# వేదాంతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము | ... | 0 | 2 |
| ఆత్మబోధము, సాంధ్రటీక | ... | 0 | 6 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| అపరోక్షానుభూతి ,, | ... | 0 | 6 |
| అద్వైతపంచరత్నములు ,, | ... | 0 | 3 |
| అద్వైతోపదేశపంచరత్నములు ,, | ... | 0 | 3 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము | ... | 8 | 0 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 6 |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యానాంధ్ర టీకాతాత్పర్యసహితము | | అచ్చు | |
| విచారచంద్రోదయము, వచనము | ... | 0 | 10 |
| వేదాంతస్తోత్రపంచకము, తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| శ్రీవిద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | | 3 | 6 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 1 | 6 |
| సదాముక్తిసుధార్ణవము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | | 0 | 10 |
| రామగీతా ,, | ... | 0 | 8 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 0 |
| శాంతివిలాసము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 8 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 8 |
| ,, తెనుఁగువచనము | ... | 12 | 0 |
| ,, శంకరభాష్యము | ... | 10 | 0 |
| భగవద్గీతలు, మూలముమాత్రము | ... | 0 | 8 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 12 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమా | ... | 0 | 10 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యవివరణ సహితము | ... | 6 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 8 |
| హఠయోగప్రదీపిక ,, | ... | 3 | 0 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| భక్తిపలసముక్తి | ... | 0 | 1 |
| భగవద్గీతాసారసంకీర్తనలు | ... | 0 | 2 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 3 |
| ,, తెనుఁగువచనము | ... | 0 | 3 |
| భగవద్గీత, శంకరభాష్యము | ... | 2 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 1 | 0 |

# వైద్యగ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| అనుపానమంజరి | | ... | 0 | 12 |
| అజీర్ణమంజరి | | ... | 0 | 4 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | I | ... | 6 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | II | ... | 5 | 0 |
| డిటో శారీర నిదానస్థానములు | III | ... | 3 | 8 |
| డిటో ఉత్తరస్థానము | IV | ... | 6 | 0 |
| చరకసంహిత, సూత్రస్థానము | I | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ,నిదాన, విమానస్థానములు | II | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానములు | III | ... | 8 | 0 |
| ,, సిద్ధి - కల్పస్థానములు | IV | ... | 3 | 8 |
| భేషజకల్పము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 8 |
| దేహతత్త్వనిర్ణయము ,, | | ... | 0 | 6 |

శ్రీ ర స్తు

శ్రీమద్రామాయణాంతర్గత

# కిష్కింధాకాండము

ఆంధ్రతాత్పర్యసహితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1925

## శ్రీరామాయణ కిష్కిన్ధాకాణ్డఫలశ్రుతిః.

సుగ్రీవసఖ్య మారభ్య యావద్వాలినిషూదనమ్,
శ్రుత్వా విజయ మాప్నోతి ముచ్యతే జారదోషతః.
దణ్డాదన్యం నష్టశ్యామీ త్యక్త్వా కానన మక్షరమ్,
శ్రుత్వా మర్త్య స్స్వర్గప్రకాశో లక్ష్మీలోక మవాప్నుయాత్.
అభిషేకఞ్చ రామేణ రుమాయాః ప్రాప్తి ముత్తమామ్,
సుగ్రీవస్య జయం శ్రుత్వా రాజ్యలాభ మవాప్నుయాత్.
వాక్య మాత్మహితం చైవ త్యక్త్వా ద్వాదశవర్ణకమ్,
శ్రుత్వా రామ ప్రసాదేన సౌమ్యతత్త్వ మవాప్నుయాత్.
కిష్కిన్ధాకాణ్డపఠనా త్తదర్థశ్రవణాదపి,
సర్వదా సర్వలోకేషు కామచారో భవే న్నరః.

## స్మార్తాదీనాం సర్వేషాం శ్రీరామాయణపారాయణాదౌ కర్తవ్యపూజావిధానమ్.

ఆచమ్య, ప్రాణానాయమ్య, మమోపాత్త....శుభే శోభనే ముహూర్తే అస్యాం శుభతిథౌ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచన్ద్ర దేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తిధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. తదఙ్గత్వేన కలశపూజాం కరిష్యే. కలశపూజాం గణపతిపూజాంచ కృత్వా, వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామణ్టపే మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,

అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.
తత శ్రీమతో శోపరి శ్రీరామధ్యానావాహనాది నై వేద్యాంత
పూజావిధేయా. శ్రీరామచంద్ర దేవతాభ్యాం నమః. ధ్యానా
వాహనాదిషోడశోపచారపూజాం చ కృత్వా.

---

శ్రీమద్రామాయణపారాయణారంభ క్రమః.

సద్గురుసకాశా ల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామా
యణపారాయణం కుర్యాత్ - దేశకాలౌ సంకీర్త్య:—

అస్య శ్రీరామాయణమహామంత్రస్య వాల్మీకి ర్భగ
వా నృషిః - అనుష్టు ప్ఛందః - శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న
హనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా - రాం బీజం - శ్రీం
శక్తిః - నుం కీలకం - మమ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహను
మత్సమేత శ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే విని
యోగః - రాం అంగుష్ఠాభ్యాన్నమః - రీం తర్జనీభ్యాం స్వాహా -
రూం మధ్యమాభ్యాం వషట్ - రైం అనామికాభ్యాం హుం -
రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్ - రః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్ -
రాం హృదయాయ నమః - రీం శిరసే స్వాహా - రూం శిఖాయై
వషట్ - రైం కవచాయ హుం - రౌం నేత్రత్రయాయ వౌషట్ -
రః అస్త్రాయ ఫట్. లోకత్రయేణ దిగ్బంధః. ధ్యానం.—

కాలాంభోధరకాంతికాంత మనిశం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజంజానుని,
సీతాంపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం ముకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

---

## అథ మానసికపూజా.

లం పృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే గంధం సమర్పయామి-హాం ఆకాశాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీ రామచంద్రపరబ్రహ్మణే దీపం దర్శయామి-వం అమృతాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి- సం సర్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణేసర్వోపచారపూజా స్సమర్పయామి-ఇతి మానసికపూజా.

మూలమంత్రః —ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది, పౌరుషే చాప్రతిద్వంద్వశ్శరై నం జహి రావణిమ్.

ఇతి యథాశక్తి జపిత్వా శ్రీరామాయణపారాయణం కుర్యాత్. అనంతరం పునః ధ్యానం మానసికపూజాం హృదయాదిన్యాసం చ కుర్యాత్-శ్లోకత్రయేణ దిగ్విమోకః.

గుహ్యాతిగుహ్యగోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపం,
సిద్ధి ర్భవతు మే దేవ! త్వత్ప్రసాదా ద్రఘూద్వహ!.

---

## శ్రీవైష్ణవానాం

### శ్రీమద్రామాయణపఠనోపక్రమానుసంధేయక్రమః.

ప్రథమతః 'శ్రీశైలేశే'త్యాది స్వస్వసంప్రదాయనిర్వాహకాచార్యానుసంధానం, తతః 'లక్ష్మీనాథే'త్యారభ్య 'ప్రణతో ఽస్మి నిత్య'మిత్యంతం, అనంతరం శ్రీశైలపూర్ణవిషయం, 'పితామహ'స్యేతి శ్లోకమారభ్య శ్రీభాష్యకారప్రభృతిస్వాచార్యపర్యంతవిషయా స్సాంప్రదాయికశ్లోకాఅనుసంధేయాః. యదాహ

శ్రీధరాదిస్వాచార్యపర్యంతాః ప్రతివ్యక్తిశ్లోకా అనుసంధేయాః. తతః.—

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందే ఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

ఉల్లంఘ్యసింధో స్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్రకృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమతరాక్షసాంతకమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.

త దుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్య
బద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామ
యధ్వమ్. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం సీతాపతిం
రఘుకులాన్వయరత్నదీపమ్, ఆజానుబాహు మరవిందదళాయ
తాక్షం రామం నిశాచరవినాశకరం నమామి.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్.
తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కర్తవ్యమ్.

---

### పారాయణసమాపనక్రమః.

ఏవ మేత త్పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్.
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీ శ్చ వర్ధతామ్.
స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాంన్యాయ్యేనమార్గేణమహీం
మహీశాః, గో బ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకాస్సమ
స్తా స్సుఖినో భవంతు.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.
విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్.
త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్.
సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్.
దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్.
సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.
హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.
శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్.
ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్.
తతః పితామహాస్యే త్యారభ్య, స్వాచార్యాంతాశ్శ్లోకా అనుసంధేయాః.

---

## శ్రీస్మార్తమాధ్వాదీనాం శ్రీమద్రామాయణ పఠనోపక్రమానుసంధేయక్రమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.
తతః శ్రీమచ్ఛంకరాచార్యాది గురుపరంపరాఽనుసంధేయా.
దోర్భిర్యుక్తా చతుర్భిస్స్ఫటికమణిమయీ మక్షమాలాం దధానా
హస్తేనైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసా కుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.
కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

ఆంజనేయమతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరి
ష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం
శిరసా నమామి.

యః కర్ణాంజలిసంపుటైరహరహస్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణైరత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్.

తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్య
బద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామ
యధ్వమ్

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ.

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా.

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.

వామే భూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చాత్ సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషుచ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవా
న్మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్.
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకా
త్మజాయై, నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు
చంద్రార్కమరుద్గణేభ్యః.
తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాంతపూజా
విధేయా. పారాయణావసానే చ పునఃపూజా కర్తవ్యా.

---

పారాయణసమాపనసమయానుసంధేయక్రమః.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః, గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకా
స్సమస్తా స్సుఖినో భవంతు.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
అపుత్త్రాః పుత్త్రిణ స్సంతు పుత్త్రిణ స్సంతు పౌత్త్రిణః,
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్.
చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణ స్స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.
య న్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,

వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్.
య న్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా,
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
అమృతోత్పాదనే దైత్యా న్ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్.
త్రీ న్విక్రమా న్ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
య దాసీ న్మంగళం రామ! త త్తే భవతు మంగళమ్.
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే,
మంగళాని మహాబాహో! దిశంతు తవ సర్వదా.
కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతే స్స్వభావాత్, కరోమి యద్య త్సకలం పరస్మై, నారాయణాయేతి సమర్పయామి.

---

## శ్రీగాయత్రీరామాయణమ్.

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. ౧
స హత్వా రాక్షసా న్సర్వా న్యజ్ఞఘ్నా న్రఘునందనః,
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా. ౨
విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. ౩
తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః,
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత. ౪
వనవాసం హి సంఖ్యాయ వాసాం స్యాభరణాని చ,

భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. ౫
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. ౬
నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్. ౭
యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః ౮
భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౯
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్,
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ. ౧౦
దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. ౧౧
వంద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యా శ్చాపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః. ౧౨
స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. ౧౩
ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః,
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. ౧౪
మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః,
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. ౧౫
హితం మహార్థం మృదుపూర్వసంహితం వ్యతీతకాలాయతి
సంప్రతిక్షమమ్, నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః ప్రసంగవా
నుత్తర మేత దబ్రవీత్. ౧౬

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః,
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకంటకమ్.
యో వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చచాల రా
జా, స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ
ముమోచ వీరః. ౧౮

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. ౧౯
న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా. ౨౦
ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాంజలిపుటా చేద ముమా చాగ్నిసమీపతః. ౨౧
చలనా త్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః,
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. ౨౨
దారాః పుత్త్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనమ్,
సర్వమే వావిభక్తం నో భవిష్యతి హరీశ్వర. ౨౩
యా మేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తా మేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్. ౨౪
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్,
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. ౨౫

గాయత్రీరామాయణం సంపూర్ణమ్.

---

## దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.

### వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలం.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వ న్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

### ఆంజనేయప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరం.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

### శ్రీరామాయణప్రశంసా.

శ్రీమద్బ్రహ్మ తదేవ బీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాణ్డై స్సప్తభి రన్వితోఽతివితతో బుహ్యాలవాలోదితః,
వక్త్రై స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః పఞ్చభి
శ్చాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణ స్సవ్స్తరుః.

శ్రీః

# శ్రీమద్రామాయణే - కిష్కిన్ధాకాణ్డే

## ప్రథమస్సర్గః

---

స తాం పుష్కరిణీం గత్వా పద్మోత్పలఝషాకులామ్,
రామ స్సౌమిత్రిసహితో విలలాపాకులేన్ద్రియః. ౧
తస్య దృష్ట్వైవ తాం హర్షా దిన్ద్రియాణి చకమ్పిరే,
స కామవశ మాపన్న స్సౌమిత్రి మిద మబ్రవీత్. ౨

సౌమిత్రే! శోభతే పమ్పా వైడూర్యవిమలోదకా,
ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధై ర్ద్రుమైః. ౩

సౌమిత్రే! పశ్య పమ్పాయాః కాననం శుభదర్శనమ్,
యత్ర రాజన్తి శైలాభా ద్రుమా స్సశిఖరా ఇవ. ౪

మాం తు శోకాభిసన్తప్తం మాధవః పీడయన్నివ,
భరతస్య చ దుఃఖేన వైదేహ్యా హరణేన చ. ౫

శోకార్తస్యాపి మే పమ్పా శోభతే చిత్రకాననా,
వ్యవకీర్ణా బహువిధైః పుష్పైః శీతోదకా శివా. ౬

శ్రీ ర స్తు.

# కిష్కింధాకాండ తాత్పర్యము

## ఒ క ట వ స ర్గ ము.

---

ఆ రాముఁడు లక్ష్మణసహితంబుగా తామరాకులను మత్స్యంబులను నిండియుండు నాపంపాసరస్సును బొంది దుఃఖితుఁడై విలపించెను. ౧

ఆపంపాసరస్సును జూడఁగానే రాముఁడు మొదట సంతుష్టుఁడయ్యె యంత సీతం దలఁచుకొని యింద్రియంబులు చలింపఁ గామవశుఁడై లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౨

లక్ష్మణుఁడా! పంపాసరస్సు వైడూర్యమణివంటి స్వచ్ఛమయిన జలము గలదై వికసించియుండు కమలంబులును నల్లకలువలను గలదై తీరంబులనందు నానావిధఫలవృక్షంబులతో నెంతయుఁ బ్రకాశించుచున్నది చూడుము. ౩

లక్ష్మణుఁడా! పంపాతీరమునందు నరణ్యము సుందరముగా నున్నది. అందు వృక్షములు పర్వతాకారములయి కొమ్మలచే శిఖరములతోఁ గూడిన వెంతయుఁ బ్రకాశించుచున్నవి చూడుము. ౪

భరతుఁ డట్లు మునివేషముదాల్చి కష్టపడుచున్నాఁడే యను దుఃఖము చేతను సీతాపహరణముచేతను బరమదుఃఖితుఁడనైన నన్ను మాత్రము ఈదుఃఖములు మిక్కిలియుఁ బీడించుచునే యున్నవి. ౫

దుఃఖితుఁడనగు నాకుఁగూడ సుందరములయి యడవులుగలదియు నానావిధపుష్పములతో నొప్పుచున్నదియుఁ జల్లనిజలముగలదియు నగు పంపాసరస్సు రమణీయముగా నున్నది. ౬

తేన విక్షిపతా త్యర్థం పవనేన సమ న్తతః,
అమీ సంస క్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః. ౧౬

స ఏవ సుఖసంస్పర్శో వాతి చన్దనశీతలః,
గన్ధ మభ్యవహ న్పుణ్యం శ్రమాపనయనోఽనిలః. ౧౭
అమీ పవనవిక్షిప్తా వినద న్తీవ పాదపాః,
షట్పదై రనుకూజద్భి ర్వనేషు మధుగన్ధిషు. ౧౮
గిరిప్రస్థేషు రమ్యేషు పుష్పవద్భి ర్మనోరమైః,
సంస క్తశిఖరా శ్శైలా విరాజ న్తే మహాద్రుమైః. ౧౯

పుష్పసంఛన్నశిఖరా మారుతోత్క్షేపచఞ్చలాః,
అమీ మధుకరోత్తంసాః ప్రగీతా ఇవ పాదపాః. ౨౦

పుష్పితాగ్రాం స్తు పశ్యేమా న్కర్ణికారాం త్సమ న్తతః,
హాటకప్రతిసంఛన్నా న్నరా న్పీతామ్బరా నివ. ౨౧
అయం వస న్త స్సౌమిత్రే! నానావిహగనాదితః,
సీతయా విప్రహీనస్య శోకసన్దీపనో మమ. ౨౨

మాం హి శోకసమాక్రా న్తం సన్తాపయతి మన్మథః,
హృష్టః ప్రవదమాన శ్చ మా మాహ్వయతి కోకిలః. ౨౩

ఏష దాత్యూహకో హృష్టో రమ్యే మాం వననిర్ఝరే,
ప్రణద న్మన్మథావిష్టం శోచయిష్యతి లక్ష్మణ!. ౨౪

ఆ ట్లతివేగంబున నంతటను వీచుచున్న గాలికి ఈ వృక్షములశాఖాగ్రములు ఒకదానితో నొకటి కలసి మాలగాఁగట్టఁబడినవివలెఁ దోఁచుచున్నవి. ౧౭

ఇదిగో ఈవాయువు స్పర్శమునకు సుఖముగా చందనశీతలమయి రమణీయమగు గంధముగలదై శ్రమమూఁ బోఁగొట్టుచు మందముగా వీచుచున్నది.

మధుగంధముతోఁగూడిన వనంబులందు ఈవృక్షములు వాయువుచేఁ గదలింపఁబడినవై తేనెటీఁగలధ్వనులచే నఱచుచున్నట్లున్నవి. ౧౮

పర్వతములు రమణీయంబులగు శిలలయందు మొలిచి పుష్పంబులతో నిండియుండు మనోహరంబులయిన మహావృక్షంబులచేత శిఖరములు పరస్పరము చేరుకొని యెంతయుఁ బ్రకాశించుచున్నవి. ౧౯

ఈవృక్షములు శిఖరములయందు పుష్పచ్ఛన్నంబులయి గాలివీచుటకుఁ గదలుచు మధురముగా గానముచేయు భృంగములు శిఖరములంగలవై యుండుటవలన నల్లనివెండ్రుకలుగల తలయందుఁ బుష్పములుదాల్చి తలయూడించుచుఁ బాడుచుండు గాయకులపగిదిఁ జూపట్టుచున్నవి. ౨౦

చక్కఁగాఁ బుష్పించి కాంచనాభరణధరులును బసపువస్త్రము గట్టుకొన్నవారలునగు మనుష్యులపగిది నున్నయీకర్ణికారవృక్షంబులం జూడుము.

లక్ష్మణుఁడా! ఈవసంతర్తువునందు నానావిధపక్షులు మధురముగాఁ గూయుచుండుటవలన సీతావిరహితుఁడనగు నాకు మిక్కిలియు దుఃఖము వృద్ధిఁబొందుచున్నది. ౨౨

మన్మథుఁడు దుఃఖితుఁడనగు నన్ను మిక్కిలియుఁ దపింపఁజేయుచున్నాఁడు. కోయిల నేను లొంగిపోవుటకు సంతోషంబునఁబొంగి విజయగర్వంబునఁ గూతలువేయుచు నన్ను ఎగతాళిసేయుచున్నది. ౨౩

లక్ష్మణుఁడా! ఈసెలయేటియందు నీరుకోడి మన్మథబాధితుఁడనగు నన్నుఁ జూచి సంతోషంబున నఱచుచు నాకు మఱియు దుఃఖము గలుగఁ జేయుచున్నది. ౨౪

శ్రుత్వైతస్య పురా శబ్ద మాశ్రమస్థా మమ ప్రియా,
మా మాహూయ ప్రముదితా పరమం ప్రత్యనన్దత. ౨౫

ఏవం విచిత్రాః పతగా నానారావవిరావిణః,
వృక్షగుల్మలతాః పశ్య సమ్పతన్తి తత స్తతః. ౨౬
విమిశ్రా విహగాః పుమ్భి రాత్మవ్యూహాభినన్దితాః,
భృఙ్గరాజప్రముదితా సౌమిత్రే! మధురస్వనాః. ౨౭

నత్యూహరుతవిక్రన్దైః పుంస్కోకిలరుతై రపి,
స్వనన్తి పాదపా శ్చేమే మమానఙ్గప్రదీపనాః. ౨౮
అశోకస్తబకాఙ్గారః షట్పదస్వననిస్వనః,
మాం హి పల్లవతామ్రార్చి ర్వసన్తాగ్నిః ప్రధక్ష్యతి. ౨౯

న హి తాం సూక్ష్మపక్ష్మాక్షీం సుకేశీం మృదుభాషిణీమ్,
అపశ్యతో మే సౌమిత్రే! జీవితేఽస్తి ప్రయోజనమ్. 30

అయం హి దయిత స్తస్యాః కాలో రుచిరకాననః,
కోకిలాకులసీమాన్తో దయితాయా మమానఘ!. 3౧

మన్మథాయాససమ్భూతో వసన్తగుణవర్ధితః,
అయం మాం ధక్ష్యతి క్షిప్రం శోకాగ్ని ర్నచిరా దివ. 3౨

అపశ్యత స్తాం దయితాం పశ్యతో రుచిరద్రుమాన్,
మ మాయ మాత్మప్రభవో భూయ స్త్వ ముపయాస్యతి. 33

ము నాశ్రమంబున నుండునప్పుడు నాప్రియురాలు ఈనీరుకోడి ధ్వనిని విని సంతోషంబున నన్నుఁ బిలిచి నానావిధక్రీడారసంబులచేఁ బరమ సంతోషంబు నొందుచుండును. ౨౬

ఇట్లు నానావిధమధురధ్వనులు కూయునట్టి నానావిధములయినపక్షులు అచ్చటచ్చట వృక్షంబులను పొదలను లతలను జేరుచున్నవి చూడుము.

లక్ష్మణుఁడా! స్త్రీజాతిపక్షులు పురుషపక్షులతోఁ గూడి తమ జాతిగుంపులచేఁ గొనియాడఁబడుచున్నవై గండుతుమ్మెదల ఝుంకారధ్వనులకు సంతుష్టంబులయి మధురంబుగాఁ గూయుచున్నవి. ౨౭

నీరుకోళ్లధ్వనులచేతను మగకోయిలధ్వనులచేతను ఈవృక్షంబులును ధ్వనించునట్లు చూపట్టుచు నాకెంతయు మన్మథదీపకములుగా నున్నవి ౨౮

ఈవసంతర్తువే యగ్నిహోత్రముగా నన్ను దహింపఁగలదు. దీనికి అశోకస్తబకమె శిఖలవి; తుమ్మెదలధ్వనియే ధ్వని; చిగుళ్లే యెఱ్ఱనిజ్వాలలుగాఁ దోఁచుచున్నవి. ౨౯

లక్ష్మణుఁడా! సూక్ష్మములయిన ఱెప్పలతోఁ గూడినకన్నులుగలదియు సుందరములయిన వెండ్రుకలుగలదియు మృదుమధురంబుగా మాటలాడునదియునగు నాసీతం జూడకున్న నాకు బ్రతుకుతో నేమియుఁ బ్రయోజనంబు లేదు. ౩౦

పాపరహితుఁడవగు లక్ష్మణుఁడా! సుందరములయిన యడవులును నలుప్రక్కలను మధురములయిన కోకిలధ్వనులును గల యీవసంతర్తువు నాప్రియురాలికి మిక్కిలియుఁ బ్రియమైనది. ౩౧

మన్మథపీడవలనఁ బుట్టినదియు వసంతసౌందర్యముచే వృద్ధిఁబొందినదియు నగు నీదుఃఖమను నగ్నిహోత్రము నన్ను శీఘ్రముగనే దహింపఁగలదు. ౩౨

ఆప్రియురాలిం జూడక మనోహరవృక్షంబులఁ జూచుచున్న నాకు ఈమన్మథతాపము మఱిమఱి వృద్ధినొందఁగలదు. ౩౩

మామప్యేవం విశాలాక్షీ జానకీ జాతసమ్భ్రమా. ౪౨
మదనే నాభివర్తేత యది నాఽపహృతా భవేత్,

పశ్య లక్ష్మణ! పుష్పాణి నిష్ఫలాని భవన్తి మే. ౪౩
పుష్పభారసమృద్ధానాం వనానాం శిశిరాత్యయే,

రుచిరా ణ్యపి పుష్పాణి పాదపానా మతిశ్రియా. ౪౪
నిష్ఫలాని మహీం యాన్తి సమం మధుకరోత్కరైః,

వదన్తి రావం ముదితా శ్శకునా స్సఙ్ఘశః కలమ్. ౪౫
ఆహ్వయన్త ఇ వాన్యోన్యం కామోన్మాదకరా మమ,

వసన్తో యది తత్రాపి యత్ర మే వసతి ప్రియా. ౪౬
నూనం పరవశా సీతా సాపి శోచ త్యహం యథా,
నూనం నతు వసన్తోఽయం దేశం స్పృశతి యత్ర సా. ౪౭
కథం హ్యసితపద్మాక్షీ వర్తయే త్సా మయా వినా,

అథవా వర్తతే తత్ర వసన్తో యత్ర మే ప్రియా. ౪౮
కిం కరిష్యతి సుశ్రోణీ సా తు నిర్భర్త్సితా పరైః,

శ్యామా పద్మపలాశాక్షీ మృదుపూర్వాభిభాషిణీ. ౪౯
నూనం వసన్త మాసాద్య పరిత్యక్ష్యతి జీవితమ్,

దృఢం హి హృదయే బుద్ధి ర్మమ సమ్ప్రతి వర్తతే. ౫౦
నాలం వర్తయితుం సీతా సాధ్వీ మద్విరహం గతా,

నా ప్రియురాలగు వెడఁదకన్నులు గలసీతయు శాత్రునిచే నపహరిం
పఁబడకుండు నేని మన్మథప్రేరితయయి ఇట్లు మిక్కిలియు సంభ్రమముతో
నాపైకి వచ్చును. ౪౨

లక్ష్మణుఁడా! వసంతఋతువునందు ఈవనంబులందుఁ బుష్పంబు లమితము
గానున్నను ఈపుష్పములతో నాకెంతమాత్రము ప్రయోజనము లేకున్నది;
చూడుము. ౪౩

అధికమయిన కాంతిగలిగి మిక్కిలియు సుందరములయియున్నను
ఈపుష్పములు మనకేమిప్రయోజనము లేకుండుటచే తుమ్మెదలతోఁగూడినవై
వ్యర్థముగా నేలపై రాలుచున్నవి. ౪౪

పక్షులు ఒండొంటిం బిలుచుకొనునవివలె గుంపులుచేరి సంతోషంబున
మధురంబుగాఁ గూయుచు నాకు మన్మథబాధ నతిశయించి యున్మాదము
గలుగునట్లు చేయుచున్నవి. ౪౫

నా ప్రియురాలుండు స్థలమునఁగూడ నీవసంతఋతువుండు నేని ఆసీత
యును బరవశయయి నాపగిది దుఃఖితయగును ఇది నిశ్చయము. ౪౬

సీతను ఎచ్చటనో రహస్యప్రదేశమున నుంచియుందురు గావున నాబి
డయుండు ప్రదేశమున నీవసంతఋతువుండదు. ఇది నిశ్చయము. అట్లయినను
నన్ను విడిచి నీలకమలంబులవంటికన్నులుగలసీత యెట్లు జీవించును? ౪౭

అటుగాక సీతయుండుచోట వసంతఋతువుండ నేయున్నది. సుందరముల
యిన పిఱుఁదులుగల సీత శత్రువులు క్రూరవాక్యంబుల బెదరింపుచుండఁగా
నేమిచేయఁగలదో ? ౪౮

యౌవనమధ్యమున నున్నదియు తామరపూ రేకులంబోలు కన్నులుగల
దియు మృదుమధురంబుగా మాటలాడునదియు నగుసీత ఈవసంతఋతువు సహిం
పఁజాలక ప్రాణంబులు విడువఁగలదు నిశ్చయము. ౪౯

పతివ్రతయగు సీత నన్నువిడిచి జీవించియుండఁజాలదని నామనస్సున
దృఢముగాఁ దోఁచియున్నది. ౫౦

మయి భావ స్తు వైదేహ్యా స్తత్త్వతో వినివేశితః. ౫౧
మమాపి భావ స్సీతాయాం సర్వథా వినివేశితః,

ఏష పుష్పవహో వాయు స్సుఖస్పర్శో హిమావహః. ౫౨
తాం విచిన్తయతః కాన్తాం పావక ప్రతిమో మమ,

సదా సుఖ మహం మన్యే యం పురా సహ సీతయా. ౫౩
మారుత స్స వినా సీతాం శోకం వర్ధయతే మమ,

తాం వినా స విహఙ్గో యః పక్షీ ప్రణదిత స్తదా ౫౪
వాయసః పాదపగతః ప్రహృష్ట మభినర్దతి,

ఏష వై తత్ర వైదేహ్యా విహగః ప్రతిహారకః. ౫౫
పక్షీ మాం తు విశాలాక్ష్యా స్సమీప ముపనేష్యతి,
శృణు లక్ష్మణ! సన్నాదం వనే మదవివర్ధనమ్. ౫౬
పుష్పితాగ్రేషు వృక్షేషు ద్విజానా ముపకూజతామ్,

విక్షిప్తాం పవనే నైతా మసౌ తిలకమఞ్జరీమ్. ౫౭
షట్పద స్సహసాఽభ్యేతి మదోద్ధూతా మివ ప్రియామ్,
కామినా మయ మత్యన్త మశోక శ్శోకవర్ధనః. ౫౮
స్తబకైః పవనోత్క్షిప్తై స్తర్జయ న్నివ మాం స్థితః,

అమీ లక్ష్మణ! దృశ్యన్తే చూతాః కుసుమశాలినః. ౫౯
విభ్రమోత్సిక్తమనస స్సాఙ్గరాగా నరా ఇవ,

సీతయు నాయందు యథార్థముగా దృఢమయిన యనురాగము నుంచియుండినది. నేనును సీతయందు అన్నివిధంబులను దృఢమయిన యనురాగము నుంచియుంటిని. ౫౧

పుష్పగంధముతోఁ గూడి స్పర్శసుఖమై మందముగా చల్లఁగాఁ గొట్టుచున్న యీమందమారుతము సీతావిరహమునొంది యాబిడం జింతించుచున్న నాకు అగ్నిహోత్రమువలె నున్నది. ౫౨

మునుపు సీతాసహితుఁడనై యుండునప్పుడు దేని సదాసుఖకరముగాఁ దలంతునో అట్టి మందమారుతము ఇప్పుడు సీతావిరహితుఁడనగు నాకు మఱి మఱి దుఃఖమును వృద్ధిఁ బొందించుచున్నది. ౫౩

మున్ను సీత యుండునప్పుడు ఏ కాకి ఆకాశమునొంది పరుషంబుగా నఱచుచు సీతావియోగమును సూచించెనో ఆకాకి యిప్పుడు సీతలేనికాలమున వృక్షగతమై సంతోషంబునఁ గూయుచు సీతాసంయోగసౌఖ్యమును సూచించుచున్నది. ౫౪

ఈకాకియే మునుపు పంచవటియందు సీతావియోగమును గలిగించినది; ఇప్పుడిది నన్ను వెడఁదకన్నులుగల సీతయొద్దకుఁ గొనిపోఁ గలదు.

లక్ష్మణుఁడా! వనమునందుఁ బుష్పించియుండు శిఖరములుగల వృక్షములపైఁ బక్షులు మధురముగాఁ గూయుచున్నవి. మన్మథమదమును వృద్ధిఁ బొందించునట్టి యాధ్వని వినుము. ౫౫

ఈతుమ్మెద గాలికి కదలిన యీబొట్టుగుపూగుత్తిని మద్యమదంబునఁ జలించు ప్రియురాలినింబోలె శీఘ్రంబునఁ బొందుచున్నది ౫౬

స్వభావంబుననే విరహిజనులకు మిక్కిలియు దుఃఖమును వృద్ధిఁబొందించునట్టి యీయశోకవృక్షము గాలికిఁ జలించు స్తబకములచే నన్ను బెదరించునట్లు చూపట్టుచున్నది. ౫౭

లక్ష్మణుఁడా! పుష్పంబులచే నిండియుండు నీచూతవృక్షములు దేహమంతయుఁ జందనము నలంగుకొని విలాసవంతులయి గర్వితులయియుండు కాముకులకైవడిఁ జూపట్టుచున్నవి. ౫౮

సౌమిత్రే! పశ్య పమ్పాయా శ్చిత్రాసు వనరాజిషు. ౬౦
కిన్నరా నరశార్దూల! విచరన్తి తత స్తతః,

ఇమాని శుభగన్ధీని పశ్య లక్ష్మణ! స ర్వశః. ౬౧
నళినాని ప్రకాశన్తే జలే తరుణసూర్యవత్,
ఏషా ప్రసన్నసలిలా పద్మనీలోత్పలాయుతా. ౬౨
హంసకారణ్డవాకీర్ణా పమ్పా సౌగన్ధికాన్వితా,

జలే తరుణసూర్యాభై ష్షట్పదాహతకేసరైః. ౬౩
పఙ్కజై శ్శోభతే పమ్పా సమన్తాదభిసంవృతా,

చక్రవాకయుతా నిత్యం చిత్రప్రస్తవనాన్తరా. ౬౪
మాతఙ్గమృగయూథై శ్చ శోభతే సలిలార్థిభిః,

పవనాహతవేగాభి రూర్మిభి ర్విమలేఽమ్భసి. ౬౫
పఙ్కజాని విరాజన్తే తాడ్యమానాని లక్ష్మణ!,
పద్మపత్రవిశాలాక్షీం సతతం పఙ్కజప్రియామ్. ౬౬
అపశ్యతో మేవై దేహీం జీవితం నాభిరోచతే,

అహో కామస్య వామత్వం యో గతా మపి దుర్లభామ్.
స్మారయిష్యతి కల్యాణీం కల్యాణతరవాదినీమ్,

శక్యో ధారయితుంకామో భవే ద ద్యాగతో మయా. ౬౭

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! పంపాతీరంబులనుండు చిత్రంబులయిన వనరాజులయందు అరణ్యస్థలంబులందుఁ గిన్నరులుగూడ విహరించుచున్నారు చూడుము. ౬౦

లక్ష్మణుఁడా! నాలుగుప్రక్కలం జూడుము. మంచివాసనగల యీ కమలంబులు బాలసూర్యులపగిదిఁ బ్రకాశించుచున్నవి. ౬౧

ఈపంపాసరస్సు నిర్మలమగు జలమును కమలంబులును నల్లకలువలును సౌగంధికంబులును గలిగి హంసలతోను గన్నెలేళ్లతోను నొప్పుచు, ఎంతయుఁ బ్రకాశించుచున్నది. ౬౨

పంపాసరస్సు జలముసంగఁ బ్రతితరంగంబులం బ్రతిఫలించినట్టి బాలసూర్యులంబోలె వెలుంగుచున్నవియు తుమ్మెదలచే వ్యాపింపఁబడిన కేసరములుగలవియునగు కమలంబులతో సంతటనుఁగూడి యెంతయుఁ బ్రకాశించుచున్నది. ౬౩

పంపాసరస్సు చక్రవాకంబులతోఁగూడి కట్టుకోఁకవలెనుండు చిత్రములయిన తీరవనంబులతో నొప్పుచు నీళ్లు త్రావవచ్చినయేనుంగులతోను మృగంబులతోనుఁ గూడినదై యెల్లప్పుడును బ్రకాశించుచున్నది ౬౪

లక్ష్మణుఁడా! నిర్మలమయిన జలమునందుఁ గమలంబులు గాలికిఁ బుట్టుతరంగంబులచేఁ గొట్టఁబడుచున్నవై శోభిల్లుచున్నవి. ౬౫

కమలదళంబులంబోలె విశాలసుందరంబులగు నేత్రంబులుగలదియు నెల్లప్పుడును గమలంబులపై మిక్కిలియుఁ బ్రీతిగలదియునగు సీతం జూడకున్న నాకు బ్రతికియుండుట కెంతమాత్ర మిష్టము లేకున్నది. ౬౬

కల్యాణరూపిణియు మిక్కిలియు మంగళకరములగు మాటలం జెప్పునదియునగు సీత నష్టయయి యిప్పుడు పొందనలవిగాని స్థితిలోనున్నను అదిడను మాటిమాటికిఁ దలఁచుకొనునట్లు చేయుచున్నాఁడే! యీమన్మథుఁ డెంత వక్రుఁడు. ౬౭

పుష్పించిన వృక్షములుగల యీవసంతము ఇంక నాజోలికి రాకుండు

యది భూయో వసన్తో మాం న హన్యా త్పుష్పితద్రుమః,

యాని స్మ రమణీయాని తయా సహ భవన్తి మే. ౧౯
తా న్యే వారమణీయాని జాయన్తే మే తయా వినా,

పద్మకోశపలాశాని దృష్ట్వా దృష్టి ర్హి మన్యతే. ౨౦
సీతాయా నేత్రకోశాభ్యాం సదృశా నీతి లక్ష్మణ!,

పద్మ కేసరసంసృష్టో వృక్షా న్తరవినిస్సృతః. ౨౧
నిశ్వాసఇవ సీతాయా వాతి వాయు ర్మనోహరః,

సౌమిత్రే! పశ్య పమ్పాయా దక్షిణే గిరిసానుని. ౨౨
పుష్పితాం కర్ణికారస్య యష్టిం పరమశోభనామ్,

అధికం శైలరాజో௨యం ధాతుభి స్సువిభూషితః. ౨౩
విచిత్రం సృజతే రేణుం వాయువేగవిఘట్టితమ్,
గిరిప్రస్థా స్తు సౌమిత్రే! సర్వతః స్సమ్ప్రపుష్పితైః. ౨౪
నిష్పత్త్రై స్సర్వతో రమ్యైః ప్రదీప్తా ఇవ కింశుకైః,

పమ్పాతీరరుహా శ్చేమే సంసక్తా మధుగన్ధినః. ౨౫
మాలతీమల్లికాషణ్డాః కరవీరా శ్చ పుష్పితాః,

కేతక్య స్సిన్దువారా శ్చ వాసన్త్యశ్చ సుపుష్పితాః. ౨౬
మాధవ్యో గన్ధపూర్ణా శ్చ కున్దగుల్మా శ్చ సర్వశః,

నేని నే నెట్లైనను ఇప్పుడు గల్గియుండు మన్మథతాపమును ఓర్చియుండఁ గలను. ౧౮

ఆసీతతోఁ గూడ సంచరించునప్పుడు ఏయే పదార్థములు నాకు రమణీయములుగనుండెనో ఆపదార్థములన్నియు నిప్పుడు సీతావిరహితుఁడనై యుండునప్పుడు మిక్కిలియు దుఃఖకరములుగా నున్నవి. ౧౯

లక్ష్మణుఁడా! ఈకమలదళములఁ జూడఁగానే యివి సీతాదేవి నేత్రంబులతో సమానములని తోఁచుటవలన సీతాదేవి నేత్రంబులు స్మృతికివచ్చి యెంతయుఁ దాపముచేయుచున్నవి. ౨౦

కమలకేసరంబులతో సంబంధించి వృక్షంబుల సందులనుండి వీచుచున్న మందమారుతము సీతాదేవి నిట్టూర్పువలె సురభిలముగాను మనోహరముగాను నున్నది ఇందువలన సీతాదేవి నిట్టూర్పు స్మృతికి వచ్చి మిక్కిలియుఁ దపింపఁజేయుచున్నది. ౨౧

లక్ష్మణుఁడా! పంపాసరస్సునకు దక్షిణపార్శ్వముననున్న పర్వతసానువునందు కర్ణికార మొకటి పుష్పించి పరమసుందరముగా సీతాదేవి దేహాలతఁ దోఁపించుచున్నది. చూడుము. ౨౨

నానావిధధాతుభూషితంబగు నీపర్వతము వాయువేగంబుచే నానావర్ణములుగల పరాగమును అధికముగా విడుచుచున్నది. ౨౩

లక్ష్మణుఁడా! పర్వతసానువులు అంతటను చక్కఁగాఁ బుష్పించియున్నవియుఁ బత్రములు కొంచెమేని లేనివియును సుందరములునగు పలాశవృక్షములచే జ్వాలలుగలవివలెఁ జూపట్టుచున్నవి. ౨౪

పంపాతీరంబునంబుట్టి యొకటితో నొకటిచేరుకొని వాసన గుబాళించుచుండు నీపుష్పితంబులగు జాజులును మల్లెలును గన్నేరులును మిక్కిలియుఁ బ్రకాశించుచున్నవి. ౨౫

సుపుష్పితంబులగు మొగల్లును సిందువారములును అడవిమొల్లలును గొవ్వల మంచివాసనగల గురివెందలును ఎంతయు నొప్పుచున్నవి చూడుము.

చిరిబిల్వా మధూకా శ్చ వఞ్జులా వకులా స్తథా. ౭౭
చమ్పకా స్తిలకా శ్చైవ నాగవృక్షా స్సుపుష్పితాః,

నీపా శ్చ వరణా శ్చైవ ఖర్జూరా శ్చ సుపుష్పితాః. ౭౮
పద్మకా శ్చైవ శోభన్తే నీలాశోకా శ్చ పుష్పితాః,

లోధ్రా శ్చ గిరిపృష్ఠేషు సింహకేసరపిఞ్జరాః. ౭౯
అఙ్కోలా శ్చ కురణ్టా శ్చ చూర్ణకాః పారిభద్రకాః,
చూతాః పాటలయ శ్చైవ కోవిదారా శ్చ పుష్పితాః. ౮౦

ముచుళిన్దార్జునా శ్చైవ దృశ్యన్తే గిరిసానుషు,
కేతకోద్దాలకా శ్చైవ శిరీషా శ్శింశుపా ధవాః. ౮౧

శాల్మల్యః కింశుకా శ్చైవ రక్తాః కురవకా స్తథా,
తినిశా నక్తమాలాశ్చ చన్దనా స్స్యన్దనా స్తథా. ౮౨

పుష్పితా న్పుష్పితాగ్రాభి ర్లతాభిః పరివేష్టితాన్,
ద్రుమా న్పశ్యేహ సౌమిత్రే! పమ్పాయా రుచిరా న్బహూన్.

వాతవిక్షిప్తవిటపా న్యథాసన్నా న్ద్రుమా నిమాన్,
లతా స్సమనువర్తన్తే మత్తా ఇవ వరస్త్రియః. ౮౪

పాదపా త్పాదపం గచ్ఛన్ శైలా చ్ఛైలం వనాద్వనమ్,
వాతి నైకరసాస్వాదసమ్మోదిత ఇ వానిలః. ౮౫

సుపుష్పితములగు కానుగుచెట్లును ఇప్పచెట్లును పొగడచెట్లును తివాస పుచెట్లును సంపెంగచెట్లును బొట్టుగుచెట్లును నాగమల్లెలును ఎంతయు రాజిల్లు చున్నవి. ౨౭

చక్కఁగా బుష్పించియుండు కదంబవృక్షములను ఉలిమిరిచెట్లును ఖర్జూరవృక్షములును బద్మకంబులును నీలాశోకంబులును బ్రకాశించు చున్నవి. ౨౮

పర్వతసానువులయందు సింహకేసరవర్ణములయిన లొద్దుగుచెట్లును బుష్పితములగు ఊడుగుచెట్లును గొజ్జెంగచెట్లును బూర్జకవృక్షములును వేప చెట్లును మామిడిచెట్లును కలిగొట్టుచెట్లును గోవిదారవృక్షములును ఎంతయు భాసిల్లుచున్నవి. ౨౯-౩౦

నారంగవృక్షములును అర్జునవృక్షంబులును గేదఁగిమొగలిచెట్లును విరిగిచెట్లును శిరీషవృక్షములను శింశుపావృక్షములును చంద్రచెట్లును బర్వత సానువులం దున్నవి చూడుము. ౩౧

బూరుగుచెట్లును బలాశవృక్షంబులును ఎఱ్ఱగోరంటచెట్లును తేమివృ క్షములును నక్తమాలంబులును జందనవృక్షములును స్పందనవృక్షంబులును అగపడుచున్నవి. ౩౨

లక్ష్మణుఁడా! పుష్పించియుండునవియుఁ బుష్పితాగ్రంబులగు లత లచేఁ బరివేష్టింపఁబడినవియు నగు సుందరములయిన వృక్షము లనేకములు ఈపంపాతీరంబున నున్నవి చూడుము. ౩౩

సమీపంబుననుండు వృక్షంబులు గాలికిఁ గొమ్మలఁ గదలించుచుండఁగా మదించినట్టి యుత్తమస్త్రీలు ప్రియు లెటుపోయినను విదలక యనువర్తించునట్లు లతలు ఆవృక్షములను అనుసరించి చలించుచున్నవి. ౩౪

వాయువు ఈవృక్షముననుండి యావృక్షమునకు ఈపర్వతమునుండి యాపర్వతమునకు ఈవనముననుండి యావనమునకు సంచరించుచు ఇట్లనేక రసములను ఆస్వాదించుటచేఁదృప్తిఁబొందినదివలె మందముగా వీచుచున్నది.

కేచి త్పర్యాప్తకుసుమాః పాదపా మధుగన్ధినః,
కేచిన్ముకుళసంవీతాః శ్యామవర్ణా ఇవాఽబభుః. ౧౬

ఇదం మృష్ట మిదం స్వాదు ప్రఫుల్ల మిద మిత్యపి,
రాగమత్తో మధుకరః కుసుమే ష్వవలీయతే. ౧౭
నిలీయ పున రుత్పత్య సహసాఽన్యత్ర గచ్ఛతి,
మధులుబ్ధో మధుకరః పమ్పాతీరద్రుమే ష్వసౌ. ౧౮

ఇయం కుసుమసంఘాతై రుపస్తీర్ణా సుఖాకృతా,
స్వయం నిపతితై ర్భూమి శ్శయనప్రస్తరై రివ. ౧౯
వివిధా వివిధైః పుష్పై స్తై రేవ నగసానుషు,
వికీర్ణైః పీతరక్తా హి సౌమిత్రే! ప్రస్తరాః కృతాః ౨౦

హిమాన్తే పశ్య సౌమిత్రే! వృక్షాణాం పుష్పసమ్భవమ్,
పుష్పమాసే హి తరవ స్సంఘర్షా దివ పుష్పితాః. ౨౧

ఆహ్వయన్త ఇ వాన్యోన్యం నగా ష్షట్పదనాదితాః,
కుసుమోత్తంసవిటపా శ్శోభన్తే బహులక్ష్మణ!. ౨౨

ఏష కారణ్డవః పక్షీ విగాహ్య సలిలం శుభమ్,
రమతే కాన్తయా సార్ధం కామ ముద్దీపయ న్నివ. ౨౩
మన్దాకిన్యా స్తు య దిదం రూప మేవం మనోహరమ్,

కొన్ని వృక్షములు పుష్పములతో నిండి తేనెవాసన గుబాళించుచున్నవి. మఱికొన్ని వికసించినపుష్పము లంతగ లేనివై మొగ్గలతోఁగూడి శ్యామవర్ణములుగాఁ దోఁచుచున్నవి. ౮౬

"ఇది రమణీయము. ఇది రసవంతము. ఇది వికసితంబు" అని తుమ్మెద దేనిని వదలఁజాలక మత్తమయి పుష్పములయం దాసక్త మగుచున్నది. ౮౭

ఈతుమ్మెద తేనియపై నాశవలనఁ బంపాతీరవృక్షములయందు ఒకవృక్షముపైఁ గొంతసేపుండ అంత మఱల నెగసి మఱియొకవృక్షముపైకిఁ బోవుచున్నది. ౮౮

ఇచ్చట అతిసుకుమారంబులగు పుష్పములసమూహములు తమంతనే రాలియుండుటవలన పఱపు వేసినట్లు పరుండుటకు సుఖముగా నున్నది. ౮౯

లక్ష్మణుఁడా! పర్వతసానువులందు ఒక్కొకచోట ఒక్కొకవిధముగా నానావర్ణములయినపుష్పములు రాలియుండుటవలన కొన్ని పచ్చనివియుఁ గొన్ని యెఱ్ఱనివియునుగా నానావర్ణములయిన శయనము లనేకము లేర్పడినవి. ౯౦

లక్ష్మణుఁడా! ఈవసంతర్తువునందు వృక్షములలో పుష్పములు సమృద్ధిగా నున్నవి చూడుము.

ఈవసంతర్తువునందు వృక్షములు ఒకటికన్న నొకటి యెచ్చుగాఁ బుష్పింపవలె ననుస్పర్ధగలవివలె మిక్కిలియుఁ బుష్పించియున్నవి. ౯౧

లక్ష్మణుఁడా! వృక్షములు గాలికిఁ బుష్పములతో నిండిన శిఖరముల నాడించుచుఁ బుష్పములతో నిండినవై తుమ్మెదలధ్వనిచే "నే నెచ్చుగాఁ బూచియున్నాను జూడు నే నెచ్చుగాఁ బూచియున్నాను జూడు" మని యొండొంటిఁ బిలుచుకొనునట్లు ఎంతయుఁ బ్రకాశించుచున్నవి. ౯౨

ఈ కారండవంబు ప్రియురాలితోఁగూడ జలంబుఁ బ్రవేశించి నాకు మన్మథతాపము వృద్ధిఁబొందునట్లు పరమసంతోషంబునఁ గ్రీడించుచున్నది.

గంగానదికిని ఇట్టి మనోహరమయిన సౌందర్యము కలదేని యప్పటికి

స్థానే జగతి విఖ్యాతా గుణా స్తస్యా మనోరమాః. ౯౪

యది దృశ్యేత సా సాధ్వీ యది చేహ వసేమహి,
స్పృహయేయం న శక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ! ౯౫

న హ్యేవం రమణీయేషు శాద్వలేషు తయా సహ,
రమతో మేభవే చ్చిన్తా న స్పృహాఽన్యేషు వా భవేత్. ౯౬

అమీ హి వివిధైః పుష్పై స్తరవో రుచిరచ్ఛదాః,
కాననేఽస్మి న్వినా కాన్తాం చిత్త మున్మాదయన్తి మే. ౯౭

పశ్య శీతజలాం చేమాం సౌమిత్రే! పుష్కరాయుతామ్,
చక్రవాకానుచరితాం కారణ్డవనిషేవితామ్. ౯౮
ప్లవైః క్రౌఞ్చై శ్చ సంపూర్ణాం వరాహమృగసేవితామ్,

అధికం శోభతే పమ్పా వికూజద్భి ర్విహఙ్గమైః. ౯౯

దీపయన్తీవ మే కామం వివిధా ముదితా ద్విజాః,
శ్యామాం చన్ద్రముఖీం స్మృత్వా ప్రియాం పద్మనిభేక్షణామ్,

పశ్య సానుషు చిత్రేషు మృగీభి స్సహితా న్మృగాన్,
మాం పున ర్మృగశాబాక్ష్యా వైదేహ్యా విరహీకృతమ్. ౧౦౦

వ్యథయన్తీవ మే చిత్తం సంచరన్త స్తత స్తతః,

గంగానది మనోహరములయిన గుణంబులు గలదని లోకంబులఁ బ్రసిద్ధిఁ గాంచు టంతయు యుక్తమగును. ౯౩

రఘూత్తముఁడవగు లక్ష్మణుఁడా! పతివ్రతయగు సీత లేక మన మందఱము నిచ్చట నెట్లుండుదుమని నేను అయోధ్యనుమాత్రమె గాదు దేవేంద్రపదవినిగూడ నాశింపను. ౯౪

ఇట్టి రమణీయములగు శాద్వలప్రదేశములందు, సీతతోఁగూడఁ గ్రీడింపుచుండు నేని నా కెంతమాత్రము చింతకలుగదు. మఱి యింక దేని యందు నాశయుఁ గలుగదు. ౯౫

ఈవనంబునందు సుందరపత్రములుగు వృక్షముల నానావిధములయిన పుష్పములం జూచి ప్రియావిరహితుఁడ నగు నాకున్నను సుస్వాదము గలుగుచున్నది. ౯౬

లక్ష్మణుఁడా! చల్లని జలముగలదియుఁ గమలంబులతోఁ నొప్పుచున్నదియుఁ జక్రవాకంబులు కారండవంబులు నీరుకోళ్లు క్రౌంచంబులు మొదలగు పక్షులతోఁ గూడినదియు నీళ్లు త్రాగుటకై వచ్చిన వరాహంబులతోను మృగంబులతోనుఁ గూడినదియునగు నీపంపాసరస్సునుం జూడుము. ౯౭

పంపాసరస్సు మధురముగాఁ గూయుపక్షులతో నెంతయు నొప్పుచున్నది. ౯౮

నానావిధములయినపక్షులు సంతుష్టంబులయి మధురముగాఁ గూయుచు యౌవనమధ్యస్థయును చంద్రునింబోలు ముఖంబుగలదియుఁ గమలంబుల వంటి కన్నులుగలదియునగు ప్రియురాలిందలఁచుకొనుచున్న నాకు మన్మథవికారము మఱిమఱి వృద్ధిఁబొందునట్లు చేయుచున్నవి ౧౦౦

చిత్రములగు పర్వతసానులందు జింకలు ఆఁడుజింకలతోఁ గూడి క్రీడించుచున్నవి. నేనో యిట్లు జింకపిల్లకుంబోలె సుందరంబులగు కన్నులు గల సీతను విడిచి బాధపడుచున్నాను

మృగపక్షిసమూహములతో నొప్పుచున్న [illegible] యీపర్వత

అస్మింస్త్వానుని రమ్యే హి మత్తద్విజగణాయుతే. ౧౦౨

పశ్యేయం యది తాం కాన్తాం తత స్స్వస్తి భవేన్మమ,
జీవేయం ఖలు సౌమిత్రే! మయా సహ సుమధ్యమా. ౧౦౩
సేవతే యది వై దేహీ పమ్పాయాః పవనం సుఖమ్,

పద్మసౌగన్ధికవహం శివం శోకవినాశనమ్, ౧౦౪
ధన్యా లక్ష్మణ! సేవన్తే పమ్పోపవనమారుతమ్,

శ్యామా పద్మపలాశాక్షీ ప్రియా విరహితా మయా. ౧౦౫
కథం ధారయతి ప్రాణా న్వివశా జనకాత్మజా,

కిన్ను వక్ష్యామి రాజానం ధర్మజ్ఞం సత్యవాదినమ్ ౧౦౬
సీతయా జనకం పృష్టః కుశలం జనసంసది,
యా మా మనుగతా మన్దం పిత్రా ప్రవ్రాజితం వనమ్. ౧౦౭
సీతా సత్పథ మాస్థాయ క్వను సా వర్తతే ప్రియా,

తయా విహీనః కృపణః కథం లక్ష్మణ! ధారయే. ౧౦౮
యా మా మనుగతా రాజ్యా ద్భ్రష్టం విగతచేతసమ్,

త చ్చార్వఞ్చితపక్ష్మాక్షం సుగన్ధి శుభ మవ్రణమ్ ౧౦౯
అపశ్యతో ముఖం తస్యా స్సీదతీవ మనో మమ,

స్మితహాస్యాన్తరయుతం గుణవ న్మధురం హితమ్. ౧౧౦

సానువులందును, అచ్చటచ్చట సంచరించుచున్న మృగాదులు నామనస్సున కిచ్ఛగా దుఃఖము గలిగించుచున్నవి. ౧౦౨

నేను ప్రియురాలిం జూతునేని యప్పటికి నాకు మంగళంబు గలుగును.

లక్ష్మణుఁడా! సుందరమయిన నడుముగల సీతయును నాతోఁగూడ పంపాసరస్సుయొక్క యీ మనోహరంబగు మందమారుతము ననుభవించునేని నేను సుఖముగా జీవించియుందును. ౧౦౩

లక్ష్మణుఁడా! కమలసౌగంధికంబుల గంధమును వహించునదియు మంగళకరంబును దుఃఖనాశనంబు నగు పంపాసమీపవర్తివనంబుల మందమారుతమును ప్రియురాండ్రతోఁగూడ ననుభవించుచుండు పుణ్యవంతులగువారికే ఘటిల్లును.

యౌవనమధ్యస్థయును కమలదళంబులవంటి కన్నులుగలదియునగు జనకమహారాజపుత్రియునయిన సీత నన్ను విడిచి పరవశయయి ప్రాణంబు లెట్లు దాల్చియుండును? ౧౦౪

నలువురియెదుట ధర్మజ్ఞుఁడును సత్యవాదియు నగు జనకమహారాజు నన్ను సీతాదేవి క్షేమం బడుగఁగా నే నాయన కేమి చెప్పఁగలను? ౧౦౫

ఏసీత తండ్రిచే నడవికిఁ దఱుమఁబడిన నిర్భాగ్యుఁడ నగు నన్ను సన్మార్గము నవలంబించి వెంబడించివచ్చెనో అట్టి ప్రియురాలు ఇప్పు డెచ్చట నున్నది? ౧౦౬

లక్ష్మణుఁడా! ఎవ్వతె రాజ్యభ్రష్టుఁడను దుఃఖితుఁడ నగు నన్ను వెంబడించివచ్చెనో అట్టి సీతనువిడిచి యీదుఃఖంబుసహించుచు నెట్లు జీవింపఁగలను? ౧౦౭

సుందరమును సుందరములయిన ఱెప్పవెండ్రుకలతోఁగూడిన కన్నులుగలదియు సుగంధియు మంగళకరంబును ఎంతమాత్రము మచ్చమరుగు లేనిదియు నగు నా సీతాదేవి మొగంబుఁ జూడకుండుటవలన నామనస్సు ఎంతయు దుఃఖము నొందుచున్నది. ౧౦౮

లక్ష్మణుఁడా! స్వాభావికమయిన చిఱునగవుతో నడుమ నాగంతుక

వైదేహ్యా వాక్య మతులం కదా శ్రోష్యామి లక్ష్మణ!,

ప్రాప్య దుఃఖం వనే శ్యామా సా మాం మన్మథకర్శితమ్.
నష్టదుఃఖేవ హృష్టేవ సాధ్వీ సా ధ్యభ్యభాషత,

కిం ను వక్ష్యామి కౌసల్యా మయోధ్యాయాం నృపాత్మజ!.
క్వ సా స్నుషేతి పృచ్ఛన్తీం కథం చాతిమనస్వినీమ్,

గచ్ఛ లక్ష్మణ! పశ్య త్వం భరతం భ్రాతృవత్సలమ్. ౧౧౩
న హ్యహం జీవితుం శక్త స్తా మృతే జనకాత్మజామ్,

ఇతి రామం మహాత్మానం విలపన్త మనాథవత్. ౧౧౪
ఉవాచ లక్ష్మణో భ్రాతా వచనం యుక్త మవ్యయమ్,

సంస్తమ్భ రామ! భద్రం తే మా శుచః పురుషోత్తమ!. ౧౧౫
నేదృశానాం మతి ర్మన్దా భవ త్యకలుషాత్మనామ్,

స్మృత్వా వియోగజం దుఃఖం త్యజ స్నేహం ప్రియే జనే.
అతిస్నేహపరిష్వఙ్గా ద్వర్తి రార్ద్రాఽపి దహ్యతే,

యది గచ్ఛతి పాతాళం తతో హ్యధిక మేవ వా. ౧౧౬
సర్వథా రావణ స్తావ న్న భవిష్యతి రాఘవ!,

ముగా వచ్చునప్పుడోను ఒప్పుచున్నదియు గుణవంతంబును మధురమును హితమును అనుకూలంబునగు సీతాదేవి నోటవచ్చుమాటను మరల నెప్పుడు వినఁగలను? ౧౧౦

యౌవనమధ్యస్థురాలగు పతివ్రతయయిన యాసీత తాను వనంబున దుఃఖమే పొందుచుండినను నేను మన్మథబాధితుఁడ నగునప్పుడు తాను దుఃఖమే యెఱుంగనట్లును సంతోషమె పొందియున్నట్లును నాకు సంతోషకరంబులగుమాటలు చెప్పుచు నన్ను సంతోషపెట్టును. ౧౧౧

రాచకొమరుఁడవగు లక్ష్మణుఁడా! అయోధ్యకుఁ బోఁగానే "స్త్రీలోఁ గూడిన రాజ్యసుఖంబుల నన్నిఁటిని విడిచి పరమపాతివ్రత్యంబున నడవికి వచ్చి వనంబునను గీర్తిదెచ్చినట్టి నాముద్దుకోడ లెచ్చటనో?" అని మహాసాత్త్వికయగు కౌసల్య యడిగితే ఆబిడకు బదులేమి యెట్లు చెప్పఁగలను? ౧౧౨

లక్ష్మణుఁడా! నీవుపోయి భ్రాతృవత్సలుండగు భరతుం జూడుము; జనకమహారాజ పుత్రియగు నాసీతను విడిచి నేనెంతమాత్రము జీవింపఁజాలను. అని రాముఁడు విలపించెను. ౧౧౩

ఇట్లనాథపగిది విలపించుచున్న మహాత్ముఁడగు రాముం జూచి తమ్ముఁడగు లక్ష్మణుఁడు యుక్తంబును ఎంతమాత్రము మాఱుపలుకఁ గూడనిదియునగు నీమాటఁ జెప్పెను. ౧౧౪

పురుషోత్తముఁడవగు రాముఁడా! దుఃఖము మానుకొనుము; నీకు మంగళముగలుగుఁగాక; దుఃఖింపవలదు; మహాత్ములగు నీయట్టివారలకు బుద్ధి యెంతమాత్రము కలుషము గాదు. ౧౧౫

మిక్కిలియు స్నేహముంచుటచేతనె వెనుక వియోగముగలుగునప్పుడు అధికము దుఃఖముగలుగు ననున్యాయమును దలంచి ప్రియజనమునం దధిక స్నేహమును విడువుము. అతిస్నేహముండునేని తడిసినపత్తిగూడ దహింపఁబడును. (స్నేహమనఁగా నూనె ప్రీతియని రెండర్థములు). ౧౧౬

రాముఁడా! పాతాళమునకుఁ బోయినను మఱియు నంతకన్న నధిక స్థలమున కెందుఁబోయినను రావణుఁడేమో యింక జీవించియుండఁజాలఁడు.

ప్రవృత్తి ర్లభ్యతాం తావ త్తస్య పాపస్య రక్షసః. ౧౧౮
తతో హాస్యతి వా సీతాం నిధనం వా గమిష్యతి,
యది యాత్యదితే ర్గర్భం రావణ స్సహ సీతయా. ౧౧౯
తత్రాప్యేనం హనిష్యామి న చే ద్దాస్యతి మైథిలీమ్,

స్వాస్థ్యం భద్రం భజ స్వార్య! త్యజ్యతాం కృపణా మతిః.
అర్థో హి నష్టకార్యార్థై ర్నాయత్నే నాధిగమ్యతే,

ఉత్సాహో బలవా నార్య! నా స్త్యుత్సాహా త్పరం బలమ్.
సోత్సాహ స్యాస్తి లోకేఽస్మిన్ న కిఞ్చిదపి దుర్లభమ్,

ఉత్సాహవన్తః పురుషా నావసీదన్తి కర్మసు. ౧౨౨
ఉత్సాహమాత్ర మాశ్రిత్య సీతాం ప్రతిలభేమహి,
త్యజ్యతాం కామవృత్తత్వం శోకం సన్న్యస్య పృష్ఠతః. ౧౨౩
మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుధ్యసే,

ఏవం సమ్బోధిత స్తత్ర శోకోపహతచేతనః. ౧౨౪
న్యస్య శోక ఞ్చ మోహ ఞ్చ తతో ధైర్య ముపాగమత్,

సోఽభ్యతిక్రామ దవ్యగ్ర స్తా మచి న్త్యపరాక్రమః. ౧౨౫
రామః పమ్పాం సురుచిరాం రమ్యపారిప్లవద్రుమామ్,

నిరీక్షమాణ స్సహసా మహాత్మాసర్వం వనం నిర్ఝరకన్దరాంశ్చ,
ఉద్విగ్నచేతా స్సహలక్ష్మణేనవిచార్య దుఃఖోపహతః ప్రతస్థే.

పాపిష్ఠుఁడగు నారావణునిజాడమాత్రము మనకుఁ దెలియవలెను.
అంత నతఁడు సీత నేని యివ్వవలయును, లేక మరణము నేనిపొందవలెను. ౧౧౮

రావణుఁడు సీతం దీసికొని పాఱిపోయి యింద్రునితల్లియగు నదితి
దేవిగర్భములోనికిఁ జొచ్చినను అచ్చటఁగూడ సీత నివ్వఁడేని యతని వధిం
చిపుచ్చెదను. ౧౧౯

పూజ్యుఁడనగు రాముఁడా! మంగళకరమయిన ధైర్యము నవలంబిం
చుము. దీనబుద్ధిని విడువుము. ధైర్యము విడిచి ప్రయత్నము చేయకుండు నా
రలకు ఎంతమాత్రము కార్యసిద్ధి కాదు. ౧౨౦

పూజ్యుఁడనగు రాముఁడా! ఉత్సాహము చాలబలముగలది. ఉత్సాహ
మునకన్న నధికబలము వేఱులేదు. ఉత్సాహముగలవానికి లోకంబున దుర్ల
భమయినది కొంచెమేని లేదు. ౧౨౧

ఉత్సాహముగల పురుషులు ఎట్టికార్యములందేని క్లేశంబునొందరు;
మన ముత్సాహ మొకటిమాత్రము ఆశ్రయింతుమేని సీతం బొందఁగలము.

దుఃఖము వెనుకకుఁద్రోసి యీమన్మథవ్యాపారమును జయింపుము.
మహాప్రభావుండవు మహాబుద్ధివగు నిన్ను నీవే మఱచియున్నావు. అని లక్ష్మ
ణుండు రామునకుఁ జెప్పెను. ౧౨౩

అట్లు దుఃఖాక్రాంతహృదయుఁడగు రాముఁడు ఈప్రకారంబున
లక్ష్మణునిచే బోధింపఁబడినవాఁడై దుఃఖమోహములను విడిచి యంత ధైర్య
మునొందెను. ౧౨౪

అచింత్యపరాక్రముఁడగు నారాముఁడు అంత నెంతమాత్రము
మోహవశతఁజెందక సుందరములును గాలికిఁ జలించునవియునగు వృక్షము
లుగలదియు సుందరంబునగు నాపంపాసరస్సును అతిక్రమించిపోయెను.

మహాత్ముఁడగు రాముఁడు లక్ష్మణునితోఁగూడ నావనంబంతయు నెల
యెల్లను బర్వతగుహలను జూచి సీతను వెదకి దిగులొంది దుఃఖితహృదయుఁ
డై శీఘ్రంబునఁ బోయెను. ౧౨౬

తం మత్తమాతఙ్గవిలాసగామీ
గచ్ఛన్త మవ్యగ్రమనా మహాత్మా,
స లక్ష్మణో రాఘవ మప్రమత్తో
రరక్ష ధర్మేణ బలేన చైవ. ౧౨౭

తా వృశ్యమూకస్య సమీపచారీ
చర న్దద ర్శాద్భుతదర్శనీయౌ,
శాఖామృగాణా మధిప స్తరస్వీ
వితత్రసే నైవ చిచేష్ట కిఞ్చిత్ ౧౨౮

స తౌ మహాత్మా గజమన్దగామీ
శాఖామృగ స్తత్ర చిరం చరన్తౌ,
దృష్ట్వా విషాదం పరమం జగామ
చిన్తాపరీతో భయ భారమగ్నః. ౧౨౯

త మాశ్రమం పుణ్యసుఖం శరణ్యం
సదైవ శాఖామృగసేవితా న్తమ్,
త్రస్తా శ్చ దృష్ట్వా హరయోఽభిజగ్ము
ర్మహౌజసౌ రాఘవలక్ష్మణౌ తౌ. ౧౩౦

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ప్రథమ స్సర్గః. ౧.

---

## ద్వితీయ స్సర్గః.

తౌ తు దృష్ట్వా మహాత్మానౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
వరాయుధధరౌ వీరౌ సుగ్రీవ శ్శఙ్కితోఽభవత్. ౧

ఉద్విగ్నహృదయ స్సర్వా దిశ స్సమవలోకయన్,
న వ్యతిష్ఠత కస్మింశ్చి ద్దేశే వానరపుఙ్గవః. ౨

మదపుటేనుఁగువలె సవిలాసముగా నడచువాఁడును మహాత్ముఁడునగు లక్ష్మణుఁడు మనసునఁ జలనము నేమఱుపాటును లేనివాఁడై అట్లు రాజనీతులు మొదలగుధర్మములు చెప్పుటచేతను తనబలము నుగ్గడించుటచేతను పోవుచున్నరాము నెంతమాత్రము వ్యసనముఁ బొందనీయక రక్షించుచుండెను.

ఋశ్యమూకపర్వతంబున నుండునట్టిబలవంతుఁడగు వానరరాజు సుగ్రీవుఁడు ఒకానొకప్పుడు పంపాసమీపంబున విహరించుచుఁ జూపరుల కాశ్చర్యము గలిగించునట్టి యారామలక్ష్మణులం జూచి భయముఁజెంది నిశ్చేష్టుఁడయ్యెను. ౧౨౮

మహాబలుండును ఏనుఁగువలె మందగంభీరముగా నడచువాఁడు నగు నా సుగ్రీవుఁడు ఆపంపాప్రాంతవనంబున బహుకాలము తిరుగుచున్న ఆరామలక్ష్మణులంజూచి వారిరూపాతిశయమునకు చింతనొంది మిక్కిలియు భీతుఁడై పరమదుఃఖము నొందెను. ౧౨౯

ఆసుగ్రీవునిసచివులగు వానరులుగూడ మహాపరాక్రములగు నారామలక్ష్మణులంజూచి "వీరలువాలిచేఁ బంపబడినవా" రని యెంచి వాలిపక్షంబువారికిఁ బొందసలవిగానిదియుఁ బవిత్రంబును సుఖకరంబును వాసయోగ్యమును వానరసేవితంబునగు నామతంగాశ్రమంబుఁ జొచ్చిరి. ౧౩౦

ఇది యొకటవసర్గము.

---

## రెండవసర్గము.

ఉత్తమలక్షణములుగల దేహములు గలవారలును ఉత్తమాయుధంబులు ధరించినవారలును బరాక్రమవంతులునగునన్నదమ్ముల నారామలక్ష్మణులఁ జూచినంతనె సుగ్రీవుఁడు భయంబునొందెను. ౧

వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు మనస్సున భయముఁజెంది దిక్కులన్నింటిని జూచుచు ఒక్కచోటను నిలువఁడయ్యె. ౨

నైవ చక్రే మనః స్థానే వీక్షమాణో మహాబలౌ,
కపేః పరమభీతస్య చిత్తం వ్యవససాద హ. ౩

చిన్తయిత్వా స ధర్మాత్మా విమృశ్య గురులాఘవమ్,
సుగ్రీవః పరమోద్విగ్న స్సర్వై రనుచరై స్సహ. ౪

తత స్స సచివేభ్య స్తు సుగ్రీవః ప్లవగాధిపః,
శశంస పరమోద్విగ్నః పశ్యం స్తౌ రామలక్ష్మణౌ. ౫
ఏతౌ వన మిదం దుర్గం వాలిప్రణిహితౌ ధ్రువమ్,
ఛద్మనా చీరవసనౌ ప్రచరన్తా విహాగతౌ. ౬

తత స్సుగ్రీవసచివా దృష్ట్వా పరమధన్వినౌ,
జగ్ము ర్గిరితటా త్తస్మా దన్య చ్ఛిఖర ముత్తమమ్. ౭

తే క్షిప్ర మధిగమ్యాథ యూథపా యూథపర్షభమ్,
హరయో వానరశ్రేష్ఠం పరివా ర్యోపతస్థిరే. ౮
ఏక మేకాయనగతాః ప్లవమానా గిరే ర్గిరిమ్,
ప్రకమ్పయన్తో వేగేన గిరీణాం శిఖరా ణ్యపి. ౯

తతశ్శాఖామృగా స్సర్వే ప్లవమానా మహాబలాః,
బభఞ్జుశ్చ నగాం స్తత్ర పుష్పితాన్దుర్గసంశ్రితాన్. ౧౦
ఆప్లవన్తో హరివరా స్సర్వత స్తం మహాగిరిమ్,
మృగమార్జారశార్దూలాం స్త్రాసయన్తో యయు స్తదా. ౧౧
తత స్సుగ్రీవసచివాః పర్వతేన్ద్రం సమాశ్రితాః,
సఙ్గమ్య కపిముఖ్యేన సర్వే ప్రాఞ్జలయ స్స్థితాః. ౧౨

ఆసుగ్రీవుఁడు మహాబలశాలులగు నారామలక్ష్మణులం జూచుచు నెచ్చోటనునిలువ నోపఁడయ్యె. అట్లుపరమభీతుఁడగుసుగ్రీవునిమనస్సు మిక్కిలియు దుఃఖమునొందెను. ౩

ధర్మాత్ముఁడగు నాసుగ్రీవుఁడు అట్లు దుఃఖితుఁడై నిలిచియుండుటయం దును బరుగెత్తుటయందును ఏదికష్టమో ఏదిసుఖమో విమర్శించి సచివులయం దఱతోఁగూడ మిక్కిలియు భయపడెను. ౪

అంత వానరేశ్వరుండగు నాసుగ్రీవుఁడు ఆరామలక్ష్మణులఁ జూచుచుఁ బరమభీతుఁడై ఆసంగతి యంతయుఁ దనమంత్రులకుఁ జెప్పెను. ౫

వీరలు వాలిచేఁ బంపఁబడినవారలయి కపటంబున నారచీరలుగట్టుకొని మునివేషంబు వేసికొని తిరుగుచు నిచ్చటికి దుర్గమంబగు నీవనంబునకు వచ్చినారు. ఇదినిశ్చయము. అని సుగ్రీవుఁడు మంత్రులకుఁ జెప్పెను. ౬

అంత సుగ్రీవునిసచివులగు వానరులు మహాధనుర్ధరులగు నారామలక్ష్మణులం జూచి ఆపర్వతసానువుననుండి మఱియొక యున్నతమగు పర్వత శిఖరమునకుఁ బోయిరి. ౭

అంత నావానరవీరులు అచ్చటచ్చటనుండి వానరశ్రేష్ఠుండగు సుగ్రీవునియొద్దకువచ్చి యతనిం బరివేష్టించి కొలిచియుండిరి. ౮

ఆవానరులు వేగంబునఁ బర్వతశిఖరంబులుగూడ జలనంబునొంద ఈ పర్వతంబుననుండి యీపర్వతంబున కెగురుచుఁ దుదకందఱు నొకస్థానంబుఁ జేరి సుగ్రీవుఁబరివేష్టించి కొలిచియుండిరి. ౯

అంత మహాబలశాలులగు నావానరులందఱు ఎగురుచుఁ బర్వతంబుల నుండు పుష్పితవృక్షంబుల విఱిచిరి. ౧౦

అప్పుడు వానరవీరులు ఆఋశ్యమూకపర్వతంబంతయు నెగురుచు జింకలు పిల్లులు పెద్దపులులు మొదలగు మృగంబుల వెఱపించుచుఁ బోయిరి.

అంత సుగ్రీవునిసచివులందఱు పర్వతశ్రేష్ఠంబగు ఋష్యమూకపర్వతంబు జేరి వానరేంద్రుఁడగు సుగ్రీవునియొద్ద చేతులు మొగిడ్చి కొలిచియుండిరి. ౧౨

తత స్తం భయసంవిగ్నం వాలికిల్బిషశఙ్కితమ్,
ఉవాచ హనుమా న్వాక్యం సుగ్రీవం వాక్యకోవిదః. ౧౩

సంభ్రమ స్త్యజ్యతా మేష సర్వై ర్వాలికృతే మహాన్,
మలయోఽయం గిరివరో భయం నేహాస్తి వాలినః. ౧౪
యస్మా దుద్విగ్నచేతా స్త్వం ప్రద్రుతో హరిపుఙ్గవ!,
తం క్రూరదర్శనం క్రూరం నేహ పశ్యామి వాలినమ్. ౧౫
యస్మా త్తవ భయం సౌమ్య! పూర్వజా త్పాపకర్మణః,
స నేహ వాలీ దుష్టాత్మా న తే పశ్యా మ్యహం భయమ్. ౧౬

అహో శాఖామృగత్వం తే వ్యక్త మేవ ప్లవఙ్గమ!,
లఘుచి త్తతయాఽఽత్మానం న స్థాపయసి యో మతౌ. ౧౭

బుద్ధివిజ్ఞానసంపన్న ఇఙ్గితై స్సర్వ మాచర,
న హ్యబుద్ధిం గతో రాజా సర్వభూతాని శాస్తి హి. ౧౮

సుగ్రీవ స్తు శుభం వాక్యం శ్రుత్వా సర్వం హనూమతః,
తత శ్శుభతరం వాక్యం హనూమన్త మువాచ హ. ౧౯
దీర్ఘబాహూ విశాలాక్షౌ శరచాపాసిధారిణౌ,
కస్య న స్యా ద్భయం దృష్ట్వా హ్యేతౌ సురసుతోపమౌ. ౨౦

వాలిప్రణిహితా వేతౌ శఙ్కేఽహం పురుషోత్తమౌ,
రాజానో బహుమిత్రా శ్చ విశ్వాసో నాత్ర హి క్షమః. ౨౧

అంత మాటలుచెప్పుటయందుఁ బండితుఁడగు హనుమంతుఁడు వాలి రామ వీరి బంపియుండునని శంకించి భయపీడితుఁడైయున్న సుగ్రీవుఁజూచి యిట్లనిచెప్పెను. ౧౩

మీ అలందఱు ఇట్లు వాలినిమిత్తమయి మహాభయంబు నొందవలదు. ఇదిఋష్యమూకపర్వతము. ఇచ్చట వాలివలన నెంతమాత్రము భయములేదు.

వానరశ్రేష్ఠుడవగు సుగ్రీవుఁడా! నీవెవ్వనివలనభయపడి పరుగెత్తుచున్నావో ఆట్టిక్రూరుఁడును క్రూరకర్ముడునగు వాలి యిక్కడ నగపడలేదు.

సౌమ్యుడవగు సుగ్రీవుఁడా నీవు పాపకర్ముడగు నేవాలివలన భయంబు నొందుచున్నావో అట్టిదుష్టాత్ముడగు వాలి యిచ్చటలేఁడు. కాబట్టి నీకెంతమాత్రముభయముగలుగునని నాకు తోఁచలేదు. ౧౫

వానరుఁడవగు సుగ్రీవుఁడా! నీ విట్లు లఘుబుద్ధివై బుద్ధితోఁ జక్కఁగా విచారింపక చాపలంబు నొందుచున్నావుకావున నీవానరత్వము స్పష్టమగుచున్నది. ౧౬

బుద్ధియు విజ్ఞానంబును గలవాఁడవైబుద్ధిబలంబున నితరులయింగితంబులచే వారియభిప్రాయంబుఁ దెలిసి సమస్తకార్యంబులఁ జేయుము. బుద్ధిలేని రాజు ఎంతమాత్ర జనులఁ బాలింపఁజాలఁడు అని హనుమంతుఁడు సుగ్రీవుని తోఁజెప్పెను. ౧౭

సుగ్రీవుడు హనుమంతుఁడు చెప్పినమంగళకరంబగు మాటనంతయు విని హనుమంతుంజూచి మఱియు మంగళకరంబగు నీమాటఁజెప్పెను. ౧౮

అజానుబాహువులును విశాలంబులగు నయనంబులుగలవారలును ధనుర్బాణంబులను ఖడ్గంబులను దాల్చినవారలును దేవతుల్యులు నగువీరలం జూచితే ఎవ్వనికి భయంబు గలుగదు. ౨౦

వాలి యిచ్చటికి వచ్చియున్నాఁడని నామనసులో లేదు; ఈపురుషశ్రేష్ఠులను వాలి నాపైకిఁ బంపినాఁడని నాకుఁదోఁచుచున్నది; రాజులు పెక్కండ్రు స్నేహితులుగలవారలు: కావున రాజవిషయమందు ఎంతమాత్రము నమ్మకముంచరాదు. ౨౧

అరయశ్చ మనుష్యేణ విజ్ఞేయా శ్ఛన్నచారిణః,
విశ్వస్తానా మవిశ్వస్తా రన్ధ్రేషు ప్రహరన్తి హి. ౨౨

కృత్యేషు వాలీ మేధావీ రాజానో బహుదర్శనాః,
భవన్తి పరహన్తార స్తే జ్ఞేయాః ప్రాకృతై ర్నరైః. ౨౩

తౌ త్వయా ప్రాకృతే నైవ గత్వా జ్ఞేయౌ ప్లవఙ్గమ!,
ఇఙ్గితానాం ప్రకారైశ్చ రూపవ్యాభాషణేన చ. ౨౪

లక్షయస్వ తయో ర్భావం ప్రహృష్టమనసౌ యది,
విశ్వాసయ న్ప్రశంసాభి రిఙ్గితైశ్చ పునఃపునః. ౨౫
మమైవాభిముఖం స్థిత్వా పృచ్ఛ త్వం హరిపుఙ్గవ!,
ప్రయోజనం ప్రవేశస్య వనస్యాస్య ధనుర్ధరౌ. ౨౬

శుద్ధాత్మానౌ యది త్వేతౌ జానీహి త్వం ప్లవఙ్గమ!,
వ్యాభాషితై ర్వా విజ్ఞేయా స్యా ద్దుష్టాదుష్టతా తయోః. ౨౭

ఇత్యేవం కపిరాజేన సన్దిష్టో మారుతాత్మజః,
చకార గమనే బుద్ధిం యత్ర తౌ రామలక్ష్మణౌ. ౨౮
తథేతి సమ్పూజ్య వచ స్తు తస్య త
త్కపే స్సుభీమస్య దురాసదస్య చ,

మనుష్యుఁడు రహస్యముగా సంచరించుశత్రువులను గనిపెట్టియుండ వలయును; లేనియెడ వారలు తమ్ము నమ్మునట్లుచేసికొని తాము మఱల మనల నమ్మక మన మేమఱియుండునప్పుడు మనలఁ బ్రహరింతురు. ౨౨

వాలి కార్యములచేయుటయందు మిక్కిలియు బుద్ధిమంతుఁడు: రాజులు పెక్కుపాయముల శత్రువులం బొరిగొనఁజాలుదురు. కాఁబట్టి బుద్ధిమంతులు దీనమగువేషమును దాల్చినవారలై వారల యభిప్రాయముఁ దెలియవలయును. ౨౩

హనుమంతుఁడా, నీవు ప్రాకృతవేషంబుఁదాల్చి వారలయొద్దకుఁ బోయి వారియింగితభేదములచేతను సౌమ్యులుగానుండుటయో అసౌమ్యులుగానుండుటయో మొదలయిన లక్షణములచేతను వారలతోఁ బరస్పరము సంభాషించుటచేతను వారలయథార్థస్థితిని దెలిసికొనవలయును. ౨౪

వానరోత్తముఁడవగు హనుమంతుఁడా! వారియభిప్రాయము తెలిసికొనుము: వారిమనసునఁ గీడుతలంపుండునేని వారియింగితంబులచే వారిమనోగతంబు నెఱుంగుచు వారిని స్తోత్రంబులుచేసుబ్బించి మాటిమాటికి అనుకూలవాక్యములచే నాపై వారల కనుకూలాభిప్రాయము గలుగునట్లుచేసి ధనుర్ధరులయి వారలీవనంబునకు వచ్చుటకుఁ గారణంబు నడుగుము. ౨౫

హనుమంతుఁడా! వీరలు శుద్ధమయిన మనస్సుగలవారలె యయినపక్షమున వారలతో మాటలాడవలసినప్రకారము నీకుఁదెలిసియే యున్నది; వారి మాటలచేతనే వారుదుష్టులో అదుష్టులో యెఱుంగవచ్చును. అని సుగ్రీవుండు హనుమంతునితోఁజెప్పెను. ౨౬

వాయుపుత్త్రుండగు హనుమంతుఁడు వానరరాజు సుగ్రీవుఁ డాజ్ఞాపించినది విని ఆరామలక్ష్మణు లుండుస్థలమునకుఁ బోఁదలఁచెను. ౨౭

మహానుభావుఁడగు హనుమంతుఁడు భయంకరాకారుఁడును శత్రువులకు దురాసదుండు నగుసుగ్రీవునిమాటను అట్లె కావించెదనని శ్లాఘించి

మహానుభావో హనుమా న్యయౌ తదా
స యత్ర రామోఽతిబల శ్చ లక్ష్మణః. ౨౯

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్వితీయ స్సర్గః. ౨.

---

## తృ తీ య స్స ర్గః.

వచో విజ్ఞాయ హనుమాం త్సుగ్రీవస్య మహాత్మనః,
పర్వతా దృశ్యమూకా త్తు పుప్లువే యత్ర రాఘవౌ. ౧

కపిరూపం పరిత్యజ్య హనూమా న్మారుతాత్మజః,
భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః. ౨
తత స్స హనుమా న్వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా,
వినీతవ దుపాగమ్య రాఘవౌ ప్రణిపత్య చ. ౩
ఆబభాషే తదా వీరౌ యథావ త్ప్రశశంస చ,
సంపూజ్య విధివ ద్వీరో హనూమా న్మారుతాత్మజః. ౪
ఉవాచ కామతో వాక్యం మృదు సత్యపరాక్రమౌ,

రాజర్షి దేవప్రతిమౌ తాపసౌ సంశితవ్రతౌ. ౫
దేశం కథ మిమం ప్రాప్తౌ భవన్తౌ వరవర్ణినౌ,
త్రాసయన్తౌ మృగగణా నన్యాం శ్చ వనచారిణః. ౬
పమ్పాతీరరుహా న్వృక్షా న్వీక్షమాణౌ సమన్తతః,

ఇమాం నదీం శుభజలాం శోభయన్తౌ తపస్వినౌ. ౭
ధైర్యవన్తౌ సువర్ణాభౌ కౌ యువాం చీరవాససౌ,
నిశ్శ్వసన్తౌ వరభుజౌ పీడయన్తా వివాః ప్రజాః. ౮
సింహవిప్రేక్షితౌ వీరౌ సింహాతిబలవిక్రమౌ,

రాముఁడును మహాబలుఁడునగు లక్ష్మణుఁడు నుండుచోటికిఁ బోయెను. ౨౯

ఇది రెండవ సర్గము.

---

## మూఁడవ సర్గము.

హనుమంతుఁడు మహాబుద్ధిశాలియగు సుగ్రీవుని యభిప్రాయంబు దెలిసికొని ఋశ్యమూకపర్వతంబుననుండి రామలక్ష్మణు లుండుస్థలంబునకు ఎగిరిపోయెను. ౧

అంత వాయుకుమారుఁడగు హనుమంతుఁడు మోసపుచ్చవలెనని బుద్ధిగలవాఁడగుటచే వానరరూపంబు విడిచి బ్రహ్మచారిరూపంబు దాల్చెను. ౨

అంతనప్పుడు ఆహనుమంతుఁడు పరాక్రమవంతులగు నారామలక్ష్మణులయొద్దకు వినయమునం బోయి వారలకు నమస్కరించి మృదుమధురమయినమాటతో వారలఁజూచి యిట్లని ప్రశంసించెను. ౩

పరాక్రమశాలియగు వాయుకుమారుఁడైన హనుమంతుఁడు సత్యపరాక్రముల నారామలక్ష్మణులను యథావిధిఁబూజించి మృదుమధురవాక్యంబున నిట్లని చెప్పెను. ౪

మీరలు రాజర్షులరును దేవతుల్యులరును తాపసులరును వ్రతదీక్షితులరును స్నిగ్ధరూపులరును గానున్నారు; మీర లిచ్చటికెట్లువచ్చినారు? ౫

మీరలు గాంభీర్యాదులచే వనంబునఁదిరుగుమృగాదులను వెఱపించుచుఁ బంపాతీరంబున మొలచియుండువృక్షంబులసౌందర్యంబుఁ గన్నారం జూచుచు వచ్చుచున్నారు. ౬

మంగళకరమయిన జలముగల యీపంపాసరస్సును ప్రకాశింపఁజేయుచున్నవారలును దపస్వులరును ధైర్యవంతులరును మంచిరంగుగలవారలును నారచీరలుగట్టుకొన్నవారలును మార్గాయాసంబున నిట్టూర్పులు పుచ్చుచున్నవారలును సుందరములును ఏనుఁగుతొండము వంటివియు

శక్రచాపనిభే చాపే గృహీత్వా శత్రుసూదనౌ. ౯
శ్రీమన్తౌ రూపసమ్పన్నౌ వృషభశ్రేష్ఠవిక్రమౌ,
హస్తిహస్తోపమభుజౌ ద్యుతిమన్తౌ నరర్షభౌ. ౧౦

ప్రభయా పర్వతేన్ద్రోఽయం యువయో రవభాసితః,

రాజ్యార్హా వమరప్రఖ్యౌ కథం దేశ మిహాగతౌ. ౧౧
పద్మపత్రేక్షణౌ వీరౌ జటామణ్డలధారిణౌ,

అన్యోన్యసదృశౌ వీరౌ దేవలోకా దివాగతౌ. ౧౨
యదృచ్ఛ యేవ సంప్రాప్తౌ చన్ద్రసూర్యౌ వసున్ధరామ్,

విశాలవక్షసౌ వీరౌ మానుషౌ దేవరూపిణౌ. ౧౩
సింహస్కన్ధౌ మహోత్సాహౌ సమదా వివ గోవృషౌ,

ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః. ౧౪
సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః,

ఉభౌ యోగ్యా వహం మన్యే రక్షితుం పృథివీ మిమామ్ ౧౫
ససాగరవనాం కృత్స్నాం విన్ధ్యమేరువిభూషితామ్,

ఇమే చ ధనుషీ చిత్రే శ్లక్ష్ణే చిత్రానులేపనే. ౧౬

నఘబాహువులుగలవారలును ఈమృగాదులను వెఱపించుచున్నవారలును సింహమునకుఁబోలె గంభీరవీక్షణంబుగలవారలును బరాక్రమవంతులరును సింహమునకన్నను అధికమయినబలపరాక్రమంబులు గలవారలును ఇంద్రధనుస్సువంటి మహాధనుస్సుల ధరించినవారలును శత్రుహంతలరును శ్రీమంతులరు రూపసంపన్నులరు ఆఁబోతులుంబోలె నడచువారలు మహాతేజులరు బురుషశ్రేష్ఠులరునగు మీర లెవ్వరు? ౧౦

మీ దేహకాంతి చేత పర్వతశ్రేష్ఠమగు నీఋశ్యమూకపర్వతము ప్రకాశింపఁజేయఁబడుచున్నది

రాజ్యార్హులరును దేవసమానులరును గమలదళంబులు బోలు నయనంబులు గలవారలును బరాక్రమవంతులరు నగుమీరలు జటామండలంబు దాల్చి యిప్వనంబున కెట్లువచ్చినారు. ౧౧

మీరు సౌందర్యంబున నొకరివలెనొకరున్నారు. స్వర్గంబుననుండి వచ్చిన దేవతలవలె నున్నారు. యదృచ్ఛచేభూమికివచ్చిన చంద్రసూర్యులనందగియున్నారు. ౧౨

మీరలు విశాలమయిన వక్షస్స్థలముగలవారలు, పరాక్రమవంతులరు. మనుష్యులయినను దేవతలవలెనున్నారు. సింహమునకుఁబోలె నున్నతంబులయిన మూఁపులుగలవారలును అధికమయినయుత్సాహముగలవారలు: మదించినయాఁబోతులవలెనున్నారు. ౧౩

ఆజానుదీర్ఘములును గుండ్రములునుపరిఘలంబోలినవియును సమస్తభూషణములచేతను నలంకరింపఁదగినవియు నగునీభుజములు భూషణములచే నలంకరింపఁబడకున్నవేల ? ౧౪

మీరిద్దఱును సముద్రంబులతోను వనంబులతోను వింధ్యమేరు పర్వతంబులతోను నొప్పుచున్న యీసమస్తభూమండలమునుఁ బాలింప సర్హులని తలంచుచున్నాను. ౧౫

చూపరుల కచ్చెరువు గలిగించునవియు సుందరంబులును అద్భుతమ

ప్రకాశేతే యథేన్ద్రస్య వజ్రే హేమవిభూషితే,

సమాపూర్ణా నిశితై ర్బాణై స్తూణాశ్చ శుభదర్శనాః. ౧౭
జీవితాన్తకరై ర్ఘోరై శ్శ్వసద్భిరివ పన్నగైః,

మహాప్రమాణౌ విస్తీర్ణౌ తప్తహాటకభూషితౌ. ౧౮
ఖడ్గా వేతౌ విరాజేతే నిర్ముక్తా వివ పన్నగా,

ఏవం మాం పరిభాషన్తం కస్మా ద్వై నాభిభాషథః. ౧౯
సుగ్రీవో నామ ధర్మాత్మా కశ్చి ద్వానరయూథపః,
వీరో వినికృతో భ్రాత్రా జగద్భ్రమతి దుఃఖితః. ౨౦

ప్రాప్తోఽహం ప్రేషిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా,
రాజ్ఞా వానరముఖ్యానాం హనూమా న్నామ వానరః. ౨౧
యువాభ్యాం సహ ధర్మాత్మా సుగ్రీవ స్సఖ్య మిచ్ఛతి,

తస్య మాం సచివం విత్తం వానరం పవనాత్మజమ్. ౨౨
భిక్షురూపప్రతిచ్ఛన్నం సుగ్రీవప్రియకామ్యయా,
ఋశ్యమూకా దిహ ప్రాప్తం కామగం కామరూపిణమ్. ౨౩

ఏవ ముక్త్వా తు హనుమాం స్తౌ వీరౌ రామలక్ష్మణౌ,
వాక్యజ్ఞో వాక్యకుశలః పున ర్నోవాచ కించన. ౨౪

ఏత చ్ఛ్రుత్వా వచ స్తస్య రామో లక్ష్మణ మబ్రవీత్,

యిన కాంచనానులేపనంబు గలవియునగునీధనుస్సులు కాంచనభూషితంబులగు నింద్రుని వజ్రాయుధంబులపగిదిఁ బ్రకాశించుచున్నవి. ౧౭

సుందరములయిన యీయమ్ములపొదులును తీక్ష్ణములును ప్రాణనాశకరంబులును భయంకరములును గోపంబున నిట్టూర్పులు పుచ్చుచున్న సర్పములంబోలె నున్నవియునగు బాణములచే నిండియున్నవి. ౧౮

మిక్కిలియు దీర్ఘములును విశాలములును మంచిబంగారముచే నలంకృతంబులు నగు నీఖడ్గంబులు కుబుసమువీడిన పన్నగంబులభంగిఁ బ్రకాశించుచున్నవి ౧౯

ఇట్లు నే నెంతమాటలాడినను నాతో మీ రేల బదులు పలుకకున్నారు?

ధర్మాత్ముఁడును మహాపరాక్రమశాలియు నగుసుగ్రీవుఁ డనువానరరాజు అన్నచేఁ దఱుమఁగొట్టఁబడినవాఁడై దుఃఖితుఁడై భూమిం దిరుగుచున్నాఁడు. ౨౦

హనుమంతుఁడను వానరుండనగు నేను మహాత్ముఁ డగువానరోత్తములకెల్ల రాజయిన సుగ్రీవునిపనుపున నిచ్చటికి వచ్చినాను. ౨౧

ధర్మాత్ముఁడగు నాసుగ్రీవుఁడు మీతో సఖ్యము సేయఁ గోరుచున్నాఁడు.

నేను ఆసుగ్రీవునిసచివుఁడను వానరుఁడను వాయుపుత్రుఁడను సుగ్రీవుని ప్రియంబుపొంటె బ్రహ్మచారిరూపంబు దాల్చి ఋశ్యమూకపర్వతంబున నుండి యిచ్చటికి వచ్చినాను. తలఁచినచోటికెల్లం బోవఁగలవాఁడను. కామరూపుఁడను. అని తెలిసికొనుఁడు అని హనుమంతుఁడు రామలక్ష్మణులతోఁ జెప్పెను. ౨౨-౨౩

మాటలుచెప్పుటయందుఁ బండితుఁడగు హనుమంతుఁడు మాటలయందుఁ బండితులును వీరులునగు నా రామలక్ష్మణులతో నీప్రకారమున జెప్పి మఱియేమియుఁ జెప్పక యూరకుండెను. ౨౪

శ్రీమంతుఁడగు రాముఁడు హనుమంతునిమాటనువిని మొగంబు సం

ప్రహృష్టవదన శ్శ్రీమా న్భ్రాతరం పార్శ్వతః స్థితమ్. ౨౫
సచివోఽయం కపీన్ద్రస్య సుగ్రీవస్య మహాత్మనః,
త మేవ కాఙ్క్షమాణస్య మ మాన్తిక ముపాగతః. ౨౬
త మభ్యభాష సౌమిత్రే! సుగ్రీవసచివం కపిమ్,
వాక్యజ్ఞం మధురై ర్వాక్యై స్స్నేహయుక్త మరిన్దమ!. ౨౭

నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః,
నాసామవేదవిదుష శ్శక్య మేవం ప్రభాషితుమ్. ౨౮
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్,
బహు వ్యాహరతాఽనేన న కిఞ్చి దపశబ్దితమ్. ౨౯

న ముఖే నేత్రయో ర్వాపి లలాటే చ భ్రువో స్తథా,
అన్యే ష్వపి చ గాత్రేషు దోష స్సంవిదితః క్వచిత్. 30

అవిస్తర మసన్దిగ్ధ మవిలమ్బిత మద్రుతమ్,
ఉరస్థం కణ్ఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే. 3౧

సంస్కారక్రమసమ్పన్నా మద్రుతా మవిలమ్బితామ్,
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్. 3౨

అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యఞ్జనస్థయా,
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే రరే రపి. 33

ఏవంవిధో యస్య దూతో న భవే త్పార్థివస్య తు,
సిద్ధ్యన్తి హి కథం తస్య కార్యాణాం గతయోఽనఘ!. 3౪

తోషంబు చూపట్ట సమీపంబుననున్న తమ్ముని లక్ష్మణుఁ జూచి యిట్లనిచెప్పెను.

ఈతఁడు మహాత్ముఁడగు వానరరాజు సుగ్రీవుని సచివుఁడు. ఆసుగ్రీవునే చూడఁగోరుచుండు నాయొద్దకు వచ్చినాఁడు. ౨౬

శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి లక్ష్మణుఁడా! మాటలు చెప్పుటయందుఁ బండితుఁడును మనలయందు స్నేహముగలవాఁడునగు సుగ్రీవసచివుఁడైనయీ వానరునితో నీవు మధురవచనంబుల మాటలాడుము. ౨౭

ఋగ్యజుస్సామవేదంబుల మూఁడింటిని అధ్యయనింపనివానికి ఎంతమాత్ర మిట్లు మాటలాడుట కలవిగాదు. ౨౮

ఈతఁడు వ్యాకరణమును బెక్కుమార్లు చక్కఁగాఁ జదివియున్నాఁడు. ఇదినిశ్చయము. ఏలయనఁగా ఈతఁడు ఇంతసేపు మాటలాడుచున్నను గొంచెమేని యపశబ్దం బితనినోట రాలేదు. ౨౯

ఈతఁడు మాటలాడుచుండఁగా ఇతని ముఖంబునందుఁగాని కన్నులందుఁగాని లలాటంబునందుఁగాని కనుబొమలంగాని యితరములయిన యవయవములందుగాని యెందేనియు నెంతమాత్రము దోషము అగపడలేదు.

మఱియు మాటలు శబ్దవిస్తారముగాని అక్షరాదిసందేహముగాని లేక యంత యాలస్యముగాని మఱివేగము గాని గలవిగాక ఉరస్స్థానోద్గతంబులై కంఠముననుండి మధ్యమస్వరంబున వినఁబడుచున్నవి. ౩౦

ఈతఁడు వ్యాకరణాధ్యయనమువలనం గలిగినశబ్దశుద్ధితోను అక్షరశుద్ధితోనుం గూడినదియు నంత వేగంబును అంత యాలస్యంబును లేనిదియు మంగళకరంబును మనోహరంబునగునట్లు వాక్యంబు నుచ్చరించుచున్నాఁడు.

ఆశ్చర్యకరమయిన యర్థముగలవియు ఉరఃకంఠశిరస్సులను మూడుస్థానములందు స్పష్టముగాఁ బలుకుచున్నవియు నగు నీమాటలచేత ఛేదించుటకుఁ గత్తిచేఁబట్టియుండు శత్రువైనను ఎవ్వఁడు సంతోషము నొందఁడు.

పాపరహితుఁడవగు లక్ష్మణుఁడా! ఇట్టి సమర్థుఁడగు దూతలేనియెడ రాజునకుఁ గార్యసిద్ధు లెట్లు కాఁగలవు? ౩౪

ఏవం గుణగణై ర్యుక్తా యస్య స్స్యుః కార్యసాధకాః,
తస్య సిధ్యన్తి సర్వార్థా దూతవాక్యప్రచోదితాః. 3౫

ఏవ ముక్తస్తు సౌమిత్రి స్సుగ్రీవసచివం కపిమ్,
అభ్యభాషత వాక్యజ్ఞో వాక్యజ్ఞం పవనాత్మజమ్. 3౬

విదితా నో గుణా విద్వం! త్సుగ్రీవస్య మహాత్మనః,
త మేవ చాఽవాం మార్గావ స్సుగ్రీవం ప్లవగేశ్వరమ్ 3౭

యథా బ్రవీషి హనుమం! త్సుగ్రీవవచనా దిహ,
త త్తథా హి కరిష్యావో వచనా త్తవ సత్తమ!. 3౮

త త్తస్య వాక్యం నిపుణం నిశమ్య
ప్రహృష్టరూపః పవనాత్మజః కపిః,
మనః సమాధాయ జయోపపత్తౌ
సఖ్యం తదా కర్తు మియేష తాభ్యామ్. 3౯

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే తృతీయ స్సర్గః. 3.

---

## చతుర్థ స్సర్గః.

తతః ప్రహృష్టో హనుమా న్కృత్యవా నితి తద్వచః,
శ్రుత్వా మధురసంభావం సుగ్రీవం మనసా గతః. ౧

భవ్యో రాజ్యాగమ స్తస్య సుగ్రీవస్య మహాత్మనః,
య దయం కృత్యవా న్ప్రాప్తః కృత్యం చైత దుపాగతమ్.

ఏరాజునకు ఇట్టి గుణవంతులయిన కార్యసాధకులయిన భృత్యులుందురో ఆరాజు కార్యములన్నియు అతనికి శ్రమములేకయే భృత్యులసామర్థ్యముచేతనె జయము నొందును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౩౫

మాటలు చెప్పుటయందుఁ బండితుఁడగులక్ష్మణుఁడు రామునిమాటను విని మాటలయందుఁ బండితుఁడును సుగ్రీవుని సచివుఁడునగు వాయుపుత్రుని హనుమంతుం జూచి యిట్లనియె. ౩౬

పండితుఁడవగు హనుమంతుఁడా! మహాత్ముఁడగు సుగ్రీవుని సుగుణంబులు మాకుఁదెలియును. వానరరాజుఁడగు నాసుగ్రీవునే మేమును ఇప్పుడు వెదకుచున్నాము. ౩౭

ఉత్తముఁడవగు హనుమంతుఁడా! నీవు ఇప్పుడు సుగ్రీవునియోగంబున నేమిచెప్పితివో దాని నీవు చెప్పినప్రకారముననే గావించెదము. అని లక్ష్మణుఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౩౮

అంత వాయుకుమారుఁడగు హనుమంతుఁడు చతురమయినలక్ష్మణుఁడు చెప్పినమాటను విని సంతుష్టుఁడై సుగ్రీవునకు వాలిజయంబు గలుగునని మనంబునఁ దలఁచి ఆరామలక్ష్మణులతో సుగ్రీవునకు స్నేహంబు గలిగింపఁ గోరెను. ౩౯

ఇది మూఁడవసర్గము.

---

## నాలవసర్గము.

అంత హనుమంతుఁడు మధురంబయిన యాలక్ష్మణుని మాటను విని రామునకును సుగ్రీవునితోఁ గార్యమున్నదని తెలియుటచే సంతుష్టుఁడై మనస్సున సుగ్రీవుఁ దలఁచుకొనెను. ౧

ఈరాముఁడు సుగ్రీవునితోఁ గార్యముగలిగివచ్చినాఁడు. రామునికిఁ గార్యమును ముఖ్యముగా నున్నది. కావున మహాత్ముఁడగు సుగ్రీవునకు రాజ్యలాభము కాఁగలదు, అని హనుమంతుఁడు చింతించెను. ౨

తతః పరమసంహృష్టో హనూమాన్ ప్లవగర్షభః,
ప్రత్యువాచ తతో వాక్యం రామం వాక్యవిశారదః. ౩
కిమర్థం త్వం వనం ఘోరం పమ్పాకాననమణ్డితమ్,
ఆగత స్సానుజో దుర్గం నానావ్యాళమృగాయుతమ్. ౪

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణో రామచోదితః,
ఆచచక్షే మహాత్మానం రామం దశరథాత్మజమ్. ౫
రాజా దశరథో నామ ద్యుతిమా న్ధర్మవత్సలః,
చాతుర్వర్ణ్యం స్వధర్మేణ నిత్యమే వాభ్యపాలయత్. ౬

న ద్వేష్టా విద్యతే తస్య నచ స ద్వేష్టి కఞ్చన,
సచ సర్వేషు భూతేషు పితామహ ఇ వాపరః. ౭

అగ్నిష్టోమాదిభి ర్యజ్ఞై రిష్టవా నాప్తదక్షిణైః,

త స్యాయం పూర్వజః పుత్రో రామో నామ జనై శ్శ్రుతః.
శరణ్య స్సర్వభూతానాం పితు ర్నిర్దేశపారగః,
వీరో దశరథ స్యాయం పుత్రాణాం గుణవ త్తమః. ౯
రాజలక్షణసమ్పన్న స్సంయుక్తో రాజసమ్పదా,

రాజ్యా ద్భ్రష్టో వనే వస్తుం మయా సార్ధ మిహాగతః. ౧౦

భార్యయా చ మహాతేజా స్సీతయాఽనుగతో వశీ,
దినక్షయే మహాతేజాః ప్రభ యేవ దివాకరః. ౧౧

అంత మాటలు చెప్పుటయందుఁ బండితుఁడును వానరోత్తముఁడు నగుహానుమంతుఁడు పరమసంతుష్టుఁడై రాముం జూచి యిట్లనియె. 3

నీవును దమ్ముఁడును, భయంకరంబును బంపాసమీపవనాలంకృతంబును నానావిధములయిన సర్పములతోను మృగములతోనుఁ గూడినదియును దుష్ప్రవేశంబునగు దండకారణ్యంబున కెందుకు వచ్చినారు? ౪

లక్ష్మణుఁడు హానుమంతునిమాటను విని రాము ప్రేరితుఁడై హానుమంతునకు రాముని ప్రభావంబును దశరథపుత్రత్వాదులునుం జెప్పెను. ౫

కాంతిమంతుఁడును బరమధార్మికుఁడునగు దశరథుఁ డనుమహారాజు తనధర్మమును వదలక బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను నాలుగువర్ణములను ఎల్లప్పుడును దప్పక పరిపాలించుచుండెను ౬

ఆదశరథుఁడు ఒకనిపై ద్వేషము నుంచువాఁడుకాఁడు. అతనిపై ద్వేషముగలవాఁడును ఎవ్వఁడునులేఁడు అతఁడు సమస్తలోకంబులయందును రెండవబ్రహ్మదేవుఁ డనఁ బరమదయాళుఁడై సత్తముఁడై యుండెను. ౭

ఆదశరథుఁడు సంపూర్ణముగా దక్షిణ లిచ్చి యగ్నిష్టోమాదియాగంబులు గావించెను.

ఈతఁడు ఆదశరథుని జ్యేష్ఠకుమారుఁడు. రాముఁడనుపేరఁ బ్రసిద్ధుఁడు. సమస్తభూతంబులను రక్షించువాఁడు. తండ్రియాజ్ఞ మీఱనివాఁడు.

ఈతఁడు మహాపరాక్రమశాలి దశరథుని కొడుకులలో గుణంబులను త్తముఁడు. జ్యేష్ఠుఁడగుటచే రాజలక్షణంబులతోను రాజసంపదతోనుఁ గూడినవాఁడు. ౯

అట్టి ఈరాముఁడు రాజ్యభ్రష్టుఁడై వనవాసంబు నేయుటకై నాతోఁ గూడ నిచ్చటికి వచ్చినాఁడు. ౧౦

మహాతేజుఁడగు సూర్యుని సాయంకాలంబునందుఁ గాంతి వెంబడించునట్లు భార్య సీతాదేవియు రాజ్యభ్రష్టుఁడైవచ్చు మహాతేజుఁడగు రాముని వెంబడించి వచ్చెను. ౧౧

అహ మ స్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః,
కృతజ్ఞ స్య బహుజ్ఞ స్య లక్ష్మణో నామ నామతః. ౧౨
సుఖార్హ స్య మహార్హ స్య సర్వభూతహితాత్మనః,
ఐశ్వర్యేణ చ హీనస్య వనవాసాశ్రితస్య చ. ౧౩

రక్షసాఽపహృతా భార్యా రహితే కామరూపిణా,
తచ్చ న జ్ఞాయతే రక్షః పత్నీ యే నాస్య సా హృతా. ౧౪

దను ర్నామ దితేః పుత్ర శ్శాపా ద్రాక్షసతాం గతః,
ఆఖ్యాత స్తేన సుగ్రీవ స్సమర్థో వానరర్షభః. ౧౫

స జ్ఞాస్యతి మహావీర్య స్తవ భార్యాపహారిణమ్,
ఏవ ముక్త్వా దను స్స్వర్గం భ్రాజమానో గత స్సుఖమ్. ౧౬

ఏత త్తే సర్వ మాఖ్యాతం యాథాతథ్యేన పృచ్ఛతః,
అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణం గతౌ. ౧౭
ఏష దత్త్వా చ విత్తాని ప్రాప్య చాను త్తమం యశః,
లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి. ౧౮

పితా యస్య పురా హ్యాసీ చ్ఛరణ్యో ధర్మవత్సలః,
తస్య పుత్రః శ్శరణ్య శ్చ సుగ్రీవం శరణం గతః. ౧౯

సర్వలోకస్య ధర్మాత్మా శరణ్య శ్శరణం పురా,
గురు ర్మే రాఘవ స్సోఽయం సుగ్రీవం శరణం గతః. ౨౦

నేను ఈతనితమ్ముఁడను. నాపేరు లక్ష్మణుఁ డందురు. తనకుఁ బరులు కొంచె ముపకారము చేసినను దానిని మిక్కిలియు నధికముగాఁ దలఁచువాఁడును బహుశ్రుతుఁడును సుఖంబు ననుభవింపఁదగినవాఁడును బూజనీయుఁడును సర్వభూతంబులయు మేలు నే గోరుచుండువాఁడు నగు నీరాముఁడు ఐశ్వర్యహీనుఁడయ్యు వనవాసంబు నొందినవాఁడైనను ఇతనిగుణంబులచే నే నితనికి దాసుఁడనై వచ్చినాను. ౧౨-౧౩

మేము లేనికాలమునందుఁ గామరూపియగు రాక్షసుఁడొకఁడు ఈతనిభార్య నపహరించెను. ఆభార్య నపహరించిన రాక్షసుఁ డెవఁడో తెలియకున్నది. ౧౪

దనువంశజుఁడు శ్రీయను దానవుని పుత్త్రుఁడునగు నొక ప్రసిద్ధదానవుఁడు శాపంబున రాక్షసుఁడై యుండెను. అతఁడు వానరోత్తముఁడగు సుగ్రీవుఁడు సమర్థుఁడని చెప్పెను. ౧౫

“మహాపరాక్రమశాలియగు నా సుగ్రీవుఁడు నీభార్య నపహరించిన రాక్షసుఁ దెలిసికొనఁగలఁడు” అని రామునికిఁ జెప్పి యాకబంధుఁడు దేదీప్యమానుఁడై సుఖంబుగా స్వర్గంబునకుఁ బోయెను. ౧౬

నీ వడిగినావు కావున మాసమాచారమంతయు యథార్థముగా నీకుఁ జెప్పినాను. నేనును రాముఁడు మీసుగ్రీవుని శరణుపొందితిమి. ౧౭

ఈ మహాత్ముఁడు యాచకులకు నానావిధధనంబు లొసఁగియు నసదృశమయిన కీర్తిఁ బొంది లోకనాథుఁడనఁ బ్రసిద్ధినొందియు నిప్పుడు సుగ్రీవునిం దనకు నాథుఁడుగాఁ గోరుచున్నాఁడు. ౧౮

ఎవ్వనితండ్రి దశరథమహారాజు మున్ను ధర్మవత్సలుఁడై శరణాగతులఁ దప్పక రక్షించువాఁడను బిరుదువహించియుండెనో అట్టివాని కుమారుఁడును శరణాగతరక్షణధురంధరుఁడు నగు రాముఁడు ఇప్పుడు సుగ్రీవుని శరణుపొందినాఁడు. ౧౯

మున్ను సమస్తలోకంబునకు శరణ్యుఁడై రక్షకుఁడై యుండిన నాయన్నయగు రాముఁ డిప్పుడు సుగ్రీవుని శరణుపొందినాఁడు. ౨౦

యస్య ప్రసాదే సతతం ప్రసీదేయు రిమాః ప్రజాః,
స రామో వానరేన్ద్రస్య ప్రసాద మభికాఙ్క్షతే. ౨౧

యేన సర్వగుణోపేతాః పృథివ్యాం సర్వపార్థివాః,
మానితా స్సతతం రాజ్ఞా సదా దశరథేన వై. ౨౨
తస్యాయం పూర్వజః పుత్ర స్త్రిషు లోకేషు విశ్రుతః,
సుగ్రీవం వానరేన్ద్రం తు రామ శ్శరణ మాగతః. ౨౩
శోకాభిభూతే రామే తు శోకార్తే శరణం గతే,
కర్తు మర్హతి సుగ్రీవః ప్రసాదం హరియూథపః. ౨౪

ఏవం బ్రువాణం సౌమిత్రిం కరుణం సాశ్రులోచనమ్,
హనూమా న్ప్రత్యువాచేదం వాక్యం వాక్యవిశారదః. ౨౫

ఈదృశా బుద్ధిసమ్పన్నా జితక్రోధా జితేన్ద్రియాః,
ద్రష్టవ్యా వానరేన్ద్రేణ దిష్ట్యా దర్శన మాగతాః. ౨౬

స హి రాజ్యా త్పరిభ్రష్టః కృతవైర శ్చ వాలినా,
హృతదారో వనే త్యక్తో భ్రాత్రా వినికృతో భృశమ్. ౨౭

కరిష్యతి స సాహాయ్యం యువయో ర్భాస్కరాత్మజః,
సుగ్రీవ స్సహ చాస్మాభి స్సీతాయాః పరిమార్గణే. ౨౮

ఇత్యేవ ముక్త్వా హనుమాన్ శ్లక్ష్ణం మధురయా గిరా,
బభాషే సోఽభిగచ్ఛామ సుగ్రీవ మితి రాఘవమ్. ౨౯
ఏవం బ్రువాణం ధర్మాత్మా హనుమన్తం స లక్ష్మణః,

ఎవ్వఁడు అనుగ్రహించినచో ఈ ప్రజలందఱు నెల్లప్పుడు సమస్తాభీష్టంబులం బొంది సంతుష్టులయి యుందురో అట్టిరాముఁ డిప్పుడు వానరరాజుఁడగు సుగ్రీవుని యనుగ్రహమును గోరుచున్నాఁడు. ౨౧

ఎవ్వఁడు శరణాగతులయిన భూమియందలి సమస్తరాజులను ఎల్లప్పుడు సమస్తోపచారంబులతోఁ గూడినవారిం జేసి రక్షించెనో అట్టి మహారాజు దశరథుని జ్యేష్ఠపుత్త్రుఁడును ముల్లోకంబులం బ్రసిద్ధికెక్కినవాఁడునగు రాముఁడు వానరరాజమాత్త్రుఁడైన సుగ్రీవుని శరణొందుచున్నాఁడు. ౨౨,౨౩

ఇట్లు దుఃఖపరవశుఁడై దుఃఖపీడితుఁడై శరణుచొచ్చిన రామునివిషయమయి వానరరాజుఁడగు సుగ్రీవుఁడు అనుగ్రహముసేయవలయును అని లక్ష్మణుఁడు చెప్పెను. ౨౪

మాటలయందుఁ బండితుఁడగు హనుమంతుఁడు ఇట్లు వినువారికిని దుఃఖముగలుగునట్లుగాఁ గన్నుల నీళ్లుగాఱం జెప్పుచున్న లక్ష్మణుఁ జూచి యీమాటం జెప్పెను. ౨౫

ఇట్టిబుద్ధిమంతులరును జితక్రోధులరును జితేంద్రియులరు నగు మిమ్మే వానరరాజు సుగ్రీవుఁడు వెదకికొనివచ్చి చూడవలయును. అతని భాగ్యవశంబున అతనికి దర్శనంబగుటకై మీరలైయే వచ్చినారు. ౨౬

ఆసుగ్రీవుఁడును అన్నయగు వాలితో వైరంబుగొని యతఁడు తన భార్యను హరించి తన్ను వంచించి తఱుమఁగొట్టఁగా రాజ్యభ్రష్టుఁడై వనంబున నున్నాఁడు. ౨౭

సూర్యపుత్త్రుఁడగు నా సుగ్రీవుఁడు మాతోఁగూడ సీతాదేవిని వెదకుటయందు మీకు సహాయుఁడై యుండఁగలఁడు. అని హనుమంతుఁడు చెప్పెను. ౨౮

ఆహనుమంతుఁ డీప్రకారంబున మృదుమధురవాక్యంబులం జెప్పి మఱల రామునిం జూచి "ఇంక సుగ్రీవునియొద్దకుఁ బోవుదము" అని చెప్పెను. ౨౯

ధర్మాత్ముఁడగు నాలక్ష్మణుఁడు ఈప్రకారంబునం జెప్పుచున్న హను

ప్రతిపూజ్య యథాన్యాయ మిదం ప్రోవాచ రాఘవమ్. ౩౦

కపిః కథయతే హృష్టో యథాఽయం మారుతాత్మజః,
కృత్యవాం స్తోఽపి సంప్రాప్తః కృతకృత్యోఽసి రాఘవ!. ౩౧

ప్రసన్నముఖవర్ణ శ్చ వ్యక్తం హృష్ట శ్చ భాషతే,
నానృతం వక్ష్యతే వీరో హనుమా న్మారుతాత్మజః. ౩౨

తత స్తుతు మహాప్రాజ్ఞో హనుమా న్మారుతాత్మజః,
జగామాఽదాయ తౌ వీరౌ హరిరాజాయ రాఘవౌ. ౩౩

భిక్షురూపం పరిత్యజ్య వానరం రూప మాస్థితః,
పృష్ఠ మారోప్య తౌ వీరౌ జగామ కపికుఞ్జరః. ౩౪

స తు విపులయశాః కపిప్రవీరః
పవనసుతః కృతకృత్యవ త్ప్రహృష్టః,
గిరివర మురువిక్రమః ప్రయాత
స్స శుభమతి స్సహ రామలక్ష్మణాభ్యాం. ౩౫
ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుర్థ స్సర్గః. ౪.

---

పఞ్చమ స్సర్గః.

ఋశ్యమూకా త్తు హనుమా న్గత్వా తు మలయం గిరిమ్,
ఆచచక్షే తదా వీరౌ కపిరాజాయ రాఘవౌ. ౧

అయం రామో మహాప్రాజ్ఞ స్సంప్రాప్తో దృఢవిక్రమః,

మంతుని యథాన్యాయముగా దూతను బూజింపవలసినరీతిం బూజించి రా
ముం జూచి యిట్లనియె. 3౦

రాముఁడా! నామాటలకు వాయుపుత్త్రుఁడగు నీహనుమంతుఁడు సంతుష్టుఁడై యథార్థముగాఁ జెప్పుచున్నాఁడు. ఆసుగ్రీవునికిని మనవలనఁ బని యున్నది. కాఁబట్టి నీవు కృతార్థుఁడ వైతివి. 3౧

వీరుఁడగువాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు ప్రసన్నమయిన ముఖవర్ణముతో సంతుష్టుఁడై స్పష్టముగామాటలాడుచున్నాఁడు గావుననితఁడు చెప్పునది యబద్ధముకాదు అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. 3౨

ఇంత మహాపండితుఁడగు వాయుకుమారుఁడు హనుమంతుఁడు పరాక్రమవంతులగు నారామలక్ష్మణులను దీసికొని వానరరాజు సుగ్రీవునొద్దకుఁ బోయెను. 33

వానరోత్తముఁడగు హనుమంతుఁడు బ్రహ్మచారిరూపంబును విడిచి మఱల నిజమయిన వానరరూపంబునొంది వీరులగు నారామలక్ష్మణులను వీపుపై నెక్కించుకొని పోయెను. 3౪

మహాకీర్తిసంపన్నుఁడును మహాపరాక్రమశాలియు మహాబుద్ధిమంతుఁడునగు వాయుకుమారుఁడు హనుమంతుఁడు "ఇఁకఁ దప్పక సుగ్రీవు నభీష్టంబు నెఱవేఱుఁగలదు" అని సంతుష్టుఁడై రామలక్ష్మణులతోఁ గూడ ఋశ్యమూకపర్వతంబునకుఁ బోయెను. 3౫

ఇది నాలవసర్గము.

---

## ఐదవసర్గము.

హనుమంతుఁడు ఋశ్యమూకపర్వతంబుననుండి ఋశ్యమూక ప్రాంతంబుననుండు మలయపర్వతంబునకుఁబోయి వానరరాజు సుగ్రీవుంజూచి యతనికి రామలక్ష్మణులు వచ్చియుండుటం జెప్పెను. ౧

మహాపండితుఁడును దృఢపరాక్రముఁడు నగు రాముఁడును అతని

లక్ష్మణేన సహ భ్రాత్రా రామోఽయం సత్యవిక్రమః. ౨

ఇక్ష్వాకూణాం కులే జాతో రామో దశరథాత్మజః,
ధర్మే నిగదిత శ్చైవ పితు ర్నిర్దేశపారగః. ౩
త స్యాస్య వసతోఽరణ్యే నియతస్య మహాత్మనః,
రావణేన హృతా భార్యా స త్వాం శరణ మాగతః. ౪

రాజసూయాశ్వమేధైశ్చ వహ్ని ర్యేనాభితర్పితః,
దక్షిణాశ్చ తథోత్సృష్టా గావ శ్శతసహస్రశః. ౫
తపసా సత్యవాక్యేన వసుధా యేన పాలితా,
స్త్రీహేతో స్తస్య పుత్రోఽయం రామ స్త్వాం శరణం గతః. ౬

భవతా సఖ్యకామౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
ప్రతిగృహ్యార్చయ స్వైతౌ పూజనీయతమౌ వుభౌ. ౭

శ్రుత్వా హనుమతో వాక్యం సుగ్రీవో హృష్టమానసః,
భయం చ రాఘవా ద్ఘోరం ప్రజహౌ విగతజ్వరః. ౮
స కృత్వా మానుషం రూపం సుగ్రీవః ప్లవగాధిపః,
దర్శనీయతమో భూత్వా ప్రీత్యా ప్రోవాచ రాఘవమ్. ౯

భవా న్ధర్మవినీత శ్చ విక్రాన్త స్సర్వవత్సలః,
ఆఖ్యాతా వాయుపుత్రేణ తత్త్వతో మే భవద్గుణాః. ౧౦

త న్మమైవైష సత్కారో లాభ శ్చైవోత్తమః ప్రభో,
య త్త్వ మిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ. ౧౧

తమ్ముఁడు లక్ష్మణుఁడును వచ్చియున్నారు. ఈరాముఁడు సత్యమయిన పరాక్రమముగలవాఁడు. ౨

రాముఁడు ఇక్ష్వాకువంశంబునఁ బుట్టినవాఁడు. దశరథమహారాజపుత్త్రుఁడు పరమధార్మికుఁడని ప్రసిద్ధుఁడు. తండ్రియాజ్ఞను మీఱనివాఁడు. 3

మహాత్ముఁడగు నారాముఁడు నియమంబున నరణ్యంబుననుండఁగా నతనిభార్యను రావణుఁడు హరించెను. ఆరాముఁ డిప్పుడు నిన్ను శరణుపొందినాఁడు. ౪

ఎవ్వఁడు రాజసూయములచేతను అశ్వమేధములచేతను అగ్నిహోత్రుఁ దృప్తినొందించెనో మఱియు లక్షలు లక్షలుగా గోవులదక్షిణల నొసంగునో మఱియు నెవ్వఁడు జితేంద్రియుఁడై సత్యంబు దప్పక భూమిఁ బరిపాలించుచుండెనో అట్టిమహాత్ముఁడు దశరథమహారాజుకొడుకు రాముఁడు స్త్రీనిమిత్తమయి నిన్ను శరణుపొందినాఁడు. ౫

అన్నదమ్ములగు నారామలక్ష్మణులు నిర్వురును నీతో స్నేహమును గోరుచున్నారు. వీరలు మిక్కిలియుఁ బూజనీయులు వీరలను బ్రతిగ్రహించి పూజింపుము. అని హనుమంతుఁడును సుగ్రీవునితోఁ జెప్పెను. ౬

సుగ్రీవుఁడు హనుమంతునిమాటను విని సంతుష్టుఁడై దిగులువిడిచి రామునివలనం గలిగియుండిన మహాభయంబును వదలెను. ౭

వానరోత్తముఁడగు నాసుగ్రీవుఁడు మనుష్యరూపంబునొంది మిక్కిలియు సుందరవిగ్రహుఁడయి రామునిం జూచి సంతోషంబున నిట్లని పలికెను. ౯

తౌము సమస్తధర్మముఁ దెలిసినవారలు పరాక్రమవంతులు సమస్తప్రాణులయందు నధికమయిన దయగలవారలు తమగుణంబుల నన్నింటిని యథార్థముగా హనుమంతుఁడు నాకుఁ జెప్పినాఁడు. ౧౦

రాజవగు రాముఁడా! అందువలన నీవు వానరమాత్రుఁడవగు నాతో స్నేహంబుఁ గోరుచున్నా వనునది నాకే చాలగౌరవమును ఉత్తమమయిన లాభంబును అగుచున్నది. ౧౧

రోచతే యది వా సఖ్యం బాహు రేష ప్రసారితః,
గృహ్యతాం పాణినా పాణి ర్మర్యాదా బధ్యతాం ధ్రువా. ౧౨

ఏత త్తు వచనం శ్రుత్వా సుగ్రీవేణ సుభాషితమ్,
స ప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా. ౧౩
హృద్యం సౌహృద మాలమ్బ్య పర్యష్వజత పీడితమ్,

తతో హనూమాం స్సన్త్యజ్య భిక్షురూప మరిన్దమః. ౧౪
కాష్ఠయో స్స్వేన రూపేణ జనయామాస పావకమ్,

దీప్యమానం తతో వహ్నిం పుష్పై రభ్యర్చ్య సత్కృతమ్. ౧౫
తయో ర్మధ్యేఽథ సుప్రీతో నిదధే సుసమాహితః,
తతోఽగ్నిం దీప్యమానం తౌ చక్రతు శ్చ ప్రదక్షిణమ్. ౧౬
సుగ్రీవో రాఘవ శ్చైవ వయస్యత్వ ముపాగతౌ,

తత స్సుప్రీతమనసౌ తా వుభౌ హరిరాఘవౌ. ౧౭
అన్యోన్య మభివీక్షన్తౌ న తృప్తి ముపజగ్మతుః,
త్వం వయస్యోఽసి మే హృద్యో హ్యేకం దుఃఖంసుఖం చనౌ.
సుగ్రీవో రాఘవం వాక్య మి త్యువాచ ప్రహృష్టవత్,

తత స్సుపర్ణబహులాం ఛిత్త్వా శాఖాం సుపుష్పితామ్. ౧౯
సాలస్యాస్తీర్య సుగ్రీవో నిషసాద స రాఘవః,

లక్ష్మణా యాథ సంహృష్టో హనూమా న్ప్లవగర్షభః. ౨౦
శాఖాం చన్దనవృక్షస్య దదౌ పరమపుష్పితామ్,

నీకు స్నేహము ఇష్టమే యగునేని ఇదిగో చేయిచాఁచినాను. చేతం జేయి గ్రహింపుము. స్నేహమర్యాదయు దృఢముగాఁ గావింపుము అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౧౨

ఆరాముఁడు సుగ్రీవుఁడు సుఖంబుగాఁ జెప్పినమాటను విన్నంతనే పరమసంతుష్టుఁడై సుగ్రీవునిచేతిని దనచేతం బట్టుకొనెను. ౧౩

రాముఁడు మనోహరంబగు స్నేహము నవలంబించి సుగ్రీవుని దృఢంబుగాఁ గవుఁగిలించుకొనెను.

అంత శత్రువుల నడంగఁద్రొక్కంజాలిన హనుమంతుఁడు తాను రామలక్ష్మణులఁ దీసికొనిపోయినపిమ్మట మఱల నెప్పటియట్ల ధరించిన భిక్షురూపమును విడిచి నిజరూపమునొంది అరణుల మథించి నిప్పు పుట్టించెను. ౧౪

అంత నాహనుమంతుఁడు మండుచున్న యయ్యగ్నిం బూజించి దాని సంతుష్టుఁడై యెచ్చరికగలవాఁడై యారామసుగ్రీవులనడుమ నుంచెను. ౧౫

అంత ఆరామసుగ్రీవులు మండుచున్న యయ్యగ్నిహోత్రమునకుఁ బ్రదక్షిణముచేసి ఇట్లు అగ్నిసాక్షికంబుగా సుగ్రీవుఁడును రాముఁడును సఖ్యము గావించిరి. ౧౬

అంత నారామసుగ్రీవు లిద్దఱును పరమసంతుష్టులై యొండొరులం జూచుచు దృప్తిం బొందరైరి. ౧౭

సుగ్రీవుఁడు రాముం జూచి సంతుష్టుఁడై నీవునాకు స్నేహితుఁడవైతివి. ఇంక నీదుఃఖము నాదుఃఖమును ఒకటే. నీసుఖమును నాసుఖమును ఒకటే. అని చెప్పెను. ౧౮

ఆసుగ్రీవుఁడు అధికముగాఁ బత్రములుగలిగి చక్కఁగాఁ బూచియున్నమద్దిచెట్టుకొమ్మను విఱిచి దానిం బఱచుకొని రామునితోఁగూడఁ గూర్చుండెను. ౧౯

అంతఁ బరమసంతుష్టుఁడగు వానరోత్తముఁడు హనుమంతుఁడు లక్ష్మణునికిఁగాఁ బరమపుష్పితంబగు చందనవృక్షశాఖను విఱిచి పఱచెను. ౨౦

తతః ప్రహృష్ట స్సుగ్రీవః శ్లక్ష్ణం మధురయా గిరా. ౨౧
ప్రత్యువాచ తదా రామం హర్ష వ్యాకులలోచనః,
అహం వినికృతో రామ! చరా మీహ భయార్దితః. ౨౨
హృతభార్యో వనే త్రస్తో దుర్గ మేత దుపాశ్రితః,

సోఽహం త్రస్తో వనే భీతో వసా మ్యుద్భ్రాన్తచేతనః. ౨౩
వాలినా నికృతో భ్రాత్రా కృతవైర శ్చ రాఘవ!,

వాలినో మే మహాభాగ! భయార్త స్యాభయం కురు. ౨౪
కర్తు మర్హసి కాకుత్స్థ! భయం మే న భవే ద్యథా,

ఏవ ముక్త స్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః. ౨౫
ప్రత్యభాషత కాకుత్స్థ స్సుగ్రీవం ప్రహస న్నివ,

ఉపకారఫలం మిత్రం విదితం మే మహాకపే!. ౨౬
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్,
అమోఘా స్సూర్యసఙ్కాశా మ మైతే నిశితా శ్శరాః. ౨౭
తస్మి న్వాలిని దుర్వృత్తే నిపతిష్యన్తి వేగితాః,
కఙ్కపత్త్రప్రతిచ్ఛన్నా మహేన్ద్రాశనిసన్నిభాః. ౨౮
తీక్ష్ణాగ్రా ఋజుపర్వాణ స్సరోషా భుజగా ఇవ,
త మద్య వాలినం పశ్య క్రూరై రాశీవిషోపమైః. ౨౯
శరై ర్వినిహతం భూమౌ వికీర్ణ మివ పర్వతమ్,

స తు తద్వచనం శ్రుత్వా రాఘవస్యాఽఽత్మనో హితమ్. ౩౦
సుగ్రీవః పరమప్రీత స్సుమహా ద్వాక్య మబ్రవీత్.

అంత నప్పుడు పరమసంతుష్టుఁడైన సుగ్రీవుఁడు ఆనందబాష్పంబుల చే నిండినకన్నులతో రాముంజూచి స్నేహమధురంబగు వాక్యంబున నిట్లనియె.

రాముఁడా! నేను నాయన్నచే వంచితుఁడనై యపహరింపఁబడిన భార్యగలవాఁడనై యతనిభయంబున నే యీదుర్గమంబగు నరణ్యంబును నాశ్రయించినాను. ౨౨

అట్లు నాయన్న వాలి నన్ను వంచించి నాపై విరోధమునుం గొనియుండుటచేత నేను అతనివలన భయపడి దిగులుపడి దిగ్భ్రమంబునొంది యేమియుదోఁచక యివ్వనంబున నున్నాను. ౨౩

మహాత్ముఁడవగు రాముఁడా! వాలిభయంబునఁ బీడితుఁడవగు నాకు అభయం బొసంగుము. నాకు భయంబులేనట్లు గావింపుము అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౪

మహాప్రభావుఁడును ధర్మజ్ఞుఁడును ధర్మమునం దధికశ్రద్ధగలవాఁడు నగు రాముఁడు సుగ్రీవుని మాటను విని మొగంబునఁ జిఱునగవు దోఁప నిట్లని చెప్పెను. ౨౫

సుగ్రీవుఁడా! స్నేహితుఁడగుటకు ఉపకారముచేయుటయె ఫలమని నాకుఁ దెలియును కాఁబట్టి నీభార్య నపహరించినట్టి వాలిని నేను వధించెదను.

అమోఘంబులును సూర్యసమానంబులును దీక్ష్ణంబులును గంకపత్రసహితంబులును ఇంద్రునివజ్రాయుధముతో సరియయినవియు తీక్ష్ణములయిన కొనలుగలవియు బుజాపర్వంబులు నగు ఈనాబాణంబులు కుపితంబులగు సర్పంబులపగిది మహావేగంబునదుష్టుఁడగు నవ్వాలిపయిం బడఁగలవు. ౨౭-౨౮

ఇంక శీఘ్రంబుననే యావాలి క్రూరంబులును కృష్ణసర్పములవంటివియు నగు బాణంబులచే నిహతుఁడై పర్వతంబుపగిది నేలంగూలఁగలఁడు చూడుము. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౯

సుగ్రీవుఁడు తనకు హితమయిన రాముఁడు చెప్పిన యామాటను విని పరమసంతుష్టుఁడై పరమార్థంబగు నీమాటం జెప్పెను. ౩౦

తవ ప్రసాదేన నృసింహ! రాఘవ!
ప్రియాం చ రాజ్యం చ సమాప్నుయా మహమ్,
తథా కురు త్వం నరదేవ! వైరిణం
యథా నిహంస్యద్య రిపుం మ మాగ్రజమ్. ౩౧

సీతాకపీన్ద్రక్షణదాచరాణాం
రాజీవహేమజ్వలనోపమాని,
సుగ్రీవరామప్రణయప్రసఙ్గే
వామాని నేత్రాణి సమం స్ఫురన్తి. ౩౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చమ స్సర్గః. ౫.

---

షష్ఠ స్సర్గః.

పున రేవాబ్రవీ త్ప్రీతో రాఘవం రఘునన్దనమ్,

అయ మాఖ్యాతి మే రామ! సచివో మన్త్రిసత్తమః. ౧
హనూమా న్యన్నిమిత్తం త్వం నిర్జనం వన మాగతః,

లక్ష్మణేన సహ భ్రాత్రా వసత శ్చ వనే తవ. ౨
రక్షసాఽపహృతా భార్యా మైథిలీ జనకాత్మజా,
త్వయా వియుక్తా రుదతీ లక్ష్మణేన చ ధీమతా. ౩
అన్తరప్రేప్సునా తేన హత్వా గృధ్రం జటాయుషమ్,
భార్యావియోగజం దుఃఖ మచిరా త్త్వం విమోక్ష్యసే. ౪
అహం తా మానయిష్యామి నష్టాం వేదశ్రుతీ మివ,

రసాతలే వావర్తన్తీం వర్తన్తీం వా నభస్థలే. ౫

పురుషశ్రేష్ఠుఁడవు మనుష్యలోకపాలకుఁడవగు రామా! నీయనుగ్రహంబున నేను నాప్రియభార్యను రాజ్యంబునుఁ బొందఁగలెను కావున నీ విష్టుఁడవు నాయందు నైరంబు గొనియున్నవాఁడవు నాశత్రువగు నాయన్నను వాలిని వధించుటకుఁ బ్రయత్నింపుము. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౩౧

సుగ్రీవుఁడును రాముఁడును స్నేహము సేయుకాలమునందు కమలంబువంటి సీతాదేవి యెడమకన్నును కనకవర్ణంబగు సుగ్రీవుని యెడమకన్నును నిప్పువంటి రావణుని వామనేత్రంబులును ఏకకాలమునందే యదరినవి. (ఎడమకన్నదరుట స్త్రీకి శుభము. పురుషులకు అశుభము).

ఇది యైదవసర్గము.

---

## ఆఱవసర్గము.

అసుగ్రీవుఁడు సంతుష్టుఁడై రఘువంశమునం బుట్టిన రాముం జూచి మరల నిట్లని చెప్పెను.

రాముఁడా! నామంత్రియు ఎల్లమంత్రులలోను నుత్తముఁడునగు నీహనుమంతుఁడు నీవు నిర్జనంబగు నీవనంబునకు వచ్చినకార్యమును నాకుఁ జెప్పియున్నాఁడు. ౧

నీవును నీతమ్ముఁడు లక్ష్మణుఁడును వనంబుననుండఁగా రావణుఁడు అవకాశముగోరి కాచియుండి నీవును బుద్ధిమంతుఁడగు లక్ష్మణుఁడును లేనప్పుడు ఒంటిమెయి దిక్కులేక రోదనంబు సేయుచున్న నీభార్యను జనకమహారాజపుత్రియగు సీతాదేవిని హరించి జటాయువును వధించి కొనిపోయినాఁడు.

నీవింక భార్యావియోగమువలనఁగలిగినదుఃఖమును శీఘ్రముననే విడువఁగలవు. మధుకైటభులచే హరింపఁబడిన వేదమును మత్స్యావతారరూపుఁడగు విష్ణుఁడు దెచ్చినట్లు నే నాసీతాదేవిని నీకుఁ దెచ్చియిచ్చెదను. ౪

శత్రువుల నడంగఁద్రొక్కఁజాలిన రాముఁడా! నీభార్య పాతాలము

అహ మానీయ దాస్యామి తవ భార్యా మరిన్దమ!,
ఇదం తథ్యం మమ వచ స్త్వ మవేహి చ రాఘవ!. ౬

న శక్యా సా జరయితు మపి సేన్ద్రై స్సురాసురైః,
తవ భార్యా మహాబాహో! భక్ష్యం విషకృతం యథా. ౭

త్యజ శోకం మహాబాహో! తాం కాన్తా మానయామి తే,
అనుమానా త్తు జానామి మైథిలీ సా న సంశయః. ౮

హ్రియమాణా మయా దృష్టా రక్షసా క్రూరకర్మణా,
క్రోశన్తీ రామ రామేతి లక్ష్మణేతి చ విస్వరమ్. ౯
స్ఫురన్తీ రావణ స్యాఙ్కే పన్నగేన్ద్రవధూ ర్యథా,
ఆత్మనా పఞ్చమం మాం హి దృష్ట్వా శైలతటే స్థితమ్. ౧౦
ఉత్తరీయం తయా త్యక్తం శుభా న్యాభరణాని చ,
తా న్యస్మాభి ర్గృహీతాని నిహితాని చ రాఘవ!. ౧౧
ఆనయిష్యా మ్యహం తాని ప్రత్యభిజ్ఞాతు మర్హసి,

త మబ్రవీ త్తతో రామ స్సుగ్రీవం ప్రియవాదినమ్. ౧౨
ఆనయస్వ సఖే! శీఘ్రం కిమర్థం ప్రవిలమ్బసే,

ఏవ ముక్తస్తు సుగ్రీవ శ్శైలస్య గహనాం గుహామ్. ౧౩
ప్రవివేశ తత శ్శీఘ్రం రాఘవప్రియకామ్యయా,

ఉత్తరీయం గృహీత్వా తు శుభా న్యాభరణాని చ. ౧౪

నందున్నను ఆకాశంబునందున్నను ఆమెను నేను దెచ్చి నీ కిచ్చెదను. ౫

రామచంద్రా! నేనిప్పుడు చెప్పినమాట యథార్థము. ఇదెంతమాత్రము తప్పదని యెఱుంగుము. ౬

మహాబాహుఁడవగు రామచంద్రా! విషము గలిసిన యన్నంబువలె నీభార్యయగు సీతను హరించి ఇంద్రసహితులగు దేవాసురులైనను జీర్ణించుకొనఁజాలరు. ౭

ఆజానుబాహుఁడవగు రామచంద్రా! దుఃఖమును విడిచి సుఖంబుగా నుండుము నీప్రియురాలను నేను నీకుఁ దెచ్చియిచ్చెదను. ౮

ఊహచేఁ దెలిసికొంటిని. మున్ను నేను జూచిన యాబిసయె సీత సందేహము లేదు; ౯

భయంకరకర్ముఁడగు రావణునిచే నపహరింపఁబడుచు రామరామా! యని యాలక్ష్మణా యనియు విస్పష్టస్వరంబుగా రోదనంబు సేయుచు నాగేంద్రకాంతవలె రావణునంకంబున నల్లాడుచున్న సీతాదేవిని నేను జూచినాను. ౧౦

ఆసీత నలుగురు వానరవీరులతోఁ గూడఁ బర్వతతటంబున నున్న నన్నుఁ జూచి యుత్తరీయంబుదీసి యాభరణంబులనూటఁ గట్టి మాతట్టు పడవేసినది.

రామచంద్రా! మే మాభూషణంబుల నెత్తియుంచియున్నాము. నేను వానిం దెచ్చెదను. నీవు వానిం జూచి గుఱుతుపట్టఁగలవు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౧౧

అంత ప్రియవార్తం జెప్పుచున్న సుగ్రీవుం జూచి రాముఁ డిట్లనియె.

స్నేహితుఁడా! ఆయాభరణంబుల వేగిరముగాఁ దెచ్చి నాకుఁ జూపుము; ఆలస్యము చేసెదవేల? అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

అంత సుగ్రీవుఁడు రామునిమాటను విని రామునకు సంతోషంబు సేయవలెనను కోరికచే శీఘ్రంబున ఆపర్వతంబునందలి దుర్గమమయిన గుహలోనికిం బోయెను. ౧౩

సుగ్రీవుఁడు సీతాదేవియుత్తరీయంబును సుందరంబులగు నాభరణం

ఇదం ప శ్యేతి రామాయ దర్శయామాస వానరః,
తతో గృహీత్వా తద్వాస శ్శుభా న్యాభరణాని చ. ౧౫
అభవ ద్బాష్పసంరుద్ధో నీహారే ణేవ చన్ద్రమాః,

సీతాస్నేహప్రవృత్తేన సతు బాష్పేణ దూషితః. ౧౬
హా ప్రియేతి రుద న్ధైర్య ముత్సృజ్య న్యపత త్క్షితౌ,

హృది కృత్వా తు బహుశ స్త మలంకార ముత్తమమ్. ౧౭
నిశశ్వాస భృశం సర్పో బిలస్థ ఇవ రోషితః,

అవిచ్ఛిన్నాశ్రువేగ స్తు సౌమిత్రిం వీక్ష్య పార్శ్వతః. ౧౮
పరిదేవయితుం దీనం రామ స్సముపచక్రమే,

పశ్య లక్ష్మణ! వైదేహ్యా సంత్యక్తం హ్రియమాణయా. ౧౯
ఉత్తరీయ మిదం భూమౌ శరీరా ద్భూషణాని చ,
శాద్వలిన్యాం ధ్రువం భూమౌ సీతయా హ్రియమాణయా.
ఉత్సృష్టం భూషణ మిదం తథారూపం హి దృశ్యతే,

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్. ౨౧

నాహం జానామి కేయూరే నాహం జానామి కుణ్డలే,
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివన్దనాత్. ౨౨

తత స్స రాఘవో దీన స్సుగ్రీవ మిద మబ్రవీత్,
బ్రూహి సుగ్రీవ! కం దేశం హ్రియ న్తీ లక్షితా త్వయా. ౨౩

బులను దీసికొనివచ్చి "యిదిగో చూడు"మని రామునకుం జూపెను. ౧౪

అంత నారాముఁడు ఆయుత్తరీయంబును సుందరంబులయిన యాభరణంబులను దీసికొని మంచుచేతఁ జంద్రుఁడు కప్పఁబడునట్లు కన్నీళ్లచేఁ గప్పఁబడెను. ౧౫

ఆరాముఁడు ఆయుత్తరీయాభరణంబులఁ జూచినంతనే పైకుబ్బిన సీతాస్నేహంబునంబుట్టిన కన్నీళ్లచేఁ దముపఁబడినవాఁడై "హా ప్రియురాలా!" యనిరోదనంబు సేయుచు ధైర్యంబు విడిచి నేలంబడెను. ౧౬

రాముఁడు ఉత్తమంబులగు నయ్యాభరణంబులను బహువిధంబుల ఱొమ్మపై నుంచుకొని బిలంబుననుండు కుపితంబగు సర్పంబువలె మిక్కిలియు నిట్టూర్పులు వుచ్చెను. ౧౭

రాముఁడు కన్నులనుండి యెడతెగక కన్నీళ్లు సంతతధారగాఁ గాఱఁ బార్శ్వభాగంబున నున్న లక్ష్మణుం జూచి దీనంబుగా రోదనంబుసేయ నారంభించెను. ౧౮

లక్ష్మణా! సీత యపహరింపఁబడుచుండునప్పుడు తన దేహమునందుండిదీసి నేలంబాఱవైచిన యీయుత్తరీయంబును భూషణంబులనుం జూడుము. ౧౯

రాక్షసునిచే నపహరింపఁబడుచున్న సీతాదేవి యీయాభరణమును పచ్చికనేలయందు వేసియుండును. ఇది నిశ్చయము. అట్లు ఇది యెంతమాత్రము దెబ్బదగులకున్నది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦

లక్ష్మణుఁడు అట్లు రాముఁడు చెప్పినమాటను విని యిట్లని బదులు చెప్పెను. ౨౧

నేను బాహుపురులనుగాని కుండలంబులనుగాని యెంతమాత్రము నెఱుఁగను. నిత్యము పాదములకు నమస్కరించుచుండుటవలన అందెలను మాత్ర మెఱుఁగుదును. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౨

అంత నారాముఁడు దీనుఁడై సుగ్రీవుం జూచి యీమాటం జెప్పెను.

సుగ్రీవుఁడా! నాకు ప్రాణంబులకన్నఁ బ్రియురాలగు నాసీతను రావ

రక్షసా రౌద్రరూపేణ మమ ప్రాణైః ప్రియా ప్రియా,
క్వ వా వసతి తద్రక్షో మహ ద్వ్యసనదం మమ. ౨౪
యన్నిమిత్త మహం సర్వా న్నాశయిష్యామి రాక్షసాన్,
హరతా మైథిలీం యేన మాం చ రోషయతా భృశమ్. ౨౫
ఆత్మనో జీవితాన్తాయ మృత్యుద్వార మపావృతమ్.
మమ దయితతరా హృతా వనాన్తా
ద్రజనిచరేణ విమథ్య యేన సా,
కథయ మమ రిపుం త్వ మద్య వై
ప్లవగపతే! యమసాదనం నయామి. ౨౬

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షష్ఠ స్సర్గః. ౬.

## సప్తమ స్సర్గః.

ఏవ ముక్తస్తు సుగ్రీవో రామే ణార్తేన వానరః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం సబాష్పం బాష్పగద్గదః. ౧
న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః,
సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులేయస్య వా కులమ్. ౨
సత్యం తే ప్రతిజానామి త్యజ శోక మరిన్దమ!,
కరిష్యామి తథా యత్నం యథా ప్రాప్స్యసి మైథిలీమ్. ౩

రావణం సగణం హత్వా పరితోష్యాత్మపౌరుషమ్,
తథాఽస్మి కర్తా నచిరా ద్యథా ప్రీతో భవిష్యసి. ౪
అలం వైక్లబ్య మాలమ్బ్య ధైర్య మాత్మగతం స్మర,
త్వద్విధానా మసదృశ మీదృశం విద్ధి లాఘవమ్. ౫

ణుఁడు నీవు చూచునప్పుడు ఏప్రదేశమునకు అపహరించుకొనిపోయెను? చెప్పుము. ౧౩

ఎవ్వనినిమిత్తము నేను సమస్తరాక్షసులను నాశము నొందించెదనో మఱియు నెవ్వఁడు సీతను హరించి నాకుఁగోపంబుగలుగఁజేసి తనమరణంబు నకై మృత్యువువాకిలి తెఱచుకొన్నాఁడో అట్టి భయంకరుఁడు నాకు వ్యస నం బొసఁగినవాఁడునగు రావణుని నివాస మెచ్చట? ౧౪-౧౫

వానరనాథుఁడవగు సుగ్రీవుఁడా! ఏరాక్షసుఁడు వనమధ్యమునుండి నాకు మిక్కిలియుఁ బ్రియురాలైన సీతను బలాత్కారంబున హరించి నాఁడో ఆ నాశత్రువు రావణుఁ డెవ్వఁడో యెచ్చటనున్నాఁడో యిప్పుడే చెప్పుము; అతని నిప్పుడె వధించివచ్చెదను. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౬

ఇది యాఱవసర్గము

## ఏడవసర్గము.

సుగ్రీవుఁడు దీనుఁడగు రాముఁడు చెప్పినమాటను విని చేమోడ్పుగిలించి కంఠమున డగ్గుత్తికగలుగఁ గన్నీళ్ళు గార్చుచు నీమాటఁ జెప్పెను.

దుష్టకులంబునం బుట్టిన పాపిష్ఠుఁడగు నారాక్షసు నివాసస్థలము గాని సామర్థ్యముగాని పరాక్రమముగాని కులముగాని నాకెంతమాత్రము దెలియదు.

శత్రువుల సహింపఁ ద్రొక్కునట్టి రాముఁడా! నీవు దుఃఖమును విడువుము. ఇది సత్యము ప్రతిజ్ఞ చేయుచున్నాను. నీవుసీతను బొందునట్లు తగిన ప్రయత్నములు చేయుచున్నాను. ౩

నేను బరివారసహితంబుగా రావణుని వధించి నాపౌరుషంబు సఫలంబుగావించి నీకు సంతోషంబుగలుగునట్లు శీఘ్రంబునఁ గావించెదను. ౪

ఈదైన్యమును విడిచి నీకు సహజంబగు ధైర్యము నవలంబింపుము. నీయట్టిమహావీరులకు ఇట్టి లాఘవ మెంతమాత్రము సరిగాదు. ౫

మయాఽపి వ్యసనం ప్రాప్తం భార్యాహరణజం మహత్,
న చాహ మేవం శోచామి నచ ధైర్యం పరిత్యజే. ౬
నాహం తా మనుశోచామి ప్రాకృతో వానరోఽపిసన్,
మహాత్మా చ వినీతశ్చ కింపున ర్ధృతిమా న్భవాన్. ౭

బాష్ప మాపతితం ధైర్యా న్నిగ్రహీతుం త్వ మర్హసి,
మర్యాదాం సత్త్వయుక్తానాం ధృతిం నోత్స్రష్టు మర్హసి. ౮
వ్యసనే వాఽర్థకృచ్ఛ్రే వా భయేవా జీవితాన్తకే,
విమృశ న్వై స్వయా బుద్ధ్యా ధృతిమా న్నావసీదతి. ౯

బాలిశ స్తు నరో నిత్యం వైక్లబ్యం యోఽనువర్తతే,
స మజ్జ త్యవశ శ్శోకే భారాక్రాన్తేవ నౌ ర్జలే. ౧౦

ఏషోఽఞ్జలి ర్మయా బద్ధః ప్రణయా త్త్వాం ప్రసాదయే,
పౌరుషం శ్రయ శోకస్య నాన్తరం దాతు మర్హసి. ౧౧

యే శోక మనువర్తన్తే న తేషాం విద్యతే సుఖమ్,
తేజశ్చ క్షీయతే తేషాం న త్వం శోచితు మర్హసి. ౧౨

శోకే నాభిప్రపన్నస్య జీవితే చాపి సంశయః,
స శోకం త్యజ రాజేన్ద్ర! ధైర్య మాశ్రయ కేవలమ్. ౧౩

హితం వయస్యభావేన బ్రూమి నోపదిశామి తే,
వయస్యతాం పూజయ న్మేన త్వం శోచితు మర్హసి. ౧౪

నేను నీయట్లు భార్యావియోగంబగు మహావ్యసనంబును బొందియు న్నాను; అయితే ఇట్లు దుఃఖంబునుఁ బొందలేదు. ధైర్యంబును విడువలేదు.

నేను అల్పమగు వానరజాతియందుఁ బుట్టినవాఁడనే. ప్రియురాలిగు ఱించి దుఃఖింపకున్నాను; ఇంక మహాప్రభావుఁడవు సమస్తశాస్త్రవేత్తవు స్వభావధీరుఁడవు నగు నీవు దుఃఖింపక యుండవలె నని చెప్పనేల? ౭

నీవు కన్నులం గాఱుచుండు కన్నీళ్లను ధైర్యంబున నిలుపుము. బలవం తులకు గుఱుతైయున్న ధైర్యంబు నెంతమాత్రము వదలవలదు. ౮

దుఃఖము గాని ధననాశము గాని ప్రాణాంతకరంబగు భయము గాని కలి గినను ధైర్యవంతుఁడు తనబుద్ధిచేతనే దేశకాలకార్యాకార్యములను విమర్శిం చును గాని యెంతమాత్రము దుఃఖింపఁడు. ౯

ఎవ్వఁడు తెలివితేనివాఁడై యెల్లప్పుడును దీనుఁడై యే యుండునో ఆతఁడు జలమునందు భారాక్రాంతమగు నోడ మునుఁగునట్లు పరాధీనుఁడై దుఃఖంబుననే మునుఁగును. ౧౦

ఇదిగో చేమోడ్పుగీలించి ప్రార్థించెదను. నేను స్నేహంబున నిన్ను ఊఱడించుచున్నాను గాని వేఱు గాదు. పౌరుషంబు నవలంబింపుము. దుఃఖ మున కవకాశం బివ్వవలదు. ౧౧

ఎవ్వరు ఎల్లప్పుడు దుఃఖమునే యవలంబించియుందురో వారలకు సుఖమే గలుగదు. మఱియు వారిపరాక్రమంబును నశియించును. కావున నీవు దుఃఖింపవలదు. ౧౨

రాజశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఎల్లప్పుడు దుఃఖితుఁడై యుండువా నికిఁ బ్రాణసంశయము గూడఁ గలుగును. కావున నీవు దుఃఖమును వదలి ధైర్యము నాశ్రయింపుము. ౧౩

నేను స్నేహితుఁడ నగుటచేత నీకు హితంబుఁ జెప్పుచున్నాను గాని యుపదేశము సేయుటలేదు. నాస్నేహము గౌరవించుచున్నావు కావున ఆకార ణముచే నేని దుఃఖము విడువుము. అని సుగ్రీవుఁడు రామునకుఁ జెప్పెను.

మధురం సాన్త్విత స్తేన సుగ్రీవేణ స రాఘవః,
ముఖ మశ్రుపరిక్లిన్నం వస్త్రాన్తేన ప్రమార్జయత్. ౧౫
ప్రకృతిస్థ స్తు కాకుత్స్థ స్సుగ్రీవవచనా త్ప్రభుః,
సమ్పరిష్వజ్య సుగ్రీవ మిదం వచన మబ్రవీత్. ౧౬
కర్తవ్యం య ద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ,
అనురూపం చ యుక్తం చ కృతం సుగ్రీవ! త త్త్వయా. ౧౭

ఏష చ ప్రకృతిస్థోఽహ మనునీత స్త్వయా సఖే!,
దుర్లభో హీదృశో బన్ధు రస్మిన్ కాలే విశేషతః. ౧౮

కింతు యత్న స్త్వయా కార్యో మైథిల్యాః పరిమార్గణే,
రాక్షసస్య చ రౌద్రస్య రావణస్య దురాత్మనః. ౧౯

మయా చ య దనుష్ఠేయం విస్రబ్ధేన త దుచ్యతామ్,
వర్షా స్వివ చ సుక్షేత్రే సర్వం సమ్పద్యతే మయి. ౨౦

మయా చ య దిదం వాక్య మభిమానా త్సమీరితమ్,
త త్త్వయా హరిశార్దూల! త త్త్వ మి త్యుపధార్యతామ్. ౨౧
అనృతం నో క్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన,
ఏత త్తే ప్రతిజానామి సత్యే నైవ చ తే శపే. ౨౨

తతః ప్రహృష్ట స్సుగ్రీవో వానరై స్సచివై స్సహ,
రాఘవస్య వచ శ్శ్రుత్వా ప్రతిజ్ఞాతం విశేషతః ౨౩

ఆరాముఁ డట్లు సుగ్రీవుఁడుచెప్పిన మధురంబులగు నాశ్వాసనవచనంబులను విని కన్నీళ్లచేఁ దడిసినముఖంబుఁ దుడుచుకొనెను. ౧౫

ప్రభుఁడగు రాముఁడు సుగ్రీవునిమాటవలన స్వభావంబగు ధైర్యంబు నొంది సుగ్రీవునిఁ గవుఁగిలించుకొని యీమాటం జెప్పెను. ౧౬

సుగ్రీవుఁడా! మిత్రుఁడును స్నేహంబుగలవాఁడును మేలుగోరువాఁడు నగువాఁడు ఏమిచేయవలెనో ఆకార్యమును యుక్తముగాను దగినట్లుగాను గావించినావు. ౧౭

స్నేహితుఁడవగు సుగ్రీవుఁడా! ఇదిగో నేను నీ నాశ్వాసించుటంజేసి స్వభావంబు నొందినాను. ఇట్టి బంధువు విశేషించి యిట్టి యాపత్కాలంబున దొరకుట దుర్లభము. ౧౮

మఱియేమన్న నీవు సీత యెచ్చట నుండునదియు భయంకరుఁడును దురాత్ముఁడు నగు రాక్షసుఁడు రావణుఁడెచ్చట నుండునదియు మాత్రము వెదకుటయందు యత్నము చేయవలయును ౧౯

ఇంక నేను ఏమిచేయవలయునో దానినిం జెప్పుము. ఆకార్యమును నేను జేయఁజాలనో యేమో యనియెంతమాత్రము సంశయింపకుము వర్షాకాలమునందు సుక్షేత్రమునందు జేసిన బీజావాపము సఫలమగునట్లు సమస్తకార్యమును నాయందు సఫలమగును ౨౦

వానరోత్తముఁడవగు సుగ్రీవుఁడా! నేనును ఇప్పు డభిమానంబున వాలినివధించెదనని యీమాటం జెప్పినాను గదా! ఇదియథార్థమని తలంపుము.

నేను ఇదివఱకు అబద్ధము చెప్పినవాఁడనుగాను. ఇంకను జెప్పఁబోవునదియు లేదు. నీకొఱకు వాలిని వధించెదనని ప్రతిజ్ఞచేయుచున్నాను. నీకుఁగా సత్యముచేత నే శపథము చేయుచున్నాను అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౨

అంత సుగ్రీవుఁడును అతనిమంత్రులగు వానరులును సంతోషించి రాముని యొక్క నమాటను విశేషించి యతని ప్రతిజ్ఞను విని సంతోషించినవా...

ఏవ మేకాన్తసమ్పృక్తౌ తత స్తౌ నరవానరౌ,
ఉభా వన్యోన్యసదృశం సుఖం దుఃఖం ప్రభాషతామ్. ౨౪
మహానుభావస్య వచో నిశమ్య
హరి ర్నరాణా మృషభస్య తస్య,
కృశం స మేనే హరివీరముఖ్య
స్తదా స్వకార్యం హృదయేన విద్వాన్. ౨౫

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తమ స్సర్గః. ౭.

---

## అష్టమ స్సర్గః.

పరితుష్ట స్తు సుగ్రీవ స్తేన వాక్యేన వానరః,
లక్ష్మణ స్యాగ్రజం రామ మిదం వచన మబ్రవీత్. ౧
సర్వథాఽహ మనుగ్రాహ్యో దేవతానా మసంశయః,
ఉపపన్నగుణోపేత స్సఖా యస్య భవాన్మమ. ౨

శక్యం ఖలు భవే ద్రామ! సహాయేన త్వయాఽనఘ!,
సురరాజ్య మపి ప్రాప్తుం స్వరాజ్యం కింపునః ప్రభో!. ౩

సోఽహం సభాజ్యో బన్ధూనాం సుహృదాం చైవ రాఘవ!,
య స్యాగ్నిసాక్షికం మిత్రం లబ్ధం రాఘవవంశజమ్. ౪

అహ మ ప్యనురూప స్తే వయస్యో జ్ఞాస్యసే శనైః,
నతు వక్తుం సమర్థోఽహం స్వయ మాత్మగతా న్గుణాన్. ౫

మహాత్మనాం తు భూయిష్ఠం త్వద్విధానాం కృతాత్మనామ్,
నిశ్చలా భవతి ప్రీతి ర్ధైర్య మాత్మవతా మివ. ౬

అంత నారామసుగ్రీవు లిద్దఱును ఇట్లు రహస్యంబు నం జేరి తమతమ సుఖదుఃఖములను ఒకరితో నొకరు చెప్పుకొనిరి. ౨౪

వానరశ్రేష్ఠుడును బండితుండునగు నాసుగ్రీవుండు మహాప్రభావుండు పురుషశ్రేష్ఠుండునగు నారాముని మాటనువిని తనకార్యము సిద్ధమాయె నట్లు మనంబునం దలంచెను. ౨౫

ఇది యేడవసర్గము.

## ఎనిమిదవసర్గము.

సుగ్రీవుండు రాముండు చెప్పినయామాటకుం బరమసంతుష్టుండై లక్ష్మణునిముందట రాముం జూచి యిట్లని చెప్పెను. ౧

నాకు శౌర్యవీర్యధైర్యౌదార్యాదిసమస్తసద్గుణసంపన్నుండవగు నీవు మిత్రుండవైతివి కావున నాపై దేవతల కన్నివిధంబుల ననుగ్రహంబు గలిగియున్నది. సందియము లేదు. ౨

పాపరహితుండవు ప్రభుండవగు రాముండా! నీవు సహాయుండవై యుండంగా దేవరాజ్యము నేని పొందవచ్చును. ఇంక నా వానరరాజ్యమును బొందుట చెప్పవలయునా? ౩

నాకు రఘువంశంబునం బుట్టిన నీవు అగ్నిసాక్షికముగా మిత్రుండవైతివి కావున నేను బంధువులకును స్నేహితులకును బూజనీయుండ నైతిని. ౪

నేనును నీకుం దగినమిత్రుండనని నీవు క్రమక్రమముగాం దెలిసికొనంగలవు. నాగుణంబుల నేనే చెప్పుకొనుటకు మాత్రము నేను సమర్థుండం గాను. ౫

మహాత్ములును ఆత్మజ్ఞానసంపన్నులునగు నీయట్టివారలకుం గలిగినప్రేమ ధీరులకు ధైర్యమువలె మిక్కిలియు స్థిరముగా నుండును. ౬

రజతం వా సువర్ణం వా వస్త్రాణ్యాభరణాని చ,
అవిభక్తాని సాధూనా మవగచ్ఛన్తి సాధవః ౭
ఆఢ్యో వాపి దరిద్రో వా దుఃఖిత స్సుఖితోఽపి వా,
నిర్దోషో వా సదోషో వా వయస్యః పరమా గతిః. ౮
ధనత్యాగ స్సుఖత్యాగో దేహత్యాగోఽపి వా పునః,
వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథావిధమ్. ౯

తత్తథేత్యబ్రవీ ద్రామ స్సుగ్రీవం ప్రియవాదినమ్,
లక్ష్మణ స్యాగ్రతో లక్ష్మ్యా వాసవ స్యేవ ధీమతః. ౧౦

తతో రామం స్థితం దృష్ట్వా లక్ష్మణం చ మహాబలమ్,
సుగ్రీవ స్సర్వత శ్చక్షు ర్వనే లోల మపాతయత్. ౧౧

స దదర్శ తత స్సాల మవిదూరే హరీశ్వరః,
సుపుష్ప మీషత్పత్రాఢ్యం భ్రమరై రుపశోభితమ్. ౧౨

తస్యైకాం పర్ణబహులాం భఙ్క్త్వా శాఖాం సుపుష్పితామ్,
సాల స్యాస్తీర్య సుగ్రీవో నిషసాద స రాఘవః. ౧౩

తా వాసీనౌ తతో దృష్ట్వా హనూమా నపి లక్ష్మణమ్,
సాలశాఖాం సముత్పాట్య వినీత ముపవేశయత్. ౧౪
సుఖోపవిష్టం రామం తు ప్రసన్న ముదధిం యథా,
ఫలపుష్పసమాకీర్ణే తస్మి న్గిరివరోత్తమే. ౧౫
తతః ప్రహృష్ట స్సుగ్రీవః శ్లక్ష్ణం మధురయా గిరా,
ఉవాచ ప్రణయా ద్రామం హర్ష వ్యాకులితాక్షరమ్. ౧౬

మిత్రులు ఒండొరుల ప్రజలను సువర్ణము వస్త్రంబులు భూషణంబులు మొదలగువానిని వేఱుపాటు లేనివిగా భావింతురు. ౭

ధనవంతుఁడుగాని దరిద్రుఁడుగాని దుఃఖిగాని సుఖిగాని దోషిగాని నిర్దోషిగాని మిత్రుఁడే పరమగతి. ౮

ఉత్తమమయిన స్నేహమును జూచి యట్టిస్నేహితుని నిమిత్తమే ధనమునుగాని సుఖమునుగాని మఱియు దేహమునుగాని విడుతురు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను ౯

రాముఁడు బుద్ధిమంతుఁడును గాంతిచేనింద్రునకు సరియగువాఁడునగు లక్ష్మణునియెదుట ప్రియభాషియగు సుగ్రీవుంజూచి నీవు చెప్పినది వాస్తవమని చెప్పెను. ౧౦

అంత సుగ్రీవుఁడు రాముఁడును మహాబలుఁడగు లక్ష్మణుఁడును నిలిచియుండుటను జూచి మంచిశాఖకై యడవి నాలుగుప్రక్కలను జక్కఁగాఁ జూచెను. ౧౧

అంత వానరరాజుఁడగు నాసుగ్రీవుఁడు సమీపంబునఁ జక్కఁగాఁ బుష్పించియున్నదియుఁ జిగుళ్లెమ్మ గాఁగలదియు భ్రమరశోభితంబునగు వృక్షంబును జూచెను. ౧౨

సుగ్రీవుఁడు ఆవృక్షంబునందు అధికముగాఁ బత్రములుగలిగి చక్కఁగాఁ బూచియున్న యొకకొమ్మను విఱిచి దానిఁబఱచి రామసహితంబుగాఁ గూర్చుండెను. ౧౩

అంత నారామసుగ్రీవులు కూర్చుండుటంజూచి హనుమంతుఁడు మఱియొకచెట్టుకొమ్మను విఱిచి వినయవంతుఁడగు లక్ష్మణుఁ గూర్చుండఁ బెట్టెను.

అంత ఫలపుష్పంబులచే నిండియుండునప్పర్వతోత్తమంబుపై సుఖోపవిష్టుఁడై సముద్రముభంగిఁ బ్రసన్నగంభీరుఁడై సర్వాంగసౌందర్యంబు చెలంగుచున్న రాముం జూచి సుగ్రీవుఁడు స్నేహంబుచే మృదుమధురవాక్యంబున సంతోషాతిశయంబువలన మాటలు తొట్రుపడ నిట్లని చెప్పెను. ౧౪,౧౫

అహం వినికృతో భ్రాత్రా చరా మ్యేష భయార్దితః,
ఋశ్యమూకం గిరివరం హృతభార్య స్సుదుఃఖితః. ౧౭
సోఽహం త్రస్తో భయే మగ్నో వసా మ్యుద్భ్రాన్తచేతనః,
వాలినా నికృతో భ్రాత్రా కృతవైర శ్చ రాఘవ!. ౧౮

వాలినో మే భయార్తస్య సర్వలోకాభయంకర!,
మమాపి త్వ మనాథస్య ప్రసాదం కర్తుమర్హసి. ౧౯

ఏవ ముక్తస్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః,
ప్రత్యువాచ స కాకుత్స్థ స్సుగ్రీవం ప్రహస న్నివ. ౨౦
ఉపకారఫలం మిత్ర మపకారోఽరిలక్షణమ్,
అద్యైవ తం హనిష్యామి తవ భార్యాపహారిణమ్. ౨౧

ఇమే హి మే మహావేగాః పత్రిణ స్తిగ్మతేజసః,
కార్తికేయవనోద్భూతా శ్శరా హేమవిభూషితాః. ౨౨
కఙ్కపత్త్రప్రతిచ్ఛన్నా మహేన్ద్రాశనిసన్నిభాః,
సుపర్వాణ స్సుతీక్ష్ణాగ్రా స్సరోషా భుజగా ఇవ. ౨౩

భ్రాతృసంజ్ఞ మమిత్రం తే వాలినం కృతకిల్బిషమ్,
శరై ర్వినిహతం పశ్య వికీర్ణ మివ పర్వతమ్. ౨౪
రాఘవస్య వచ శ్శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః,
ప్రహర్ష మతులం లేభే సాధుసా ధ్వితి చాబ్రవీత్. ౨౫

రామ! శోకాభిభూతోఽహం శోకార్తానాం భవా న్గతిః,
వయస్య ఇతి కృత్వా హి త్వ య్యహం పరిదేవయే. ౨౬

నేను అన్నచే వంచితుఁడనై అపహృతభార్యుఁడనై పరమదుఃఖితుఁడనై భయంబున ఈఋశ్యమూకపర్వతంబున నున్నాను. ౧౬

రాముఁడా! నేను వాలి నన్ను వంచించి నాపై వైరంబుగొని యుండుటవలన భయపడి భయంబున మునిఁగి మనంబున దిగ్భ్రమంబునొంది యేమియుఁ దెలియక వాసము సేయుచున్నాను. ౧౭

సమస్తలోకంబులను భయంబు బోఁగొట్టి రక్షించునట్టి రాముఁడా! నీవు వాలికి భయపడి యనాథుఁడనైయున్న నాయందును అనుగ్రహముంచుము. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౧౮

మహాప్రభావుఁడును ధర్మజ్ఞుఁడును పరమధార్మికుఁడునగు రాముఁడు సుగ్రీవునిమాటను విని సుగ్రీవుం జూచి చిఱునగవు నవ్వుచు నిట్లనియె ౨౦

స్నేహితునికి ఉపకారము అవశ్యము సేయవలెను. శత్రునకు అపకారము చేయవలెను. కావున నీభార్యను హరించినవాలిని ఇప్పుడే వధించిపుచ్చెదను. ౨౧

నాబాణములు మహావేగములును భయంకరములయిన కాంతిగలవియు శరవణమునం బుట్టినవియుఁ గాంచనాలంకృతంబులును గంకపక్షిఱెక్కలు గట్టినవియు దేవేంద్రుని వజ్రాయుధముంబోలినవియు నునుపులయిన గణుపులు గలవియు మిక్కిలియుఁ గఱకులయిన కొనలు గలవియుఁ గుపితంబులగు సర్పములువలె నుండునవియుఁగదా! ౨౨,౨౩

నీకు అన్నయనుపేరుతో శత్రువయినవాఁడును బాప మాచరించినవాఁడునగు వాలియింక నాబాణంబులచే నిహతుఁడై విఱిగినపర్వతంబుపగిది నేలంగూలఁ గలఁడు చూడుము. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు రామునిమాటను విని అసదృశమయిన సంతోషమునుబొంది సాధువాదంబులం బ్రశంసించెను. ౨౪

రాముఁడా! నేను పరమదుఃఖితుఁడనైయున్నాను. దుఃఖితులకు నీవే గతివి. నేను నీవు స్నేహితుఁడవని నీతో నాదుఃఖంబులు చెప్పుకొనుచున్నాను. ౨౫

త్వం హి పాణిప్రదానేన వయస్యో మేఽగ్నిసాక్షికమ్,
కృతః ప్రాణై ర్బహుమత స్సత్యే నాపి శపామి తే. ౨౭

వయస్య ఇతి కృత్వా చ విస్రబ్ధం ప్రవదా మ్యహమ్,
దుఃఖ మన్తర్గతం య న్మే మనో హరతి నిత్యశః. ౨౮

ఏతావ దుక్త్వా వచనం బాష్పదూషితలోచనః,
బాష్పోపహతయా వాచా నోచ్చై శ్శక్నోతి భాషితుమ్. ౨౯

బాష్పవేగం తు సహసా నదీవేగ మివాగతమ్,
ధారయామాస ధైర్యేణ సుగ్రీవో రామసన్నిధౌ. ౩౦
సన్నిగృహ్య తు తం బాష్పం ప్రమృజ్య నయనే శుభే,
వినిశ్శ్వస్య చ తేజస్వీ రాఘవం వాక్య మబ్రవీత్. ౩౧

పురాఽహం వాలినా రామ! రాజ్యా త్స్వా దవరోపితః,
పరుషాణి చ సంశ్రావ్య నిర్ధూతోఽస్మి బలీయసా. ౩౨
హృతా భార్యా చ మే తేన ప్రాణేభ్యోఽపి గరీయసీ,
సుహృదశ్చ మదీయా యే సంయతా బన్ధనేషు తే. ౩౩
యత్నవాంశ్చ సుదుష్టాత్మా మద్వినాశాయ రాఘవ!,
బహుశ స్తత్ప్రయుక్తాశ్చ వానరా నిహతా మయా. ౩౪

శఙ్కయా త్వేతయా చేహ దృష్ట్వా త్వామపి రాఘవ!,
నోపసర్పా మ్యహం భీతో భయే సర్వే హి బిభ్యతి. ౩౫

అగ్నిసాక్షికముగా మనము స్నేహముచేయుటచేత నీవు నాకుఁ బ్రాణములకన్న నధికుఁడవైతివి; దీనికిఁ గావలసినచో సత్యముచేత శపథము గూడఁ జేయుచున్నాను. ౨౭

మఱియు నీవు స్నేహితుఁడ వనియు సౌహార్దయంబునంజేసి యెల్లప్పుడును బాధించుచున్న దుఃఖమును నీతో మనసారఁ జెప్పుకొనుచున్నాను. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౮

ఆసుగ్రీవుఁడు ఇంతదూరము చెప్పి కన్నీళ్ళతోఁ గప్పఁబడిన దృష్టి గలవాఁడై దుఃఖాతిశయంబున నోరుతడఁబడ నాపైని వినవచ్చునట్లు గట్టిగా మాటలాడఁజాలఁడయ్యె. ౨౯

సుగ్రీవుఁడు నదీప్రవాహమువలె వచ్చినకన్నీళ్ళను రామసన్నిధానంబున ధైర్యముచే శీఘ్రమున అణఁచుకొనెను. ౩౦

మహాపరాక్రమశాలియగు సుగ్రీవుఁడు కన్నీళ్ల నణఁచికొని మంగళకరంబులగు కన్నులను దుడుచుకొని నిట్టూర్పులువుచ్చుచు రాముంజూచి యిట్లని చెప్పెను. ౩౧

మున్ను బలిష్ఠుఁడగు వాలి నన్ను నాయొక్కరాజ్యంబుననుండి తొలఁగించి పరుషవాక్యంబులాడి రాజ్యంబుననుండి తఱుముఁగొట్టినాఁడు. ౩౨

మఱియు నా వాలి ప్రాణంబులకన్న నధికురాలయిన నాభార్యను హరించెను. నా స్నేహితులనుగూడ గారాగృహంబుల వేసెను. ౩౩

రాముఁడా! అతఁడు దుష్టాభిప్రాయంబుతో నన్ను వధించుటకును ప్రయత్నములు చేయుచున్నాఁడు. అతనిచేఁబంపఁబడిన వానరులను బెక్కండ్రను నేను వధించినాను. ౩౪

రాముఁడా! నే నీసందేహముచేత నే నిన్నుఁ జూచినప్పుడును భయంబున నీ సమీపంబునకు రాలేదు. భయకారణంబుండునప్పుడు ఎవ్వరు భయపడరు? ౩౫

కేవలం హి సహాయా మే హనుమత్ప్రముఖా స్త్విమే,
అతోఽహం ధారయా మ్యద్య ప్రాణాన్ కృచ్ఛ్రగతోఽపి సన్.

ఏతే హి కపయ స్స్నిగ్ధా మాం రక్షన్తి సమన్తతః,
సహ గచ్ఛన్తి గన్తవ్యే నిత్యం తిష్ఠన్తి చ స్థితే. ౩౭

సంక్షేప స్త్వేష మే రామ! కి ముక్త్వావి స్తరం హి తే,

స మే జ్యేష్ఠో రిపు ర్భ్రాతా వాలీ విశ్రుతపౌరుషః. ౩౮
తద్వినాశా ద్ధి మే దుఃఖం ప్రణష్టం స్యా దనన్తరమ్,
సుఖం మే జీవితం చైవ తద్వినాశనిబన్ధనమ్. ౩౯
ఏష మే రామ! శోకాన్త శ్శోకార్తేన నివేదితః,
దుఃఖిత స్సుఖితో వాపి సఖ్యు ర్నిత్యం సఖా గతిః. ౪౦

శ్రుత్వై తద్వచనం రామ స్సుగ్రీవ మిద మబ్రవీత్,
కింనిమిత్త మభూ ద్వైరం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః. ౪౧
సుఖం హి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర!,
అనన్తరం విధాస్యామి సంప్రధార్య బలాబలమ్. ౪౨
బలవాన్ హి మామమర్షు శ్శ్రుత్వా త్వా మవమానితమ్,
వర్తతే హృదయోత్కమ్పీ ప్రావృడ్వేగ ఇ వామ్భసః. ౪౩
హృష్టః కథయ విస్రబ్ధో యావ దారోప్యతే ధనుః,
సృష్టశ్చ హి మయా బాణో నిరస్త శ్చ రిపు స్తవ. ౪౪

ఏవ ముక్త స్తు సుగ్రీవః కాకుత్స్థేన మహాత్మనా,

నా కిప్పుడు ఈహనుమంతుఁడు మొదలగువారలు మాత్రము మిక్కిలి సహాయులు. వీరల సాహాయ్యమువలననే నే నింతకష్టమునొందియు ఒడలఁ బ్రాణంబులు ధరించియున్నాను. ౩౮

ఈవానరులు నాపై నధికస్నేహముంచి న న్నేమఱక రక్షించుచున్నారు. నే నెచ్చటికిఁ బోయినను కూడవత్తురు. నే నున్నచోట న న్నెప్పుడును గాచియుందురు. ౩౯

రాముఁడా! నీతో నధికముగా మాటలుచెప్పి యేమిప్రయోజనము? సంక్షేపముగాఁ జెప్పెదను. వినుము.

నా జ్యేష్ఠభ్రాతయుఁ బ్రసిద్ధమయిన మహాపరాక్రమముగలవాఁడునగు నావాలి నాశత్రువు. అతఁడు వధింపఁబడినప్పుడుగాని నే నాదుఃఖము నశించును.

నాసుఖమును జీవితమునుగూడ వాలి నాశమువలననే కలుగవలసినది.

రాముఁడా! ఇది నాదుఃఖ సమాచారము. దుఃఖము సహింపఁజాలక నీకుఁ జెప్పుకొన్నాను. ఏలయనఁగా దుఃఖితుఁడైనను సుఖితుఁడైనను మిత్త్రుఁడే మిత్త్రునకుగతి. అని సుగ్రీవుఁడు రామునకుఁ జెప్పెను. ౪౦

నీకును వాలికిని ఏకారణమువలన వైరంబులుగలిగినది? యథార్థసంగతిని వినఁగోరుచున్నాను. ౪౧

సుగ్రీవుఁడా! వైరమునకుఁ గారణమునంతయు విని బలాబలంబులను విచారించి యటుపిమ్మట నీకు సుఖంబు గావించెదను. ౪౨

వాలి నిన్నవమానించుటను విన్నంతనే నాను హృదయమును జలింపఁ జేయుచు వర్షాకాలజలప్రవాహమువంటి మహాకోపము గలిగియున్నది. ౪౩

నేను ధనుస్సు నారోపింపకమున్నే సంతోషంబున విస్రబ్ధుఁడవై చెప్పుము. నేను బాణము విడుచుటయే యడ్డి. తత్క్షణంబున నీశత్త్రువు హతుఁడయ్యెననియే తలంపుము. ౪౪

సుగ్రీవుఁడు మహాత్ముఁడగు రామునిమాటను విని మంత్త్రులగు వలుగురు

ప్రహర్ష మతులం లేభే చతుర్భి స్సహ వానరైః. ౨౫
తతః ప్రహృష్టవదన స్సుగ్రీవో లక్ష్మణాగ్రజే,
వైరస్య కారణం తత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౨౬
ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టమ స్సర్గః. ౮.

---

## నవమ స్సర్గః.

వాలీ నామ మమ భ్రాతా జ్యేష్ఠ శ్శత్రునిషూదనః,
పితు ర్బహుమతో నిత్యం మ మాపి చ తథా పురా. ౧
పిత ర్యుపరతేఽస్మాకం జ్యేష్ఠోఽయ మితి మన్త్రిభిః,
కపీనా మీశ్వరో రాజ్యే కృతః పరమసమ్మతః. ౨
రాజ్యం ప్రశాసత స్తస్య పితృపైతామహం మహత్,
అహం సర్వేషు కాలేషు ప్రణతః ప్రేష్యవత్ స్థితః. ౩

మాయావీ నామ తేజస్వీ పూర్వజో దున్దుభే స్సుతః,
తేన తస్య మహ ద్వైరం స్త్రీకృతం విశ్రుతం పురా. ౪

సతు సుప్తజనే రాత్రౌ కిష్కిన్ధాద్వార మాగతః,
నర్దతిస్మ సుసంరబ్ధో వాలినం చాహ్వయ ద్రణే. ౫

ప్రసుప్త స్తు మమ భ్రాతా నర్దితం భైరవస్వనమ్,
శ్రుత్వా నమమృషే వాలీ నిష్పపాత జవా త్తదా. ౬
స తు వై నిస్సృతః క్రోధా త్తం హన్తు మసురోత్తమమ్,
వార్యమాణ స్తత స్స్త్రీభి ర్మయా చ ప్రణతాత్మనా. ౭

వానరులుం దానును బరమసంతోషంబునొందిరి. ౪౫

అంత సుగ్రీవుఁడు పరమసంతుష్టుఁడై లక్ష్మణాగ్రజుఁడగు రామునకుఁ గా వైరకారణమంతయు యథార్థముగాఁ జెప్ప నారంభించెను. ౪౬

ఇది యెనిమిదవసర్గము.

---

## తొమ్మిదవ సర్గము.

మున్ను శత్రుహంతయగు నాయన్నయయిన వాలిని మాతండ్రిగారును నేనును జాల గౌరవించుచుంటిమి. ౧

నాతండ్రి మృతుఁడైనపిమ్మట మంత్రులు జ్యేష్ఠపుత్రుఁడని వాలిని వానరరాజ్యంబునఁ బట్టాభిషిక్తుంగావించి గౌరవించిరి. ౨

తండ్రితాతలనాటనుండి వచ్చినగొప్పవానరరాజ్యంబుఁ బరిపాలించుచున్నవాలికి నేను సమస్తకాలంబులయందు సేవకునియట్లు నమ్రుఁడనై యుంటిని. ౩

దుందుభిజ్యేష్ఠకుమారుఁడు మాయావియను మహాపరాక్రమశాలియగు రాక్షసుఁ డొకఁడుండెను. అతనికిని వాలికిని స్త్రీనిమిత్తమయి మహావైరంబు గల్గినది. ఇది జగద్విదితమయినసంగతి. ౪

ఆమాయావి ఒకనాఁడు అందఱు నిదురవోయియుండునప్పుడు అర్ధరాత్రంబునఁ గిష్కింధాద్వారంబునకువచ్చి మిక్కిలియు విజృంభించి గర్జించుచు యుద్ధమునకు వాలినిం బిలిచెను. ౫

అప్పుడు నిదురవోవుచున్న నాయన్న వాలియు భయంకరమయిన యాగర్జితధ్వనివిని పరగర్వంబు సహింపక వేగంబునఁ బోయెను. ౬

అంత స్త్రీలును నేనును వినయపూర్వకంబుగా నెంతవారించినను నిలువక వాలి కోపంబున నసురోత్తముఁడగునమ్మాయావిని వధించుటకుఁ బోయెను. ౭

సతు నిర్ధూయ సర్వాన్నో నిర్జగామ మహాబలః,
తతోఽహ మపి సౌహార్దా న్నిస్సృతో వాలినా సహ. ౮

స తు మే భ్రాతరం దృష్ట్వా మాం చ దూరా దవస్థితమ్,
అసురో జాతసంత్రాసః ప్రదుద్రావ తతో భృశమ్. ౯
తస్మి న్ద్రవతి సంత్రస్తే హ్యావాం ద్రుతతరం గతౌ,
ప్రకాశ శ్చ కృతో మార్గ శ్చన్ద్రే ణోద్గచ్ఛతా తదా. ౧౦

స తృణై రావృతం దుర్గం ధరణ్యా వివరం మహత్,
ప్రవివే శాసురో వేగా దావా మాసాద్య విష్ఠితౌ. ౧౧
తం ప్రవిష్టం రిపుం దృష్ట్వా బిలం రోషవశం గతః,
మా ముృవాచ తదా వాలీ వచనం క్షుభితేన్ద్రియః. ౧౨
ఇహ త్వం తిష్ఠ సుగ్రీవ! బిలద్వారి సమాహితః,
యావ దత్ర ప్రవిశ్యాహం నిహన్మి సహసా రిపుమ్. ౧౩

మయా త్వేత ద్వచ శ్శ్రుత్వా యాచిత స్స పరన్తపః,
శాపయిత్వా తు మాం పద్భ్యాం ప్రవివేశ బిలం మహత్. ౧౪

తస్య ప్రవిష్టస్య బిలం సాగ్ర స్సంవత్సరో గతః,
స్థితస్య చ మమ ద్వారి స కాలో వ్యత్యవర్తత. ౧౫

అహం తు నష్టం జ్ఞాత్వా తం స్నేహా దాగతసమ్భ్రమః,
భ్రాతరం న చ పశ్యామి పాపాశఙ్కి చ మే మనః. ౧౬
అథ దీర్ఘస్య కాలస్య బిలా త్తస్మా ద్వినిస్సృతమ్,

మహాబలశాలియగు నావాలి మమ్మందఱను నిరాకరించి యుద్ధంబునకుఁబోయెను. అంత నేనును స్నేహంబున వాలి నొంటిమెయిఁ బంపఁజాలక వాలివెంటంబోతిని. ౮

అంత అయ్యసుర, నాయన్నయును దూరంబున నేనును వచ్చుటంజూచి భయపడి పరమవేగంబునం బరుగెత్తెను. ౯

ఆమాయావి భయపడి పరుగెత్తుటంజూచి మేమును అతనికన్న వేగముగా వెంబడించితిమి. అప్పుడు చంద్రుఁడుదయించుటయు మార్గంబు వెలుతురుగా నుండినది. ౧౦

అమ్మాయావి మేము సమీపించుటనుజూచి వేగంబున తృణంబులచేఁ గప్పఁబడినదియు దుర్గమంబునగు నొక్కమహాబిలంబుఁ బ్రవేశించెను. ౧౧

వాలి శత్రుఁ డమ్మహాబిలంబుఁ జొచ్చుటనుజూచి పరమకుపితుఁడై క్షుభితేంద్రియుఁడై నన్నుఁజూచి యిట్లని చెప్పెను. ౧౨

సుగ్రీవుఁడా! నే నీబిలంబుఁజొచ్చి శీఘ్రంబున శత్రువును వధించి వచ్చునంతకు నీవు ఎచ్చరికతో నీబిలమువాకిట నే యుండుము. అని వాలి నాతోఁ జెప్పెను. ౧౩

నే నీమాటనువిని శత్రుతాపనుఁడగు వాలిని నేనుగూడ వచ్చెదనని ఎంతప్రార్థించినను వినక నాచేత తనపాదంబులమీఁద శపథము సేయించి యమ్మహాబిలంబుఁ జొచ్చెను. ౧౪

అట్లు వాలి యమ్మహాబిలంబు బ్రవేశించినపిమ్మట సమగ్రముగా నొక సంవత్సరమయినది. ఆసంవత్సరమంతయు నేను బిలద్వారంబునం గనిపెట్టి యుంటిని. ౧౫

నేను ఆసంవత్సరమంతయు వాలి రాకుండుటవలన స్నేహంబుచే మిక్కిలియు భయపడినాను. అన్న కనుపడలేదు. కావున నామనస్సున మరణంబు నొందెనో యేమో యని సంశయంబును గలిగినది. ౧౬

అంత దీర్ఘకాలమునకు ఆబిలముననుండి నురుఁగుతోఁగూడ ఎఱ్ఱని

సఫేనం రుధిరం ర క్త మహం దృష్ట్వా సుదుఃఖితః. ౧౭
నర్దతా మసురాణాం చ ధ్వని ర్మే శ్రోత్ర మాగతః,
నిర స్తస్య చ సఙ్గ్రామే క్రోశతో నిస్స్వనో గురోః. ౧౮
అహం త్వవగతో బుద్ధ్యా చిహ్నై స్తై ర్భ్రాతరం హతమ్,
పిధాయ చ బిలద్వారం శిలయా గిరిమాత్రయా. ౧౯
శోకార్త శ్చోదకం కృత్వా కిష్కిన్ధా మాగత స్సఖే!,
గూహమానస్య మే త త్త్వం యత్నతో మన్త్రిభి శ్శ్రుతమ్ ౨౦
తతోఽహం తై స్సమాగమ్య సమ్మతై రభిషేచితః,

రాజ్యం ప్రశాసత స్తస్య న్యాయతో మమ రాఘవ!. ౨౧
ఆజగామ రిపుం హత్వా వాలీ త మసురో త్తమమ్,
అభిషి క్తం తు మాం దృష్ట్వా వాలీ సంర క్తలోచనః. ౨౨
మదీయా న్మన్త్రిణో బద్ధ్వా పరుషం వాక్య మబ్రవీత్,

నిగ్రహేఽపి సమర్థస్య తం పాపం ప్రతి రాఘవ!. ౨౩
న ప్రావ ర్తత మే బుద్ధి ర్భ్రాతృ గౌరవయన్త్రితా,

హత్వా శత్రుం స మే భ్రాతా ప్రవివేశ పురం తదా. ౨౪
మానయం స్తం మహాత్మానం యథావ చ్చాభ్యవాదయమ్,

ఉక్తా శ్చ నాశిష స్తేన సన్తుష్టే నా న్తరాత్మనా. ౨౫

న త్వా పాదా వహం తస్య ముకుటే నాస్పృశం ప్రభో!,

నెత్తురు వెలువడినది. నేను దానింజూచి పరమదుఃఖితుఁడ నయితిని. ౧౮

అంత గర్జించుచున్న యసురులధ్వనియును యుద్ధంబునఁ బరాజయం బునొంది యేడ్చుచున్న నాయన్నయొక్క ధ్వనియు నాకు వినవచ్చినది.

స్నేహితుఁడా! నేను గుహుతులచే నాయన్న వాలి హతుఁడయ్యెనని యూహించి దుఃఖితుఁడనై భయంబునఁ బర్వతంబంతటిశిలచే నమ్మహాబిలం బుమూసి జలతర్పణంబు గావించి కిష్కింధకు వచ్చినాను. ౧౯

నేను యథార్థమును దాఁచవలెననియుండినను బహుప్రయత్నంబున మంత్రులు నావలన వాలిమరణమును దెలిసికొనిరి. అంత మంత్రులందఱు చేరి యాలోచించి నన్నుఁ బట్టాభిషిక్తుం గావించిరి. ౨౦

రాముఁడా! నే నట్లు న్యాయంబున రాజ్యంబుఁ బాలించుచుండఁగా వాలియు శత్రువయిన యాసురోత్తముని నమ్మాయావిని వధించి వచ్చెను. ౨౧

వాలి పట్టాభిషిక్తుఁడనై రాజ్యంబుఁ బాలించుచున్న నన్నుఁ జూచి సంతసే పరమకుపితుఁడై కన్నుల నెఱ్ఱఁదనముగదుర నామంత్రులను బంధించి పరుషవచనంబు లాడెను. ౨౨

రాముఁడా! అప్పుడు పాపిష్ఠుఁడగు నావాలిని నిగ్రహించుటకు నేను సమర్థుఁడనై యుండినను అన్న యనుగౌరవముసంజేసి నాబుద్ధికి నిగ్రహిం చుట తోఁచలేదు. ౨౩

అప్పుడు మహాత్ముఁడగు నాయన్న వాలి శత్రువును వధించి పట్టణం బుఁబ్రవేశింపఁగానే నేను యథాశాస్త్రంబుగా నతని గౌరవించి నమస్కా రము గావించితిని. ౨౪

ఆవాలి సంతుష్టంబయిన మనస్సుతో నా కాశీర్వాదముగూడఁ జేయ లేదు. ౨౫

ప్రభుఁడవగు రాముఁడా! అంత నేను మరల నాకిరీటం బతనిపాదఁ

అపి వాలీ మమ క్రోధా న్నప్రసాదం చకార సః. ౨౬

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే నవమ స్సర్గః. ౯.

---

దశమస్సర్గః.

తతః క్రోధసమావిష్టం సంరబ్ధం త ముపాగతమ్,
అహం ప్రసాదయాంచక్రే భ్రాతరం ప్రియకామ్యయా, ౧
దిష్ట్యాఽసి కుశలీ ప్రాప్తో నిహత శ్చ త్వయా రిపుః,
అనాథస్య హి మే నాథ స్త్వ మేకోఽనాథనన్దనః. ౨

ఇదం బహుశలాకం తే పూర్ణచన్ద్ర మివోదితమ్,
ఛత్త్రం సవాలవ్యజనం ప్రతీచ్ఛస్వ మ యోద్యతమ్. 3

ఆర్త శ్చాథ బిలద్వారి స్థిత స్సంవత్సరం నృప!,
దృష్ట్వాఽహం శోణితం ద్వారి బిలాచ్చాపి సముత్థితమ్. ౪

శోకసంవిగ్నహృదయో భృశం వ్యాకులితేన్ద్రియః,
అపిధాయ బిలద్వారం శైలశృఙ్గేణ త త్తథా. ౫
తస్మా ద్దేశా దపాక్రమ్య కిష్కిన్ధాం ప్రావిశం పునః,
విషాదా త్త్విహ మాం దృష్ట్వా పౌరై ర్మన్త్రిభి రేవ చ. ౬
అభిషిక్తో న కామేన తన్మే త్వం క్షన్తు మర్హసి,

త్వమేవ రాజా మానార్హ స్సదా చాహం యథాపురమ్, ౭
రాజభావే నియోగోఽయం మయా త్వద్విరహా త్కృతః,

బులుసోఁక సాష్టాంగంబుగ సమస్కారముచేసితిని. అప్పటికిని నాయందు కోపమువలన అతని కనుగ్రహముకలుగలేదు. ౨౭

ఇది తొమ్మిదవసర్గము.

---

## పదవసర్గము.

అంత నేను వాలి పరమకుపితుఁడై తొందరపడుచుండుటంజూచి యతని సంతోషపెట్టవలెనను కోరికచే అతని నీ ప్రకారంబున వేడుకొంటిని.

నాభాగ్యవశంబున నీవు క్షేమంబున వచ్చినావు. శత్రువునుంగూడ వధించినావు. అనాథుఁడనగు నాకు అనాథుల నందఱను సంతోషపెట్టునట్టి నీ వొక్కఁడవేగదా నాథుఁడవు. ౨

పెక్కుకమ్ములుగలదియు నిండుచంద్రునియట్లు వెలుంగుచున్నదియు నగు నీశ్వేతచ్ఛత్రమును నీకుఁ బట్టెదను; ఈవింజామరలను వీచెదను, అంగీకరింపుము. 3

రాజా! నేను బిలద్వారంబున సంవత్సరము కాచియుండి నీవు రాకుండుటయేగాక యాబిలద్వారమునసుండి నెత్తురుగూడ వెడలుటంజూచి దుఃఖితుఁడనైతిని. ౪

నేను దుఃఖితుఁడై ఇంద్రియముల స్వాధీనతదప్పి యాప్రకారమున నాబిలద్వారమును బర్వతశిఖరంబుచేఁ గప్పి యచ్చటనుండివచ్చి కిష్కింధాపురంబుఁ జొచ్చితిని. ౫

పౌరులును మంత్రులును నన్నుఁజూచి రాజ్యనాశభయంబున నాకుఁ బట్టాభిషేకంబు గావించిరిగాని నేను గోరిగాదు. ఒకవేళ నాది తప్పైనను నీవు క్షమింపవలెను. ౬

నీవే రాజవు; పూజనీయుఁడవును. నేను ఎప్పటియట్లు నిన్నుసేవింపుచు యువరాజుఁడనై యుండెదను. అయితే ఇదివఱకు నీవు లేకపోవుటవలన నేను రాజుగానుండి రాజ్యంబుఁ బాలింపుచుంటినిగాని వేఱుగాదు. ౭

సామాత్యపౌరనగరం స్థితం నిహతకణ్టకమ్. ౮
న్యాసభూత మిదం రాజ్యం తవ నిర్యాతయా మ్యహమ్,

మాచ రోషం కృథా స్సౌమ్య! మయి శత్రునిబర్హణ!. ౯
యాచే త్వాం శిరసా రాజ! న్మయా బద్ధోఽయ మఞ్జలిః,

బలా దస్మి సమాగమ్య మన్త్రిభిః పురవాసిభిః ౧౦
రాజభావే నియుక్తోఽహం శూన్యదేశజిగీషయా,
స్నిగ్ధమేవం బ్రువాణం మాం సతు నిర్భర్త్స్య వానరః. ౧౧
ధి క్త్వా మితి చ మా ముక్త్వా బహు తత్త దువాచ హ,
ప్రకృతీ శ్చ సమానీయ మన్త్రిణ శ్చైవ సమ్మతాన్. ౧౨
మా మాహ సుహృదాం మధ్యే వాక్యం పరమగర్హితమ్,
విదితం వో యథా రాత్రౌ మాయావీ స మహాసురః. ౧౩
మాం సమాహ్వయత క్రూరో యుద్ధకాఙ్క్షీ సుదుర్మతిః,
తస్య తద్వచనం శ్రుత్వా నిస్సృతోఽహం నృపాలయాత్.
అనుయాత శ్చ మాం తూర్ణ మయం భ్రాతా సుదారుణః,

స తుదృష్ట్వైవ మాం రాత్రౌ సద్వితీయం మహాబలః. ౧౪
ప్రాద్రవ ద్భయసన్త్రస్తో వీక్ష్యాఽవాం త మనుద్రుతౌ,
అనుద్రుత శ్చ వేగేన ప్రవివేశ మహాబిలమ్. ౧౬

తం ప్రవిష్టం విదిత్వా తు సుఘోరం సుమహ ద్బిలమ్,
అయ ముక్తోఽథ మే భ్రాతా మయా తు క్రూరదర్శనః. ౧౭

ఈరాజ్యంబు నాయొద్ద ఇల్లడగా నుంచఁబడినట్లు భావించి నేను మంత్రులతోను పౌరులతోను నగరంబులతోనుంగూడిన యీరాజ్యంబు నింతవఱకు శత్రుబాధ యేమిలేకుండఁగా పాడినాను. మరల నీసొమ్ము నీ కప్పగించెదను. ౮

సౌమ్యుఁడవును శత్రువుల వధించువాఁడవును సమస్తవానరరాజుఁడవు నగు వాలీ! నాపైఁ గోపంబు సేయవలదు. నిన్ను శిరసా నమస్కరించి యాచించెదను. ఇదిగో అంజలిబంధము గావించితిని. ౯

మంత్రులును పౌరులునువచ్చి దేశము రాజశూన్యముగా నుండఁగూడదను నభిప్రాయంబున బలాత్కారముచే నన్ను రాజుగాఁ జేసిరిగాని నేనై కోరిగాని నా యంగీకారముమీఁదఁగాని కాదు. ౧౦

ఆవాలి అంతదూరము స్నేహముతోఁ జెప్పుచున్న నన్నదలించి నన్ను ధిక్కరించి అధికముగా అశ్రావ్యపరుషవాక్యంబుల నిందించెను. ౧౧

ఆవాలి పౌరులను దనకిష్టులగు మంత్రులను రప్పించి స్నేహితులనడుమ నన్నుగుఱించి నిందితమయినమాటం జెప్పెను. ౧౨

ఒకనాఁడు రాత్రి క్రూరుఁడును దుర్బుద్ధియునగు మాయావి యను నసుర యుద్ధమునకై నన్నుఁ బిలిచినసంగతి మీకుఁ దెలియునుగదా! ౧౩

నేను అమ్మాయావిమాటను విన్నంతనె నేను ఇంటనుండి వెడలితిని. అంత భయంకరుఁడగు ఈనాతమ్ముఁడును నావెంట వచ్చినాఁడు. ౧౪

మహాబలుఁడగు నమ్మాయావి యారాత్రి తనపైకి మేమిద్దఱము యుద్ధంబునకు వచ్చుటనుజూచి భయపడి పరుగెత్తుటయు మేము వానివెంటం బరుగెత్తితిమి. ౧౫

అట్లు మేము వెంబడించి పరుగెత్తుటయు మాయావి వేగంబున నొక్కమహాబిలంబుఁ జొచ్చెను. ౧౬

అమ్మాయావి భయంకరమయిన మహాబిలంబుఁ జొచ్చుటం జూచి నేను క్రూరంబయిన తలంపుగల నాతమ్ముఁడగు నీసుగ్రీవుం జూచి యిట్లని చెప్పితిని.

అహత్వా నా స్తి మే శ క్తిః ప్రతిగన్తు మితః పురీమ్,
బిలద్వారి ప్రతీక్ష త్వం యావ దేనం నిహన్మ్యహమ్. ౧౭

స్థితో ఽయమితి మత్వా తు ప్రవిష్టోఽహం దురాసదమ్,
తంచ మే మార్గమాణస్య గత స్సంవత్సర స్తదా. ౧౮

స తు దృష్టో మయా శత్రు రని ర్వేదా ద్భయావహః,
నిహత శ్చ మయా తత్ర సోఽసురో బన్ధుభి స్సహ. ౨౦
త స్యాస్యాత్తు ప్రవృత్తేన రుధిరౌఘేన తద్బిలమ్,
పూర్ణ మాసీ ద్దురాక్రామం స్తనత స్తస్య భూతలే. ౨౧

సూదయిత్వా తు తం శత్రుం విక్రా న్తం దున్దుభే స్సుతమ్,
నిష్క్రామ న్నేవ పశ్యామి బిలస్య పిహితం ముఖమ్. ౨౨

విక్రోశమానస్య తు మే సుగ్రీ వేతి పునఃపునః,
యదా ప్రతివచో నా స్తి తతోఽహం భృశదుఃఖితః. ౨౩
పాదప్రహారై స్తు మయా బహుభి స్త ద్విదారితమ్,
తతోఽహం తేన నిష్క్రమ్య యథాపుర ముపాగతః. ౨౪
త త్రానే నాస్మి సంరుద్ధో రాజ్యం ప్రార్థయతాఽత్మనః,
సుగ్రీ వేణ నృశంసేన విస్మృత్య భ్రాతృసౌహృదమ్. ౨౫

ఏవ ముక్త్వా తు మాంతత్ర వస్త్రే ణై కేన వానరః,
నిర్వాసయామాస తదా వాలీ విగతసాధ్వసః. ౨౬
తే నాహ మపవిద్ధ శ్చ హృతదార శ్చ రాఘవ!,
తద్భయాచ్చ మహీ కృత్స్నా క్రా న్తేయం సవనార్ణవా. ౨౭

నేను ఈయసురను వధింపక కిష్కింధాపురికిఁ బోఁజాలను కావున నే
నతని వధించివచ్చువఱకు నీ వీబిలద్వారంబునఁ గాచియుండుము అని నేను
ఈసుగ్రీవునికిఁ జెప్పితిని. ౧౮

నేను ఈసుగ్రీవుఁడు వాకిటఁ గాఁవలియున్నాఁడని తలంచియే దురా
సదంబగు నమ్మహాబిలంబుఁ జొచ్చినాను. అంత నే నమ్మాయావిని వెదకుచుం
డఁగా నొకసంవత్సరంబు గడచినది. ౧౯

అంత భయంకరుఁ డగు నమ్మాయావిని నేను నిర్భయంబుగాఁ జూచి
నాను అచ్చటనె యతని నతనిబంధువులతోఁగూడ వధించినాను. ౨౦

నేను గొట్టినదెబ్బను సహింపఁజాలక యమ్మాయావి యఱచునప్పుడు
అతనినోటనుండి వెడలిన నెత్తురుచే నమ్మహాబిలంబు నిండినదై అచ్చటనుండ
నశక్యమయినది. ౨౧

నేను బరాక్రమవంతుఁడును దుందుభిపుత్త్రుఁడునగు నమ్మాయావిని
వధించివచ్చి నబ్బిలంబువెడల యత్నించినాఁగా నాబిలద్వారంబు మూయఁబ
డియుండుటంజేసి యెంతమాత్రము గనుపడలేదు. ౨౨

నేను "సుగ్రీవా" యని యెన్నిమాఱు లఱచినను బదులు పలుకు లే
కుండుటవలన నేను మిక్కిలియు దుఃఖితుఁడనైతిని. ౨౩

నేను అంత పెక్కుమార్లు కాలితోఁదన్ని యాబిలమువాకిట మూసిన
శిలను బగులగొట్టితిని. అంత నామార్గంబున నెప్పటియట్లు వచ్చి చేరినాను.

క్రూరుఁడగు నీసుగ్రీవుఁడు తనకు రాజ్యంబు కావలెననికోరి భ్రాతృ
స్నేహంబును గూడ మఱచి ఆబిలంబుననుండి నన్ను వెలికి రాకుండునట్లు
నిరోధించెను. అని వాలి చెప్పెను. ౨౪

వాలి యీప్రకారము సుహృన్మధ్యంబునం జెప్పి నిర్భయంబుగా
నన్ను ఒకవస్త్రంబుతోఁ గిష్కింధనుండి తఱుమఁగొట్టినాఁడు. ౨౫

రాముఁడా! ఆవాలి నన్నుఁ గొట్టియు నాభార్యనుగూడ నపహరించి
నాఁడు. నే నతనిభయమువలనె వనములతోను సముద్రములతోనుంగూడిన
భూమియంతయుఁ దిరిగినాను. ౨౬

ఋశ్యమూకం గిరివరం భార్యాహరణదుఃఖితః,
ప్రవిష్టోఽస్మి దురాధర్షం వాలినః కారణాన్తరే. ౨౮

ఏత త్తే సర్వ మాఖ్యాతం వైరానుకథనం మహత్,
అనాగసా మయా ప్రాప్తం వ్యసనం పశ్య రాఘవ!. ౨౯

వాలిన స్తు భయా ర్తస్య సర్వలోకాభయంకర!,
కర్తు మర్హసి మే వీర! ప్రసాదం తస్య నిగ్రహాత్. ౩౦

ఏవ ముక్త స్స తేజస్వీ ధర్మజ్ఞో ధర్మసంహితమ్,
వచనం వక్తు మారేభే సుగ్రీవం ప్రహస న్నివ. ౩౧

అమోఘా స్సూర్యసఙ్కాశా మమైతే నిశితా శ్శరాః,
తస్మి న్వాలిని దుర్వృత్తే నిపతిష్య న్తి వేగితాః. ౩౨
యావ త్తం నాభిపశ్యామి తవ భార్యాపహారిణమ్,
తావ త్స జీవే త్పాపాత్మా వాలీ చారిత్రదూషకః. ౩౩

ఆత్మానుమానా త్పశ్యామి మగ్నం త్వాం శోకసాగరే,
త్వా మహం తారయిష్యామి కామం ప్రాప్స్యసి పుష్కలమ్.

తస్య తద్వచనం శ్రుత్వా రాఘవ స్యాత్మనో హితమ్,
సుగ్రీవః పరమప్రీత స్సుమహా ద్వాక్య మబ్రవీత్. ౩౫

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే దశమ స్సర్గః. ౧౦.

నేను అట్లు భార్యయును నపహరింపఁబడుటచేఁ బరమదుఃఖితుఁడనై మఱియొక కారణమునం జేసి వాలికిఁ బ్రవేశింప నలవిగానట్టి యీ ఋశ్యమూకపర్వతంబున నున్నాను. ౨౮

రాముఁడా! గొప్పదగు నీవైరవృత్తాంతమంతయును నీకుఁ జెప్పినాను. నే నేయపరాధము నెఱుఁగకపోయినను నాకు దుఃఖము సంభవించినది. చూడుము. ౨౯

సమస్తలోకంబులకును అభయంబొసంగునట్టి వీరుఁడవగు రాముఁడా! వాలివలని భయముచేఁ బీడితుఁడనగునాకు నావాలిని నిగ్రహించి యభయంబొసంగుము. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. 3౦

మహాప్రభావుఁడును ధర్మంబు దెలిసినవాఁడునగు రాముఁడు సుగ్రీవుఁడుచెప్పినమాటను విని చిఱునగవు మొగంబునఁ దోఁప సుగ్రీవునింజూచి ధర్మయుక్తంబగు నీమాటం జెప్పెను. 3౧

అమోఘంబులును సూర్యసమానంబులును తీక్ష్ణములునగు నాయీబాణంబులు మహావేగంబున దురాచారుండగు నావాలిపైఁ బడఁగలవు. 3౨

ఎంతవఱకు నీభార్య నపహరించిన యావాలి నాయెదుటఁ బడకుండునో అంతవఱకు పాపాత్ముఁడును బెద్దలపేరు చెఱచువాఁడునగు నావాలి బ్రతికియుండును. 33

నాకుఁ గలిగియుండుదుఃఖమును జూచుకొనఁగా నీవు దుఃఖసముద్రంబున మునిఁగియున్నావని తెలిసినది. ఆదుఃఖసముద్రంబుననుండి నిన్ను నేను దాఁటించెదను. పుష్కలంబుగా నీయభీష్టము సిద్ధింపఁగలదు. 3౪

సుగ్రీవుఁడు తనకు హితమయిన యారామునిమాటను విని పరమసంతుష్టుఁడై రాముని మిక్కిలియుఁ బూజించెను. 3౫

ఇది పదవ సర్గము.

---

## ఏ కా ద శ స్స ర్గః.

రామస్య వచనం శ్రుత్వా హర్షపౌరుషవర్ధనమ్,
సుగ్రీవః పూజయాంచక్రే రాఘవం ప్రశశంసచ. ౧

అసంశయం ప్రజ్వలితై స్తీక్ష్ణై ర్మర్మాతిగై శ్శరైః,
త్వం దహేః కుపితో లోకా న్యుగా న్త ఇవ భాస్కరః. ౨

వాలినః పౌరుషం యత్త ద్యచ్చ వీర్యం ధృతి శ్చ యా!,
త న్మమైకమనా శ్శ్రుత్వా విధత్స్వ యదన న్తరమ్. ౩
సముద్రా త్పశ్చిమా త్పూర్వం దక్షిణా దపి చో త్తరమ్,
క్రామ త్యనుదితే సూర్యే వాలీ వ్యపగతక్లమః. ౪

అగ్రా ణ్యారుహ్య శైలానాం శిఖరాణి మహా న్త్యపి,
ఊర్ధ్వ ముత్క్షిప్య తరసా ప్రతిగృహ్ణాతి వీర్యవాన్. ౫

బహవ స్సారవ న్త శ్చ వనేషు వివిధా ద్రుమాః,
వాలినా తరసా భగ్నా బలం ప్రథయతాఽత్మనః. ౬
మహిషో దున్దుభి ర్నామ కైలాసశిఖరప్రభః,
బలం నాగసహస్రస్య ధారయామాస వీర్యవాన్. ౭
వీర్యోత్సేకేన దుష్టాత్మా వరదానాచ్చ మోహితః,
జగామ సుమహాకాయ స్సముద్రం సరితాం పతిమ్. ౮

ఊర్మిమ న్త మభిక్రమ్య సాగరం రత్నసఞ్చయమ్,
మహ్యం యుద్ధం ప్రయచ్ఛేతి త మువాచ మహార్ణవమ్. ౯

## పదునొకండవ సర్గము.

సుగ్రీవుఁడు సంతోషంబును పౌరుషంబును వృద్ధి బొందించునట్టి రామునిమాటను విని రాముని అంజలిబంధాదులచేఁ బూజించి యిట్లని ప్రశంసించెను. ౧

నీవు కోపంబు నొందుదువేని ప్రళయకాలసూర్యుఁడువోలె ప్రజ్వరిల్లుచున్నవియును దీక్ష్ణంబులును మర్మస్థానంబులు దూరిపోవునవియునగు బాణంబులచే లోకంబులనన్నియును దహింతువు సందేహములేదు. ౨

వాలియొక్క బలంబును బరాక్రమంబును ధైర్యంబును నెందులకునని నావలన సావధానంబుగా విని యాపిమ్మటఁ జేయవలసినదానిం జేయుము. ౩

వాలి బ్రాహ్మముహూర్తంబున లేచి సూర్యుఁ డుదయించునంతలోపల పశ్చిమసముద్రమునుండి తూర్పుసముద్రంబును, దక్షిణసముద్రమునుండి యుత్తరసముద్రమును బొంది యిట్లు చతుస్సముద్రంబులయందును సంధ్యావందనంబు గావించును. ౪

మహాపరాక్రమశాలియగువాలి పర్వతాగ్రంబుల నెక్కి యచ్చట గొప్పగొప్పపర్వతశిఖరంబులను చెండ్లువలె వేగంబునఁ బైకెగురవేసి పట్టుకొనును ౫

తనబలముఁ జూపుటకై వాలి వనంబులందు సారవంతంబులయిన నానావిధవృక్షంబుల ననేకంబులను బాహుబలముచే విఱిచియున్నాఁడు. ౬

మహాపరాక్రమశాలియుఁ గైలాసశిఖరం బంతటివాఁడునగు దుందుభియను మహిషాకారరాక్షసుఁడు వేయియేనుఁగులబలము గలిగియుండెను. ౭

మహాకాయుఁడును దుష్టాత్ముఁడునగు నాదుందుభి పరాక్రమగర్వంబువను వరదానబలమువలనను దేహము దెలియనివాఁడై నదీనాథుఁడగు సముద్రునియొద్దకుఁ బోయెను. ౮

ఆదుందుభి అధికముగాఁ దరంగంబులుగలదియు రత్నరాసులతో నొప్పుచున్నదియునగు సముద్రంబుఁ బ్రవేశించి యమ్మహాసముద్రుం జూచి "నాకు యుద్ధం బొసంగు" మని యడిగెను. ౯

తత స్సముద్రో ధర్మాత్మా సముత్థాయ మహాబలః,
అబ్రవీ ద్వచనం రాజ! న్నసురం కాలచోదితమ్. ౧౦

సమర్థో నాస్మి తే దాతుం యుద్ధం యుద్ధవిశారద!,
శ్రూయతాం చాభిధాస్యామి యస్తే యుద్ధం ప్రదాస్యతి. ౧౧
శైలరాజో మహారణ్యే తపస్విశరణం పరమ్,
శఙ్కరశ్వశురో నామ్నా హిమవా నితి విశ్రుతః. ౧౨

గుహాప్రస్రవణోపేతో బహుకన్దరనిర్ఝరః,
స సమర్థ స్తవ ప్రీతి మతులాం కర్తు మాహవే. ౧౩
తం భీత ఇతి విజ్ఞాయ సముద్ర మసురోత్తమః,
హిమవద్వన మాగచ్ఛ చ్ఛర శ్చాపా దివ చ్యుతః. ౧౪

తత స్తస్య గిరే శ్శ్వేతా గజేన్ద్రవిపులా శ్శిలాః,
చిక్షేప బహుధా భూమౌ దున్దుభి ర్వినవాద చ. ౧౫
తత శ్శ్వేతామ్బుదాకారః సౌమ్యః ప్రీతికరాకృతిః,
హిమవా నబ్రవీ ద్వాక్యం స్వ ఏవ శిఖరే స్థితః. ౧౬

క్లేష్టు మర్హసి మాం న త్వం దున్దుభే! ధర్మవత్సల!,
రణకర్మ స్వకుశల స్తపస్విశరణం హ్యహమ్. ౧౭

తస్య తద్వచనం శ్రుత్వా గిరిరాజస్య ధీమతః,
ఉవాచ దున్దుభి ర్వాక్యం రోషా త్సంరక్తలోచనః. ౧౮
యది యుద్ధే సమర్థ స్త్వం మద్భయా ద్వా నిరుద్యమః,

రాజవగు రాముఁడా! అంత ధర్మాత్ముఁడును మహాబలుఁడునగు సము
ద్రుఁడు మానుషరూపంబునఁ దాల్చి మృత్యుప్రేరితుఁడగు నాదుందుభిం జూచి
యీమాటం జెప్పెను. ౧౦

యుద్ధపండితుఁడా! నీతో యుద్ధంబు సేయుటకు నేను సమర్థుఁడఁ
గాను. నీతో యుద్ధము సేయఁగలవానిం జెప్పెదను. వినుము, ౧౧

మునులకు ముఖ్యనివాసస్థానంబును శంకరుని మామయును పెద్దగుహల
తోను సెలయేళ్లతోను బగిలిన పాషాణముల రంధ్రములతోను గూడినవాఁడు
నగు హిమవంతుఁ డను పర్వతరాజు మహారణ్యంబున నున్నాఁడు. ౧౨

ఆహిమవంతుఁడు యుద్ధంబున నీకు అసదృశముగాఁ దృప్తి గావింపఁ
గలఁడు. అని సముద్రుఁడు దుందుభికిఁ జెప్పెను. ౧౩

అసురోత్తముఁడగు నాదుందుభి ఆసముద్రుఁడు తనకు భయపడినాఁ
డని తెలిసికొని వింటినుండి విడువఁబడిన బాణమువలె నతివేగంబున హిమవ
త్పర్వతప్రాంతవనంబునకుఁ బోయెను. ౧౪

అంత దుందుభి ఆహిమవత్పర్వతమునందలి తెల్లనివైన యేనుఁగులంత
టిఱాళ్లను కొమ్ములతోఁ గ్రుచ్చి విసరివైచుచు గర్జించెను. ౧౫

అంత మానుషరూపంబున తెల్లనిమేఘంబువలె నుండువాఁడును
సౌమ్యుఁడును జూపరులకు సంతోషంబు గల్గించు నాకారముగలవాఁడునగు
హిమవంతుఁడు తనశిఖరంబుననుండి దుందుభింజూచి యిట్లనిచెప్పెను.

ధర్మమునం దధికప్రీతిగలదుందుభీ! నన్ను నీవు శ్రమపఱుపవలదు;
నేను యుద్ధకార్యంబుల సమర్థుఁడఁగాను; మఱియు నాయందు మునులు
నివాసము సేయుచున్నారు కావున నేను యుద్ధము సేయుటకు వీలులేదు.
అని హిమవంతుఁడు దుందుభితోఁ జెప్పెను. ౧౬

బుద్ధిమంతుఁడును బర్వతరాజుఁడునగు నాహిమవంతుని మాటను విని
దుందుభి క్రోధంబునఁ గన్నుంగొనల నెఱ్ఱఁదనంబు గదుర నిట్లనియెను. ౧౭

నీవు యుద్ధమునం దసమర్థుఁడవుగాని లేక నావలనిభయంబువలన నే

సమాచక్ష్వ ప్రదద్యాన్మే యోఽద్య యుద్ధం యుయుత్సవః.

హిమవా నబ్రవీ ద్వాక్యం శ్రుత్వా వాక్యవిశారదః,
అనుక్తపూర్వం ధర్మాత్మా క్రోధా త్తమసురోత్తమమ్. ౨౦

వాలీనామ మహాప్రాజ్ఞ శ్శక్రతుల్యపరాక్రమః,
అధ్యాస్తే వానర శ్శ్రీమా న్కిష్కిన్ధా మతులప్రభామ్ ౨౧
స సమర్థో మహాప్రాజ్ఞ స్తవ యుద్ధవిశారదః,
ద్వన్ద్వయుద్ధం మహాద్దాతుం నముచే రివ వాసవః. ౨౨
తం శీఘ్ర మభిగచ్ఛ త్వం యది యుద్ధ మిహేచ్ఛసి,
సహి దుర్ధర్షణో నిత్యం శూర స్సమరకర్మణి ౨౩

శ్రుత్వా హిమవతో వాక్యం క్రోధావిష్ట స్స దున్దుభిః,
జగామ తాం పురీం తస్య కిష్కిన్ధాం వాలిన స్తదా. ౨౪
ధారయ న్మాహిషం రూపం తీక్ష్ణశృఙ్గో భయావహః,
ప్రావృ షీవ మహామేఘ స్తోయపూర్ణో నభస్తలే. ౨౫

తత స్తు ద్వార మాగమ్య కిష్కిన్ధాయా మహాబలః,
ననర్ద కమ్పయ న్భూమిం దున్దుభి ర్దున్దుభి ర్యథా. ౨౬
సమీపస్థా న్ద్రుమా న్భఞ్జ న్వసుధాం దారయ న్ఖురైః,
విషాణే నోల్లిఖ న్దర్పా త్తద్వారం ద్విరదో యథా. ౨౭

అన్తఃపురగతో వాలీ శ్రుత్వా శబ్ద మమర్షణః,
నిష్పపాత సహ స్త్రీభి స్తారాభి రివ చన్ద్రమాః. ౨౮

యుద్ధంబు సేయ నోల్లని వాఁడవు గాని యగుదువు గాక; యుద్ధంబుఁ గోరుచుండునాను ఇప్పుడు యుద్ధం బొసంగఁగల యట్టివీరుఁ డెవఁడో చెప్పుము. అని దుందుభి హిమవంతునితోఁ జెప్పెను. ౧౯

ధర్మాత్ముఁడును మాటలయందుఁ బండితుఁడునగు హిమవంతుఁడు ఇది వఱ కెన్నఁడును ఎవ్వరును జెప్పియుండని యట్టి దుందుభిగర్వపుమాటను విని కోపంబు నొంది యయ్యసురోత్తముం జూచి యిట్లని చెప్పెను. ౨౦

మహాపండితుఁడును బగాక్రమంబున దేవేంద్రునకు సరివచ్చువాఁడును శ్రీమంతుఁడునగు వాలి యను వానరుఁడు కిష్కింధాపురంబున నున్నాఁడు.

మహాపండితుఁడును యుద్ధంబులందుఁ బండితుఁడునగు నా వాలి నముచికి దేవేంద్రుఁ డొసంగినట్లు నీకు నిప్పుడు ద్వంద్వయుద్ధము నొసంగ సమర్థుఁడు.

నీ కిప్పుడు యుద్ధంబు గావలసి యుండు నేని శీఘ్రంబున నా వాలియొద్దకుఁ బొమ్ము; అతఁడు ఎట్టికాలమునందేనియు నెదిరింప నలవిగానివాఁడు; యుద్ధంబున శూరుఁడు. అని హిమవంతుఁడు దుందుభితోఁ జెప్పెను ౨౩

ఆదుందుభి హిమవంతుఁడు చెప్పినమాటను విని పరమకుపితుఁడై యప్పుడే వాలిచేఁ బాలింపఁబడుచుండునట్టి యాకిష్కింధాపురికిఁ బోయెను. ౨౪

మహిషరూపంబు ధరించి తీక్ష్ణంబులగు కొమ్ములుగలిగి భయంకరాకారుఁడై యున్న యాదుందుభి యాకాశంబున వర్షాకాలంబునందు జలపూర్ణంబగు మహామేఘంబుకైవడిఁ బ్రకాశించుచుండెను. ౨౫

అంత మహాబలుఁడగు దుందుభి కిష్కింధా నగరద్వారంబుఁ జేరి భూమి యదరునట్లు భేరివలె మహానాదంబున గర్జించెను. ౨౬

ఆదుందుభి మత్తగజంబువలె సమీపంబుననుండు వృక్షంబుల విఱచుచు గిట్టలచే భూమిని బగుల్చుచు కొమ్ములచే నాకిష్కింధాద్వారంబును గీఱుచు మదించియుండెను. ౨౭

అంతఃపురంబుననుండిన వాలి యాధ్వనిని విని దాని సహింపక స్త్రీలతోఁ గూడ ఆకాశంబున నక్షత్రంబులతోఁ గూడఁ జంద్రుఁడువలె బయలు వెడలెను ౨౮

మితం వ్యక్తాక్షరపదం త ముహా చాథ దున్దుభిమ్,
హరీణా మీశ్వరో వాలీ సర్వేషాం వనచారిణామ్. ౨౯

కిమర్థం నగరద్వార మిదం రుద్ధ్వా వినర్దసి,
దున్దుభే! విదితో మేఽసి రక్ష ప్రాణా న్మహాబల!. 3౦

తస్య తద్వచనం శ్రుత్వా వానరేన్ద్రస్య ధీమతః,
ఉవాచ దున్దుభి ర్వాక్యం రోషా త్సంరక్తలోచనః. 3౧
న త్వం స్త్రీసన్నిధౌ వీర! వచనం వక్తు మర్హసి,
మమ యుద్ధం ప్రయచ్ఛ త్వం తతో జ్ఞాస్యామి తే బలమ్. 3౨

అథవా ధారయిష్యామి క్రోధ మద్య నిశా మిమామ్,
గృహ్యతా ముదయః స్వైరం కామభోగేషు వానర!. 33

దీయతాం సమ్ప్రదానం చ పరిష్వజ్య చ వానరాన్,
సర్వశాఖామృగేన్ద్ర స్త్వం సంసాదయ సుహృజ్జనాన్. 3౪

సుదృష్టాం కురు కిష్కిన్ధాం కురు ష్వాత్మసమం పురే,
క్రీడస్వ చ సహ స్త్రీభి రహం తే దర్పనాశనః. 3౫

యో హి మత్తం ప్రమత్తం వా సుప్తం వా రహితం భృశం,
హన్యా త్స భ్రూణహా లోకే త్వద్విధం మదమోహితమ్. 3౬

అంత సమస్తవానరులకును ఈశ్వరుఁడగు వాలి యా దుందుభిం జూచి మితమును అక్షతములును బదములును స్పష్టములుగాఁ గలదియగు నీమాటం జెప్పెను. ౨౯

మహాబలుఁడవగు దుందుభీ! నీవు నాకుఁ దెలిసినవాఁడవే; ఈ నగర ద్వారము నిట్లు నిరోధించి గర్జించుచున్నా వేల? నీప్రాణంబులు కాపాడుకొనుము. అని వాలి దుందుభితోఁ జెప్పెను. ౩౦

దుందుభి బుద్ధిమంతుఁడగు వానరరాజు వాలి చెప్పిన మాటను విని కుపితుఁడై కనుఁగొనల నెఱ్ఱఁదనంబు గదుర నవ్వాలిం జూచి యిట్లనియెను. ౩౧

పరాక్రమశాలివగు వాలీ! నీ విట్లు స్త్రీలయొక్క సమక్షంబున గర్వంబు లాడుట యుక్తముగాదు. నాతో నిప్పుడు యుద్ధంబు సేయుము; అటుపిమ్మట నీ బలంబుఁ దెలిసికొనియెదను. ౩౨

వానరుఁడవగు వాలీ! అటుగాదేని యీరాత్రియందు నా క్రోధమును నణఁచుకొనియుండెదను; మన్మథభోగంబులనిమిత్తమయి రేపు ప్రాతఃకాలము వఱకు గడువొసంగెదను; అంతవఱకు యథేచ్ఛముగా ననుభవింపుము. ౩౩

సమస్తవానరనాథుఁడవగు నీవు బంధువులగు వానరులను గవుఁగిలించుకొని వారివారి కివ్వవలసినదాని నొసంగుము; మఱియుఁ గూరిమిస్నేహితులతోఁ గలసియుండుము. ౩౪

కిష్కింధనంతయు నొకమాఱు చక్కఁగాఁ జూచుకొనుము; నీయట్టివాని మఱియొకనిఁ బురంబున రాజుగా నునుచుము; స్త్రీలతో యథేష్టంబుగాఁ గ్రీడింపుము; అట్లు నీకోర్కెలన్నియుఁ దీర్చుకొన్నపిదపనే నీమదం బణఁచెదను. ౩౫

ఎవ్వఁడు మత్తుపొందినవానిఁగాని యేమఱియున్నవానిఁగాని నిద్రించియుండువానిఁగాని యాయుధములేనివానిఁగాని నీయట్టి విషయాసక్తుఁడగు కాముకునిఁగాని వధించునో అతఁడు భ్రూణహత్యాదోషంబునొందును అని దుందుభి వాలితోఁ జెప్పెను. ౩౬

స ప్రహస్యాబ్రవీ న్మన్దం క్రోధా త్త మసురో త్తమమ్,
విసృజ్య తాః స్త్రియ స్సర్వా స్తారా ప్రభృతికా స్తదా. ౩౮
మత్తోఽయ మితి మా మంస్థాయ ద్యభీతోఽసి సంయుగే,
మదోఽయం సమ్ప్రహారేఽస్మి న్వీరపానం సమర్థ్యతామ్.

త మేవ ముక్త్వా సంక్రుద్ధో మాలా ముత్క్షిప్య కాఞ్చనీమ్,
పిత్రా దత్తాం మహేన్ద్రేణ యుద్ధాయ వ్యవతిష్ఠత. ౩౯

విషాణయో ర్గృహీత్వా తం దున్దుభిం గిరిసన్నిభమ్,
ఆవిధ్యత తదా వాలీ వినద న్కపికుఞ్జరః ౪౦
వాలీ వ్యాపాతయాంచక్రే ననర్దచ మహాస్వనమ్,
శ్రోత్రాభ్యా మథ రక్తంతు తస్య సుస్రావ పాత్యతః. ౪౧

తయోస్తు క్రోధసంరమ్భా త్పరస్పరజయైషిణోః,
యుద్ధం సమభవ ద్ఘోరం దున్దుభే ర్వానరస్యచ. ౪౨
అయుధ్యత తదా వాలీ శక్రతుల్యపరాక్రమః,
ముష్టిభి ర్జానుభి శ్చైవ శిలాభిః పాదపై స్తథా. ౪౩
పరస్పరం ఘ్నతో స్తత్ర వానరాసురయో స్తదా,
అసీద దసురో యుద్ధే శక్రసూను ర్వ్యవర్ధత. ౪౪

వ్యాపారవీర్యధైర్యైశ్చ పరిక్షీణం పరాక్రమైః,
తంతు దున్దుభి ముత్పాట్య ధరణ్యా మభ్యపాతయత్ ౪౫

యుద్ధే ప్రాణహారే తస్మి న్నిష్పిష్టో దున్దుభి స్తదా,
పపాత చ మహాకాయః క్షితౌ పఞ్చత్వ మాగతః. ౪౬

ఆవాలి అప్పుడు తార మున్నగు స్త్రీల నంతఃపురంబునకుఁ బంపి కోపం-
బున నయ్యసురోత్తముని దుందుభిం జూచి నవ్వి తిన్నఁగా నిట్లనియెను.

నీవు యుద్ధమునందు భయముగలవాఁడవు కావేని నన్ను మత్తుఁడని తలంపవలదు; ఈమదమే ఇప్పుడు చేయఁబోవుయుద్ధమునకు వీరపానమని తలంపుము. అని వాలి దుందుభితోఁ జెప్పెను. ౩౮

ఆవాలి దుందుభితో నాప్రకారంబునం జెప్పి పరమకుపితుఁడై మున్ను తనకుఁ దండ్రి దేవేంద్రుఁ డొసంగిన కాంచనమాలికను గంఠమునం దాల్చి యుద్ధమునకు వెడలెను. ౩౯

అప్పుడు వానరోత్తముఁడగు వాలి పర్వతాకారుఁడగు దుందుభిని కొమ్ములంబట్టి గర్జించుచు గిఱగిఱం ద్రిప్పెను. ౪౦

వాలి యట్లు గిఱగిఱం ద్రిప్పి నేలంబడవేసి మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబుచేసెను. అంత నిట్లు పడఁద్రోయఁబడిన యాదుందుభిచెవుల నుండి నెత్తురు గాఱినది. ౪౧

అట్లు పరమకుపితులును బరస్పరము జయింపవలెనని కోరువారలునగు నావాలిదుందుభులకు భయంకరమయిన యుద్ధము కలిగినది. ౪౨

అప్పుడు దేవేంద్రసమానపరాక్రముఁడగు వాలి పిడికిళ్ళతోను మోఁకాళ్ళతోను కాళ్ళతోను వృక్షంబులతోను యుద్ధంబు గావించెను. ౪౩

అప్పు డచ్చట నావాలిదుందుభులు ఒండొరులం బ్రహరింపుచు యుద్ధంబుసేయుచుండఁగా యుద్ధమునందు అంతకంతకు దుందుభిబలము క్షీణించెను దేవేంద్రపుత్త్రుఁడు వాలిబలము వృద్ధిఁబొందెను. ౪౪

వాలి యుద్ధంబున దుందుభి క్షీణబలుఁడై పరాక్రమం బుడిగి ప్రయత్నంబుసేయ నశక్తుఁడై యుండుటంజూచి యతనిని బైకెత్తి నేలపైవేసి కొట్టెను. ౪౫

అప్పుడు ప్రాణహరంబగు నయ్యుద్ధంబునందు మహాకాయుఁడగు దుందుభిదేహమంతయు నలఁగి మరణంబునొంది నేలంబడెను. ౪౬

తం తోలయిత్వా బాహుభ్యాం గతసత్త్వ మచేతనమ్,
చిక్షేప బలవా న్వాలీ వేగే నైకేన యోజనమ్. ౪౭

తస్య వేగప్రవిద్ధస్య వక్త్రా త్క్షతజబిన్దవః,
ప్రపేతు ర్మారుతోత్క్షిప్తా మతఙ్గ స్యాశ్రమం ప్రతి. ౪౮
తా న్దృష్ట్వా పతితాం స్తస్య ముని శ్శోణితవిప్రుషః,
క్రుద్ధ స్తత్ర మహాభాగ శ్చిన్తయామాస కో న్వయమ్. ౪౯

యేనాహం సహసా స్పృష్ట శ్శోణితేన దురాత్మనా,
కోఽయం దురాత్మా దుర్బుద్ధి రకృతాత్మా చ బాలిశః. ౫౦

ఇత్యుక్త్వాథ వినిష్క్రమ్య దదర్శ మునిసత్తమః,
మహిషం పర్వతాకారం గతాసుం పతితం భువి. ౫౧

స తు విజ్ఞాయ తపసా వానరేణ కృతం హి తత్,
ఉత్ససర్జ మహాశాపం క్షేప్తారం వాలినం ప్రతి. ౫౨

ఇహ తేనాప్రవేష్టవ్యం ప్రవిష్టస్య వధో భవేత్,
వనం మత్సంశ్రయం యేన దూషితం రుధిరస్రవైః. ౫౩
సమ్భగ్నాః పాదపా శ్చేమే క్షిప తే హాసురీం తనుమ్,
సమన్తా ద్యోజనం పూర్ణ మాశ్రమం మామకం యది. ౫౪
ఆగమిష్యతి దుర్బుద్ధి ర్వ్యక్తం స న భవిష్యతి,

యే చాపి సచివా స్తస్య సంశ్రితా మామకం వనమ్. ౫౫
న చ తై రిహ వస్తవ్యం శ్రుత్వా యాన్తు యథా సుఖమ్,

అంతట మహాబలుఁడగు వాలి గతప్రాణుఁడై నేలంబడిన యాదుందుభికళేబరంబును జేతులనెత్తి యిట్టటు ఆడించి ఒక యామడదూరమునకుఁబోయి పడునట్లు ఒకచేతివిసురున వైచెను. ౪౮

అట్లు వేగంబున విసరివేయఁబడిన యాదుందుభి నోటనుండి రక్తబిందువులు వాయువేగంబుచే మతంగమహాముని యాశ్రమంబునఁ బడినవి.

మహాత్ముఁడగు నమ్మతంగమహాముని తనయాశ్రమంబునం బడియున్న యారక్తబిందువులం జూచి కుపితుఁడై "యీపనిగావించినవాఁడెవ్వఁ"డని చింతించెను. ౪౯

ఎంతమాత్ర మాలోచింపక నాపైనెత్తురుబిందువులు పడునట్లుగావించిన దురాత్ముఁడును దుర్బుద్ధియు మూఢుఁడును మూర్ఖుఁడు నగువాఁడెవ్వఁడు? అని మతంగమహాముని చెప్పెను. ౫౦

మునిశ్రేష్ఠుఁడగు నమ్మతంగమహాముని ఈప్రకారంబునఁబలుకుచు ఆశ్రమంబువెలువడి ఒక్కచో గతప్రాణుఁడై నేలంబడియున్న పర్వతాకారుఁడగు మహిషరూపుని దుందుభిం జూచెను. ౫౧

ఆమ్మతంగమహాముని తపోదృష్టిచే ఆకార్యమును వాలి గావించినాఁడని తెలిసికొని యాదుష్కార్యంబుగావించిన వాలిని భయంకరంబుగా శపించెను. ౫౨

ఎవ్వఁడు నాతపోవనంబు నెత్తురుబిందువులుపడి చెడునట్లును ఈవృక్షంబులన్నియు విఱుగునట్లును ఈరాక్షసకళేబరంబు నిచ్చట వేసినాఁడో అతఁడు ఇంక నీవనంబునకు రాఁగూడదు; వచ్చినచో మరణంబునొందును.

ఆవాలి నాయాశ్రమముచుట్టును ఆమడదూరములోనికి వచ్చినట్టయితే అతఁడు ఎంతమాత్రము బ్రతుకఁడు. ఇది స్పష్టము. ౫౪

ఆవాలికి సంబంధించినవానరు లెవరెవరు నావనంబున నున్నారో వారలును ఇంకమీఁద నిచ్చట నుండఁగూడదు. ఈమాటనువిని తత్క్షణము సుఖముగాఁ బోవుదురుగాక. ౫౫

యది తే పీహ తిష్ఠన్తి శపిష్యే తా నపి ధ్రువమ్. ౫౬
వనేఽస్మి న్మామకే నిత్యం పుత్త్రవ త్పరిరక్షితే,
పత్త్రాఙ్కురవినాశాయ ఫలమూలాభవాయ చ. ౫౭
దివస శ్చాస్య మర్యాదా యం ద్రష్టా శ్వోఽస్మి వానరమ్,
బహువర్షసహస్రాణి స వై శైలో భవిష్యతి. ౫౮

తత స్తే వానరా శ్శ్రుత్వా గిరం మునిసమీరితామ్,
నిశ్చక్రము ర్వనా త్తస్మా త్తాం దృష్ట్వా వాలి రబ్రవీత్. ౫౯
కిం భవన్త స్సమస్తా శ్చ మతఙ్గవనవాసినః,
మత్సమీప మనుప్రాప్తా అపి స్వస్తి వనౌకసామ్. ౬౦

తత స్తే కారణం సర్వం తదా శాపంచ వాలినః,
శశంసు ర్వానరా స్సర్వే వాలినే హేమమాలినే. ౬౧

ఏత చ్ఛ్రుత్వా తదా వాలీ వచనం వానరేరితమ్,
స మహర్షిం తదాఽఽసాద్య యాచతే స్మ కృతాఞ్జలిః. ౬౨

మహర్షి స్త మనాదృత్య ప్రవివే శాశ్రమం తదా,
శాపధారణభీత స్తు వాలీ విహ్వలతాం గతః. ౬౩

తత శ్శాపభయా ద్భీత ఋశ్యమూకం మహాగిరిమ్,
ప్రవేష్టుం నేచ్ఛతి హరి ర్ద్రష్టుం వాపి నరేశ్వర!. ౬౪

త స్యాప్రవేశం జ్ఞాత్వాఽహ మిదం రామ! మహావనమ్,
విచరామి సహామాత్యో విషాదేన వివర్జితః. ౬౫

ఆవానరులు ఇంక నెప్పుడైనను బిడ్డవలెఁ గాపాడుచుండిన యీనావనమునం దుండినగాని పత్రములను అంకురములను ఫలమూలంబులను నశింపఁజేసినంగాని వారలనుంగూడ శపించెదను. నిశ్చయము. ౫౬,౫౭

ఈశాపమునకు ఒకదినము గడువొసంగెదను. రేపు ఎవ్వఁడేని వానరుఁడు ఈవనంబున నుండునేని యతఁడు పెక్కువేలసంవత్సరములు పర్వతంబై యుండఁగలఁడు. అని మతంగమహాముని శపించెను. ౫౮

ఆవానరులు మతంగమహాముని చెప్పినమాటనువిని ఆవ్వనంబుననుండి వెడలి వాలియొద్దకుఁబోయిరి. వాలి వారలం జూచి యిట్లని చెప్పెను. ౫౯

మతంగమహాముని వనంబుననుండు మీరలందఱు నాసమీపంబునకు వచ్చినారేమి? వానరుల కందఱకు క్షేమమేగదా! అని వాలి యావానరుల నడిగెను. ౬౦

అంత నప్పుడు ఆవానరులందఱుఁ జేరి కాంచనమాలికతో నొప్పుచున్న వాలికి దుందుభికళేబరంబు పడుటయాదిగా మతంగమహాముని వాలిని శపించుటవఱకు నాకారణం బంతయుఁ జెప్పిరి. ౬౧

ఆవాలి వానరులు చెప్పిన యామాటనువిని యప్పుడె యమ్మతంగమహాముని సన్నిధానంబునకుఁబోయి చేమోడ్పుగీలించి శాపవిమోచనం బనుగ్రహింపుఁడని ప్రార్థించెను. ౬౨

అప్పుడు అమ్మతంగమహాముని వాలిని ఆదరింపకయే తన యాశ్రమంబుఁజొచ్చెను. అంత వాలి శాపంబు ననుభవింపవలసివచ్చినందుకు భయపడి దుఃఖితుఁడై కిష్కింధకుఁబోయెను. ౬౩

మనుష్యనాథుఁడవగు రాముఁడా! అందువలన వాలి మతంగమహాముని శాపభయంబువలన ఈఋశ్యమూక పర్వతంబును బ్రవేశింప నొల్లఁడు చూడనుగూడ నిచ్ఛింపఁడు. ౬౪

రాముఁడా! ఆవాలి యిచ్చటికి రాఁడనితెలిసియే నేను మంత్రులతోఁ గూడ నిర్భయముగా నిమ్మహావనంబున సంచరించుచున్నాను. ౬౫

ఏషోఽస్థినిచయ స్తస్య దున్దుభే స్సంప్రకాశతే,
వీర్యోత్సేకాన్నిర స్తస్య గిరికూటోపమో మహాన్. ౧౬
ఇమే చ విపులా స్సాలా స్సప్త శాఖావలమ్బినః,
యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితు మోజసా. ౧౭

ఏత దస్యాసమం వీర్యం మయా రామ! ప్రకీర్తితమ్,
కథం తం వాలినం హన్తుం సమరే శక్ష్యసే నృప!. ౧౮

తథా బ్రువాణం సుగ్రీవం ప్రహస న్లక్ష్మణోఽబ్రవీత్,
కస్మి న్కర్మణి నిర్వృత్తే శ్రద్దధ్యా వాలినో వధమ్. ౧౯

త మువా చాథ సుగ్రీవ స్సప్త సాలా నిమా న్పురా,
ఏవ మేకైకశో వాలీ వివ్యాథాథ స చాసకృత్. ౨౦

రామోఽపి దారయే దేషాం బాణే నైకేన చేద్ద్రుమమ్,
వాలినం నిహతం మన్యే దృష్ట్వా రామస్య విక్రమమ్. ౨౧
హతస్య మహిష స్యాస్థి పాదే నైకేన లక్ష్మణ!,
ఉద్యమ్యాథ ప్రక్షిపే చ్చే త్తరసా ద్వే ధనుశ్శతే. ౨౨

ఏవ ముక్త్వాతు సుగ్రీవో రామం రక్తాన్తలోచనమ్,
ధ్యాత్వా ముహూర్తం కాకుత్స్థం పున రేవ వచోఽబ్రవీత్. 23
శూరశ్చ శూరఘాతీచ ప్రఖ్యాతబలపౌరుషః,
బలవా న్వానరో వాలీ సంయుగే ష్వపరాజితః. ౨౪

వాలిచే బలగర్వంబున విసరివేయఁబడిన యీదుందుభియొక్క పర్వత శిఖరంబంతటికళేబరము ఇదిగో ఉన్నది. చూడుము. ౧౬

ఇదిగో వ్రేలు కాఁడు కొమ్మలతో స్థూలంబులగు ఏడుసాలవృక్షంబులు న్నవి చూడుము. వీనిలో వాలి బాహుబలముచేత బాణము ఒకచెట్టును దూరి యావలంబడునట్లు బాణంబు వేయఁగలఁడు. ౧౭

రాజవరరామా! ఇది వాలియొక్క పరాక్రమము అసదృశమయినది. నీకుఁ జెప్పి వేసినాను. అట్టివాలిని నీవు యుద్ధంబున నెట్లు వధింపఁగలవు? అని సుగ్రీవుఁడు చెప్పెను. ౧౮

లక్ష్మణుఁడట్లు సుగ్రీవుఁడు చెప్పుమాటనువిని నవ్వుచు వతనితో నిట్లని రెను.

ఏమిపనిగావించితే ఇతఁడు వాలిని వధింపఁగలఁడని నీకు నమ్మకముగ లుగును? అని లక్ష్మణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౯

అంత సుగ్రీవుఁడు లక్ష్మణుంజూచి యిట్లనియెను. మున్ను వాలి యీ సాలవృక్షముల నేడింటిని మున్ను నేను జెప్పినప్రకారంబున బాణము చెట్టు నుదూరి యావలంబడునట్లు ఒక్కొకటిగాఁ బలుమాఱు గొట్టియున్నాఁడు.

లక్ష్మణుఁడా! రాముఁడును నాసాలవృక్షములలో నొకటిని ఒకబాణ ముచేత బాణము చెట్టుదూరి యావలం బడునట్లు కొట్టునేని మఱి నిహతుఁ డగు దుందుభికళేబరమును బాణముతో నెత్తి యొనిమిదివందలచేతులదూరము పోయి పడునట్లు విసరివేయునేనియు అప్పటికి రామునిపరాక్రమంబుఁజూచి వాలి నిహతుఁడయ్యెనని తలఁచెదను. అని సుగ్రీవుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦,౨౧

సుగ్రీవుఁ డీప్రకారంబునం జెప్పికొంతసేపు చింతించి మరల రక్తాం తనయనుఁడగు కాకుత్స్థవంశోద్భవు రాముంజూచి యిట్లని చెప్పెను. ౨౩

వాలి శూరుఁడు, శూరుల వధించినవాఁడు, ప్రసిద్ధములయిన బలపరా క్రమంబులుగలవాఁడు, బలవంతుఁడు, యుద్ధంబుల నెన్నఁడు నిదివఱకుఁ బరా జయంబు నొందనివాఁడు. ౨౪

దృశ్యన్తే చాస్య కర్మాణి దుష్కరాణి సురై రపి,
యాని సంచి న్త్యభీతోఽహ మృశ్యమూకం సమాశ్రితః. ౭౫

త మజయ్య మధృష్యం చ వానరేన్ద్ర మమర్షణమ్,
విచి న్తయ న్నముఞ్చామి ఋశ్యమూక మహం త్విమమ్. ౭౬

ఉద్విగ్న శ్శఙ్కిత శ్చాపి విచరామి మహావనే,
అనురక్తై స్సహామాత్యై ర్హనుమత్ప్రముఖై ర్వరైః. ౭౭

ఉపలబ్ధం చ మే శ్లాఘ్యం సన్మిత్రం మిత్రవత్సల!,
త్వా మహం పురుషవ్యాఘ్ర! హిమవ న్త మి వాశ్రితః. ౭౮

కింతు తస్య బలజ్ఞోఽహం దుర్భ్రాతుర్బలశాలినః,
అప్రత్యక్షం తు మే వీర్యం సమరే తవ రాఘవ!. ౭౯

న ఖ ల్వహం త్వాం తులయే నావమన్యే న భీషయే,
కర్మభి స్తస్య భీమై స్తు కాతర్యం జనితం మమ. ౮౦

కామం రాఘవ! తే వాణీ ప్రమాణం ధైర్య మాకృతిః,
సూచయ న్తి పరం తేజో భస్మచ్ఛన్న మి వానలమ్. ౮౧

తస్య తద్వచనం శ్రుత్వా సుగ్రీవస్య మహాత్మనః,
స్మితపూర్వ మథో రామః ప్రత్యువాచ హరిం ప్రభుః. ౮౨
యది న ప్రత్యయోఽస్మాసు విక్రమే తవ వానర!,
ప్రత్యయం సమరే శ్లాఘ్య మహ ముత్పాదయామి తే. ౮౩

ఈవాలి దేవతలకునుగూడఁ జేయనలవిగానికర్మము లనేకములు గావించియున్నాఁడు. నేను వానినంతయు నాలోచించియే భయపడి యీఋశ్యమూకంబు నాశ్రయించియున్నాను. ౨౫

జయింప నలవిగానివాఁడును ధర్షింపరానివాఁడును బలమకోపనుఁడు నగువానరరాజు నావాలిని దలంచియే నేను ఈఋశ్యమూకపర్వతంబు నెంతమాత్రము విడువకున్నాను. ౨౬

మఱియు నేను నాయం దనురాగముగలవారలును ఉత్తములునగు హనుమంతుఁడు మున్నగు మంత్రిసత్తములతోఁగూడియు నిమ్మహావనంబున దిగులుపడుచు భయపడుచునే సంచరించుచున్నాను. ౨౭

మిత్రులయం దధికప్రీతిగలరాముఁడా! మఱియు నాకు శ్లాఘనీయుఁడవగు సన్మిత్రమవు దొరకినావు. పురుషశ్రేష్ఠుఁడా! హిమవంతు నవలంబించినట్లు నేను నిన్నాశ్రయించినాను. ౨౮

రాముఁడా! మఱియేమందువేని మహాబలశాలియగు నాదుర్భ్రాత వాలియొక్క బలము నాకుఁ దెలియును. యుద్ధంబున నీపరాక్రమమును మాత్రము నే నిదివఱకుఁ జూచినదిలేదు. ౨౯

భయంకరములయిన యావాలి కార్యంబులచే నాకు భయముపుట్టి యీమాటలం జెప్పుచున్నాను గాని నీకుఁ జలనంబు గలిగింపవలెనని గాని నిన్నవమానింపవలెనని గాని నిన్ను భయపఱుపవలెనని గాని కాదు. ౩౦

రాముఁడా! నీమాటయు బుద్ధియు ధైర్యంబును ఆకారంబును భస్మంబగు నగ్నివలె నున్నమహాతేజస్సును సూచించుచున్నవి. సందేహములేదు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౩౧

నాథుఁడగురాముఁడు మహాత్ముఁడగు నాసుగ్రీవునిమాటనువిని చిఱునగవు నవ్వుచు సుగ్రీవుంజూచి యిట్లని చెప్పెను. ౩౨

సుగ్రీవుఁడా! మాపరాక్రమమునందు నీకు నమ్మకము లేదేని ఇప్పుడు నేను నీకు యుద్ధమువిషయమయి కావలసినంతనమ్మకమును గలుగఁజేసెదను. అని రాముడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౩౩

ఏవ ముక్త్వా తు సుగ్రీవం సాన్త్వం లక్ష్మణపూర్వజః,
రాఘవో దున్దుభేః కాయం పాదాఙ్గుష్ఠేన లీలయా. ౪౪
తోలయిత్వా మహాబాహు శ్చిక్షేప దశయోజనమ్,

అసురస్య తనుం శుష్కం పాదాఙ్గుష్ఠేన వీర్యవాన్. ౪౫
క్షిప్తం దృష్ట్వా తతః కాయం సుగ్రీవః పున రబ్రవీత్,

లక్ష్మణ స్యాగ్రతో రామ మిదంవచన మర్థవత్. ౪౬

ఆర్ద్రస్సమాంసః ప్రత్యగ్రః క్షిప్తః కాయః పురా సఖే!,
లఘుస్సమ్ప్రతి నిర్మాంస స్తృణభూతశ్చ రాఘవ!. ౪౭

పరిశ్రాన్తేన మత్తేన భ్రాత్రా మేవాలినా తదా,
క్షిప్త మేవం ప్రహర్షేణ భవతా రఘునన్దన!. ౪౮
నాత్ర శక్యం బలం జ్ఞాతుం తవ వా తస్య వాధికమ్,

ఆర్ద్రం శుష్క మితి హ్యేత త్సుమహ ద్రాఘవా న్తరమ్. ౪౯
స ఏవ సంశయ స్తాత! తవ తస్య చ యద్బలే,

సాల మేకంతు నిర్భిద్య భవే ద్వ్యక్తి ర్బలాబలే. ౫౦

కృ త్వేదం కార్ముకం సజ్యం హ స్తిహ స్త మివాతతమ్,
ఆకర్ణపూర్ణ మాయమ్య విసృజస్వ మహాశరమ్. ౫౧
నమం హి సాలం సహిత స్త్వయా శరో
న సంశయోఽత్రా స్తి విదారయిష్యతి,

మహాబాహుఁడును లక్ష్మణునియన్నయు నగురాముఁడు సుగ్రీవునితో నీప్రకారంబునం జెప్పి యతని నాశ్వాసింపుచు దుందుభి కళేబరమును బాదాంగుష్ఠంబున నెత్తి యాడించి పదియామడలదూరమునఁ బడునట్లు వేసెను. ౮౪

పరాక్రమవంతుఁడగు సుగ్రీవుఁడు ఎండినది కావున మునుపటికన్న స్వల్పముగానున్న దుందుభికళేబరమును రాముఁడు పాదాంగుష్ఠమున విసరి వేయుటనుజూచి మరల రామునితో నిట్లని చెప్పెను. ౮౫

ఆసుగ్రీవుఁడు లక్ష్మణునిముందట రాముంజూచి యీమాటం జెప్పెను. ౮౬

స్నేహితుఁడవగురాముఁడా! మున్ను తడిదియుఁ గ్రొత్తదియు మాంసభూయిష్ఠంబునగు కళేబరము వేయఁబడినది. ఇప్పుడు ఎండి నిర్మాంసమై చులుకనయియుండు కళేబరము వేయఁబడినది. ౮౭

రాముఁడా! అప్పుడు నాయన్నవాలి యలసి మత్తుడైయుండినప్పుడు విసరివేసినాఁడు. నీవు సంతోషంబుతో నుండునప్పుడు వేసినావు ౮౮

కావున దీనిచేత నీబల మధికమో అతనిబల మధికమో తెలిసికొనుటకు వీలులేదు.

రాముఁడా! "తడిది ఎండుది" అనునదే మిగుల తారతమ్యమున్నది కావున నీబలమునందును ఆవాలిబలమునందును మునుపటి సందేహమే యున్నది. ౮౯

నీవు ఒకసాలవృక్షమును బాణముచే భేదింతువేని బలాబలములు స్పష్టమగును. ౯౦

నీవు ఏనుఁగుతొండమువలె వలిదీర్ఘమయిన యీధనుస్సును సజ్యంబుగావించి ఆకర్ణాంతము నాకర్షించి మహాబాణంబు నొకటి విడువుము. ౯౧

రాచకొమరుఁడవగు రాముఁడా! నీచేఁ బ్రయుక్తంబగు బాణము ఈసాలవృక్షమును భేదింపఁగలదు. ఇందు సందియములేదు. ఆలోచింపవలదు.

అలం విమర్శేన మమ ప్రియం ధ్రువం
కురుష్వ రాజాత్మజ! శాపితో మయా. ౯౨
యథాహి తేజస్సు వర స్సదా రవి
ర్యథాహి శైలో హిమవా న్మహాద్రిషు,
యథా చతుష్పాత్సు చ కేసరీ వర
స్తథా నరాణా మసి విక్రమే వరః. ౯౩

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డ ఏకాదశ స్సర్గః. ౧౧.

---

## ద్వాదశ స్సర్గః.

ఏతచ్చ వచనం శ్రుత్వా సుగ్రీవేణ సుభాషితమ్,
ప్రత్యయార్థం మహాతేజా రామో జగ్రాహ కార్ముకమ్. ౧
స గృహీత్వా ధను ర్ఘోరం శర మేకంచ మానదః,
సాల ముద్దిశ్య చిక్షేప జ్యాస్వనైః పూరయ న్దిశః. ౨

స విసృష్టో బలవతా బాణ స్స్వర్ణపరిష్కృతః,
భిత్త్వా సాలా న్గిరిప్రస్థే సప్త భూమిం వివేశ హ. ౩

ప్రవిష్టశ్చ ముహూర్తేన ధరాం భిత్త్వా మహాజవః,
నిష్పత్య చ పున స్తూర్ణం స్వతూణీం ప్రవివేశహ. ౪

తా న్దృష్ట్వా సప్త నిర్భిన్నాం స్సాలా న్వానరపుఙ్గవః,
రామస్య శరవేగేన విస్మయం పరమం గతః. ౫
స మూర్ధ్నా న్యపత ద్భూమౌ ప్రలమ్బీకృతభూషణః,
సుగ్రీవః పరమప్రీతో రాఘవాయ కృతాఞ్జలిః. ౬

నాకు సంతోషమునేయుము. నిన్ను బరీక్షించుటకుఁగాదు. నీకొట్టుపెట్టెదను. ౯౨

తేజోవంతులయందుసూర్యుఁడుత్తముఁడగునట్లును మహాపర్వతంబులయందు హిమవత్పర్వతము శ్రేష్ఠమగునట్లును చతుష్పాజ్జంతువులయందు సింహము శ్రేష్ఠమగునట్లును నీవు పరాక్రమంబున సమస్తమనుష్యులలోను శ్రేష్ఠుఁడవు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౯౩

ఇది పదునొకండవసర్గము.

---

## పండ్రెండవసర్గము.

మహాతేజుఁడగు రాముఁడు సుగ్రీవుఁడు చెప్పినమాటను విని సుగ్రీవునకు నమ్మకము గలుగుటకై ధనుస్సు చేతంబట్టెను. ౧

శత్రువులగర్వంబు నణఁచునట్టి రాముఁడు భయంకరాకారంబగు ధనుస్సును ఒక్కబాణంబును గ్రహించి జ్యాధ్వనులచే దిక్కులు పిక్కటిల్ల సాలవృక్షంబు నేసెను. ౨

బలవంతుఁడగు నారామునిచే వేయఁబడిన కాంచనాలంకృతంబగు నాబాణము ఏడుసాలవృక్షంబుల భేదించి యాపర్వతంబును భేదించి భూమిం బ్రవేశించెను. ౩

మహావేగంబగు నాబాణంబు అట్లు భూమిని బ్రవేశించి శీఘ్రంబున మరల భూమిని భేదించుకొనివచ్చి వేగంబున తనస్థానమయిన యమ్ములపొదిం బ్రవేశించెను. ౪

వానరోత్తముఁడగు సుగ్రీవుఁడు రాముని బాణవేగంబుచే ఏడుసాలవృక్షంబులు భేదింపఁబడుటను జూచి పరమాశ్చర్యంబు నొందెను. ౫

ఆసుగ్రీవుఁడు పరమసంతుష్టుఁడై రామునికిఁ జేమోడ్పుగీలించి వ్రేలుకాడు సాభరణంబులతో సాష్టాంగముగ నమస్కారము గావించెను. ౬

ఇదం చోవాచ ధర్మజ్ఞం కర్మణా తేన హర్షితః,
రామం సర్వాస్త్రవిదుషాం శ్రేష్ఠం శూర మవస్థితమ్. ౭

సేన్ద్రా నపి సురాం స్సర్వాం స్త్వం బాణైః పురుషర్షభ!,
సమర్థ స్సమరే హన్తుం కింపున ర్వాలినం ప్రభో!. ౮

యేన సప్త మహాసాలా గిరి ర్భూమి శ్చ దారితాః,
బాణే నైకేన కాకుత్స్థ! స్థాతా తే కో రణాగ్రతః. ౯

అద్య మే విగత శ్శోకః ప్రీతి రద్య పరా మమ,
సుహృదం త్వాం సమాసాద్య మహేన్ద్రవరుణోపమమ్. ౧౦

త మద్యైవ ప్రియార్థం మే వైరిణం భ్రాతృరూపిణమ్,
వాలినం జహి కాకుత్స్థ! మయా బద్ధోఽయ మఞ్జలిః. ౧౧

తతో రామః పరిష్వజ్య సుగ్రీవం ప్రియదర్శనమ్,
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో లక్ష్మణానుమతం వచః. ౧౨
అస్మా ద్గచ్ఛేమ కిష్కిన్ధాం క్షిప్రం గచ్ఛ త్వ మగ్రతః,
గత్వా చాహ్వయ సుగ్రీవ! వాలినం భ్రాతృగన్ధినమ్. ౧౩

సర్వే తే త్వరితం గత్వా కిష్కిన్ధాం వాలినః పురీమ్,
వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠ న్గహనే వనే. ౧౪

సుగ్రీవో వ్యనద ద్ఘోరం వాలినో హ్వానకారణాత్,
గాఢం పరిహితో వేగా న్నాదై ర్భిన్ద న్నివామ్బరమ్. ౧౫

ఆసుగ్రీవుఁడు ఆకార్యముచే పరమసంతుష్టుఁడై ధర్మముఁ దెలిసినవాఁడును సమస్తాస్త్రవేత్తలలో నుత్తముఁడును శూరుఁడు నగు రామునిం జూచి యీమాటనుం జెప్పెను. ౭

నాథుఁడవు పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవు యుద్ధంబునందు బాణంబులచే దేవేంద్రునితోఁ గూడివచ్చిన దేవతలనందఱనుంగూడ వధింప సమర్థుండవు. ఇంక వాలిని వధింపఁగలవని చెప్పనేల? ౮

రాముఁడా! ఒక్క బాణముచేత ఏడుమహాసాలవృక్షంబులను బర్వతంబును భూమిని భేదించినట్టి మహావీరుఁడవగు నీముందట యుద్ధంబున నెవ్వఁడు నిలువఁగలఁడు? ౯

దేవేంద్రవరుణులతో సమానుఁడవగు నిన్ను స్నేహితునిగాఁ బొందుట వలన ఇప్పుడు నాదుఃఖము పోయినది. ఇప్పుడు నాకుఁ బరమసంతోషము కలిగినది. ౧౦

రాముఁడా! నాకుఁ దోఁబుట్టువను పేరుతోఁ బరమశత్రువయియున్న యీవాలిని నాసంతోషార్థమయి యిప్పుడే వధింపుము. ఇదిగో అంజలిబంధము గావించితిని అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౧౧

అంత మహాపండితుఁడగు రాముఁడు లక్ష్మణుని యనుమతిఁగొంది ప్రియదర్శనుఁడగు సుగ్రీవునిం గవుఁగిలించుకొని యీమాటం జెప్పెను. ౧౨

సుగ్రీవుఁడా! ఇచ్చటనుండియే కిష్కింధకుఁబోవుదము. నీవు శీఘ్రంబునఁగొంతముందు గాఁ బోవుము. పోయి నీవు తమ్ముని హింసించునట్టి వాలిని యుద్ధంబునకుఁ బిలువుము. అని రాముఁడు సుగ్రీవునకుఁ జెప్పెను ౧౩

ఆరామలక్ష్మణసుగ్రీవప్రభృతులందఱు శీఘ్రంబున వాలిరాజధానియగు కిష్కింధకుఁబోయి యచ్చట దుర్గమవనంబున వృక్షంబుల మఱుఁగున డాఁగియుండిరి. ౧౪

సుగ్రీవుఁడు గట్టిగా దట్టిగట్టుకొని వాలినిం బిలుచుటకై వేగంబున గర్జనలచే నాకాశంబును భేదించువాఁడువలె భయంకరంబుగా గర్జించెను. ౧౫

తం శ్రుత్వా నినదం భ్రాతుః క్రుద్ధో వాలీ మహాబలః,
నిశ్చక్రామ సుసంరబ్ధో భాస్కరో౽స్తతటా దివ. ౧౬
తత స్సుతుములం యుద్ధం వాలిసుగ్రీవయో రభూత్,
గగనే గ్రహయో ర్ఘోరం బుధాఙ్గారకయో రివ. ౧౭
తలై రశనికల్పై శ్చ వజ్రకల్పై శ్చ ముష్టిభిః,
జఘ్నతు స్సమరే౽న్యోన్యం భ్రాతరౌ క్రోధమూర్ఛితౌ. ౧౮

తతో రామో ధనుష్పాణి స్తా వుభౌ సముదీక్ష్యతు,
అన్యోన్యసదృశౌ వీరా వుభౌ దేవా వి వాశ్వినౌ. ౧౯
యన్నావగచ్ఛ త్సుగ్రీవం వాలినం వాపి రాఘవః,
తతో న కృతవా న్బుద్ధిం మోక్తు మన్తకరం శరమ్. ౨౦
ఏతస్మి న్నన్తరే భగ్న స్సుగ్రీవ స్తేన వాలినా,
అపశ్య న్రాఘవం నాథ మృశ్యమూకం ప్రదుద్రువే. ౨౧
క్లాన్తో రుధిరసిక్తాఙ్గః ప్రహారై ర్జర్జరీకృతః,
వాలినా౽భిద్రుతః క్రోధా త్ప్రవివేశ మహావనమ్. ౨౨

తం ప్రవిష్టం వనం దృష్ట్వా వాలీ శాపభయార్దితః,
ముక్తో హ్యసి త్వ మి త్యుక్త్వా సన్నివృత్తో మహాద్యుతిః. ౨3

రాఘవో౽పి సహ భ్రాత్రా సహ చైవ హనూమతా,
త దేవ వన మాగచ్ఛ త్సుగ్రీవో యత్ర వానరః. ౨౪
తం సమీక్ష్యాగతం రామం సుగ్రీవ స్సహ లక్ష్మణమ్,
హ్రీమా న్దీన మువా చేదం వసుధా మవలోకయన్. ౨౫
ఆహ్వయ స్వేతి మా ముక్త్వా దర్శయిత్వా చ విక్రమమ్,
వైరిణా ఘాతయిత్వా చ కి మిదానీం త్వయా కృతమ్. ౨౬

మహాబలశాలి యగువాలి తమ్ముని గర్జనధ్వనిని విని కుపితుఁడై మహా వేగంబున ఉదయగిరినుండి సూర్యుఁడువలె వెడలివచ్చెను. ౧౬

అంత నాకాశంబున బుధాంగారకగ్రహంబులకుంబోలె నవ్వాలి సుగ్రీవులకు భయంకరంబగు తుములయుద్ధం బయ్యెను. ౧౭

అన్నదమ్ములగు నావాలిసుగ్రీవులు కోపంబున నొడలు దెలియనివారై యుద్ధంబున పిడుగులవంటి యఱచేతులతోను వజ్రాయుధములవంటి పిడికిళ్లతోను ఒకరినొకరు కొట్టుకొనిరి. ౧౮

అంత ధనుర్ధరుఁడగు రాముఁడు అశ్వినీదేవతలువలె నొకరివలె నొకరున్నవారలును బరాక్రమవంతులునగు నావాలిసుగ్రీవుల నిద్దఱం జూచి "ఇతఁడు సుగ్రీవుఁడు ఇతఁడు వాలి" యని గుఱుతుపట్టఁజాలనందున ప్రాణహరంబగు బాణమును విడుచుటకుఁ దలంపుగొనలేదు. ౧౯,౨౦

ఈనడుమ సుగ్రీవుఁడు వాలిచేఁ బరాజయంబునొంది నాథుఁడగు రాముఁగాన ఋశ్యమూకపర్వతంబునకుఁ బరుగెత్తెను. ౨౧

ఆసుగ్రీవుఁడు అలసి దేహమంతయు నెత్తురు వెల్లువలుగా దెబ్బలచే నొచ్చి వాలి కోపంబున వెంబడించి తఱుమ నమ్మతంగమహాముని వనంబుఁ జొచ్చెను. ౨౨

మహాతేజుఁడగు వాలి సుగ్రీవుఁడు మతంగాశ్రమవనంబుఁ జొచ్చుటంజూచి శాపభీతుఁడై "తప్పించుకొని పోతివి" అనిచెప్పి మరలి కిష్కింధకుఁ బోయినాఁడు. ౨౩

రాముఁడును హనుమంతునితోను లక్ష్మణునితోనుంగూడ సుగ్రీవుఁడు పోయినవనంబునకే పోయెను. ౨౪

సుగ్రీవుఁడు లక్ష్మణసహితంబుగా వచ్చిన రామునంజూచి సిగ్గుపడి తల వంచి నేలంజూచుచు దీనవచనంబున నిట్లని చెప్పెను. ౨౫

పరాక్రమంబుఁజూపి వాలిని యుద్ధంబునకుఁ బిలువుమని నాకుఁజెప్పి నన్ను వాలిచేతఁ గొట్టించినావే; నీ విప్పుడేమిచేసినావు? ౨౬

త్తా మేవ వేళాంవ క్తవ్యం త్వయా రాఘవ! త త్త్వతః,
వాలినం న నిహాన్మీతి తతో నాహ మితో వ్రజే. ౨౭

తస్య చైవం బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
కరుణం దీనయా వాచా రాఘవః పున రబ్రవీత్. ౨౮

సుగ్రీవ! శ్రూయతాం తాత! క్రోధ శ్చ వ్యపనీయతామ్,
కారణం యేన బాణోఽయం న మయా స విసర్జితః. ౨౯
అలంకారేణ వేషేణ ప్రమాణేన గతేన చ,
త్వంచ సుగ్రీవ! వాలీచ సదృశౌ స్థః పరస్పరమ్. ౩౦
స్వరేణ వర్చసా చైవ ప్రేక్షితేన చ వానర!,
విక్రమేణ చ వాక్యై శ్చ వ్యక్తిం వా నోపలక్షయే. ౩౧
తతోఽహం రూపసాదృశ్యా న్మోహితో వానరోత్తమ!,

నోత్సృజామి మహావేగం శరం శత్రునిబర్హణమ్. ౩౨
జీవితాన్తకరం ఘోరం సాదృశ్యాత్తు విశఙ్కితః,
మూలఘాతో న నౌ స్యా ద్ధి ద్వయోరపి కృతో మయా ౩౩

త్వయి వీరే విపన్నే హి అజ్ఞానా ల్లాఘవా న్మయా,
మౌఢ్యంచ మమ బాల్యంచ ఖ్యాపితం స్యాత్కపీశ్వర!. ౩౪

దత్తాభయవధో నామ పాతకం మహ దుచ్యతే,

అహంచ లక్ష్మణ శ్చైవ సీతాచ వరవర్ణినీ. ౩౫

రాముఁడా! నీ వాసమయమునందే "నేను వాలిని వధింపఁజాలను" అని ఖండితముగా యథార్థముగాఁ జెప్పియుండవలెను. అట్లు చేసియుండు వేని నే నిచ్చటనుండి పోనే పోనుగదా! అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౬

మహాత్ముఁడగు సుగ్రీవుఁ డీప్రకారమున వినువారికిఁగూడ దుఃఖము గలుగునట్లు దీనవాక్యంబునఁ జెప్పుటను విని రాముఁడు అతని కిట్లని బదు లుచెప్పెను. ౨౭

సుగ్రీవుఁడా! నేను ఏకారణముచేత ఈబాణమును విడువలేదో ఆకారణమును జెప్పెదను వినుము. కోపంబు విడువుము. ౨౮

సుగ్రీవుఁడా! అలంకారముచేతను వేషముచేతను ఆకారముచేతను నడకచేతను నీవును వాలియు మీరిరువురు ఒకరివలె నొకరున్నారు. ౩౦

సుగ్రీవా! కంఠధ్వనిచేతఁగాని కాంతిచేతఁగాని కన్నులచేతఁగాని నడకచేతఁగాని మాటలచేతఁగాని మీయిద్దఱిలో భేద మెంతయు నాకగపడలేదు.

వానరశ్రేష్ఠుఁడవగు సుగ్రీవుఁడా! అట్లు మీయిద్దఱికి రూప మొకటిగానే యుండుటవలన నేను మోసపోతిని.

నేను మీయిద్దఱి రూపసామ్యమువలన సందేహించియే "మనయిద్దఱికిని మొదటికే మోసము రాకుండుఁగాక" యని మహావేగంబున శత్రువధంబు నేయునదియుఁ బ్రాణనాశకరంబునగు బాణంబును బ్రయోగింపలేదు. వేఱుగాదు. ౩౨, ౩౩

వానరరాజుఁడవగు సుగ్రీవుఁడా! నాయజ్ఞానంబునను లాఘవంబునను నీకు ఏదేని యుపాయము సంభవించునేని నామూర్ఖ్యంబును బాల్యంబును వెల్లడియగునుగదా! ౩౪

ఎవ్వనికి అభయం బొసంగినామో అతని వధించితే మహాపాతకము చెప్పఁబడియున్నది.

నేనును లక్ష్మణుఁడును ఉష్ణకాలమున సుఖశీతలమును శీతకాలమున

త్వదధీనా వయం సర్వే వనేఽస్మిన్ శరణం భవాన్,

తస్మా ద్యుధ్యస్వ భూయ స్త్వం మా మా శఙ్కిశ్చ వానర!।

ఏతన్ముహూర్తే సుగ్రీవ! పశ్య వాలిన మాహవే,
నిరస్త మిషు ణైకేన వేష్టమానం మహీతలే. ౩౭
అభిజ్ఞానం కురుష్వ త్వ మాత్మనో వానరేశ్వర!,
యేన త్వా మభిజానీయాం ద్వన్ద్వయుద్ధ ముపాగతమ్. ౩౮

గజపుష్పీ మిమాం ఫుల్లా ముత్పాట్య శుభలక్షణామ్,
కురు లక్ష్మణ! కణ్ఠేఽస్య సుగ్రీవస్య మహాత్మనః. ౩౯
తతో గిరితటే జాతా ముత్పాట్య కుసుమాకులామ్,
లక్ష్మణో గజపుష్పీం తాం తస్య కణ్ఠే వ్యసర్జయత్. ౪౦
స తయా శుశుభే శ్రీమాన్ లతయా కణ్ఠసక్తయా,
విపరీత ఇ వాకాశే సూర్యో నక్షత్రమాలయా. ౪౧
మాలయేవ బలాకానాం ససన్ధ్య ఇవ తోయదః,
విభ్రాజమానో వపుషా రామవాక్యసమాహితః. ౪౨
జగామ సహ రామేణ కిష్కిన్ధాం వాలిపాలితామ్.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్వాదశ స్సర్గః. ౧౨.

---

## త్రయోదశ స్సర్గః.

ఋశ్యమూకా త్స ధర్మాత్మా కిష్కిన్ధాం లక్ష్మణాగ్రజః,
జగామ సహసుగ్రీవో వాలివిక్రమపాలితామ్. ౧

సుఖోష్ణమునగు సంగముగలిగి భర్తయం దధికానురాగముగల యుత్తమస్త్రీయగు సీతయు మేమందఱము నీయధీనులము. నీవే మా కివ్వనంబున రక్షకుఁడవు. ౩౫

సుగ్రీవా! అందువలన నీవు మఱలఁబోయి యుద్ధంబుసేయుము. నామీఁద సందేహింపవలదు. ౩౬

సుగ్రీవా! ఇప్పుడు యుద్ధంబున వాలిని ఒక్కబాణంబుననె వధించి భూమిపయిఁబడి పొరలునట్లు గావించెదను చూడుము. ౩౭

వానరరాజుఁడవగు సుగ్రీవుఁడా! మఱియు నీవు వాలితో ద్వంద్వయుద్ధము సేయునప్పుడు నిన్ను నేను గుర్తించులాగున నీవు ఏదేని గుర్తు ధరింపుము. ౩౮

లక్ష్మణుఁడా! వికసితంబును మంగళకరంబునగు నీగజపుష్పిం బెఱికి మహాత్ముఁడగు నీసుగ్రీవునికంఠమునందు వేయుము. ౩౯

అంత లక్ష్మణుఁడు పర్వతసానువునం బుట్టిన చక్కఁగాఁ బుష్పితంబగు నాగజపుష్పిని బెఱికి యాసుగ్రీవునికంఠంబున వేసెను. ౪౦

శ్రీమంతుఁడగు నాసుగ్రీవుండు కంఠమున నాగజపుష్పిలతను ధరించి యాకాశంబున నక్షత్రమాలికచేఁజుట్టఁబడిన సూర్యునిపగిది బ్రకాశించెను.

ఆసుగ్రీవుఁడు ఆగజపుష్పిలతచే బలాకాపఙ్క్తితో నొప్పుచున్న సంధ్యారాగసహితంబగు మేఘంబువలెఁ బ్రకాశించుచు రామునిమాటచే నమ్మకము నొందినవాఁడై రామునితోఁ గూడి వాలిచేఁ బాలింపఁబడుచున్న కిష్కింధాపురికిఁ బోయెను. ౪౧

ఇది పండ్రెండవసర్గము.

---

## పదుమూఁడవసర్గము.

ధర్మాత్ముఁడగు లక్ష్మణునియన్న రాముఁడు సుగ్రీవుని వెంటఁబెట్టుకొని వాలిపరాక్రమముచేఁబరిపాలితమగు కిష్కింధానగరమునకుఁ బోయెను. ౧

సముద్యమ్య మహచ్చాపం రామః కాఞ్చనభూషితమ్,
శరాం శ్చాదిత్యసఙ్కాశా న్గృహీత్వా రణసాధకాన్. ౨

అగ్రతస్తు యయౌ తస్య రాఘవస్య మహాత్మనః,
సుగ్రీవ స్సంహతగ్రీవో లక్ష్మణ శ్చ మహాబలః. 3

పృష్ఠతో హనుమా న్వీరో నళో నీల శ్చ వానరః,
తారశ్చైవ మహాతేజా హరియూథపయూథపః. ౪

తే వీక్షమాణా వృక్షాం శ్చ పుష్పభారావలమ్బినః,
ప్రసన్నామ్బువహా శ్చైవ సరిత స్సాగరంగమాః. ౫
కన్దరాణిచ శైలాం శ్చ నిర్దరాణి గుహా స్తథా,
శిఖరాణి చ ముఖ్యాని దరీశ్చ ప్రియదర్శనాః ౬
వైడూర్యవిమలైః పర్ణైః పద్మై శ్చాకోశకుట్మలైః,
శోభితాం త్సజలా న్మార్గే తటాకాం శ్చ వ్యలోకయన్. ౭
కారణ్డైః సారసై ర్హంసై ర్వఞ్జులై ర్జలకుక్కుటైః,
చక్రవాకై స్తథా చాన్యై శ్శకునై రుపనాదితాన్. ౮
మృదుశష్పాఙ్కురాహారా న్నిర్భయా న్వనగోచరాన్,
చరత స్సర్వతః పశ్యన్ స్థలీషు హరిణాన్ స్థితాన్. ౯
తటాకవైరిణశ్చాపి శుక్లదన్తవిభూషితాన్,
ఘోరా నేకచరా న్వన్యా న్ద్విరదా న్కూలఘాతినః. ౧౦
మత్తా న్గిరితటోత్కృష్టా న్పర్వతా నివ జఙ్గమాన్,
వారణా న్వారిదప్రఖ్యా న్మహీరేణుసముక్షితాన్. ౧౧
వనే వనచరాం శ్చాన్యా న్ఖేచరాం శ్చ విహఙ్గమాన్,

రాముఁడు కాంచనాలంకృతంబయిన మహాధనుస్సును మఱియు యుద్ధంబునఁ దప్పక శత్రుసంహారంబు సేయునట్టి సూర్యసమానకాంతిం బ్రజ్వరిల్లుచున్న దివ్యబాణంబులనుం గ్రహించి వెడలెను. ౨

మహాత్ముఁడగు రాముని యగ్రభాగంబున గజపుష్పిం దాల్చియుండుటచే దట్టమయిన కంఠముతో నొప్పుచున్న సుగ్రీవుఁడును మహాబలుఁడగు లక్ష్మణుఁడునుం బోయిరి. ౩

వీరుఁడగు హనుమంతుఁడును నలుఁడును నీలుఁడును మహాపరాక్రమశాలియు వానరయూధపులలో నుత్తముఁడునగుతారుఁడును రాముని వెనుకం బోయిరి. ౪

ఆరామాదులు పుష్పభారంబుచే వ్రేలుకాడుచుండు వృక్షంబులను నిర్మలంబులయిన జలంబులతో నొప్పుసముద్రగామినదులను సాధారణ బిలంబులను బర్వతంబులను బర్వతశిఖరంబులను బగిలిన ఱాళ్లను గుహలను బ్రియదర్శనంబులగు మహాగుహలనుం జూచుచుఁ బోయిరి. ౫,౬

ఆరామాదులు మార్గంబున వైడూర్యంబులవంటి దామరాకులతోను గొన్ని వికసితంబులై కొన్ని మొగ్గలై యలరుచున్నకమలంబులతోను నభిరామంబులయి మంచిజలంబులుగల్గి మధురంబుగాఁ గూయుచుండు కారండవసారసహంసవంజుల జలకుక్కుటచక్రవాకాదిపక్షులతో నొప్పుచుండు కొలంకులఁ జూచుచుఁ బోయిరి. ౭,౮

ఆరామాదులు మెత్తని లేఁతకసవు మెసవుచు నిర్భయంబులై వనభూములందంతటనుఁ జరించుచును నిలుచుండియు నున్న జింకలం జూచిరి. ౯

వారలు సుగ్రీవశవర్తులయి వనంబునఁ దటాకంబులఁ జెఱచునవియుఁ దెల్లనిరెండుదంతములచేఁ బ్రకాశించుచున్నవియు భయంకరాకారంబులును నొక్కటొక్కటిగా సంచరించునవియు అడవియందుఁ బుట్టినవియు నేటిగట్టుల విఱుగవేయునవియు మదించినవియుఁ బర్వతతటంబులఁ బొడుచుచున్నవియు సంచరించునట్టి పర్వతంబులో యనందగినట్టి పెద్దయాకృతిగల

పశ్యన్త స్త్వరితా జగ్ము స్సుగ్రీవవశవర్తినః. ౧౨

తేషాం తు గచ్ఛతాం తత్ర త్వరితం రఘునన్దనః,
ద్రుమషణ్డం వనం దృష్ట్వా రామ స్సుగ్రీవ మబ్రవీత్. ౧౩

ఏష మేఘ ఇవాకాశే వృక్షషణ్డః ప్రకాశతే,
మేఘసఙ్ఘాతవిపులః పర్యన్తకదళీవృతః. ౧౪

కి మేతత్ జ్ఞాతు మిచ్ఛామి సఖే! కౌతూహలం హి మే,
కౌతూహలాపనయనం కర్తు మిచ్ఛా మ్యహం త్వయా. ౧౫

తస్యతద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
గచ్ఛన్నే వాచచక్షేఽథ సుగ్రీవ స్తన్మహద్వనమ్. ౧౬
ఏత ద్రాఘవ! విస్తీర్ణ మాశ్రమం శ్రమనాశనమ్,
ఉద్యానవనసంపన్నం స్వాదుమూలఫలోదకమ్. ౧౭

అత్ర సప్తజనా నామ మునయ స్సంశ్రితవ్రతాః,
సప్తై వాస న్నధశ్శీర్షా నియతం జలశాయినః. ౧౮

సప్తరాత్రకృతాహారా వాయునా వనవాసినః,
దివం వర్షశతై ర్యాతా స్సప్తభి స్సకళేబరాః. ౧౯

తేషా మేవం ప్రభావానాం ద్రుమప్రాకారసంవృతః,
ఆశ్రమ స్సుదురాధర్ష అపి సేన్ద్రై స్సురాసురైః. ౨౦

వియు మేఘంబులుంబోలె నల్లనివియు నేలదుమ్ముతోఁ గప్పఁబడియున్నవియు నగు నేనుఁగులను, మఱియు నితరములయిన వనంబునం దిరుగుమృగంబులను నాకాశంబునం దిరుగుపక్షులను జూచుచు వేగంబునం బోయిరి. ౧౦-౧౨

అచ్చట వారలందఱు వేగంబునం బోవుచుండునప్పుడు రాముఁడు వృక్షసమూహంబుచే నిబిడమయిన యొకవనముఁ జూచి సుగ్రీవునితో నిట్లనియె. ౧౩

మేఘసమూహమువలె విశాలంబును జుట్టును గొనలయం దరఁటిచెట్లతో నొప్పుచున్నదియు నగు నీవృక్షసమూహము ఆకాశంబుననుండు మేఘంబువలెఁ బ్రకాశింపుచున్నది. ౧౪

మిత్రుఁడా! ఇదేమి? దీనిఁదెలిసికొనవలెనని నాకుఁ గోరికగలిగినది; నీవలన నాకోరిక దీర్చుకొనఁ గోరుచున్నాను. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౫

సుగ్రీవుఁడు మహాత్ముఁడగు రాముని మాటనువిని నడిచిపోవుచునే యమ్మహావనంబు గుఱించిన వృత్తాంతముఁ జెప్ప నారంభించెను. ౧౬

రాముఁడా! ఇది మున్ను విశాలమును జల్లగానుండుటచేత శ్రమనివారణము సేయు సుపవనముతోఁ గూడినదియు మంచిరుచ్యములయిన కందమూలఫలంబులును జలంబునుఁ గలదియు నగు నొకఋష్యాశ్రమము. ౧౭

ఇయ్యాశ్రమమునందు మిక్కిలియుఁ గఠినమయిన వ్రతం బవలంబించి తలక్రిందుగా జలంబుల నిలుచుండి యత్యుగ్రముగాఁ దపముసేయుచున్న సప్తజనులను మునీంద్రులు ఏడ్వురు నివసించియుండిరి. ౧౮

ఆ సప్తజనమహర్షులు ఇవ్వనంబున ఏడురాత్రు లొకమాఱు వాయువు నాహారంబుగాఁ గొనుచు ఏడునూఱులవర్షంబులు తపంబుగావించి సశరీరంబుగా స్వర్గంబునొందిరి. ౧౯

ఇట్లు మహాప్రభావులగు నాసప్తజనమహామునులయొక్క వృక్షమయమయిన ప్రాకారముచే సంవృతమయినయియ్యాశ్రమము ఇంద్రాదిదేవతలకుఁ గూడ, ఎంతమాత్రముఁ బ్రవేశింప నలవిగాకున్నది. ౨౦

పక్షిణో వర్జయ న్త్యేత త్తథాఽన్యే వనచారిణః,
విశన్తి మోహా ద్యేఽప్యత్ర నివర్తన్తే న తే పునః. ౨౧

విభూషణరవా స్తత్ర శ్రూయన్తే సకలాక్షరాః,
తూర్యగీతస్వరా శ్చాత్ర గన్ధో దివ్యశ్చ రాఘవ!. ౨౨

త్రేతాగ్నయోఽపి దీప్యన్తే ధూమో హ్యత్ర ప్రకాశతే,
వేష్టయ న్నివ వృక్షాగ్రా న్కపోతాఙ్గారుణో ఘనః. ౨౩

ఏతే వృక్షాః ప్రకాశన్తే ధూమసంసక్తమస్తకాః,
మేఘజాలప్రతిచ్ఛన్నా వైడూర్యగిరయో యథా. ౨౪

కురు ప్రణామం ధర్మాత్మం! స్తాం త్వముద్దిశ్య రాఘవ!,
లక్ష్మణేన సహభ్రాత్రా ప్రయత స్సంయతాఞ్జలిః. ౨౫

ప్రణమన్తి హి యే తేషాం మునీనాం భావితాత్మనామ్,
న తేషా మశుభం కించి చ్ఛరీరే రామ! దృశ్యతే. ౨౬

తతో రామ స్సహ భ్రాత్రా లక్ష్మణేన కృతాఞ్జలిః,
సముద్దిశ్య మహాత్మాన స్తా నృషీ నభ్యవాదయత్. ౨౭
అభివాద్య తు ధర్మాత్మా రామో భ్రాతా చ లక్ష్మణః,
సుగ్రీవో వానరా శ్చైవ జగ్ము స్సంహృష్టమానసాః. ౨౮

మనుష్యులు సరి యియ్యాశ్రమమునకుఁ బ్రవేశించుటకే నేలేదుగదా! పక్షులును మఱియు నితరములయిన యడవిజంతువులును సయితము ఇయ్యాశ్రమములోని కెంతమాత్రము పోవు; అట్లు తెలియక ఏదేనిపోవునేని అది యెంతమాత్ర మటనుండి మరలివచ్చుటలేదు. ౨౧

రాముఁడా! ఆయ్యాశ్రమమునందు నాట్యములు సేయు నప్సరసలయాభరణధ్వనులును అవ్యక్తమధురములయిన యక్షరములతోఁ గూడ గీతధ్వనులును వాద్యధ్వనులును ఎల్లప్పుడును వినవచ్చుచుండును. మఱియు దివ్యగంధంబును గుబాళింపుచుండును. ౨౨

ఈయాశ్రమమునందు ఎల్లప్పుడును త్రేతాగ్నులు వెలుఁగుచుండును. అందుకు నిదర్శనము దట్టముగా వృక్షములశిఖరములను బరివేష్టించుచుఁ బావురముల దేహమువలె నెఱ్ఱనైన నీ ధూమము కాన్పించుచున్నదిగదా! ౨౩

ఈవృక్షములు శిఖరములందు ధూమముచేఁ గప్పఁబడియుండుటవలన మేఘసమూహములచే నాచ్ఛాదితములయిన వైడూర్యపర్వతములుంబోలె రాజిల్లుచున్నవి. ౨౪

ధర్మాత్ముఁడవయిన రాముఁడా! నీవును లక్ష్మణుఁడును బ్రయతచిత్తులరై చేతులుమోడ్చి ఆసప్తజనమహర్షుల నుద్దేశించి నమస్కారము గావింపుఁడు. ౨౫

రాముఁడా! ఆత్మవేత్తలగు నమ్మహామునులకు ఎవ్వరు నమస్కారము సేయుదురో అట్టివారిదేహమునందు వ్యాధి మొదలయినచెడుపు ఎంతమాత్రమును గలుగదు. కావున నమస్కరింపుఁడు. అని సుగ్రీవుఁడు రామునకుఁ జెప్పెను. ౨౬

అంత రాముఁడు తమ్ముఁడు లక్ష్మణునితోఁగూడ చేమోడ్పుగీలించి మహానుభావులగు నమ్మర్షుల నుద్దేశించి నమస్కారముచేసెను. ౨౭

అట్లు నమస్కరించి ధర్మాత్ముఁడగు రాముఁడును దమ్ముఁడు లక్ష్మణుఁడును సుగ్రీవుఁడును దక్కఁగల వానరులును బరమసంతోషంబునఁబోయిరి. ౨౮

తే గత్వా దూర మధ్వానం తస్మా త్సప్తజనా శ్రమాత్,
దదృశు స్తాం దురాధర్షాం కిష్కిన్ధాం వాలిపాలితామ్. ౨౯

తత స్తు రామానుజరామవానరాః
ప్రగృహ్య శస్త్రా ణ్యుదితాగ్ర్య తేజసః,
పురీం సురేశాత్మజవీర్యపాలితాం
వధాయ శత్రోః పున రాగతా స్సహ. 30

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రయోదశ స్సర్గః ౧౩.

---

## చతుర్దశ స్సర్గః.

సర్వే తే త్వరితం గత్వా కిష్కిన్ధాం వాలిపాలితామ్,
వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠ న్గహనే వనే ౧

విచార్య సర్వతో దృష్టిం కాననే కాననప్రియః,
సుగ్రీవో విపులగ్రీవః క్రోధ మాహారయ ద్భృశమ్. ౨

తత స్స నినదం ఘోరంకృత్వా యుద్ధాయ చాహ్వయత్,
పరివారైః పరివృతో నాదై ర్భిన్ద న్నివాంబరమ్ 3
గర్జన్నివ మహామేఘో వాయువేగపురస్సరః,
అథ బాలార్కసదృశో దృప్తసింహగతి స్తదా. ౪
దృష్ట్వా రామం క్రియాదక్షం సుగ్రీవో వాక్యమబ్రవీత్,

హరివాగురయా వ్యాప్తాం తప్తకాఞ్చనతోరణామ్. ౫
ప్రాప్తా స్మ ధ్వజయన్త్రాఢ్యాం కిష్కిన్ధాం వాలినః పురీమ్,

వారలు ఆ సప్తజనమహర్షుల యాశ్రమమునుండి బహుదూరము నడచి వాలిచేఁ బాలింపఁబడుచున్నదియు శత్రువులకుఁ దేఱిచూడ నలవిగానిదియు నగు కిష్కింధానగరముం జూచిరి. ౨౯

అంత రాముఁడును లక్ష్మణుఁడును సుగ్రీవుఁడు మున్నగువానరులును అసమానంబగు తేజంబునం గ్రాలుచు ఆయుధంబులు ధరించి శత్రువధార్థమయి యందఱు నేకకాలమున దేవేంద్రపుత్రుఁడగు వాలిపరాక్రమంబుచేతం బరిపాలితంబగు కిష్కింధాపురిం జేరిరి. ౩౦

ఇది పదుమూఁడవసర్గము.

---

## పదునాల్గవసర్గము.

అట్లు రాముఁడు మున్నగువారలందఱు శీఘ్రంబుగా వాలిపాలితంబగు కిష్కింధంజేరి దుర్గమంబగు వనంబునందు వృక్షంబులమఱుఁగున డాఁగియుండిరి. ౧

అరణ్యప్రియుఁడును విశాలమయిన కంఠముగలవాఁడు నగుసుగ్రీవుఁడు అడవియందంతటను నాలుగుప్రక్కలం గలయఁజూచి మిక్కిలియుఁ గ్రోధము నవలంబించెను. ౨

అంత నాసుగ్రీవుఁడు హనుమంతుఁడు మున్నగుపరిజనులచేఁ బరివేష్టితుఁడై వాయువేగపురస్కృతంబై గర్జించు మహామేఘంబుకైవడి నాకాశంబు భేదిల్లునట్లు సింహనాదంబులు సేయుచు వాలిని యుద్ధమునకుం బిలిచెను.

అంత నప్పుడు బాలసూర్యుఁడుంబోలె వెలుంగుచున్నవాఁడును గర్వితంబగుసింహంబు గమనమువంటి గమనంబుగలవాఁడునగు సుగ్రీవుఁడు ఎట్టికార్యంబునందేని సమర్థుఁడగు రాముంజూచి యిట్లని పలికెను. ౪

వల మృగంబులం దగిలించునట్లు శత్రువులంబట్టి వధించునట్టి వానరులచే నిండియుండునదియు నుత్తమమయిన బంగారుతోఁ గట్టఁబడిన పుర

ప్రతిజ్ఞా యా త్వయా వీర! కృతా వాలివధే పురా. ౬
సఫలాం తాం కురు క్షిప్రం లతాం కాల ఇ వాగతః,

ఏవము క్తస్తు ధర్మాత్మా సుగ్రీవేణ స రాఘవః. ౭
త మ థోవాచ సుగ్రీవం వచనం శత్రుసూదనః,
కృతాభిజ్ఞానచిహ్న స్త్వ మనయా గజసాహ్వయా. ౮
లక్ష్మణేన సముత్పాట్య యైషా కణ్ఠే కృతా తవ,

శోభసే హ్యధికం వీర! లతయా కణ్ఠస క్తయా. ౯
విపరీత ఇ వాకాశే సూర్యో నక్షత్రమాలయా,

అద్య వాలిసముత్థం తే భయం వైరం చ వానర!. ౧౦
ఏకే నాహం ప్రమోక్ష్యామి బాణమోక్షేణ సంయుగే,

మమ దర్శయ సుగ్రీవ! వైరిణం భ్రాతృరూపిణమ్. ౧౧
వాలీ వినిహతో యావ ద్వనే పాంసుషు వేష్టతే,

యది దృష్టిపథం ప్రాప్తో జీవం స్స న నివ ర్తతే. ౧౨
తతో దోషేణ మాగచ్ఛే త్సద్యో గర్హే చ్చ మా భవాన్,

ప్రత్యక్షం స ప్త తే సాలా మయా బాణేన దారితాః. ౧౩
తేనావేహి బలే నాద్య వాలినం నిహతం మయా,

ద్వారంబులుగలదియు ధ్వజయంత్రాలంకృతంబునగు వాలిపట్టణమయిన కిష్కింధానగరంబునకు వచ్చినాముగదా! ౫

పరాక్రమవంతుఁడవగు రాముఁడా! నీవు మున్ను వాలిని వధించెదనని యే ప్రతిజ్ఞంజేసియున్నావో ఫలకాలము ప్రాప్తించినప్పుడు అది తప్పక లతను ఫలింపఁజేయునట్లు, ఆప్రతిజ్ఞను శీఘ్రముగా నెఱవేర్పుము. అని సుగ్రీవుఁడు రామునికిం జెప్పెను. ౬

ధర్మాత్ముఁడును శత్రువధంబు సేయువాఁడునగు నారాముఁడు సుగ్రీవుఁడు చెప్పినది విని, యాసుగ్రీవునింజూచి యిట్లని చెప్పెను. ౭

లక్ష్మణుఁడు గుఱుతుకొఱకు ఈగజపుష్పీలతను బెఱికి నీ మెడను వేసియున్నాఁడు కావున నీవు ఈగజపుష్పీలతయను చిహ్నముచేత సులభముగా గుర్తింపఁదగియున్నావు ౮

పరాక్రమవంతుఁడవగు సుగ్రీవుఁడా! నీవుకంఠంబున గజపుష్పీలతం దాల్చియుండుటచేత ఆకాశంబున నక్షత్రమాలికచేఁ బరివేష్టితుఁడగు చంద్రునిభంగి నెంతయుఁ బ్రకాశించుచున్నావు ౯

సుగ్రీవుఁడా! నీకు వాలివలనం గలిగిన భయంబున అతనికి నీయందుం గలవైరంబును, నే నిప్పుడు యుద్ధంబునందు ఒక్కటేబాణంబుచేఁ దీర్చివుచ్చెదను. భయపడకుము ౧౦

సుగ్రీవుఁడా! తోడంబుట్టువు రూపంబుతోనున్న నీశత్రువును నాకుం జూపుము; నే నతనిం జూచుటయే యడ్డి; చూచినంతలోనే యతఁడు హతుఁడై ఇవ్వనంబున నే దుమ్మునం బొరలఁగలఁడు ౧౧

ఆవాలి నాయెదుటం బడినపిమ్మట, అతఁడు మరలఁ బ్రాణముతోఁ బోవకుండునట్లు, వాని వధించిపుత్తునేని యిప్పుడు నీవు నన్ను నిర్దోషిగాఁ దలిసికొని నిందింపకుండుము. ౧౨

నేను నీప్రత్యక్షమునందు ఏబలముచేత సప్తసాలంబుల నొక్కబాణంబుచే భేదించినానో ఇప్పుడు ఆబలంబుచేతనే వాలిని వధించితినని యెఱుంగుము. ౧౩

అనృతం నోక్తపూర్వం మే వీర! కృచ్ఛ్రేఽపి తిష్ఠతా. ౧౪
ధర్మలోభపరీతేన నచ వక్ష్యే కథంచన,

సఫలాం చ కరిష్యామి ప్రతిజ్ఞాం జహి సంభ్రమమ్. ౧౫
ప్రసూతం కలమం క్షేత్రే వర్షేణేవ శతక్రతుః,

తదాహ్వాననిమిత్తం త్వం వాలినో హేమమాలినః. ౧౬
సుగ్రీవ! కురు తం శబ్దం నిష్పతేద్యేన వానరః,

జితకాశీ బలశ్లాఘీ త్వయా చాధర్షితః పురా. ౧౭
నిష్పతిష్యత్యసఙ్గేన వాలీ స ప్రియసంయుగః,

రిపూణాం ధర్షణం శూరా మర్షయన్తి న సంయుగే. ౧౮
జానన్తస్తు స్వకం వీర్యం స్త్రీసమక్షం విశేషతః,

సతు రామవచశ్శ్రుత్వా సుగ్రీవో హేమపిఙ్గళః. ౧౯
ననర్ద క్రూరనాదేన వినిర్భిన్దన్నివామ్బరమ్,
తస్య శబ్దేన విత్రస్తా గావో యాన్తి హతప్రభాః. ౨౦
రాజదోషపరామృష్టాః కులస్త్రియ ఇవాకులాః,

ద్రవన్తి చ మృగాశ్శీఘ్రం భగ్నా ఇవ రణే హయాః. ౨౧
పతన్తి చ ఖగా భూమౌ క్షీణపుణ్యా ఇవ గ్రహాః.

వీరుఁడవగు సుగ్రీవుఁడా! నేను ఎంత కష్టంబు నొందియుండు నప్పుడును ధర్మంబు చెడు నను భయముచేత ఇదివఱ కెప్పుడును అనృతమాడి యుండలేదు; ఇంకను ఎంతకష్టంబువచ్చినను ఆడఁబోవునదిలేదు. ౧౪

భూమిపైఁ బెరిగిన పైరును దేవేంద్రుఁడు వర్షముచే ఫలింపఁజేయు నట్లు నేను వాలిని వధించెదనని చేసిన ప్రతిజ్ఞను బరాక్రమంబుచే సఫలము గావించెదను; ఎంతమాత్రము ప్రతిజ్ఞ తప్పను. సంశయంబు విడువుము. ౧౫

సుగ్రీవుఁడా! అందువలన నీ విప్పుడు కాంచనమాలాధరుఁడగు వాలిం బిలుచుటనిమిత్తమై ఏధ్వని కతఁడు పఱతెంచునో అట్టినాదంబు గావింపుము. ౧౬

ఎల్లప్పుడును జయముచేతనే యొప్పుచుండువాఁడును బలగర్వితుఁడును యుద్ధప్రియుఁడునగు వాలి యిదివఱ కెప్పుడును భయంబునం బొఱు చుండినట్టి నీ విప్పు డెదిరింపఁగానే యెంతమాత్రము జాగు సేయక యుద్ధంబునకు రాఁగలఁడు. ౧౭

శూరులగు వారలు యుద్ధంబున శత్రువులు సేయుతిరస్కారంబు సహింపరు; అందును శత్రువుల దానికంటెఁ దమపరాక్రమ మధికమని యెఱిఁగినవారు, మఱియు స్త్రీలయెదుటను ఎంతమాత్రము సహింపరు. అని రాముఁడు సుగ్రీవునికి చెప్పెను. ౧౮

బంగారముబోలెఁ బింగళవర్ణుఁడగు నాసుగ్రీవుఁడు రాముఁడు చెప్పినదివిని ఆకాశంబు పగులునట్లు భయంకరనాదంబున నఱచెను. ౧౯

సుగ్రీవునిధ్వనికి, గోవులు భయంబునొంది రాజు ధర్మాధర్మంబులు చక్కఁగా విచారింపకపోవుటచేత బలవంతులగు పరపురుషులు (లేక, రాజే) దుష్టబుద్ధిని యథేచ్ఛగా కామవశంబున బలాత్కరింపఁజేయఁబడిలేక దిగులొందు కులస్త్రీలుఁబోలె తేజంబువీడి వెలవెలఁబోయినవి. ౨౦

జింకలు యుద్ధంబున నంగవైకల్యంబునొందిన గుఱ్ఱంబులపగిది ఎంతమాత్రము శీఘ్రముగాఁ బరుగెత్తఁజాలవైనవి. ఆకాశంబునందు నక్షత్ర

తత స్స జీమూతగణప్రణాదో
నాదం వ్యముఞ్చ త్త్వరయా ప్రతీతః,
సూర్యాత్మజ శ్శౌర్యవివృద్ధతేజా
స్సరిత్పతి ర్వాఽనిలచఞ్చలోర్మిః. ౨౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుర్దశ స్సర్గః. ౧౪.

## పఞ్చదశ స్సర్గః.

అథ తస్య నినాదం తు సుగ్రీవస్య మహాత్మనః,
శుశ్రావా న్తఃపురగతో వాలీ భ్రాతు రమర్షణః. ౧

శ్రుత్వాతు తస్య నినదం సర్వభూతప్రకమ్పనమ్,
మద శ్చైకపదే నష్టః క్రోధ శ్చాపతితో మహాన్. ౨

సతు రోషపరీతాఙ్గో వాలీ సన్ధ్యాతపప్రభః,
ఉపరక్త ఇ వాదిత్య స్సద్యో నిష్ప్రభతాం గతః. 3

వాలీదంష్ట్రాకరాళ స్తు క్రోధా ద్దీప్తాగ్నిసన్నిభః,
భాత్యుత్పతితపద్మస్తు సమృణాళ ఇవ హ్రదః. ౪

శబ్దం దుర్మర్షణం శ్రుత్వా నిష్పపాత తతో హరిః,
వేగేన చరణన్యాసై ర్దారయ న్నివ మేదినీమ్. ౫

రూపంబున వెలుఁగుచుండు పుణ్యపురుషులు తాము చేసికొన్న సుకృతం బంతయుఁ దఱిగినపిదప భూమింబడునట్లు పక్షులు నేలం గూలినవి. ౨౧

అంత మేఘంబులు సమూహముగాఁజేరి గర్జించినచో ఎంతధ్వని గలుగునో అంతటి నాదంబుగల సుప్రసిద్ధుఁడయిన సూర్యపుత్రుఁడు సుగ్రీవుఁడు శౌర్యాతిశయంబున నంతకంతకు వృద్ధినొందుచున్న తేజంబుచే వెలుఁగుచు వాయువేగంబునంజేసి యధికముగాఁ జంచలతరంగంబులుగల సముద్రంబుభంగి వేగంబున సింహనాదంబు గావించెను. ౨౨

ఇది పదునాల్గవసర్గము.

---

## పదునైదవసర్గము.

అంత సహనములేనివాఁడైన యంతఃపురంబున నున్నవాలి తనతమ్ముఁడు సుగ్రీవుఁడు మున్ను తనకు భయపడుచున్నవాఁడయ్యు నిప్పుడు రామావలంబంబునమహాధైర్యంబునొంది గావించిన సింహనాదంబును వినెను. ౧

సమస్తభూతంబులకును భయోత్పాదకంబయిన సుగ్రీవుని యమ్మహాధ్వనిని విన్నంతనే వాలి క్షణమందే కామవిషయకమయిన మత్తతయంతయు నశించుటయేగాక మహాకోపంబునుఁ గలిగినది. ౨

మహాకోపంబుచే దేహంబంతయు నెఱ్ఱనగుటంజేసి సంధ్యాతపంబుకరణి నొప్పుచు నవ్వాలి యాక్షణంబుననే రాహుగ్రస్తుఁడగు సూర్యునిభంగిఁ గాంతిహీనుఁడయ్యెను. ౩

కోపంబున మండుచున్న నిప్పువలె జ్వలించుచుఁ గోఱలచే నొప్పుమిట్టయయిన దేహముతో నున్న యవ్వాలి గజంబులుసొచ్చి కలంచి కమలంబు లన్నియుం బెఱికివేయుటవలన బురదచే నెఱ్ఱనై వెలికిఁ దేలినమృణాళంబులతోఁడఁ గూడినతామరకొలంకువోలెఁ బ్రకాశించెను. ౪

ఘోరున కంతమాత్రము సహింపరాని సుగ్రీవసింహనాదంబు విన్నంతనే వాలి వేగంబున భూమిపగులునట్లు పాదఘట్టనంబులతో యుద్ధంబునకు వెడలెను. ౫

తం తు తారా పరిష్వజ్య స్నేహా ద్దర్శితసౌహృదా,
ఉవాచ త్రస్తసంభ్రాన్తా హితోదర్క మిదం వచః. ౬

సాధు క్రోధ మిమం వీర! నదీవేగ మి వాగతమ్,
శయనా దుత్థితః కాల్యం త్యజ భుక్తా మివ స్రజమ్. ౭

కాల్య మేతేన సంగ్రామం కరిష్యసి చ వానర!,
వీర! తే శత్రుబాహుళ్యం ఫల్గుతా వాన విద్యతే. ౮

సహసా తవ నిష్క్రామో మమ తావ న్న రోచతే,
శ్రూయతాం చాభిధాస్యామి యన్నిమిత్తం నివార్యసే. ౯

పూర్వ మాపతితః క్రోధా త్స త్వా మాహ్వయతే యుధి,
నిష్పత్య చ నిర స్త స్తే హన్యమానో దిశో గతః. ౧౦

త్వయా తస్య నిరస్తస్య పీడితస్య విశేషతః,
ఇ హైత్య పున రాహ్వానం శఙ్కాం జనయతీవ మే. ౧౧

దర్ప శ్చ వ్యవసాయ శ్చ యాదృశ స్తస్య నర్దతః,
నినాద శ్చాపి సంరమ్భో నై త దల్పం హి కారణమ్. ౧౨

నాసహాయ మహం మన్యే సుగ్రీవం త మిహాగతమ్,

తార అప్పుడు భయంబున దిగ్గునలేచి స్నేహంబున వాలిం గవుఁగిలించికొని తనమనసునందలి స్నేహంబు గనుపడునట్లు హితము గలిగించునట్టి యీమాటం జెప్పెను. ౬

పరాక్రమశాలివగు వాలీ! నదీప్రవాహమువలె నెదురులేక పెరిఁగిన యీకోపమును ప్రాతఃకాలమున శయనంబునుండి లేఁచినవాఁడు భుక్తమయిన శిరమునందలి పుష్పమాలికను బాఱవైచునట్లు నిశ్చేష్టముగావదలుము.

నీ కీసుగ్రీవునితో యుద్ధమే చేయవలెనని యిష్టముండెనేని రేపు ప్రాతఃకాలమునం దీతనితోఁ బోరుము. వీరుఁడవగు నీవు శత్రువునికన్నం దక్కువయినవాఁడవు కావు. శత్రుఁడును నీకన్న నధికుఁడు గాఁడు. కావున నిప్పుడే యావసర మేమి ? ౮

నీ విల్లు కొంచెమేని యాలోచింపక తటాలున యుద్ధంబునకు వెడలుట నాకెంతమాత్రము యుక్తముగాఁ దోఁచలేదు. వినిమిత్తంబువలన నేను వలదని చెప్పుచున్నానో ఆకారణంబునుఁగూడఁ గావలసినఁ జెప్పెదను వినుము. ౯

పూర్వ మెవ్వఁడు నీతో యుద్ధముసేయవచ్చి నీచేఁ దఱుమఁబడి దెబ్బలుదిని దిక్కులకుం బాఱెనో ఆట్టి సుగ్రీవుఁడు ఇప్పుడు మరలఁ గ్రోధం బవలంబించి నిన్ను యుద్ధంబునకుఁ బిలుచుచున్నాఁడు. ౧౦

నీచేత నోటుపడినదిమాత్రమేగాక దెబ్బలు దినియుం బాఱిపోయిన యీసుగ్రీవుఁడు ఇచ్చటికి మరలవచ్చి నిన్ను యుద్ధంబునకుఁ బిలుచుటఁ జూడఁగా ఇతని కేమైన నధికమయిన సహాయసంపత్తి కలిగియుండునని నాకెంతయు సందేహము గలుగుచున్నది. ౧౧

ఇంతియగాక యీసుగ్రీవుఁడు గర్జించునపుడు నీతనిదర్పంబును బ్రయత్నంబును నాదంబును ఆటోపంబునుం జూడఁగా దీనికంతయు నేదో గొప్పకారణ ముండునని తోఁచుచున్నది. ౧౨

ఆటువంటి సుగ్రీవుఁ డిప్పు డిచ్చటికి సహాయబలములేక యెంతమా

అవష్టబ్ధసహాయశ్చ యమాశ్రిత్యైష గర్జతి. ౧౩

ప్రకృత్యా నిపుణ శ్చైవ బుద్ధిమాం శ్చైవ వానరః,
అపరీక్షితవీర్యేణ సుగ్రీవ స్సహ నైష్యతి. ౧౪

పూర్వ మేవ మయా వీర! శ్రుతం కథయతో వచః,
అఙ్గదస్య కుమారస్య వక్ష్యామి త్వా హితం వచః. ౧౫

అఙ్గద స్తు కుమారోఽయం వనా న్త ముపనిర్గతః,
ప్రవృత్తి స్తేన కథితా చారై రాప్తై ర్నివేదితా. ౧౬

అయోధ్యాధిపతేః పుత్త్రౌ శూరౌ సమరదుర్జయౌ,
ఇక్ష్వాకూణాం కులే జాతౌ ప్రథితౌ రామలక్ష్మణౌ. ౧౭
సుగ్రీవప్రియకామార్థం ప్రాప్తౌ తత్ర దురాసదౌ,

తవ భ్రాతు ర్హి విఖ్యాత స్సహాయో రణకర్కశః. ౧౮
రామః పరబలామర్దీ యుగాన్తాగ్ని రి వోత్థితః,

త్రము రాలేదని నాయభిప్రాయము. ఇతఁడు ఎవరినో గొప్పవారి నాశ్రయించియే యిచ్చటికివచ్చి గర్జించుచున్నాఁడుగాని యూరక కాదు. ౧౩

“సుగ్రీవునకు సహాయుఁడేయుండుఁగాక. అతఁడేని ఎట్టివారికిని దుర్జయుఁడనగు నన్నేమి సేయఁగలఁడు? వానిని వధించిపుత్తును” అని యనుకొందువేమో; అట్లు తలంపవలదు. సుగ్రీవుఁడు స్వభావంబుననే మిగుల సమర్థుండును బుద్ధిమంతుఁడును గావునఁ దనకు సాహాయ్యము గావించువాని పరాక్రమమును జక్కఁగాఁ బరీక్షింపకయే యతనివెంటరాఁడు. నిదర్శనపూర్వకముగా నీపరాక్రమముకన్న నతనిది యెక్కువగాఁ దెలిసికొనియే యతని వెంటఁ వచ్చియున్నాఁడు, ౧౪

వీరుఁడా! నే నూహించుటమాత్రమేకాదు. నేను మున్నే కుమారుఁడగు నంగదునివలన వినియున్నాను. హితకరంబైన యీమాటను నీకుఁ జెప్పెదను వినుము. ౧౫

కుమారుఁడగు నంగదుఁడు విహారార్థము వనమధ్యమునకుఁ బోయివచ్చినాఁడు; అచ్చట ఆప్తులగు చారులవలన విన్నసంగతి నాతఁడు నాతోఁ జెప్పినాఁడు. ౧౬

శూరులును యుద్ధంబున నెదురులేనివారలును ఇక్ష్వాకువంశమువం బుట్టినవారలును యశస్సంపన్నులును తేజస్సుచే నెట్టివారికిని సమీపించుటకేని యలవిగాని వారలునగు అయోధ్యాధీశ్వరుఁడైన దశరథమహారాజు కొడుకులు రాముఁడును లక్ష్మణుఁడు ననువార లిర్వురు మహాపురుషులు సుగ్రీవునికి సాహాయ్యము సేయుటకై ఋశ్యమూకపర్వతమునందు వచ్చియున్నారు. అని యంగదుఁడు చెప్పినాఁడు. ౧౭

నీ తమ్మునికి సాహాయ్యము సేయవచ్చినరాముఁడు ఇదివఱకే విరాధఖరదూషణకబంధాదులను వధించి ప్రఖ్యాతినొందినవాఁడు. యుద్ధంబున మిక్కిలియు సమర్థుఁడు. శత్రుసైన్యంబుల మర్దించువాఁడు. ఎదురులేక ప్రజ్వలించు ప్రళయకాలాగ్నిహోత్రునివంటివాఁడు. ౧౮

నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరాగతిః. ౧౯
ఆర్తానాం సంశ్రయ శ్చైవ యశస శ్చైకభాజనమ్,

జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః. ౨౦
ధాతూనా మివ శైలేన్ద్రో గుణానా మాకరో మహాన్,

తత్క్షమం నవిరోధ స్తే సహ తేన మహాత్మనా. ౨౧
దుర్జయే నాప్రమేయేన రామేణ రణకర్మసు,

శూర! వక్ష్యామి తే కించి న్న చేచ్ఛామ్యభ్యసూయితుమ్. ౨౨
శ్రూయతాం క్రియతాం చైవ తవ వక్ష్యామి యద్ధితమ్,

యౌవరాజ్యేన సుగ్రీవం తూర్ణం సాధ్వభిషేచయ. ౨౩
విగ్రహం మా కృథా వీర! భ్రాత్రా రాజ! న్బలీయసా,

అహం హి తే క్షమం మన్యే తేన రామేణ సౌహృదమ్. ౨౪
సుగ్రీవేణ చ సంప్రీతిం వైర ముత్సృజ్య దూరతః,

లాలనీయో హి తే భ్రాతా యవీయా నేష వానరః. ౨౫
తత్ర వా స న్నిహస్థో వా సర్వథా బన్ధు రేవ తే,

నహి తేన సమం బన్ధుం భువి పశ్యామి కంచన. ౨౬

రాముఁడు పక్షులకు నివాసవృక్షమువలె సత్పురుషులకుఁ దాపమువారించి సమస్తఫలముల నొసంగువాఁడు; ఆశ్రితులకుఁ బరమగతి; ఆర్తులగువారికి సమస్తాపదలనుం బోఁగొట్టి యానందము గల్గించువాఁడు; రామునంతటి కీర్తిమంతుఁ డెవ్వఁడును లేఁడు. ౧౯

ఆరాముఁడు లోకశాస్త్రంబులు చక్కఁగాఁ దెలిసినవాఁడు. (శాస్త్రజన్యజ్ఞానంబును దాని యనుభవంబునుం గలవాఁడు). తండ్రియాజ్ఞ నొంచెమేని జవదాఁటఁడు; హిమవత్పర్వతము గైరికధాతువులకుం బోలె సమస్తసద్గుణంబులకును ఉత్పత్తిస్థానము. ౨౦

ఆకారణమువలన యుద్ధమునందు దుర్జయుఁడును ఇంతవాఁడని కొలఁతపెట్ట నలవిగానివాఁడును మహానుభావుఁడునగు నారామునితోటివిరోధము నీ కింతమాత్రము యుక్తము కాదు. ౨౧

శూరుఁడా! నీ కొకమాటఁ జెప్పెదను; నీయందు దోషము నారోపింపవలెననిగాదు; (నీవు వానియందు దోషము నారోపింపవలదు) విని యాప్రకారమాచరింపుము; నీకు మేలుగలిగించువిధముఁ జెప్పెదను. ౨౨

వీరుఁడవగు వాలీ! శీఘ్రముగా సుగ్రీవునికి యౌవరాజ్యంబున నెప్పగాఁ బట్టాభిషేకము గావింపుము; నీకన్న బలిష్ఠుఁడై యున్న నీతమ్మునితో యుద్ధంబుఁ బెట్టుకొనకుము. ౨౩

ఎందువలన ననఁగా ప్రకృతస్థితినిబట్టి యాలోచింపఁగా రామునితో సఖ్యము సేయుటయు, సుగ్రీవునితోను వైరంబు దూరమున వదలి స్నేహము గావించుటయు నీకు యుక్తముగా నాకుఁ దోఁచుచున్నది. ౨౪

నీతమ్ముఁడయిన యీసుగ్రీవుఁడు నీ కింతయు లాలనసేయఁదగినవాఁడేకదా! ఈతఁడు ఋశ్యమూకపర్వతంబున నున్ననేమి కిష్కింధలో మనయింట నున్ననేమి? యెట్లయినను నీబంధువేకాని యన్యుఁడు కాఁడుగదా! ౨౫

నీకు సుగ్రీవునివంటిబంధువు భూమియం దెచ్చటను మఱియొకఁ డగ

గర్జతోఽస్యచ సంరమ్భం భ్రాతు శ్శత్రో ర్విశేషతః,
మర్షయిష్యా మ్యహం కేన కారణేన వరాననే!. ౨

అధర్షితానాం శూరాణాం సమరే ష్వనివర్తినామ్,
ధర్షణామర్షణం భీరు! మరణా దతిరిచ్యతే. 3

సోఢుం నచ సమర్థోఽహం యుద్ధకామస్య సంయుగే,
సుగ్రీవస్యచ సంరమ్భం హీనగ్రీవస్య గర్జతః. ౪

న చ కార్యో విషాద స్తే రాఘవం ప్రతిమత్కృతే,
ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ కథం పాపం కరిష్యతి. ౫

నివర్తస్వ సహ స్త్రీభిః కథం భూయోఽనుగచ్ఛసి,
సౌహృదం దర్శితం తారే! మయి భక్తిః కృతా త్వయా. ౬

ప్రతియోత్స్యా మ్యహం గత్వా సుగ్రీవం జహి సంభ్రమమ్,
దర్పమాత్రం వినేష్యామి నచ ప్రాణై ర్విమోక్ష్యతే. ౭

అహం హ్యాజౌ స్థిత స్యాస్య కరిష్యామి యథేప్సితమ్,
వృక్షై ర్ముష్టిప్రహారై శ్చ పీడితః ప్రతియాస్యతి. ౮

సుందరమయిన ముఖముగలతారా! ఈసుగ్రీవుఁడు యుద్ధంబునకై గర్జించుచుండఁగా అందును శత్రువును దమ్ముఁడునగు నీతఁడు గర్జించుచుండఁగా వీనియాటోపమును నే నెట్లు సహింతును? ౨

నీవు పితికదానవు కావున నీకుఁ దెలియదు; ఎప్పుడును ఎవ్వనివలనను తిరస్కారమే యెఱుఁగనివారలును యుద్ధంబులందు వెనుదీయనివారలును శూరులునగు మహాపురుషులకు ఎవ్వరేనియెదిరించిన దానిసహించుటయే మరణముకన్న నధికకష్టము అట్టివారికిఁ దిరస్కారమును సహించియుండుటకన్న మరణమునొందుట సుఖము. ౩

యుద్ధంబున ఈనోరులేని సుగ్రీవుఁడు నన్ను యుద్ధంబునకు రమ్మని గర్జించుచుఁ గావించు నాటోపమును ఇదివఱ కెన్నఁడును ఎవనిచేతను ఎదిరింపఁబడనివాఁడను యుద్ధంబున వెనుదీయనివాఁడను శూరుఁడనగు నేనెంతమాత్రము సహింపఁజాలను. ౪

రామునివలన నాకేమేని బాధగలుగునని నీ వెంతమాత్రము దుఃఖింపవలదు; ధర్మజ్ఞుఁడును ఎవ్వఁడే యపరాధము గావించియుండుటయుఁ దెలిసినవాఁడునగు రాముఁడు నిరపరాధుఁడనగు నన్ను వధించుటయను పాపకార్యము నెట్లు చేయఁగలఁడు? ౫

తారా! నీవు నీతోడిస్త్రీలతో మరలిపొమ్ము. మరల నన్నేల వెంబడించెదవు; స్నేహంబున నాకు హితోపదేశంబుచేసి నాయందు నీకుంగల భక్తిం జూపితివి. ౬

నేను బోయి సుగ్రీవునితో యుద్ధంబు గావించెదను నీవు భయపడవలదు. అతని గర్వంబునుమాత్రమె యణఁచెదనుగాని యతని వధించుట లేదు. ౭

నేను యుద్ధంబునఁగూడ నాయిష్టప్రకారము సుగ్రీవుని ప్రాణములు పోవకుండునట్లు అతని బాధింపఁగలను; కావున సుగ్రీవుఁడు నాచే వృక్షంబులను పిడికిటిపోటులను బీడింపఁబడి నిలువనేరక పరుగెత్తఁగలఁడు. ౮

న మే గర్వితమాయ స్తం సహిష్యతి దురాత్మవాన్,
కృతం తారే! సహాయత్వం సౌహృదం దర్శితం మయి. ౯

శాపితాసి మమ ప్రాణై ర్నివ ర్తస్వ జయేనచ,
అహం జిత్వా నివ ర్తిష్యే త మహం భ్రాతరం రణే. ౧౦

తంతు తారా పరిష్వజ్య వాలినం ప్రియవాదినీ,
చకార రుదతీ మన్దం దక్షిణా సా ప్రదక్షిణమ్. ౧౧

తత స్స్వ స్త్యయనం కృత్వా మన్త్రవ ద్విజయైషిణీ,
అన్తఃపురం సహ స్త్రీభిః ప్రవిష్టా శోకమోహితా. ౧౨

ప్రవిష్టాయాంతు తారాయాం సహ స్త్రీభి స్స్వమాలయమ్,
నగరా న్నిర్యయౌ క్రుద్ధో మహాసర్ప ఇవ శ్వసన్. ౧౩

స నిశ్శ్వస్య మహాతేజా వాలీ పరమరోషణః,
సర్వత శ్చారయ న్దృష్టిం శత్రుదర్శనకాఙ్క్షయా. ౧౪

స దదర్శ తత శ్శ్రీమాం స్సుగ్రీవం హేమపిఙ్గళమ్,
సుసంవీత మవష్టబ్ధం దీప్యమాన మి వానలమ్. ౧౫

దురాత్ముఁడగు సుగ్రీవుఁడు యుద్ధమునందు నాగర్వంబు నేమి నాప్రయత్నము నేమి యెంతమాత్రము సహింపఁజాలఁడు; తారా! నీవు విన్నవార్తను జెప్పి నీబుద్ధిచేఁ జాల సాహాయ్యము గావించినావు; నాయందలి స్నేహంబుఁ జూపినావు; ఇంకఁ బొమ్ము. ౯

నాప్రాణములచే నీ కొట్టు పెట్టుచున్నాను; నీవు పొమ్ము; నేను యుద్ధంబున నాతమ్ముఁడగు సుగ్రీవుని జయించి జయంబుతో వచ్చెదను. అని వాలి తారకుఁ జెప్పెను. ౧౦

ప్రియంబులగు మాటలె చెప్పనట్టిదగు నాతారయు నోరులవిషయమయి మిక్కిలియు దాక్షిణ్యముగలది కావునఁ బెనిమిటిమాటలకు బదులేమియుఁ జెప్పఁజాలక యవ్వాలిఁ గవుఁగిలించుకొని యమంగళభయంబున మందంబుగా రోదనము సేయుచు నతనికిఁ బ్రదక్షిణంబు గావించెను. ౧౧

అంతఁ దార వాలికి యుద్ధంబున జయముగలుగవలెనని పౌరాణికమంత్రములచే స్వస్త్యయనంబుఁ గావించి దుఃఖముచే నేమియుం దోఁచక పరితపించు స్త్రీలతోఁగూడ నంతిపురంబునకుఁ బోయెను. ౧౨

తార స్త్రీలతోఁగూడఁ దనయంతఃపురంబునకుఁ బోయినపిమ్మట అంతఃపుర స్త్రీలు భయపడుచుండని కోపము నణఁచికొనియుండినయవ్వాలి క్రుద్ధుఁడై మహాసర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచుఁ గిష్కింధానగరమునుండి వెడలెను. ౧౩

మహాపరాక్రమశాలియుఁ బరమకోపనుఁడునగు నావాలి అట్లు నిట్టూర్పులువుచ్చుచు శత్రువైన సుగ్రీవుని గనుంగొనుటకై నాలుగుప్రక్కలయందుసుఁ జూచుచుండెను. ౧౪

అంత శ్రీమంతుఁడగువాలి వస్త్రము వీడకుండునట్లు నడుమునకు దిట్టముగాఁగట్టుకొనియుద్ధంబునకుసన్నద్ధుఁడై నిలిచియున్నవాని జ్వలించుచున్నయగ్నిహోత్రునిభంగి వెలుఁగుచున్నవాని బంగారమువలెఁ బింగళవర్ణుఁడగు సుగ్రీవునిఁ జూచెను. ౧౫

స తం దృష్ట్వా మహావీర్యం సుగ్రీవం పర్యవస్థితమ్,
గాఢం పరిదధే వాసో వాలీ పరమరోషణః. ౧౬

సవాలీ గాఢసంవీతో ముష్టి ముద్యమ్య వీర్యవాన్,
సుగ్రీవ మే వాభిముఖో యయౌ యోద్ధుం కృతక్షణః. ౧౭

శ్లిష్టముష్టిం సముద్యమ్య సంరబ్ధతర మాగతః,
సుగ్రీవోఽపి త ముద్దిశ్య వాలినం హేమమాలినమ్. ౧౮
తం వాలీ క్రోధతామ్రాక్ష స్సుగ్రీవం రణపణ్డితమ్,
ఆపతన్తం మహావేగ మిదం వచన మబ్రవీత్. ౧౯

ఏష ముష్టి ర్మయా బద్ధో గాఢ స్సునిహితాఙ్గులిః,
మయా వేగవిముక్త స్తే ప్రాణా నాదాయ యాస్యతి. ౨౦

ఏవము క్తస్తు సుగ్రీవః క్రుద్ధో వాలిన మబ్రవీత్,
తవైవ చాహర న్ప్రాణా న్ముష్టిః పతతు మూర్ధని. ౨౧
తాడిత స్తేన సంక్రుద్ధ స్సమభిక్రమ్య వేగతః,
అభవచ్ఛోణితోద్గారీ సోత్పీడ ఇవ పర్వతః. ౨౨

సుగ్రీవేణ తు నిస్సఙ్గం సాల ముత్పాట్య తేజసా,
గాత్రే ష్వభిహతో వాలీ వజ్రే ణేవ మహాగిరిః. ౨౩

సతు వాలీ ప్రచలిత స్సాలతాడనవిహ్వలః,
గురుభారసమాక్రాన్తో నౌసార్థ ఇవ సాగరే. ౨౪

పరమరోషణుఁడగు నవ్వాలి అట్లు యుద్ధంబునకు సిద్ధంబుగా నిలిచియున్న మహాపరాక్రమశాలియగు సుగ్రీవునింజూచి తానును వస్త్రమును నడుమునకు బిగువుగాఁ గట్టెను. ౧౭

వీరుఁడగు నావాలి యట్లు వస్త్రమును నడుమునకు గట్టిగాఁ గట్టి యుద్ధంబునం దుత్సాహంబు గదురఁ బిడికిలి నలవరించి సుగ్రీవునిమీఁదికే పోయెను. ౧౮

సుగ్రీవుఁడును దృఢంబుగాఁ బిడికిలి నలవరించి కాంచనమాలచే నెంతయు నొప్పుచున్న యవ్వాలిమీఁదికి అంతకన్న నధికవేగంబునఁ బోయెను.

వాలి క్రోధంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదురఁ దనమీఁదికి వచ్చుచున్న యుద్ధంబునందుఁ బండితుఁడును మహావేగుఁడు నగు సుగ్రీవుంజూచి యిట్లని పలికెను. ౧౯

దృఢమును బిగువుగాఁ గదిసిన వ్రేళ్లుగలదియు నయిన యీ పిడికిలిం బట్టియున్నానుగదా! దీనివ్రేటునకు నీప్రాణములు తప్పక దేహమునుండి వెడలఁగలవు. అని వాలి సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౦

సుగ్రీవుఁడును వాలిమాటను విని క్రుద్ధుఁడై యావాలింజూచి "ఇదిగో యీముష్టి నీనెత్తిమీఁదం బడి నీప్రాణంబులనే హరించును" అని పలికెను.

వాలి యట్లు పలుకుచు సుగ్రీవు నాక్రమించి పిడికిటం బొడువ నాసుగ్రీవుఁడును పరమక్రుద్ధుఁడై వేగంబున నవ్వాలిపై కుఱుకుచు నొడలంతయు నెత్తురు వెల్లువలుగాఁ గాఱుటవలన సెలయేళ్లతోఁగూడిన పర్వతంబుభంగి నెంతయుఁ జూడ నొప్పెను. ౨౧

అప్పుడు సుగ్రీవుఁడును వేళ్లతోఁగూడ నొకసాలవృక్షంబును బలిమిం బెకలించి దానిచే సమస్తావయవంబులయందును వజ్రాయుధంబుచే మహాపర్వతంబునుంబోలె వాలిం గొట్టెను. ౨౨

అంత వాలి యాసాలవృక్షంబు వ్రేటునకు ఎంతయు డస్సి కొంతతడవు అవయవముల స్వాధీనత దప్పి సముద్రంబున అధికమయిన భారము చేయుటచేత జలంబుల మునుంగు వర్తకులఁగూడవలెఁ జలనంబు నొందెను. ౨౩

తౌ భీమబలవిక్రాన్తౌ సువర్ణసమవేగినౌ,
ప్రవృద్ధౌ ఘోరవపుషౌ చన్ద్రసూర్యా వి వామ్బరే. ౨౫

పరస్పర మమిత్రఘ్నౌ ఛ్ఛిద్రాన్వేషణతత్పరౌ,

తతోఽవర్ధత వాలీ తు బలవీర్యసమన్వితః. ౨౬
సూర్యపుత్రో మహావీర్యస్సుగ్రీవః పరిహీయతే,

వాలినా భగ్నదర్ప స్తు సుగ్రీవో మన్దవిక్రమః. ౨౭
వాలినం ప్రతి సామర్షో దర్శయామాస లాఘవమ్,

వృక్షై స్సశాఖై స్సశిఖై ర్వజ్రకోటినిభై ర్నఖైః. ౨౮
ముష్టిభి ర్జానుభిః పద్భి ర్బాహుభి శ్చ పునఃపునః,
తయోర్యుద్ధ మభూ ద్ఘోరం వృత్రవాసవయోరివ. ౨౯

తౌ శోణితాక్తౌ యుధ్యేతాం వానరౌ వనచారిణౌ,
మేఘా వివ మహాశబ్దై స్తర్జయానౌ పరస్పరమ్. ౩౦

హీయమాన మథోఽపశ్య త్సుగ్రీవం వానరేశ్వరమ్,
వీక్షమాణం దిశ శ్చైవ రాఘవ స్స ముహుర్ముహుః. ౩౧

తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరమ్,
శరం చ వీక్షతే వీరో వాలినో వధకారణాత్. ౩౨

భయంకరమయిన బలమును బరాక్రమంబును గలవారలును గరుత్మంతునకుంబోలె వేగంబుగలవారలును భయంకరాకారులు నగు నావాలిసుగ్రీవులు ఆకాశంబున కెగసి చంద్రసూర్యులభంగి వెలుఁగుచు యుద్ధంబున వృద్ధిఁ బొందిరి. ౨౫

శత్రువధంబు సేయునట్టి యావాలిసుగ్రీవులు యుద్ధంబున నొకరి రంధ్రము నొకరువెదకుచు నొకరి నొకరు జయింపవలె నని జాగ్రత్తతోఁ బోరిరి.

అంత బలపరాక్రమములయం దధికుఁడయిన వాలిమాత్రము కొంత దడవునకు యుద్ధంబునందు బలమునం బెరిఁగెను. మహాపరాక్రముఁడు సూర్యపుత్త్రుఁడయిన సుగ్రీవుఁడు తగ్గ నారంభించెను. ౨౬

సుగ్రీవుఁడును అట్లు వాలిచే నవమానింపఁబడుటవలన హీనపరాక్రముం డయ్యు వాలిమీఁదికోపంబున మిక్కిలియు లాఘవంబుతో యుద్ధంబు చేసెను. ౨౭

అంత నవ్వాలిసుగ్రీవులు శాఖలతోను అగ్రములతోడనుం గూడిన వృక్షంబులచేతను వజ్రకఠినంబులయిన నఖంబులచేతను బిటికిటిపోటుల చేతనుమోఁకాళ్లచేతను జేతులనుంగాళ్లనునొకరినొకరు ప్రహరింపుచు వృత్రుఁడును దేవేంద్రుఁడునుంబోలె భయంకరంబుగాఁ బోరిరి. ౨౮, ౨౯

ఆవాలిసుగ్రీవులు నెత్తుటం దోఁగుచు మహాగర్జనంబులచే మేఘంబులుంబోలె నొకరి నొక రదలించుచు భయంకరముగాఁ బోరిరి. ౩౦

అంత నారాముఁడు వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు బలంబున క్షీణించి వాలిబలిమినోర్వఁజాలక మాటిమాటికి భయంబున నలుదిక్కులం జూచుటను జూచెను. ౩౧

అంత మహాప్రభావుఁడును మహావీరుఁడు నగు రాముఁడు వానరరాజు సుగ్రీవుఁ డార్తుఁ డగుటఁ జూచి వాలిని వధించుట నిమిత్తమయి యందుకుఁ దగినదివ్యబాణంబును జూచుకొనెను. ౩౨

తతో ధనుషి సన్ధాయ శర మాశీవిషోపమమ్,
పూరయామాస తచ్చాపం కాలచక్ర మి వాన్తకః. 33

తస్య జ్యాతలఘోషేణ త్రస్తాః పత్త్రరథేశ్వరాః,
ప్రదుద్రువు ర్మృగా శ్చైవ యుగాన్త ఇవ మోహితాః. 34

ముక్త స్తు వజ్రనిర్ఘోషః ప్రదీప్తాశనిసన్నిభః,
రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః. 35

తత స్తేన మహాతేజా వీర్యోత్సిక్తః కపీశ్వరః,
వేగే నాభిహతో వాలీ నిపపాత మహీతలే. 36
ఇన్ద్రధ్వజ ఇవోద్ధూతః పౌర్ణమాస్యాం మహీతలే,
ఆశ్వయుజ్సమయే మాసి గతశ్రీకో విచేతనః. 37
నరోత్తమః కాలయుగాన్తకోపమం
శరోత్తమం కాఞ్చనరూప్యభూషితమ్,
ససర్జ దీప్తం త మమిత్రమర్దనం
సధూమ మగ్నిం ముఖతో యథా హరః. 38

అథో క్షితః శోణితతోయవిస్రవై
స్సుపుష్పితాశోక ఇవానిలోద్ధతః,
విచేతనో వాసవసూను రాహవే
విభ్రంశితేన్ద్రధ్వజవ త్క్షితిం గతః. 39

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షోడశ స్సర్గః. ౧౬.

అపిమ్మట రాముఁడు కృష్ణసర్పతుల్యమగు నాదివ్యబాణంబును వింట సంధించి నారి యెక్కువెట్టి యముఁడు కాలచక్రమునుంబోలె అధనుస్సును ఆకర్ణాంతంబు నాకర్షించెను. 33

ఆరాముని జ్యాతలధ్వనికి గొప్పగొప్పపక్షులును మృగంబులును ప్రళయకాలమునందుఁబోలె భయంబు నొంది యేమియుం దెలియక దిక్కులకుం బఱచినవి. 3౪

రాముఁడా ఆదివ్యబాణంబును వింటనుండివదలినంతనే యాదివజ్రాయుధంబునకుంబోలె మహాధ్వనిగదుర మెఱుపువలె మెఱయుచు వాలివక్షస్థలంబుఁ జొచ్చెను. 3౫

అట్లు మహాతేజుఁడును బలపరాక్రమంబులచే గర్వించినవాఁడు నగు వాలి ఆరామబాణంబుచే వేగంబువం దాడితుఁడై కాంతిచెడి విసంజ్ఞుఁడై ఆశ్వయుజమాసమునం బూర్ణిమయందు ఉత్సవానంతరము నేలంద్రోయఁబడు దేవేంద్రధ్వజము పడునట్లు నేలంగూలెను. 3౬, 3౭

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ప్రళయకాలంబున రుద్రుఁడు ముఖంబునుండి ధూమసహితంబుగా నగ్నిని గ్రక్కునట్లు ప్రళయకాలమృత్యుసమానంబును శత్రుధ్వంసము గావించునదియు దేదీప్యమానంబును బంగారముతోను వెండితోను అలంకరింపఁబడియుఁ బక్షిఱెక్కలు గట్టియు నుండుటచే ధూమసహితాగ్నివలె నున్నదియు నగు ఆదివ్యబాణమును వాలిపైఁ బ్రయోగించెను. 3౮

అంత యుద్ధంబున దేవేంద్రపుత్రుఁడగువాలి దేహంబంత నెత్తురుప్రవాహములచేఁ దడుపఁబడుచుండ సంజ్ఞలేనివాఁడై చక్కఁగాఁ బూచి యున్నగానుండు నశోకవృక్షంబు వాయువేగహతంబై నేలం బడునట్లు ఉత్సవాంతంబునంద్రోయఁబడిన యింద్రధ్వజంబువలెంగూలువిధంబున భూమిం బడెను. 3౯

ఇది పదునాఱవసర్గము.

## స ప్త ద శ స్స ర్గః.

తత శ్శరే ణాభిహతో రామేణ రణకర్కశః,
పపాత సహసా వాలీ నికృత్త ఇవ పాదపః. ౧
స భూమౌ న్యస్తసర్వాఙ్గ స్తప్తకాఞ్చనభూషణః,
అపత ద్దేవరాజస్య ముక్తరశ్మి రివ ధ్వజః. ౨

తస్మి న్నిపతితే భూమౌ వానరాణాం గణేశ్వరే,
నష్టచన్ద్ర మివ వ్యోమ న వ్యరాజత భూతలమ్. ౩

భూమౌ నిపతిత స్యాపి తస్య దేహం మహాత్మనః,
న శ్రీ ర్జహాతి న ప్రాణా న తేజో న పరాక్రమః. ౪

శక్రదత్తా వరా మాలా కాఞ్చనీ వజ్రభూషితా,
దధార హరిముఖ్యస్య ప్రాణాం స్తేజ శ్శ్రియంచ సా. ౫

స తయా మాలయా వీరో హైమయా హరియూథపః,
సన్ధ్యానుగతపర్యన్తః పయోధర ఇ వాభవత్. ౬
తస్య మాలా చ దేహశ్చ మర్మఘాతీచ యశ్శరః,
త్రి ధేవ రచితా లక్ష్మీః పతిత స్యాపి శోభతే. ౭

త దస్త్రం తస్య వీరస్య స్వర్గమార్గప్రభావనమ్,
రామబాణాసనక్షిప్త మావహ త్పరమాం గతిమ్. ౮

## పదునేడవసర్గము.

అంత యుద్ధంబు సేయుటయందుఁ బండితుఁడగు వాలి రామబాణతాడితుఁడై ఛేదింపఁబడిన వృక్షంబు పడునట్లు తటాలున నేలం గూలెను.౧

ఉత్తమములయిన కాంచనాభరణములు దాల్చియున్న యవ్వాలి కట్టుత్రాళ్లు వదలుటచేత నింద్రధ్వజము నేలంబడువిధంబున సమస్తావయవంబులును భూమిం దాఁకునట్లు పైనుండి పడెను. ౨

వానరసమూహములకంతయు నధినాథుఁడయిన యావాలి నేలం గూలినంతనే చంద్రుఁడు లేని యాకాశమువలె భూమియంతయుఁ బ్రకాశహీనమయ్యెను. ౩

అట్లు భూమింబడినను మహాత్ముఁడగు నావాలి దేహంబునుండి కాంతిగాని ప్రాణంబులుగాని తేజస్సుగాని పరాక్రమంబుగాని యెంతమాత్రము నశింపకుండినవి. ౪

ఉత్తమమయినదియు వజ్రములచే నలంకృతంబు నగు దేవేంద్రుఁడొసంగిన సుప్రసిద్ధమయిన కాంచనమాలిక వానరశ్రేష్ఠుఁడగు నావాలి దేహంబునందు ప్రాణంబులను తేజస్సును గాంతిని బోవకుండ నిలిపియుంచెను. ౫

వీరుఁడగు వానరరాజు వాలి మెడను ఆకాంచనమాలను ధరించియుండుటవలనఁ జొట్టును సంధ్యారాగము క్రమ్మియుండు మేఘమువలెఁ జూపట్టెను.

అప్పుడు ఆవాలిదేహంబును అతనికాంచనమాలయు అతని దేహంబునమర్మస్థానంబున నాటుకొనియుండు రామబాణంబును ఇట్లు మూఁడువిధంబులుగా నుండుటవలన వాలి పడిపోయినప్పటికిని అతని తేజస్సు మూఁడువిధములుగాఁ బరిష్కరింపఁబడినవిధంబున ఎంతయుం బ్రకాశించెను.౭

అయ్యస్త్రము సాధారణముగాఁ దనచే మృతి నొందినవారికందఱకు స్వర్గమార్గము కలిగించునది. అది మఱియు రామధనుస్సునుండి ముక్తమయి వాలిం దాఁకుటవలన వీరుఁడగు నవ్వాలికిఁ బునరావృత్తిరహితమగు పరమగతినే కలిగించెను. ౮

తం తదా పతితం సంఖ్యే గతార్చిష మివానలమ్,
బహుమాన్య చ తం వీరం వీక్షమాణం శనై రివ. ౯
యయాతి మివ పుణ్యా న్తే దేవలోకా త్పరిచ్యుతమ్,
ఆదిత్య మివ కాలే న యుగా న్తే భువి పాతితమ్. ౧౦
మహేన్ద్ర మివ దుర్ధర్షం మహేన్ద్ర మివ దుస్సహమ్,
మహేన్ద్రపుత్త్రం పతితం వాలినం హేమమాలినమ్. ౧౧
సింహోరస్కం మహాబాహుం దీప్తాస్యం హరిలోచనమ్,
లక్ష్మణానుగతో రామో దదర్శోపససర్ప చ. ౧౨

తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణంచ మహాబలమ్,
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం పరుషం ధర్మసంహితమ్. ౧౩
త్వం నరాధిప తేః పుత్త్రః ప్రథితః ప్రియదర్శనః,
కులీన స్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః. ౧౪

పరాఙ్ముఖవధం కృత్వా కోనుప్రాప్త స్త్వయా గుణః,
యదహం యుద్ధసంరబ్ధ శ్శరే ణోరసి తాడితః. ౧౫

రామః కరుణవేదీచ ప్రజానాంచ హితే రతః,
సానుక్రోశో జితోత్సాహ స్సమయజ్ఞో దృఢవ్రతః. ౧౬
ఇతి తే సర్వభూతాని కథయ న్తి యశో భువి,

దమ శ్శమః క్షమా ధర్మో ధృతి స్సత్యం పరాక్రమః. ౧౭

అట్లు అప్పుడు యుద్ధంబున నేలంబడి గతజ్వాలమయిన యగ్నిహోత్రముభంగి నున్నవాని 'చక్కఁగా బాణప్రయోగము చేసినాఁడు. ఎక్కఁడ వతఁడు' అని గౌరవించి వీరుఁడగు రాముని చూడఁగోరి బాధచే మెల్లఁగాఁ గన్నులు దెఱచుచున్నవానిఁ బుణ్యంబు దఱుగుటవలన దేవలోకంబునుండి భూలోకంబునం బడిన యయాతికరణిఁ బ్రలయకాలంబున రుద్రునిచే భూమిం ద్రోయఁబడిన సూర్యునిభంగినొప్పుచున్నవాని మహేంద్రుఁడుంబోలె ధర్షించుటకుఁగాని యెదుటనిలుచుటకుఁగాని యలవిగానివాని సింహంబునకుంబోలె విశాలంబగు వక్షస్స్థలంబుగలవాని మహాబాహుఁడగువానిఁ బ్రదీప్తంబగుముఖంబుగలవాని గపిలవర్ణంబులయిన నేత్రంబులవాని దేవేంద్రకుమారుని గాంచనమాలచేఁ బ్రకాశించుచున్నవాని నవ్వాలినిరాముఁడు లక్ష్మణసహితుఁడై చూచి యతనిసమీపంబునకుం బోయెను. ౯-౧౨

వాలియు రాముని మహాబలుఁడగులక్ష్మణునింజూచి వినయసహితమును బరుషమును ధర్మయుక్తమునగు నీమాటం జెప్పెను. ౧౩

నీవు మహారాజకుమారుఁడవు; సద్గుణంబులచేఁ బ్రసిద్ధిఁ గాంచినవాఁడవు; శాస్త్రములయందు భక్తిగలవాఁడవు; సత్కులంబునఁ బుట్టినవాఁడవు; మహాబలసంపన్నుఁడవు; మహాతేజుఁడవు; పెక్కుధర్మవ్రతంబుల ననుష్ఠించినవాఁడవు.

నేను వేఱొమఱియొకరితో యుద్ధము చేయుచుండఁగా నాఱొమ్ముపైని బాణముఁ బ్రయోగించినావే; ఇట్లు నీవు బాణప్రయోగము చేయుదువని యెంతమాత్రము తెలియక యేమఱి మఱియొకనితో యుద్ధము సేయుచున్న నన్ను వధించుటవలన నీవేమి యతిశయమును బొందినావు? ౧౪

రాముఁడు కారుణ్య మెఱింగినవాఁడు; ప్రజలహితంబుఁ గోరువాఁడు. దయాశాలి. కామరహితుఁడు. పెద్దలయాచారముఁ దెలిసినవాఁడు. ఎంతమాత్రము చలనములేని వ్రతముగలవాఁడు. అని నిన్ను సమస్తభూతంబులును భూమియంతయుఁ గీర్తించుచున్నవి. ౧౫

రాజా! ఇంద్రియనిగ్రహము, చిత్తశుద్ధి, ఓర్పు, ధర్మము, ధైర్యము,

పార్థివానాం గుణా రాజ న్దణ్డ శ్చా ప్యపరాధిషు,

తా న్గుణాం స్త్వం ప్రధా ర్యాహ మగ్ర్యం చాభిజనం తవ. ౧౮
తారయా ప్రతిషిద్ధోఽపి సుగ్రీవేణ సమాగతః,

న మా మన్యేన సంరబ్ధం ప్రమత్తం యోద్ధు మర్హతి. ౧౯
ఇతి మే బుద్ధి రుత్పన్నా బభూవా దర్శనే తవ,

న త్వాం వినిహతాత్మానం ధర్మధ్వజమధార్మికమ్. ౨౦
జానే పాపసమాచారం తృణైః కూపమి వావృతమ్,

సతాం వేషధరం పాపం ప్రచ్ఛన్న మివ పావకమ్. ౨౧
నాహం త్వా మభిజానామి ధర్మచ్ఛద్మాభిసంవృతమ్,

విషయే వా పురే వా తే యదా నాపకరో మ్యహమ్. ౨౨
నచ త్వా మవజానే చ కస్మా త్త్వం హం స్యకిల్బిషమ్,
ఫలమూలాశినం నిత్యం వానరం వనగోచరమ్. ౨౩
మా మి హాప్రతియుధ్య న్త మన్యేన చ సమాగతమ్,

లిఙ్గమ ప్యస్తి తే రాజ! న్దృశ్యతే ధర్మసంహితమ్. ౨౪

కః క్షత్రియకులే జాతః శ్రుతవా న్నష్టసంశయః,

సత్యము, పరాక్రమము, అపరాధులను దండించుట ఇవి రాజులగుణము లందురు. ౧౭

నేను తార యిప్పుడు యుద్ధంబునకుఁ బోవలదని యెంత వారించినను నీయందుఁగల యాసద్గుణంబులను మఱియు నీసత్కులంబునుఁ దలఁచి నాకేమియు నీవలన భయముగలుగదని నమ్మి సుగ్రీవునిమీఁదికి వచ్చినాను. ౧౮

నిన్నుఁ జూడకుండునప్పుడు నేను మఱియొక్కరితో యుద్ధముసేయుచు నేమఱియున్నప్పుడు "రాముఁడు నన్నేమియుఁ జేయఁడు" అని తలఁచియుంటిని. నిన్నుఁ జూచినవెనుక నీయథార్థస్వభావము తెలియవచ్చెను. ౧౯

నీవు దుర్బుద్ధివనియు, లోకులవంచించుటకై ధర్మవేషంబు ధరించినవాఁడవనియు, నధర్మపరుఁడవనియు, పాపాచారుఁడవనియు. లోకుల్మృత్యుణంబులచేఁ గప్పఁబడినకూపమును ఇది కూపమని తెలియఁజాలనివిధంబున వెలుపలికిఁ బరమధార్మికుఁడవుగా నటించుచున్న నీయథార్థరూపమును దెలియఁజాలనైతిని. ౨౦

నీవు సత్పురుషులవలె వేషముదాల్చి కపటముగా ధర్మము నాచరించునట్లుఅభినయించుచు ప్రచ్ఛన్నంబగు నిప్పువలె నున్నావనియుఁ బాపుఁడవనియు నెఱుంగనైతి. ౨౧

నీదేశమునకుఁగాని నీపురమునకుఁగాని నే నెంతమాత్ర మపకారము చేయలేదు నిన్నును నే నేవిధముచేతనైనను ఎంతమాత్ర మవమానించియుండలేదు. ఇట్లుండఁగా ఏవిధమయిన పాపము నెఱుఁగనివాఁడను. ఫలమూలంబులు దినుచు అడవియందు వసించువాఁడను వానరమాత్రుఁడను నీతో బదులుయుద్ధమునకు రానివాఁడను. ఇంతియగాక యితరునితోఁ బోరుచున్నవాఁడను. నన్ను ఎందువలన వధించెదవు? ౨౨,౨౩

రాజా! కపటముచే ధర్మవేషముగూడ నీయందుండనేయున్నది స్పష్టముగా నీకార్యములవలనఁ దెలియవచ్చుచున్నది. ౨౪

క్షత్రియకులమునందు జన్మించి విద్యావంతుఁడైనవాఁడు ఎవ్వఁడు

ధర్మలిఙ్గప్రతిచ్ఛన్నః క్రూరం కర్మ సమాచరేత్. ౨౫

రామ! రాజకులే జాతో ధర్మవా నితి విశ్రుతః,
అభవ్యో భవ్యరూపేణ కిమర్థం పరిధావసి. ౨౬

సామ దానం క్షమాధర్మ స్సత్యం ధృతిపరాక్రమౌ,
పార్థివానాం గుణా రాజన్! దణ్డ శ్చాప్యపరాధిషు. ౨౭
వయం వనచరా రామ! మృగా మూలఫలాశనాః,
ఏషా ప్రకృతి రస్మాకం పురుష స్త్వం నరేశ్వరః. ౨౮

భూమి ర్హిరణ్యం రూప్యంచ విగ్రహే కారణాని చ,
అత్ర క స్తే వనే లోభో మదీయేషు ఫలేషు వా. ౨౯

నయ శ్చ వినయశ్చోభౌ నిగ్రహానుగ్రహా వపి,
రాజవృత్తి రసంకీర్ణా న నృపాః కామవృత్తయః. ౩౦

త్వంతు కామప్రధానశ్చ కోపన శ్చానవస్థితః,
రాజవృత్తై శ్చ సంకీర్ణ శ్శరాసనపరాయణః. ౩౧

న తేఽ స్త్యపచితి ర్ధర్మే నార్థే బుద్ధి రవస్థితా,
ఇన్ద్రియైః కామవృత్త స్స న్కృష్యసే మనుజేశ్వర!. ౩౨

ధర్మవేషంబు వేసికొని నిస్సంశయముగాఁ గ్రూరమయిన పాపకర్మముచే యుదువు? ౨౫

రాముఁడా! నీవు రాజవంశమునఁ బుట్టినావు; ధర్మిష్ఠుఁడని ప్రఖ్యాతిఁ బొందినావు; ఇట్లుండియు యథార్థముచేతఁ గ్రూరుఁడవై పరుల వంచించుటకై సౌమ్యరూపమున సంచరించుచున్నా వేల? ౨౬

రాజా! సాంత్వనము, దానము, క్షమ, సత్యము, ధైర్యము, పరాక్రమము, అపరాధుల దండించుటయు నివి రాజులగుణములు. ౨౭

రాముఁడా! మేము ఫలమూలంబు లాహారముగాఁ గొనుచు వడవులం దిరుగుమృగములము; ఇది మాప్రకృతి; నీవో మనుష్యుఁడవు; అందును మనుష్యులకంతయు రాజవు ౨౮

భూమియుఁ గనకంబును వెండియు ఈమూఁడును లోకమున యుద్ధకారణములు; మనకు అవియుఁ గూడలేవు; నావనంబువలనను నాఫలముల వలనను నీ కేమిలాభము? ౨౯

నయమును అనుగ్రహమును వినయమును నిగ్రహమును ఇవిరాజులకు ఏయేవిషయమందు దేనిఁ బ్రయోగింపవలయునో అదే యావిషయమునందే ప్రయోగింపఁ బడవలయును గానిసంకీర్ణములుగా నుండఁగూడదు; అట్లు గొప్ప రాజులు ఆపద్ధతిప్రకారమున నుందురేకాని యథేష్టముగా సంచరింపరు. ౩౦

నీవు మాత్రము కామప్రధానుఁడవు; కోపిష్ఠుఁడవు; మర్యాదలేని వాఁడవు; మఱియు రాజవ్యాపారంబులను అక్రమముగా నొకటిచేయవలసిన చోట నొకటిచేయువాఁడవు; ధనుస్సు నేముఖ్యగతిగాఁ జేసికొని యిచ్చకు వచ్చినవాని వధించువాఁడవుగా నున్నావు. ౩౧

రాజా! నీకు ధర్మమునం దెంతమాత్రము శ్రద్ధలేదు. అర్థము విషయమయికూడ నీబుద్ధికి పరద్రవ్యము కూడదనుట మొదలయిన వ్యవస్థలేదు; మఱియు నింద్రియవశుఁడవై యథేచ్ఛముగా యుక్తాయుక్తంబు లెఱుఁగక యాచరించుచున్నావు. ౩౨

హత్వా బాణేన కాకుత్స్థ! మా మిహా నవరాధినమ్,
కిం వక్ష్యసి సతాం మధ్యే కర్మ కృత్వా జుగుప్సితమ్. 33

రాజహా బ్రహ్మహా గోఘ్న శ్చోరః ప్రాణివధే రతః,
నాస్తికః పరివేత్తాచ సర్వే నిరయగామినః. 34

సూచకశ్చ కదర్యశ్చ మిత్రఘ్నో గురుతల్పగః,
లోకం పాపాత్మనా మేతే గచ్ఛన్తే నాత్ర సంశయః. 35

అధార్యం చర్మ మే సద్భి రోమా ణ్యస్థిచ వర్జితమ్,
అభక్ష్యాణిచ మాంసాని త్వద్విధై ర్ధర్మచారిభిః. 36

పఞ్చ పఞ్చనఖా భక్ష్యా బ్రహ్మక్షత్త్రేణ రాఘవ!,
శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పఞ్చమః. 37

చర్మ చాస్థి చ మే రాజ! న్నస్పృశన్తి మనీషిణః,
అభక్ష్యాణిచ మాంసాని సోఽహం పఞ్చనఖో హతః. 38

తారయా వాక్య ముక్తోఽహం సత్యం సర్వజ్ఞయా హితమ్,
త దతిక్రమ్య మోహేన కాలస్య వశ మాగతః. 39

త్వయా నాథేన కాకుత్స్థ! న సనాథా వసున్ధరా,
ప్రమదా శీలసంపన్నా ధూర్తేన పతినా యథా. 40

రాముఁడా! గొప్పక్షత్త్రవంశమున జన్మించినావు. ఇచ్చట నిరపరాధుఁడ నగు నన్ను బాణముచే వధించినావే? ఇట్లు నిందితమయిన కార్యమును గావించి సత్పురుషులయెదుట ఏమిసమాధానము చెప్పఁగలవు? ౩౩

రాజును జంపినవాఁడును, బ్రహ్మఘ్నుండును, గోహత్యచేసినవాఁడును, చోరుఁడును, జంకులేక ఎప్పుడును ప్రాణివధంబునే చేయువాఁడును, నాస్తికుఁడును, జ్యేష్ఠుఁడు పెండ్లియగుటకు మున్ను పెండ్లియాడినవాఁడును వీరలందఱు నరకంబునొందుదురు. ౩౪

ఒరునిపైఁ గొండెములు చెప్పువాఁడును, లుబ్ధుఁడును, మిత్రహంతయు, గురుభార్యాగమనంబు గావించినవాఁడును వీరలు పాపాత్ములు పొందు లోకంబులం బొందుదురు. ఇందు సందేహములేదు. ౩౫

నన్ను మృగయావినోదంబున వధించితి నని చెప్పుటకును నీ కవకాశములేదు. ఎట్లనఁగా, నీవంటిధార్మికులయిన సత్పురుషులు నాచర్మమును ధరింపరు. నారోమంబుల నుపయోగింపరు. నాయెముకను ఏనుఁగు నెముకను వలె స్పృశింపరు. నామాంసములను భక్షింపరు. ౩౬

రాముఁడా! ఏదుపంది, అడవిపంది, ఉడుము, కుందేలు, తాఁబేలు, అయిదుగోళ్లుగలజంతువులలో ఈయయిదుమృగములుమాత్రమే బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు భక్ష్యములు. తక్కినపంచనఖములుభక్ష్యములుకావు. ౩౭

రాజా! పండితులగువారలు నాచర్మమును అస్థులను స్పృశింపరు. నామాంసమును భక్షింపరు. అట్టి అభక్ష్యపంచనఖుఁడనైన నన్ను వ్యర్థముగా వధించినావు. ఎంతమాత్రము నీకుఁ బాపచింతయే లేకపోయెను.

సర్వజ్ఞయగుతార హితము సత్యమునగువాక్యమునే నాకుఁ జెప్పినది; నే నజ్ఞానంబున ఆమాట నతిక్రమించుటవలన ఇప్పుడు మృత్యువశమునఁ బడినాను. ౩౯

పాతివ్రత్యాదిసదాచారముగలస్త్రీ మగఁడు దుష్టుఁడయితే అతనిచేత నెట్లుచక్కఁగాఁ బాలింపఁబడదో అవ్విధంబున అధర్మిష్ఠుఁడవయిన నీవు ప్రభువుగా నుండుదువుక భూమి చక్కఁగాఁ బాలింపఁబడదు. ౪౦

శఠో నైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రితమానసః,
కథం దశరథేన త్వం జాతః పాపో మహాత్మనా. ౪౧

ఛిన్నచారిత్రకక్ష్యేణ సతాం ధర్మాతివర్తినా,
త్యక్తధర్మాఙ్కుశే నాహం నిహతో రామహస్తినా. ౪౨

అశుభం చాప్యయుక్తం చ సతాంచైవ విగర్హితమ్,
వక్ష్యసే చేదృశం కృత్వా సద్భి స్సహ సమాగతః. ౪౩

ఉదాసీనేషు యోఽస్మాసు విక్రమ స్తే ప్రకాశితః,
అపకారిషు తం రాజ! న్నహి పశ్యామి విక్రమమ్. ౪౪

దృశ్యమాన స్తు యుధ్యేథా మయా యది నృపాత్మజ!,
అద్య వైవస్వతం దేవం పశ్యే స్త్వం నిహతో మయా. ౪౫

త్వయాఽదృశ్యేన తు రణే నిహతోఽహం దురాసదః,
ప్రసుప్తః పన్నగే నేవ నరః పానవశం గతః. ౪౬

మామేవయది పూర్వం త్వ మేత దర్థ మచోదయః,
మైథిలీ మహ మేకాహ్నా తవ చానీతవా న్భవేత్. ౪౭

నీవు రహస్యముగా నితరుల కప్రియంబు గావించువాఁడవు. పరుల కపకారము సేయుటయు స్వభావముగాఁగలవాఁడవు. నీచకార్యములు చేయువాఁడవు. శాంతమయిన మనస్సుగలిగినట్లు వేషము ధరించి లోపలఁ బరమకుటిలుఁడవై యున్నవాఁడవు. పాపాచారుఁడవు. ఇట్టి నీవు మహానుభావుఁడగు దశరథమహారాజు గర్భవాసంబున నెట్లు పుట్టినావు? ౪౧

మదించిన యేనుఁగు కట్టుఁద్రాడుదెంచుకొని సాధుగజంబుల మర్యాద నతిక్రమించి యంకుశంబు సరకుసేయక తారసిలినవారిం జంపునట్లు నీవు సదాచారంబు విడలి అపరాధినిమాత్రమే దండించవలెనను పెద్దలమర్యాద నతిక్రమించి ధర్మమున్నను భయపడక నన్ను వధించినావు. ౪౨

నీవు పెద్దలచే నిందితంబును అయుక్తంబునగు నిట్టి పాపకృత్యంబు గావించినావే, ఇఁక నెప్పుడేని సత్పురుషులతోడం గలసినప్పుడు వార లాక్షేపించినయెడ నేమిసమాధానము చెప్పఁగలవు? ౪౩

నీవిషయమయి యేవిధమయిన యపకారము నేని చేయకున్న మాయందు నీవు ఏపరాక్రమమును బ్రయోగించినావో అపరాక్రమమును నీకు గొప్పయపకారము గావించిన రావణాదులయందుఁ బ్రయోగింపఁజాలకున్నావేమి? ౪౪

రాచబిడ్డఁడా! నీవు నాయెదుట నిలిచి నాకు దృశ్యుఁడవై యే యుద్ధముగావించియుందు నేని యిప్పటికి నాచే నిహతుఁడవై యముం జూచియుందువు. ౪౫

నీవుదృశ్యుఁడవై యే యుద్ధము సేయుదువేని నాసమీపమున కేనివచ్చుట నీకు శక్యముకాదు; మద్యంబు ద్రాఁగి మైమఱచి నిదురవోవువాని సర్పముఁ కఱచి చంపునట్లు నీవు అదృశ్యుఁడవై నన్ను వధించినావు. ౪౬

మొదట నీవు సీతను వెదకితెచ్చి యివ్వవలెనని నన్నే యడిగియుందువేని నేను ఒకరేదినములో నీభార్యను సీతను ఎచటనున్నదో వెదకి కనుఁగొనుట మాత్రమేగాక తెచ్చి నీకొసఁగియుందును. ౪౭

సుగ్రీవప్రియకామేన యత్కృతేఽస్మి హత స్త్వయా,
కణ్ఠే బద్ధ్వా ప్రదద్యాం తే నిహతం రావణం రణే. ४८

న్యస్తాం సాగరతోయే వా పాతాళే వాపి మైథిలీమ్,
ఆనయేయం త వాదేశా చ్ఛ్వేతా మశ్వతరీ మివ. ४९

యుక్తం య త్ప్రాప్నుయా ద్రాజ్యం సుగ్రీవ స్స్వర్గతే మయి,
అయుక్తం య దధర్మేణ త్వయాఽహం నిహతో రణే. ५०

కామ మేవంవిధో లోకః కాలేన వినియుజ్యతే,
క్షమం చే ద్భవతా ప్రాప్త ముత్తరం సాధుచిన్త్యతామ్. ५१

ఇత్యేవ ముక్త్వా పరిశుష్కవక్త్ర
శ్శరాభిఘాతా ద్వ్యథితో మహాత్మా,
సమీక్ష్య రామం రవిసన్నికాశం
తూష్ణీం బభూ వామరరాజసూనుః. ५२

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తదశ స్సర్గః. १७.

---

## అష్టాదశ స్సర్గః.

ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం ధర్మార్థసహితం హితమ్,
పరుషం వాలినా రామో నిహతేన విచేతసా. १

నీవు సుగ్రీవునకుఁ బ్రియంబు గావింపవలెనను నుద్దేశంబున రావణుని మిత్తమైగదా నన్నువధించినావు; నీవు నన్నే యీసాహాయ్యము నడిగియుందువేని నే నారావణుని యుద్ధంబునవధించి కంఠంబునంగట్టి నీకొసఁగియుందును. ౪౯

నీవు సీతను వెదకి తెమ్మని నాకాజ్ఞయొసంగియుందువేని మున్ను మధుకైటభులచేఁ బాతాళంబున దాఁచబడిన శ్వేతాశ్వతరీరూపమైన శ్రుతినిభగవంతుఁడగు హయగ్రీవుఁడు సాధించినట్లు రావణుఁడాబిడను సముద్రజలంబులఁగాని పాతాళలోకంబునంగాని మఱియెచ్చటంగాని దాఁచియుంచినను నేను సాధించి తెచ్చి నీ కొసంగియుందును ౫౦

నేను మృతిఁబొందిన పిదప సుగ్రీవుఁడు వానరరాజ్యంబున కధిపతి కావలయు ననుట యుక్తమే; అయితే నేనుమఱియొకరితోఁ బోరుచుండఁగా నీవుమఱుఁగుననుండి నన్ను వధించుట యెంతమాత్రము యుక్తముకాదు.

ఎట్లయినను బుట్టినవాఁడు మరణము బొందవలసినదే కావున నేను మృతిఁబొందితే మృతిఁబొందుదునుగాక; దానివలని నాకేమియు నష్టములేదు. నీవుచేసినకార్యము నీకు ఇంకను యుక్తముగానే తోఁచునేని సమాధానము చక్కఁగా నాలోచించి చెప్పుము. అని వాలి రామునితోఁ జెప్పెను. ౫౧

బాణప్రయోగముచేఁ బీడితుఁడునుమహాబుద్ధిమంతుఁడునగు నాదేవేంద్రకుమారుఁడు వాలి యువ్విధంబునఁ బలికి యెచ్చుగా మాటలాడుటవలన నాయాసంబునంజేసి నోరెండఁగా నంత సూర్యునిపగిది వెలుంగుచున్న రాముం జూచి యూరకయుండెను. ౫౨

ఇది పదునేడవసర్గము.

---

## పదునెనిమిదవ సర్గము.

అప్పుడు నిహతుఁడై కొంచెముకొంచెముగాఁ దప్పుచున్న తెలివితోఁ గూడిన వాలి రామునితో నివ్విధంబున వినయసంపన్నంబును ధర్మార్థములోఁ

తం నిష్ప్రభ మి వాదిత్యం ము క్తతోయ మి వామ్బుదమ్,
ఉ క్తవాక్యం హరిశ్రేష్ఠ ముపశాన్త మి వానలమ్. ౨
ధర్మార్థగుణసంపన్నం హరీశ్వర మను త్తమమ్,
అధిక్షి ప్త స్తదా రామః పశ్చా ద్వాలిన మబ్రవీత్. ౩

ధర్మ మర్థంచ కామంచ సమయం చాపి లౌకికమ్,
అవిజ్ఞాయ కథం బాల్యా న్మా మి హాద్య విగర్హసే. ౪

అపృష్ట్వా బుద్ధిసంపన్నా న్వృద్ధా నాచార్యసమ్మతాన్,
సౌమ్య! వానరచాపల్యా త్త్వం మా వక్తు మి హేచ్ఛసి. ౫

ఇక్ష్వాకూణా మియం భూమి స్సశైలవనకాననా,
మృగపక్షిమనుష్యాణాం నిగ్రహప్రగ్రహా వపి. ౬

తాం పాలయతి ధర్మాత్మా భరత స్సత్యవా గృజుః,
ధర్మకామార్థతత్త్వజ్ఞో నిగ్రహానుగ్రహే రతః. ౭

నయశ్చ వినయ శ్చోభౌ యస్మిం త్సత్యంచ సుస్థితమ్,

గూడినదియుఁ దనకు హితంబుగాఁ దోఁచినదియుఁ బరుషంబు నగుమాటం జెప్పెను. ౧

రాముఁడు అవ్విధంబున నధిక్షేపింపఁబడినవాఁడై పిమ్మట అట్లు తన ముందట మాటలాడి కాంతిహీనుఁడగు సూర్యునిపగిది, జలమంతయు వర్షించి జలహీనంబయియున్న మేఘంబుభంగి, జ్వలించి జ్వలించి చల్లాఱిన యగ్నిహోత్రునివిధంబున నిహతుఁడై నిశ్చేష్టుఁడై తేజోహీనుఁడై యున్న వానరరాజుఁడగు వాలింజూచి ధర్మముతోను అర్థముతోను సమస్తగుణంబులతోఁ గూడినదియు సర్వోత్తమంబునగు నీమాటం జెప్పెను. ౨, ౩

నీవు ధర్మమును అర్థమును గామమును ఈమూఁడుపురుషార్థములను లోకు లవలంబించి యాచరించునట్టి యాచారమును జక్కఁగాఁ దెలియక శాస్త్రోక్తమయిన ధర్మమునకును అర్థమునకును గామమునకును విరుద్ధముగా ననుష్ఠించినవాఁడవయ్యు నజ్ఞానంబువలనఁ బ్రియ్యంబున దప్పులేని నన్నెట్లు నిందించెదవు? ౪

తిన్ననివాఁడా! కోపింపవలదు; జ్ఞానసంపన్నులును బెద్దలును పూజింపఁదగినవారలును ఆచార్యులునగు వారలయొద్ద ఈ ధర్మార్థకామముల స్వరూపము నడిగి తెలిసికొనక యిచట నన్నేల వ్యర్థముగా మాటలాడుచున్నావు? ౫

సమస్తపర్వతములతోను అరణ్యములతోను మహారణ్యములతోనుఁ గూడిన యీ భూమియంతయు నిక్ష్వాకువంశసంభవులయిన రాజులదిగా నున్నది. అట్లు మృగంబులను బక్షులను మనుష్యులను శిక్షించునట్టియు ననుగ్రహించునట్టియు నధికారంబును ఆయిక్ష్వాకువంశపురాజులదిగానే యున్నది.

ఆభూమిని ధర్మాత్ముఁడును సత్యవాదియుఁ గపటవృత్తి యొంతమాత్రము లేనివాఁడును ధర్మకామార్థంబుల తత్త్వంబు దెలిసినవాఁడు నగు భరతుఁడు దుష్టులశిక్షించుచు సాధువుల ననుగ్రహించుచు ధర్మంబు దప్పక పరిపాలించుచున్నాఁడు. ౬

ఎవ్వనియందు నీతియు శిక్షయు సత్యంబును శాస్త్రవిహితమయిన పరా

విక్రమశ్చ యథా దృష్ట స్స రాజా దేశకాలవిత్. ౮

తస్య ధర్మకృతాదేశా వయ మన్యే చ పార్థివాః,
చరామో వసుధాం కృత్స్నం ధర్మసన్తాన మిచ్ఛవః. ౯

తస్మి న్నృపతిశార్దూలే భరతే ధర్మవత్సలే,
పాలయ త్యఖిలాం భూమిం క శ్చరే ద్ధర్మనిగ్రహమ్. ౧౦

తే వయం ధర్మవిభ్రష్టం స్వధర్మే పరమే స్థితాః,
భరతాజ్ఞాం పురస్కృత్య నిగృహ్ణీమో యథావిధి. ౧౧

త్వం తు సంక్లిష్టధర్మా చ కర్మణా చ విగర్హితః,
కామతన్త్రప్రధాన శ్చ న స్థితో రాజవర్త్మని. ౧౨

జ్యేష్ఠో భ్రాతా పితా చైవ య శ్చ విద్యాం ప్రయచ్ఛతి,
త్రయ స్తే పితరో జ్ఞేయా ధర్మే పథి హి వర్తినః. ౧౩

యవీయా నాత్మనః పుత్ర శ్శిష్య శ్చాపి గుణోదితః,
పుత్రవ త్తే త్రయ శ్చిన్త్యా ధర్మ శ్చే దత్ర కారణమ్. ౧౪

సూక్ష్మః పరమదుర్జ్ఞేయ స్సతాం ధర్మః ప్లవఙ్గమ!,
హృదిస్థ స్సర్వభూతానా మాత్మా వేద శుభాశుభమ్. ౧౫

క్రమంబును ఇవన్నియు నెల్లప్పుడును జక్కఁగా నిలిచియుండునో అట్టి దేశకాలముల నెఱిఁగినభరతుఁ డిప్పుడు రాజుగా నున్నాఁడు. ౮

ఆభరతుఁడు రాజధర్మము ననుసరించిచేసిన యాజ్ఞను శిరసావహించి మేమును ఇతరరాజులును ధర్మవృద్ధికొఱకు భూమియంతయు సంచరించుచున్నాము. ౯

సమస్తరాజులలోను ఉత్తముఁడగు పరమధార్మికుఁడయిన యాభరతుఁడు సమస్తభూమండలమును ఎంతమాత్రము ధర్మము దప్పకుండునట్లు పరిపాలింపుచుండఁగా ధర్మముదప్పి యెవ్వఁడు నడుచుకొనఁగలఁడు? అట్లు నడుచునేని తప్పక శిక్షనొందును. ౧౦

అట్లు భరతునిచే నాజ్ఞాపింపఁబడిన మేమందఱము ఉత్కృష్టమయిన మాస్వధర్మము నవలంబించి భరతాజ్ఞను శిరసావహించి ధర్మంబుదప్పి ప్రవర్తించునట్టి దుష్టులను యథావిధి శిక్షించుచున్నాము. ౧౧

నీవు అట్లు ధర్మము నతిక్రమించి నిందితములయిన కార్యములనుఁ జేసినవాఁడవు. రాజులుండవలసినమార్గంబున నెంతమాత్రము నున్నవాఁడవు కావు. ౧౨

కన్నతండ్రియుఁ దనజ్యేష్ఠభ్రాతయు, దనకు విద్యనేర్పిన గురుఁడును వీరలు ముప్వురను దండ్రులని ధార్మికుఁడగువాఁడు ఎల్లప్పుడు తలంపవలెను. ౧౩

ధర్మముచొప్పుననే నడువవలసినది సిద్ధమయిన పక్షమునఁ దనపుత్త్రుఁడు తమ్ముఁడు గుణవంతుఁడగు శిష్యుఁడు వీరల ముప్వురను గొడుకులుగా ధార్మికుఁడగువాఁడు తలంపవలెను. ౧౪

వానరుఁడా! ధర్మము మిక్కిలియు సూక్ష్మమయినది. సత్పురుషునకుఁ గూడ నెంతమాత్రము దెలియ నశక్యము. ఇఁక నీయట్టి వానరులకు ఎట్లు తెలియును? సమస్తభూతంబుల హృదాకాశమున నుండునట్టి సర్వాంతర్యామియయిన పరమాత్మమాత్రమే శుభాశుభకారణములయిన ధర్మాధర్మముల నెఱుఁగును. ౧౫

చపల శ్చపలై స్సార్ధం వానరై రకృతాత్మభిః,
జాత్యన్ధ ఇవ జాత్యన్ధై ర్మన్త్రయన్ ద్రక్ష్యసే ను కిమ్. ౧౬

అహం తు వ్యక్తతా మస్య వచనస్య బ్రవీమి తే,
నహి మాం కేవలం రోషా త్త్వం విగర్హితు మర్హసి. ౧౭

త దేత త్కారణం పశ్య యదర్థం త్వం మయా హతః,
భ్రాతు ర్వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనమ్. ౧౮

అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
రుమాయాం వర్తసే కామా త్స్నుషాయాం పాపకర్మకృత్.

తద్వ్యతీతస్య తే ధర్మా త్కామవృత్తస్య వానర!,
భ్రాతృభార్యావమర్శేఽస్మి న్దణ్డోఽయం ప్రతిపాదితః. ౨౦

నహి ధర్మవిరుద్ధస్య లోకవృత్తా దపేయుషః,
దణ్డా దన్యత్ర పశ్యామి నిగ్రహం హరియూథప. ౨౧

నహి తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్భవః,

ఔరసీం భగినీం వాపి భార్యాం వా ప్యనుజస్య యః. ౨౨
ప్రచరేత నరః కామా త్తస్య దణ్డో వధః స్మృతః,

నీవొక చపల వానరుఁడవు; జాత్యంధుఁడు జాత్యంధులతో ముచ్చటించినట్లు నీవు నీయట్టి బుద్ధిహీనులయిన చపలులగు వానరులతో నెంత యాలోచించినను నీకేమి దెలియఁగలదు? ౧౬

ఇంతకుమున్న కొడుకును దమ్ముఁడును శిష్యుఁడును వీరలు మువ్వురును బుత్త్రులు అని చెప్పినానే. ఈమాటయొక్క అభిప్రాయమును నేను నీకు స్పష్టముగాఁ జెప్పెదను. నీవు ఇట్లు కేవల కోపమునంజేసి నన్ను నిందించుట యెంతమాత్రము యుక్తము గాదు. ౧౭

ఎందుకుఁగా నిన్ను నేను వధించినానో ఆకారణముం జెప్పెద వినుము. నీవు సనాతనమయిన ధర్మము నతిక్రమించి నీతమ్ముఁడు సుగ్రీవుని భార్యయందు రమించుచున్నావు. ఈమహాపాపము నీవు చేసినందువలననే నిన్ను వధించినాను. ౧౮

పాపిష్ఠుఁడవగు నీవు ధార్మికుఁడగు నీతమ్ముఁడు సుగ్రీవుఁడు బ్రతికి యుండఁగా నతనిభార్యయయిన (తమ్ముఁడు నీకుఁ గొడుకువంటివాఁడు కావున) నీకోడలయిన రుమయందుఁ గామంబునఁ రమించుచున్నావు. ౧౯

వాలీ! నీవు ధర్మము నతిక్రమించి యిచ్చకువచ్చినట్లాచరించుచుఁ దమ్మునిభార్యతో వ్యభిచరించినావు కావున ఆదోషమునకై నీ కీశిక్ష చేయఁ బడినది. ౨౦

వానరనాథుఁడవగు వాలీ! ధర్మమునకు విరుద్ధముగా నాచరించుచు లోకాచారమునుఁగూడ నతిక్రమించియున్నవానిని శిక్షింపవలసినదేకాని యంతకన్న వేఱువిధముగా నతని నిగ్రహించునుపాయము లేదు. ౨౧

సత్కులంబునం బుట్టిన క్షత్త్రియుఁడనగు నేను నీవుచేసిన పాపమునకుఁ దగినశిక్షసేయక యూరక యెట్లు సహించియుందును?

ఎవ్వఁడు తనకొమార్తెనుగాని తోడఁబుట్టినదానిఁగాని తమ్మునిభార్యనుగాని కామంబునం గలయునో అతనికి వధమే శిక్ష యని ధర్మశాస్త్రములం జెప్పఁబడినది. ౨౨

భరత స్తు మహీపాలో వయం త్వాదేశవర్తినః. ౨౩
త్వం తు ధర్మా దతిక్రాన్తః కథం శక్య ఉపేక్షితుమ్,

గురు ర్ధర్మవ్యతిక్రాన్తం ప్రాజ్ఞో ధర్మేణ పాలయన్. ౨౪
భరతః కామవృత్తానాం నిగ్రహే పర్యవస్థితః,

వయం తు భరతాదేశవిధిం కృత్వా హరీశ్వర!. ౨౫
త్వద్విధా న్భిన్నమర్యాదా న్నియన్తుం పర్యవస్థితాః,

సుగ్రీవేణ చ మే సఖ్యం లక్ష్మణేన యథాతథా. ౨౬
దారరాజ్యనిమిత్తం చ నిశ్శ్రేయసి రత స్స మే,

ప్రతిజ్ఞాచ మయా దత్తా తదా వానరసన్నిధౌ. ౨౭
ప్రతిజ్ఞా చ కథం శక్యా మద్విధే నానవేక్షితుమ్,

త దేభిః కారణై స్సర్వై ర్మహద్భి ర్ధర్మసంహితైః. ౨౮
శాసనం తవ యద్యుక్తం తద్భవా ననుమన్యతామ్,

సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్య స్తవ నిగ్రహః. ౨౯
వయస్య స్యాపి కర్తవ్యం ధర్మమే వానుపశ్యతః,

ఇప్పుడు పరమధార్మికుఁడగు భరతుఁడు రాజై యెంతమాత్రము ధర్మము జవదాఁట నివ్వఁడు. మేమో అతనియాజ్ఞయం దున్నవారలమేగాని స్వతంత్రులముగాము. చట్టముచొప్పునఁ దప్పక జరిగింపవలసినవారము. నీవో ధర్మము నతిక్రమించినావు. మాకు నిన్ను ఎట్లు విడిచిపెట్టవచ్చును? ౨౩

రాజగుటచేత నందఱికన్న నధికుఁడును ధర్మముదెలిసినవాఁడునగు భరతుఁడు ధర్మ మెంతమాత్రము చెడకుండునట్లు కనిపెట్టియుండును. అతఁడు యిచ్ఛకు వచ్చినట్లంతయు ధర్మము నతిక్రమించి నడుచువారలను దప్పక శిక్షింపవలెనని దీక్షవహించియున్నాఁడు. ౨౪

వానరనాథుఁడా! మేమో ఆభరతునియాజ్ఞచే నడువవలసినవారము కావున అతని యాజ్ఞాప్రకారము ధర్మమర్యాద నతిక్రమించి సంచరించునట్టి దుష్టులను యథాశాస్త్రముగా శిక్షించుటయే పనిగా నున్నాము ౨౫

ఇంతియుగాక నాకును సుగ్రీవునకును గలసఖ్యము నాకును లక్ష్మణునకును గలసఖ్యమువంటిది. కాఁబట్టి యెంతమాత్రము పరిహరింపఁదగినదికాదు. మఱియు నాచెలిమి భార్యకొఱకును రాజ్యంబుకొఱకును గలిగినది. ఆసుగ్రీవుఁడును నాక్షేమంబుఁ గోరియున్నవాఁడు, నీవతనిభార్యను హరించితివి. ఆకారణంబువలనను నిన్ను వధింపవలసివచ్చెను. ౨౬

ఆసఖ్యము సేయుకాలమునందు వానరులయెదుట నేను వాలినివధించెదనని నేను బ్రతిజ్ఞయుఁ జేసినాను. నావంటివాఁడు చేసినప్రతిజ్ఞను ఎట్లు తప్పవచ్చును? ౨౭

అందువలన నేను ఇప్పుడు చెప్పినధర్మిష్ఠంబులగు గొప్పకారణంబుల నన్నిఁటిని విమర్శించుకొంటివేని నే నిప్పుడు నిన్ను వధించుట లోకశాస్త్రములకు యుక్తమనియే నీవు నంగీకరింపవలెను. ౨౮

కాఁబట్టి నిన్ను శిక్షించుట అన్నివిధంబులను ధర్మమేకాని యెంతమాత్రమును అధర్మము కాదని తెలియవలెను. ౨౯

ధర్మమును మాత్రమే యపేక్షించునట్టి మిత్రుఁడుగూడ తనమి

శక్యం త్వయాఽపి తత్కార్యం ధర్మ మే వానుపశ్యతా. ౩౦

శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ,
గృహీతౌ ధర్మకుశలై స్తత్తథా చరితం హరే!. ౩౧

రాజభి ర్ధృతదణ్డా స్తు కృత్వా పాపాని మానవాః,
నిర్మలా స్స్వర్గ మాయాన్తి సన్త స్సుకృతినో యథా. ౩౨

శాసనా ద్వా విమోక్షా ద్వా స్తేనః స్తేయా ద్విముచ్యతే,
రాజా త్వశాస న్పాపస్య త దవాప్నోతి కిల్బిషమ్. ౩౩

ఆర్యేణ మమ మాన్ధాత్రా వ్యసనం ఘోర మీప్సితమ్,
శ్రమణేన కృతే పాపే యథా పాపం కృతం త్వయా. ౩౪

అన్యై రపి కృతం పాపం ప్రమత్తై ర్వసుధాధిపైః,
ప్రాయశ్చిత్తంచ కుర్వన్తి తేన త చ్ఛామ్యతే రజః. ౩౫

త దలం పరితాపేన ధర్మతః పరికల్పితః,
వధో వానరశార్దూల! న వయం స్వవశే స్థితాః. ౩౬

త్రుఁడు ఇట్టిపాపము చేసినప్పుడు అవశ్యము వాని నివ్విధంబున శిక్షింపవలసినదే. కాఁబట్టి నీవును ధర్మమునే యాలోచించి నీకు ఇప్పుడు గావించిన శిక్ష నీవు చేసినపాపమునకుఁ బ్రాయశ్చిత్త మగుచున్నది కావున యుక్తమని యంగీకరింపవలెను. ౩౦

వానరమా! పూర్వము మనువు సదాచారమును జక్కఁగా బోధించునట్టి రెండుశ్లోకములు పచించెను. ధర్మమునందుఁ బండితులయిన వారలందఱు నారెండు శ్లోకంబులను గ్రహించియున్నారు. ఆశ్లోకంబులం జెప్పఁబడియున్నట్లు నే నిప్పు డాచరించినాను. వేఱుగాదు. ౩౧

పాపములను జేసినవారలు రాజులచే శిక్షింపఁబడుదురేని అంత వారి పాపం బంతయు నశించుటయుగాక వారలు పుణ్యవంతులగు సత్పురుషులుం బోలె స్వర్గంబు నొందుదురు. ౩౨

రాజు శిక్షచేసినను లేక శిక్షచేయక వదలిపెట్టినను దొంగను దొంగతనమువలనఁ గలిగిన పాపమేమో నశించుచున్నది. అయితే శిక్షింపకయే వదలినపక్షంబున ఆదొంగయొక్క పాపమును రాజు పొందుచున్నాఁడు. అని యీ రెండుశ్లోకములను మనువుచెప్పెను. ౩౩

నీవు ఇప్పుడు పాపముచేసినట్లు మున్ను ఒకశ్రమణుఁడు పాపముగావించినాఁడు. అప్పుడు మావంశములోఁ బూర్వికుఁడును బూజనీయుఁడు నగుమాంధాత యతనికి భయంకరమయిన శిక్ష విధించెను. ౩౪

ఆశ్రమణుఁడును నీవును మాత్రమెగాదు రాజులు ఏమఱియున్నప్పుడు ఇతరులుగూడ పెక్కండ్రు పాపము చేసియున్నారు. అంత నారాజులు తెలిసికొని చక్కఁగా విమర్శించి యాపాపము చేసినవారికి శిక్షారూపమయిన ప్రాయశ్చిత్తము చేయుటయు అందువలన నాదోషము నశించుటయు నాచారముగా నున్నది. ౩౫

వానరోత్తముఁడా! ఈకారణంబువలనఁ బరితపింపవలదు. ధర్మము ననుసరించియే నీవధము చేయఁబడినది. మేము శాస్త్రమునకు బద్ధులమై యథా

శృణు చా ప్యపరం భూయః కారణం హరిపుఙ్గవ!,
యచ్ఛ్రుత్వా హేతుమ ద్వీర! న మన్యుం కర్తు మర్హసి. ౩౭

న మే తత్ర మనస్తాపో న మన్యు ర్హరియూథప!,
వాగురాభి శ్చ పాశై శ్చ కూటై శ్చ వివిధై ర్నరాః. ౩౮
ప్రతిచ్ఛన్నా శ్చ దృశ్యా శ్చ గృహ్ణన్తి సుబహూ న్మృగాన్,

ప్రధావితా న్వా విత్రస్తా న్విస్రబ్ధాంశ్చాపి నిష్ఠితాన్. ౩౯
ప్రమత్తా నప్రమత్తా న్వా నరా మాంసార్థినో భృశమ్,
విధ్య న్తి విముఖాం శ్చాపి నచ దోషోఽత్ర విద్యతే. ౪౦

యా న్తి రాజర్షయ శ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః,

తస్మా త్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర!. ౪౧
అయుధ్య న్ప్రతియుధ్య న్వా యస్మా చ్ఛాఖామృగో హ్యసి,

దుర్లభ స్యచ ధర్మస్య జీవితస్య శుభ స్యచ. ౪౨

విధిగా నవశ్యము జరగింపవలసినవాదము. ఎంతమాత్రము స్వతంత్రులము కాము. కావున మాయిష్టప్రకారము కోపమువచ్చినపుడు శిక్షించుటకుఁగాని దయగలిగిన వదలుటకుఁగాని యవకాశములేదు. 3౧.

వీరుఁడవగు వానరోత్తముఁడా! ఇంతవఱకు నీవు వానరుఁడవైనను మనుష్యుల ననుసరించి సంధ్యావందనము రాజ్యపాలనము మొదలగుకర్మం బుల ననుష్ఠించుచున్నాఁడవు కావున నీకు మనుష్యులకుఁ బోలె శాస్త్రీయమయి నపద్ధతి నవలంబించి సమాధానముఁ జెప్పినాను. ఇఁక నీవానరత్వము నవలం బించి చెప్పెదను వినుము. యుక్తియుక్తమయిన యీమాటను విందువేని యాపిమ్మట నాపైన గోపము వహింపవు. 3౨

వానరవీరుఁడా! నీవు నేను మఱుఁగుననుండి నిన్ను వధించినందుకు నన్ను నిందించినావని నాకెంతమాత్రము మనస్తాపముగాని కోపముగానిలేదు.

మనుష్యులు డాఁగియుండిగాని కనఁబడుచుండిగాని వలలచేతను పాశ ములచేతను నానావిధకపటోపాయంబుల నవవులనుండి యనేకమృగంబులం బట్టుచున్నారు. 3౮

మాంసార్థులగువారలు అరణ్యంబునందు మృగంబులను భయంబునఁ బరుగెత్తుచున్నవానిఁగాని తమ్ముబాధించువార లెవ్వరును లేరని నిశ్చయంబుగా నిలిచియున్నవానిఁగాని యేమఱియున్నవానిఁగాని జాగ్రత్తతో నున్నవా నిఁగాని వదలక వధించుచున్నారు. ఈవిషయంబున నేదోషంబునులేదు.

పరమధార్మికులగు రాజర్షులుగూడ అరణ్యంబున మృగంబులను భక్ష్యం బులనుగాని యభక్ష్యంబులనుగాని వధించుటకై వేఁటాడుచున్నారు. కావున నీ వభక్ష్యమృగంబ వని నిన్ను వధించుట నింద్యముకాదు. ౪౦

వాలీ! నీవు కోఁతివి కావున మృగములలోఁ జేరినవాఁడవు కాఁబట్టి నీవు నాతో యుద్ధముచేయుచున్నను సరే లేక యేమఱియున్నను సరే నీవిష యమయి యాలోచింపవలసినదిలేదు కావున నిన్ను బాణంబున వధించినాను.

వానరోత్తముఁడవగు వాలీ! దుర్లభంబగుధర్మమును జీవనంబును శుభం

జానే వానరశ్రేష్ఠ! ప్రదాతారో న సంశయః,
న్నహింస్యా న్న చాక్రోశే న్నాక్షిపే న్నాప్రియం వదేత్.
వా మానుషరూపేణ చర న్త్యేతే మహీతలే,

తు ధర్మ మవిజ్ఞాయ కేవలం రోష మాస్థితః. ౪౪
దూషయసి మాం ధర్మే పితృపైతామహే స్థితమ్,

స ముక్తస్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశమ్. ౪౫
దోషం రాఘవే దధ్యౌ ధర్మేఽధిగతనిశ్చయః,

ప్రత్యువాచ తతో రామం ప్రాఞ్జలి ర్వానరేశ్వరః. ౪౬

యు త్త్వ మాత్థ నరశ్రేష్ఠ! త దేవం నాత్ర సంశయః,
ప్రతివక్తుం ప్రకృష్టే హి నాపకృష్ట స్తు శక్నుయాత్. ౪౭

త దయుక్తం మయా పూర్వం ప్రమాదా దుక్త మప్రియమ్,
తత్రాపి ఖలు మే దోషం కర్తుం నార్హసి రాఘవ. ౪౮

త్వం హి దృష్టార్థత త్త్వజ్ఞః ప్రజానాం చ హితే రతః,
కార్యకారణసిద్ధౌ తే ప్రసన్నా బుద్ధి రవ్యయా. ౪౯

బును బ్రజలను రాజులే కలుగఁ జేయువారలు. ఇందుకు సందేహములేదు. ౪౨.

దేవతలే మనుష్యరూపంబు ధరించి భూలోకంబునఁ బుట్టి ధర్మరక్షణార్థమయి యీరాజులయి తిరుగుచున్నారు. కావున రాజులను ఎంతమాత్రము హింసించుటగాని నిందించుటగాని యాక్షేపించుటగాని యప్రియంబులాడుటగాని కారాదు. ౪౩

నీవో ధర్మమెంతమాత్రముఁ దెలియనివాఁడవు, కేవలము కోపమును మాత్రము నవలంబించి యుండువాఁడవు. కావునఁ దండ్రితాతలనాటనుండి తప్పక వచ్చినధర్మంబునం దిసుమంతేని జవదాఁటక నిలిచియున్న నన్ను అధికముగా దూషించెదవు. అని రాముఁడు వాలితోఁ జెప్పెను. ౪౪

అంత రామునిమాటలు విని వాలి ధర్మస్వరూపమును జక్కఁగా దెలిసినవాఁడై రామునందుఁ దన్ను వధించుట విషయమయి యేవిధమయినదోషంబును లేదని యెఱుంగుటయేగాక యంతకమున్ను రాముని దోషిగాఁ దలఁచి నిందించినందుకై యెంతయు వ్యథఁ జెందెను. ౪౫

అంత వానరరాజు వాలి రాముంజూచి చేతులు మోడ్చుకొని యిట్లని విన్నవించెను. ౪౬

సమస్తపురుషులలోను ఉత్తముఁడవయినరాముఁడా! నీ విప్పుడు చెప్పినవిషయంబునందు నీవు చెప్పినదే వాస్తవము. అందుకు సంశయములేదు. నీవు సమస్తపురుషోత్తముఁడవు. సర్వజ్ఞుండవు. నేనో వానరజాతినగుటను అధమాధముఁడను. జ్ఞాన హీనుఁడను. నీవు చెప్పినందుకు బదులు నేనేమి చెప్పఁగలను? ౪౭

నేను మున్ను అయుక్తములును అప్రియములునగు వచనంబులాడి నిన్ను నిందించినాను. అట్లు తెలియకచేసినాను కావున అవిషయమయి నాయందు ఏవిధమయిన దోషంబు నుంచక నీవు క్షమింపవలయును. ౪౮

నీవు సమస్తార్థములు దెలిసినవాఁడవు. మహాపండితుఁడవు. ప్రజలకు మేలు గావించుటయందే ఆసక్తిగలవాఁడవు. దండించువిధమును అందుకుఁ

మా మ ప్యగతధర్మాణం వ్యతిక్రాన్తపురస్కృతమ్,
ధర్మసంహితయా వాచా ధర్మజ్ఞ! పరిపాలయ. ౫౦

న త్వాత్మాన మహం శోచే న తారాం నచ బాన్ధవాన్,
యథా పుత్త్రం గుణశ్రేష్ఠ మఙ్గదం కనకాఙ్గదమ్. ౫౧

స మమాదర్శనా ద్దీనో బాల్యా త్ప్రభృతి లాలితః,
తటాక ఇవ పీతామ్బు రుపశోషం గమిష్యతి. ౫౨

బాల శ్చాకృతబుద్ధి శ్చ ఏకపుత్త్ర శ్చ మే ప్రియః,
తారేయో రామ! భవతా రక్షణీయో మహాబలః. ౫౩

సుగ్రీవే చాఙ్గదే చైవ విధత్స్వ మతి ముత్తమామ్,
త్వం హి శాస్తాచ గోప్తాచ కార్యాకార్యవిధౌ స్థితః. ౫౪

యా తే నరపతే! వృత్తి ర్భరతే లక్ష్మణేచ యా,
సుగ్రీవే చాఙ్గదే రాజం! స్తాం త్వ మాధాతు మర్హసి. ౫౫

గారణమయిన పాపముయొక్క స్వరూపమును దెలిసికొనుటయందు నీబుద్ధి మిక్కిలియు సామర్థ్యమును ఓపికయుఁ గలది. ౪౯

ధర్మజ్ఞుఁడవగు రాముఁడా! నేను ధర్మంబు వదలినవాఁడను. అట్టిమహా పాపుఁడనగు నన్నును ధర్మిష్ఠంబయిన నీమాటచేత క్షమించినానని చెప్పి కాపాడవలయును. ౫౦

నాకు నేను హతుఁడనైతినని (నన్నుగుఱించిగాని తారను గుఱించి గాని బంధువులను గుఱించిగాని యంతగా దుఃఖములేదు. అయితే గుణంబులచే నుత్తముఁడును బంగారు బాహుపురులుధరించి చూపులకు విందుగా నుండువాఁడునగు నాకొడుకు నంగదునిఁ దలంచుకొన్నమాత్రము నాకు మిక్కిలియు దుఃఖమగుచున్నది. ౫౧

పుట్టిననాఁటఁగోలె మిక్కిలియు గారాబముగా నాచేత లాలింపఁబడుచున్నవాఁడు. నన్నుఁ జూడక నిమిషమేనియుండఁజాలఁడు. కావున నయ్యంగదుఁడు నేను మృతిఁబొందిన వెనుక నన్నుఁ జూడకుండుటవలన దీనుఁడై నీళ్లంతయుఁ ద్రావఁబడిన పిమ్మట తటాకం బెండిపోవువిధంబునఁ గృశింపఁ గలఁడు. ౫౨

రాముఁడా! తారాపుత్త్రుండయిన యంగదుఁడు పసివాఁడు. ఏమియుఁ దెలియనివాఁడు. నాకుఁ బ్రియుఁడైనఒక్కఁడె కొడుకు. మహాబలశాలి. నీవతనిఁ దయతోఁ గాపాడవలయును. ౫౩

సుగ్రీవునియందును అంగదునియందును సమానమయిన దృష్టియుంచుము. వీరియిద్దఱిలో నెవ్వరేని మంచిచెడ్డలు చేసినప్పుడు రక్షించువాఁడవును శిక్షించువాఁడవును నీవే కావున ఇద్దఱిని సమానముగాఁ జూచి విచారించుకొనుము. ౫౪

మనుష్యనాథుఁడవగు రాముఁడా! నీకు భరతునియందుఁగాని లక్ష్మణునియందుఁగాని యేప్రీతియున్నదో అట్టిప్రీతిని నీవు సుగ్రీవునియందును అంగదునియందును ఉంచవలెను. ౫౫

మద్దోషకృతదోషాం తాం యథా తారాం తపస్వినీమ్,
సుగ్రీవో నావమన్యేత తథాఽవస్థాతు మర్హసి. ౫౬

త్వయా హ్యనుగృహీతేన రాజ్యం శక్య ముపాసితుమ్,
త్వద్వశే వర్తమానేన తవ చిత్తానువర్తినా. ౫౭
శక్యం దివం చార్జయితుం వసుధాం చాపి శాసితుమ్,

త్వత్తోఽహం వధ మాకాఙ్క్ష న్వార్యమాణోఽపి తారయా.
సుగ్రీవేణ సహ భ్రాత్రా ద్వన్ద్వయుద్ధ ముపాగతః,

ఇత్యుక్త్వా సన్నతో రామం విరరామ హరీశ్వరః. ౫౮

స త మాశ్వాసయ ద్రామో వాలినం వ్యక్తదర్శనమ్,
సామసంపన్నయా వాచా ధర్మతత్త్వార్థయుక్తయా. ౬౦

న సంతాప స్త్వయా కార్య ఏతదర్థం ప్లవఙ్గమ!,

న వయం భవతా చిన్త్యా నాప్యాత్మా హరిసత్తమ. ౬౧
వయం భవద్విశేషేణ ధర్మతః కృతనిశ్చయాః,

దణ్డ్యే యః పాతయే ద్దణ్డం దణ్డ్యో యశ్చాపి దణ్డ్యతే. ౬౨
కార్యకారణసిద్ధార్థా వుభౌ తౌ నావసీదతః,

తార నిర్దోషురాలైనను నేను సుగ్రీవున కపకారము చేయుటవలన నాభార్య కాఁబట్టి తారయు సుగ్రీవున కపకారము చేసినట్లే యగును. కావున సుగ్రీవుఁడు తార నెంతమాత్రమేని యవమానింపకుండునట్లు నీవు చేయవలయును. ౫౭

నీయనుగ్రహమునొంది నీచిత్తము ననువర్తింపుచు నీయాజ్ఞను జవదాఁటకుండువాఁడు. ఈవానరరాజ్యంబుఁ బాలించుటకు సమర్థుఁడగుట మాత్రమేకాదు. భూమండలమంతయుఁ బాలింపఁగలుగును. మఱియు నంతంబునఁ బరమపదంబునుం జెందఁగలఁడు. కాఁబట్టి సుగ్రీవునిపుణ్యమే పుణ్యము.

నాకుమాత్రము ఎట్లయినను నీచేతఁ జావు నొందవలెనని కోరికయుండినది. కావున నన్నుఁ దార యెంతవారించినను నేను నాతమ్ముఁడయిన సుగ్రీవునితో ద్వంద్వయుద్ధము నేయవచ్చినాను. అని వాలి రామునితోఁ జెప్పెను.

వానరేశ్వరుఁడగు వాలి యిట్లు వినయంబున రామునితో విన్నవించి యంత నూరకుండెను. ౫౯

అంత నారాముఁడు ఆట్లుమోహంబువదలి స్పష్టమయిన జ్ఞానముతోఁ గూడియున్న వాలింజూచి ధర్మస్వరూపంబు తేఁటపడునట్లు తిన్ననిమాటల నిట్లని చెప్పెను. ౬౦

వాలీ! ఈయంగదునిఁ గాపాడుటవిషయమయి నీ వెంతమాత్రము పరితాప ముంచుకోవలదు.

వానరశ్రేష్ఠుఁడవగు వాలీ! మఱుఁగుననుండి వధించినామని మమ్ముఁ గుఱించిగాని తమ్ముని భార్యను హరించి మహాపాపము గావించినానే యని నిన్నుఁగుఱించిగాని నీవు ఎంతమాత్రము చింతనొందవలదు. ఎందువలన ననఁగా నీవుచేసిన పాపమునకు మేము ప్రాయశ్చిత్తరూపమయిన శిక్షచేసినామని నిస్సంశయముగా నిశ్చయించి యున్నాము. ౬౧

ఏరాజు దండ్యునియందు దండమును ప్రయోగించునో మఱియు నే దండ్యుఁ దండింపఁబడునో వారలిద్దఱును తమతమ ప్రయోజనము సిద్ధించుటవలన ఎంతమాత్రము పాపము నొందరు. రాజును అపరాధముచేసిన దం

త ద్భవా న్దణ్డసంయోగా దస్మా ద్విగతకల్మషః ౬3
గత స్స్వాం ప్రకృతిం ధర్మ్యాం ధర్మదృష్టేన వర్త్మనా,
త్యజ శోకం చ మోహం చ భయం చ హృదయే స్థితమ్.
త్వయా విధానం హర్యగ్ర్య! న శక్య మతివర్తితుమ్,

యథా త్వ య్యఙ్గదో నిత్యం వర్తతే వానరేశ్వర!. ౬౪
తథా వర్తేత సుగ్రీవే మయి చాపి న సంశయః,

స తస్య వాక్యం మధురం మహాత్మన
స్సమాహితం ధర్మపథానువర్తినః,
నిశమ్య రామస్య రణావమర్దినో
వచ స్సుయుక్తం నిజగాద వానరః. ౬౬
శరాభితప్తేన విచేతసా మయా
ప్రదూషిత స్త్వం య దజానతా ప్రభో!,
ఇదం మహేన్ద్రోపమభీమవిక్రమ!
ప్రసాదిత స్త్వం క్షమ మే నరేశ్వర!. ౬౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టాదశ స్సర్గః. ౧౮.

---

ద్యానే దండించుటవలన దనధర్మమును నెఱవేర్చినవాఁడై కృతార్థుఁడగును. శిక్షితుఁడైన దండ్యుఁడును తానుగావించిన యపరాధము రాజావలనం బొంచిన దండముచేఁ బరిహృతం బగుటవలనఁ గృతార్థుఁ డగుచున్నాఁడు. ౬౨

నీవు ఇట్లు ధర్మశాస్త్రోక్తప్రకారంబున దండనము ననుభవించినావు కావున నీపాపము నశించి నీవు ఎప్పటియట్లు ధర్మిష్ఠుఁడ వయినావు. ౬౩

వానరోత్తముఁడ వగువాలీ! నీ మనమునను న్న శోకమోహంబులను భయంబును వదలుము. వ్యర్థముగా నేల బాధపడెదవు? ప్రారబ్ధకర్మరూపమయిన విధిని నీవతిక్రమింపఁగలవా? ౬౪

వానరనాథుఁడ వగువాలీ! అంగదుఁడు నీయం దిదివఱ కెట్లు తండ్రియను భక్తిగలిగి యతనియందు నీకుంగల వాత్సల్యాతిశయము ననుభవింపుచు వర్తించుచున్నాఁడో అట్లే యిఁక సుగ్రీవునియందును నాయందును బితృభక్తిగలిగి మా కతనియందుఁ గల పుత్రవాత్సల్యంబు ననుభవింపుచు సుఖముగా వర్తింపఁగలఁడు. సందేహములేదు. అని రాముఁడు వాలితోడం జెప్పెను. ౬౫

అట్లు మహానుభావుఁడును ధర్మమార్గము నెంతమాత్రమును జవదాఁటనివాఁడును యుద్ధంబునందు శత్రువుల మర్దించువాఁడునగు నారాముఁడు పలికిన మనోహరమయిన సమాధానవాక్యంబు విని యావాలి మిక్కిలి యుక్తముగా నిట్లు బదులుచెప్పెను. ౬౬

మనుష్యనాథుఁడవగు రాముఁడా! నీవు దేవేంద్రసమానుఁడవు. మహాపరాక్రమశాలివి. శిక్షించుటకును మన్నించుటకును సమర్థుండవు. కావున నేను నీబాణముచేతఁ బీడింపఁబడుచుఁ బ్రజ్ఞదప్పి తెలియక నిన్ను మిక్కిలియు నిందించినా ననునట్టి యీనాయపరాధమును నేను బ్రార్థించుచున్నాను కావున ననుగ్రహించి మన్నింపుము. అని వాలి రామునితోఁ జెప్పెను.

ఇది పదునెనిమిదవసర్గము.

---

## ఏ కో న విం శ స్స ర్గః.

స వానరమహారాజ శ్శయాన శ్శరవిక్షతః,
ప్రత్యుక్తో హేతుమద్వాక్యై ర్నోత్తరం ప్రత్యపద్యత. ౧

అశ్మభిః ప్రవిభిన్నాఙ్గః పాదపై రాహతో భృశమ్,
రామబాణేన చ క్రాన్తో జీవితాన్తే ముమోహ సః. ౨

తం భార్యా బాణమోక్షేణ రామదత్తేన సంయుగే,
హతం ప్లవగశార్దూలం తారా శుశ్రావ వాలినమ్. ౩
సా సపుత్త్రాఽప్రియం శ్రుత్వా వధం భర్తుస్సుదారుణమ్,
నిష్పపాత భృశం త్రస్తా వివిధా ద్గిరిగహ్వరాత్. ౪

యే త్వఙ్గదపరీవారా వానరా భీమవిక్రమాః,
తే సకార్ముక మాలోక్య రామం త్రస్తాః ప్రదుద్రువుః. ౫

సా దదర్శ తత స్త్రస్తా న్హరీ నాపతతో భృశమ్,
యూథా దివ పరిభ్రష్టా న్మృగా న్నిహతయూథపాన్. ౬

తా నువాచ సమాసాద్య దుఃఖితా న్దుఃఖితా సతీ,
రామవిత్రాసితాం త్సర్వా ననుబద్ధా నివేషుభిః. ౭

వానరా! రాజసింహస్య యస్య యూయం పురస్సరాః,
తం విహాయసుసంత్రస్తాః కస్మా ద్ద్రవథ దుర్గతాః. ౮

## పంచవింశతిసర్గము.

రామబాణపీడితుఁడై నేలంబడియున్న యవ్వానరరాజు వాలి రాముఁడు చెప్పిన యుక్తియుక్తంబగు ప్రత్యుత్తరమును విని "నన్ను క్షమింపు" మని మాత్రమే చెప్పి యంతకంటె నేమియుఁ జెప్పక యూరకుండెను. ౧

మున్ను సుగ్రీవునిచే ఱాలను వృక్షంబులను మిక్కిలియు నొప్పింపఁబడియున్నవాఁడు ఇప్పుడు రామబాణంబుచేతను బాధింపఁబడుచున్నవాఁడు కావున నావాలి ప్రాణాంతసమయంబున మూర్ఛనొందెను. ౨

అంత నట్లు యుద్ధంబున రామప్రయుక్తమయిన బాణముచేత వానరోత్తముఁడగు వాలి వధింపఁబడెనని యతనిభార్య యయినతార వినెను.

తార అప్రియంబును మహాభయంకరంబునగు రాముఁడు తనపెనిమిటిని వధించినాఁ డన్నమాటను విని పరమదుఃఖితయయి నానావిధంబులగు సన్నివేశంబులతో నొప్పుచున్న పర్వతగుహారూపమయిన కిష్కింధనుండి పుత్రసహితంబుగా వెడలివచ్చెను. ౪

అంగదుని యనుచరులయిన మహాపరాక్రమశాలులగు వానరులందఱు అట్టివాలినే యొక్కబాణంబున వధించినపుచ్చిన ధనుర్ధరుఁడగు రాముంజూచి నంతనే వెనుకకుఁ బాఱిపోయిరి. ౫

యూధపతి వధింపఁబడుటవలన భయంబున యూధంబునుండి చెల్లాచెదరై పఱచు మృగంబులుంబోలె వాలి నిహతుఁడగుటను భయంబునం బరుగెత్తివచ్చుచున్న యవ్వానరవీరులను దార మార్గంబునం జూచెను. ౬

అట్లు దుఃఖితులయి రామునకు భయపడి రామప్రయుక్తంబులగు బాణంబులు వెనువెంటం దగులుచున్నచో యనఁగా మహాభయంబుతో మహావేగంబునఁ బరుగెత్తి వచ్చుచున్న యవ్వానరులంజూచి తార పరమదుఃఖితురాలై యిట్లని చెప్పెను. ౭

వానరులారా! తమ్ముఁడగుసుగ్రీవుఁడు అన్నయవాలిని రాజ్యము నిమిత్తమయి రామునిచే బహుదూరము పాఱునట్టి భయంకరంబులయిన బాణం

రాజ్యహేతో స్స చే ద్భ్రాతా భ్రాత్రా రౌద్రేణ పాతితః,
రామేణ ప్రహితై రౌద్రై ర్మార్గణై ర్దూరపాతిభిః. ౯

కపిపత్న్యా వచ శ్శ్రుత్వా కపయః కామరూపిణః,
ప్రాప్తకాల మవిక్లిష్ట మూచు ర్వచన మఙ్గనామ్. ౧౦

జీవపుత్రే! నివర్తస్వ పుత్త్రం రక్షస్వ చాఙ్గదమ్,
అన్తకో రామరూపేణ హత్వా నయతి వాలినమ్. ౧౧

క్షిప్తాన్ వృక్షా న్సమావిధ్య విపులా శ్చ శిలా స్తథా,
వాలీ వజ్రసమై ర్బాణై రామేణ వినిపాతితః. ౧౨
అభిద్రుతమిదం సర్వం విద్రుతం ప్రసృతం బలమ్,
అస్మిన్ ప్లవగశార్దూలే హతే శక్రసమప్రభే. ౧౩

రక్ష్యతాం నగరద్వార మఙ్గద శ్చాభిషిచ్యతామ్,
పదస్థం వాలినః పుత్త్రం భజిష్యన్తి ప్లవఙ్గమాః. ౧౪

అథవా ఽనుచితం స్థాన మిహ తే రుచిరాననే!,
ఆవిశన్తి హి దుర్గాణి క్షిప్ర మన్యాని వానరాః. ౧౫

అభార్యా శ్చ సభార్యా శ్చ సన్త్యత్ర వనచారిణః,
లుబ్ధేభ్యో విప్రయుక్తేభ్య స్తేభ్యో న స్తుములం భయమ్.

బులచేతఁ జంపించినట్లయితే మీకేమిభయము? ఇట్లు మీరలు ఎవనియనుచరులో ఆరాజశ్రేష్ఠుండగు వాలిని విడిచి యగతికులయి పరమభీతులయి యేల పరుగెత్తి వచ్చుచున్నారు? అని తార వానరులతోఁ జెప్పెను. ౯

ఇచ్చకు వచ్చినరూపము దాల్పఁజాలినట్టి యవ్వానరులు వాలిభార్యయగు తార చెప్పిన మాటను విని యాతారం జూచి యాకాలమునందుఁ జెప్పవలసిన యుక్తియుక్తమయిన మాటం జెప్పిరి. ౧౦

తారా! నీకొడుకు బ్రతికియున్నాఁడు. కావున నీవు మరలిపొమ్ము. నీ కొడుకును అంగదునిఁ గాపాడుకొనుము. ఇప్పుడు మృత్యువె రామరూపంబున వచ్చి వాలినివధించి పరలోకమునకుఁ గొనిపోవుచున్నాఁడు. ౧౧

రాముండు వాలిప్రయోగించినవృక్షంబులను బెద్దరాళ్లను గొట్టివేసి వజ్రసమానంబులగు బాణంబులచే వాలిని వధించెను. ౧౨

అట్టిదేవేంద్రతుల్యుండగు వానరోత్తముండు వాలి హతుండగుటవలన మున్ను కిష్కింధనుండి వెడలిన యాసైన్యంబంతయు భయంబునం జెల్లాచెదరై మరలఁ గిష్కింధ మొగముగాఁ బరుగెత్తుచున్నది. ౧౩

పట్టణంబు వాకిలితలుపులు వేసి జాగ్రత్తగాఁ గాచియుండవలెను; అంగదునకుఁ బట్టాభిషేకము చేయుము. వాలిపుత్త్రుఁడంగదుఁడు రాజ్యాధికారంబు వహింప నతనినే వానరులందఱు గొలిచియుండంగలరు. ౧౪

సుందర మయిన ముఖము గలతారా! మేముచెప్పినట్లు చేయవేని యీకిష్కింధలో నుండుటయే నీకు యుక్తము కాదు. ఎదువలన ననఁగా మనశత్రువులయిన వానరులు శీఘ్రముగా మననివాసస్థానములు దక్క నితరములయిన కిష్కింధయందలి దుష్ప్రవేశస్థానముల నన్నింటిని ఆక్రమించివేయుదురు. ౧౫

అట్లాక్రమించుటవలన నేమిభయమనఁగా ఈకిష్కింధయందు భార్యలేనివారలును భార్యగలవారలును వానరులు పెక్కండ్రు వాలిచేఁ దఱుమఁగొట్టఁబడినవారలున్నారు. అట్టిపెద్దకాలము భార్యా విరహము

అల్పాన్తరగతానాం తు శ్రుత్వా వచన మఙ్గనా,
ఆత్మనః ప్రతిరూపం సా బభాషే చారుహాసినీ. ౧౭

పుత్త్రేణ మమ కిం కార్యం కిం రాజ్యేన కి మాత్మనా,
కపిసింహే మహాభాగే తస్మి న్భర్తరి నశ్యతి. ౧౮

పాదమూలం గమిష్యామి తస్యైవాహం మహాత్మనః,
యోఽసౌ రామప్రయుక్తేన శరేణ వినిపాతితః. ౧౯

ఏవ ముక్త్వా ప్రదుద్రావ రుదన్తీ శోకకర్శితా,
శిర శ్చోరశ్చ బాహుభ్యాం దుఃఖేన సమభిఘ్నతీ ౨౦
ఆవ్రజన్తీ దద ర్శాథ పతిం నిపతితం భువి,
హన్తారం దానవేన్ద్రాణాం సమరే ష్వనివర్తినామ్. ౨౧
క్షేప్తారం పర్వతేన్ద్రాణాం వజ్రాణా మివ వాసవమ్,
మహావాతసమావిష్టం మహామేఘౌఘనిస్స్వనమ్. ౨౨
శక్రతుల్యపరాక్రాన్తం వృష్ట్వే వోపరతం ఘనమ్,
నర్దన్తం నర్దతాం భీమం శూరం శూరేణ పాతితమ్. ౨౩
శార్దూలే నామిష స్యార్థే మృగరాజం యథా హతమ్,
అర్చితం సర్వలోకస్య సపతాకం సవేదికమ్. ౨౪
నాగహేతో స్సుపర్ణేన చైత్య మున్మథితం యథా,

నొందినవారలును లబ్ధులునగు సుగ్రీవాదిజ్ఞాతులవలన మనకు ఎల్లప్పుడును భయము కలుగుచునేయుండును. అని వానరులు తారతోఁ జెప్పినారు. ౧౨

తక్కువతరగతిం జేరిన స్వల్పబుద్ధులగు నవ్వానరులు పలికినమాటనువిని సుందరమయిన చిఱునవ్వు గలయాతార మహాబుద్ధిమంతురాలయిన తనకను రూపమగునట్లు వచించెను. ౧౩

వానరోత్తముఁడును మహానుభావుఁడునగునట్టి పెనిమిటియే పోవుచుండఁగా నిఁక నీకొడుకుచేతను ఈరాజ్యముచేతను ఈశరీరముచేతను నాకేమి ప్రయోజనమున్నది? ౧౪

నేను శ్రీరామప్రయుక్తంబగు బాణంబుచేఁ బడిన మహానుభావుండగు నవ్వాలి పాదములయొద్దకె పోయెదను. అని తార వానరులతోఁ జెప్పెను. ౧౫

అంత నాతార యవ్విధంబునం జెప్పి పరమదుఃఖితయయి రోదనంబు సేయుచు శిరస్సున ఱొమ్మునఁ జేతులఁ గొట్టుకొనుచు వేగంబునం బోయెను.

అంత నాతార అట్లు సమీపంబునకుఁబోయి ఎట్టి యుద్ధంబునం దేని వెనుదీయని మహాశూరులగు మాయావి మొదలగు రాక్షసశ్రేష్ఠులను వధించినవాఁడును, యుద్ధంబున నింద్రుఁడు వజ్రాయుధమును బ్రయోగించులాగున గొప్పగొప్ప పర్వతంబులను విసరివైచువాఁడును మహావాయువు లనేకము లొకటిగాఁ జేరినచో వానికన్నిటికిని ఎంతవేగముండునో అంతటి మహావేగంబు గలవాఁడును మహామేఘంబులసమూహంబులకుంగల మహాధ్వనిగలవాఁడును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమంబు గలవాఁడును గర్జించువారిమధ్యను అందఱికన్నను భయంకరంబుగా గర్జించువాఁడును నేలంగూలియుండుటచే వర్షించివర్షించి యుపరమించిన మేఘంబువలె శాంతుఁడై యున్నవాఁడును శూరుండును ధర్మము నిమిత్తమై శూరుండగు రామునిచే వధింపఁబడినవాఁడును గావున మాంసమునిమిత్తమయి మహాపరాక్రమవంతమగు సింహముచే నిహతమయిన సింహముంబోలె నున్నవాఁడును కీర్తియు బలంబును బరాక్రమంబును శౌర్యమును గలవాఁడయి దక్షుని భార్యం జేపట్టిన

అవష్టభ్యచ తిష్ఠన్తం దదర్శ ధను రుత్తమమ్. ౨౫
రామం రామానుజం చైవ భర్తుశ్చైవానుజం శుభా,

తా మతీత్య సమాసాద్య భర్తారం నిహతం రణే. ౨౬
సమీక్ష్య వ్యథితా భూమౌ సంభ్రాన్తా నిపపాత హ,

సు ప్త్వేవ పున రుత్థాయ ఆర్యపుత్రేతి శోచతి. ౨౭

రురోద సా పతిం దృష్ట్వా సందితం మృత్యుదామభిః,

తా మవేక్ష్య తు సుగ్రీవః క్రోశ న్తీం కురరీ మివ. ౨౮
విషాద మగమ త్కష్టం దృష్ట్వా చాఙ్గద మాగతమ్.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకోనవింశ స్సర్గః. ౧౯.

---

## వింశ స్సర్గః.

రామచాపవిసృష్టేన శరే ణాన్తక రేణ తమ్,
దృష్ట్వా వినిహతం భూమౌ తారా తారాధిపాననా. ౧

ద్రోహంబునకై రామునిచే నిహతుండగుటం జేసి సమస్తలోకపూజితంబయి ధ్వజాలంకృతంబయి వేదికతో నొప్పుచున్నను అందు సర్పంబు దాఁగియుండుటవలన సర్పము నిమిత్తమయి గరుత్మంతునిచేఁ బెల్లగింపఁబడిన చైత్యవృక్షంబుపగిది నున్నవాఁడునగు నేలంబడియున్న తనపెనిమిటిని వాలిం జూచెను. ౨౧-౨౪

ఆతార మఱియు ధనుస్సును దృఢంబుగానూని నిలుచున్నట్టి రాముని రామానుజుండగు లక్ష్మణునిఁ దనపెనిమిటియందు దోషంబుండుటచేతనె వధించినాఁడు కాఁబట్టి రామునియందును అతని తమ్మునియందును దనపెనిమిటిదే తప్పు అగుటవలనను సుగ్రీవునియం దేతప్పును లేకపోవుటవలనను సుగ్రీవునందును ఎంతమాత్రము ద్వేషబుద్ధిగలది కాదయ్యె. ౨౫

అంత నాతార రామలక్ష్మణులను సుగ్రీవుని దాఁటిపోయి యుద్ధంబున నిహతుఁడైపడియున్న తనభర్తను దగ్గఱి యతనిఁ జక్కఁగాఁజూచి యతనికిఁ దనరాక దెలియనందున హతుఁడయ్యెనని పరమదుఃఖితయయి మూర్ఛిలి నేలంబడెను. ౨౬

అంత నాతార నిదురించి మేలుకొనినట్లు లేచి పెనిమిటిం జేర్కొని రోదనంబు సేసెను. ౨౭

అట్లు ఆసన్నమరణుండై పడియున్న పెనిమిటింజూచి తార దుఃఖంబున విలపించెను.

అట్లు గోరువంకపిట్టవలె విలపించుచున్న తారను అచటికివచ్చి దీనుండై యున్న యంగదునిం జూడఁగానే సుగ్రీవునకును మిక్కిలిదుఃఖము కలిగెను. ౨౮

ఇది పందొమ్మిదవసర్గము.

---

## ఇరువదవసర్గము.

చందురుంబోలు మొగంబుగల యాతార ప్రాణనాశంబుగలిగించునట్టి రామబాణముచేఁ గొట్టఁబడి నేలంబడియున్న తనభర్తను వాలింజూచి దగ్గఱకుఁబోయి యతని గవుఁగిలించుకొనెను. ౧

సా సమాసాద్య భర్తారం పర్యష్వజత భామినీ,
ఇషుణాఽభిహతం దృష్ట్వా వాలినం కుఞ్జరోపమమ్. ౨
వానరేన్ద్రం మహేన్ద్రాభం శోకసంతప్తమానసా,
తారా తరు మివోన్మూలం పర్యదేవయ దాతురా. ౩
రణే దారుణవిక్రాన్త! ప్రవీర! ప్లవతాం వర!,
కిం దీనా మపురోభాగా మద్య త్వం నాభిభాషసే. ౪

ఉత్తిష్ఠ హరిశార్దూల! భజస్వ శయనోత్తమమ్,
నైవంవిధాః శేరతే హి భూమౌ నృపతిసత్తమాః. ౫

అతీవ ఖలు తే కాన్తా వసుధా వసుధాధిప!,
గతాసురపి యాం గాత్రై ర్మాం విహాయ నిషేవసే. ౬

వ్యక్త మన్యా త్వయా వీర! ధర్మతః స్సంప్రవర్తితా,
కిష్కిన్ధేవ పురీ రమ్యా స్వర్గమార్గే వినిర్మితా. ౭

యా న్యస్మాభి స్త్వయా సార్ధం వనేషు మధుగన్ధిషు,
విహృతాని త్వయా కాలే తేషా ముపరమః కృతః. ౮

నిరానన్దా నిరాశాఽహం నిమగ్నా శోకసాగరే,
త్వయి పఞ్చత్వ మాపన్నే మహాయూథపయూథపే. ౯

హృదయం సుస్థిరం మహ్యం దృష్ట్వా వినిహతం పతిమ్,

మదపుటేనుఁగువంటివాఁడును దేవేంద్రసమానుండునగు వాలియొక్క బాణంబుచే నిహతుఁడై ఛిన్నమూలం బగు వృక్షంబుపగిది నేలం గూలి యుండుటనుజూచి తార పరమదుఃఖితురాలై యిట్లువిలపించెను. ౨, ౩

యుద్ధమునందు భయంకరమయిన పరాక్రమము గలవాఁడా! వీరోత్తముఁడా! వానరశ్రేష్ఠుఁడా! ఏయపరాధము సెయుంగనిదానను. దుఃఖితురాలనగు నాతో నిప్పుడేల మాటలాడకున్నావు? ౪

వానరోత్తముఁడా! నీయట్టియుత్తములగు రాజులు నేలపైఁబడరు కాఁబట్టి నీవిట్లు నేలపైఁబరుండుట యుక్తముగాదు. లేచి యుత్తమమయిన శయనముపైఁ బరుండుము. ౫

భూనాథుఁడా! నీవు మృతుండ వయ్యును నన్నుఁగూడ వదలి యీభూమినే సమస్తావయవంబులనుం గవుఁగిలించుకొనియున్నావు. కాఁబట్టి నీకు నాకన్నను భూమియే మిక్కిలియుఁ బ్రియురాలు. ౬

వీరుఁడా! పరమధార్మికుఁడవు కావున నీధర్మమహిమవలన స్వర్గమునకుఁ బోవుమార్గమునందు ఈ కిష్కింధవంటి మణిమొకరమణీయమయిన పట్టణమును నిర్మించుకొని యున్నట్లు స్పష్టముగాఁ దెలియ వచ్చుచున్నది. లేనియెడ నీవి ట్టికిష్కింధను విడువవు. ౭

నీవు అర్యోగ్యకాలములయందు మమ్ముఁగూడి మధుపూర్ణంబులగు వనంబులందుఁ గావించుచుండిన విహారములన్నియు నిప్పుడు తుదముట్టునట్లు చేసినావు. ౮

గొప్పగొప్ప వానరయూథపులకందఱకును నాథుఁడవు నీవు మరణంబునొందినావు కావున నే నిప్పు డెంతమాత్రము సంతోషము లేనిదాన నగుటయేగాక యిఁకముందును సంతోషము గలుగవచ్చునను నాశయుం లేనిదాననై దుఃఖసముద్రంబున మునింగినాను. ౯

నీవు హతుఁడవై నేలం గూలియుండుటను జూచియు దుఃఖాతిశ

య న్నశోకాభిసంతప్తం స్ఫుటతేఽద్య సహస్రధా. ౧౦

సుగ్రీవస్య త్వయా భార్యా హృతా స చ వివాసితః,
యత్తు తస్య త్వయా వ్యుష్టిః ప్రాప్తేయం ప్లవగాధిప! ౧౧
నిశ్శ్రేయసపరా మోహా త్త్వయా చాహం విగర్హితా,
యైషాఽబ్రువం హితం వాక్యం వానరేన్ద్ర! హితైషిణీ. ౧౨
రూపయౌవనదృప్తానాం దక్షిణానాంచ మానద!,
నూన మప్సరసా మార్య! చిత్తాని ప్రమథిష్యసి. ౧౩

కాలో నిస్సంశయో నూనం జీవితాన్తకర స్తవ,
బలా ద్యేనావపన్నోఽసి సుగ్రీవ స్యావశో వశమ్. ౧౪

వైధవ్యం శోకసంతాపం కృపణం కృపణా సతీ,
అదుఃఖోపచితా పూర్వం వర్తయిష్యా మ్యనాథవత్. ౧౫

లాలిత శ్చాఙ్గదో వీర స్సుకుమార స్సుఖోచితః,
వర్త్స్యతే కా మవస్థాం మే పితృవ్యే క్రోధమూర్ఛితే!. ౧౬

కురుష్వ పితరం పుత్త్ర! సుదృష్టం ధర్మవత్సలమ్,
దుర్లభం దర్శనం వత్స! తవ తస్య భవిష్యతి. ౧౭

యంబున వేయిపత్రియలు గాఁబగులకున్నది గావున నాగుండెకాయ మిక్కిలి యు దృఢమయినదని చెప్పవలెను. ౧౦

వానరరాజా! నీవు సుగ్రీవునిభార్యను హరించి యతనిం దఱుమఁ గొట్టినావే; దానిఫలమే నీకిప్పుడు సంభవించినది కాని వేఱుగాదు. ౧౧

వానరరాజవగు వాలీ! నేను నీమేలుగోరి నీకు హితముఁ జెప్పినప్పుడు నీక్షేమము నే కోరుచున్ననన్నుఁగూడ నీ వజ్ఞానంబున నిందించినావు. ౧౨

మాకందఱకు మానముగలిగించునట్టి (శత్రువులగర్వము నణఁచునట్టి) పూజనీయుఁడవైనవాలీ! ఇంక నీవు స్వర్గంబున రూపయౌవన సంపన్నలుం మన్మథతంత్రంబులం జతురలునగు నచ్చరమిన్నల మనంబుల నన్వశీకరింపఁగ లవు. ఇది నిశ్చయము. ౧౩

నిన్ను స్వాధీనతఁ దప్పునట్లుచేసి బలాత్కారంబునం జిక్కునట్లు గావించినది నీప్రాణంబులు గొనుటకై వచ్చిన నీమృత్యువేగాని వేఱు గాదు. ఈవిషయమందు సందేహములేదు. ౧౪

నేను ఇదివఱకు ఎంతమాత్రము దుఃఖముగాని దారిద్ర్యముగాని యెఱుఁగకుండి యిఁక ననాథనై వైధవ్యమును దారిద్ర్యమునుబొంది దుఃఖింపుచుండఁగలను ౧౫

మిక్కిలియుఁ బ్రేమముచే లాలింపబడుచుండినవాఁడును వీరుండును సుకుమారుండును గష్టపడఁ జాలనివాఁడును సుఖముగా నుండఁదగినవాఁడునగు నంగదుఁడు నీవు మృతిఁబొందినవెనుక నిఁకఁ బినతండ్రి కోపము నొందినప్పుడు ఎట్లు జీవించియుండఁగలఁడు? ౧౬

కొడుకా! పరమ ధార్మికుఁడయిన మీనాయనను ఇప్పుడె చక్కఁగాఁ జూచుకొనుము. ఇఁకమీఁద నీ కతనిఁజూడ నలవిగాదు. (సర్గద్వితీయశ్లోక పూర్వార్థమయిన "సా సమాసాద్య భర్తారం పర్యష్వజత భామినీ" అనునది "దుర్లభం దర్శనం వత్స తవ తస్య భవిష్యతి" అనుదాని యనంతరమున్నట్లు కొందఱు వ్యాఖ్యానము చేసియున్నారు.) ౧౭

సమాశ్వాసయ పుత్త్రం త్వం సందేశం సందిశస్వ చ,
మూర్ధ్ని చైనం సమాఘ్రాయ ప్రవాసం ప్రస్థితో హ్యసి. ౧౮

రామేణ హి మహత్కర్మ కృతం త్వా మభినిఘ్నతా,
ఆనృణ్యం చ గతం తస్య సుగ్రీవస్య ప్రతిశ్రవే. ౧౯

స కామో భవ సుగ్రీవ! రుమాం త్వం ప్రతిపత్స్యసే,
భుఙ్క్ష్వ రాజ్య మనుద్విగ్న శ్శస్తో భ్రాతా రిపు స్తవ. ౨౦

కిం మా మేవం విలపతీం ప్రేమ్ణా త్వం నాభిభాషసే,
ఇమాః పశ్య వరాబహ్వీ ర్భార్యా స్తే వానరేశ్వర!. ౨౧

తస్యా విలపితం శ్రుత్వా వానర్య స్సర్వత శ్చ తాః,
పరిగృహ్యాఙ్గదం దీనం దుఃఖార్తాః పరిచుక్రుశుః. ౨౨

కి మఙ్గదం సాఙ్గదవీరబాహో!
విహాయ యా స్యద్య చిరప్రవాసమ్,
న యుక్తమేవం గుణసన్నికృష్టం
విహాయ పుత్త్రం ప్రియపుత్త్ర! గన్తుమ్. ౨౩
కి మప్రియం తే ప్రియ! చారువేష!
మయా కృతం నాథ! సుతేన వా తే,
సహాఙ్గదాం మాం ప్రవిహాయ వీర!
య త్ప్రస్థితో దీర్ఘ మితః ప్రవాసమ్. ౨౪
య ద్యప్రియం కించి దసంప్రధార్య
కృతం మయా స్యా త్తవ దీర్ఘబాహో!,

నీవు చాల దూరదేశమునకుఁ బ్రయాణమయినావు. కావున నీకొడుకు నంగదు నాశ్వాసించి యతని శిరంబు మూర్కొని యతనికి సమాచారముఁ జెప్పిపొమ్ము ౧౮

రాముఁడు నిన్ను వధించుటచేత గొప్పకార్యము గావించినవాఁడై నాఁడు. సుగ్రీవునకతఁడు చేసిన ప్రతిజ్ఞావిషయమయిన ఋణమును దీర్చుకొన్నవాఁడు నయ్యెను, ౧౯

సుగ్రీవుఁడా! నీశత్రువయిన నీయన్న వాలి వధింపఁబడెను గావున నిఁక నీకోర్కెల నీడేర్చుకొమ్ము. నీభార్యను రుమను బొంది సుఖముగా దిగులులేక రాజ్యము ననుభవింపుము. ౨౦

వానరనాథుఁడా! నేనింతదూరము విలపించుచున్నను నామీఁద గొంచెమైనను బ్రేమతో మాటలాడవేమి? సౌందర్యవతులయిన నీపెక్కండ్ర భార్యలనైనను జూడుము. ౨౧

తార యట్లు విలపించుటను విని వాలిభార్యలయిన వానరస్త్రీలందఱుం జేరి పరమదుఃఖితులయి దీనుండగు నంగదుం గవుఁగిలించుకొని రోదనంబు చేసిరి. ౨౨

బాహుపురులచే నలంకరింపఁబడిన వీర్యవంతములయిన బాహువులు గలవాఁడా! నీకొడుకు నంగదుని వదలి యెందుకలన నిప్పుడు చిరకాలము దూరదేశమున నుండఁబోవుచున్నావు? నీవు కొడుకునందు మిక్కిలియుఁ బ్రేమగలవాఁడవు. నీవిట్లు కొడుకును వదలిపోవుట యుక్తముగాదు. ౨౩

ప్రియుఁడా! సుందరమయిన వేషముగలవాఁడా! నాథుఁడా! నాయందును అంగదునియందును అంతటియధికమయిన ప్రేమగలనీవు ఇప్పుడు నన్నును అంగదుని విడిచి బహుదూరదేశముపోవుటకుఁ బయనమయియున్నావే; నేను గాని నీకుమారుఁ డంగదుఁడు గాని యంతటితప్పు నీకేమి గావించినాము?

దీర్ఘములయిన బాహువులు గల్గి మహాపరాక్రమశాలి వైన వానరరాజా! నేను నాకుదెలియక యేమేని నీ కప్రియము చేసియున్నయెడ నేనిప్పు

ఉష్యస్వ మే త ద్ధరివంశనాథ!
ప్రవాసేషు మూర్ధ్నా తవ వీర! పాదౌ. ౨౭
తథా తు తారా కరుణం రుదన్తీ
భర్తు స్సమీపే సహ వానరీభిః,
వ్యవస్యత ప్రాయ ముపోపవేష్టు
మనిన్ద్యవర్ణా భువి యత్ర వాలీ. ౨౮

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే వింశ స్సర్గః. ౨౦.

---

## ఏకవింశ స్సర్గః.

తతో నిపతితాం తారాం చ్యుతాం తారా మి వామ్బరాత్,
శనై రాశ్వాసయామాస హనూమా న్హరియూథపః. ౧

గుణదోషకృతం జన్తు స్స్వకర్మఫలహేతుకమ్,
అవ్యగ్ర స్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభాశుభమ్. ౨

శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనాఽనుకమ్పసే,
కస్య కో వాఽనుశోచ్యోఽస్తి దేహేఽస్మి న్బుద్బుదోపమే.

డు శిరస్సుచే నీపాదములకు మ్రొక్కుచున్నాను గావున నీవు దయచేసినాతప్పును క్షమింపవలెను. అని తార విలపించెను. ౨౫

సౌందర్యవతియగు నాతార చూపరులకు దుఃఖము గలుగునట్లు వానరస్త్రీలతోఁ గూడఁ బెనిమిటి సమీపమున రోదనంబు సేయుచు నేయుండి భర్తయగు వాలిప్రక్కనతాను మరణపర్యంతంబు శుద్ధోపవాసవ్రతంబుండి మృతిఁబొందవలెనని నిశ్చయించుకొనెను. ౨౬

ఇది యిరువదవసర్గము.

---

## ఇరువదియొకటవసర్గము.

అంత వానరశ్రేష్ఠుండగు హనుమంతుఁడు వాలిసమీపంబున నేలంబడియుండుటచేత నాకాశంబునుండి భూమిఁబడిన నక్షత్రమువలె నొప్పుచున్నతారను తిన్నగా యుక్తియుక్తంబులగు మాటలచే నాశ్వాసించెను. ౧

సమస్తప్రాణులును వారువారుచేసిన మంచిచెడ్డలఫలముచేఁగలిగినసుఖదుఃఖములను బరలోకంబునఁ దప్పక యనుభవింపవలెనుగాని యొకరుచేసినది యొకరికిరాదు కావున ఒకరినిగుఱించి యొకరు దుఃఖింపవలసినదిలేదు. ౨

నీవుచేసిన కర్మముయొక్క శుభాశుభఫలము నీవే యనుభవింప వలసినదానవు కావున నిన్నుఁజూచియే యెవ్వరేనిదుఃఖము నొందవలసియున్నది. అందువలన నీవేదీనురాలవు నితరులకుఁ గరుణింపఁదగినదానవు నగుచున్నావు. అట్లుండఁగా నీవు మఱియొక శోచనీయునిజూచి దుఃఖించుటయు దీనునిఁ గరుణించుటయు యుక్తముగాదు. తాముస్వస్థులై సంపన్నులయి శోచనీయులు దీనులు గాకున్నవారలుగదా ఇతరులనుజూచి దుఃఖించి కరుణింపవలయును. మఱియు ఈదేహము నీటిబుగ్గవంటిది. అందఱిదేహమును అట్టిదే కావున ఈదేహము నిమిత్తమయి ఒకరినిగుఱించి యొకరుదుఃఖించుట వెఱ్ఱితనము. దుఃఖించువారిదేహమును క్షణభంగురమేకదా! ౩

అఙ్గద స్తు కుమారోఽయం ద్రష్టవ్యో జీవపుత్త్రయా,
ఆయత్యాం చ విధేయాని సమర్థా న్యస్య చిన్తయ. ౪

జానా స్యనియతా మేవం భూతానా మాగతిం గతిమ్,
తస్మా చ్ఛుభం హి కర్తవ్యం పణ్డితే నైహ లౌకికమ్. ౫

యస్మి న్హరిసహస్రాణి ప్రయుతా న్యర్బుదాని చ,
వర్తయన్తి కృతాంశాని సోఽయం దిష్టాన్త మాగతః. ౬

యదయం న్యాయదృష్టార్థ స్సామదానక్షమాపరః,
గతో ధర్మజితాం భూమిం నైనం శోచితు మర్హసి. ౭

సర్వేహి హరిశార్దూలాః పుత్త్ర శ్చాయం తవాఙ్గదః,
ఇదం హర్యృక్షరాజ్యం చ త్వత్సనాథ మనిన్దితే!. ౮

తా విమౌ శోకసంతాపౌ శనైః ప్రేరయ భామిని!,
త్వయా పరిగృహీతోఽయ మఙ్గద శ్శాస్తు మేదినీమ్. ౯

సన్తతి శ్చ యథా దృష్టా కృత్యం యచ్చాపి సాంప్రతమ్,
రాజ్ఞ స్తత్ క్రియతాం సర్వ మేష కాలస్య నిశ్చయః. ౧౦

నీకుఁ బుత్త్రుఁడున్నాఁడు. కొడుకులు లేనివారలు భర్తతో సహగమనము చేయవలెనుగాని కొడుకులుగల స్త్రీలు సహగమనము సేయరాదు. నీవు నీకొడుకు అంగదునియొక్క యోగక్షేమమును జూచుకొనుచు నతనికి ముందు హితములయినవి ఏవేవి చేయవలయునో వానిని జక్కఁగా నాలోచింపవలెను.

పండితురాలవగు తారా! పృథివ్యాదిపంచమహాభూతములయొక్క రాకపోకలు స్థిరములు కావు. కావున నశుభకరమగు రోదనము మాని పరలోకమునందు శుభమగు ప్రేతకృత్యములు జేయవలయును. ౬

ఎవ్వఁడు సంఖ్య కతిక్రమించిన వానరకోటులకు వారివారికిఁ దగునట్లు విభజించి జీవనము గలిగించుచుండెనో అట్టి మహాత్ముండు వాలి యిప్పుడు కాలధర్మము నొందెను. పెక్కండ్రను బోషింపుచుండి యాఫలమనుభవింపఁ బరలోకగతుండయినవానివిషయమయి దుఃఖించుట యయుక్తముగాను.

ఈవాలి సమస్తశాస్త్రంబులఁ జదివి తత్త్వం బెఱిఁగి దుఃఖితుల నూఱడించుచు యాచకులకుఁ గోరినవాని నొసంగుచు నపరాధులను దయచే క్షమింపుచు ధర్మిష్ఠుఁడై యుండి ధర్మమును స్వాధీనముఁ జేసికొన్నపుణ్యాత్ముండు నుత్తమలోకంబు నొందెను గావున నీతనిఁ గుఱించి దుఃఖించుట యుచితము గాదు. ౭

నిందింపఁదగని యుత్తమగుణంబులుగలతారా! ఈ సమస్త వానరవీరులకును నీపుత్త్రుఁ డంగదునకును ఈవానరభల్లూక రాజ్యంబునకును నీవే నాథురాలవు. ౮

తారా! వాలినివధించిన యీరామలక్ష్మణులను అంగదుని ప్రోత్సాహపఱుపుము. (ఈదుఃఖమును సంతోషమును దిన్నగా వదలుము.) నీసాహాయ్యమున నంగదుఁడు రాజ్యభారము వహించుఁగాక. ౯

సంతానము గలిగినందుకు ఏదిప్రయోజనమో ప్రకృతమందు ఏదిచేయవలయునో అట్టియౌర్ధ్వదైహికక్రియను అంగదునిచే వాలికిఁ జేయింపుము. ఈకాలమున నిదియే చేయవలయును. ౧౦

సంస్కార్యో హరిరాజ శ్చ అఙ్గద శ్చాభిషిచ్యతామ్,
సింహాసనగతం పుత్త్రం పశ్య న్తీ శాన్తి మేష్యసి. ౧౧

సా తస్య వచనం శ్రుత్వా భర్తృవ్యసనపీడితా,
అబ్రవీ దుత్తరం తారా హనూమన్త మవస్థితమ్. ౧౨

అఙ్గదప్రతిరూపాణాం పుత్త్రాణా మేకత శ్శతమ్,
హత స్యా ప్యస్య వీరస్య గాత్రసంశ్లేషణం వరమ్. ౧౩

న చాహం హరిరాజస్య ప్రభవా మ్యఙ్గదస్య వా,
పితృవ్య స్తస్య సుగ్రీవ స్సర్వకార్యే ష్వనన్తరః. ౧౪

న హ్యేషా బుద్ధి రాస్థేయా హనూమ! న్నఙ్గదం ప్రతి,
పితా హి బన్ధుః పుత్త్రస్య న మాతా హరిసత్తమ!. ౧౫

న హి మమ హరిరాజసంశ్రయా
త్క్షమతర మస్తి పరత్ర చేహ వా,
అభిముఖహత వీరసేవితం
శయన మిదం మమ సేవితుం క్షమమ్.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డ ఏకవింశ స్సర్గః. ౨౧.

వానరరాజయిన వాలికి సంస్కారము గావింపవలెను. అంగదునకుఁ బట్టాభిషేకము గావింపుము. సింహాసనగతుండై రాజ్యసుఖంబు లనుభవించుచున్న పుత్త్రుంజూచుచు దుఃఖంబువాసి సుఖము నొందఁగలవు. అని హనుమంతుఁడు తార నాశ్వాసించెను. ౧౧

అట్లు భర్తృదుఃఖంబునఁ బరితపించుచున్న తార హనుమంతుని మాటను విని తార బదులేమిచెప్పనోయని నిరీక్షించుచున్న యాహనుమంతున కిట్లని యుత్తరంబుఁ జెప్పెను. ౧౨

అంగదునివంటి గుణవంతులగు కొడుకులు నూర్గురు ఒకవైపునను న్నను నాకేమో వారియందఱికన్న హతుఁడైనను వీరుండగు నీవాలిని గవుఁగిలించుకొనుటయే యధికము. ౧౩

వానరరాజుండగు వాలికి సంస్కారముగాని అంగదునికిఁ బట్టాభిషేకముగాని సేయించుటయందు విధాయకురాలను నేనుగాను. వాలికివెనుక నన్ని కార్యములను నిర్వహింపవలసినవాఁడు అంగదునిపినతండ్రి సుగ్రీవుఁడేగాని యితరుఁడు గాఁడు. ౧౪

వానరశ్రేష్ఠుఁడవగు హనుమంతుఁడా! అంగదుని క్షేమముఁ గోరుచు నతనికి హితములయిన కార్యములను నేనుజేయుచుండవలెనని నీవు తలంచితివే ఆతలంపు యుక్తముగాదు. ఏలయనఁగా కొడుకు హితముఁగోరి యతనికిఁగావలసిన కార్యములు చేయవలసిన బంధువు తండ్రియేగాని తల్లిగాదు. అట్టి తండ్రిపోయినప్పుడు తండ్రికి వెనుకటివాఁడు పినతండ్రియేగాని నేను గాను. ౧౫

వానరరాజయిన వాలిని ఆశ్రయించి యుండుటకన్నను అధికము ఈలోకంబునఁగాని పరలోకంబునఁగాని నాకు వేఱేమియు లేదు. కావున యుద్ధమునందు శత్రువునకు అభిముఖంబుగా నుండి హతుఁడైనవీరుండగు వాలి పరుండియున్న శయనమే నాకును యుక్తమయిన శయనము అంతకన్న మఱేదియులేదు. ౧౬

ఇది ఇరువదియొకటవసర్గము.

---

## ద్వావింశస్సర్గః

వీక్షమాణ స్తు మన్దాన స్సర్వతో మన్ద ముచ్ఛ్వసన్,
ఆదా వేవ తు సుగ్రీవం దదర్శ త్వాత్మజాగ్రతః. ౧

తం ప్రాప్తవిజయం వాలీ సుగ్రీవం ప్లవగేశ్వరః,
ఆభాష్య వ్యక్తయా వాచా సస్నేహ మిద మబ్రవీత్. ౨
సుగ్రీవ! దోషేణ న మాం గన్తు మర్హసి కిల్బిషాత్,
కృష్యమాణం భవిష్యేణ బుద్ధిమోహేన మాం బలాత్. 3

యుగప ద్విహితం తాత! న మన్యే సుఖ మావయోః,
సౌహార్దం భ్రాతృయుక్తం హి త దిదం తాత! నాన్యథా. ౪

ప్రతిపద్య త్వ మద్యైవ రాజ్య మేషాం వనౌకసామ్,
మా మప్యద్యైవ గచ్ఛన్తం విద్ధి వైవస్వతక్షయమ్. ౫
జీవితం చ హి రాజ్యం చ శ్రియం చ విపులా మిమామ్,
ప్రజహా మ్యేష వై తూర్ణం మహ చ్చాగర్హితం యశః. ౬
అస్యాం త్వహ మవస్థాయాం వీర! వక్ష్యామి య ద్వచః,
యద్య ప్యసుకరం రాజ! న్కర్తు మేవ త దర్హసి. ౭

సుఖార్హం సుఖసంవృద్ధం బాలమేన మబాలిశమ్,
బాష్పపూర్ణముఖం పశ్య భూమౌ పతిత మఙ్గదమ్. ౮
మమ ప్రాణైః ప్రియతరం పుత్త్రం పుత్త్ర మి వౌరసమ్,

మయా హీన మహీనార్థం సర్వతః పరిపాలయ. ౯

## ఇరువదిరెండవసర్గము.

అల్పావశిష్టమయిన జీవితము గలవాలి తిన్నగా నూర్పులువిడుచుచు నాలుగుప్రక్కలంజూచి మొదటఁ దనకొడుకుముందటనున్న సుగ్రీవుం జూచెను. ౧

వానరేశ్వరుండగు వాలి జయంబునొందియున్న సుగ్రీవుంజూచి స్పష్టముగాఁ బిలిచి స్నేహముతో నిట్లని చెప్పెను. ౨

సుగ్రీవుఁడా! నిన్ను రాజ్యంబునుండి వెడలఁగొట్టి నీభార్యను హరించి పాపము చేసినానని నీ వావిషయమయి నామీఁద దోషమెంచవలదు. ఇట్టిఫలము గలుగవలసినకారణంబున దైవవశంబున నాబుద్ధికిఁ గలిగినమోహంబు బలాత్కారముగా నట్లు నాచేఁ జేయించినదని తెలియుము. ౩

నాయనా! మన యిరువురకును రాజ్యసౌఖ్యమును తోడఁబుట్టువులకు నుండవలసిన చెలిమియు నేకకాలంబునఁ గలుగఁగూడదని దైవసంకల్పమని తోఁచుచున్నది అది తప్పక యట్లె సమకూరెను. ౪

నే నిప్పుడె యమలోకంబు నొందెదను గావున నీవిఁక నీవానర రాజ్యంబునంతయు నిప్పుడె వహింపుము. ౫

జీవితంబును దొరతనంబును ఈయనంతమగు సంపదయు వాలియొట్టివారికి నజేయుఁడను గొప్పయశంబును నన్నిదిగో వదలిపోవుచున్నవి. ౬

వీరుఁడవు వానరరాజవగు సుగ్రీవుఁడా! ఇప్పుడు నాయంత్యకాలంబున నేను నీకేమిచెప్పెదనో అది నీకుఁజేయుటకష్టమయినను నీవు తప్పక దానిఁ జేయవలయును. ౭

ముఖమునిండఁ గన్నీళ్లతో నేలఁబడి విషణ్ణుండై యున్న సుఖంబునకుమాత్రమె దగినవాఁడును బాలుండును బండితుండును నాకుఁ బ్రాణంబులకన్న నధికుండు నగు నాకొడుకు నంగదుని నీ గర్భవాసంబునఁ బుట్టిన కొడుకునుగాఁ జూచుకొనుము. ౮

తండ్రినైన నే నతనివదలిపోయెదను. గావున నంగదునికి అన్నిటను

త్వ మేవాస్య హి దాతా చ పరిత్రాతా చ సర్వతః,
భయే ష్వభయద శ్చైవ యథాఽహం ప్లవగేశ్వర!. ౧౦

ఏష తారాత్మజ శ్శ్రీమాం స్త్వయా తుల్యపరాక్రమః,
రక్షసాం తు వధే తేషా మగ్రత స్తే భవిష్యతి. ౧౧

అనురూపాణి కర్మాణి విక్రమ్య బలవా న్రణే,
కరిష్య త్యేష తారేయ స్తరస్వీ తరుణోఽఙ్గదః. ౧౨

సుషేణదుహితా చేయ మర్థసూక్ష్మవినిశ్చయే,
ఔత్పాతికే చ వివిధే సర్వతః పరినిష్ఠితా. ౧౩

య దేషా సాధ్వితి బ్రూయా త్కార్యం తన్ముక్తసంశయమ్,
నహి తారామతం కించి దన్యథా పరివర్తతే. ౧౪

రాఘవస్య చ తే కార్యం కర్తవ్య మవిశఙ్కయా,
స్యా దధర్మో హ్యకరణే త్వాం చ హింస్యా ద్విమానితః. ౧౫

ఇమాం చ మాలా మాధత్స్వ దివ్యాం సుగ్రీవ! కాఞ్చనీమ్,
ఉదారా శ్రీ స్స్థితా హ్యస్యాం సంప్రజహ్యా న్మృతే మయి. ౧౬

ఇ త్యేవ ముక్త స్సుగ్రీవో వాలినా భ్రాతృసౌహృదాత్,
హర్షం త్యక్త్వా పున ర్దీనో గ్రహగ్రస్త ఇవోడురాట్. ౧౭

ఏమియుఁ దక్కువ పడనట్లు అతని నీవు చక్కఁగాఁ గాపాడవలయును. నా

వానరరాజవయిన సుగ్రీవుఁడా! ఈయంగదునకు ఇఁక నావలె కావలసినవస్తువుల నొసంగువాఁడవును ఆపదలఁ బోఁగొట్టి రక్షింపవలసినవాఁడవును భయంబు గలిగినపుడు అభయంబొసంగువాఁడవును నీవేగాని మఱి యెవరున్నారు? ౧౦

శ్రీమంతుఁడగు నీతారాసూనుఁ డంగదుఁడు నీకు సరియయిన పరాక్రమముగలవాఁడు. సమస్తకార్యములయందును నీకు దోడుగా నుండుటయె గాక రాక్షసుల వధించునపుడును నీకు ముంగల నిలువఁగలఁడు. ౧౧

బలవంతుండును వేగవంతుండును యౌవన సంపన్నుండు నగు తారాపుత్త్రుం డంగదుఁడు యుద్ధంబునఁ బరాక్రమముఁ జూపి గొప్పకార్యములు చేయఁగలఁడు. ౧౨

సుషేణుని కూఁతురయిన యీతారయు సూక్ష్మములయిన కార్యముల నాలోచించి నిశ్చయించుటయందును మఱియు నానావిధములయిన రాఁబోవు నాపదల నారయుటయందును మిక్కిలియు సమర్థురాలు. ౧౩

తారయొక్క అభిప్రాయ మెప్పటికిని వేఱువిధముగాఁ దిరుగదు కావున నీమె యేదియుక్తమని వచించునో అది నిస్సంశయముగాఁ జేయవలెను.

రామకార్యంబును గూడ నీవెంతమాత్రము సంశయింపక యావశ్యము చేయవలెను. చేయనియెడ నధర్మము గలుగుటయె గాక రాముండు మాఱుదప్పి తన్ని ట్లవమానించుటకుఁ గోపించి నిన్ను వధించును. ౧౪

సుగ్రీవుఁడా! నాకు దేవేంద్రుఁ డొసంగిన యీకాంచనమాలనుగూడ నిప్పుడె గ్రహింపుము. ఏలయనఁగా నేను మృతిఁబొందినవెనుక దీనియందున్న యుత్తమకాంతి నశించును. ౧౫

సుగ్రీవుఁడు వాలి చెప్పినదంతయు విని భ్రాతృసౌహార్దంబునంజేసి సంతోషంబువదలి దుఃఖితుఁడై రాహుగ్రస్తుండగు చంద్రునిభంగిఁ గాంతిహీనుఁడయ్యెను. ౧౬

త ద్వాలివచనా చ్ఛాన్తః కుర్వ న్యుక్త మతన్ద్రితః,
జగ్రాహ సోఽభ్యనుజ్ఞాతో మాలాం తాం చైవ కాఞ్చనీమ్.

తాం మాలాం కాఞ్చనీం దత్త్వా వాలీ దృష్ట్వాఽఽత్మజం స్థితమ్,
సంసిద్ధః ప్రేత్యభావాయ స్నేహా దఙ్గద మబ్రవీత్. ౧౯

దేశకాలౌ భజ స్వాద్య క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. ౨౦

యథా హి త్వం మహాబాహో! లాలిత స్సతతం మయా,
న తథా వర్తమానం త్వాం సుగ్రీవో బహు మంస్యతే. ౨౧

మాఽస్యామిత్రై ర్గతం గచ్ఛే ర్మా శత్రుభి రరిన్దమ!,
భర్తు రర్థపరో దాన్త స్సుగ్రీవవశగో భవ. ౨౨

న చాతిప్రణయః కార్యః కర్తవ్యోఽప్రణయ శ్చ తే,
ఉభయం హి మహాదోష స్తస్మా దన్తరదృ గ్భవ. ౨3

ఇత్యుక్త్వాఽథ వివృత్తాక్ష శ్శరసంపీడితో భృశమ్,
వివృతై ర్దశనై ర్భీమై ర్బభూవోత్క్రాన్తజీవితః. ౨౪

తతో విచుక్రుశు స్తత్ర వానరా హరియూథపాః,
పరిదేవయమానా స్తే సర్వే ప్లవగపుఙ్గవాః. ౨౫

అంత నాసుగ్రీవుఁడు వాలిమాటప్రకారము వైరమువదలి యసూయ సేయక యాతఁడుచెప్పిన చొప్పున యుక్తముగా నడుచుట కంగీకరించి యన్నయనుమతినొంది యాకాంచనమాలికను బుచ్చుకొనెను. ౧౮

వాలి ఆకాంచనమాలను సుగ్రీవునకొసంగి మృతుండగుటకు సన్నద్ధుండై యెదుటనిలుచున్న కుమారు నంగదుఁ జూచి స్నేహంబున నిట్లని పలికెను. ౧౯

ఇఁక నీవు సుగ్రీవునియధీనుఁడవై దేశకాలంబులు దెలిసి వర్తింపుము. ప్రియమునుగాని అప్రియముగాని యోర్చుచు ఆయాకాలంబున సంభవించు సుఖమునుగాని దుఃఖంబునుగాని సహించుచుఁ బ్రవర్తింపుము ౨౦

మహాబాహుండవగు నంగదుఁడా! నిన్ను నేనెల్లప్పుడును ఎట్లులాలింపుచుంటినో ఆవిధంబుననె సుగ్రీవుఁడును లాలింపుచుండఁగలఁడు గావున నీవు నాయెడవర్తించినట్లె యతనియెడను వర్తించునది. ౨౧

శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలినట్టి యంగదుఁడా! ఈసుగ్రీవుని శత్రువులతోఁజేరిన పురుషునితోఁగాని యతనిశత్రువులతోఁగాని చేరకుము. నీప్రభువయిన సుగ్రీవునికార్యములందు జాగరూకుఁడవై జితేంద్రియుఁడవై యతనియాజ్ఞాప్రకారము వర్తింపుచుండుము. ౨౨

అతిస్నేహము సేయుటయు స్నేహమేలేకయుండుటయు రెండును గొప్పతప్పు. గావున నీవా రెంటినివదలి మధ్యస్థంబుగాఁ బ్రవర్తింపుము అని వాలి యంగదునికిఁ జెప్పెను. ౨౩

వాలి యివ్విధంబున నంగదునకుఁ జెప్పి యంత బాణబాధ మఱియు నధికమవుటయుఁ గన్నులు గిరగిరం దిరుగ దంతములు వెలువడి భయంకరంబులై యొప్పఁ బ్రాణంబులు విడిచెను. ౨౪

అంత నచట వానరులలో నుత్తములయిన వారలు గొప్పగొప్ప వానరసమూహములను బాలించువారలునగు వానరులందఱు గొప్పధ్వని గలుగునట్లు రోదనము గావించిరి. ౨౫

కిష్కిన్ధా హ్యద్య శూన్యాఽఽసీ త్స్వర్గతే వానరాధిపే,
ఉద్యానాని చ శూన్యాని పర్వతాః కాననానిచ. ౨౬

హతే ప్లవగశార్దూలే నిష్ప్రభా వానరాః కృతాః,

యస్య వేగేన మహతా కాననాని వనాని చ. ౨౭
పుష్పౌఘే నానుబధ్య న్తే కరిష్యతి త దద్య కః,

యేన ద త్తం మహ ద్యుద్ధం గన్ధర్వస్య మహాత్మనః. ౨౮
గోలభస్య మహాబాహో ర్దశ వర్షాణి పఞ్చచ,
నైవ రాత్రౌ న దివసే తద్యుద్ధ ముపశామ్యతి. ౨౯
తత స్తు షోడశే వర్షే గోలభో వినిపాతితః,

హత్వా తం దుర్వినీతం తు వాలీ దంష్ట్రాకరాళవాన్. ౩౦
సర్వాభయకరోఽస్మాకం కథ మేష నిపాతితః,

హతే తు వీరే ప్లవగాధిపే తదా
ప్లవఙ్గమా స్తత్ర న శర్మ లేభిరే,
వనేచరా స్సింహయుతే మహావనే
యథా హి గావో నిహతే గవాం పతౌ. ౩౧
తత స్తు తారా వ్యసనార్ణవాప్లుతా
మృతస్య భ ర్తు ర్వదనం సమీక్ష్య సా,
జగామ భూమిం పరిరభ్య వాలినం
మహాద్రుమం ఛిన్నమి వాశ్రితా లతా. ౩౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్వావింశ స్సర్గః. ౨౨.

వానరరాజు వాలి మృతిఁబొందినాఁడు కావున నిఁక కిష్కింధానగరము పాడుపడినట్లు కాంతిహీనము యిసది. ఉపవనములును అరణ్యంబులును శూన్యములయినవి. ౨౭

వానరశ్రేష్ఠుండు వాలి వధింపఁబడియెఁ గావున వానరులందఱు తేజోహీనులయిరి.

గొప్పదైన యీవాలి యూరువేగంబునకు గొప్పకాననంబులును వనంబులును బుష్పసమూహములోఁగూడ వతనివెంబడించునే; ఇప్పుడిఁక నట్టి కార్యమును ఎవ్వఁడు చేయఁజాలును? ౨౭

ఈవాలి మహాబలుండును మహాబాహుండునగు గోలభుండను గంధర్వునితోఁ బదునైదు సంవత్సరంబులు గొప్ప యుద్ధంబు గావించెను. ౨౮

ఆయుద్ధము రాత్రిఁగాని పగలుఁగాని నిలువక పదునైదుసంవత్సరములును జరగినది. అంతఁ బదునాఱవసంవత్సరమునందు గోలభుండు హతుఁడయ్యెను. ౨౯

దుష్టుండగు నాగోలభునిఁగూడ వధించి మాకట్టి భయంబులు గల్గినను అభయంబు గలిగించుచుండిన భయంకరములయిన కోఱలుగల యీవాలి యిప్పుడెట్లు వధింపఁబడెనో ఆశ్చర్యంబు గానున్నది. అని విలపించిరి. ౩౦

అప్పుడు సింహాక్రాంతమైన గొప్పయడవియందు ఆఁబోతు వధింపఁబడినప్పుడు వనంబునందలి యావులుంబోలె రామునిచే వాలి వధింపఁబడిన తరువాత రామయుక్తమయిన యవ్వనంబున వానరులు మిక్కిలియు భయంబునొందిరి. ౩౧

అంత నాతార మృతుండగు పెనిమిటిమొగంబుఁజూచి పరమ దుఃఖితయయి నఱుకఁబడినవృక్షమును దానిపైఁబ్రాఁకినతీఁగ చుట్టుకొని నేలంబడునట్లు వాలిని గవుఁగిలించుకొని భూమిపయింబడెను. ౩౨

ఇది యిరువదిరెండవసర్గము.

## త్రయోవింశ స్సర్గః.

తత స్సముపజిఘ్రన్తీ కపిరాజస్య తన్ముఖమ్,
పతిం లోకా చ్చ్యుతం తారా మృతం వచన మబ్రవీత్. ౧
శేషే త్వం విషమే దుఃఖ మకృత్వా వచనం మమ,
ఉపలోపచితే వీర! సుదుఃఖే వసుధాతలే. ౨

మత్తః ప్రియతరా నూనం వానరేన్ద్ర! మహీ తవ,
శేషే హి తాం పరిష్వజ్య మాం చ న ప్రతిభాషసే. ౩

సుగ్రీవస్య వశం ప్రాప్తో విధి రేష భవ త్యహో,
సుగ్రీవ ఏవ విక్రాన్తో వీర! సాహసికప్రియ!. ౪

ఋక్షవానరముఖ్యా స్త్వాం బలినః పర్యుపాసతే,

ఏషాం విలపితం కృచ్ఛ్ర మఙ్గదస్య చ శోచతః. ౫
మమ చేమాం గిరం శ్రుత్వా కిం త్వం న ప్రతిబుధ్యసే,
ఇదం తచ్ఛూరశయనం యత్ర శేషే హతో యుధి. ౬
శాయితా నిహతా యత్ర త్వయైవ రిపవః పురా,
విశుద్ధసత్త్వాభిజన! ప్రియయుద్ధ! మమ ప్రియ!. ౭
మా మనాథాం విహా యైకాం గత స్త్వ మసి మానద!,

శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా.
శూరభార్యాం హతాం పశ్య సద్యో మాం విధవాం కృతామ్,

## ఇరువదిమూఁడవసర్గము

అంతఁ దార వానరరాజు వాలిమొగంబు మూర్కొని మృతుండై లోకాంతరగతుండగు పెనిమిటిం జూచి యిట్లని పలికెను. ౧

వీరుఁడా! నీవు నామాట వినలేదు కావున ఇప్పుడు మిక్కిలిబాధకరమయిన రాలతోఁగూడిన మిట్టపల్లపు భూమిపయిఁ గష్టముగాఁ బరుండియున్నావు. ౨

వానరరాజా! నీవు భూమిని కౌఁగిటఁజేర్చి పరుండి నాతో మాటుపలుకకున్నావు కావున నాకన్నను నీకు ఈభూమియె మిక్కిలి ప్రియురాలనుట నిశ్చయము. 3

వీరుఁడవు సాహసికుఁడవునగు నాప్రియుఁడా! నీవు యుద్ధంబున సుగ్రీవునకు లోఁబడితివి. అంగునవలన నీచే నెన్నిమాఱులో దెబ్బలు దిని పాఱిపోయిన సుగ్రీవుఁడె పరాక్రమవంతుఁడని దైవము నియమించుట యాశ్చర్యకరముగా నున్నది. ౪

బలవంతుఁడగునిన్ను భల్లూకవీరులును వానరవీరులును వినయంబునం గొలిచియున్నారు నీవు వారల నుపేక్షించెద వేమి?

ఈభల్లూక వానరవీరుల రోదనధ్వనిని దుఃఖితుఁడగు నంగదునివిలాపంబును నావిలాపంబును విని మేలుకొన వేమి? ౫

నీవు మున్ను శత్రువులను వధించి దేనిపైఁ బరుండఁ బెట్టితివో అట్టి వీరశయనంబునందే నీవు నిప్పుడు యుద్ధంబున హతుఁడవై పరుండియున్నావు.

పరిశుద్ధమును బలవంతమునగు కులమునంబుట్టినవాఁడా! యుద్ధమునందు మిక్కిలియిచ్ఛగలవాఁడా! నాప్రియుఁడా! బంధువులకు మానము గలిగించువాఁడా! (శత్రువుల గర్వము నణఁచువాఁడా!) ఇప్పుడు నన్ననాథనుగా నొంటిమెయి వదలిపోయినావు. ౭

పండితుఁడగువాఁడు కన్యను శూరున కెంతమాత్రము ఇవ్వరాదు. ఏలయనఁగా శూరునిభార్యను నేను ముండమోపినై చెడినాను జూడుము. ౮

అవభగ్న శ్చ మే మానో భగ్నా మే శాశ్వతీ గతిః. ౯
అగాధేచ నిమగ్నాఽస్మి విపులే శోకసాగరే,

అశ్మసారమయం నూన మిదం మే హృదయం దృఢమ్.. ౧౦
భర్తారం నిహతం దృష్ట్వా య న్నాద్య శతధా గతమ్,

సుహృచ్చైవ హి భర్తాచ ప్రకృత్యా మమచ ప్రియః. ౧౧
ఆహవే చ పరాక్రాన్త శ్శూరః పఞ్చత్వ మాగతః,

పతిహీనా తు యా నారీ కామం భవతు పుత్రిణీ. ౧౨
ధనధాన్యై స్సుపూర్ణాఽపి విధ వే త్యుచ్యతే జనైః,
స్వగాత్రప్రభవే వీర! శేషే రుధిరమణ్డలే. ౧3
క్రిమిరాగపరిస్తోమే త్వ మాత్మశయనే యథా,

రేణుశోణితసంవీతం గాత్రం తవ సమ న్తతః. ౧౪
పరిరబ్ధుం న శక్నోమి భుజాభ్యాం ప్లవగర్షభ!,
కృతకృత్యోఽద్య సుగ్రీవో వైరేఽస్మి న్నతిదారుణే. ౧౫
యస్య రామవిముక్తేన హృత మేకేషుణా భయమ్,

శరేణ హృది లగ్నేన గాత్రసంస్పర్శనే తవ. ౧౬
వార్యామి త్వాం నిరీక్షన్తీ త్వయి పఞ్చత్వ మాగతే,

ఉద్వవర్హ శరం నీల స్తస్య గాత్రగతం తదా. ౧౭
గిరిగహ్వరసంలీనం దీప్త మాశీవిషం యథా,

నా గర్వము నశించినది. నా శాశ్వతగతియైన పతి శుశ్రూష భగ్నమయ్యె. ఇంతియగాక అగాధంబును అనంతంబునగు దుఃఖసముద్రంబున మునింగినాను. ౯

పెనిమిటివి నీవు హతుఁడవగుటను జూచియు నిపుడు నూఱువ్రక్కలయి పగులకున్నది గావున ఇంత దృఢమైన నాహృదయము శిలాసారముతోఁ జేయఁబడియుండవలెఁ గాని వేఱు గాదు. ఇది నిశ్చయము. ౧౦

నాకుఁ బెనిమిటియు స్నేహితుఁడును స్వభావంబునఁ బ్రియుఁడును యుద్ధమునందుఁ బరాక్రమవంతుఁడును శూరుఁడునగు వాలి మరణంబు నొందెను. ౧౧

పెనిమిటిమృతిఁ బొందిన వెనుక స్త్రీ పుత్రవతియయినను సంపూర్ణముగా ధనధాన్యములు గలదైనను ఆమెను బంధువులు విధవయనియే గర్హింతురు.

వీరుఁడా! నీవు నీశరీరమునుండి కాఱిన నెత్తురువెల్లువపైఁ బరుండియుండుటం జూడఁగా లత్తుకవలె నెఱ్ఱనైన యాస్తరణముగల నీశయనంబునం బరుండినట్లున్నది. ౧౩

వానరశ్రేష్ఠుఁడా! నీదేహమంతయు దుమ్ము నెత్తురుగలసి కప్పియుండుటం జేసి చేతులనిలువక జాఱుటవలనఁ గౌఁగిలింపఁ జాలకున్నాను. ౧౪

సుగ్రీవునకును వాలికిని ఇట్లు భయంకరమయిన వైరము గలిగి యుండినప్పుడు రాముఁడు సుగ్రీవునకుఁ గల వాలివలని భయమును ఒకబాణముచే హరించి పుచ్చెను గావున నిఁక సుగ్రీవుఁడు కృతార్థుఁడయ్యె. ౧౫

నీవు మృతుఁడవై యుండఁగా నిన్నుఁ గవుఁగిలించుటకేని నీఱొమ్మున నాటియున్న బాణముచే నవకాశము లేకపోవుటవలన నిన్నుఁ గనులం జూచుచుమాత్రమే యుండవలసిన దానను గానున్నాను. అని తార విలపించెను. ౧౬

అపుడు నీలుండు పర్వతగుహను డాఁగియున్న దీప్తంబగు సర్పమును లాగునట్లు వాలిదేహంబున నాటియున్న రామబాణంబును వీడఁ బెఱికి వేసెను.

తస్య నిష్కృష్యమాణస్య బాణస్య చ బభౌ ద్యుతిః. ౧౮
అస్తమస్తకసంరుద్ధో రశ్మి ర్దినకరా దివ,

పేతుః క్షతజధారాస్తు వ్రణేభ్య స్తస్య సర్వశః. ౧౯
తామ్రగైరికసంపృక్తా ధారాఇవ ధరాధరాత్,

అవకీర్ణం విమార్జన్తీ భర్తారం రణరేణునా. ౨౦
అస్త్రై ర్నయనజైః శ్శూరం సిషే చాస్త్రసమాహతమ్,

రుధిరోక్షితసర్వాఙ్గం దృష్ట్వా వినిహతం పతిమ్. ౨౧
ఉవాచ తారా పిఙ్గాక్షం పుత్త్ర మఙ్గద మఙ్గనా,

అవస్థాం పశ్చిమాం పశ్య పితుః పుత్త్ర! సుదారుణామ్. ౨౨
సంప్రసక్తస్య వైరస్య గతోఽన్తః పాపకర్మణా,
బాలసూర్యోదయతనుం ప్రయాన్తం యమసాదనమ్. ౨౩
అభివాదయ రాజానం పితరం పుత్త్ర! మానదమ్,

ఏవ ముక్త స్సముత్థాయ జగ్రాహ చరణౌ పితుః. ౨౪
భుజాభ్యాం పీనవృత్తాభ్యా 'మఙ్గదోఽహ' మితి బ్రువన్,

అభివాదయమానం త్వా మఙ్గదం త్వం యథా పురా. ౨౫
దీర్ఘాయు ర్భవ పుత్త్రేతి కిమర్థం నాభిభాషసే,
అహం పుత్త్రసహాయా త్వా ముపాసే గతచేతసమ్. ౨౬
సింహేన నిహతం సద్యో గౌ స్సవత్సేవ గోవృషమ్,

అట్లు వీడఁ బెఱుకునప్పుడు ఆ రామబాణముయొక్క తేజస్సు అస్త మయపర్వతమునందు దగిలియున్న సూర్యునుండి వెడలు కిరణమువలెం బ్రకాశించినది. ౧౮

పర్వతంబునుండి యెఱ్ఱని గైరికధాతువుతోఁ గలిసి యెఱ్ఱనైన నీటిధారలు స్రవించునట్లు అవ్వాలిదేహమునందలి గాయములనుండి నెత్తురుధారలు స్రవించినవి. ౧౯

తార ఆయుధనిహతుఁడై యుద్ధపరాగముచేఁ గప్పఁబడియున్న శూరుఁడగు పెనిమిటిని కన్నీళ్ళచే దేహముపై దుమ్ముపోఁ గడుగుచుఁ దడిపెను. ౨౦

అట్లు రామబాణహతుఁడై నెత్తుటం దడుపఁబడిన సమస్తావయవంబులతోనున్న పెనిమిటింజూచి తార పింగళవర్ణములయిన కన్నులుగల తనకొమరు నంగదుంబిలిచి యిట్లని పలికెను. ౨౧

కొడుకా! మహాభయంకరమయిన నీతండ్రి మరణావస్థను జూడుము. పాపకర్మమువలనం బుట్టినవైరము ఇపుడు తుదముట్టెను. ౨౨

కుమారుఁడా! యమమందిరంబునకుఁ బోవుచున్నవాని నుదయసూర్యనిభంగి నరుణగాత్రుఁడైన మానదుండగు వానరేశ్వరుని నీతండ్రిని నమస్కరింపుము. అని తార యంగదునితోఁ జెప్పెను. ౨౩

అంత నంగదుఁడు తల్లిపనుపువిని తనచామధేయంబుఁ జేర్కొనుచు గుండ్రములై బలిసిన భుజంబులతోఁ దండ్రిపాదంబులంబట్టి నమస్కారము చేసెను. ౨౪

అంగదుఁడు నీకు నమస్కారము గావింపఁగా మునుపటిరీతి "కుమారుఁడా! చిరాయువగుము" అని నీవతని నేల యాశీర్వదింపకున్నావు? ౨౫

సింహముచే నాక్షణమేహతమయినయాఁబోతును ఆవును దూడయు వదలక సేవించునట్లు హతుఁడవై ప్రజ్ఞలేకయున్ననిన్ను నేనును నాకొడుకును సేవించుచున్నాము. ౨౬

ఇష్ట్వా సంగ్రామయజ్ఞేన రామప్రహరణామ్భసి. ౨౭
అస్మి న్నవభృథే స్నాతః కథం పత్న్యా మయా వినా,
యా దత్తా దేవరాజేన తవ తుష్టేన సంయుగే. ౨౮
శాతకుమ్భమయీం మాలాం తాం తే పశ్యామి నేహ కిమ్,
రాజశ్రీ ర్న జహాతి త్వాం గతాసు మపి మానద!. ౨౯
సూర్య స్యావర్తమానస్య శైలరాజ మివ ప్రభా,

న మే వచః పథ్య మిదం త్వయా కృతం
న చాస్మి శక్తా హి నివారణే తవ,
హతా సపుత్త్రాఽస్మి హతేన సంయుగే
సహ త్వయా శ్రీ ర్విజహాతి మా మిహ. ౩౦

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రయోవింశస్సర్గః. ౨౩.

## చతుర్వింశస్సర్గః.

తాం చాశ్రువేగేన దురాసదేన
త్వభిప్లుతాం శోకమహార్ణవేన,
పశ్యం స్తదా వాల్యనుజ స్తరస్వీ
భ్రాతు ర్వధే నాప్రతిమేన తేపే. ౧
స బాష్పపూర్ణేన ముఖేన వీక్ష్య
క్షణేన నిర్విణ్ణమనా మనస్వీ,
జగామ రామస్య శనై స్సమీపం
భృత్యై ర్వృత స్సంపరిదూయమానః. ౨
స తం సమాసాద్య గృహీతచాప
ముదాత్త మాశీవిషతుల్యబాణమ్,

నీవు యుద్ధమను యజ్ఞముగావించి రామబాణంబను జలమునందు అవభృథస్నానము చేసినావుగదా! భార్యను నన్నువదలి యెట్లు చేసితివి? ౨౬

మున్ను దేవేంద్రుఁడు యుద్ధంబున సంతుష్టుఁడై నీకొసంగిన కాంచనహారము ఇప్పుడు నీవక్షస్స్థలంబున నెందువలన నగపడలేదు? ౨౭

మాకు సమస్తసౌఖ్యంబుల నొసంగి గర్వము గలుగఁజేయువాఁడా! ప్రదక్షిణము సేయుచున్న సూర్యునికాంతి మేరుపర్వతమును విడువకుండునట్లు నీవు మృతుండవైనను రాజలక్ష్మి నిన్ను వదల కున్నది. ౨౮

నీవు నేను జెప్పిన హితవచనమును వినవైతివి. నిన్నపుడు యుద్ధమునకుఁ బోనీక ఆపుటకు నేను సమర్థురాలఁ గాకపోతిని. కావున నేనును నాకొడుకును హతులమయితిమి. యుద్ధంబున నీవు హతుఁడ వయినప్పుడె నాలక్ష్మియు నన్ను వదలిపోయినది. అని తార విలపించెను. ౩౦

ఇది యిరువదిమూఁడవసర్గము.

---

## ఇరువదినాల్గవసర్గము.

అంత బలవంతుఁడగు వాలితమ్ముఁడు సుగ్రీవుఁడు అట్లు కన్నీరువెల్లువగా రోదనంబుసేయుచు దుఃఖసముద్రంబున మునింగియున్న తారం జూచి దుఃఖమునొందినవాఁడై తనయన్నను దానే వధింపించినందుకు మిక్కిలియుఁ బరితాపమునొందెను. ౧

గొప్ప మనస్సుగల యా సుగ్రీవుఁడు ముఖమునిండఁ గన్నీళ్లుగాఱఁ దారంజూచి క్షణంబునఁ బరమదుఃఖితుఁడై భ్రాతృవధంబునకు మిక్కిలియుఁ బరితాపమునొందుచు భృత్యులు పరివేష్టించి వెంబడింప మెల్లమెల్లఁగా రామునియొద్దకుఁ బోయెను. ౨

అట్లు ధనుస్సును సర్పతుల్యంబులగు బాణములును ధరించి నిలిచియున్నవాఁడును ఉత్తముఁడును యశస్సంపన్నుండును శుభలక్షణములచే నలం

యశస్వినం లక్షణలక్షితాఙ్గ
మవస్థితం రాఘవ మిత్యువాచ. ౩
యథా ప్రతిజ్ఞాత మిదం నరేన్ద్ర!
కృతం త్వయా దృష్టఫలం చ కర్మ,
మ మాద్య భోగేషు నరేన్ద్రపుత్ర!
మనో నివృత్తం సహ జీవితేన. ౪
అస్యాం మహిష్యాం తు భృశం రుదన్త్యాం
పురే చ విక్రోశతి దుఃఖతప్తే,
హతే౽గ్రజే సంశయితే౽ఙ్గదే చ
న రామ! రాజ్యే రమతే మనో మే. ౫
క్రోధా దమర్షా దతివిప్రధర్షా
ద్భ్రాతు ర్వధో మే౽నుమతః పురస్తాత్,
హతే త్విదానీం హరియూథపే౽స్మిం
త్సుతీవ్ర మిక్ష్వాకుకుమార! తప్స్యే. ౬
శ్రేయో౽ద్య మన్యే మమ శైలముఖ్యే
తస్మి న్నివాస శ్చిర మృశ్యమూకే,
యథా తథా వర్తయత స్స్వవృత్త్యా
నేమం నిహత్య త్రిదివస్య లాభః. ౭
న త్వాం జిఘాంసామి చరేతి య న్మా
మయం మహాత్మా మతిమా నువాచ,
తస్యైవ త ద్రామ! వచో౽నురూప
మిదం పునః కర్మ చ మే౽నురూపమ్. ౮
భ్రాతా కథం నామ మహాగుణస్య
భ్రాతు ర్వధం రాఘవ! రోచయేత,

కృతములయిన యవయవములుగలవాఁడునగు నారాముని యొద్దకుఁ బోయి సుగ్రీవుం డిట్లని పలికెను. 3

మనుజనాథుఁడవగు రామూఁడా! నీవుచేసిన ప్రతిజ్ఞదప్పక వాలిని వధించి నాకు రాజ్యంబు సిద్ధింపఁజేసినావు. అయితే రాచకొమరుఁడా! నాకు భోగములందు మాత్రమె గాదు జీవితమునంగూడ నెంతమాత్రము ఇచ్ఛలేదు.

రామూఁడా! పట్టమహిషి యయిన యీతార యిట్లు రోదనము సేయుచుండఁగాఁ గిష్కింధానగరమునందలి వానరులందఱు పరమదుఃఖితులయి యాక్రోశించుచుండఁగా నాయన్న వాలిహతుఁడుగాఁగా అంగదుఁడును ప్రాణసంశయము నొందఁగా నాకీరాజ్యంబేల? నాకెంతమాత్ర మక్కఱలేదు.

రామూఁడా! మున్ను క్రోధంబువను వాలిగావించు మహాబాధను సహింపఁజాలకయే అన్నను వధించుట నాకు ఇష్టముగా నుండినది. ఇప్పుడు మీరు వాలిని వధించినతరువాతఁ బరితాపము పట్టఁజాలకున్నాను. ౭

ఇఁక నాకుఁ దగినవృత్తిచే జీవనము చేయుచు నాజీవితకాలమువఱకు ఆబుశ్యమూక పర్వతమునందు వాసము సేయుటయె నాకు ఉత్తమముగాఁ దోఁచుచున్నది. ఈవాలిని వధించినతరువాత స్వర్గమువచ్చినను నాకు వలదు.

రామూఁడా! మహానుభావుఁడును బుద్ధిమంతుఁడునగు వాలి "నిన్ను నేను చంపుటలేదు పొమ్ము" అని నాతోఁ జెప్పినాఁడు. ఆమాట మహానుభావుఁడగు నావాలికే యనురూపముగా నున్నది దురాత్ముఁడనగు నాకో యిట్లతని వధింపించుట యనురూపము. ౯

రామూఁడా! అన్నను వధించిన పిదపఁగలుగు రాజ్యసుఖం బధికమో దుఃఖమధికమో విచారింపక కేవలకామమునకు లోఁబడి తమ్ముఁ డెక్కడ

రాజ్యస్య దుఃఖస్యచ వీర! సారం
నచిన్తయ న్కామపురస్కృత స్సన్.
వధో హి మే మతో నాసీ త్స్వమాహాత్మ్యావ్యతిక్రమాత్,
మమాఽసీ ద్బుద్ధిదౌరాత్మ్యా త్ప్రాణహారీ వ్యతిక్రమః. ౧౦

ద్రుమశాఖావభగ్నోఽహం ముహూర్తం పరినిష్టనన్,
సాన్త్వయిత్వా త్వనేనోక్తో నపునః కర్తు మర్హసి. ౧౧

భ్రాతృత్వ మార్యభావ శ్చ ధర్మ శ్చానేన రక్షితః,
మయా క్రోధశ్చ కామశ్చ కపిత్వంచ ప్రదర్శితమ్. ౧౨

అచిన్తనీయం పరివర్జనీయ
మనీప్సనీయం స్వనవేక్షణీయమ్,
ప్రాప్తోఽస్మి పాప్మాన మిమం నరేన్ద్ర!
భ్రాతు ర్వధా త్త్వాష్ట్రవధా దివేన్ద్రః. ౧౩
పాప్మాన మిన్ద్రస్య మహీ జలం చ
వృక్షాశ్చ కామం జగృహుః స్త్రియశ్చ,
కో నామ పాప్మాన మిమం క్షమేత
శాఖామృగస్య ప్రతిపత్తు మిచ్ఛన్. ౧౪
నార్హామి సమ్మాన మిమం ప్రజానాం
న యౌవరాజ్యం కుతఏవ రాజ్యమ్,
అధర్మయుక్తం కులనాశయుక్త
మేవంవిధం రాఘవ! కర్మ కృత్వా. ౧౫
పాపస్య కర్తాఽస్మి విగర్హితస్య
క్షుద్రస్య లోకాపకృతస్య చైవ,

నేని ఎంత పాపియయినను మహానుభావుఁడయిన యన్నను వధింపఁగోరుదునా? నాయట్టి పాపి యెవ్వఁడును లేఁడు. ౯

వాలి గొప్పమనస్సుగలవాఁడు. ధర్మంబు దప్పనివాఁడు గావున నన్ను వధించుట యతని కిష్టము గాదయ్యె. నేను దురాత్ముఁడఁ గావున అన్నను వధించుటకు ఇట్లు అమర్యాదగాఁ బ్రయత్నించితిని. ౧౦

వాలి చెట్టుకొమ్మలచే దెబ్బలుదిన్నవాఁడనై నేను బాధచే నఱచుచుండఁగా నన్నుఁజూచి మంచిమాటలుచెప్పి "యిఁకనిట్లు యుద్ధమునకు రాకుము" అని చెప్పెను. ౧౧

వాలి తోడఁబుట్టుఁదనమును సత్పురుషస్వభావమును ధర్మమును అనువర్తించి నన్ను వధింపక విడచుచుండెను నేను కామక్రోధంబు నవలంబించి నావానరస్వభావంబునకుఁ దగినకార్యము నే గావించినాను. ౧౨

మనుజేశ్వరుఁడవగు రాముఁడా! మున్ను త్వష్టృపుత్త్రు విశ్వరూపుని జంపి యింద్రుఁడు మహాపాపము నొందినట్లు నేనిప్పుడు అన్నను వధింపించి ఇంతయని యెన్నరానిదియు సత్పురుషులకుఁ బరిహరణీయంబును గోరరానిదియుఁ జూచుటకేని యయోగ్యంబునగు మహాపాపమును బొందినాను. ౧౩

అతఁడు దేవేంద్రుఁడు కావున వరంబులొసఁగు నను నాశచే నతని పాపమును భూమియు జలంబును వృక్షంబులును స్త్రీలును గ్రహించిరి. ఇఁకఁ గోఁతినగు నాపాపమును ఎవ్వఁడు గ్రహించుట కంగీకరించును? ౧౪

రాముఁడా! అధర్మిష్ఠమును వంశనాశమునకుఁ గారణంబునగు నిట్టి భ్రాతృవధరూపమయిన మహాపాపమును గావించి నే నిఁకఁ బ్రజలచే సమ్మానింపఁబడుటకు అర్హుఁడఁగాను. యౌవరాజ్యంబునకు నర్హుఁడను గాను. ఇఁక రాజ్యంబున కర్హుఁడను గానని చెప్పనేల? ౧౫

శిష్టులచే నిందింపఁబడినదియు నీచంబును సమస్తలోకంబులచేతను విడువఁబడినదియునగు మహాపాపము గావించినాను. వర్షంబునఁబుట్టిన జలవేగము

శోకో మహా న్మా మభివ ర్తతేఽయం
వృష్టే ర్యథా నిమ్న మి వామ్బువేగః. ౧౬
సోదర్యఘాతా పరగాత్రవాల
స్సన్తాపహస్తాక్షిశిరోవిషాణః,
ఏనోమయో మా మభిహన్తి హస్తీ
దృప్తో నదీకూలమివ ప్రవృద్ధః. ౧౭
అంహో బ తేదం నృవరా విషహ్యా
నివ ర్తతే మే హృది సాధు వృత్తమ్,
వివర్ణ మగ్నౌ పరితప్యమానం
కిట్టం యథా రాఘవ! జాతరూపమ్. ౧౮

మహాబలానాం హరియూథపానా
మిదం కులం రాఘవ! మన్నిమి త్తమ్,
అస్యాఙ్గద స్యాపి చ శోకతాపా
దర్ధస్థితప్రాణ మి తీవ మన్యే. ౧౯
సుత స్సులభ్య స్సుజన స్సువశ్యః
కుత స్సుపుత్ర స్సదృశోఽఙ్గదేన,
నచాపి విద్యేత స వీర! దేశో
యస్మి న్భవే త్సోదరసన్నికర్షః. ౨౦
య ద్యఙ్గదో వీర! వరార్హ! జీవే
జ్జీవేచ్చ మాతా పరిపాలనార్థమ్,
వినా తు పుత్రం పరితాపదీనా
తారా నజీవే దితి నిశ్చితం మే. ౨౧
సోఽహం ప్రవేక్ష్యా మ్యతిదీప్త మగ్నిం
భ్రాత్రా చ పుత్రేణ చ సఖ్య మిచ్ఛన్,

పల్లభూమిం బొందునట్లు ఈమహాదుఃఖము నన్నుం బొందియున్నది. ౧౭

మత్తగజము ఏటిగట్టును కొమ్ములం బొడుచునట్లు అన్నను వధించుటయును శరీరపృష్ఠభాగమును వాలమును గలదియు ఆయనకు సంతాపము గలిగించుటయును తొండము కన్నులు శిరస్సు దంతములు గలదియునగు మహాపాపమను మత్తగజము అనుక్షణము వృద్ధిఁబొందుచు నన్ను హింసించుచున్నది.

పురుషోత్తముఁడవగు రాముఁడా! అగ్నియందు బంగారము కాఁచఁబడఁగా దానిసహింపఁజాలక బంగారముతోఁ జేరియున్న మలము నశించునట్లు నామనస్సుననున్న ధర్మగుణముగూడ ఘనీభవించి నా మనస్సు నాక్రమించిన యీ మహాపాపమును సహింపఁజాలక నశించిపోవును. అయ్యో యేమిసేయుదును? ౧౮

రఘువంశప్రసూతుండవగు రాముఁడా! మఱియు నానిమిత్తముగా నే ఈయంగదుఁడు తండ్రి హతుఁడగుటకుఁ బరితపించుటనుజూచి మహాబలులగు నీవానరవీరులసమూహము ఇప్పటికె సగముపోయిన ప్రాణముతోనున్నట్లు తలంచుచున్నాను. ౧౯

వీరుఁడవగు రాముఁడా! సౌజన్యముగలవాఁడును జెప్పినట్లు వినువాఁడునగు కొడుకును సులభముగాఁ బడయవచ్చునుగాని అంగదునివంటి సుపుత్రునిఁబొందుట మాత్రము దుర్లభము. మఱియు నేదేశమునకుఁ బోయినను సోదరునిఁ బొందుటయు శక్యముగాదు. ౨౦

వీరుఁడవు సర్వోత్తముఁడవగు రాముఁడా! ఒకవేళ నంగదుఁడు జీవించియుండునేని యతనితల్లితారయు నతని సంరక్షణార్థము జీవించియుండును గాని యతఁడు బ్రతికియుండనియెడమాత్రము పరమదుఃఖితురాలును దీనురాలునగుతార యొంతమాత్రము జీవింపదని నానిశ్చయము. ౨౧

అట్టి మహాపాపినగు నేను ఇఁకనైనను నాయన్నతోను నాకొడుకు అంగదునితోను స్నేహము నెఱపుటకై ప్రజ్వలించుచున్నయగ్నిం బ్రవేశించె

ఇమే విచేష్యన్తి హరిప్రవీరా
స్సీతాం నిదేశే తవ వర్తమానాః. ౨౨
కృత్స్నం తు తే సేత్స్యతి కార్య మేత
న్మ య్యప్రతీతే మనుజేన్ద్రపుత్ర!,
కులస్య హన్తార మజీవనార్హం
రామానుజానీహి కృతాగసం మామ్. ౨౩

ఇత్యేవ మార్తస్య రఘుప్రవీర
శ్శ్రుత్వా వచో వాల్యనుజస్య తస్య,
సంజాతబాష్పః పరవీరహన్తా
రామో ముహూర్తం విమనా బభూవ. ౨౪
తస్మిన్ క్షణేఽభీక్ష్ణ మవేక్ష్యమాణః
క్షితిక్షమావా న్భువనస్య గోప్తా,
రామో రుదన్తీం వ్యసనే నిమగ్నాం
సముత్సుక స్సోఽథ దదర్శ తారామ్. ౨౫
తాం చారునేత్రాం కపిసింహనాథం
పతిం సమాశ్లిష్య తదా శయానామ్,
ఉత్థాపయామాసు రదీనసత్త్వాం
మన్త్రిప్రధానాః కపివీరపత్నీమ్. ౨౬
సా విస్ఫురన్తీ పరిరభ్యమాణా
భర్తు స్సకాశా దపనీయమానా,
దదర్శ రామం శరచాపపాణిం
స్వతేజసా సూర్యమివ జ్వలన్తమ్. ౨౭
సుసంవృతం పార్థివలక్షణైశ్చ
తం చారునేత్రం మృగశాబనేత్రా,

వను. ఈవానరవీరులందఱు నీ యాజ్ఞాప్రకారముసంప్రవర్తింపుచు సీతాదేవిని వెతకఁగలరు. ౨౨

మనుష్యనాథుండగు దశరథమహారాజుయొక్క కుమారుఁడవైనరాముఁడా! నేను మృతుఁడనైనను నీకార్యము ఎంతమాత్రము కొఱఁతలేక సిద్ధింపఁగలదు. కావునఁ గులమునంతయు వధించినవాఁడను మహాపాపిని అపరాధిని గావున జీవించుట కనర్హుఁడనగునాకు అగ్నిప్రవేశముసేయ ననుమతి యొసంగుము. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౩

శత్రువీరుల వధించునట్టి రఘువీరోత్తముఁడగు రాముండు వాలితమ్ముని సుగ్రీవునిమాటనువిని తానును బరమదుఃఖితుఁడై కన్నుల నీళ్లుగాఱఁ గొంతసేపు ఏమియుఁ దోఁచక విచారముతో నుండెను. ౨౪

అంత భూమికింబోలె నోర్పుగలవాఁడును సమస్తలోకంబులను రక్షించువాఁడునగురాముండు పలుమాఱు తారచేఁ జూడఁబడుచున్నవాఁడై తానును ఆమెకు శోకపరిహారంబు సేయఁగోరి దుఃఖసముద్రంబున మునింగి రోదనంబుసేయుచున్నతారం జూచెను. ౨౫

అప్పుడు రాముఁడు వచ్చుటంజూచి మంత్రివరులగువానరులు వానరోత్తములకు నాథుఁడగువాలిని కౌఁగిలించికొని పరుండియున్న సుందరములగు కన్నులుగలదాని గొప్పబుద్ధిగలదాని వానరరాజపత్నిని లేవనెత్తిరి. ౨౬

ఆతార దుఃఖాతిశయంబునఁ బెనిమిటిని విడలలేక చలించుచుండుట వలన మంత్రులామెను బలాత్కారంబున బాహువులంబట్టి పెనిమిటి యొద్దనుండి యావలికిఁ గొనివచ్చుటయు నామె ధనుర్బాణంబులు దాల్చి తేజస్సుచే సూర్యునివలె జ్వలించుచున్న రాముం జూచెను. ౨౭

జింకపిల్లకన్నులవంటి కన్నులుగలయాతార సమస్తరాజలక్షణంబులతోను గూడినవాఁడును సుందరము లయిన కన్నులుగలవాఁడును ఇదివఱ

అదృష్టపూర్వం పురుషప్రధాన
మయం స కాకుత్స్థ ఇతి ప్రజజ్ఞే. ౨౮
త స్యేన్ద్రకల్పస్య దురాసదస్య
మహానుభావస్య సమీప మార్యా,
ఆర్తాఽతితూర్ణం వ్యసనాభిపన్నా
జగామ తారా పరివిహ్వలన్తీ. ౨౯
సా తం సమాసాద్య విశుద్ధసత్త్వా
శోకేన సంభ్రాన్తశరీరభావా,
మనస్వినీ వాక్య మువాచ తారా
రామం రణోత్కర్షణలబ్ధలక్షమ్. ౩౦
త్వ మప్రమేయ శ్చ దురాసద శ్చ
జితేన్ద్రియ శ్చో త్తమధార్మిక శ్చ,
అక్షయ్యకీ ర్తిశ్చ విచక్షణశ్చ
క్షితిక్షమావా న్క్షతజోపమాక్షః. ౩౧
త్వ మా త్తబాణాసనబాణపాణి
ర్మహాబల స్సంహననోపపన్నః,
మనుష్యదేహాభ్యుదయం విహాయ
దివ్యేన దేహాభ్యుదయేన యుక్తః. ౩౨

యే నైకబాణేన హతః ప్రియో మే
తే నైవ మాం త్వం జహి సాయకేన,
హతా గమిష్యామి సమీప మస్య
న మా మృతే రామ! రమేత వాలీ. ౩౩
స్వర్గేఽపి పద్మామలపత్రనేత్ర
స్సమేత్య సంప్రేక్ష్య చ మా మపశ్యన్,

కన్నఁడును ఎప్పుడును చూడఁబడనివాఁడునుబురుషోత్తముఁడునగు రాముం జూచి "యితఁడె యారాముఁ" డని తెలిసికొనెను. ౨౮

ప్రాజ్ఞురాలగు తార అట్లు ఆర్తయయి దుఃఖపీడితయయి మాటిమాటికి మూర్ఛనొందుచు దేవేంద్రునితో సమానుండును శత్రువుల కెంతమాత్రము సమీపింప నలవిగానివాఁడును మహాత్ముఁడునగు నారాముని సమీపమునకు శీఘ్రంబునం బోయెను. ౨౯

పరిశుద్ధమయిన చిత్తవృత్తిగలదియు దృఢమయిన మనస్సుగలదియు నగు నాతార దుఃఖంబునం దొట్రుపడుచున్న యవయవములతో రాముని యొద్దకుంబోయి ఒకటేబాణంబున వాలినివధించిపుచ్చినట్టి యారాముంజూచి యీమాటలను జెప్పెను. 30

నీవు అప్రమేయుండవు. నిన్నుఁబొందుట యేరికి నలవిగాదు జితేంద్రియుండవు ధార్మికులలో నెల్ల నుత్తముఁడవు. అనంతమయిన కీర్తిగలవాఁడవు. మహాసమర్థుండవు. భూమివలె క్షమగలవాఁడవు. రక్తాంతనయనుండవు.

నీవు ధనుస్సును బాణంబులును హస్తములం దాల్చినవాఁడవు. మహాబలుండవు. దృఢమయిన యవయవ సంస్థానము గలవాఁడవు. ఇప్పుడు దుష్టసంహారార్థమయి మనుష్యశరీరము నొందియున్నావు గాని పరమార్థంబున నీవు జననమరణాత్మకంబయిన సంసారంబునకుఁ లోఁబడక యప్రాకృతంబగు దివ్యశరీరంబుతోఁ గూడినవాఁడవు. 3౨

నీవు ఏబాణముచేత నాప్రియుని వాలిని వధించినావో ఆబాణముచేతనే నన్నుఁగూడ వధింపుము హతురాలనై ప్రియుఁడైన వాలియొద్దకుఁ బోయెదను. రాముఁడా! నీవు అందఱను రమింపఁజేయువాఁడవు. ఈకార్యము చేసి వాలిని రమింపఁజేయుము. నేను లేనియెడ వాలి యెంతమాత్రము సంతోషింపఁడు. 33

తామరపూరేకులవంటి కన్నులుగలవాలి స్వర్గంబునందుఁగూడ అప్సరసలంగూడి వారలంజూచి, యందు నన్నుఁ గానఁడేని నానావిధములయిన

న హ్యేవ ఉచ్చావచతామ్రచూడా
విచిత్రవేషాప్సరసోఽభజిష్యత్. 34
స్వర్గేఽపి శోకం చ వివర్ణతాం చ
మయా వినా ప్రాప్స్యతి వీర! వాలీ,
రమ్యే నగేన్ద్రస్య తటావకాశే
విదేహకన్యారహితో యథా త్వమ్. 35
త్వం వేత్థ యావద్వనితావిహీనః
ప్రాప్నోతి దుఃఖం పురుషః కుమారః,
తత్త్వం ప్రజానన్ జహి మాం న వాలీ
దుఃఖం మమాదర్శనజం భజేత. 36
యచ్చాపి మన్యేత భవాన్మహాత్మా
స్త్రీఘాతదోషో నభవేత్తు మహ్యమ్,
ఆత్మేయమస్యేతి చ మాం జహి త్వం
నస్త్రీవధస్స్యాన్మనుజేన్ద్రపుత్ర!. 37
శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదా
దాత్మా హ్యనన్యః పురుషస్య దారాః,

దారప్రదానాన్నహి దానమన్య
త్ప్రదృశ్యతే జ్ఞానవతాం హి లోకే. 38

త్వం చాపి మాం తస్య మమ ప్రియస్య
ప్రదాస్యసే ధర్మమవేక్ష్య వీర!,

యొజ్జనిపూలను శిరస్సున ముడుచుకొన్నవారలును నానావిధములయిన యలంకారములు గలవారలునగు నాయప్సరసలం బొందకయె యుండును.

పరాక్రమశాలివగు రాముఁడా! పర్వతోత్తమంబగు ఋశ్యమూక పర్వతంబునందలి రమణీయంబులయిన తటములయందు సీతా విరహితుం డవై నీవు పరితపించునట్లు వాలి స్వర్గంబునొందియు నేను లేనియెడ నావిర హంబునం బరితపించుచు వెలవెలంబోవుచుండును. ౩౫

యౌవనవంతుండగు పురుషునకు భార్యావిరహంబు గలిగినచో నెంత దుఃఖము గల్గునో అది నీకుఁ దెలిసియున్నది. నీవు అమ్మహాదుఃఖమును దెలిసిన వాఁడవు కావున నన్ను శీఘ్రంబున వధింపుము. నన్ను వధించినయెడ నేనును వాలియొద్దకుఁ బోవుదును గావున వాలికి నేనులేనిదుఃఖము గలుగకుండును.

రాజపుత్త్రుండవగు రాముఁడా! మహాత్ముఁడవగునీవు స్త్రీహత్యకా రాదని తలంతువేమో, అదియుక్తము గాదు. 'వాలియొక్క ఆత్మయె యీతార' యనితలఁచి నన్ను వధింపుము. నీకు స్త్రీవధ దోషంబురాదు. ౩౬

ధర్మశాస్త్రవచనముల వలనను అనేకములయిన వేదవాక్యములవల నను భార్య పురుషునియొక్క ఆత్మయేగాని భిన్నురాలు కాదని తెలియుచు న్నదిగదా! కాఁబట్టి నన్ను వధించుటయు వాలివధంబునందె యంతర్భావము నొందుటవలన నీకు స్త్రీవధదోషము లేదు.

లోకంబున భార్యాదానమునకన్న నధికమయినదాన మేదియులేదని పండితులు వచించెదరు. గావున నన్నుఁ జంపుటవలనఁ బాపము లేకపోవుట యేగాక నీకుఁ బుణ్యంబును గలుగును. ౩౭

వీరుండవగురాముఁడా! మాకు సౌఖ్యము గలుగుటయేగాక నీవును ధర్మమును బరిశీలించి నన్ను నాప్రియుఁడైనవాలికి ఒసంగినవాఁడవగుదువు;

అనేన దానేన నలప్స్యసే త్వ
మధర్మయోగం మమ వీరఘాతాత్. ౩౯

ఆర్తా మనాథా మపనీయమానా
మేవంవిధా మర్హసి మాం నిహన్తుమ్,
అహం హి మాతఙ్గవిలాసగామినా
ప్లవఙ్గమానా మృషభేణ ధీమతా. ౪౦
వినా వరార్హోత్తమహేమమాలినా
చిరం నశక్ష్యామి నరేన్ద్ర! జీవితుమ్,

ఇత్యేవముక్తస్తు విభుర్మహాత్మా
తారాం సమాశ్వాస్య హితం బభాషే. ౪౧
మా వీరభార్యే! విమతిం కురుష్వ
లోకోహి సర్వో విహితో విధాత్రా,
తం చైవ సర్వం సుఖదుఃఖయోగం
లోకోఽబ్రవీత్తేన కృతం విధాత్రా. ౪౨
త్రయోహి లోకా విహితం విధానం
నాతిక్రమన్తే వశగా హితస్య,
ప్రీతిం పరాం ప్రాప్స్యసి తాం తథైవ
పుత్రస్తు తే ప్రాప్స్యతి యౌవరాజ్యమ్. ౪౩
ధాత్రా విధానం విహితం తథైవ
న శూరపత్న్యః పరిదేవయన్తి,

ఇట్లు నన్ను నాప్రియునికి దానము సేయుటచేత నీకు వాలివధమువలన గలిగిన పీరహత్యాదోషముగూడ నుండదు. కావున నావధము నీకు వాలివధప్రాయశ్చిత్తరూపము నగుచున్నది. 39

దుఃఖురాలను అనాథురాలను నాథునియొద్దనుండి తొలఁగింపఁబడుచున్నదానను ఇట్టిమహాపదలోనున్న నన్ను వధించి పుణ్యంబు వహింపుము.

మనుష్యేశ్వరుండవగు రాముఁడా! మదపుటేనుఁగునకుంబోలె విలాసగమనముగలవాఁడును, ఉత్తమకాంచనమయంబగు దివ్యహారము ధరించినవాఁడును, సమస్త వానరోత్తముండునగు వాలిని విడిచి నేనేమో యధికకాలము జీవింపఁజాలను; ఎట్లయినను నేను మృతిఁబొందుదును. కాఁబట్టి నీవే వధించి పుణ్యమునొందుట మంచిది. అని తార రామునితోఁ జెప్పెను 40

లోకనాథుఁడును మహాత్ముఁడు నగురాముఁడు, తారావచనమును విని ఆమెను ఆశ్వాసించి, ఆమెకు హితముఁ జెప్పెను. 41

వీరుఁడగు వాలియొక్క భార్యవైన తారా! నీవు వీరభార్యవైయుండి యిట్లు ఘోర విరుద్ధములయినమాటలు చెప్పుట యుక్తముగాదు; ఈలోకమంతయు బ్రహ్మదేవుఁడు సృజించినప్పుడ యాబ్రహ్మయే జనులకు సుఖమును దుఃఖమును గలిగించినాఁడని పండితులును పామరులును జెప్పుదురు. 42

బ్రహ్మచే నియమింపఁబడిన విధిని మూఁడులోకంబులకు అతిక్రమింప నలవిగాదు. సమస్తంబును ఆవిధికి లోఁబడియుండును. కావున నీవు దుఃఖింపకుము. వాలి యున్నపుడువలె నీవు అధికసంతోషంబు నొందఁగలవు. నీకొడుకు అంగదుఁడు యువరాజు గాఁగలఁడు. 43

వాలి యిపు డిట్లు హతుఁడుగావలసినట్లు బ్రహ్మదేవుఁడు విధించినాఁడు; అవ్విధి నతిక్రమింపఁ దరముగాదు కావున దుఃఖింపవలదు; నీవంటి శూరభార్యలు ఇట్లు ఎందును దుఃఖింపరు. అని రాముండు తారకుఁ జెప్పెను.

ఆశ్వాసితా తేన తు రాఘవేణ
ప్రభావయుక్తేన పరన్తపేన.
సా వీరపత్నీ ధ్వనతా ముఖేన
సువేషరూపా విరరామ తారా.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుర్వింశ స్సర్గః ౨౪.

---

పఞ్చవింశ స్సర్గః.

సుగ్రీవం చైవ తారాంచ సాఙ్గదం సహలక్ష్మణః,
సమానశోకః కాకుత్‌స్థ స్సాన్త్వయ న్నిద మబ్రవీత్. ౧

న శోకపరితాపేన శ్రేయసా యుజ్యతే మృతః,
య దత్రానన్తరం కార్యం త త్సమాధాతు మర్హథ. ౨

లోకవృత్తమ నుష్ఠేయం కృతం వో బాష్పమోక్షణమ్,
న కాలా దుత్తరం కించి త్కర్మ శక్య ముపాసితుమ్. ౩

నియతిః కారణం లోకే నియతిః కర్మ సాధనమ్,
నియతి స్సర్వభూతానాం నియోగే ష్విహ కారణమ్. ౪

న కర్తా కస్యచి త్కశ్చి న్నియోగే చాపి నేశ్వరః,
స్వభావే వర్తతే లోక స్తస్య కాలః పరాయణమ్. ౫

నకాలః కాల మత్యేతి నకాలః పరిహీయతే,
స్వభావంచ సమాసాద్య నకశ్చి దతివర్తతే. ౬

మంచి యలంకారములచే నలంకృతమయిన రూపముతో నొప్పుచున్న శూరపత్నియగు నాతార, అట్లు రోదనంబుసేయుచు మహాప్రభావుండును శత్రుతాపనుండునగు రామునిచే నాశ్వాసింపఁబడినదై రాముండు అంగదునకు యౌవరాజ్యంబొసంగి యతనిశత్రువుల సంహరింపఁగలండని కొంత యూరటనొందెను. ౪౪

ఇది యిరువదినాల్గవసర్గము.

## ఇరువదియైదవసర్గము.

అంత రాముండును లక్ష్మణసహితుఁడై తానును సుగ్రీవాదులతో సమానమయిన దుఃఖముగలవాఁడై సుగ్రీవాంగదులను దారను ఆశ్వాసించుచు నీమాటం జెప్పెను. ౧

దుఃఖముచే నెంత పరితపించినను అందువలన మృతుల కెంతమాత్రము మంచిగలుగదు. కావున, ఇపుడు వాలికి నేమేమి శ్రేయస్కరమయినది చేయవలెనో అట్టియూర్ధ్వదైహికము నెఱవేర్పుఁడు. ౨

లోకమునందు సాధారణముగాఁ బామరులు గావించునట్టి కన్నీరు విడుచుటనే మీరుచేసినారు. విధినతిక్రమించి ఎవ్వరికిని ఏకార్యముగాని చేయనలవిగాదు. ౩

సమస్తలోకములకును కాలమె కారణము సమస్తకార్యములకును కాలమె సాధనము. సమస్తజంతువులను ఆయాకార్యంబులందుఁ గాలమే ప్రేరించుచున్నది. కాలము నతిక్రమించినది ప్రపంచంబున నేదియులేదు. ౪

ఎవ్వఁడును ఏకార్యమునకును గర్తకాఁడు. ఎవ్వఁడును ఎవ్వనిని ప్రేరింపను సమర్థుఁడుకాఁడు. లోకమంతయు కాలము ననువర్తించియున్నది. కావునఁ గాలమే లోకమునకు ముఖ్యకారణము. ౫

కాలము స్వతంత్రమేగాని దేనికిని లోఁబడినదిగాదు. కాలము జన్మనాశాదిషడ్భావవికారములులేనిది లోకంబున నెవ్వఁడును సమస్తకారణమయిన కాలమునకు లోఁబడియుండునే గాని దాని నతిక్రమింపఁజాలఁడు. ౬

న కాల స్యాస్తి బన్ధుత్వం న హేతు ర్న పరాక్రమః,
న మిత్రజ్ఞాతిసంబన్ధః కారణం నాత్మనో వశః. ౭

కింతు కాలపరీణామో ద్రష్టవ్య స్సాధు పశ్యతా,
ధర్మ శ్చార్థ శ్చ కామ శ్చ కాలక్రమసమాహితాః. ౮

ఇత స్స్వాం ప్రకృతిం వాలీ గతః ప్రాప్తః క్రియాఫలమ్,
ధర్మార్థకామసంయోగైః పవిత్రం ప్లవగేశ్వరః. ౯

స్వధర్మస్య చ సంయోగా జ్జిత స్తేన మహాత్మనా,
స్వర్గః పరిగృహీత శ్చ ప్రాణా నపరిరక్షతా. ౧౦

ఏషా వై నియతి శ్శ్రేష్ఠా యాం గతో హరియూథపః,
త దలం పరితాపేన ప్రాప్తకాల ముపాస్యతామ్. ౧౧

వచనాన్తే తు రామస్య లక్ష్మణః పరవీరహా,
అవద త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం గతచేతసమ్. ౧౨

కురు త్వ మస్య సుగ్రీవ! ప్రేతకార్య మనన్తరమ్,

ఈశ్వరునకు ఎవ్వనితోను బంధుత్వము లేదు. ఉపకారాదులచే దాక్షిణ్యంబును లేదు. అతఁడు పరాక్రమవంతుఁడే యని దయఁజూడఁడు ఎవ్వనితోను స్నేహము దాయాదత్వము మొదలయిన సంబంధములును అతనికి లేవు. అతఁడు పురుషాధీనుఁడును గాఁడు. అతఁడు సమస్తంబునకును గారణమే గాని యతనికి వేఱొకకారణము లేదు. స్వతంత్రుఁడు. పురుషులకుఁ దత్తత్కర్మానుగుణమయినఫలము నొసఁగుచుండును. కావున ఇట్టి విషయముల యందు దుఃఖింపరాదు. ౭

మఱియేమన్నను, బుద్ధిమంతుఁడగువాఁడు ఏమిసంభవించినను దాని స్వకర్మానురూపముగా నీశ్వరుఁడొసంగిన ఫలముగా నెఱింగి నెమ్మది నుండవలయును. ఈశ్వరునిచేతనె వారివారి కర్మక్రమము ననుసరించి వారివారికి అప్పుడప్పుడు ధర్మము అర్థము కామము ఇయ్యఁబడుచున్నవి. ౮

వానరేశ్వరుండగువాలి నాచేత వధింపఁబడి ప్రాయశ్చిత్తము నొందుటంజేసి పాపమువదలి తొల్లిటిపారిశుద్ధ్యమును బొంది తాను శాస్త్రమునందు విధింపఁబడినవిధంబు జవదాఁటక యాచరించిన ధర్మార్థకామములవలనఁ గలుగుసుఖం బనుభవించుటకై యీలోకంబునుండి స్వర్గంబు నొందెను ౯

మహాత్ముఁడగు వాలి, విహితధర్మము సహిష్ఠించుటవలనను, ప్రాణంబుల సరకుగొనక యుద్ధము సేయుటవలనను బూర్వము తాను సంపాదించిన స్వర్గము నిప్పుడు స్వీకరించెను. ౧౦

వానరనాథుండగు వాలికి ఇప్పు డీగతిగలిగె నది సర్వోత్తమము కావున వాలివిషయమయి మీరలు పరితపింపవలదు. ఈకాలమునం దేది చేయవలయునో దాని నేమఱక గావింపుఁడు అని రాముఁడు చెప్పెను. ౧౧

రాముఁడు చెప్పినవెనుక శత్రువీరులవధించునట్టి లక్ష్మణుఁడు దుఃఖాతిశయంబునఁ బ్రజ్ఞఁ దప్పియున్న సుగ్రీవునింజూచి వినయంబున నిట్లని చెప్పెను. ౧౨

సుగ్రీవుఁడా! ఇఁక నీవు వాలికిఁ బ్రేతకార్యంబులు గావింపుము.

తారాఙ్గదాభ్యాం సహితో వాలినో దహనం ప్రతి. ౧౩
సమాజ్ఞాపయతు కాష్ఠాని శుష్కాణిచ బహూనిచ,
చన్దనాదీని దివ్యాని
వాలిసంస్కారకారణాత్. ౧౪
సమాశ్వాసయ చైనం త్వ మఙ్గదం దీనచేతసమ్,
మాభూ ర్బాలిశబుద్ధి స్త్వం త్వదధీన మిదం పురమ్. ౧౫

అఙ్గద స్త్వానయే న్మాల్యం వస్త్రాణి వివిధాని చ,
ఘృతం తైల మథో గన్ధా న్యచ్చాత్ర సమన న్తరమ్. ౧౬

త్వం తార! శిబికాం శీఘ్ర మాదా యాగచ్ఛ సంభ్రమాత్,
త్వరా గుణవతీ యుక్తా హ్యస్మి న్కాలే విశేషతః. ౧౭

సజ్జీభవన్తు ప్లవగా శ్శిబికా వహనోచితాః,
సమర్థా బలిన శ్చైవ నిర్హరిష్య న్తి వాలినమ్ ౧౮
ఏవ ముక్త్వా తు సుగ్రీవం సుమిత్రానన్దవర్ధనః,
తస్థౌ భ్రాతృసమీపస్థో లక్ష్మణః పరవీరహా. ౧౯
లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా తార స్సంభ్రా న్తమానసః,
ప్రవివేశ గుహాం శీఘ్రం శిబికాస క్తమానసః. ౨౦
ఆదాయ శిబికాం తార స్సతు పర్యాపత త్పునః,
వానరై రూహ్యమానాం తాం శూరై రుద్వహనోచితైః. ౨౧
దివ్యాం భద్రాసనయుతాం శిబికాం స్యన్దనోపమామ్,
పక్షికర్మభి రాచిత్రాం ద్రుమకర్మవిభూషితామ్. ౨౨

నీవు తారునితోను అంగదునితోను గూడి వాలికి దహనసంస్కారంబు గావించుటకై చందనము మొదలయిన యుత్తమములగు శుష్కకాష్ఠముల ననేకములం దెమ్మని వానరుల కాజ్ఞాపింపుము. ౧౩

నీవు దుఃఖితుఁడగు నీయంగదు నాశ్వాసించి యాతని వాలికి సంస్కారము సేయ నుద్యుక్తునిఁ గాఁ గావింపుము. ౧౪

ఈపట్టణమంతయు నిఁక నీయధీనము కాఁబట్టి యిఁక నీవు ఈనగరము యొక్క రోగక్షేమములం జూడవలయును. ఇట్లు మూఢునివలె దుఃఖించుచుండుట తగదు. ౧౫

పుష్పమాలికలను నానావిధములగు వస్త్రములను ఆజ్యమును తైలమును గంధద్రవ్యములను మఱియు నిపుడే సంస్కారమున కవశ్యముగా నేదేది కావలయునో వానినన్నింటిని అంగదుండు తెచ్చుఁగాక ౧౬

తారుఁడా! నీవు శీఘ్రముగం బోయి పల్లకిం దీసుకొని వేగముగా రమ్ము త్వరపడుట యెప్పటికిని యుక్తమును గుణవంతము నగుటయె గాక ప్రకృతమందు విశేషించి యుక్తము గుణవంతము నగుచున్నది. ౧౭

వాలిని మోయుటకు సమర్థులును బలవంతులు నగు పల్లకిమోయందగిన వానరులను సన్నద్ధులఁ గావింపుము. అని లక్ష్మణుండు చెప్పెను. ౧౮

శత్రువులవధించునట్టి సుమిత్రకూరిమితనయుండు లక్ష్మణుండు సుగ్రీవున కివ్విధంబునం జెప్పి అన్నసమీపంబున నిలుచుండెను. ౧౯

తారుఁడు లక్ష్మణుండు చెప్పినమాటను విని మనంబునం దొట్రుపాటుగ దుర శిబికం దెచ్చుటకై శీఘ్రంబునఁ గిష్కింధానగరముం బ్రవేశించెను. ౨౦

ఆతారుఁడు శీఘ్రంబున శిబికం దీసికొని మరలవచ్చెను.

శూరులును బలవంతులు నగు వానరులచే వహింపఁబడుచున్నదియు, దివ్యంబును సింహాసనాధిష్ఠితంబును రథమువలె నుండునదియుఁ, జిత్తరువున వ్రాయఁబడినపక్షులచేతను వృక్షములచేతను బదాతులచేతను అలంకృతమయినదియు,

ఆచితాం చిత్రపత్తీభి స్సునివిష్టాం సమన్తతః,
విమాన మివ సిద్ధానాం జాలవాతాయనాన్వితామ్. ౨౩
సునియుక్తాం విశాలాం చ సుకృతాం విశ్వకర్మణా,
దారుపర్వతకోపేతాం చారుకర్మపరిష్కృతామ్. ౨౪
వరాభరణహారైశ్చ చిత్రమాల్యోపశోభితామ్,
గుహాగహనసంచ్ఛన్నాం రక్తచన్దనరూషితామ్. ౨౫
పుష్పౌఘై స్సమభిచ్ఛన్నాం పద్మమాలాభి రేవచ,
తరుణాదిత్యవర్ణాభి ర్భ్రాజమానాభి రావృతామ్. ౨౬

ఈదృశీం శిబికాం దృష్ట్వా రామో లక్ష్మణ మబ్రవీత్,

శీఘ్రం వినీయతాం వాలీ ప్రేతకార్యం విధీయతామ్. ౨౭

తతో వాలిన ముద్యమ్య సుగ్రీవ శ్శిబికాం తదా,
ఆరోపయత విక్రోశ న్నఙ్గదేన సహైవ తు. ౨౮
ఆరోప్య శిబికాంచైవ వాలినం గతజీవితమ్,
అలంకారై శ్చ వివిధై ర్మాల్యై ర్వస్త్రై శ్చ భూషితమ్. ౨౯
ఆజ్ఞాపయ త్తదా రాజా సుగ్రీవః ప్లవగేశ్వరః,
ఔర్ధ్వదైహిక మార్యస్య క్రియతా మనురూపతః. ౩౦
విశ్రాణయన్తో రత్నాని వివిధాని బహూన్యపి,
అగ్రతః ప్లవగా యాన్తు శిబికా సమనన్తరమ్. ౩౧

సుందరముగాఁ గూర్పఁబడినదియు, ఆకాశంబున సంచరించు సిద్ధుల విమానములంబోలెనున్నదియుఁ జిన్నకిటికీలతోను బెద్దకిటికీలతోను ఒప్పుచున్నదియు, ఆర్యోక్తుల్యందుఁ జక్కఁగాఁ నమర్పఁబడినదియు,విశాలంబును మున్ను విశ్వకర్తచేఁ దననేర్పరితనంజేర్పఁ సుందరముగా నిర్మింపఁబడినదియు,అలంకారార్థము ధ్రాసుతోఁజేసిన చిన్నపర్వతములతోఁ గూడినదియు, సుందరముగా మెఱుఁగుపెట్టఁబడినదియు, నుత్తమములగు నాభరణములచేతను, హారములచేతను, నానావిధపుష్పమాలికలచేతను బ్రకాశించుచున్నదియుఁ, గృత్రిమములగు గుహలును వనంబులును గలదియు, ఎఱ్ఱని సుగంధిచందనముతోఁ బూయఁబడినదియు, అంతట సురభిలంబులగు పుష్పములచేఁ గప్పఁబడినదియు, మఱియు నచటచట బాలసూర్యబింబములుంబోలెఁ బ్రకాశించుచున్న రక్తపద్మమాలికలచే నలంకృతంబునగు శిబికం దీసికొని తారుండు వచ్చెను. ౨౧-౨౬.

రాముండు ఇట్టియుత్తమంబగు శిబికంజూచి లక్ష్మణునితో నిట్లని చెప్పెను.

ఇఁక శీఘ్రముగా వాలినెత్తి శిబికయందుంచి ప్రేతకృత్యము చేయఁబడుఁగాక. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౭.

అంత నపుడు సుగ్రీవుండు రోదనంబుసేయుచు అంగదసహితుఁడై వాలినెత్తి పల్లకిపై నుంచెను. ౨౮.

అప్పుడు వానరేశ్వరుండగు సుగ్రీవుఁడు మృతుండగువాలిని నానావిధాలంకారంబులను బుష్పమాలికలను వస్త్రంబులను అలంకరింపించి శిబికపై నుంచి ,యంత వానరుల కిట్లనియాజ్ఞాపించెను. ౨౯.

అన్నయగువాలికి ఉత్తరక్రియ చక్కఁగాఁ గావింపుఁడు. ౩౦

వానరులు నానావిధములయినమణుల ననేకముగా వెదచల్లుచు ముందఱం బోవుదురుగాక; వారివెంటనె శిబికం గొనిపోవలయును. అని సుగ్రీవుం డాజ్ఞాపించెను. ౩౧.

రాజ్ఞా మృద్ధివిశేషా హి దృశ్యన్తే భువి యాదృశాః,
తాదృశం వాలినః క్షిప్రం ప్రాకుర్వ న్నౌర్ధ్వదైహికమ్. ౩౨

అంగదం పరిగృహ్యాఽశు తారప్రభృతయ స్తదా,
క్రోశన్తః ప్రయయు స్సర్వే వానరా హతబాన్ధవాః. ౩౩
తతః ప్రణిహితా స్సర్వా వానర్యోఽస్య వశానుగాః,
చుక్రుశు ర్వీరవీరేతి భూయః క్రోశన్తి తాః స్త్రియః. ౩౪

తారాప్రభృతయ స్సర్వా వానర్యో హరియూథపాః,
అనుజగ్ము ర్హి భర్తారం క్రోశన్త్యః కరుణస్వనాః. ౩౫
తాసాం రుదితశబ్దేన వానరీణాం వనాన్తరే,
వనాని గిరయ స్సర్వే విక్రోశన్తీవ సర్వతః. ౩౬

పులినే గిరినద్యా స్తు వివిక్తే జలసంవృతే,
చితాం చక్రు స్సుబహవో వానరా శ్శోకకర్శితాః. ౩౭
అవరోప్య తత స్స్కన్ధా చ్ఛిబికాం వహనోచితాః,
తస్థు రేకాన్త మాశ్రిత్య సర్వే శోకసమన్వితాః. ౩౮
తత స్తారా పతిం దృష్ట్వా శిబికాతలశాయినమ్,
ఆరోప్యాఙ్కే శిర స్తస్య విలలాప సుదుఃఖితా. ౩౯
హా వానర! మహారాజ! హా నాథ! మమ వత్సల!,
హా మహార్హ! మహాబాహో! హా మమ ప్రియ! పశ్య మామ్.

జనం నపశ్యసీమం త్వం కస్మా చ్ఛోకాభిపీడితమ్,
ప్రహృష్ట మివ తే వక్త్రం గతాసో రపి మానద!. ౪౦
అస్తార్కసమవర్ణం చ లక్ష్యతే జీవతో యథా,

రాజులకు వారివారియైశ్వర్యవిశేషమున కనురూపముగా నుత్తరక్రియ లేవిధంబునం గావింతురో సుగ్రీవాదులు వాలికిని అవిధముగా సమస్తవైభవములతో నుత్తరక్రియం గావించిరి. ౩౨

అప్పుడు మృతుండగు వాలికి సమీపబంధువులగు తారయు మున్నగు వారలందఱు అంగదుంబరివేష్టించి రోదనంబుసేయుచు శీఘ్రంబున నడచిరి.

అంత వాలియధీనలయియుండిన మిక్కిలియు బంధువులయిన వానర స్త్రీలందఱు "వీరుఁడా! వీరుఁడా" యని పేర్కొనుచు అందఱికన్న నధికముగా రోదనముచేయుచుఁ బోయిరి. ౩౪

వానరేంద్రులగు తార మున్నగు వానర స్త్రీలందఱును విను వారలకును దుఃఖముగలుగునట్లు రోదనంబుసేయుచుఁ బెనిమిటివెంబడిం బోయిరి. ౩౫

అవ్వనమధ్యమునందు అట్లు రోదనంబుసేయుచున్న యవ్వానర స్త్రీలరోదనధ్వనిచేత నచటివనంబులును బర్వతములును అంతటను రోదనము సేసినట్లుండినవి. ౩౬

ఒకపర్వతనదియొక్క పరిశుద్ధమయిన సమీపమందు నీళ్లుగల యిసుకదిన్నెయందుఁ బెక్కండ్రువానరులు పరమదుఃఖితులై చితియేర్పఱచిరి.

అంత వాహకులు అచట మూఁపునుండి శిబికనుదించి యందఱు దుఃఖితులయి ఏకాంతస్థలంబున నిలుచుండిరి. ౩౮

అంత తార పల్లకిలోఁ బరుండియున్న తనపెనిమిటింజూచి యతనిశిరమును దనతొడపైనుంచుకొని పరమదుఃఖితురాలయి యిట్లని విలపించెను.

అయ్యో! వానరరాజా! నాయొక్క నాథుఁడా! నాయందు దయగలవాఁడా! అందఱిచేత గౌరవింపఁబడుచున్నవాఁడా! మహాబాహుఁడా! నాప్రియుఁడా! నన్నుఁ జూడుము. ౪౦

నీవు ఇట్లు పరమదుఃఖితనయిననన్నుఁ గన్నెత్తిచూడవేమి?

మాకందఱకును గౌరవము గలిగించువాఁడా! నీవు మృతిఁబొందినను నీముఖము బ్రతికియున్నపుడువలె సాయంకాల సూర్యబింబముంబోలెఁ

ఏష త్వాం రామరూపేణ కాలః కర్షతి వానర!. ౪౨
యేన స్మ విధవా స్సర్వాః కృతా ఏకేషుణా వనే,
ఇమా స్తా స్తవ రాజేన్ద్ర! వానర్యో వల్లభా స్సదా. ౪౩
పాదై ర్వికృష్ట మధ్వాన మాగతాః కిం నబుధ్యసే,

తవేష్టా నను నామైతా భార్యా శ్చన్ద్రనిభాననాః. ౪౪

ఇదానీం నేక్షసే కస్మా త్సుగ్రీవం ప్లవగేశ్వరమ్,
ఏతేహి సచివా రాజం స్తార ప్రభృతయ స్తవ. ౪౫
పురవాసీ జన శ్చాయం పరివా ర్యాస తేఽనఘ!,

విసర్జయైతా౯ ప్లవగా న్యథోచిత మరిన్దమ!. ౪౬
తతః క్రీడామహే సర్వా వనేషు మదనోత్కటాః,

ఏవం విలపతీం తారాం పతిశోకపరిప్లుతామ్. ౪౭
ఉత్థాపయన్తి స్మ తదా వానర్య శ్శోకకర్శితాః,
సుగ్రీవేణ తత స్సార్ధ మఙ్గదః పితరం రుదన్. ౪౮
చితా మారోపయామాస శోకే నాభిహతేన్ద్రియః,
తతోఽగ్నిం విధివ ద్దత్త్వా సోఽపసవ్యం చకార హ. ౪౯
పితరం దీర్ఘ మధ్వానం ప్రస్థితం వ్యాకులేన్ద్రియః,

సంస్కృత్య వాలినం తే తు విధిపూర్వం ప్లవఙ్గమాః. ౫౦
ఆజగ్ము రుదకం కర్తుం నదీం శీతజలాం శివామ్,

ప్రకాశించుచు సంతోషముతోఁ గూడినట్లు కానఁబడుచున్నది. ౪౧

వాలీ! ఇపుడు యముఁడె రామరూపంబున వచ్చి యివ్వనంబున నొక శరబాణంబున మమ్మందఱను విధవలంజేసి నిన్నుఁ గొనిపోవుచున్నాఁడు.

రాజశ్రేష్ఠుఁడవగు వాలీ! నీకెల్లప్పుడును బ్రియురాండ్రును సుకుమారాంగులును మిక్కిలి సుఖముగానున్నవారలునగు నీవానర స్త్రీలు ఇప్పుడు బహుదూరము కాళ్లతో నడిచివచ్చిరే నీకేల తెలియుటలేదు ? ౪౩

అయ్యో! చంద్రబింబముం బోలు మొగంబులుగల యీవానర స్త్రీలు నీప్రియభార్యలుగదా! వీరలు ఇట్లు కష్టంబున నడచివచ్చి దుఃఖించుచుండఁగా నూరకున్నావేమి? ౪౪

వానరరాజయిన సుగ్రీవుని నిపుడెందువలనఁ జూడకున్నావు?

సాహసహితుండవగు వానరరాజా! తారుఁడు మొదలయిన నీమంత్రులును కిష్కింధానగరమున నివసించుజనులును నిన్నుఁ బరివేష్టించియున్నారు చూడుము ౪౫

శత్రువుల నడంగఁద్రొక్కినట్టి వాలీ! ఈవానరులనందఱను వారి వారికిఁ దగినట్లుగా సెలవిచ్చి పంపివేయుము. అంత అందఱము యథేచ్ఛముగా మన్మథక్రీడల విహరించెదము. అని తార విలపించెను ౪౬

అప్పుడు అట్లు పతిమరణ దుఃఖితయయి విలపించుచున్న తారను వానర స్త్రీలు దుఃఖ పీడితలయి వాలియొద్దనుండి యావలకుఁ గొనిపోయిరి.

అంత నంగదుఁడు దుఃఖంబునఁ బరవశుఁడై రోదనంబు సేయుచు సుగ్రీవునితోఁ గూడినవాఁడై తండ్రిని చితిపై నుంచెను. ౪౮

అంత నయ్యంగదుఁడు దుఃఖంబునఁ బరవశములయిన యింద్రియములతో మృతుండగుతండ్రికి యథాశాస్త్రముగ నగ్నియొసంగి యప్రదక్షిణంబు గావించెను. ౪౯

ఆవానరులు అట్లు యథాశాస్త్రముగా వాలికి దహనసంస్కారము గావించి జలతర్పణముసేయుటకై చల్లనినీళ్లుగలదియు మంగళకరియునగు నదియొద్దకు వచ్చిరి. ౫౦

తత స్తే సహితా స్తత్ర హ్యఙ్గదం స్థాప్య చాగ్రతః. ౫౧
సుగ్రీవతారాసహితా స్సిషిచు ర్వాలినే జలమ్,
సుగ్రీవేణైవ దీనేన దీనో భూత్వా మహాబలః. ౫౨
సమానశోకః కాకుత్స్థః ప్రేతకార్యా ణ్యకారయత్,

తత స్తు తం వాలిన మగ్ర్యపౌరుషం
ప్రకాశ మిక్ష్వాకువరేషుణా హతమ్,
ప్రదీప్య దీప్తాగ్నిసమౌజసం తదా
సలక్ష్మణం రామ ముపేయివా న్హరిః. ౫౩

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చవింశ స్సర్గః. ౨౫.

## షడ్వింశ స్సర్గః.

తత శ్శోకాభిసంతప్తం సుగ్రీవం క్లిన్నవాససమ్,
శాఖామృగమహామాత్రాః పరివా ర్యోపతస్థిరే. ౧
అభిగమ్య మహాబాహుం రామ మక్లిష్టకారిణమ్,
స్థితాః ప్రాఞ్జలయ స్సర్వే పితామహ మి వర్షయః. ౨

తతః కాఞ్చనశైలాభ స్తరుణార్కనిభాననః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం హనూమా న్మారుతాత్మజః. ౩

భవత్ప్రసాదా త్సుగ్రీవః పితృపైతామహం మహత్,
వానరాణాం సుదుష్ప్రాపం ప్రాప్తో రాజ్య మిదం ప్రభో!. ౪

భవతా సమనుజ్ఞాతః ప్రవిశ్య నగరం శుభమ్,
సంవిధాస్యతి కార్యాణి సర్వాణి ససుహృజ్జనః. ౫

అంత నానదీతీరంబున నావానరులు సుగ్రీవునితోను దారతోను సంగూడినవారలయి అంగదుమున్నిడికొని వాలికి జలతర్పణము గావించిరి. ౫౧

మహాబలుండగు రాముఁడు తానును సుగ్రీవాదులతో సమానముగా దుఃఖితుఁడై దుఃఖితుండగు సుగ్రీవునిమూలముగానే వాలికిఁ బ్రేతకార్యముల నన్నింటినిం జేయించెను. ౫౨

అప్పుడు సుగ్రీవుఁడు మహాపరాక్రమశాలియు జగత్ప్రసిద్ధుఁడును మండుచున్న యగ్నివంటి తేజస్సుగలవాఁడు నగు రామబాణహతుండగు వాలికి దహనసంస్కారము గావించి యంత లక్ష్మణసహితుండగు రామునొద్దకు వచ్చెను. ౫౩

ఇది యిరువదియైదవసర్గము.

---

## ఇరువదియాఱవసర్గము.

అంత వాలి యుత్తరక్రియలఁ గావించి స్నానముచేసి తడిబట్టలతోనున్న సుగ్రీవుని మంత్రులగు వానరులు పరివేష్టించి గొలిచిరి. ౧

సుగ్రీవుఁడును ఆవానరులును అందఱును మహాబాహుఁడును ఎవ్వరికిని దుఃఖముఁ జేయనివాఁడునగు రామునియొద్దకుఁబోయి బ్రహ్మదేవునొద్ద ఋషులుంబోలె చేతులుమోడ్చుకొని నిలుచుండిరి. ౨

అంత బంగారుకొండవంటి మేనుగలవాఁడును బాలసూర్యునివంటి మొగంబుగలవాఁడునగు వాయుకుమారుఁడు హనుమంతుఁడు చేమోడ్పు గీలించి వినయంబున రామునితో విన్నవించెను. ౩

నాథుఁడవగు రాముఁడా! నీయనుగ్రహంబునంజేసి సుగ్రీవుఁడు ఎట్టివారికిని బొంద నలవిగానిదియు గొప్పదియునగు పితృపైతామహమగు నీవానరరాజ్యంబు నొందెను. ౪

సుగ్రీవుఁడు ఇఁక నీయనుమతినొంది మంగళాలంకృతంబగు నగరంబుఁ బ్రవేశించి మిత్రులతోఁగూడ నన్నికార్యములం జేయవలెను. ౫

స్నాతోఽయం వివిధై ర్గన్ధై రౌషధై శ్చ యథావిధి,
అర్చయిష్యతి రత్నైశ్చ మాల్యైశ్చ త్వాం విశేషతః. ౬

ఇమాం గిరిగుహాం రమ్యా మభిగన్తు మితోఽర్హసి,
కురుష్వ స్వామిసంబన్ధం వానరాం స్సంప్రహర్షయన్. ౭

ఏవ ముక్తో హనుమతా రాఘవః పరవీరహా,
ప్రత్యువాచ హనూమన్తం బుద్ధిమా న్వాక్యకోవిదః. ౮

చతుర్దశ సమాః సౌమ్య! గ్రామం వా యదివా పురమ్,
న ప్రవేక్ష్యామి హనుమ! న్పితు ర్నిర్దేశపాలకః. ౯

సుసమృద్ధాం గుహాం రమ్యాం సుగ్రీవో వానరర్షభః,
ప్రవిష్టో విధివ ద్వీరః క్షిప్రం రాజ్యేఽభిషిచ్యతామ్. ౧౦

ఏవ ముక్త్వా హనూమన్తం రామ స్సుగ్రీవ మబ్రవీత్,
వృత్తజ్ఞో వృత్తసమ్పన్న ముదారబలవిక్రమమ్. ౧౧

ఇమ మప్యఙ్గదం వీర! యౌవరాజ్యేఽభిషేచయ,

జ్యేష్ఠస్య స సుతో జ్యేష్ఠ స్సదృశో విక్రమేణ తే. ౧౨
అఙ్గదోఽయ మదీనాత్మా యౌవరాజ్యస్య భాజనమ్,

పూర్వోఽయం వార్షికో మాస శ్శ్రావణ స్సలిలాగమః. ౧౩

సుగ్రీవుఁడు నానావిధగంధద్రవ్యంబులచేతను ఓషధులచేతను యథాశాస్త్రముగ నభిషిక్తుఁడై యటుపిమ్మట నిన్ను విశేషించి రత్నంబులను బుష్పంబులను బూజింపఁగలఁడు. ౬

నీవు ఇచటనుండి రమణీయంబగు కిష్కింధానగరంబునకువచ్చి వానరులకందఱకు సంతోషంబు గలిగించి సుగ్రీవుని వానరరాజుఁ జేయుము. అని హనుమంతుఁడు రామునితోఁ జెప్పెను. ౭

శత్రువీరులనధించువాఁడును బుద్ధిమంతుఁడును మాటలుచెప్పుటయందుఁబండితుఁడునగురాముఁడు హనుమంతుఁడుచెప్పినమాటనువిని హనుమంతునితో నిట్లని వచించెను. ౮

సౌమ్యుఁడవగు హనుమంతుఁడా! నేను దండ్రియాజ్ఞను బరిపాలింపవలసినవాఁడను గావున ఈపదునాలుగు సంవత్సరములను గ్రామములోనికిఁ గాని పట్టణములోనికిఁగాని వచ్చుటకు వీలులేదు. ౯

మీరలందఱు పరాక్రమవంతుఁడగువానరశ్రేష్ఠుఁడు సుగ్రీవుని సమస్తసంపదలచేతను బూర్ణంబును రమణీయంబునగు కిష్కింధకుఁ దీసికొనిపోయి శీఘ్రంబున యథాశాస్త్రంబుగా నతనికి వానరరాజ్యంబునందుఁ బట్టాభిషేకము గావింపుఁడు. అని రాముఁడు హనుమంతునితోఁ జెప్పెను ౧౦

సదాచారము చక్కఁగాఁ దెలిసినట్టిరాముఁడు ఇవ్విధంబున హనుమంతునితోఁ బలికి సదాచారసంపన్నుఁడును అధికమయినబలమును బరాక్రమంబును గలవాఁడునగు సుగ్రీవుంజూచి యిట్లనివచించెను. ౧౧

వీరుఁడవగుసుగ్రీవుఁడా! ఈయంగదునకుఁగూడ నీవు యౌవరాజ్యంబునందుఁ బట్టాభిషేకము చేయవలయును.

ఈయంగదుఁడు నీకు జ్యేష్ఠుఁడగు వాలియొక్క జ్యేష్ఠపుత్త్రుఁడు. పరాక్రమంబున నీకు సమానుఁడు. మిక్కిలియు బుద్ధిమంతుఁడు కావున యువరాజ్యంబునకుఁ దగినవాఁడు. ౧౨

సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! వర్షాకాలమువచ్చినది. అందు ఈశ్రావ

ప్రవృత్తా స్సౌమ్య! చత్వారో మాసా వార్షికసంజ్ఞికాః,
నాయ ముద్యోగసమయః ప్రవిశ త్వం పురీం శుభామ్. ౧౪
అస్మి న్వత్స్యా మ్యహం సౌమ్య! పర్వతే సహలక్ష్మణః,

ఇయం గిరిగుహారమ్యా విశాలా యు క్తమారుతా. ౧౫
ప్రభూతసలిలా సౌమ్య! ప్రభూతకమలోత్పలా,

కార్తికే సమనుప్రాప్తే త్వం రావణవధే యత. ౧౬
ఏష న స్సమయ సౌమ్య! ప్రవిశ త్వం స్వమాలయమ్,

అభిషిక్తస్స్వరాజ్యేచ సుహృద స్సంప్రహర్షయ. ౧౭

ఇతి రామాభ్యనుజ్ఞాత స్సుగ్రీవో వానరాధిపః,
ప్రవివేశ పురీం రమ్యాం కిష్కిన్ధాం వాలిపాలితామ్. ౧౮

తం వానరసహస్రాణి ప్రవిష్టం వానరేశ్వరమ్,
అభివాద్య ప్రవిష్టాని సర్వతః పర్యవారయన్. ౧౯

తతః ప్రకృతయ స్సర్వా దృష్ట్వా హరిగణేశ్వరమ్,
ప్రణమ్య మూర్ధ్నా పతితా వసుధాయాం సమాహితాః. ౨౦

సుగ్రీవః ప్రకృతీ స్సర్వా స్సంభాష్యోత్థాప్య వీర్యవాన్,
భ్రాతు రంతఃపురం సౌమ్యం ప్రవివేశ మహాబలః. ౨౧

ణము పొందఁటిది. వార్షికము లనంబడుమాసములు (పక్షములు) నాల్గును అతం ఘించినవి. ౧౩

శాంతుఁడవగు సుగ్రీవుఁడా! ఇదియుద్ధప్రయత్నమునకుఁ దగినకాల ముగాదు కావున నీవు రమణీయంబగు కిష్కింధకుఁ బొమ్ము. నేనును లక్ష్మ ణుండును ఈపర్వతంబున నుండెదము. ౧౪

సౌమ్యుఁడా! ఈపర్వతగుహ మిక్కిలి రమణీయముగాను విశాలము గాను గావలసినంత గాలిగలదిగాను ఉన్నది. దీనికిసమీపంబున నీళ్లును దామ రపూలును గలువలును సమృద్ధముగా నున్నవి. కావున ఇది నాకు నివాస యోగ్యము. ౧౫

సౌమ్యుఁడా! కార్తికమాసము సమీపించినపుడు నీవు రావణవధార్థ మయి ప్రయత్నముసేయవలయు. ఇది మనసంకేతము. ఇఁక నీవు నీపురంబు నకుఁ బొమ్ము. ౧౬

నీవు వానరరాజ్యంబునందుఁ బట్టాభిషేకంబునొంది నీబంధువులకు సంతోషంబు గలుగఁజేయుము. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

వానరాజయిన సుగ్రీవుఁడు ఇట్లు రాముని యనుమతినొంది యిదివ లకు వాలిచేఁ బాలింపఁబడిన రమణీయంబగు కిష్కింధాపురంబుఁ బ్రవేశిం చెను. ౧౭

వేలకొలఁది వానరవీరులు వానరరాజయిన సుగ్రీవునితోఁగూడఁ గిష్కింధఁ బ్రవేశించి యతనికి నమస్కరించి యతనిం బరివేష్టించి కొలిచి యుండిరి. ౧౮

అంతఁ బట్టణమందలి జనులు సమస్తవానరనాథుఁడగు సుగ్రీవుని సం దర్శించి వాలివధంబునంజేసి యెంతమాత్రము మనస్సున నశ్రుప్తి లేనివార లయి సుగ్రీవునకు సాష్టాంగముగా నమస్కరించి నేలపయి చాఁగిలఁబడిరి,

పరాక్రమవంతుఁడును మహాబలశాలియునగు సుగ్రీవుఁడు తనముందట నట్లు చాఁగిలంబడిన పురజనులను లేవనెత్తి వారలతో మంచిమాటలాడి యంతఁ దార నాశ్వాసించుటకై వాలి యంతఃపురంబునకుఁ బోయెను. ౨౦

ప్రవిశ్య త్వభినిష్క్రాన్తం సుగ్రీవం ప్లవగేశ్వరమ్,
అభ్యషించంత సుహృద స్సహస్రాక్ష మివామరాః. ౨౨

తస్య పాండర మాజహ్రు శ్ఛత్రం హేమపరిష్కృతమ్,
శుక్లేచ వాలవ్యజనే హేమదండే యశస్కరే. ౨౩
తథా సర్వాణి రత్నాని సర్వబీజౌషధీ రపి,
సక్షీరాణాంచ వృక్షాణాం ప్రరోహా న్కుసుమానిచ. ౨౪
శుక్లానిచైవ వస్త్రాణి శ్వేతం చైవానులేపనమ్,
సుగన్ధీనిచ మాల్యాని స్థలజా న్యమ్బుజానిచ. ౨౫
చన్దనానిచ దివ్యాని గన్ధాంశ్చ వివిధా న్బహూన్,
అక్షతం జాతరూపంచ ప్రియఙ్గుమధుసర్పిషీ ౨౬
దధి చర్మచ వైయాఘ్రం వారాహీ చాప్యుపానహౌ,
సమాలమ్భన మాదాయ రోచనాం సమనశ్శిలామ్. ౨౭
ఆజగ్ముస్తత్ర ముదితా వరాః కన్యాస్తు షోడశ,
తత స్తే వానరశ్రేష్ఠం యథాకాలం యథావిధి ౨౮
రత్నై ర్వస్త్రైశ్చ భక్ష్యైశ్చ తోషయిత్వా ద్విజర్షభాన్,
తతః కుశపరిస్తీర్ణం సమిద్ధం జాతవేదసమ్ ౨౯
మన్త్రపూతేన హవిషా హుత్వా మన్త్రవిదో జనాః,
తతో హేమప్రతిష్ఠానే వరాస్తరణసంవృతే. ౩౦
ప్రాసాదశిఖరే రమ్యే చిత్రమాల్యోపశోభితే,
ప్రాఙ్ముఖం వివిధై ర్మన్త్రైః స్థాపయిత్వా వరాసనే. ౩౧
నదీనదేభ్య స్సంహృత్య తీర్థేభ్య శ్చ సమన్తతః,
ఆహృత్యచ సముద్రేభ్య స్సర్వేభ్యో వానరర్షభాః. ౩౨
అపః కనకకుమ్భేషు నిధాయ విమలా శ్శుభాః,

వాలి యంతఃపురంబునకుఁ బోయి యప్పుడే వానరనాథుఁ డగు సుగ్రీవుఁడు వెడలివచ్చుటయు నంత నతనికి దేవతలు దేవేంద్రునకుఁ బోలె బంధువులు పట్టాభిషేకము గావించిరి. ౧౨

అప్పుడు వానరులు సుగ్రీవునిపట్టాభిషేకమునకై కాంచనాలంకృతంబగు శ్వేతచ్ఛత్రంబును బంగారు దండములుగల యశస్కరములగు తెల్లని రెండువింజామరంబులును సమస్తములయిన మణులును, సమస్తములయిన వి త్తనములును, ఓషధులును, క్షీరవృక్షంబుల చిగుళ్ళును, బుష్పంబులును, తెల్లనివస్త్రంబులును, ధవళమయిన కర్పూరాద్యంగరాగంబును, మంచితావిగల పుష్పమాలికలును, మెట్టనుబుట్టిన కమలంబులును, ఉత్తమంబగు చందనంబును, నానావిధగంధద్రవ్యంబులును, గాంచనాక్షతలును, కుంకుమపువ్వును, తేనెయు, ఘృతంబును, పెరుఁగును, వ్యాఘ్రచర్మంబును, అడవిపందిచర్మముతోఁ గుట్టఁబడిన పాదరక్షలును దెచ్చిరి. ౧౩-౧౭

అంత వచటికిఁ బదునాఱుగురుకన్యకలు, మైపూఁతయు మనశ్శిలతోఁ జేసిన తిలకంబును గోరోచనంబును దీసికొని సంతోషంబున వచ్చిరి. ౧౮

అంత బ్రాహ్మణోత్తములకు మణులును వస్త్రంబులును నానావిధభక్ష్యభోజ్యంబులు నొసంగి మంత్రవేత్తలగు పురోహితులు అగ్నిహోత్రంబు జ్వలింపఁజేసి చుట్టును దర్భలు పరిస్తరించి యథావిధిగా మంత్రములచే హవిస్సు వేల్చినపిదపఁ గాంచనమయపాదంబులుగలదియు నుత్తమమయిన యాస్తరణముతో నొప్పుచున్నదియుఁ బ్రాసాదంబువంటి శిఖరముగలదియు రమణీయంబును నానావిధపుష్పమాలికాలంకృతంబునగు సింహాసనంబున సుగ్రీవునిదూర్పుమొగంబుగా నానావిధమంత్రంబులతోఁ గూర్చుండఁబెట్టి నదులనుండియు నదంబులనుండియు సమస్తతీర్థంబులనుండియు సముద్రంబులనుండియుఁ దెచ్చి యొకటిగాఁ గలిపిన విమలంబులగు పుణ్యజలంబులను గాంచనఘటంబులనుంచి సుముహూర్తంబునందు శాస్త్రంబునతిక్రమింపక వేదవిధానంబు ననుసరించి కల్పసూత్రోక్తమార్గంబున గజుఁడును గవా

శుక్లై ర్వృషభశృఙ్గైశ్చ కలశై శ్చాపి కాఞ్చనైః. ౩౩
శాస్త్రదృష్టేన విధినా మహర్షి విహితేన చ,
గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః. ౩౪
మైన్దశ్చ ద్వివిద శ్చైవ హనూమా జ్జామ్బవా న్నళః,
అభ్యషిఞ్చన్త సుగ్రీవం ప్రసన్నేన సుగన్ధినా. ౩౫
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా,
అభిషిక్తే తు సుగ్రీవే సర్వే వానరపుఙ్గవాః. ౩౬
ప్రచుక్రుశు ర్మహాత్మానో హృష్టా స్తత్ర సహస్రశః,
రామస్య తు వచః కుర్వం త్సుగ్రీవో హరిపుఙ్గవః. ౩౭
అఙ్గదం సంపరిష్వజ్య యౌవరాజ్యేఽభ్యషేచయత్,
అఙ్గదే చాభిషిక్తే తు సానుక్రోశాః ప్లవఙ్గమాః. ౩౮
సాధుసాధ్వితి సుగ్రీవం మహాత్మానోఽభ్యపూజయన్,

రామం చైవ మహాత్మానం లక్ష్మణంచ పునఃపునః. ౩౯
ప్రీతా శ్చ తుష్టువు స్సర్వే తాదృశే తత్ర వర్తతి,

హృష్టపుష్టజనాకీర్ణా పతాకాధ్వజశోభితా ౪౦
బభూవ నగరీ రమ్యా కిష్కిన్ధా గిరిగహ్వరే,

నివేద్య రామాయ తదా మహాత్మనే
మహాభిషేకం కపివాహినీపతిః,
రుమాం చ భార్యాం ప్రతిలభ్య వీర్యవా
నవాప రాజ్యం త్రిదశాధిపో యథా. ౪౧
ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షడ్వింశ స్సర్గః. ౨౬.

షభుఁడును గవయుఁడును శరభుఁడును గంధమాదనుఁడును మైందుఁడును ద్వివిదుఁడును హనుమంతుఁడును జాంబవంతుఁడును నళుఁడును. స్వచ్ఛంబులును మంచివాసనలతోఁ గూడినవియునగు నాపుణ్యజలంబుల మంగళకరంబులగు వృషభశృంగంబులతోను బంగారుకలశంబులతోను సుగ్రీవునకు వసువులు దేవేంద్రునకుంబోలె నభిషేకంబు గావించిరి. ౨౮-౩౫

సుగ్రీవునకుఁ బట్టాభిషేకముకాఁగానే మహాబలశాలులగు వానరవీరులందఱు వేనవేలుగా గుమిగూడి పరమసంతుష్టులయి కేకలు వేసిరి. ౩౬

వానరోత్తముండగు సుగ్రీవుఁడు రామునియాజ్ఞను శిరసావహించి యంగదుఁ గౌఁగిటఁజేర్చి యతనికి యౌవరాజ్యంబునఁ బట్టంబుఁగట్టెను. ౩౭

సుగ్రీవుఁ డంగదునకు యౌవరాజ్యం బొసంగుటను జూచి తండ్రి హతుఁడయ్యెనే యని యంగదునియెడ దయగలిగియున్న మహాత్ములగు వానరులు సుగ్రీవుని సాధువాక్యంబుల బ్రశంసించిరి ౩౮

అట్టిఅంగదయౌవరాజ్యపట్టాభిషేకరూపమయిన మహోత్సవము జరుగునప్పుడు కిష్కింధయందలి సమస్తవానరులును పరమసంతుష్టులయి మహాత్ముఁడగురాముని లక్ష్మణుని మాటిమాటికిఁ బ్రస్తుతించిరి. ౩౯

అప్పుడు పట్టాభిషేకమహోత్సవమునందుఁ బర్వతగుహాయుంగు కిష్కింధానగరము సంతోషంబున నుప్పొంగిన మేనుగల జనులతోఁ గూడినదై రాజచిహ్నములువ్రాసిన టెక్కెములతోను పట్టుటెక్కెములతోను అలంకరింపఁబడి రమణీయంబై యొప్పెను. ౪౦

అప్పుడు పరాక్రమశాలియగు వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు మహాత్ముఁడగు రామునియొద్దకుఁ బోయి పట్టాభిషేకము జరిగినవృత్తాంతమును విన్నవించి తనభార్యయగు రుమను బొంది దేవేంద్రుఁడు దేవరాజ్యంబు నొందినట్లు వానరరాజ్యంబు నొందెను. ౪౧

ఇది యిరువదియాఱవసర్గము.

---

## సప్తవింశస్సర్గః.

అభిషిక్తే తు సుగ్రీవే ప్రవిష్టే వానరే గుహామ్,
ఆజగామ సహ భ్రాత్రా రామః ప్రస్రవణం గిరిమ్ ౧
శార్దూలమృగసంఘుష్టం సింహై ర్భీమరవై ర్వృతమ్,
నానాగుల్మలతాగూఢం బహుపాదపసంకులమ్. ౨
ఋక్షవానరగోపుచ్ఛై ర్మార్జారై శ్చ నిషేవితమ్,
మేఘరాశినిభం శైలం నిత్యం శుచిజలాశ్రయమ్. ౩

తస్య శైలస్య శిఖరే మహతీ మాయతాం గుహామ్,
ప్రత్యగృహ్ణత వాసార్థం రామ స్సౌమిత్రిణాసహ ౪
కృత్వా చ సమయం సౌమ్య స్సుగ్రీవేణ స హానఘః,
కాలయుక్తం మహ ద్వాక్య మువాచ రఘునన్దనః ౫
వినీతం భ్రాతరం భ్రాతా లక్ష్మణం లక్ష్మివర్ధనమ్,

ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్తమారుతా. ౬
అస్యాం వసావ సౌమిత్రే! వర్షరాత్ర మరిన్దమ!,
గిరిశృఙ్గ మిదం రమ్య మున్నతం పార్థివాత్మజ! ౭
శ్వేతాభిః కృష్ణతామ్రాభి శ్శిలాభి రుపశోభితమ్,
నానాధాతుసమాకీర్ణం దరీనిర్ఝరశోభితమ్. ౮
వివిధై ర్వృక్షషణ్డై శ్చ చారుచిత్రలతావృతమ్,
నానావిహగసంఘుష్టం మయూరరవనాదితమ్. ౯
మాలతీకున్దగుల్మై శ్చ సిన్దువారకురణ్టకైః,
కదమ్బార్జునసర్జై శ్చ పుష్పితై రుపశోభితమ్. ౧౦

## ఇరువదియేడవసర్గము.

సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁడై కిష్కింధానగరంబుఁ జేరినపిదప రాముఁడు లక్ష్మణసహితంబుగాఁ బెద్దపులుల యఱపులతోను జింకలధ్వనులతోనుఁ గూడినదియు భయంకరముగా గర్జించునట్టి సింహంబులతోఁ గూడినదియు నానావిధంబులగు గుల్మంబులచేతను లతాగృహంబులచేతను గప్పఁబడినదియు అనేకవృక్షంబులతో నిండియున్నదియు నెలుఁగుబంటులును గోఁతులును బిల్లులును మెండుగాఁగలదియు మేఘసమూహంబుకైవడి నల్లగానున్నదియు శిలాముఖంబును ఎల్లప్పుడు విడువక నిర్మలంబయిన జలంబు గలిగియున్నదియునగు ప్రస్రవణపర్వతంబు నొందెను. ౧-౩

ఆప్రస్రవణపర్వతశిఖరంబున వెడల్పును నిడుపునుగల యొకగుహను రాముఁడు, తానును లక్ష్మణుఁడును నివాసముసేయుటకై యేర్పఱచుకొనెను. ౪

సౌమ్యుఁడును బాపరహితుఁడునగు రాముఁడు అట్లు సుగ్రీవునితో సమయంబుఁజేసికొని వినయసంపన్నుఁడును లక్ష్మీవర్ధనంబులగు శుభలక్షణంబులుగలవాఁడునగు లక్ష్మణుంజూచి యాకాలంబునకుఁ దగిన మహార్థంబునగు నీమాటం జెప్పెను. ౫

శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి లక్ష్మణుఁడా! ఈపర్వతగుహ రమణీయంబుగాను విశాలంబుగాను గావలసినంతమాత్రము గాలిగలదిగా నున్నది. కావున వర్షాకాలమున నీగుహయందు వసింతము. ౬

రాచకొమరుఁడా! ఈపర్వతశిఖరము రమణీయంబును ఉన్నతంబును తెల్లఱాలతోను నల్లఱాలతోను ఎఱ్ఱనిశిలలతోనుఁ గూడినదియు నానావిధగైరికధాతువులచే నొప్పుచున్నదియు గుహలును సెలయేళ్లును గలదియు నానావిధములయిన వృక్షసమూహములతో నానావిధంబులగులతాగృహంబులతోనుఁ గూడినదియు నానావిధపక్షిధ్వనులును నెమళ్లధ్వనులును గలిగినదియుఁ బుష్పితంబులగు జాజులును మొల్లలును వావిలిచెట్లును గోరంటచెట్లును గదంబవృక్షంబులును ఏలుమద్దిచెట్లునుమద్దిచెట్లును గలదియునై సుందరంబుగానున్నది.

ఇయం చ నళినీ రమ్యా ఫుల్లపఙ్కజమణ్డితా,
నాతిదూరే గుహాయా నో భవిష్యతి నృపాత్మజ!. ౧౧
ప్రాగుదక్ప్రవణే దేశే గుహా సాధు భవిష్యతి,
పశ్చాచ్చైవోన్నతా సౌమ్య! నివాతేయం భవిష్యతి. ౧౨

గుహాద్వారే చ సౌమిత్రే! శిలా సమతలా శుభా,
శ్లక్ష్ణా చై వాయతా చైవ భిన్నాఞ్జనచయోపమా. ౧౩
గిరిశృఙ్గ మిదం తాత! పశ్య చోత్తరత శ్శుభమ్,
భిన్నాఞ్జనచయాకార మమ్భోధర మివోత్థితమ్. ౧౪
దక్షిణస్యా మపి దిశి స్థితం శ్వేత మి వాపరమ్,
కైలాసశిఖరప్రఖ్యం నానాధాతువిభూషితమ్. ౧౫

ప్రాచీనవాహినీం చైవ నదీం భృశ మకర్దమామ్,
గుహాయాః పూర్వతః పశ్య త్రికూటే జాహ్నవీ మివ. ౧౬
చమ్పకై స్తిలకై స్తాలై స్తమాలై రతిముక్తకైః,
పద్మకై స్సరళై శ్చైవ అశోకై శ్చైవ శోభితామ్. ౧౭
వానీరై స్తిమిశై శ్చైవ వకుళైః కేతకై ర్ధవైః,
హిన్తాలై స్తిరిటై ర్నీపై ర్వేత్రకైః కృతమాలకైః. ౧౮

తీరజై శ్శోభితా భాతి నానారూపై స్తత స్తతః,
వసనాభరణోపేతా ప్రమదే వాభ్యలంకృతా. ౧౯

రాచకొమరుఁడా! వికసించిన తామరపూలచే నలంకృతంబై రమణీయంబై యున్న యీ తామరకొలను మనగుహాకు సమీపంబున నున్నది. ౧౧

సౌమ్యుఁడా! ఈశానదిశవైపున దిగుమార్గమును నిరృతిదిశను ద్వారమును గలుగుటవలన తలుచుగా నీశానదిశనుండివచ్చు వానజల్లు లోపలఁబడదు కావున ఈగుహా మిక్కిలియు బాగుగా నుండును. మఱియు దీనికి బడమటిపార్శ్వమున ఔన్నత్యము గలదగుటంజేసి ఇందు తూర్పునుండివచ్చు చలిగాలి దగులక సుఖముగా నుండును. ౧౨

లక్ష్మణుఁడా! మఱియు నీగుహా వాకిటను మిట్టపల్లములేనిదియు సుందరమును విశాలమును విరిసిన కాటుకరాశివలె నల్లనైనదియునగు శిలయున్నది.

నాయనా! గుహాకు ఉత్తరపార్శ్వంబున సుందరంబును విరిసినకాటుకరాశివలె నల్లనైనదియు నాకాశంబున లేచినమేఘమువలె నున్నదియు దక్షిణదిక్కునను రెండవకైలాసం బనఁదగినదియుఁ గైలాసశిఖరముతో సమానమును నానావిధగైరికధాతువులచేనలంకృతంబులగు నీపర్వతశిఖరంబుఁ జూడుము. ౧౪,౧౫

మఱియు నీగుహాకుఁ దూర్పునఁ జంపకవృక్షంబులచేతను బొట్టుగుచెట్లచేతను మద్దిచెట్లచేతను దమాలవృక్షంబులచేతను గురివెందచెట్లచేతను బద్మకవృక్షంబులచేతను సరళవృక్షంబులచేతను అశోకవృక్షములచేతను బ్రబ్బలిపొదలచేతను దినాసపుచెట్లచేతను వకుళవృక్షంబులచేతను మొగిలిపొదలచేతను చంద్రచెట్లచేతను హింతాలములచేతను లొద్దుగులచేతను గదంబములచేతను వేత్రములచేతను తీఁగలచేతను ఒప్పుచున్నదియు ఎంతమాత్రముబురదలేనిదియుఁ దూర్పుతట్టు ప్రవహించునదియు నైన త్రికూటంబునందలి గంగానదివంటి నదియున్నది చూడుము. ౧౬—౧౮

ఈనది తీరంబులఁ బుట్టిన నానావిధంబులగు వృక్షములతోఁ గూడియుండుటంజేసి వస్త్రములచేతను ఆభరణములచేతను అలంకరింపఁబడిన స్త్రీవలెఁ బ్రకాశించుచున్నది. ౧౯

శతశః పక్షిసంఘైశ్చ నానానాదై ర్వినాదితా,
ఏకైక మనురక్తైశ్చ చక్రవాకై రలంకృతా. ౨౦
పులినై రతిరమ్యైశ్చ హంససారససేవితైః,
ప్రహసన్తీవ భా త్యేషా నారీ సర్వవిభూషితా. ౨౧

క్వచి న్నీలోత్పలై శ్ఛన్నా భాతి రక్తోత్పలైః క్వచిత్,
క్వచి దాభాతి శుక్లైశ్చ దివ్యైః కుముదకుట్మలైః. ౨౨

పారిప్లవశతై ర్జుష్టా బర్హిణక్రౌఞ్చనాదితా,
రమణీయా నదీ సౌమ్య! మునిసంఘై ర్నిషేవితా. ౨౩

పశ్య చన్దనవృక్షాణాం పఙ్క్తీః సురచితా ఇవ,
కకుభానాం చ దృశ్యన్తే మనసే వోదితా స్సమమ్. ౨౪

అహో సురమణీయోఽయం దేశ శ్శత్రునిషూదన!,
దృఢం రంస్యావ సౌమిత్రే! సా ధ్వత్ర నివసావహై. ౨౫

ఇతశ్చ నాతిదూరే సా కిష్కిన్ధా చిత్రకాననా,
సుగ్రీవస్య పురీ రమ్యా భవిష్యతి నృపాత్మజ!. ౨౬

గీతవాదిత్రనిర్ఘోష శ్శ్రూయతే జయతాం వర!,
నర్దతాం వానరాణాం చ మృదఙ్గాడమ్బరై స్సహ. ౨౭

అనేకములయినపక్షులు మధురంబుగాఁ గూయుటవలనను ఒండొంటి యందనురాగముల చక్రవాకపక్షులచే నలంకరింపఁబడియుండుటవలనను మనోహరంబుగాఁ గూయునట్టి హంససారసపక్షులతో నొప్పుచున్న రమణీయంబులగు నిసుకదిన్నెలతోఁ గూడియుండుటవలనను నీనది మధురధ్వనిగలుగు నట్లు నవ్వుచున్నదియు ఒండొంటితో నొరయుచున్న స్తనంబులుగలదియు నున్నతంబులగు పిఱుఁదులతోను మధురంబుగా ధ్వనించునట్టి గజ్జెలు మొదలుగాఁగల భూషణంబులతోను ఒప్పుచున్నదియునగు యువతియుంబోలెఁ బ్రకాశించుచున్నది. ౨౦ ౨౧

ఈనది ఒకచోట నల్లగలువలచే నొప్పుచున్నది. ఒకచో నెఱ్ఱగలువలచేఁ బ్రకాశించుచున్నది. మఱియొకచో నుత్తమంబులగు తెల్లగలువలమొగ్గలచే నెంతయు భాసిల్లుచున్నది. ౨౨

సౌమ్యుఁడా! పెక్కుజలపక్షులతోఁ గూడినదియు మధురముగాఁ గూయునెమిళ్ళతోను క్రౌంచపక్షులతో నొప్పుచున్నదియు ఋషిసేవితంబునగుటంజేసి యీనది రమణీయముగా నున్నది. ౨౩

మాలికారూపంబునఁ జక్కఁగాఁ గూర్పఁబడినట్లున్న యీచందనపఙ్క్తులం జూడుము. అట్లు ఏఱువద్ది చెట్లవరుసలును సంకల్పపూర్వకంబుగా నేర్పరితనంబుతోఁ గూర్చినట్లు గానంబడుచున్నవి. ౨౪

శత్రువుల జయించునట్టి లక్ష్మణుఁడా! ఈప్రదేశము మిక్కిలి రమణీయముగా నుండుట యాశ్చర్యముగా నున్నది. ఇచట మనము చక్కఁగా సంతోషముతోఁ గ్రీడింపవచ్చును గావున నిచటనే నివసింతము. ౨౫

రాచకొమరుఁడగు లక్ష్మణుఁడా! సుందరములయిన వనంబులుగల రమణీయంబగు సుగ్రీవరాజధానియయిన కిష్కింధానగరముగూడ ఇచటికి సమీపంబుననే యుండును. ౨౬

శూరులలో నుత్తముఁడవగు లక్ష్మణుఁడా! కిష్కింధయందలి గీతవాద్యధ్వనులును వానరులయఱపులును మృదంగధ్వనులును ఇచటికి వినఁబడుచున్నవి. కావునఁ గిష్కింధ యిచటికి సమీపంబున నున్నది. ౨౭

లబ్ధ్వా భార్యాం కపివరః ప్రాప్య రాజ్యం సుహృద్వృతః,
ధ్రువం నన్దతి సుగ్రీవ స్సంప్రాప్య మహతీం శ్రియమ్. ౨౭

ఇత్యుక్త్వా న్యవస త్తత్ర రాఘవ స్సహలక్ష్మణః,
బహుదృశ్యదరీకుఞ్జే తస్మి న్ప్రస్రవణే గిరౌ. ౨౮

సుసుఖేఽపి బహుద్రవ్యే తస్మి న్హి ధరణీధరే,
వసత స్తస్య రామస్య రతి రల్పాఽపి నాభవత్. 30
హృతాం హి భార్యాం స్మరతః ప్రాణేభ్యోఽపి గరీయసీమ్,

ఉదయాభ్యుదితం దృష్ట్వా శశాఙ్కంచ విశేషతః. 3౧
ఆవివేశ న తం నిద్రా నిశాసు శయనం గతమ్,

తత్సముత్థేన శోకేన బాష్పోపహతచేతసమ్. 3౨
తం శోచమానం కాకుత్స్థం నిత్యం శోకపరాయణమ్,
తుల్యదుఃఖోఽబ్రవీ ద్భ్రాతా లక్ష్మణోఽనునయ న్వచః. 33

అలం వీర! వ్యథాం గత్వా న త్వం శోచితు మర్హసి,
శోచతో వ్యవసీద న్తి సర్వార్థా విదితం హి తే. 3౪

భవా న్క్రియాపరో లోకే భవా న్దైవపరాయణః,
ఆస్తికో ధర్మశీలశ్చ వ్యవసాయీచ రాఘవ!. 3౫

వానరోత్తముఁడగు సుగ్రీవుఁడు తనభార్యను రుమను వానరరాజ్యంబు ను అసదృశమయిన సంపదనుఁబొంది బంధువులచేఁ బరివేష్టితుఁడై నిశ్చయ ముగా మిక్కిలి యానందించుచున్నాఁడు. అని లక్ష్మణునితోఁ జెప్పెను.

ఇట్లు లక్ష్మణునితోఁ జెప్పి రాముఁడు రమణీయంబులగు పెక్కు గు హలతోను లతాగృహంబులతో నొప్పుచున్న యాప్రస్రవణపర్వతంబున నాగుహయందు లక్ష్మణసహితంబుగా నివాసముచేసెను. ౨౯

అట్లు పుష్పఫలాదిబహుద్రవ్యసంపన్నమై యెట్టివారికిని సుఖము గలి గించునట్టి యాప్రస్రవణపర్వతమునందు నివాసముచేయుచున్నవాఁడైనను రా ముఁడు రావణునిచే నపహృతయయిన తనప్రాణంబులకన్నను నధికయగు ప్రి యురాలనే యెల్లప్పుడు దలఁచుకొనుచున్నందున ఎంతమాత్రము సుఖము వొందఁడయ్యె. ౩౦

పగలు విరహోద్దీపనకరంబులగు వస్తువులంజూచి పరితపించుటయే గాక యాతఁడు విశేషించి రాత్రులందుఁ బరుండినపుడు ఉదయపర్వతంబునుండి వెడలినచంద్రుంజూచి విరహతాపంబున ఎంతమాత్రము కంటికిఁ గూరుకు లేక పరితపించుచుండెను. ౩౧

అట్లు సీతావిరహంబునంజేసి మనసునందుత్సాహంబులేక పరితపించుచు నెల్లప్పుడును దుఃఖమెగతిగానున్న యారామునంజూచి తమ్ముఁడు లక్ష్మణుఁడు తానును అతనితో సమానముగా దుఃఖితుండై యతని నూఱడించుచు నీమా టం బలికెను. ౩౨,౩౩

వీరుఁడా! దుఃఖించుట చాలును. నీవిట్లు వ్యసనపడుట యుక్తము గాదు. వ్యసనపడువానికి సమస్తకార్యములును నశించును. ఇదినీకుఁ దెలిసిన విషయమేగదా! ౩౪

రాముఁడా! లోకంబున నందఱికన్నను నీవు పురుషకారం బవలం బించి కార్యము చేయువాఁడవు. కార్యసిద్ధికిఁ గారణమయిన దైవమునందును నిష్ఠగలవాఁడవు. ఆస్తికుఁడవు. ధార్మికుండవును, ఎడతెగక ప్రయత్నించు వాఁడవు. అట్టి నీ విట్లు శోకించుట తగదు. ౩౫

న హ్యావ్యవసిత శ్శత్రుం రాక్షసం తం విశేషతః,
సమర్థ స్త్వం రణే హన్తుం విక్రమై ర్జిహ్మకారిణమ్. 36

సమున్మూలయ శోకం త్వం వ్యవసాయం స్థిరం కురు,
తత స్సపరివారం తం నిర్మూలం కురు రాక్షసమ్. 37
పృథివీ మపి కాకుత్స్థ! ససాగరవనాచలామ్,
పరివర్తయితుం శక్తః కి మఙ్గ! పున రావణమ్. 38

శరత్కాలం ప్రతీక్షస్వ ప్రావృట్కాలోఽయ మాగతః,
తత స్సరాష్ట్రం సగణం రావణం త్వం వధిష్యసి. 39
అహంతు ఖలు తే వీర్యం ప్రసుప్తం ప్రతిబోధయే,
దీప్తై రాహుతిభిః కాలే భస్మరాచ్ఛన్న మి వానలమ్. 40

లక్ష్మణస్యతు తద్వాక్యం ప్రతిపూజ్య హితం శుభమ్,
రాఘవ స్సుహృదం స్నిగ్ధ మిదం వచన మబ్రవీత్. 41

వాచ్యం య దనురక్తేన స్నిగ్ధేన చ హితేన చ,
సత్యవిక్రమయుక్తేన తదుక్తం లక్ష్మణ! త్వయా. 42
ఏష శోకః పరిత్యక్త స్సర్వకార్యావసాదకః,
విక్రమే ష్వప్రతిహతం తేజః ప్రోత్సాహయా మ్యహమ్. 43
శరత్కాలం ప్రతీక్షిష్యే స్థితోఽస్మి వచనే తవ,
సుగ్రీవస్య నదీనాం చ ప్రసాద మనుపాలయన్. 44
ఉపకారేణ వీరస్తు ప్రతీకారేణ యుజ్యతే,

నీ విట్లు శోకంబున ధైర్యంబు విడిచి వ్యవసాయంబు మానియుందు వేని ఏశత్రువును జయింపఁజాలవు అందు విశేషించి పరాక్రమంబుగలిగి మాయావియునగు నారాక్షసుని రావణుని యుద్ధంబున వధించుట కెంతమాత్రము సమర్థుఁడవు కానేరవు. ౩౭

నీవు శోకమును విడిచి స్థిరమయినయుద్యోగ మవలంబించి దానంజేసి యారాక్షసు రావణుని బంధుమిత్రసహితంబుగా వధింపుము. ౩౮

రాముఁడా! నీవు సముద్రముతోను వనంబులతోను పర్వతంబులతోను గూడిన భూమినంతయుఁ గ్రిందుమీఁదు చేయఁజాలుదువు; ఇఁక నీరావణుని వధించుట నీ కెంతమాత్రము?

ఇప్పుడు వర్షాకాలమువచ్చినది; కావున శరత్కాలమువఱకుఁ గాచి యుండుము. అంత రావణుని అతనిసైన్యముతోనుంగూడ వధింతువు. ౩౯

నేను నివురుఁగప్పిన నిప్పును ఆజ్యాహుతులచేఁ బ్రజ్వలింపఁజేయు విధంబున నిదురవోవుచున్న నీపరాక్రమమును ఉద్దీపకవాక్యములచే మేలుకొలుపుచున్నానుగాని నీకు ఉపదేశించువాఁడనుగాను. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౦

రాముఁడును లక్ష్మణుఁడు చెప్పినహితకరంబును మంగళకరంబు నగు మాటను గౌరవించి తనయందుఁ బ్రీతియు స్నేహంబునుగల తమ్మునింజూచి యిట్లని పలికెను. ౪౧

లక్ష్మణుఁడా! అనురాగముగలవాఁడును స్నేహముగలవాఁడును హితంబుగోరువాఁడును వీరుఁడును ఏది చెప్పఁదగునో అట్టిమాటం జెప్పినావు.

సమస్తకార్యములం జెఱచునట్టి యీశోకమును వదలినాను; పరాక్రమసమయంబులందు ఎదురులేని తేజంబు నవలంబించెదను. ౪౩

నీమాటప్రకారము శరత్కాలమువచ్చి నదులు నిర్మలమయిన జలముగల్గి సుగ్రీవుఁ డనుగ్రహించువఱకు నిరీక్షించియుండెదను. ౪౪

వీరుఁడగువాఁడు తన కుపకారము చేసినవారికిఁ బ్రత్యుపకారము చేయక

అకృతజ్ఞోఽప్రతికృతో హన్తి సత్త్వవతాం మనః. ౪౫

అత్రైవ ముక్తః ప్రణిధాయ లక్ష్మణః
కృతాఞ్జలి స్తత్ప్రతిపూజ్య భాషితమ్,
ఉవాచ రామం స్వభిరామదర్శనం
ప్రదర్శయ న్దర్శన మాత్మన శ్శుభమ్. ౪౬
యథోక్త మేత త్తవ సర్వ మీప్సితం
నరేన్ద్ర! కర్తా నచిరా ద్ధరీశ్వరః,
శరత్ప్రతీక్షః క్షమతా మిమం భవా
జ్జలప్రపాతం రిపునిగ్రహే ధృతః. ౪౭
నియమ్య కోపం ప్రతిపాల్యతాం శర
త్క్షమస్వ మాసాం శ్చతురో మయా సహ,
వసాచలేఽస్మి న్మృగరాజసేవితే
సంవర్తయ న్శత్రువధే సముద్యమమ్. ౪౮
ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తవింశ స్సర్గః. ౨౭.

---

## అష్టావింశ స్సర్గః.

స తదా వాలినం హత్వా సుగ్రీవ మభిషిచ్యచ,
వస న్మాల్యవతః పృష్ఠే రామో లక్ష్మణ మబ్రవీత్. ౧

అయం సకాల స్సంప్రాప్త స్సమయోఽద్య జలాగమః,
సంపశ్య త్వం నభో మేఘై స్సంవృతం గిరిసన్నిభైః. ౨

మానఁడు. అట్లు తనకుఁ గావించిన యుపకారమును మఱచి ప్రత్యుపకారము నేయనియెడ సాత్త్వికులగు సత్పురుషులమనస్సు నొచ్చును; గావున సుగ్రీవుఁడు సత్పురుషులకుఁ గోపంబువచ్చునను భయంబుననైనను మనకుఁ దప్పక ప్రత్యుపకారము సేయఁగలఁడు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౫

అంత లక్ష్మణుఁడు రాముని మాటనువిని చేతులుమోడ్చి రామవచనంబును గౌరవించి ముందు చేయవలసినకార్యమును గుఱించి యాలోచించి మంగళకరంబగు తనయభిప్రాయంబు దేటపడునట్లు ప్రియదర్శనుఁడగు రాముం జూచి యిట్లని పలికెను. ౪౬

మనుజనాథుఁడవగు రాముఁడా! వానరరాజు సుగ్రీవుఁడు చెప్పిన మాటను దప్పక నీకోర్కి యంతయు శీఘ్రంబున నెఱవేర్చును; గావున నీవు శత్రువును జయించుటకై ధీరుఁడవై శరదృతువు వచ్చువఱకు నీవర్షా కాలమందు విరహవేదనను గొంత సహించియుండుము. ౪౭

కోపం బడఁచుకొని యిఁక నాలుగుమాసంబులవఱకు నాతోఁగూడ నెట్లేని యోర్చియుండుము; శత్రువధంబునం దుత్సాహంబు వదలక సింహాది క్రూరమృగంబులచే నొప్పుచున్న యీపర్వతమునందు ఈనాలుగుమాసముల కాలము గడపుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౮

ఇది యిరువదియేడవసర్గము.

---

## ఇరువది యెనిమిదవసర్గము.

అట్లే రాముఁడు వాలిని వధించి సుగ్రీవునకు వానరరాజ్యంబునఁ బట్టాభిషేకంబుగావించి ప్రస్రవణపర్వతంబున నివాసంబుసేయుచుండి లక్ష్మణుంజూచి యిట్లనియెను. ౧

ఇప్పుడు సుగ్రీవుఁడు కిష్కింధనుండునట్లును మనమిచట నుండునట్లును సంకేతితమయిన కాలమగు వర్షర్తువువచ్చినది; ఆకాశంబునం దంత

నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః,
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్. 3

శక్య మమ్బర మారుహ్య మేఘసోపానపఙ్క్తిభిః,
కుటజార్జునమాలాభి రలంకర్తుం దివాకరమ్. ౪

సన్ధ్యారాగోత్థితై స్తామ్రై రన్తే ష్వధికపాణ్డురైః,
స్నిగ్ధై రభ్రపటచ్ఛేదై ర్బద్ధవ్రణ మి వామ్బరమ్. ౫

మన్దమారుతని శ్వాసం సంధ్యాచన్దనరఞ్జితమ్,
ఆపాణ్డుజలదం భాతి కామాతుర మివామ్బరమ్. ౬

ఏషా ఘర్మపరిక్లిష్టా నవవారిపరిప్లుతా,
సీతేవ శోకసన్తప్తా మహీ బాష్పం విముఞ్చతి. ౭

మేఘోదరవినిర్ముక్తాః కహ్లారసుఖశీతలాః,
శక్య మఞ్జలిభిః పాతుం వాతాః కేతకిగన్ధినః. ౮

ఏషఫుల్లార్జున శ్శైలః కేతకై రధివాసితః,
సుగ్రీవ ఇవ శాన్తారి ర్ధారాభి రభిషిచ్యతే. ౯

టను బర్వతాకారంబులగు మేఘంబులు వ్యాపించియున్నవి చూడుము. ౨

ఆకాశము సూర్యకిరణముల మూలమున సముద్రజలంబులం ద్రావి కార్తికాద్యాషాఢమాసపర్యంతము తొమ్మిదిమాసములు గర్భమునం దాల్చి యిప్పుడు సమస్తరసములకు స్థానమయినజలమును బ్రసవించుచున్నది. ౩

పర్వతమునకు సమీపముగాఁ బైపయి మేఘములు వ్యాపించియుండు టవలన నీమేఘములను పడికట్లమీఁదుగా నెక్కి యాకాశమునకుఁబోయి కొండమల్లెలదండలచేతను ఏఱుమద్దిపూలమాలికలచేతను సూర్యు నలంకరింప వచ్చును. ౪

వర్షముగురిసి వెలిసినతరువాత స్వల్పజలము గలవి గావునఁ దెల్లగానున్న మేఘములు సాయంకాలంబున సంధ్యారాగంబు దగులుటచే నడుమ నెఱ్ఱఁగాను చివరలం దెల్లఁగాను భాసిల్లుచు నాకాశంబు వ్యాపించుటంజేసి నెత్తురు దగులుటవలన నడుమ నెఱ్ఱనైన తెల్లని గుడ్డలచే నాకాశమునందు గాయములకుఁ గట్లుకట్టినట్లున్నది. ౫

ఆకాశము తిన్ననిగాలి యను విడువని నిట్టూర్పులును సంధ్య యను చందనంపు మైపూఁతయు మేఘంబుల వెల్లదనంబునుఁ గలిగియుండుటవలనఁ బ్రియావిరహముచేఁ బీడితమయినదివలె నగపడుచున్నది. ౬

ఎండకు మిక్కిలి కాఁగి వర్షజలంబులచేఁ దడుపఁబడిన యీభూమి, శోకాతిశయంబున మిక్కిలియుఁ దపింపఁజేయఁబడిన సీతవలె బాష్పమును (భూమిపక్షంబున ఆవిరిని సీతాపక్షంబున కన్నీటిని) విడుచుచున్నది. ౭

గాడ్పులు మేఘమధ్యంబులనుండి వచ్చుటచే మందములయి రెట్టి గలువల మీఁదుగా వీచుటంజేసి మంచివాసనయుఁ జల్లదనంబునుఁ గలిగి మొగిలిపూలవాసనతో నొప్పుచుండుటవలన దోసిళ్లంబట్టి త్రావఁదగియున్నవి. ౮

వికసించిన యర్జునకుసుమములు గలదియు మొగిలిపూలు పొదలయందు వికసించియుండుటవలన వానివాసనతో నొప్పుచున్నదియునగు నీపర్వతము పట్టాభిషేకసమయంబునఁ బుష్పమాలికాలంకృతుండును సుగంధిచందనాచలిప్తుఁడునగు సుగ్రీవుఁడుఁబోలె జలధారలచే నభిషేకింపఁబడుచున్నది.

మేఘకృష్ణాజినధరాః ధారాయజ్ఞోపవీతినః,
మారుతాపూరితగుహాః ప్రాధీతా ఇవ పర్వతాః. ౧౦

కశాభి రివ హైమీభి ర్విద్యుద్భి రివ తాడితమ్,
అన్త స్తనితనిర్ఘోషం సవేదన మి వామ్బరమ్. ౧౧

నీలమేఘాశ్రితా విద్యు త్స్ఫురన్తీ ప్రతిభాతి మా,
స్ఫురన్తీ రావణ స్యాఙ్కే వైదే హీవ తపస్వినీ. ౧౨

ఇమా స్తా మన్మథవతాం హితాః ప్రతిహతా దిశః,
అనులిప్తా ఇవ ఘనై ర్నష్టగ్రహనిశాకరాః. ౧౩

క్వచి ద్బాష్పాభిసంరుద్ధా న్వర్షాగమసముత్సుకాన్,
కుటజా న్పశ్య సౌమిత్రే! పుష్పితా న్గిరిసానుషు ౧౪
మమ శోకాభిభూతస్య కామసందీపనా న్స్థితాన్,

రజః ప్రశాన్తం సహిమోఽద్య వాయు
ర్నిదాఘదోషప్రసరాః ప్రశాన్తాః,
స్థితా హి యాత్రా వసుధాధిపానాం
ప్రవాసినో యాన్తి నరా స్స్వదేశాన్. ౧౫
సంప్రస్థితా మానసవాసలుబ్ధాః
ప్రియాన్వితా స్సంప్రతి చక్రవాకాః,
అభీక్ష్ణవర్షోదకవిక్షతేషు
యానాని మార్గేషు న సంపతన్తి. ౧౬

పర్వతములు మేఘములచేఁ గప్పఁబడి తెల్లని జలధారలుగలిగి వాయుపూరితంబులయిన గుహలచే ధ్వనించుచుండుటవలన కృష్ణాజినంబులు దాల్చి యజ్ఞోపవీతంబులు ధరించి వేదాధ్యయనము చేయునట్లున్నవి. ౧౦

ఆకాశము మెఱపులు మెఱయుచు మేఘగర్జనలు గలిగియుండుటవలన బంగారుకొరడాలచేఁ గొట్టఁబడి గట్టిగా నధ్యయనముచేయుచు లోపల వేదన గలిగినట్లు కనఁబడుచున్నది. ౧౧

నల్లని మేఘంబునందుఁ జలించుచున్న మెఱపు, రావణునితొడమీఁద విడిపించుకొనుటకై పెనఁగులాడుచున్న శోచనీయయగు సీతవలె నాకుఁ దోఁచుచున్నది. ౧౨

ఇట్లు మేఘావృతంబై నక్షత్రములుగాని చంద్రుఁడుగాని తెలియక ఇది "తూర్పు పడమర" యని తెలియ నలవిగానట్లు చీఁకటి క్రమ్మియుండుట కాముకులగువారలకు మిక్కిలియుఁ బ్రియము ౧౩

లక్ష్మణుఁడా! ఒకచోటఁ గొండనెత్తములంగుఁ గొండమల్లెలు బాష్పసంవృతంబులై వర్షర్తువు వచ్చుటంజేసి వికసితంబులయి పుష్పితంబులై ప్రియాసమాగమంబునం జేసి ఆనందబాష్పంబులతోఁగూడి హసితవదనులగు కాముకులవిధంబున నొప్పుచు నాకు మఱియు మన్మథవేగంబు వృద్ధిఁబొందించుచున్నవి చూడుము. ౧౪

ఇపుడు భూమియందు దుమ్ము అణఁగినది; వాయువు చల్లఁగా వీచుచున్నది; ఎండకాలముయొక్క వేఁడిమి నశించినది; రాజులుచేయు దండయాత్రలు నిలచినవి; దూరప్రయాణము పోయినవారలు తమస్వదేశంబు నొందెదరు. ౧౫

ఇపుడు హంసలు మానససరస్సునకుఁ బోయినవి; చక్రవాకపక్షులు కామోద్రేకంబునంజేసి ప్రియాసమేతంబులయి యున్నవి; వర్షోదకధారలచే మార్గంబులు చెడియుండుటవలన బండ్లు మొదలగునవి సంచరింపవు.

క్వచి త్ప్రకాశం క్వచి దప్రకాశం
నభః ప్రకీర్ణామ్బుధరం విభాతి,
క్వచి త్క్వచి త్పర్వతసన్నిరుద్ధం
రూపంయథా శాన్తమహార్ణవస్య. ౧౭

వ్యామిశ్రితం సర్జకదమ్బపుష్పై
ర్నవం జలం పర్వతధాతుతామ్రమ్,
మయూరకేకాభి రనుప్రయాతం
శైలాపగాః శీఘ్రతరం వహన్తి. ౧౮

రసాకులం షట్పదసన్నికాశం
ప్రభుజ్యతే జమ్బుఫలం ప్రకామమ్,
అనేకవర్ణం పవనావధూతం
భూమౌ పత త్యామ్రఫలం విపక్వమ్. ౧౯

విద్యుత్పతాకా స్సబలాకమాలా
శ్శైలేన్ద్రకూటాకృతిసన్నికాశాః,
గర్జన్తి మేఘా స్సముదీర్ణనాదా
మత్తా గజేన్ద్రా ఇవ సంయుగస్థాః. ౨౦

వర్షోదకాప్యాయితశాద్వలాని
ప్రవృత్తనృత్తోత్సవబర్హిణాని,
వనాని నిర్వృష్టబలాహకాని
పశ్యాపరాహ్ణే ష్వధికం విభాన్తి. ౨౧

సముద్వహన్త స్సలిలాతిభారం
బలాకినో వారిధరా నదన్తః,
మహత్సు శృఙ్గేషు మహీధరాణాం
విశ్రమ్య విశ్రమ్య పునః ప్రయాన్తి. ౨౨

ఆకాశము విడివిడిగా మేఘంబులు వ్యాపించియుండుటవలన గొన్నిచోట్ల వెల్లడియయుం గొన్నిచోట్లం బ్రచ్ఛన్నమునై యున్నది కావున ఒక్కొకచోం బర్వతంబులచే నడ్డగింపఁబడిన యలలులేని సముద్రమువలెఁ బ్రకాశించుచున్నది. ౧౭

ఏఱుమద్దిపూలతోను గదంబపుష్పంబులతోను గలసినవియుం బర్వతధాతుసంబంధంబున నెఱ్ఱగా నున్నవియునగు క్రొత్తనీళ్ళుగలిగి మయూరంబులు మధురముగాఁ గేకారవంబులుసేయఁ బర్వతనదులు వేగంబునఁ బ్రవహించుచున్నవి. ౧౮

మిక్కిలియు మాధుర్యముగలవియు భృంగమువలె నల్లనివియునగు నేరేడుపండ్లను అధికముగా జనులు తినుచుందురు; మామిడిపండ్లు ఎఱ్ఱనివియుఁ బచ్చనివియుఁ జక్కఁగాఁ బక్వములయి గాలికి నేలఁబడుచున్నవి. ౧౯

మెఱుపులతోఁగూడినవియు క్రొక్కెరలపఙ్క్తులతో నొప్పుచున్నవియుఁ బర్వతశిఖరంబులతో సమానములునగు మేఘంబులు టెక్కెములతోఁ గూడి నక్షత్రమాలికాలంకృతములయి యత్యున్నతములయిన యొండొంటిం దాఁకి పోరునట్టి మదపుటేనుఁగులపగిది, మహాధ్వనితో గర్జించుచున్నవి ౨౦

వనంబులు వానగురియుటచేఁ జక్కఁగాఁ బెరిగిన పచ్చికగల్గి వేడుకగా నృత్తంబులుసేయు నెమిళ్లతో నొప్పుచు మేఘంబులు చక్కఁగా వర్షించి నిలిచినప్పుడు అపరాహ్ణసమయంబులందు మిక్కిలియు రమణీయంబులై యున్నవి చూడుము. ౨౧

మేఘంబులు అధికమయిన జలభారముగలవి గావున కొక్కెరలచేఁ బరివేష్టింపఁబడినవై, శ్రమాతిశయంబున గర్జనవ్యాజంబున మూలుగుచుఁ బర్వతంబుల గొప్పశిఖరములందు నిలిచినిలిచి యలసటదీర్చుకొని పోవుచున్నవి.

మేఘాభికామా పరిసంపతన్తీ
సంమోదితా భాతి బలాకపఙ్క్తిః,
వాతావధూతావరపౌణ్డరీకీ
లమ్బేవ మాలా రచితాఽమ్బరస్య. ౨౩
బాలేన్ద్రగోపాన్తరచిత్రితేన
విభాతి భూమి ర్నవశాద్వలేన,
గాత్రానుపృక్తేన శుకప్రభేణ
నారీవ లాక్షోక్షితకమ్బళేన. ౨౪
నిద్రా శనైః కేశవ మభ్యుపైతి
ద్రుతం నదీ సాగర మభ్యుపైతి,
హృష్టాబలాకా ఘన మభ్యుపైతి
కాన్తా సకామా ప్రియ మభ్యుపైతి. ౨౫
జాతా వనాన్తా శ్శిఖిసంప్రనృత్తా
జాతాః కదమ్బా స్సకదమ్బశాఖాః,
జాతా వృషా గోషు సమానకామా
జాతా మహీ సస్యవనాభిరామా. ౨౬
వహన్తి వర్షన్తి నదన్తి భాన్తి
ధ్యాయన్తి నృత్యన్తి శమాశ్వసన్తి,
నద్యో ఘనా మత్తగజా వనాన్తాః
ప్రియావిహీనా శ్శిఖినః ప్లవఙ్గాః. ౨౭

ప్రహర్షితాః కేతకపుష్పగన్ధ
మాఘ్రాయ హృష్టా వననిర్ఝరేషు,
ప్రపాతశబ్దాకులితా గజేన్ద్రా

గర్భాధారణార్థమయి మేఘంబుల నపేక్షించుచు సంతోషంబునం దిరుగుచున్న కొక్కెరలపఙ్క్తి ఆకాశమునకు వ్రేలాడునట్లు వేయఁబడి గాలికిఁ గదలుచున్న తెల్లదామరపూలమాలికవలె నొప్పుచున్నది. ౨౩

భూమి నడుమనడుమ చిన్నయెఱ్ఱని యారుద్రపురుగులచేఁ జిత్రితమయిన లేఁతపచ్చిక గలిగి యుండుటవలన నడుమనడుమ లత్తుకరసముచేఁ జిత్రములువ్రాసిన యాకుపచ్చనికంబళిపుట్టముగట్టిన యంగనవలెఁ బ్రకాశించుచున్నది. ౨౪

ఇపుడు యోగనిద్ర విష్ణువునుబొందును. నది శీఘ్రముగా సముద్రమునొందును. కొక్కెరయు సంతోషంబున మేఘమునొందును. యువతులును గామాతురలై తమప్రియులం బొందుదురు. ౨౫

వనంబులందు నెమిళ్లు నృత్తముసేయ నారంభించినవి. కదంబవృక్షములు చక్కఁగాఁ బుష్పించినవి. ఆఁబోతులు ఆవులయెడఁ గామాతురంబు లగుచున్నవి. భూమి పైరులతో నిండి రమణీయముగానున్నది. ౨౬

ఇపుడు నదులు ప్రవహించుచున్నవి. మేఘంబులు వర్షించుచున్నవి. మదపుటేనుఁగులు గర్జించుచున్నవి. అడవులు ప్రకాశించుచున్నవి. ప్రియురాండ్ర నెడఁబాసినవారలు వ్యసనంబు నొందుచున్నారు. మయూరంబులు నృత్తముసేయుచున్నవి. వానరులు ఒకచోటనె కావలసినయాహారము దొరకుటవలన నెమ్మదినొందియున్నారు; లేక సుగ్రీవపక్షమునందలి వానరులు సుగ్రీవుఁడు రాజ్యంబునొందుటవలన సంతోషంబు నొందియున్నారు. ౨౭

వర్షముచే సంతుష్టములైన మదపుటేనుఁగులు వెంగిలిపూలతావి నాఘ్రాణించి మఱియు సంతోషంబునొంది అడవి సెలయేళ్లయందు నీళ్ళు పైనుండి క్రిందఁబడుటవలనం గలుగు శబ్దముచే వ్యాకులీకృతంబులై

సార్ధం మయూరై స్సమదా నదన్తి. ౨౮
ధారానిపాతై రభిహన్యమానాః
కదమ్బశాఖాసు విలమ్బమానాః,
క్షణార్జితం పుష్పరసావగాఢం
శనై ర్మదం షట్చరణా స్త్యజన్తి. ౨౯
అఙ్గారచూర్ణోత్కరసన్నికాశైః
ఫలై స్సుపర్యాప్తరసై స్సమృద్ధైః,
జమ్బూద్రుమాణాం ప్రవిభాన్తి శాఖా
నిలీయమానా ఇవ షట్పదౌఘైః. ౩౦
తటిత్పతాకాభి రలంకృతానా
ముదీర్ణగమ్భీరమహారవాణామ్,
విభాన్తి రూపాణి బలాహకానాం
రణోద్యతానా మివ వారణానామ్. ౩౧
మార్గానుగ శ్శైలవనానుసారీ
సంప్రస్థితో మేఘరవం నిశమ్య,
యుద్ధాభికామః ప్రతినాగశఙ్కీ
మత్తో గజేన్ద్రః ప్రతిసన్నివృత్తః. ౩౨
క్వచి త్ప్రగీతా ఇవ షట్పదౌఘైః
క్వచి త్ప్రనృత్తా ఇవ నీలకణ్ఠైః,
క్వచి త్ప్రమత్తా ఇవ వారణేన్ద్రై
ర్విభా న్త్యనేకాశ్రయిణో వనాన్తాః. ౩౩
కదమ్బసర్జార్జున కన్దలాఢ్యా
వనాన్తభూమి ర్నవవారిపూర్ణా,

మయూరములతోఁగూడ నఱచుచున్నవి. ౨౮

తుమ్మెదలు కదంబపుష్పంబులందలి తేనియం గ్రోలి యతిశీఘ్రంబుగ మదమునొంది కదంబశాఖలందు వ్రాలియున్నపుడు వర్షముగురియుటచే నాతుమ్మెదలు వర్షధారలం దడియుటంజేసి యామదము తిన్నగా నశించెను. ౨౯

బొగ్గుతునకలవలె నల్లనైనవియు రసపూర్ణంబులునగు ఫలంబులు నిండియుండుటవలన జంబువృక్షశాఖలు తుమ్మెదలచేఁ గప్పఁబడినట్లు ప్రకాశించుచున్నవి. ౩౦

మేఘంబులు మెఱపులు అను ధ్వజములచే నలంకృతంబులయి గంభీరముగా మహాధ్వనితో గర్జించుచుండుటవలన యుద్ధసన్నద్ధంబులగు మత్తగజంబులభంగి నొప్పుచున్నవి. ౩౧

పర్వతవనంబునకుఁ బోవుటకై బయలుదేఱి మార్గమున బట్టి పోవుచున్న మత్తగజము మేఘగర్జనమువిని యెదిరియేనుంగు ధ్వనిగా శంకించి యుద్ధముసేయఁగోరి వెనుకకుఁ దిరిగినది. ౩౨

వనప్రదేశము, ఒకచోఁ దుమ్మెదలగీతములు గలిగియు, నొకచో మయూరంబుల మనోహరనృత్తంబులు గలిగియు మఱియొకచో గజంబుల మదజలంబులు గలిగియు అనేకవిషయములకు స్థానంబయి ప్రకాశించుచున్నది. ౩౩

వనభూమి కదంబకుసుమములతోను మంకెనపూలతోను అర్జునపుష్పములతోను అరఁటిపూలతోనుంగూడి యెఱ్ఱనినూతనజలముతో నిండి నెమిళ్ళ

మయూరమత్తాభిరుతప్రనృత్తై
రాపానభూమి ప్రతిమా విభాతి. 3౪

ముక్తాసకాశం సలిలం పతద్వై
సునిర్మలం పత్త్రపుటేషు లగ్నమ్,
హృష్టా వివర్ణచ్ఛదనా విహఙ్గా
స్సురేన్ద్రదత్తం తృషితాః పిబన్తి. 3౫

షట్పాదతన్త్రీమధురాభిధానం
ప్లవఙ్గమోదీరితకణ్ఠతాళమ్,
ఆవిష్కృతం మేఘమృదఙ్గనాదై
ర్వనేషు సంగీత మివ ప్రవృత్తమ్. 3౬
క్వచి త్ప్రనృత్తైః క్వచి దున్నదద్భిః
క్వచిచ్చ వృక్షాగ్రనిషణ్ణకాయైః,
వ్యాలమ్బబర్హాభరణై ర్మయూరై
ర్వనేషు సంగీత మివ ప్రవృత్తమ్. 3౭

స్వనై ర్ఘనానాం ప్లవగాః ప్రబుద్ధా
విహాయ నిద్రాం చిరసన్నిరుద్ధామ్,
అనేకరూపాకృతివర్ణనాదా
నవామ్బుధారాభిహతా నదన్తి. 3౮
నద్య స్సముద్వాహితచక్రవాకా
స్తటాని శీర్ణా న్యపవాహయిత్వా,

యొక్క మదయుక్తములయిన కేకలచేతను నృత్తములచేతను ఒప్పుచున్నదగుటంజేసి సంస్కారార్థములయిన పుష్పములతోఁ గూడినదియుఁ, బానపాత్రార్థములయిన యరఁటిపూలతోఁ గూడినదియుఁ, గైపుచే నఱచుచు నృత్తము సేయుచున్న పురుషులతోఁ గూడినదియునగు మద్యపూర్ణమయిన పానభూమివలె నున్నది. ౩౪

ఇంత వఱకు దప్పిగొనియున్న నానావర్ణములగు ఱెక్కలుగల చాతకపక్షులు ఇపుడు వర్షాధిదేవతయగు దేవేంద్రునిచే నొసంగఁబడినదియు ఆకాశంబునుండి పడుచునే పత్రపుటంబులలగ్నంబయి యతిస్వచ్ఛంబై ముత్తెమువలె వెలుంగుచున్నదియునగు జలంబును సంతోషంబునఁ దనివిదీరఁ ద్రాఁగుచున్నవి. ౩౫

తుమ్మెదలఝుంకారమె మనోహరమయిన తంత్రీధ్వనిగా, కప్పలధ్వనియె కంతతాళముగా మేఘగర్జనమె మృదంగవాద్యధ్వనిగా వనములయందు సంగీతము జరుగుచున్నట్లున్నది. ౩౬

వ్రేలాడుచున్న పింఛములచేనలంకృతంబులగు మయూరంబులు ఒకచోటఁ గొన్ని నృత్తంబులు సేయుచును గొన్ని యొకచోఁ గేకారవంబులు సేయుచును, గొన్ని యొకచో మధ్యస్థంబుగా వృక్షాగ్రంబుల నిలుచుండియుండుటంజేసి అట్లు కొందఱు నృత్తము సేయువారలును గొందఱు పాడువారలును గొందఱు వినువారలు నుండుటవలన ఆవనులందు సంగీతసభ జరుగునట్లున్నది.

నానావిధములయిన యాకారములును వర్ణములును ధ్వనులును గలకప్పలు మేఘగర్జనంబులచే బహుకాలముగా సమస్తవ్యాపారంబులను నిరోధించుచుండిన నిదురనువదలి మేలుకొని వర్షధారలచేఁ గొట్టఁబడినవై యఱచుచున్నవి. ౩౭

మన్మథవశంగతలగు కామినులు యౌవనమదంబున వృద్ధుల సరకుసేయక యున్నతస్తనంబులతో నొప్పుచు మంచిఫలాభ్యవహారములును బుష్పాది

దృష్ట్వా నవప్రాభృతపూర్ణభోగా
ద్రుతం స్వభర్తార ముపోపయాన్తి. ౩౯

నీలేషు నీలాః ప్రవిభాన్తి సక్తా
మేఘేషు మేఘా నవవారిపూర్ణాః,
దవాగ్నిదగ్ధేషు దవాగ్నిదగ్ధా
శ్శైలేషు శైలా ఇవ బద్ధమూలాః. ౪౦
ప్రహృష్టసన్నాదితబర్హిణాని
సశక్రగోపాకులశాద్వలాని,
చరన్తి నీపార్జునవాసితాని
గజా స్సురమ్యాణి వనాన్తరాణి. ౪౧
నవామ్బుధారాహతకేసరాణి
ద్రుతం పరిత్యజ్య సరోరుహాణి,
కదమ్బపుష్పాణి సకేసరాణి
నవాని హృష్టా భ్రమరాః పతన్తి. ౪౨
మత్తా గజేన్ద్రా ముదితా గవేన్ద్రా
వనేషు విశ్రాన్తతరా మృగేన్ద్రాః,
రమ్యా నగేన్ద్రా నిభృతా నరేన్ద్రాః
ప్రక్రీడితో వారిధరై స్సురేన్ద్రః. ౪౩
మేఘా స్సముద్ధూతసముద్రనాదా
మహాజలౌఘై ర్గగనావలమ్బాః,
నదీ స్తటాకాని సరాంసి వాపీ
ర్మహీం చ కృత్స్నా మపవాహయన్తి. ౪౪

భోగద్రవ్యములను గొని తమప్రియునిచెంతకుఁ బోవునట్లు నదులు నీళ్లునిండియుండుటచేఁ జైకొఁ దేలిన చక్రవాకంబులుగలవై ప్రవాహముచే శిథిలములయినతటంబుల నతిక్రమించి ప్రవాహంబునం గొట్టుకొని వచ్చిన నూతనములగు ఫలాద్యుపహారంబులను బుష్పాదిభోగద్రవ్యంబులను గలవై సముద్రంబునం గలయుచున్నవి. ౩౯

జలపూర్ణంబులగు నల్లనిమేఘంబులు ఒకటితోనొకటి సంబంధించియుండుటంజేసి ఒకటితోనొకటి సంబంధించియున్న దావాగ్నిదగ్ధంబు లగుటవలన నల్లనాయున్న పర్వతంబులకరణిఁ బ్రకాశించుచున్నవి. ౪౦

సంతోషంబునఁ గేకారవంబులు సేయుచున్న మయూరంబులచే మనోహరంబులయి యాదద్రపుటగులతోఁ గూడిన పుష్పకలతో కొప్పుచుఁ గదంబపుష్పంబులచేత నర్జునకుసుమంబులచేతను తోఁపలు శోభించుచున్న వన ప్రదేశంబులందు ఏనుఁగులు సంచరించుచున్నవి. ౪౧

క్రొత్తవర్షధారలు పడుటవలనఁ గేసరంబులు ముడుచుకొనియున్న కమలంబులను తుమ్మెదలు శీఘ్రంబుగా వదలి వర్షాకాలంబున వికసించున ట్లుటంజేసి చక్కఁగా వికసించిన క్రొత్తకదంబపుష్పంబులపై వ్రాలుచున్నవి. ౪౨

ఏనుఁగులు మదమునొందినవి. ఆఁబోతులు మదమునొందినవి. అడవులందు సింహములు విశ్రాంతివహించియున్నవి రాజులు యుద్ధయాత్రలఁ వదలి కదలకున్నారు. దేవేంద్రుఁడు మేఘంబులచే విహరించుచున్నాఁడు. ౪౩

మేఘంబులు ఆకాశంబునంజేరి సముద్రమధికముగా గర్జింప గొప్ప జలప్రవాహంబులు గలుగునట్లు వర్షంబుఁ గురియుటంజేసినదులును దటాకంబులను సరస్సులును నదబావులును భూమియంతయు జలమయముగా నీళ్లతో నిండియున్నవి. ౪౪

వర్షప్రవేగా విపులాః పతన్తి
ప్రవాన్తి వాతా స్సముదీర్ణఘోషాః,
ప్రణష్టకూలాః ప్రవహన్తి శీఘ్రం
నద్యో జలై ర్విప్రతిపన్నమార్గాః. ౪౫

నరై ర్నరేన్ద్రాఇవ పర్వతేన్ద్రా
స్సురేన్ద్రదత్తైః పవనోపనీతైః,
ఘనామ్బుకుమ్భై రభిషిచ్యమానా
రూపం శ్రియం స్వా మివ దర్శయన్తి. ౪౬

ఘనోపగూఢం గగనం సతారం
న భాస్కరో దర్శన మభ్యుపైతి,
నవై ర్జలౌఘై ర్ధరణీ విసృప్తా
తమోవిలిప్తా న దిశః ప్రకాశాః. ౪౭

మహాన్తి కూటాని మహీధరాణాం
ధారాభిధౌతా న్యధికం విభాన్తి,
మహాప్రమాణై ర్విపులైః ప్రపాతై
ర్ముక్తాకలాపై రివ లమ్బమానైః. ౪౮

శైలోపలప్రస్ఖలమానవేగా
శ్శైలోత్తమానాం విపులాః ప్రపాతాః,
గుహాసు సన్నాదితబర్హిణాసు
హారా వికీర్యన్త ఇ వావభాన్తి. ౪౯

శీఘ్రప్రవేగా విపులాః ప్రపాతా
నిర్ధౌతశృఙ్గోపతలా గిరీణామ్,
ముక్తాకలాపప్రతిమాః పతన్తో
మహాగుహోత్సఙ్గతలై ర్ధ్రియన్తే. ౫౦

మహావేగముతో నిరంతరముగా వానగురియుచున్నది. గాడ్పులు మహాధ్వనిగలవై వీచుచున్నవి. నదులు పూర్ణప్రవాహములగుటంజేసి గట్టులు తెగి మార్గంబుదప్పి వెల్లువలుగాఁ బ్రవహించుచున్నవి. ౪౫

మన్యుషులచేఁ బెద్దజలకుంభంబుల నభిషేకింపఁబడిన రాజులు తమరాజలక్ష్మి నిజూపువట్లు పర్వతరాజంబులును దేవేంద్రునిచే నొసంగఁబడి వాయుప్రేరితంబులగు మేఘంబులను జలకుంభములచే నభిషేకింపఁబడినవై పుష్పపల్లవాదిరమణీయమయిన తమరూపమును జూపుచున్నవి. ౪౬

ఆకాశము మేఘముచేఁ గప్పఁబడియున్నదగుటను రాత్రి నక్షత్రములుగాని పవలు సూర్యుఁడుగాని యగపడుటలేదు. భూమియంతియుఁ గ్రొత్తనీటిప్రవాహములు వ్యాపించియున్నవి. చీఁకటి క్రమ్మియుండుటంజేసి దిక్కులుఁ దెలియకున్నవి. ౪౭

వర్షధారలచేఁ గడుగఁబడినయున్నతములగు పర్వతశిఖరంబులు గొప్పవిశాలంబులగు సెలయేర్లు గలిగియుండుటచే ముక్తాహారాలంకృతంబులగు స్వచ్ఛోన్నతము లయిన కామినీస్తనంబులపగిది సెంతియు భాసిల్లుచున్నవి.

పర్వతంబులందు గొప్ప సెలయేర్లు పర్వతంబునందలి పెనుఱాళ్లచే స్ఖలితవేగంబులయి మధురంబుగాఁగూయుచున్న నెమిళ్లతో నొప్పునట్టి గుహలందుఁ జెల్లాచెదరై పడఁనపుడు ముక్తాహారంబులు తెగి వెదచల్లఁబడినట్లున్నది. ౪౯

పర్వతంబులందు మహావేగంబులగు గొప్పసెలయేర్లు శిఖరసమీపప్రదేశములమీఁదుగా ముక్తాహారంబులంబోలి క్రిందంబడుచు గొప్పగుహామధ్యప్రదేశంబుల నిలుచుచున్నవి. ౫౦

సురతామర్దవిచ్ఛిన్నాః స్స్వర్గస్త్రీహారమౌక్తికాః,
పతన్తీ వాకులా దిక్షు తోయధారా స్సమన్తతః. ౫౦
నిలీయమానై ర్విహగై ర్నిమీలద్భిశ్చ పఙ్కజైః,
వికసన్త్యా చ మాలత్యా గతోఽస్తం జ్ఞాయతే రవిః. ౫౧

వృత్తా యాత్రా నరేన్ద్రాణాం సేనా ప్రతినివర్తతే,
వైరాణి చైవ మార్గాశ్చ సలిలేన సమీకృతాః. ౫౩

మాసి ప్రోష్ఠపదే బ్రహ్మ బ్రాహ్మణానాం వివక్షతామ్,
అయ మధ్యాయసమయ స్సామగానా ముపస్థితః. ౫౪

నివృత్తకర్మాయతనో నూనం సంచితసంచయః,
ఆషాఢీ మభ్యుపగతో భరతః కోసలాధిపః. ౫౫

నూన మాపూర్యమాణాయా స్సరయ్వా వర్ధతే రయః,
మాం సమీక్ష్య సమాయాన్త మయోధ్యాయా ఇవ స్వనః.

ఇమా స్స్ఫీతగుణా వర్షా స్సుగ్రీవ స్సుఖ మశ్నుతే,
విజితారి స్సదారశ్చ రాజ్యే మహతి చ స్థితః. ౫౭

అహన్తు హృతదారశ్చ రాజ్యాచ్చ మహతశ్చ్యుతః,
నదీకూల మివ క్లిన్న మవసీదామి లక్ష్మణ!. ౫౮

ఆకాశమునుండి పడు జలధారలు సురతసమయంబునందు దంపతులరొమ్ము పయికచేఁ దెగిపడు దేహతాత్రీంహారమౌక్తికములో యనందగియున్నవి. ౫౧

పక్షులు గూండ్లలోఁ జేరుటవలనను కమలంబులు ముకుళించుకొనుటవలనను జాజిపువ్వు వికసించుటవలనను సూర్యుఁ డస్తమించెనని తెలియుచున్నది. ౫౨

రాజుల యుద్ధయాత్రలు నిలిచినవి. దండు మరలి స్వస్థానము చేరును. జలము అడ్డముగుటచే యుద్ధము సేయ వీలులేక వైరము శాంతమగును. మార్గములును పల్లములందు సమముగా నీళ్లు నిలుచుటచేత సమముగాఁ దోఁచును. లేక జలమయమగుటవలన "ఇది మార్గము. ఇది యమార్గము" అని తెలియ నశక్యమయినది. ౫౩

భాద్రపదమాసమునందు వేదాధ్యయనారంభము సేయనలసిన సామవేదులగు బ్రాహ్మణులకు ఇది యధ్యయనసమయము హస్తనక్షత్రమాసము ప్రాప్తించినది. ౫౪

కోసలదేశాధీశ్వరుండగు భరతుండు వర్షాకాలము నాలుగు మాసములందును గృహోపకరణములను గాని యితరవస్తువులను గాని సంపాదించుట కవకాశముండదు కావున, ఆషాఢపూర్ణిమకు ముందే యింటికార్యములన్నియు నెఱవేర్చుకొని సమస్తవస్తువులను సేకరించుకొని యుండును ౫౫

నే నెచటికేనిపోయి వచ్చినపుడు నన్నుఁ జూచి యయోధ్యావాసిజను లానందంబునం జేయు కోలాహలంబువలె నిపుడు వర్షంబుచే నిండిన సరయూనదియందు మహావేగంబు గలిగి యుండును; నిశ్చయము. ౫౬

శత్రువును జయించి భార్యను బొంది గొప్పరాజ్యంబున కధిపతియై యున్నాఁడు కావున, సుగ్రీవుఁడు ఉపభోగమునకు ఉత్తమకాలంబగు నీవర్షర్తువునందు సమస్తసుఖముల ననుభవించుచున్నాఁడు. ౫౭

లక్ష్మణుఁడా! నేనో భార్యంగోలుపోయి రాజ్యభ్రష్టుండనై యింకను శత్రువును జయింపఁజాలకున్నాను గావున, జలంబులం దడిసిన యేటిగట్టువలె నశించుచున్నాను. ౫౮

శోక శ్చ మమ విస్తీర్ణో వర్షాశ్చ భృశదుర్గమాః,
రావణశ్చ మహాన్ శత్రు రపారం ప్రతిభాతి మే. ౫౯

అయాత్రాంచైవ దృష్ట్వేమా న్మార్గాం శ్చ భృశదుర్గమాన్,
ప్రణతేచైవ సుగ్రీవేన మయా కించి దీరితమ్. ౬౦

అపి చాతిపరిక్లిష్టం చిరా ద్దారై స్సమాగతమ్,
ఆత్మకార్యగరీయస్త్వా ద్వక్తుం నేచ్ఛామి వానరమ్. ౬౧

స్వయ మేవహి విశ్రమ్య జ్ఞాత్వా కాల ముపాగతమ్,
ఉపకారంచ సుగ్రీవో వేత్స్యతే నాత్ర సంశయః. ౬౨

తస్మా త్కాలప్రతీక్షోఽహం స్థితోఽస్మి శుభలక్షణ!,
సుగ్రీవస్య నదీనాంచ ప్రసాద మనుపాలయన్. ౬౩

ఉపకారేణ వీరో హి ప్రతికారేణ యుజ్యతే,
అకృతజ్ఞోఽప్రతికృతో హన్తి సత్త్వవతాం మనః. ౬౪

త మేవ ముక్తః ప్రణిధాయ లక్ష్మణః
కృతాఞ్జలి స్తత్ప్రతిపూజ్య భాషితమ్,

నాదుఃఖమో మిక్కిలియు సహింపరానిదిగా నున్నది. వర్షర్తువో ఎంతమాత్రము గడప నశక్యము. రావణుఁడో అసాధ్యుఁడైన శత్రువు. ఈమూటిని దాఁటుట యశక్యమని నాకుఁ దోఁచుచున్నది. ౪౯

ఈ వర్షర్తువునందు యుద్ధయాత్ర సేయుట యసాధ్యమగుటను మార్గంబులు నడచుట కశక్యములుగా నుండుటను జూచి నేను సుగ్రీవుఁ డిప్పుడె రావణునివధించి సీతందెచ్చుటకై ప్రయత్నము సేయవలయునని యెంత ప్రార్థించినను గొంచెమయినను ఆవిషయము నంగీకరింపలేదు. ౫౦

ఇంతియగాక సుగ్రీవుఁడు ఇదివఱకుఁ జాలఁ గష్టము లనుభవించి ఇప్పటికి బహుకాలమునకు భార్యాసమాగమంబు నొందినాఁడు. మనకార్యము మిక్కిలియు గొప్పది. స్వల్పప్రయత్నముచేత స్వల్పకాలముచేత సాధ్యమగునది కాదు. కావున, సుగ్రీవుని ముందు మనపనిచేయుమని కోరనైతిని. ౫౧

సుగ్రీవుఁడు వర్షాకాల మంతయు విశ్రమించి శరత్కాలమువచ్చుట నెఱింగి తానై యె తనకు నేనుగావించిన యుపకారమును మఱవక కృతజ్ఞుఁడై ప్రవర్తింపఁగలఁడు. ౫౨

మంగళకరంబులగు లక్షణంబులు గల లక్ష్మణుఁడా! ఆకారణమువలన నేను శరత్కాలము వచ్చుదనుక నదులు . నిర్మలములయి సుగ్రీవుఁ డనుగ్రహము సేయువఱకుఁ గాంచియుండెదను. ౫౩

వీరుఁడగువాఁడు తనకుపకారముచేసినవారికిఁ బ్రత్యుపకారముచేయక మానఁడు. అట్లు తనకుఁగావించిన యుపకారమును మఱచి ప్రత్యుపకారము సేయనియెడ సాత్త్వికులగు సత్పురుషులమనస్సు నొచ్చును. గావున, సుగ్రీవుఁడు సత్పురుషులకుఁ గోపంబువచ్చునను భయంబున నైనను మనకుఁ దప్పక ప్రత్యుపకారము సేయఁగలఁడు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫౪

అంత లక్ష్మణుఁడు రాముని మాటనువిని చేతులుమోడ్చి రామువచనంబును గౌరవించి ముందు చేయవలసినకార్యమును గుఱించి యాలోచించి

ఉవాచ రామం స్వభిరామదర్శనం
ప్రదర్శయ న్దర్శన మాత్మన శ్శుభమ్. ౬౫
యథోక్త మేత త్తవ సర్వ మీప్సితం
నరేన్ద్ర! కర్తా నచిరా ద్ధరీశ్వరః,
శరత్ప్రతీక్షః క్షమతా మిమం భవా
న్జలప్రపాతం రిపునిగ్రహే ధృతః. ౬౬

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టావింశ స్సర్గః. ౨౮.

## ఏకోనత్రింశ స్సర్గః.

సమీక్ష్య విమలం వ్యోమ గతవిద్యుద్బలాహకమ్,
సారసారవసంఘుష్టం రమ్య జ్యోత్స్నానులేపనమ్. ౧
సమృద్ధార్థం చ సుగ్రీవం మన్దధర్మార్థసంగ్రహమ్,
అత్యర్థ మసతాం మార్గ మేకా న్తగతమానసమ్. ౨
నిర్వృత్త కార్యం సిద్ధార్థం ప్రమదాభిరతం సదా,
ప్రాప్తవన్త మభిప్రేతాం త్సర్వా నేవ మనోరథాన్. ౩
స్వాం చ పత్నీ మభిప్రేతాం తారాం చాపి సమీప్సితామ్,
విహర న్త మహోరాత్రం కృతార్థం విగతజ్వరమ్. ౪
క్రీడన్త మివ దేవేశం నన్దనేఽప్సరసాం గణైః,
మన్త్రిషు న్యస్తకార్యంచ మన్త్రిణా మనవేక్షకమ్. ౫
ఉత్సన్నరాజ్యసందేశం కామవృత్త మవస్థితమ్,
నిశ్చితార్థోఽర్థతత్త్వజ్ఞః కాలధర్మవిశేషవిత్. ౬
ప్రసాద్య వాక్యై ర్మధురై ర్హేతుమద్భి ర్మనోరమైః,
వాక్యవి ద్వాక్యతత్త్వజ్ఞం హరీశం మారుతాత్మజః. ౭

మంగళకరంబగు తన యభిప్రాయంబు దేటపడునట్లు ప్రియదర్శనుండగు రామునింజూచి యిట్లని పలికెను. ౬౫

మనుజనాథుండవగు రాముండా! వానరరాజు సుగ్రీవుండు చెప్పిన మాటను దప్పక నీకోర్కె యంతయు శీఘ్రంబుననె యీడేర్చును. గావున, నీవు శత్రువును జయించుటకై ధీరుండవై శరదృతువు వచ్చువఱకు ఈవర్షాకాలమంతు విరహవేదనను గొంత సహించి యుండుము. అని లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. ౬౬

ఇది ఇరువదియెనిమిదవసర్గము.

---

## ఇరువదితొమ్మిదవ సర్గము.

వాయుపుత్త్రుండగు హనుమంతుండు ఆకాశము మేఘములును మెఱుపులును నశించి స్వచ్ఛమయి సారసపక్షుల మనోహరధ్వనులతో నొప్పుచు చంద్రికాభిరామంబై యుండుటయు సమృద్ధార్థుండగు సుగ్రీవుండు సమస్తమనోరథంబులం బొంది ప్రియురాలగు తనభార్యను అభీష్టయగు తారను బడసినవాఁడై కృతార్థుండై నానావిధధనపరిపూర్ణుండై ధర్మసంగ్రహమునందు శ్రద్ధయుంచక కాముకులమార్గము నవలంబించి యున్ని కార్యంబులం బడిచి యెల్లప్పుడును స్త్రీలయందుఁ దగిలి రాజ్యభారంబంతయు మంత్రులపై నునిచి మంత్రులేమిచేసిరో యెంతమాత్రము విచారింపక రాజ్యమువిషయమయి చింతలేక నిశ్చయంబుగా నందనవనంబున దేవేంద్రుం డప్సరసలతోఁ గ్రీడించుడినట్లు ఎల్లప్పుడును గామవ్యాప్తుండై యహోరాత్రంబును ఏకరీతిని గామినీజనంబులతో విహరించుచుండుటయుం జూచి కర్తవ్యంబు దెలిసినవాఁడును కార్యస్వరూపంబు లెఱింగినవాఁడును ఏకాలమందు ఏధర్మము విడువరాదో ఆవిశేషములన్నియుఁ దెలిసినవాఁడును గావున అట్లు సుగ్రీవుండు రామకార్యంబు నుపేక్షించుటకు వగచి మాటలు చెప్పుటయందు సమర్థుండగుటం జేసి సుగ్రీవుని యొద్దకుఁబోయి మధురంబులును యుక్తియుక్తంబులును మనోవశీకరణం

హితం త త్త్వం చ పథ్యంచ సామధర్మార్థనీతిమత్,
ప్రణయ ప్రీతి సంయుక్తం విశ్వాసకృతనిశ్చయమ్. ౮
హరీశ్వర ముపాగమ్య హనూమా న్వాక్య మబ్రవీత్,

రాజ్యం ప్రాప్తం యశ శ్చైవ కౌలీ శ్రీ రభివర్ధితా. ౯
మిత్రాణాం సంగ్రహ శ్శేష స్తం భవా న్కర్తు మర్హతి,

యో హి మిత్రేషు కాలజ్ఞ స్సతతం సాధు వర్తతే. ౧౦
తస్య రాజ్యం చ కీర్తిశ్చ ప్రతాప శ్చాభివర్ధతే,

యస్య కోశశ్చ దణ్డశ్చ మిత్రా ణ్యాత్మాచ భూమిప!. ౧౧
సమవేతాని సర్వాణి స రాజ్యం మహ దశ్నుతే,
త ద్భవా న్వృత్తసంపన్నః స్థితః పథి నిరత్యయే. ౧౨
మిత్రార్థ మభినీతార్థం యథావ త్కర్తు మర్హతి,

సంత్యజ్య సర్వకర్మాణి మిత్రార్థే యోఽనువర్తతే. ౧౩
సంభ్రమా ద్ధి కృతోత్సాహ స్సోఽనర్థై ర్నావరుధ్యతే,

యస్తు కాలవ్యతీతేషు మిత్రకార్యేషు వర్తతే. ౧౪
స కృత్వా మహతోఽప్యర్థా న్నమిత్రార్థే న యుజ్యతే,

య దిదం వీర కార్యం నో మిత్రకార్య మరిన్దమ!. ౧౫
క్రియతాం రాఘవ స్యైత ద్వైదేహ్యాః పరిమార్గణమ్,

బులునగు మాటలచే నాతనిఁ బ్రసన్నుం గావించికొని తన్ను ఆప్తునిఁగా గ్రహించి తనమాటను దప్పక యంగీకరించునను నమ్మకంబున అతనికి హితకరంబును యథార్థంబును నీతియుక్తంబును సామయుతంబును ధర్మ్యంబునగు నీమాటం జెప్పెను. ౯

రాజ్యంబు బొందితివి. కీర్తిని సంపాదించినావు. కులక్రమాగతమయిన వానరరాజ్యలక్ష్మినినిష్కంటకముగాఁ జేసికొంటివి. ఇఁక మిత్రుల నాదరించి వారికార్యముల నెఱవేర్చుట మిగిలియున్నది. దానిని నీవు తప్పక చేయువలెను.

ఎవ్వఁడు కాలవిశేషంబుల గుర్తెఱిఁగి మిత్రులవిషయమయి వారి కాయాసము గలుగకుండునట్లు చక్కఁగాఁ బ్రవర్తించునో అతనిరాజ్యంబును గీర్తియుఁ బ్రతాపంబును వృద్ధిఁ బొందును. ౧౦

రాజా! ఎవ్వనికిఁ గోశంబును సైన్యంబును మిత్రులును ఈసాధనము లన్నియు తన్నువదలకుండునో అతఁడు మహారాజ్యంబున కధిపతియగును.

ఆకారణమువలన నీవు సదాచారసంపన్నుఁడవు, సన్మార్గప్రవృత్తుండవు కావున నీవు ప్రతిజ్ఞచేసియున్నచొప్పుననీమిత్రునియొక్క కార్యము చక్కగా నెఱవేర్పుము. ౧౨

ఎవ్వఁడు తనకార్యముల నన్నిఁటిని వదలి యుత్సాహసంపన్నుఁడై మిత్రులయందలి యాదరాతిశయంబునంజేసి మిత్రకార్యములనే చేయుచుండునో అట్లు అతఁడు స్వకార్యంబుల నుపేక్షించినను అతనికి అనర్థము వాటిలదు. ౧౩

ఎవఁడు మిత్రకార్యములను ఏకాలమునందు ఏదిచేయవలెనో ఆకాలమునం దదిచేయక కాలము నతిక్రమించిచేయునో అతఁడు ఎన్ని గొప్పకార్యములుచేసినను మిత్రుల ప్రయోజనములు ఈడేఱవు కావునఁ జేయనివాఁడే యగుచున్నాఁడు. ౧౪

శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి వీరుండవగు సుగ్రీవుఁడా! మనకిప్పుడు చేయవలసినదగు మిత్రకార్యమయిన రాముని కార్యము సీతామార్గణముఁ జేయుము. ౧౫

త దిదం వీర! కార్యం తే కాలాతీత మరిన్దమ!. ౧౮

న చ కాల మతీతం తే నివేదయతి కాలవిత్,
త్వరమాణోఽపి స న్ప్రాజ్ఞ స్తవ రాజ! వశానుగః. ౧౯

కులస్య హేతుః స్ఫీతస్య దీర్ఘబన్ధు శ్చ రాఘవః,
అప్రమేయప్రభావ శ్చ స్వయం చాప్రతిమో గుణైః. ౧౪

తస్య త్వం కురు వై కార్యం పూర్వం తేన కృతం తవ,
హరీశ్వర! హరిశ్రేష్ఠా నాజ్ఞాపయితు మర్హసి. ౧౯

న హి తావ ద్భవే త్కాలో వ్యతీత శ్చోదనా దృతే,
చోదితస్య హి కార్యస్య భవే త్కాలవ్యతిక్రమః. ౨౦

అకర్తు రపి కార్యస్య భవా న్కర్తా హరీశ్వర!,
కింపునః ప్రతికర్తు స్తే రాజ్యేన చ ధనేన చ. ౨౧

శక్తిమా నపి విక్రాన్తో వానరర్క్షగణేశ్వర!,
కర్తుం దాశరథేః ప్రీతి మాజ్ఞాయాం కి న్నసజ్జసే. ౨౨

కామం ఖలు శరై శ్శక్త స్సురాసురమహోరగాన్,
వశే దాశరథిః కర్తుం త్వత్ప్రతిజ్ఞాం తు కాఙ్క్షతే. ౨౩

వీరుఁడవు శత్రువుల వధించువాఁడవగు సుగ్రీవుఁడా! అట్టి నీవుచేయవలసిన సీతనువెదకుటయను మిత్రకార్యము ఇప్పుడు కాలాతీతమయినది.

రాజా! పండితుఁడగు రాముఁడు ప్రతిజ్ఞాకాలముఁ దెలిసినవాఁడైనను సీతావియోగంబునం జేసి తొందరపడుచున్నవాఁడైనను నీమనసునే యనుసరించిపోవునుగాని అతఁడై కాల మతిక్రమించినదని నీతోఁ జెప్పఁడు. ౧౭

రాముఁడు ఉత్తమమయిన వంశమును వృద్ధిఁబొందించువాఁడు. (ఉత్తమమయినవంశంబునం బుట్టినవాఁడుడు.) మనకు ఎప్పటికిని ఆప్తుఁడుగా నుండువాఁడు. మఱియుఁ గొలఁదిలేని ప్రభావము గలవాఁడు. నీవును గుణంబుల నసదృశుండవు. ౧౮

వానరనాథుఁడా! ఆరాముని కార్యమును నీవిపుడు తప్పకచేయవలయును. అతఁడు ముందు నీకార్యమును చేసినాఁడు. కావున వానరవీరులను సీతనువెదుక నాజ్ఞాపింపుము. ౧౯

రాముఁడు ప్రేరించుటకు మున్నే మనము కార్యము సేయఁ బ్రారంభించితిమేని మనకుఁ గాలాతిక్రమదోషమురాదు. అతఁడు ప్రేరించినపిమ్మటనైనచోఁ గాలాతిక్రమణము చేసినవారల మగుదుము. ౨౦

వానరరాజా! నీవు ఎంతమాత్ర ముపకారము చేయనివానికార్యమును గూడ చేయువాఁడవు. ఇఁక నీకు రాజ్యంబును ధనంబుల నొసఁగి మహోపకారము గావించిన రాముని కార్యమును చేయుదువని చెప్పనేల? ౨౧

వానరసమూహంబులకును భల్లూకసమూహంబులకును నాథుఁడా! నీవు రాముని కార్యమును నెఱవేర్చి యతనికిఁ బ్రీతిసేయుటకు సమర్థుఁడవు పరాక్రమవంతుఁడవైనను వానరసైన్యముల నాజ్ఞాపింపక యాలస్యము సేయుచున్నావేమి? ౨౨

రాముఁడు దేవతలనేమి యసురులనేమి మహోరగులనేమి బాణంబులచే స్వాధీనులంజేయ సమర్థుఁడు గదా! అయితే నీవుచేసిన ప్రతిజ్ఞను నీవు నెఱవేర్చుటను గుఱించి నిరీక్షించుచున్నాఁడు. ౨౩

ప్రాణత్యాగావిశఙ్కేన కృతం తేన తవ ప్రియమ్,
తస్య మార్గామ వైదేహీం పృథివ్యా మపి చామ్బరే. ౨౪

న దేవా న చ గన్ధర్వా నాసురా న మరుద్గణాః,
న చ యక్షా భయం తస్య కుర్యుః కిముత రాక్షసాః. ౨౫

త దేవం శక్తియుక్తస్య పూర్వం ప్రియకృత స్తవ,
రామ స్యార్హసి పిఙ్గేశ! కర్తుం సర్వాత్మనా ప్రియమ్. ౨౬

నాధస్తా దవనౌ నాప్సు గతి ర్నోపరి చామ్బరే,
కస్యచి త్సజ్జతేఽస్మాకం కపీశ్వర! త వాజ్ఞయా. ౨౭

త దాజ్ఞాపయ కః కిం తే కృతే కుత్ర వ్యవస్యతు,
హరయోఽప్యప్రధృష్యా స్తే సన్తి కోట్యగ్రతోఽనఘాః.

తస్య తద్వచనం శ్రుత్వా కాలే సాధు నివేదితమ్,
సుగ్రీవ స్సత్త్వసంపన్న శ్చకార మతి ముత్తమామ్. ౨౯

స సందిదేశాభిమతం నీలం నిత్యకృతోద్యమమ్,
దిక్షు సర్వాసు సర్వేషాం సైన్యానా ముపసంగ్రహే. ౩౦

యథా సేనా సమగ్రా మే యూథపాలాశ్చ సర్వశః,
సమాగచ్ఛ న్త్యసఙ్గేన సేనాగ్రాణి తథా కురు. ౩౧
యే త్వన్తపాలా ప్లవగా శ్శీఘ్రగా వ్యవసాయినః,

రాముఁడు తన ప్రాణంబులపైఁగూడ నాశయుంచక వాలిని వధించి నీకుఁ బ్రియంబు గావించినాఁడు అట్టి రాముని ప్రియురాలయిన సీతను భూమ్యాకాశంబులందంతయుఁ జూచి వెదకుదము. ౨౪

దేవతలుగాని గంధర్వులుగాని యసురులుగాని వాయువులుగాని యక్షులుగాని రామునకు భయముగల్గింపఁజాలరు. ఇఁక నీశత్రుభ్రాతృను లతనికెంతమాత్రము? ౨౫

వానరరాజా! ఆకారణమువలన అట్టియప్రమేయమయిన శక్తిగలవాఁడును ముందునీకుఁ బ్రియముగావించినవాఁడునగు రామునకు నీవు సర్వప్రయత్నములచేతను సంతోషంబు గావింపవలయును. ౨౬

వానరేశ్వరుఁడవగు సుగ్రీవుఁడా! నీయాజ్ఞయయినచో మాలోనొకాక వానరుఁడును పాతాళమునఁగాని భూమియందుఁగాని జలంబులందుఁగాని యూర్ధ్వముగా నాకాశంబునంగాని యెదురులేక సంచరింపఁగలఁడు. ౨౭

ఎట్టివారికిని ఎదిరింపనలవిగానివానరులు నీయందు భక్తిగలవారలు కోటికన్న నధికముగా నీవశమున నున్నారు. నీకుఁగా ఎవ్వఁడు ఏమిపనిచేయవలయునో దేనియందుఁ బ్రవర్తింపవలయునో ఆజ్ఞాపింపుము. అని హనుమంతుఁడు సుగ్రీవునకుఁ జెప్పెను. ౨౮

అట్లు హనుమంతుఁడు కాలము నెఱిఁగి చక్కఁగాఁ జెప్పిన హితవచనంబు విని బలవంతుండగుసుగ్రీవుఁడు ఉత్తమమయిన కార్యంబు సేయుటయందు బుద్ధినుంచెను. ౨౯

ఆసుగ్రీవుఁడు సమస్తదిక్కులనుండు సైన్యములనన్నింటిని రావించుటకు దనకభిమతుండును ఎల్లప్పుడు సేనావిషయకమయిన ప్రయత్నము సేయుచుండువాఁడునగు నీలు నాజ్ఞాపించెను. ౩౦

సేనానాయకుఁడా! నాసైన్యమంతయు యూథపాలురగు వానరవీరులందఱు ఇచటికి శీఘ్రంబున వచ్చిచేరునట్లు గావింపుము. ౩౧

శీఘ్రంబున నడచువారలును ఉత్సాహసంపన్నులునగు సేనాపర్యంత

సమానయన్తు తే సైన్యం త్వరితా శ్శాసనా న్మమ. 3౨

స్వయం చానన్తరం సైన్యం భవా నేవానుపశ్యతు,
త్రిపఞ్చరాత్రా దూర్ధ్వం యః ప్రాప్నుయా న్నేహ వానరః
తస్య ప్రాణాన్తికో దణ్డో నాత్ర కార్యా విచారణా,

హరీం శ్చ వృద్ధా నుపయాతు సాఙ్గదో
భవా న్మమాజ్ఞా మధికృత్య నిశ్చితామ్,
ఇతి వ్యవస్థాం హరిపుఙ్గవేశ్వరో
విధాయ వేశ్మ ప్రవివేశ వీర్యవాన్. 3౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డ ఏకోనత్రింశ స్సర్గః. ౨౯.

---

## త్రింశ స్సర్గః.

గుహాం ప్రవిష్టే సుగ్రీవే విముక్తే గగనే ఘనైః,
వర్షరాత్రోషితో రామః కామశోకాభిపీడితః. ౧

పాణ్డురం గగనం దృష్ట్వా విమలం చన్ద్రమణ్డలమ్,
శారదీం రజనీం చైవ దృష్ట్వా జ్యోత్స్నానులేపనామ్. ౨
కామవృత్తం చ సుగ్రీవం నష్టాం చ జనకాత్మజామ్,
బుద్ధ్వా కాల మతీతం చ ముమోహ పరమాతురః. 3
సతు సంజ్ఞా ముపాగమ్య ముహూర్తా న్మతిమా న్నృపః,
మనస్థా మపి వైదేహీం చిన్తయామాస రాఘవః. ౪
ఆసీనః పర్వత స్యాగ్రే హేమధాతువిభూషితే,
శారదం గగనం దృష్ట్వా జగామ మనసా ప్రియామ్. ౫

పాలకులయిన వానరవీరులు అచ్చటచ్చటనుండు సేనలను నాయాజ్ఞవలనశీఘ్రం బునం గొనివత్తురుగాక. 32

సమీపప్రదేశంబులనుండు సేనను నీవేచూచి రావింపుము.

ఏవానరుఁడు ఇదిమొదలు పదునైదురాత్రుల యనంతరము ఇచ్చటికి వచ్చి చేరకుండునో వానికి మరణదండనము విధింపఁబడును. ఈవిషయమయి సందేహములేదు. 33

నీవు నాతిరుగులేని యాజ్ఞ నవలంబించి యంగదునితోఁగూడ వానర వృద్ధులగు జాంబవంతుఁడు మొదలగు వారలయొద్దకుఁ బోయి నేను ఆజ్ఞాపించినవిధము వారలకుఁ దెలియఁజెప్పుము. అని ఇట్లువీర్యవంతుఁడగు సుగ్రీవుఁడు వ్యవస్థగావించి మరల నంతఃపురంబుఁ జొచ్చెను. 34

ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

## ముప్పదవసర్గము.

సుగ్రీవుఁడు కిష్కింధను బ్రవేశించినవెనుక రాముఁడు వర్ష ఋతువంతయుఁ గడపి శరదృతువు వచ్చి యాకాశంబు మేఘవిముక్తమయి నిర్మలంబగుటనుజూచి మన్మథబాధితుఁడై పరమదుఃఖమునొందెను. 1

రాముఁడు నిర్మలమయిన ఆకాశమును స్వచ్ఛమయిన చంద్రమండలంబును చంద్రికారమణీయంబయిన శరత్కాలరాత్రినింజూచి సీత నష్టయగుటయు సుగ్రీవుఁడు మన్మథక్రీడాపరవశుఁడై యుండుటయు సంకేత కాలము అతిక్రమించుటయుఁ దలఁపోసి పరమదుఃఖితుఁడై మూర్ఛనొందెను.

బుద్ధిమంతుఁడగు రాముఁడు అంతఁ గొంతసేపటికిఁ దెలివొంది సీత మనంబుననె యున్నదైనను ఆబిడంగుతించి యిట్లని చింతించెను. 4

రాముఁడు బంగారముచేతను గైరికధాతువులచేతను అలంకృతంబగు పర్వతశిఖరమునం గూర్చుండి శరదృతువునందు స్వచ్ఛమయిన యాకాశము నుజూచి మనంబునఁ బ్రియురాలం దలంచెను. 5

దృష్ట్వాచ విమలం వ్యోమ గతవిద్యుద్వలాహకమ్,
సారసారవసంఘుష్టం విలలాపాఽఽర్తయా గిరా. ౬

సారసారవసన్నాదై స్సారసారవనాదినీ,
యాఽఽశ్రమే రమతే బాలా సాఽద్య మే రమతేకథమ్. ౭

పుష్పితాం శ్చాసనా న్దృష్ట్వా కాఞ్చనానివ నిర్మలాన్,
కథం సా రమతే బాలా పశ్యన్తీ మా మపశ్యతీ. ౮

యా పురా కలహంసానాం స్వరేణ కలభాషిణీ,
బుధ్యతే చారుసర్వాఙ్గీ సాఽద్య మే బుధ్యతే కథమ్. ౯

నిస్వనం చక్రవాకానాం నిశమ్య సహచారిణామ్,
పుణ్డరీకవిశాలాక్షీ కథ మేషా భవిష్యతి. ౧౦

సరాంసి సరితో వాపీః కాననాని వనాని చ,
తాం వినా మృగశాబాక్షీం చర న్నాద్య సుఖం లభే. ౧౧

అపి తాం మద్వియోగాచ్చ సౌకుమార్యా చ్చ భామినీమ్,
సదూరం పీడయే త్కామ శ్శరద్గుణనిర న్తరః. ౧౨

ఏవమాది నరశ్రేష్ఠో విలలాప నృపాత్మజః,
విహఙ్గ ఇవ సారఙ్గ స్సలిలం త్రిదశేశ్వరాత్. ౧౩

రాముఁడు మేఘములును మెఱుపులును నశించి స్వచ్ఛమయి బెగ్గురుపక్షులధ్వనులచే రమణీయంబైయున్న యాకాశంబుఁజూచి యార్తస్వరంబున విలపించెను. ౭

మున్ను ఆశ్రమంబున మనోహరంబులగు సారసపక్షి ధ్వనులచే రమించుచుండిన సారసపక్షియుంబోలె మనోహరములయిన పలుకులుగల నాప్రియురాలు ఇప్పుడు ఎట్లు క్రీడించును? ౮

నాప్రియురాలు బంగారు పువ్వులవలెనున్న నిర్మలంబులగు పుష్పించిన వేగిసపుష్పంబులంజూచి నన్ను నాలుగుప్రక్కలం జూచియుఁ గానక యెట్లుసంతోషంబునొందును? ౯

మనోహరముగా మాటలాడునదియు రమణీయములయిన సమస్తావయవములును గలదియునగు నాప్రియురాలయినసీత మున్ను కలహంసలధ్వనికి నిద్రమేలుకొనునే ఇప్పుడెట్లు మేలుకొనునో. ౧౦

తెల్లదామరపూలంబోని విశాలసుందరంబులగు నయనంబులుగల నాప్రియురాలు సమీపంబుననున్న చక్రవాకంబుల మనోహరధ్వనులువిని నావిరహంబుసహించి యెట్లు జీవించియుండఁగలదు? ౧౧

ఇపుడు జింకపిల్లలకుంబోలె విశాలచంచలనయనంబులుగల యాసీత లేకుండుటంజేసి సరస్సులను నదులను నడబావులను గావనంబులను వనంబులను సంచరించుచున్నను నాకు సుఖంబు గలుగకున్నది. ౧౨

శరదృతువు వచ్చుటంజేసి పరిపూర్ణసాధనుండగు మన్మథుఁడు సీత నన్నుఁబాసియున్నదియు సుకుమారాంగియునియుఁ దయఁదలఁచి యాబిడను అధికముగా బాధింపకున్నయెడఁ జక్కఁగానుండును. అని రాముఁడు విలపించెను. ౧౩

చాతకపక్షి, జలమునకై దేవేంద్రునిగుఱించి విలపించునట్లు పురుషోత్తముండగు రాముఁడు ఇదిమొదలయినవిధంబున సీతానిమిత్తమై విలపించెను. ౧౪

తత శ్చఞ్చూర్యరమ్యేషు ఫలార్థీ గిరిసానుషు,
దదర్శ పర్యుపావృత్తో లక్ష్మీవా న్లక్ష్మణోఽగ్రజమ్. ౧౪
తం చిన్తయా దుస్సహయా పరీతం
విసంజ్ఞ మేకం విజనే మనస్వీ,
భ్రాతు ర్విషాదా త్పరితాపదీన
స్సమీక్ష్య సౌమిత్రి రువాచ రామమ్. ౧౫
కి మార్య కామస్య వశం గతేన
కి మాత్మపౌరుష్యపరాభవేన,
అయం సదా సంహ్రియతే సమాధిః
కి మత్ర యోగేన నివర్తితేన. ౧౬
క్రియాభియోగం మనసః ప్రసాదం
సమాధియోగానుగతం చ కాలమ్,
సహాయసామర్థ్య మదీనసత్త్వ!
స్వకర్మహేతుంచ కురుష్వ హేతుమ్. ౧౭
న జానకీ మానవవంశనాథ!
త్వయా సనాథా సులభా పరేణ,
న చాగ్నిచూడాం జ్వలితా ముపేత్య
న దహ్యతే వీరవరార్హ! కశ్చిత్. ౧౮
సలక్షణం లక్ష్మణ మప్రధృష్యం
స్వభావజం వాక్య మువాచ రామః,
హితం చ పథ్యం చ నయప్రసక్తం
ససామ ధర్మార్థసమాహితం చ. ౧౯
నిస్సంశయం కార్య మవేక్షణీయం
క్రియావిశేషో హ్యనువర్తితవ్యః,

అంత శ్రీమంతుండగు లక్ష్మణుఁడు ఫలములకైఁ బోయియుండి పర్వతసెత్తముల సందుగొందులం దిరిగితిరిగి మరలివచ్చి రారాముం గాంచెను. ౧౪

పరిశుద్ధంబగు హృదయముగల లక్ష్మణుఁడు అట్లు విజనప్రదేశంబున నేకాకిగా దుస్సహంబగు దుఃఖమునొంది దేహముదెలియక విలపించుచున్న రామునింజూచి అన్న దుఃఖించుటచేఁ దాను బరమదుఃఖితుఁడై యిట్లని పలికెను. ౧౫

పూజ్యుఁడా! ఇప్పుడు ఇట్లు మనస్సు కామములోఁ బడినను బౌరుషంబు వదలినను ఉత్సాహంబు విడిచినను మనోధైర్యము కలుగునా? ఎంతమాత్రము కలుగదు. ౧౬

మహాధైర్యుఁడవగురాముఁడా! కార్యోద్యోగమును నిర్మలమయిన మనస్సును ధైర్యంబును ఉపాయంబును దేశకాలంబులును సహాయులగు సుగ్రీవాదులసామర్థ్యమును దేవతాప్రార్థనాది కర్మమును సాధనములుగా వహించి కార్యమును సాధించుకొనుము. ౧౭

పరాక్రమవంతులలో నుత్తముఁడవు. మనుజనాథుఁడవగు రాముఁడా! నీవు నాథుఁడవై యుండునపుడు సీతను దక్కించుకొనుటకు మఱియొకని కెంతమాత్ర మలవిగాదు. ఎవ్వఁడేని యగ్నిజ్వాలను జేతంబట్టి దహింపఁబడక పోవునా? అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౮

అట్లు బదులుయుక్తిచెప్పుటకు అలవిగానిదియు స్వభావసిద్ధంబును ఉత్తరకాలంబునను దత్కాలంబునను సుఖకరంబును రాజనీతియుక్తంబును సాంత్వసమేతంబు ధర్మార్థయుక్తంబునగు మాటం జెప్పిన లక్ష్మణుంజూచి రాముం డిట్లని పలికెను. ౧౯

కుమారుఁడా! నీవు చెప్పినవిధంబున ఉద్దిష్టకార్యమును ముఖ్యముగాఁ జూడవలసినదే; అందుకు సాధనమయిన యుత్సాహాదుల నవలంబింపవలసి

న తు ప్రవృత్తస్య దురాసదస్య
కుమార! కార్యస్య ఫలం న చిన్త్యమ్. ౨౦

అథ పద్మపలాశాక్షీం మైథిలీ మనుచిన్తయన్,
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా. ౨౧

తర్పయిత్వా సహస్రాక్ష స్సలిలేన వసున్ధరామ్,
నిర్వ ర్తయిత్వా సస్యాని కృతకర్మా వ్యవస్థితః ౨౨
స్నిగ్ధగమ్భీరనిర్ఘోషా శ్శైలద్రుమపురోగమాః,
విసృజ్య సలిలం మేఘాః పరిశ్రాన్తా నృపాత్మజ!. ౨౩

నీలోత్పలదళ శ్యామా శ్శ్యామీకృత్వా దిశో దశ,
విమదా ఇవ మాతఙ్గా శ్శాన్తవేగాః పయోధరాః. ౨౪

జలగర్భా మహావేగాః కుటజార్జునగన్ధినః,
చరిత్వా విరతా స్సౌమ్య! వృష్టివాతా స్సముద్యతాః. ౨౫

ఘనానాం వారణానాం చ మయూరాణాంచ లక్ష్మణ!,
నాదః ప్రస్రవణానాంచ ప్రశాన్త స్సహసాఽనఘ!. ౨౬

అభివృష్టా మహామేఘై ర్నిర్మలా శ్చిత్రసానవః,
అనులిప్తా ఇవాఽభాన్తి గిరయ శ్చిత్రదీప్తిభిః. ౨౭

దర్శయన్తి శరన్నద్యః పులినాని శనై శ్శనైః,
నవసఙ్గమసవ్రీడా జఘనా నీవ యోషితః. ౨౮

నదే! ఇప్పుడు ప్రవృత్తంబగు సీతాన్వేషణరూపకార్యముయొక్క ఫలమయిన సీతాప్రాప్తిని గుఱించి యాలోచింప వలసినది యావశ్యకమే. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦

అంత రాముఁడు మరలఁ దామరపూఁ రేకులంబోలు విశాలసుందర నయనంబులుగల సీతం దలంచుకొని దుఃఖావేశంబునంజేసి యెండిన నోరు గలవాఁడై లక్ష్మణుంజూచి యిట్లనిపలికెను. ౨౧

దేవేంద్రుఁడు భూమికిఁ గావలసినంత వర్షముగురిసి పైరుల నన్నిటిని పండించి తానుజేయవలసిన కార్యము నెఱవేర్చి కృతకృత్యుఁడయ్యెను ౨౨

రాచకొమరుఁడవగు లక్ష్మణుఁడా! మేఘంబులు స్నిగ్ధంబును గంభీరంబునగు ధ్వనిగలిగి పర్వతవృక్షంబులమీఁద సంచరించుచు జలంబులువర్షించి శ్రమునొందినట్లు ఊరకున్నవి. ౨౩

నల్లగలువల రేకులంబోలె శ్యామలవర్ణంబులయినమేఘములు దశదిశలును శ్యామలవర్ణంబులగునట్లు అంతటను వ్యాపించి యిప్పుడు మదముడిగిన యేనుంగువలె శాంతములయినవి. ౨౪

సౌమ్యుఁడవగులక్ష్మణుఁడా! వర్షవాయువులు మిక్కిలియుఁ జల్లనివై కొండమల్లెలయొక్కయు అర్జున పుష్పంబులయొక్కయు సౌరభంబులచే మనోహరంబులై మహావేగంబుతో వీచివీచి యిప్పుడు నిలిచినవి. ౨౫

పాపరహితుఁడవయిన లక్ష్మణుఁడా! మేఘగర్జితంబులును గజబృంహితంబులును నెమిళ్లకేకలును సెలయేర్లుపడు ధ్వనులును ఇప్పుడు తటాలున నిలిచినవి. ౨౬

పర్వతంబులు మహావర్షంబులచే జక్కఁగాఁ గడగఁబడి నిర్మలంబులయి నానావర్ణములయిన నెత్తములు గలిగి గైరికధాతువులయొక్క నానావిధకాంతులవలనఁ గుంకుమాది సుగంధంబుఁ బూసికొన్నట్లున్నవి ౨౭

నూతనసంగమమందు యువతులు సిగ్గుచే మిక్కిలివిలంబమున జఘనముల వెలిపఱచునట్లు శరదృతువునందు నదులు మెల్లమెల్లగా నిసుకదిన్నెల బయలుపఱచుచున్నవి. ౨౮

శాఖాసు సప్తచ్ఛదపాదపానాం
ప్రభాసు తారార్కనిశాకరాణామ్,
లీలాసు చై వోత్తమవారణానాం
శ్రియం విభ జ్యాద్య శర త్ప్రవృత్తా. ౨౯
సంప్ర త్యనేకాశ్రయచిత్రశోభా
లక్ష్మీ శ్శరత్కాలగుణోపనీతా,
సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు
పద్మాకరే ష్వభ్యధికం విభాతి. ౩౦
సప్తచ్ఛదానాం కుసుమోపగన్ధీ
షట్పాదబృన్దై రనుగీయమానః,
మత్తద్విపానాం పవనోఽనుసారీ
దర్పం వనే ష్వభ్యధికం కరోతి. ౩౧
అభ్యాగతై శ్చారువిశాలపక్షై
స్స్మరప్రియైః పద్మరజోఽవకీర్ణైః,
మహానదీనాం పులినోపయాతైః
క్రీడ న్తి హంసా స్సహ చక్రవాకైః. ౩౨
మదప్రగల్భేషు చ వారణేషు
గవాం సమూహేషు చ దర్పితేషు,
ప్రసన్నతోయాసు చ నిమ్నగాసు
విభాతి లక్ష్మీ ర్బహుధా విభక్తా. ౩౩
నభ స్సమీక్ష్యామ్బుధరై ర్విముక్తం
విముక్తబర్హాభరణా వనేషు,
ప్రియా స్వసక్తా వినివృత్తశోభా
గతోత్సవా ధ్యానపరా మయూరాః. ౩౪

శరదృతువు తనసమృద్ధిని ఏడాకులఁటిచెట్ల శాఖలందును నక్షత్రములయొక్కయు సూర్యునియొక్కయుఁ జంద్రునియొక్కయు కాంతులందును మదపుటేనుంగుల విలాసములందును మూఁడస్థలములందును విభజించుకొని వ్యాపించినది. ౨౯

సూర్యోదయంబున వికసించిన తామరకొలఁకులందు నల్లనివి యెఱ్ఱనివి తెల్లనివి మొదలయిన నానావిధ కమలంబులు గలిగియుండుటం జేసి శరత్కాలలక్ష్మి నానావిధకాంతులతో మిక్కిలియుఁ బ్రకాశించుచున్నది ౩౦

వనంబులందు వాయువులు ఏడాకులఁటిపూల సుగంధంబుగలిగి తుమ్మెదల మనోహరనాదంబులతోఁ గూడినవై వీచుటచే మదపుటేనుఁగులకు మఱియు మద మధికమగుచున్నది. ౩౧

మిథునములగుటం జేసి యొండొంటి కెదురుమొగమయి సంగతములును సంతోషంబునం జేసి విదిర్చికొన్న సుందరంబులగు ఱెక్కలుగలవియు సరోనివాసప్రియంబులును తామరపూ పరాగంబుచేఁ గప్పఁబడినవియునగు చక్రవాకంబులును హంసలును గొప్పనదుల యిసుకదిన్నెలందు విహరించుచున్నవి. ౩౨

మదించిన యేనుంగులయందును గర్వితంబులగు ఆఁబోతులసమూహంబులందును స్వచ్ఛమయిన జలముగల నదులయందును శరత్కాలలక్ష్మి యనేక విధములుగా విభజింపఁబడి భాసిల్లుచున్నది. ౩౩

దర్శనీయంబులగు మేఘంబులు ఆకాశంబును వదలినవి! అడవులందు నెమిళ్లు పింఛములు విదిర్చుటను వదలి ప్రియురాండ్రతోఁ గూడక కాంతిహీనంబులయి సంతోషంబువీడి మధురంబుగాఁ గూయుటను విడిచి ధ్యానంబు సేయుచున్నట్లున్నవి. ౩౪

మనోజ్ఞగన్ధైః ప్రియకై రనల్పైః
పుష్పాతిభారావనతాగ్రశాఖైః,
సువర్ణగౌరై ర్నయనాభిరామై
రుద్యోతితా నీవ వనాన్తరాణి. ౩౫

ప్రియాన్వితానాం నళినీప్రియాణాం
వనే రతానాం కుసుమోద్ధతానామ్,
మదోత్కటానాం మదలాలసానాం
గజోత్తమానాం గతయోఽద్య మన్దాః ౩౬

వ్యభ్రం నభ శ్శస్త్రవిధౌతవర్ణం
కృశప్రవాహాని నదీజలాని,
కహ్లారశీతాః పవనాః ప్రవాన్తి
తమోవిముక్తా శ్చ దిశః ప్రకాశాః. ౩౭

సూర్యాతపక్రామణనష్టపఙ్కా
భూమి స్సముత్పాదితసాన్ద్రరేణుః,
అన్యోన్యవైరామర్షాయుతానా
ముద్యోగకాలోఽద్య నరాధిపానామ్. ౩౮

శరద్గుణాప్యాయితరూపశోభాః
ప్రహర్షితాః పాంసుసముక్షితాఙ్గాః,
మదోత్కటా స్సంప్రతి యుద్ధలుబ్ధా
వృషా గవాం మధ్యగతా నదన్తి. ౩౯

స మన్మథం తీవ్రగతానురాగాః
కులాన్వితా మన్దగతిం కరిణ్యః,
మదాన్వితం సంపరివార్య యాన్తం
వనేషు భర్తార మనుప్రయాన్తి. ౪౦

వేఁగిసచెట్లు మంచివాసనగలపుష్పంబులు నిండుగా నుండుటచే వంగి నకొనకొమ్మలుగలవై బంగారువన్నెగల పూలుగలవియుఁ గన్నులపండువుగా నుండుటవలన వనంబులందు దీపములుంచినట్లు ప్రకాశము గలిగియున్నది.

ఇపుడు గజశ్రేష్ఠములు ఏడాకులరఁటిపూల వాసనకు మదమురేఁగి మదజలము గండస్థలముల భేదించి స్రవింప మదముచే మఱియు విషయాసక్తంబులయి ప్రియురాండ్రంగూడి తామరకొలంకులందును వనంబులందును విహరింప నాసక్తంబులయి మెల్లగా నడచుచున్నవి. ౩౬

ఆకాశము మేఘములులేక చక్కఁగాఁ దోమిన యాయుధమువలె స్వచ్ఛముగా నున్నది. నదీప్రవాహములు తగ్గినవి వాయువులు ఎఱ్ఱగలువల మీఁదుగా వచ్చుటచేఁ జల్లగా వీచుచున్నవి. దిక్కులు మేఘావరణము పోవుటచేఁ బ్రకాశము గలిగియున్నవి. ౩౭

భూమి యెండగాయుటచే బురదయెండి దట్టముగా దుమ్ము రేఁగియున్నది. ఒకరిమీఁద నొకరికి విరోధమును అసూయయు నధికముగాఁగలరాజులు ఒకరిమీఁదనొకరు ఎత్తిపోవుట కిది యుత్తమయినసమయము. ౩౮

ఇపుడు ఆఁబోతులు శరదృతువువచ్చుటచే శరీరపుష్టియుఁ గాంతియు వృద్ధినొందుటంజేసి మదించినవై మేనంతయు దుమ్ముచేసికొని యొండొంటితోఁ బోరఁ గాలు ద్రవ్వుచు ఆవుమందల మధ్యంబున సంతుష్టములయి గర్జించుచున్నవి. ౩౯

వనములందు ఆఁడేనుఁగులు పెనిమిటియందు గాఢానురాగముగలవై తమసమూహముతోఁగూడినవై మన్మథవేగంబుతోఁ గూడినదియు మదించి మందగమనంబున నడచుచున్నదియునగు పెనిమిటియయిన మగయేనుఁగును బరివేష్టించి పోవుచున్నవి. ౪౦

త్యక్త్వా వరా ణ్యాత్మవిభూషణాని
బర్హాణి తీరోపగతా నదీనామ్,
నిర్భర్త్స్యమానా ఇవ సారసౌఘైః
ప్రయాన్తి దీనా విమదా మయూరాః. ౪౧

విత్రాస్య కారణ్డవచక్రవాకా
న్మహారవై ర్భిన్నకటా గజేన్ద్రాః,
సరస్సు బద్ధామ్బుజభూషణేషు
విక్షోభ్య విక్షోభ్య జలం పిబన్తి. ౪౨
వ్యపేతపఙ్కాసు సవాలుకాసు
ప్రసన్నతోయాసు సగోకులాసు,
ససారసారావవినాదితాసు
నదీషు హృష్టా నిపతన్తి హంసాః. ౪౩
నదీఘనప్రస్రవణోదకానా
మతిప్రవృద్ధానిలబర్హిణానామ్,
ప్లవఙ్గమానాం చ గతోత్సవానాం
ద్రుతం రవా స్సంప్రతి సంప్రణష్టాః. ౪౪
అనేకవర్ణా స్సువినష్టకాయా
నవోదితే ష్వమ్బుధరేషు నష్టాః,
క్షుధార్దితా ఘోరవిషా బిలేభ్య
శ్చిరోషితా విప్రసరన్తి సర్పాః. ౪౫
చఞ్చచ్చన్ద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా,
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మమ్బరమ్. ౪౬

(పూర్వము ధనికులుగానుండి వెనుకఁ గాలవిపర్యాసముచేత దరిద్రుల యినవారలు నూతనధనికులు చేయు నవమానమునకు ఏమియుఁ జేయఁజాలక దీనులగునట్లు) నెమిళ్లు తమయుత్తమాభరణంబులగు పింఛంబులులేక నదీతీరంబులకుఁ బోఁగా శరత్కాలగర్వితంబులగు హంసలు వానిఁ బెదరించినట్లు కూయుటయు ఆనెమిళ్లు గర్వంబుడిగి దీనములయి పోవుచున్నవి. ౪౧

మదించి గండస్థలంబులను భేదించి స్రవించుచున్న మదజలముగలయుత్తమగజంబులు కన్నెలేళ్లను జక్రవాకంబులను భయమునొందునట్లు పెద్ద అంకెలువేసి వికసించిన కమలములచే నలంకృతంబులగు కొలంకులను గలియఁబెట్టి కలియఁబెట్టి జలము ద్రావుచున్నవి. ౪౨

బురదలులేక స్వచ్ఛమయిన జలముగల్గి యిసుకదిన్నెలతో నొప్పుచున్నవియు, తీరములందు ఆవులమందలతోఁ గూడినవియు మధురంబుగాఁ గూయుచున్న సారసపక్షులచే రమణీయంబులునగు నదులందు హంసలు చేరుచున్నవి. ౪౩

ఇప్పుడు నదీప్రవాహధ్వనులును సెలయేర్ల జలంబులు పడు శబ్దములును పెనుగాడ్పుల ధ్వనియును మయూరంబుల కేకలును సంతోషహీనంబులయిన కప్పలస్వరంబులును శీఘ్రంబున నిలిచినవి. ౪౪

అనేకవిధవర్ణంబులును వర్షాకాలంబంతయు బయలం దిరుగక బిలంబులం డాఁగి యాహారంబు లేకుండుటం జేసి మిక్కిలియుఁ గృశించినవియు భయంకరమయిన విషముగలవియునగు సర్పములు బిలంబులనుండి వెడలివచ్చుచున్నవి. ౪౫

చంద్రకిరణంబుల ప్రకాశముతో నక్షత్రములు నిర్మలముగా నుదయించుటయు నాకాశమునందు సంధ్యారాగము క్రమముగా తగ్గుచున్నది. (కరశబ్దము కిరణమునకును హస్తమునకును, తారకాశబ్దము నక్షత్రమునకును కంటిగ్రుడ్డునకును, రాగశబ్దము ఎఱ్ఱఁదనమునకు ననురాగమునకును, అంబర

రాత్రి శ్శశాఙ్కోదితసౌమ్యవక్త్రా
తారాగణోన్మీలితచారునేత్రా,
జ్యోత్స్నాంశుకప్రావరణావిభాతి
నారీవ శుక్లాంశుకసంవృతాఙ్గీ. ౪౭
విపక్వశాలిప్రసవాని భుక్త్వా
ప్రహృష్టా సారసచారుపఙ్క్తిః,
నభ స్సమాక్రామతి శీఘ్రవేగా
వాతావధూతా గ్రథితేవ మాలా. ౪౮
సుప్తైకహంసం కుముదై రుపేతం
మహాహ్రదస్థం సలిలం విభాతి,
ఘనై ర్విముక్తం నిశి పూర్ణచన్ద్రం
తారాగణాకీర్ణ మి వా న్తరిక్షమ్. ౪౯
ప్రకీర్ణహంసాకులమేఖలానాం
ప్రబుద్ధపద్మోత్పలమాలినీనామ్,
వాప్యు త్తమానా మధికాఽద్య లక్ష్మీ
ర్వరాఙ్గనానా మివ భూషితానామ్. ౫౦
వేణుస్వనవ్యఞ్జితతూర్యమిశ్రః
ప్రత్యూషకాలానిలసమ్ప్రవృద్ధః,
సమ్మూర్ఛితో గర్గరగోవృషాణా
మన్యోన్య మాపూరయ తీవ శబ్దః. ౫౧

శబ్దము ఆకాశమునకును వస్త్రమునకును వాచకమగుటవలన కాముకియగు వనిత ప్రియుని హస్తస్పర్శంబుచే సంతోషంబున వికసించిన కంటిగ్రుడ్డుగలిగి అధికానురాగంబుతోఁ గామాతురయయి సుపతార్థము తానే వస్త్రమువదలుట ప్రతీతమగుచున్నది.) ౪౬

రాత్రి ఉదయించిన చంద్రబింబమే ముఖముగా నక్షత్రములె తెఱవఁబడిన కన్నులుగా వెన్నెల యుత్తరీయముగాఁ గలిగియుండుటవలనఁ దెల్లనివస్త్రము గప్పుకొన్న కాంతవలె నొప్పుచున్నది. ౪౭

హంసపక్షులు చక్కఁగాఁ బండిన శాలిధాన్యమును దిని సంతుష్టములయి జాలుగట్టి పుష్పమాల గాలికెగిరి యాకాశంబునొందునట్లు ఆకాశమున కెగురుచున్నవి. ౪౮

నిర్మలమయి విదురించిన యొకహంసగలిగి పెక్కు తెల్లగలువలతోఁ గూడినదైన విశాలతటాకము నందలిజలము రాత్రియందు మేఘములు లేకుండుటవలన నిర్మలమయి పూర్ణచంద్రునితోఁ గూడినదై నక్షత్రములతో నొప్పుచున్న యాకాశమువలెఁ బ్రకాశించుచున్నది. ౪౯

ఇపుడు అచటచట వ్రాలియున్న హంసలు మొలనూలుగా వికసితములగు కమలంబులు గలువలును బుష్పమాలికలుగాఁగల శ్రేష్ఠంబులగు కోనేళ్లు భూషణములచేతను బుష్పమాలికలచేతను అలంకరింపఁబడిన యుత్తమవనితలుంబోలె నెంతయుఁ బ్రకాశించుచున్నవి. ౫౦

ప్రాతఃకాలమునందు గోపికలు పెరుఁగుచిలుకునట్టిధ్వనియు ఆవులు దూడలకై యఱచునట్టిధ్వనియు ఆఁబోతులు కామాతురంబులయి యఱచునట్టిధ్వనియు గోపాలురూఁదునట్టి పిల్లంగ్రోవుల మధురస్వనంబులతోఁ గూడినవై ప్రాతఃకాలవాయువుచే నధికమయి యంతట వ్యాపించినదై యొకటితో నొకటి కలసి వృద్ధిఁబొందుచున్నవి. ౫౧

నవై ర్నదీనాం కుసుమప్రభాసై
ర్వ్యాధూయమానై ర్మృదుమారుతేన,
ధౌతామలక్షౌమపటప్రకాశై
కూలాని కాశై రుపశోభితాని. ౹౹౨

వనప్రచణ్డా మధుపానశౌణ్డాః
ప్రియాన్వితా షట్చరణాః ప్రహృష్టాః,
వనేషు మత్తాః పవనానుయాత్రాం
కుర్వన్తి పద్మాసనరేణుగౌరాః. ౹౹౩

జలం ప్రసన్నం కుముదం ప్రభాసం
క్రౌఞ్చస్వన శ్శాలివనం విపక్వమ్,
మృదు శ్చ వాయు ర్విమల శ్చ చన్ద్ర
శ్శంసన్తి వర్షవ్యపనీతకాలమ్. ౹౹౪

మీనోపసందర్శితమేఖలానాం
నదీవధూనాం గతయోఽద్య మన్దాః,
కాన్తోపభుక్తాలసగామినీనాం
ప్రభాతకాలే ష్వివ కామినీనామ్. ౹౹౫

సచక్రవాకాని సశైవలాని
కాశై ర్దుకూలై రివ సంవృతాని,
సపత్త్రలేఖాని సరోచనాని
వధూముఖా నీవ నదీముఖాని. ౹౹౬

ప్రఫుల్లబాణాసనచిత్రితేషు
ప్రహృష్టషట్పాదనికూజితేషు,
గృహీతచాపోద్యతచణ్డదణ్డాః

నదీతీరములు నూతనములును తెల్లనిపూలతో నొప్పుచున్నవియు మందమారుతమునకుఁ గదలుచున్నవియు స్వచ్ఛమయిన తెల్లనిపట్టుచీరతో సమానములునగు రెల్లుచే సంవృతంబులై తెల్లపట్టుచీరగట్టిన వనితలజఘనంబుల వలెఁ బ్రకాశించుచున్నవి. ౫౨

వనంబుల నెదురులేక దిరుగుచుఁ దేనియ ద్రావి త్రావి మత్తిలి ప్రియాసహితంబులయి సంతుష్టంబులయి కమలములయొక్కయు వేఁగిస పూలయొక్కయుఁ బరాగంబులు తగులుటచేత గౌరవర్ణంబులయిన తుమ్మెదలు గాలియందలి సుగంధమునకై గాలిని వెంబడించి పోవుచున్నవి. ౫౩

నిర్మలంబగు జలంబును వికసితంబులగు తెల్లకలువలును క్రౌంచపక్షులు మధురముగాఁ గూయుటయు వరిపైరు పండి తూఁగుటయు మందమారుతంబును స్వచ్ఛమయిన చంద్రబింబమును వర్షాకాలము కడచినదనియు నిది శరత్కాలమనియుఁ దెలుపుచున్నవి. ౫౪

ఇపుడు మీనములు మేఖలలుగాఁగలనదులు రాత్రియంతయుఁ బ్రియులతో నుపభోగించి యలసియున్న కామినులు ప్రాతఃకాలంబుల మెల్లగా నడుచునట్లు మెల్లగాఁ బాఱుచున్నవి. ౫౫

చక్రవాకపక్షులతోను బాచితోనుం గూడినవియు రెల్లుతోఁ గప్పఁబడినవియునగు నదులరేవులు గోరోచనముతోఁ గూడి మకరపత్త్రాలంకృతంబులయి దుకూలంబుచేఁ గప్పఁబడిన వనితాముఖంబులుం బోలెఁ బ్రకాశించుచున్నవి. ౫౬

ఇపుడు వికసితంబులగు నల్లగోరంటపూలచేతను వేఁగిసపూలచేతను రమణీయములయి మదించిన తుమ్మెదల మధురఝుంకారములతో నొప్పుచున్న వనంబులందు మన్మథుఁడు ధనుస్సును భయంకరంబులగు బాణంబులును బాల్చి విరహులకు భయంకరుండై విహరించుచున్నాఁడు. ౫౭

లోకం సువృష్ట్యా పరితోషయిత్వా
నదీ స్తటాకానిచ పూరయిత్వా,
నిష్పన్నసస్యాం వసుధాం చ కృత్వా
త్యక్త్వా నభ స్తోయధరాః ప్రణష్టాః. ౫౮
ప్రసన్నసలిలా స్సౌమ్య! కురరీభి ర్వినాదితాః,
చక్రవాకగణాకీర్ణా విభాన్తి సలిలాశయాః. ౫౯

అసనా స్సప్తపర్ణా శ్చ కోవిదారా శ్చ పుష్పితాః,
దృశ్యన్తే బన్ధుజీవా శ్చ శ్యామా శ్చ గిరిసానుషు. ౬౦
హంససారసచక్రాహ్వైః కురరై శ్చ సమన్తతః,
పులినా న్యవకీర్ణాని నదీనాం పశ్య లక్ష్మణ!. ౬౧
అన్యోన్యబద్ధవైరాణాం జిగీషూణాం నృపాత్మజ!,
ఉద్యోగసమయ స్సౌమ్య! పార్థివానా ముపస్థితః. ౬౨

ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ!,
నచ పశ్యామి సుగ్రీవ ముద్యోగం వా తథావిధమ్. ౬౩

చత్వారో వార్షికా మాసా గతా వర్షశతోపమాః,
మమ శోకాభిభూతస్య సౌమ్య సీతా మపశ్యతః. ౬౪
చక్రవాకీవ భర్తారం పృష్ఠతోఽనుగతా వనమ్,
విషమం దణ్డకారణ్య ముద్యాన మివ యాఽఽగతా. ౬౫

ప్రియావిహీనే దుఃఖార్తే హృతరాజ్యే వివాసితే,
కృపాం న కురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ. ౬౬

మేఘములు జనులు సంతోషించునట్లు చక్కఁగా వర్షముగురిసి నదులను దటాకములను నిండించి భూమియందుఁ బైరులను బండించి యాకాశమును వదలిపోయినవి. ౫౮

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! సరస్సులు నిర్మలంబగు జలముగలిగి మధురముగా ధ్వనించు క్రౌంచపక్షులతోను జక్రవాకసమూహంబులతోను గూడినవై ప్రకాశించుచున్నవి. ౫౯

పర్వతసానువులందు వేఁగిసచెట్లును ఏడాకులరఁటులును కాంచనములును మంకెనలును బ్రేంకణములును జక్కఁగాఁ బుష్పించియున్నవి. ౬౦

లక్ష్మణుఁడా! నదుల యిసుకదిన్నెలందు హంసలును సారసంబులును జక్రవాకంబులును గ్రౌంచంబులును విహరించుచున్నవి చూడుము. ౬౧

సౌమ్యుఁడవు రాజపుత్త్రుఁడవగులక్ష్మణుఁడా! ఒండొరులపై వైరంబు వహించి యొకరినొకరి జయింపఁదలంచియుండు రాజులు యుద్ధప్రయత్నము సేయు సమయమువచ్చినది. ౬౨

రాచశేఖరుఁడా! రాజులు యుద్ధమునకై మొదటిప్రయాణము సేయుసమయమిది. సుగ్రీవుఁడును అగపడలేదు. అట్టిప్రయత్నముగాని చేసినట్లు కానరాదు. ౬౩

సౌమ్యుఁడా! సీతంజూడక పరితపించుచుఁ బరమదుఃఖితుండనగు నాకు నూఱేండ్లు గడచినట్లు వార్షికమాసములు నాలుగును ఎట్లో గడచినవి. ౬౪

ఆసీత ఆఁడుచక్రవాకము మగచక్రవాకమును విడువక వెంబడించునట్లు పెనిమిటివెంట నడవికివచ్చినది. అందును ఉద్యానవనంబునకుఁ బోవు విధంబున ఎంతమాత్రము దుఃఖములేక సంతోషముతో బహుకష్టమయిన యీదండకారణ్యమునకు వచ్చినది. ౬౫

లక్ష్మణుఁడా! రాజ్యభ్రష్టుఁడనై యింటనుండి తఱుమఁగొట్టఁబడి ప్రియురాలంబాసి పరమదుఃఖితుఁడనై యున్న నాయందు రాజయినసుగ్రీవునకు దయరాకున్నది. ౬౬

అనాథో హృతరాజ్యోఽయం రావణేనచ ధర్షితః,
దీనో దూరగృహః కామీ మాం చైవ శరణంగతః. ౬౭
ఇత్యేతైః కారణై స్సౌమ్య! సుగ్రీవస్య దురాత్మనః,
అహం వానరరాజస్య పరిభూతః పరన్తప!. ౬౮

స కాలం పరిసంఖ్యాయ సీతాయాః పరిమార్గణే,
కృతార్థ స్సమయం కృత్వా దుర్మతి ర్నావబుధ్యతే. ౬౯

త్వం ప్రవిశ్య చ కిష్కిన్ధాం బ్రూహి వానరపుఙ్గవమ్,
మూర్ఖం గ్రామ్యసుఖే సక్తం సుగ్రీవం వచనా న్మమ. ౭౦

అర్థినా ముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్,
ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాధమః. ౭౧

శుభం వా యది వా పాపం యో హి వాక్య ముదీరితమ్,
సత్యేన ప్రతిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః. ౭౨
కృతార్థా హ్యకృతార్థానాం మిత్త్రాణాం న భవన్తి యే,
తా న్మృతా నపి క్రవ్యాదాః కృతఘ్నా న్నోపభుఞ్జతే. ౭౩

నూనం కాఞ్చనపృష్ఠస్య వికృష్టస్య మయా రణే,
ద్రష్టు మిచ్ఛతి చాపస్య రూపం విద్యుద్గణోపమమ్. ౭౪

సౌమ్యుఁడవు శత్రువులఁ దపింపఁజేయువాఁడవగు లక్ష్మణుఁడా! ఈరాముఁడు దిక్కులేనివాఁడు, రాజ్యభ్రష్టుఁడు, దూరంబుననుండి యిల్లువిడిచి వచ్చినవాఁడు, కాముకుఁడు,రావణుఁడు భార్యనపహరింపఁగా దీనుఁడై నన్ను శరణుచొచ్చియున్నాఁడు అను నభిప్రాయంబున నలక్ష్యబుద్ధిచేత దురాత్ముం డగు వానరరాజు సుగ్రీవుఁడు నన్ను ఆదరింపక యవమానించు చున్నాఁడు.

సుగ్రీవుఁడు శరత్కాలము రాఁగానే సీతను వెదక నారంభింపవలె నని సంకేతించుకొని యట్లు ప్రతిజ్ఞగావించి దురాత్ముండుగావున "నాకార్య మయ్యె నిఁక నేమి?" యని యుపేక్షించుచున్నాఁడు. ౧౯

నీవు కిష్కింధకుఁబోయి మూర్ఖుఁడును గ్రామ్యంబగు మన్మథసుఖం బునం దగిలియున్నవాఁడునగు వానరరాజును సుగ్రీవుంజూచి నేను జెప్పినట్లుగా నిట్లనిచెప్పుము. ౨౦

ఎవ్వఁడు తనకు మున్ను ఉపకారముచేసినవారలును యోగ్యులునగు కార్యార్థులకు "కార్యంబు గావించెద" నని ప్రతిజ్ఞచేసి యాశగలిగించి వెనుక దప్పుచున్నాఁడో అతఁడు లోకంబునకంతయుఁ బురుషాధముఁడు.

ఎవ్వఁడు మంచిగాని చెడుగాని తానుచెప్పినమాటను దప్పక సత్యముగాఁ గావించునో, అట్టివీరుఁడు పురుషోత్తముఁ డనఁబడును ౨౨

ఎవరు తాముస్నేహితులవలన నుపకారమునొంది తమకార్యమును గావించుకొని యాస్నేహితులు కృతార్థులుగాక దుఃఖితులయి యుండునపుడు వారలకుఁ బ్రత్యుపకారము గావింపరో అట్టికృతఘ్నులగు వారలు బ్రతికి యుండునపుడు వారల నెవ్వరును సత్పురుషులు చూడనైనను జూడరుసరేగదా వారు మృతిఁబొందినవెనుకఁగూడ వారికళేబరములను మాంసముదిను జంతువులును భక్షింపవు. అని సుగ్రీవునితోఁ జెప్పుము. ౨౩

ఆసుగ్రీవుఁడు యుద్ధంబున నేను బంగారముతో నలంకరింపఁబడిన వెనుకటిభాగముగల మహాధనస్సు నాకర్షింప మెఱుపులసమూహమువలె మెఱయుచున్నదానియొక్క భయంకరమయినయాకారమును జూడఁగోరుచున్నాఁడు కాఁబోలు. ఇది నిశ్చయము. ౨౪

ఘోరం జ్యాతలనిర్ఘోషం క్రుద్ధస్య మమ సంయుగే,
నిర్ఘోష మివ వజ్రస్య పున స్సంశ్రోతు మిచ్ఛతి. ౨౫

కామ మేవం గతే ప్యస్య పరిజ్ఞాతే పరాక్రమే,
త్వత్సహాయస్య మే వీర! న చిన్తా స్యా న్నృపాత్మజ!. ౨౬

యదర్థ మయ మారమ్భః కృతః పరపురఞ్జయ!,
సమయం నాభిజానాతి కృతార్థః ప్లవగేశ్వరః. ౨౭

వర్షాసమయకాలం తు ప్రతిజ్ఞాయ హరీశ్వరః,
వ్యతీతాం శ్చతురో మాసా న్విహర న్నావబుధ్యతే. ౨౮

సామాత్యపరిష త్క్రీడ న్పాన మే వోపసేవతే,
శోకదీనేషు నాస్మాసు సుగ్రీవః కురుతే దయామ్. ౨౯

ఉచ్యతాం గచ్ఛ సుగ్రీవ స్త్వయా వత్స! మహాబల!,
మమ రోషస్య య ద్రూపం బ్రూయా శ్చైన మిదం వచః. ౩౦
న చ సంకుచితః పన్థా యేన వాలీ హతో గతః,
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపథ మన్వగాః. ౩౧

ఏక ఏవ రణే వాలీ శరేణ నిహతో మయా,
త్వాం తు సత్యా దతిక్రాన్తం హనిష్యామి సబాన్ధవమ్. ౩౨

త దేవం విహితే కార్యే య ద్ధితం పురుషర్షభ!,

ఆసుగ్రీవుఁడు యుద్ధంబున నేసుగోపింపఁగా వజ్రాయుధధ్వనివలె భయంకరమయిన నాజ్యాతలధ్వనిని మఱియొకమాఱు వినఁగోరుచున్నాఁడు కాఁబోలు. ౨౫

వీరుఁడవగు రాచకొమరుఁడా! సాలవృక్షముల భేదించుటవలనను వాలివధమువలనను నాపరాక్రమము చక్కఁగాఁ దెలిసియుండియు నీవు సహాయుఁడవుగా నుండుటనెఱింగియు ఈసుగ్రీవునకు ఇట్లుకాలము మించినను మనస్సులోఁ జింతగలుగకున్నదే! ౨౬

శత్రుపట్టణంబుల జయించునట్టి లక్ష్మణుఁడా! సఖ్యంబును వాలివధంబును దేనికొఱకుఁ జేయఁబడినవో ఇప్పుడు సుగ్రీవుఁడు తనకార్యమయిన పిమ్మట దాని మఱచియున్నాఁడు. ౨౭

వానరరాజుసుగ్రీవుఁడు వర్షాకాలము కడచినంతనె వచ్చెదనని ప్రతిజ్ఞగావించి స్త్రీలోలుఁడై విహరించుచు నాలుగు మాసంబులు నతిక్రమించినను దెలియకున్నాఁడు. ౨౮

సుగ్రీవుఁడు మంత్రులచేతను బంధువులచేతను బరివృతుండై యెల్లప్పుడును మద్యపానలోలుఁడై యున్నాఁడుగాని దుఃఖితులమయి దీనులమయియున్న మనయందు దయయుంచకున్నాఁడు. ౨౯

మహాబలుఁడా! నీవుపోయి సుగ్రీవునకు నాకోపముయొక్క విధమును దెలియఁజెప్పి యీమాటనుగూడ నతనికిఁ జెప్పుము. ౩౦

సుగ్రీవుఁడా! వాలి హతుఁడై యేమార్గమునం బోయినాఁడో అది యిప్పుడు నశించిపోలేదు అది నీకును ఉన్నది. కాబట్టి ప్రతిజ్ఞను నెఱవేర్పుము. వాలియట్లు వధమునొందకుము. ౩౧

మున్ను యుద్ధంబున బాణముచే వాలి నొక్కనిమాత్రము వధించినాను. చేసినప్రతిజ్ఞను దప్పిన నిన్ను బంధువులతోఁగూడ వధించివచ్చెదను. అని సుగ్రీవునితోఁ జెప్పుము. ౩౨

పురుషోత్తముఁడవగు లక్ష్మణుఁడా! కార్యముయొక్క స్థితి యిట్లు

తత్తద్బ్రవీహి నరశ్రేష్ఠ! త్వర కాలవ్యతిక్రమః. ౮౩

కురుష్వ సత్యం మయి వానరేశ్వర!
ప్రతిశ్రుతం ధర్మ మవేక్ష్య శాశ్వతమ్,
మా వాలినం ప్రేత్య గతో యమక్షయం
త్వ మద్య పశ్యే ర్మమ చోదితై శ్శరైః. ౮౪

స పూర్వజం తీవ్రవివృద్ధకోపం
లాలప్యమానం ప్రసమీక్ష్య దీనమ్,
చకార తీవ్రాం మతి ముగ్రతేజా
హరీశ్వరే మానవవంశనాథః. ౮౫

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రింశ స్సర్గః. 30.

## ఏకత్రింశ స్సర్గః.

స కామినం దీన మదీనసత్త్వం
శోకాభిపన్నం సముదీర్ణకోపమ్,
నరేన్ద్రసూను ర్నరదేవపుత్రం
రామానుజః పూర్వజ మిత్యువాచ. ౧
న వానరః స్థాస్యతి సాధువృత్తే
న మంస్యతే కర్మఫలానుషఙ్గాన్,
న భోక్ష్యతే వానరరాజ్యలక్ష్మీం
తథాహి నాభిక్రమతేఽస్య బుద్ధిః. ౨

మతిక్షయా ద్గ్రామ్యసుఖేషు సక్త

న్నది. కావున ఇప్పుడు ఏయేమాట చెప్పఁదగునో ఆయామాటలం జెప్పుము. కాల మతిక్రమించుచున్నది శీఘ్రముగాఁ బొమ్ము. ౮౩

వానరరాజవగు సుగ్రీవుఁడా! నీవు నాకుఁ గావించెదనని ప్రతిజ్ఞ చేసినకార్యమును శాశ్వతంబగు ధర్మము నవలంబించి సత్యముగా నెఱవేర్పుము. అట్లుచేయవేని కుపితుండనగు నాబాణంబుల హతుండవై యమలోకంబునొంది యచట వాలిం జూడఁగలవు అని సుగ్రీవునితోఁ జెప్పుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౮౪

అట్లు అన్నయగు రాముండు పరమకుపితుండును పరమదుఃఖితుండునై విలపించుచుండుటనుజూచి భయంకరపరాక్రముఁడగు మనుష్యనాథుండైన లక్ష్మణుఁడు వానరరాజయిన సుగ్రీవుని విషయమయి మహాక్రోధంబు వహించెను. ౮౫

ఇది ముప్పదవసర్గము.

---

## ముప్పదియొకటవసర్గము.

దశరథమహారాజపుత్త్రుఁడును రామునితమ్ముఁడునగు లక్ష్మణుండు, కామబాధితుం డగుటవలన దీనుఁడై దుఃఖితుఁడై సుగ్రీవుఁడు ప్రతివదప్పుటకుఁ బరమకుపితుండైయున్న మహాబలుండును మహారాజకుమారుండునగు అన్నను రాముంజూచి యిట్లనిపలికెను. ౧

సుగ్రీవుఁడు తనకుపకారముచేసినవారికిఁ బ్రత్యుపకారము గావించెదనని చేసిన ప్రతిజ్ఞను దప్పక నెరవేర్పవలెనను సదాచారమున నిలువఁడు. రామునితో సఖ్యము సేయుటవలననేకదా దనకు వానరరాజ్యంబును భార్యాసమాగమంబును సమకూఱెనను తలం పతనికిఁ గలుగదు. మనకార్యము విషయమయి యతఁ డనుమాలించిరాఁడు. కావున వానరరాజ్యలక్ష్మి ఆతనికిఁ దక్కదు. ౨

పరాక్రమశాలివగు రాముఁడా! దుర్బుద్ధిచేత సుగ్రీవుఁడు గ్రామ్య

స్తవప్రసాదాప్రతికారబుద్ధిః,
హతోఽగ్రజం పశ్యతు వీర! తస్య
న రాజ్య మేవం విగుణస్య దేయమ్. 3

న ధారయే కోప ముదీర్ణవేగం
నిహన్మి సుగ్రీవ మసత్య మద్య,
హరిప్రవీరై స్సహవాలిపుత్త్రో
నరేన్ద్రపత్న్యా విచయం కరోతు. ४

త మాత్తబాణాసన ముత్పతన్తం
నివేదితార్థం రణచణ్డకోపమ్,
ఉవాచ రామః పరవీరహన్తా
స్వవేక్షితం సానునయం చ వాక్యమ్. ५

న హి వై త్వద్విధో లోకే పాప మేవం సమాచరేత్,
పాప మార్యేణ యో హన్తి స వీరః పురుషోత్తమః. ౬

నేద మద్య త్వయా గ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ!,
తాం ప్రీతి మనువర్తస్వ పూర్వవృత్తం చ సఙ్గతమ్. ౭

సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్,
వక్తు మర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయే. ౮

సోఽగ్రజే నానుశిష్టార్థో యథావ త్పురుషర్షభః,
ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా. ౯

సుఖంబులందగిలి నీవుచేసిన యుపకారంబునకుఁ బ్రత్యుపకారంబు సేయఁ దలంపకున్నాఁడు కావున ఇపుడు నాచేత హతుఁడై యున్నను వాలిని జూచుఁగాక. ఇట్టిదుర్గుణునకు రాజ్యం బివ్వరాదు. ౩

ఇప్పుడుగలిగిన మహాక్రోధమును అణఁచఁజాలను. కావున సత్యంబు దప్పిన యీసుగ్రీవు నిపుడు వధించెదను. వాలికుమారుండగు నంగదుఁడు వానరవీరులతోఁగూడ సీతాదేవిని వెదకును గాక. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪

శత్రువీరులవధించువాఁడేకాని యాశ్రితులను వధింపనట్టి రాముఁడు అట్లు యుద్ధంబున భయంకరంబగు కోపముగలవాఁడును ఇవ్విధంబునఁ దాను జేయఁబోవు సంగతిం జెప్పి ధనుర్ధరుఁడై పోవుచున్నవాఁడునగు లక్ష్మణుం జూచి మంచియాలోచనముతోఁ గూడినదియు సామసమన్వితంబునగు నీమాటం జెప్పెను. ౫

లోకంబున నీయట్టివాఁ డెవ్వఁడేని యిట్టిమిత్రవధరూపమయిన పాపమును జేయునా? ఎవ్వఁడు తనకుఁ గ్రోధవశంబునఁ బాపము సేయుతలంపు కల్గినపుడు దాని వివేకంబుచేఁ బరిహరించుచున్నాఁడో అట్టివీరుఁడు పురుషులలోనెల్ల నుత్తముఁ డనఁబడును. ౬

లక్ష్మణుఁడా! ఇప్పుడు సదాచారసంపన్నుఁడవగునీవు ఇట్టిపాపమును జేయరాదు. పూర్వము మనము సుగ్రీవునితోఁ జేసికొన్నసఖ్యము ననుసరించి మునుపు నీ వతనియందుంచియున్నప్రీతి నే యుంచుము. ౭

సుగ్రీవుఁడు క్రమముగాఁ గాలమునకు రాలేదేగాని మఱియును నంతగా నపరాధము చేసినవాఁడు కాఁడు. కావున నతనియొద్దఁ బరుషవచనంబులాడక మంచితనముగా మాటలాడుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౮

వీరుండును శత్రువీరుల వధించువాఁడును బురుషశ్రేష్ఠుఁడునగు లక్ష్మణుండు అన్న ధర్మముననుసరించి చెప్పిన యభిప్రాయమువిని కిష్కింధాపురంబునకుఁ బోయెను. ౯

తత శ్శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితే రతః,
లక్ష్మణః ప్రతిసంరబ్ధో జగామ భవనం కపేః. ౧౦

శక్రబాణాసనప్రఖ్యం ధనుః కాలాన్తకోపమః,
ప్రగృహ్య గిరిశృఙ్గాభం మన్దర స్సానుమా నివ. ౧౧

యథోక్తకారీ వచన ముత్తరం చైవ సోత్తరమ్,
బృహస్పతిసమో బుద్ధ్యా మత్వా రామానుజ స్తథా. ౧౨

కామక్రోధసముత్థేన భ్రాతుః కోపాగ్నినా వృతః,
ప్రభఞ్జన ఇ వాప్రీతః ప్రయయౌ లక్ష్మణ స్తదా. ౧౩
సాలతాలాశ్వకర్ణాం శ్చ తరసా పాతయ న్ద్రుమాన్,
పర్యస్య న్గిరికూటాని ద్రుమా నన్యాం శ్చ వేగతః. ౧౪
శిలా శ్చ శకలీకుర్వ న్పద్భ్యాం గజ ఇ వాశుగః,
దూర మేకపదం త్యక్త్వా యయౌ కార్యవశా ద్ద్రుతమ్. ౧౫
తా మపశ్య ద్బలాకీర్ణాం హరిరాజమహాపురీమ్,
దుర్గా మిక్ష్వాకుశార్దూలః కిష్కిన్ధాం గిరిసంకటే. ౧౬

రోషా త్ప్రస్ఫురమాణోష్ఠ స్సుగ్రీవం ప్రతి లక్ష్మణః,
దదర్శ వానరా న్భీమా న్కిష్కిన్ధాయా బహిశ్చరాన్. ౧౭
తం దృష్ట్వా వానరా స్సర్వే లక్ష్మణం పురుషర్షభమ్,
శైలశృఙ్గాణి శతశః ప్రవృద్ధాం శ్చ మహీరుహాన్. ౧౮
జగృహుః కుఞ్జరప్రఖ్యా వానరాః పర్వతా న్తరే,

అంత ధరిష్ఠుండయిన బుద్ధిగలవాఁడును బండితుఁడును అన్నకు సంతోషంబును మేలును గలిగించు కార్యంబులనే కావించువాఁడు నగు లక్ష్మణుఁడు కోపవేగంబు నడంచుకొని సుగ్రీవునింటికిఁ బోయెను ౧౦

ప్రలయకాలమునందలి యమునితో సమానుండగు నాలక్ష్మణుఁడు ఇంద్రధనుస్సుతో సమానంబగు పర్వతశిఖరంబంతటి గొప్పధనుస్సు నుధరించి మందరపర్వతంబువలె నొప్పెను. ౧౧

అట్లు బుద్ధియందు బృహస్పతితో సమానుండును రామునాజ్ఞాపించినవిధంబుఁ గొంచెమేని యతిక్రమింపక కావించువాఁడు నగు రామునితమ్ముఁడు లక్ష్మణుఁడు తాను సుగ్రీవునితోఁ జెప్పవలసినమాటను సుగ్రీవుఁ డందుకు బదులుచెప్పుమాటను తా నందుకుఁ జెప్పవలసిన ప్రత్యుత్తరమును ఆలోచించుకొని పోయెను. ౧౨

అప్పుడు లక్ష్మణుండు కామక్రోధవశంగతుఁడగు రాముని కోపంబను నగ్నితోఁ గూడినవాఁడై పరమవేగంబునం బోయెను. ౧౩

ఆలక్ష్మణుండు దోవకడ్డమువచ్చిన మద్దిచెట్లను, తాటిచెట్లను, ఇనుమద్దిచెట్లను, పెక్కులను బాహుబలంబునం బడఁద్రోయుచు నూరువేగంబునకుఁ బర్వతశిఖరంబులును ఇతరవృక్షంబులును ఎగిరిదూరంబునంబడ అడుగులుంచు వేగంబున శిలలు చూర్ణంబులు గాఁ జేయుచు శీఘ్రంబు గాఁ బోయెను. ౧౪,౧౫

ఇక్ష్వాకువంశమునం బుట్టినవారలలో నుత్తముఁడగు లక్ష్మణుఁడు పర్వతంబులనడుమ వానరసైన్యములచే వ్యాప్తమయి ఎట్టివారికిని బ్రవేశింపనశక్యమయిన వానరరాజయిన సుగ్రీవునిరాజధానియగు కిష్కింధం జూచెను.

లక్ష్మణుఁడు సుగ్రీవులమీఁది కోపవేగంబునం బెదవి యదరఁ గిష్కింధకు వెలుపల సంచరించుచున్న భయంకరాకారులగు వానరులఁ జూచెను. ౧౬

ఏనుఁగులంతటి యాకారము గలయా వానరులు పర్వతంబులనడుమఁ బురుషశ్రేష్ఠుండగు లక్ష్మణుండు కిష్కింధకు వచ్చుటం జూచి యెవ్వఁడో శత్రువు వచ్చినాఁడని పెక్కు పర్వతశిఖరంబులను బెద్దవృక్షంబులను గ్రహించిరి.

తా న్గృహీతప్రహరణా న్హరీ న్దృష్ట్వా తు లక్ష్మణః. ౧౯
బభూవ ద్విగుణం క్రుద్ధో బహ్విన్ధన ఇవానలః,
తం తే భయపరీతాఙ్గాః క్రుద్ధం దృష్ట్వా ప్లవఙ్గమాః. ౨౦
కాలమృత్యుయుగాన్తాభం శతశో విద్రుతా దిశః,

తత స్సుగ్రీవభవనం ప్రవిశ్య హరిపుఙ్గవాః. ౨౧
క్రోధ మాగమనం చైవ లక్ష్మణస్య న్యవేదయన్,
తారయా సహితః కామీ సక్తః కపివృషో రహః. ౨౨
న తేషాం కపివీరాణాం శుశ్రావ వచనం తదా,

తత స్సచివసందిష్టా హరయో రోమహర్షణాః. ౨౩
గిరికుఞ్జరమేఘాభా నగర్యా నిర్యయు స్తదా,

నఖదంష్ట్రాయుధా ఘోరా స్సర్వే వికృతదర్శనాః. ౨౪
సర్వే శార్దూలదర్పాశ్చ సర్వేచ వికృతాననాః,

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః. ౨౫
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః,

కృతాన్నం హి కపిభి ర్వ్యాప్తాం ద్రుమహస్తై ర్మహాబలైః.
అపశ్య ల్లక్ష్మణః క్రుద్ధః కిష్కిన్ధాం తాం దురాసదామ్,

తత స్తే హరయ స్సర్వే ప్రాకారపరిఘాన్తరాత్. ౨౭
నిష్క్రమ్యోదగ్రసత్త్వా స్తు తస్థు రావిష్కృతం తదా,

లక్ష్మణుఁడు ఆవానరులు ఆయుధములు ధరించుటఁజూచి నిముషడిక్రో షంబునొంది అధికముగాఁ గక్రైలుగల యగ్నివలె జ్వలించెను. ౧౯

ఆవానరులు, ఆగ్లు కుపితుఁడై ప్రళయకాలమునందలి మృత్యువువలె భయంకరంబుగా జ్వలించుచున్న లక్ష్మణుంజూచి భయంబున గడగడవడంకుచు గుంపులు గుంపులుగా దిక్కులకుఁ బోయిరి. ౨౦

అంత నవ్వానరోత్తములు సుగ్రీవగృహంబునకుఁబోయి లక్ష్మణుండు కుపితుండగుటయుఁ గిష్కింధకు వచ్చుటయు సుగ్రీవునకుఁ జెప్పిరి. ౨౧

అపుడు సుగ్రీవుఁడు మన్మథమోహితుఁడై రహస్యంబునఁ దారాసహితుఁడై క్రీడించుచున్నవాఁ డగుటంజేసి యవ్వానరవీరులు చెప్పినమాటను వినఁడయ్యె. ౨౨

అంత నప్పుడు మంత్రులు యథార్థముఁ దెలిసికొనిరండని యాదేశింప చూపరులకు భయముగలిగించువారలును బర్వతాకారులును ఏనుంగులంతటి వారలును మేఘసమానులునగు వానరులు పట్టణమునుండి వెడలిరి. ౨౩

అవ్వానరులు అందఱును నఖములు దంతములు ఆయుధముగాఁగలవారలు. అందఱును భయంకరాకారులు. అందఱును భయంకరములయిన కన్నులుగలవారలు. అందఱును బెద్దపులులవలె బలదర్పితులు. అందఱును భయంకరమయిన ముఖముగలవారలు. ౨౪

అవ్వానరులు కొందఱు పదియేనుఁగుల బలముగలవారలును, గొందఱు మాఱేనుఁగుల బలముగలవారలును, గొందఱు వేయేనుఁగుల బలముగలవారలునుగా నుండిరి. ౨౫

క్రుద్ధుండగు లక్ష్మణుఁడు అంతటను మహాబలశాలులును వృక్షహస్తులునగు వానరవీరులచే వ్యాప్తమయి యెట్టివారికిని సమీపింప నలవిగాని కిష్కింధానగరముం జూచెను. ౨౬

అంత మహాబలశాలులగు మంత్రిసందిష్టులయిన యావానరులందఱు ప్రాకారద్వారంబునకు వేసియున్న యినుపగుదియ క్రిందుగా వెడలివచ్చి లక్ష్మణునిదృష్టిపథంబున నిలిచిరి. ౨౭

సుగ్రీవస్య ప్రమాదంచ పూర్వజం చార్త మాత్మవాన్. ౨౮
బుద్ధ్వా కోపవశం వీరః పున రేవ జగామ సః,

స దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసః కోపసంరక్తలోచనః. ౨౯
బభూవ నరశార్దూల స్సధూమ ఇవ పావకః,

బాణశల్యస్ఫురజ్జిహ్వ స్సాయకాసనభోగవాన్. ౩౦
స్వతేజోవిషసంఘాతః పఞ్చాస్య ఇవ పన్నగః,

తం దీప్త మివ కాలాగ్నిం నాగేన్ద్ర మివ కోపితమ్. ౩౧
సమాసా ద్యాఙ్గద స్త్రాసా ద్విషాద మగమ ద్భృశమ్,

సోఽఙ్గదం రోషతామ్రాక్షః సందిదేశ మహాయశాః. ౩౨

సుగ్రీవః కథ్యతాం వత్స! మ మాగమన మిత్యుత,
ఏష రామానుజః ప్రాప్త స్త్వత్సకాశ మరిన్దమః. ౩౩
భ్రాతృవ్యసనసంతప్తో ద్వారి తిష్ఠతి లక్ష్మణః,

తస్య వాక్యే యది రుచిః క్రియతాం సాధువానర. ౩౪

ఇత్యుక్త్వా శీఘ్ర మాగచ్ఛ వత్స! వాక్య మరిన్దమ!,

లక్ష్మణస్య వచః శ్రుత్వా శోకావిష్టోఽఙ్గదోఽబ్రవీత్. ౩౫
పితు స్సమీప మాగమ్య సౌమిత్రి రయ మాగతః,

బుద్ధిమంతుఁడును బరాక్రమశాలియునగు నాలక్ష్మణుండు సుగ్రీవుఁడుపేక్షించుటయు అన్నయగురాముండు దుఃఖితుండగుటయుఁ దలఁచి మరలఁ గోపంబునొందెను. ౨౮

పురుషశ్రేష్ఠుఁడగు నాలక్ష్మణుఁడు కోపంబున దీర్ఘంబులగు వేఁడి నిట్టూర్పులు విడుచుచుఁ గన్నుల మిక్కిలియు నెఱ్ఱనంబుగదురఁ బొగతోఁ గూడిన నిప్పువలె నొప్పెను. ౨౯

ఆలక్ష్మణుఁడు బాణంబులను వేసియున్న యుక్కుమేకువలె చలించుచున్న నాలుకలుగాను ధనుస్సె పడగగాను దనతేజస్సె విషముగాను గలవాఁడై యయిదుతలలుగల సర్పమువలె భయంకరుండయ్యెను. ౩౦

అంగదుఁడు ప్రళయకాలాగ్నివలె జ్వలించుచున్నవాఁడును కుపితుండగు సర్పరాజయిన యాదిశేషునివలె నున్నవాఁడునగు నాలక్ష్మణుని సమీపమునకుఁ బోయి భయమునంజెంది మిక్కిలియు దుఃఖితుండయ్యె. ౩౧

మహాకీర్తిశాలియగు నాలక్ష్మణుఁడు కోపంబునం గన్నుల నెఱ్ఱదనంబు దోఁప అంగదునితో సుగ్రీవునికిఁగా నిట్లని సమాచారము చెప్పెను. ౩౨

చిన్నవాఁడా! నారాకనుగుఱించి సుగ్రీవునకుఁ దెలియఁజేయుము.

శత్రువుల నడంగఁద్రొక్కునట్టి రామునితమ్ముఁడు లక్ష్మణుండు అన్నయొక్క దుఃఖముచే సంతప్తుఁడై నీసమీపమునకువచ్చి యిపుడు వాకిటనున్నాఁడు. ౩౩

సుగ్రీవుఁడా! ఆలక్ష్మణునిమాట వినుటకు నీకిష్టముకలదేని యందుకనురూపముగాఁ బ్రవర్తింపుము. అని సుగ్రీవునితోఁ జెప్పుము. ౩౪

శత్రువుల నడంగఁద్రొక్కునట్టి యంగదుఁడా! అని యిట్లు సుగ్రీవునితోఁజెప్పి శీఘ్రంబునరమ్ము.

అంగదుఁడు లక్ష్మణునివాక్యంబు విని దుఃఖితుఁడై పినతండ్రియగు సుగ్రీవునియొద్దకుఁబోయి; "ఇదిగో లక్ష్మణుండు వచ్చియున్నాఁ"డని చెప్పెను. ౩౫

అథాఙ్గద స్తస్య వచో నిశమ్య
సంభ్రాన్తభావః పరిదీనవక్త్రః. ౩౬
నిపత్య తూర్ణం నృపతే స్తరస్వీ
తతః కుమార శ్చరణౌ వవన్దే,
సంగృహ్య పాదౌ పితు రగ్ర్యతేజా
జగ్రాహ మాతుః పున రేవ పాదౌ. ౩౭
పాదౌ రుమాయాశ్చ నిపీడయిత్వా
నివేదయామాస తత స్తమర్థమ్,
స నిద్రామదసంవీతో వానరో న విబుద్ధవాన్. ౩౮
బభూవ మదమత్తశ్చ మదనేన చ మోహితః,
తతః కిలకిలాం చక్రు ర్లక్ష్మణం ప్రేక్ష్య వానరాః. ౩౯
ప్రసాదయన్త స్తం క్రుద్ధం భయమోహితచేతసః,
తే మహౌఘనిభం దృష్ట్వా వజ్రాశనిసమస్వనమ్. ౪౦
సింహనాదం సమం చక్రు ర్లక్ష్మణస్య సమీపతః,

తేన శబ్దేన మహతా ప్రత్యబుధ్యత వానరః. ౪౧
మదవిహ్వలతామ్రాక్షో వ్యాకులస్రగ్విభూషణః,

అథాఙ్గదవచః శ్రుత్వా తేనైవ చ సమాగతౌ. ౪౨
మన్త్రిణౌ వానరేన్ద్రస్య సమ్మతౌ దారదర్శినౌ,
ప్లక్ష శ్చైవ ప్రభావ శ్చ మన్త్రిణా వర్థధర్మయోః. ౪౩
వక్తు ముచ్చావచం ప్రాప్తం లక్ష్మణం తౌ శశంసతుః,

ప్రసాదయిత్వా సుగ్రీవం వచనైః సామనిశ్చితైః. ౪౪
ఆసీనం పర్యుపాసీనౌ యథా శక్రం మరుత్పతిమ్,

అంతఁ గుమారుండగు నంగదుండు లక్ష్మణుని మాట విని మనస్సు తొట్రుపాటునొంద దుఃఖంబున ముఖంబు వెలవెలంబోవ శీఘ్రంబునం బోయి రాజయిన సుగ్రీవునిచరణంబులకు నమస్కరించెను. ౩౬

అధికమయిన పరాక్రమము గల యంగదుఁడు తండ్రిపాదంబులకు మ్రొక్కి అంతఁ దల్లియగు తారపాదంబులకు నమస్కరించి పినతల్లియగు రుమకుఁగూడ నభివందనంబు గావించియటుపిమ్మట లక్ష్మణుండు చెప్పి పంపిన సమాచారమును జెప్పెను. ౩౭

ఆసుగ్రీవుఁ డప్పుడు నిదురయు మద్యపానంబునం గల్గినకైపును మన్మథమోహంబును బొందియుండుటవలన మేలుకొనఁడయ్యె. ౩౮

అంత వానరులు లక్ష్మణునిఁ జూచి మిక్కిలి భయమునొంది కుపితుండగు లక్ష్మణునిఁ బ్రసన్నుంజేయుటకై కిలకిలయని యఱచిరి. ౩౯

మహాప్రవాహము వచ్చినట్లు వచ్చిన లక్ష్మణుంజూచి యావానరులు అందఱు నొకటిగా వజ్రాయుధమువలెను పిడుగువలెను మహాధ్వనిగల్గునట్లు సింహనాదము గావించిరి. ౪౦

ఆమహాధ్వనికి సుగ్రీవుఁడు కైపుచే సులభముగాఁ దెఱచుట కశక్యములయి యెఱ్ఱనివైన కన్నులతోను గ్రిందుమీఁదైన పుష్పసరంబులతోను ఆభరణంబులతోను గూడినవాఁడై నిదుర మేలుకొనెను. ౪౧

అంత చక్కనియాలోచనశక్తిగలవారలును సుగ్రీవునకు ఇష్టులును అంతఃపురములోనికిఁ బ్రవేశింపఁదగినవారలునగు ప్లక్షుండు ప్రభావుండు నను మంత్రులిర్వురు అంగదునివచనంబు విని యతనితోఁగూడ నంతిపురంబునకుఁ బోయి లక్ష్మణుఁడు అర్థధర్మంబుల విషయమయి చాల మాటలాడుటకై వచ్చియున్నాఁడని సుగ్రీవునికిఁ జెప్పిరి. ౪౨,౪౩

ప్లక్షప్రభావులు దేవనాథుండగునింద్రునివలె సింహాసనాసీనుఁడై వెలుంగుచున్న సుగ్రీవుని సామవచనంబులచేఁ బ్రసన్నుంగావించి యతని

సత్యసన్ధౌ మహాభాగౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౫
వయస్యభావం సంప్రాప్తౌ రాజ్యార్హౌ రాజ్యదాయినౌ,

తయో రేకో ధనుష్పాణి ర్ద్వారి తిష్ఠతి లక్ష్మణః. ౪౬
యస్య భీతాః ప్రవేపన్తో నాదా న్ముఞ్చన్తి వానరః,

స ఏష రాఘవభ్రాతా లక్ష్మణో వాక్యసారథిః. ౪౭
వ్యవసాయరథః ప్రాప్త స్తస్య రామస్య శాసనాత్,

అయం చ దయితో రాజం స్తారాయా స్తనయోఽఙ్గదః. ౪౮
లక్ష్మణేన సకాశం తే ప్రేషిత స్త్వరయాఽనఘ!,
సోఽయం రోషపరీతాక్షో ద్వారి తిష్ఠతి వీర్యవాన్. ౪౯
వానరా న్వానరపతే! చక్షుషా ప్రదహ న్నివ,

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్ర స్సహ బన్ధుభిః. ౫౦
గచ్ఛ శీఘ్రం మహారాజ! రోషో హ్యస్య నివర్త్యతామ్,

యదాహ రామో ధర్మాత్మా తత్కురుష్వ సమాహితః. ౫౧
రాజం! స్తిష్ఠ స్వసమయే భవ సత్యప్రతిశ్రవః,

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకత్రింశ స్సర్గః. ౩౧.

---

సమీపంబునం గూర్చుండి యిట్లని పలికిరి. ౪౪

ప్రతిజ్ఞ దప్పనివారలును మహాత్ములును రాజ్యంబుఁ బాలింప సమర్థులును నీతో సఖ్యంబు గావించి నీకు రాజ్యం బొసంగినవారలునగు నన్నదమ్ములు రాముండును లక్ష్మణుండు ననువార లున్నారుగదా! ౪౫

వారిలో నొకఁడు లక్ష్మణుండనువాఁడు ధనుర్ధరుండయి వాకిటికి వచ్చియున్నాఁడు. అతనిం జూచి వానరులు భయపడి పెడబొబ్బలు నాదంబులు సేయుచున్నారు. ౪౬

ఆ రామునితమ్ముండు లక్ష్మణుండు రామునిపనుపునం జేసి రామవాక్యమే సారథిగాను రామునియోగంబును గావించుటయే రథంబుగాను గలవాఁడై యిచటికి వచ్చినాఁడు. ౪౭

పాపరహితుఁడవగు సుగ్రీవుఁడా! తారయొక్క ప్రియపుత్త్రుఁడగు నీయంగదునిఁ గూడ శీఘ్రంబునం బొమ్మని లక్ష్మణుండు నీయొద్దకుఁ బంపినాఁడు.

వానరేంద్రుఁడవగు సుగ్రీవుఁడా! మహాపరాక్రమశాలియగు నాలక్ష్మణుండు కన్నులం దీవ్రకోపంబు దోఁపఁ జూపుల వానరులను దహించువాఁడువోలె వాకిటం గాచియున్నాఁడు. ౪౯

సుగ్రీవుఁడా! నీవు పుత్త్రునితోను బంధువులతోనుంగూడ శీఘ్రంబున లక్ష్మణునియొద్దకుఁ బోయి యతని శిరస్సుచే నమస్కరించి యతనికోపమును ఎట్లని పోఁగొట్టుము. ౫౦

వానరనాథుఁడా! ధర్మాత్ముండగు రాముఁ డేమిచెప్పుచున్నాఁడో, ఆపనినిజాగ్రత్తతోఁ దప్పక నెఱవేర్చి నీమర్యాదను గాపాడుకొనుము. అని ప్లక్షప్రభావులు సుగ్రీవునితోఁ జెప్పిరి. ౫౧

ఇది ముప్పదియొకటవసర్గము.

## ద్వాత్రింశ స్సర్గః.

అఙ్గదస్య వచః శ్రుత్వా సుగ్రీవ స్సచివై స్సహ,
లక్ష్మణం కుపితం శ్రుత్వా ముమోచాసన మాత్మవాన్. ౧

సచివా నబ్రవీ ద్వాక్యం నిశ్చిత్య గురులాఘవమ్,
మన్త్రజ్ఞా న్మన్త్రకుశలో మన్త్రేషు పరినిష్ఠితాన్. ౨

న మే దుర్వ్యాహృతం కించి న్నాపి మే దురనుష్ఠితమ్,
లక్ష్మణో రాఘవభ్రాతా క్రుద్ధః కిమితి చిన్తయే. ౩

అసుహృద్భి ర్మమామిత్రై ర్నిత్య మన్తరదర్శిభిః,
మమ దోషా నసంభూతాః శ్రావితో రాఘవానుజః. ౪
అత్ర తావ ద్యథాబుద్ధి సర్వై రేవ యథావిధి,
భావస్యనిశ్చయ స్తావ ద్విజ్ఞేయో నిపుణం శనైః. ౫

న ఖ ల్వస్తి మమ త్రాసో లక్ష్మణా న్నాపి రాఘవాత్,
మిత్రం త్వస్థానకుపితం జనయ త్యేవ సంభ్రమమ్. ౬

సర్వథాసుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్,
అనిత్యత్వా చ్చ చిత్తానాం ప్రీతి రల్పేఽపిభిద్యతే. ౭

అతోనిమిత్తం త్రస్తోఽహం రామేణ తు మహాత్మనా,
య న్మమోపకృతం శక్యం ప్రతికర్తుం న తన్మయా. ౮

## ముప్పదిరెండవసర్గము.

బుద్ధిమంతుఁడగు సుగ్రీవుఁడు అంగదపురస్సరులగు నాప్లక్ష ప్రభావులమాటనువిని లక్ష్మణుండు క్రుద్ధుండయ్యెనని తెలిసి సింహాసనమునుండి దిగెను. ౧

ఆలోచనలందు సమర్థుఁడయిన సుగ్రీవుఁడుగౌరవలాఘవంబులునిశ్చయించి ఆలోచనలు చక్కఁగాఁ దెలిసినవారలును ఎప్పుడును ఆలోచన సేయుటయందె యున్నవారలునగు మంత్రులంజూచి యిట్లనిపలికెను. ౨

నేను కొంచెమయినను తప్పుమాట చెప్పియుండలేదు. తప్పుపనియుఁ జేసియుండలేదు. ఇట్లుండఁగా రామునితమ్ముఁడు లక్ష్మణునకు ఎందువలనఁ గోపము గలిగెనని యాలోచించుచున్నాను. ౩

ఎల్లప్పుడును నాఛిద్రములనే కనిపెట్టియుండు దురాత్ములగు నాశత్రువులు నాయందు లేనిపోని దోషములను లక్ష్మణునితోఁ జెప్పియుందురు. ౪

ఈవిషయమందు ముందుగా మీరలందఱును మీబుద్ధికౌశలంబుకొలఁది నీతిశాస్త్రోక్తపద్ధతిని ఆలోచించి లక్ష్మణునకుఁ గోపముగలుగుటకుఁ దగిన కారణంబునంతయుఁ జక్కఁగా నిశ్చయించి తెలిపికొనవలెను. ౫

లక్ష్మణునియొద్దఁగాని రామునియొద్దఁగాని నాకెంతమాత్రము భయములేదు. అయితే స్నేహితుఁడు కారణంబులేక కోపంబునొందినయెడ నెట్టివానికిని సంభ్రమము గలుగకమానదు. ౬

మిత్రుని సంపాదించుట యన్నివిధములను సులభసాధ్యము. ఆమైత్రిని గాపాడుటమాత్రము కష్టము. చిత్తవృత్తి చపలముగుటవలన కొంచెము వైషమ్యము గలిగినను స్నేహము చెడును. ౭

మహాత్ముఁడగు రాముఁడు నాకేయుపకారము గావించినాఁడో అట్టియుపకారమునకు సరియయిన ప్రత్యుపకారము సేయుటకు నాచే నెంతమాత్రముశక్యముగాదు. ఈకారణమువలననె నేను భయపడెదను. అని సుగ్రీవుఁడు మంత్రులతోఁ జెప్పెను. ౮

సుగ్రీవే ణైవ ముక్త స్తు హనూమాన్హరిపుఙ్గవః,
ఉవాచ స్వేన తర్కేణ మధ్యే వానరమన్త్రిణామ్. ౯

సర్వథా నైతదాశ్చర్యం య త్త్వం హరిగణేశ్వర!,
న విస్మరసి సుస్నిగ్ధ ముపకారకృతం శుభమ్. ౧౦

రాఘవేణ తు వీరేణ భయ ముత్సృజ్య దూరతః,
త్వత్ప్రియార్థం హతో వాలీశక్రతుల్యపరాక్రమః. ౧౧

సర్వథా ప్రణయా త్క్రుద్ధో రాఘవో నాత్ర సంశయః,
భ్రాతరం సమ్ప్రహితవా న్లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. ౧౨

త్వం ప్రమత్తో న జానీషే కాలం కాలవిదాం వర!,
ఫుల్లసప్తచ్ఛదశ్యామా ప్రవృత్తా తు శర చ్ఛివా. ౧౩

నిర్మలగ్రహనక్షత్రా ద్యౌః ప్రణష్టబలాహకా,
ప్రసన్నా శ్చ దిశ స్సర్వా స్సరిత శ్చ సరాంసి చ. ౧౪

ప్రాప్త ముద్యోగకాలం తు నావైషి హరిపుఙ్గవ!,
త్వం ప్రమత్త ఇతివ్యక్తం లక్ష్మణోఽయ మిహాగతః. ౧౫

ఆర్తస్య హృతదారస్య పరుషం పురుషాన్తరాత్,
వచనం మర్షణీయం తే రాఘవస్య మహాత్మనః. ౧౬

కృతాపరాధస్య హి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమమ్,
అన్తరే ణాఞ్జలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్. ౧౭

వానరోత్తముఁడగు హనుమంతుఁడు సుగ్రీవుండు చెప్పినమాటను విని వానరమంత్రులనడుమఁ దనబుద్ధిబలంబు దేటపడ నిట్లని పలికెను. ౯

వానరరాజా! మిక్కిలియు స్నేహంబుగలవాఁడును సద్గుణ సంపన్నుండునగు నుపకారంబు కావించినవాని నీయట్టి ధర్మాత్ముఁడు మఱవకుండుట యెంతమాత్రము నాశ్చర్యకరము గాదు. నీకిది సహజమె. ౧౦

పరాక్రమశాలియగు రాముఁడు నీయొక్కసంతోషార్థమయి యెంతమాత్రము భయంబునొందక దేవేంద్రునిపరాక్రమము గలవాలిని వధించి పుచ్చెను. ౧౧

అన్నివిధంబులను రాముఁడు నీపైఁ బ్రణయకోపంబు పూని తమ్ముని సంపదను వృద్ధిఁబొందించునట్టి లక్ష్మణుని నీయొద్దకుఁ బంపియుండు నేకాని వేఱుకాదు. ఈవిషయమునందు ఎంతమాత్రము సందియము లేదు. ౧౨

కాలముఁ దెలిసినవారలలో నుత్తముఁడవగు సుగ్రీవుఁడా! నీవు ఏమఱియుండుటవలన నీకుఁ గాలము దెలియకున్నది. చక్కఁగా వికసించిన యేడాకులఁటిపూలచే నల్లనైన సుందరమయిన శరదృతువుగూడ వచ్చినది.

ఆకాశమునందు మేఘములు నశించి గ్రహములును నక్షత్రములును నిర్మలముగా నున్నవి. దిశలును నదులును గొలంకులును ప్రసన్నము లయియున్నవి. ౧౪

వానరోత్తముఁడా! యుద్ధమునకుఁ బ్రయత్నము సేయు సమయము వచ్చినను నీవు ప్రమత్తుఁడవై తెలియకున్నావు కావున లక్ష్మణుఁ డిచటికి వచ్చినాఁడు. స్పష్టము. ౧౫

భార్యం గోలుపోయి దుఃఖితుఁడై యున్నవాఁడును నీ కుపకారము గావించిన మహాత్ముండునగు రాముఁడు లక్ష్మణునిచేఁ జెప్పి పంపినమాట పరుషముగానున్నను నీవు గోపింపక సహించియుండవలెను. ౧౬

సంకేతకాలము దప్పుటవలన నపరాధము గావించినవాఁడవైన నీవు చేమోడ్పుగీలించి లక్ష్మణుని వేడుకొని ప్రసన్నుం గావింపవలసినదేకాని మఱియొకటి యుక్తమయినయుపాయము నాకు వేఱొకటోఁచలేదు. ౧౭

నియుక్తై ర్మన్త్రిభి ర్వాచ్యో హ్యవశ్యం పార్థివో హితమ్,
అతఏవ భయం త్యక్త్వా బ్రవీ మ్యవధృతం వచః. ౧౮

అభిక్రుద్ధ స్సమర్థో హి చాప ముద్యమ్య రాఘవః,
స దేవాసురగన్ధర్వం వశే స్థాపయితుం జగత్. ౧౯
న స క్షమః కోపయితుం యః ప్రసాద్యః పున ర్భవేత్,
పూర్వోపకారం స్మరతా కృతజ్ఞేన విశేషతః. ౨౦

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్త్ర స్ససుహృజ్జనః,
రాజం! స్తిష్ఠస్వ సమయే భర్తు ర్భార్యేవ తద్వశః. ౨౧

న రామరామానుజశాసనం త్వయా
కపీన్ద్ర! యుక్తం మనసాఽప్యపోహితుమ్,
మనో హి తే జ్ఞాస్యతి మానుషం బలం
సరాఘవ స్యాస్య సురేన్ద్రవర్చసః. ౨౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్వాత్రింశ స్సర్గః. 3౨.

---

## త్రయస్త్రింశ స్సర్గః.

అథ ప్రతిసమాదిష్టో లక్ష్మణః పరవీరహా,
ప్రవివేశ గుహాం ఘోరాం కిష్కిన్ధాం రామశాసనాత్. ౧

ద్వారస్థా హరయ స్తత్ర మహాకాయా మహాబలాః,
బభూవు ర్లక్ష్మణం దృష్ట్వా సర్వే ప్రాఞ్జలయ స్స్థితాః. ౨

రాజనియుక్తులు మంత్రులు రాజునకు అవశ్యము హితంబు బోధింప వలెనుగావున నేనిపుడు రాజభయంబువదలి నాకుఁ దోఁచినహితమును నిశ్చితముగాఁ జెప్పుచున్నాను. ౧౮

రాముండు కోపించినచో ధనుర్ధరుండై దేవాసుర గంధర్వ సహితంబుగాఁ బ్రపంచంబునంతయుఁ దనస్వాధీనము చేసికొనఁగలఁడుగదా! ౧౯

ఎవ్వఁడు కుపితుండయినపుడు ప్రసన్నుఁడుగాఁ జేయఁదగినవాఁడో ఆట్టి బలవంతునికి కోపము గలిగింపరాదు. అందువిశేషించి అతనివలన నుపకారమునుబొంది కృతజ్ఞుఁడైనవాఁడు ఎంతమాత్రము కలిగింపరాదు. ౨౦

వానరరాజా! నీవిపుడు నీపుత్త్రునితోను బంధుజనులతోను గూడ నతనికి నమస్కరించి పెనిమిటి యధీనయయి భార్యయుండునట్లు నీవు అతని యధీనుండవై నీప్రతిజ్ఞను నెఱవేర్పుము. ౨౧

వానరరాజా! నీవు రామునిమాటనుగాని లక్ష్మణునిమాటనుగాని మనస్సునకైనను ఎంతమాత్ర మతిక్రమించుట యుక్తముకాదు. దేవేంద్రసమానుండగు రామునియొక్కయు లక్ష్మణునియొక్కయు దివ్యాస్త్రబలంబుమాత్రమె గాక స్వాభావికమయిన దేహబలంబుగూడ నీమనసునకుఁ దెలిసియె యున్నదిగదా! అని హనుమంతుఁడు సుగ్రీవునకుఁ జెప్పెను. ౨౨

ఇది ముప్పదిరెండవసర్గము.

---

## ముప్పదిమూఁడవసర్గము.

అంత రామునియాజ్ఞవలన శత్రువీరహంతయగు లక్ష్మణుండు, అంగదుఁడు సుగ్రీవునియొద్దకుఁబోయి మరలవచ్చి పిలువ భయంకరమయిన గుహాకారమగు కిష్కింధానగరముఁ బ్రవేశించెను. ౧

మహాకాయులును మహాబలశాలులునగు నచట వాకిటఁ గావలియున్న వానరులు లక్ష్మణుంజూచి యందఱును చేతులుమోడ్చుకొని నిలుచుండిరి.

నిశ్వసన్తం తు తం దృష్ట్వా క్రుద్ధం దశరథాత్మజమ్,
బభూవు ర్ద్వారయా స్త్రస్తా న చైనం పర్యవారయన్. ౩
స తాం రత్నమయీం శ్రీమా న్దివ్యాం పుష్పితకాననామ్,
రమ్యాం రత్నసమాకీర్ణాం దదర్శ మహతీం గుహామ్. ౪
హర్మ్యప్రాసాదసంబాధాం నానాపణ్యోపశోభితామ్,
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితామ్. ౫
దేవగన్ధర్వపుత్త్రైశ్చ వానరైః కామరూపిభిః,
దివ్యమాల్యామ్బరధరై శ్శోభితాం ప్రియదర్శనైః. ౬
చన్దనాగరుపద్మానాం గన్ధై స్సురభిగన్ధినామ్,
మైరేయాణాం మధూనాంచ సమ్మోదితమహాపథామ్. ౭

దదర్శ గిరినద్య శ్చ విమలా స్తత్ర రాఘవః,
అఙ్గదస్య గృహం రమ్యం మైన్దస్య ద్వివిదస్య చ. ౮
గవయస్య గవాక్షస్య గజస్య శరభస్య చ,
విద్యున్మాలే శ్చ సంపాతే స్సూర్యాక్షస్య హనూమతః. ౯
వీరబాహో స్సుబాహో శ్చ నళస్య చ మహాత్మనః,
కుముదస్య సుషేణస్య తారజామ్బవతో స్తథా. ౧౦
దధివక్త్రస్య నీలస్య సుపాటలసునేత్రయోః,

ఏతేషాం కపిముఖ్యానాం రాజమార్గే మహాత్మనామ్. ౧౧

ఆవానరులు కుపితుఁడై నిట్టూర్పులు నిగుడించుచున్న దశరథపుత్త్రు లక్ష్మణుంజూచి భయపడినవారలయి యతనిసమీపంబునకుఁ బోవఁజాలరైరి.

శ్రీమంతుండగులక్ష్మణుఁడు రత్నములతోఁ గట్టఁబడినదియుఁ బుష్పించిన వనంబులుగలదియు రమణీయంబును ఆపణంబులందు నిండియున్న మణులుగలదియు ధనికగృహంబులచేతను దేవాలయంబులచేతను నిండియున్నదియు నానావిధములయిన యాపణంబులతో నొప్పుచున్నదియు ఉత్తమములయిన ఫలంబులుగల ఫలవృక్షములచేతను బుష్పితంబులగు పుష్పవృక్షములచేతను శోభిల్లుచున్నదియు దేవతలకు గంధర్వులకు జన్మించినవారలును గామరూపులును దివ్యంబులగు పుష్పమాలికలు నుత్తమవస్త్రంబులు దాల్చి చూపరులకు సంతోషంబు సేయుచున్నవారలునగు వానరులచేఁ బ్రకాశించుచున్నదియు మంచివాసనగల చందనము అగరు పద్మము మొదలగు విలేపనద్రవ్యములయొక్కయు ఆరెపువ్వు బెల్లము కడుగునీళ్లు వీనితోఁ జేసినమద్యములయొక్కయు ఇప్పపువ్వుతోఁజేసిన మద్యములయొక్కయు సుగంధంబుచే గుబాళించుచున్న రాజమార్గంబులు గలదియు నగు విశాలమయిన కిష్కింధా నగరముం జూచెను. ౮-౯

ఆకిష్కింధయందులక్ష్మణుఁడు స్వచ్ఛజలముగలపర్వతనదులనుజూచెను.

లక్ష్మణుండు రమణీయమయిన అంగదుని గృహంబును మైందుని నికేతనంబును ద్వివిదుని వాసస్థానంబును గవయుని గేహంబును గవాక్షుని మందిరంబును గజునివేశ్మమును శరభునియాలయంబును విద్యున్మాలిసద్మంబును సంపాతియాగారంబును సూర్యాక్షుని హర్మ్యంబును హనుమంతుని భవనంబును వీరబాహునిస్థానంబును సుబాహుని గృహంబును మహాప్రభావుండగు నలునియాలయంబును కుముదుని సదనంబును సుషేణుని గేహంబును తారజాంబవంతులహర్మ్యంబులును దధివక్త్రుని గృహంబును నీలుని మేడయు సుపాటలసునేత్రులలోఁగిళ్లను జూచెను. ౧౦

మహాపరాక్రమశాలులగు ఈవానరోత్తములయొక్క అధికమయిన

దదర్శ గృహముఖ్యాని మహాసారాణి లక్ష్మణః,
పాణ్డురాభ్రప్రకాశాని దివ్యమాల్యయుతాని చ. ౧౨
ప్రభూతధనధాన్యాని స్త్రీరత్నైః శోభితాని చ,

పాణ్డురేణ తు శైలేన పరిక్షిప్తం దురాసదమ్. ౧౩
వానరేన్ద్రగృహం రమ్యం మహేన్ద్రసదనోపమమ్,

శుక్లైః ప్రాసాదశిఖరైః కైలాసశిఖరోపమైః. ౧౪
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితమ్,
మహేన్ద్రదత్తైః శ్రీమద్భి ర్నీలజీమూతసన్నిభైః. ౧౫
దివ్యపుష్పఫలై ర్వృక్షైః శీతచ్ఛాయై ర్మనోరమైః,
హరిభి స్సంవృతద్వారం బలిభి శ్శస్త్రపాణిభిః. ౧౬
దివ్యమాల్యావృతం శుభ్రం తప్తకాఞ్చనతోరణమ్,
సుగ్రీవస్య గృహం రమ్యం ప్రవివేశ మహాబలః. ౧౭
అవార్యమాణ స్సౌమిత్రి ర్మహాభ్ర మివ భాస్కరః,

స సప్తకక్ష్యా ధర్మాత్మా నానాజనసమాకులాః. ౧౮
ప్రవిశ్య సుమహ ద్గుప్తం దదర్శాన్తఃపురం మహత్,
హైమరాజతపర్యఙ్కై ర్బహుభి శ్చ వరాసనైః. ౧౯
మహార్హాస్తరణోపేతై స్తత్ర తత్రోపశోభితమ్,

ప్రవిశ న్నేవ సతతం శుశ్రావ మధురస్వరమ్. ౨౦
తన్త్రీగీతసమాకీర్ణం సమగీతపదాక్షరమ్,

దాక్ష్యముగలవియు తెల్లని మేఘంబులువలెఁ బ్రకాశించుచున్నవియు నుత్త
మంబులగు పూలమాలికలచే నలంకరింపఁబడినవియు అధికము గాధనధాన్యముల
చే నిండినవియు నుత్తమస్త్రీలచే నొప్పుచున్నవియునగు నయుత్తమగృహం
బులను లక్ష్మణుండు రాజమార్గంబునం జూచెను. ౧౧,౧౨

అంత చుట్టును తెల్లని ప్రాకారంబు గలదియుఁ బ్రవేశింప నలవిగానిదియు రమణీయంబును దేవేంద్రునిగృహంబువలె నున్నదియునగు వానరరాజు సుగ్రీవుని గృహమును లక్ష్మణుండు గాంచెను. ౧౩

మహాబలశాలియగు లక్ష్మణుండు కైలాసశిఖరంబులంబోలిన తెల్లని ప్రాసాదశిఖరంబులతో నొప్పుచున్నదియు నుత్తమ ఫలప్రదంబులగు పుష్పవృక్షములతోసం గూడినదియు మఱియు దేవేంద్రుఁడొసంగిన శ్రీమంతంబులును మేఘములువలె నల్లగా విశాలములైనవియు దివ్యంబులగుపుష్పంబులును ఫలంబులును గలవియు చల్లని నీడతోఁ గూడినవియు మనోహరంబులునగు దేవవృక్షంబులచేఁ బ్రకాశించుచున్నదియు వాకిట ద్వారపాలురగు ఆయుధపాణులయిన బలవంతులయిన వానరవీరులచే నధిష్ఠితంబును దివ్యంబులగు మాల్యములచే నలంకృతంబును సువర్ణవర్ణంబును ఉత్తమమయిన బంగారముతోఁ జేయఁబడిన తలవాకిలితో నొప్పుచున్నదియు రమణీయంబునగు సుగ్రీవుని గృహంబులోనికి ద్వారపాలురచే నివారింపఁబడనివాఁడై సూర్యుఁడు మహామేఘంబుఁ జొచ్చునట్లు ప్రవేశించెను. ౧౪-౧౭

ధర్మాత్ముఁడగు లక్ష్మణుండు నానావిధులయిన జనులతో నిండిన యేడు తొట్టికట్లను అతిక్రమించి యచటచటబంగారుమంచంబులతోను వెండిమంచంబులతోను ఉత్తమాస్తరణములు పఱచినపెక్కులయిన యుత్తమాసనంబులతోసుంగూడి రమణీయంబయిన సురక్షితంబును విశాలంబునగు నంతఃపురంబుఁ గాంచెను. ౧౮,౧౯

ఆలక్ష్మణుండు అంతఃపురమును బ్రవేశించుచుమనె మనోహరంబైన శ్రుతితోఁగూడినదియు తంత్రీధ్వనిరూపమయిన నానావిధగీతముగలదియు వైష

బహ్వీశ్చ వివిధాకారా రూపయౌవనగర్వితాః. ౨౧
స్త్రియ స్సుగ్రీవభవనే దదర్శ సుమహాబలః,

దృష్ట్వాఽభిజనసంపన్నా శ్చిత్రమాల్యకృతస్రజః. ౨౨
ఫలమాల్యకృతవ్యగ్రా భూషణోత్తమభూషితాః,
నాతృప్తా న్నాపి చావ్యగ్రా న్నానుదాత్తపరిచ్ఛదాన్. ౨౩
సుగ్రీవానుచరాం శ్చాపి లక్షయామాస లక్ష్మణః,

కూజితం నూపురాణాంచ కాఞ్చీనాం నినదం తథా. ౨౪
సన్నిశమ్య తత శ్శ్రీమాం త్సౌమిత్రి ర్లజ్జితోఽభవత్,

రోషవేగప్రకుపిత శ్శ్రుత్వా చాభరణస్వనమ్. ౨౫
చకార జ్యాస్వనం వీరో దిశ శ్శబ్దేన పూరయన్,

చారిత్రేణ మహాబాహు రపకృష్ట స్సలక్ష్మణః. ౨౬
తస్థౌ వేకాన్త మాశ్రిత్య రామకోపసమన్వితః,

తేన చాపస్వనే నాథ సుగ్రీవః ప్లవగాధిపః. ౨౭
విజ్ఞాయాఽగమనం త్రస్త స్సంచచాల వరాసనాత్,
అఙ్గదేన యథామహ్యం పురస్తా త్ప్రతివేదితమ్. ౨౮
సువ్యక్త మేష సంప్రాప్త స్సౌమిత్రి ర్భ్రాతృవత్సలః,
అఙ్గదేన సమాఖ్యాతం జ్యాస్వనేన చ వానరః. ౨౯

ప్యము లేక సమానములయిన గీతములపదములును అక్షరములును గలదియు నగు వీణావాద్యమును వినెను. ౨౦

మహాబలుండగులక్ష్మణుండు సుగ్రీవుని యంతఃపురంబునందు నానా విధములైన వేషభూషణములచే నొప్పుచున్నవారలును సౌందర్యముచేతను యౌవనముచేతను గర్వించినవారలునగు పెక్కండ్రను స్త్రీలం జూచెను. ౨౧

లక్ష్మణుండు సత్కులప్రసూతలును నానావిధమాల్యంబులచేతను ఉత్తమాభరణంబులచేతను అలంకృతలును ఫలంబులు గొనుటయందును బుష్పసరంబులు గట్టుటయందును ఏమఱక ఆసక్తలయియున్నవారలునగు నారీమణులం గాంచి ధనరత్నధాన్యాదులచేఁ దృప్తులయి తమకునియుక్తములయిన కార్యములందు జాగరూకులయి యుత్తమవస్త్రాభరణాలంకృతులయియున్న సుగ్రీవుని సేవకులం జూచెను. ౨౨,౨౩

అంత శ్రీమంతుండగులక్ష్మణుండు నూపురంబుల ధ్వనియు స్త్రీలమొలనూళ్లకు గట్టియున్న గజ్జెల స్వనంబును విని (యవి యుపరతిని సూచించుట వలన) లజ్జనొందెను. ౨౪

పరాక్రమవంతుఁడగులక్ష్మణుండు స్త్రీల యాభరణధ్వనిని విని అప్పుడుగూడ సుగ్రీవుం డింకను స్త్రీలోలుండై యున్నాఁడని తెలియుటవలనఁ బరమకుపితుండై దిశలన్నియు శబ్దముచేఁ బూరించుచు జ్యాధ్వని గావించెను.

రామునకుఁగల్గిన సుగ్రీవునిమీఁదికోపముతోఁగూడిన మహాబాహుండగులక్ష్మణుండు సదాచారమననుసరించి స్త్రీలున్నప్రదేశమును వదలి యేకాంతంబున నుండెను. ౨౫

అంత వానరరాజయిన సుగ్రీవుఁడు అధనుష్టంకారధ్వనిచే లక్ష్మణుండు వచ్చెనని తెలిసికొని భయపడి ఉత్తమాసనమునుండి చలనము నొందెను.

పూర్వము నాకు అంగదుఁడు చెప్పినలాగున అన్నయందు అధికప్రీతిగలలక్ష్మణుం డిదిగో వచ్చినాఁడు. అని సుగ్రీవుండు తెలిసికొనెను. ౨౭

సుగ్రీవుండు అంగదుఁడు చెప్పినవిధంబుననె లక్ష్మణుండు వచ్చెనని

బుబుధే లక్ష్మణం ప్రాప్తం ముఖం చాస్య వ్యశుష్యత,

తత స్తారాం హరిశ్రేష్ఠ స్సుగ్రీవః ప్రియదర్శనామ్. ౩౦
ఉవాచ హిత మవ్యగ్ర స్త్రాససంభ్రాన్తమానసః,

కిన్ను తత్కారణం సుభ్రు! ప్రకృత్యా మృదుమానసః. ౩౧
సరోష ఇవ సంప్రాప్తో యే నాయం రాఘవానుజః,

కిం పశ్యసి కుమారస్య రోషస్థాన మనిన్దితే!. ౩౨
న ఖ ల్వకారణే కోప మాహరే న్నరసత్తమః,

య దస్య కృత మస్మాభి ర్బుధ్యసే కించి దప్రియమ్. ౩౩
తద్బుద్ధ్యా సంప్రధా ర్యాశు క్షిప్ర మర్హసి భాషితుమ్,
అథవా స్వయ మే నైనం ద్రష్టు మర్హసి భామిని!. ౩౪
వచనై స్సాన్త్వయుక్తైశ్చ ప్రసాదయితు మర్హసి,
త్వద్దర్శనవిశుద్ధాత్మా న స కోపం కరిష్యతి. ౩౫
నహి స్త్రీషు మహాత్మానః క్వచి త్కుర్వన్తి దారుణమ్,
త్వయా సాన్త్వై రుపక్రాన్తం ప్రసన్నేన్ద్రియమానసమ్. ౩౬
తతః కమలపత్త్రాక్షం ద్రక్ష్యా మ్యహ మరిన్దమమ్,

సా ప్రస్ఖలన్తీ మదవిహ్వలాక్షీ
ప్రలమ్బకాఞ్చీగుణహేమసూత్రా. ౩౭
సలక్షణా లక్ష్మణసన్నిధానం
జగామ తారా నమితాఙ్గయష్టిః,

వారియొక్క ధ్వనిచేఁ దెలిసికొనెను. అంత భయంబున నితని నోటిలోని ద్రవముకూడ నెండెను. ౨౯

అంత వానరశ్రేష్ఠుండగు సుగ్రీవుండు ఏమియుపాటులేనివాఁడై భయంబున మనంబు దొట్రుపాటునొందఁ జూపరులకుఁ బ్రియంబుగాఁ గిలికించుచున్నట్టి తారంజూచి తనకు హితముగువిధంబున నిట్లనిపలికెను. ౩౦

సుందరములయిన కనుబొమలుగల తారా! రామునితమ్ముఁడయిన యీలక్ష్మణుండు స్వభావంబున మృదువైనహృదయము గలవాఁడు అట్టివాఁ డిపుడు కుపితుఁడై వచ్చినట్లున్నదే! ఇందుకుఁ గారణమేమి? ౩౧

సద్గుణసంపన్నురాలవగు తారా! లక్ష్మణునికిఁ గోపముగలుగుటకుఁ గారణమేమని నీకుఁ దోఁచుచున్నది? కారణములేకయే పురుషోత్తముఁడు లక్ష్మణుఁడు కోపంబునొందఁడు. ౩౨

నేనేమైనను లక్ష్మణునకప్రియము గావించినట్లు నీకుజ్ఞాపకమున్నదా? నీవు శీఘ్రముగా బుద్ధిచే దానినాలోచించి నాకుఁ జెప్పుము. ౩౩

అంతకన్నను నీవే లక్ష్మణునియొద్దకుఁబోయి యాతనిఁ జూచి మాటలాడి మంచిమాటలచే నతనిఁ బ్రసన్నుం గావింపుము. ౩౪

గొప్పవారలు ఎప్పుడును స్త్రీలయందుఁ గోపంబుఁ జూపరుకావున లక్ష్మణుండు నిన్నుఁ జూచినంతనె ప్రసన్నుండగుఁ గాని కోపంబునొందఁడు.

నీవు లక్ష్మణుని సాంత్వవచనంబులఁ బ్రసన్నుం గావించినపిదపఁ గమలపత్రంబులంబోలు నయనంబులు గలవాఁడును శత్రువుల నడంగఁ ద్రొక్కువాఁడునగు లక్ష్మణుని నేను జూచెదను. అని సుగ్రీవుఁడు తారతోఁ జెప్పెను. ౩౫

ఆతార సంభోగవివశ యగుటంజేసి తొట్రుపాటుతో నడచుచుఁ బానమదంబునం దేలిపోవుచున్న కన్నులుగలదై మన్మథకేళిసలంబు వీడి వ్రేలుకాడుచున్న కాంచీగుణంబును బంగారుమొలత్రాడును గలదై సంభోగచిహ్నంబులతో నొప్పుచు స్తనభారంబువలనఁ గొంచెము వంగినశరీరముతో లక్ష్మణునిసమీపంబునకుఁ బోయెను. ౩౬

స తాం సమీక్ష్యైవ హరీశపత్నీం
తస్థా వుదాసీనతయా మహాత్మా. ౩౮
అవాఙ్ముఖోఽభూ న్మనుజేన్ద్రపుత్త్రః
స్త్రీసన్నికర్షా ద్వినివృత్తకోపః,

సా పానయోగా ద్వినివృత్తలజ్జా
దృష్టిప్రసాదాచ్చ నరేన్ద్రసూనోః. ౩౯
ఉవాచ తారా ప్రణయప్రగల్భం
వాక్యం మహార్థం పరిసాన్త్వపూర్వమ్,
కిం కోపమూలం మనుజేన్ద్రపుత్త్ర!
కస్తే న సంతిష్ఠతి వాఙ్నిదేశే. ౪౦
కశ్శుష్కవృక్షం వన మాపతన్తం
దవాగ్ని మాసీదతి నిర్విశఙ్కః,
స తస్యా వచనం శ్రుత్వా సాన్త్వపూర్వ మశఙ్కితమ్. ౪౧
భూయః ప్రణయదృష్టార్థం లక్ష్మణో వాక్య మబ్రవీత్,
కి మయం కామవృత్తస్తే లుప్తధర్మార్థసంగ్రహః. ౪౨
భర్తా భర్తృహితే యుక్తే న చైన మవబుధ్యసే,

న చిన్తయతి రాజ్యార్థం నాస్మాన్ శోకపరాయణాన్. ౪౩
సామాత్యపరిష త్తారే! పాన మే వోపసేవతే,

సమాసాం శ్చతురః కృత్వా ప్రమాణం ప్లవగేశ్వరః. ౪౪
వ్యతీతాం స్తా న్మదవ్యగ్రో విహార న్నావబుధ్యతే,

నహి ధర్మార్థసిద్ధ్యర్థం పాన మేవం ప్రశస్యతే. ౪౫

పరమభాక్తికుండగు నాలక్ష్మణుండు అట్లు మదవివశయయి సంభోగచిహ్నంబులతో వచ్చిన వానరరాజభార్యను దాఁ జూచినంతనె ఆమె యొక్క రూపసంపద పానమదము సంభోగరసపారవశ్యంబున వస్త్రము దొలంగియుండుట మొదలైనవానియందెంతమాత్రము మనసుంచక యుదాసీనుండై స్త్రీసన్నిధియగుటం జేసి కోపంబు నిగ్రహించి తలవంచుకొని యుండెను ౩౮

ఆతార మద్యమదంబునం జేసి తనయందుఁగల సంభోగచిహ్నములవలన లజ్జలేనిదై తాను వచ్చినంతనె లక్ష్మణుఁడు కోపంబులేకయుండుటవలన మైత్రిబలంబున ధైర్యంబుగానుండు ఆతని మంచిమాటలచేఁ బ్రసన్నుంగావించి అధికమయిన యర్థముగల యీమాటం జెప్పెను. ౩౯

దశరథమహారాజపుత్రుఁడవగు లక్ష్మణుఁడా! నీకుఁ గోపంబు గలుగుటకు ఏమి కారణము? నీనోటిమాటను ఎవ్వఁ డతిక్రమించినాఁడు? ఎవ్వఁడు నిర్భయుఁడై ఎండినయడవిం బ్రజ్వలించుచున్న దావానలంబుచెంతకుఁ బోఁగలఁడు? అని తార లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౦

తార యట్లు సాంత్వపూర్వకముగాఁ జెప్పిన నిష్కపటంబును స్నేహయుక్తంబునగు మాటనువిని లక్ష్మణుఁ డిట్లని పలికెను. ౪౧

పెనిమిటియొక్క హితమునం దాసక్తురాలవగుతారా! నీపెనిమిటియయిన యీసుగ్రీవుఁడు మన్మథవ్యాపారంబులఁ దగిలి ధర్మార్థంబులం జూడకున్నాఁడు. నీకిది తెలియదాయేమి? ౪౨

తారా! సుగ్రీవుఁడు రాచకార్యమును జూడఁడు. దుఃఖితులమగు మమ్ముగూడఁ దలంపఁడు. మంత్రులుం దానును ఎల్లప్పుడును పానమునే సేవించుచున్నాఁడు. ౪౩

వానరరాజయినసుగ్రీవుఁడు యుద్ధసన్నాహమునకు నాలుగు మాసములవధియుంచుకొనివచ్చి యిప్పుడు మదలోలుఁడై విహరించుచు ఆనాలుగు మాసములు గడచినను దెలియకున్నాఁడు ౪౪

ధర్మార్థంబులు గోరువాఁడు ఇట్లు మద్యపానంబునఁ దగిలియుండుట

పానాదర్థ శ్చ ధర్మ శ్చ కామ శ్చ పరిహీయతే,

ధర్మలోపో మహాం స్తావత్కృతే హ్యప్రతికుర్వతః. ౪౬
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్,

మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్. ౪౭
త ద్ద్వయంతు పరిత్యక్తం నతు ధర్మే వ్యవస్థితమ్,

త దేవం ప్రస్తుతే కార్యే కార్య మస్మాభి రుత్తరమ్. ౪౮
య త్కార్యం కార్యతత్త్వజ్ఞే! త దుదాహర్తు మర్హసి,

సా తస్య ధర్మార్థసమాధియుక్తం
నిశమ్య వాక్యం మధురస్వభావమ్. ౪౯
తారా గతార్థే మనుజేన్ద్రకార్యే
విశ్వాసయుక్తం త మువాచ భూయః,
న కోపకాలః క్షితిపాలపుత్త్ర!
న చాతికోప స్స్వజనే విధేయః. ౫౦
త్వదర్థకామస్య జనస్య తస్య
ప్రమాద మ ప్యర్హసి వీర! సోఢుమ్,

కోపం కథం నామ గుణప్రకృష్టః

యొంతమాత్రము యుక్తముగాదు. పానంబువలన అర్థంబును ధర్మంబును నశించుటయగాక పిమ్మటఁ గామంబును నాశంబునొందును. ౪౫

ఉపకారముజేసినవానికిఁ బ్రత్యుపకారము చేయకయుండిన ధర్మలోపము అధికముగా సంభవించును. అట్లు ప్రత్యుపకారము సేయమిచేత గుణవంతుఁడగు మిత్రుఁడు నశించినప్పుడు అధికముగా నర్థలోపంబును గామలోపంబునుం గలుగును. ౪౬

సత్యంబునందును ధర్మమునందును స్థిరుఁడగుమిత్రుఁడు అర్థకామంబులకు మూలమగుటవలన వానికన్నను అధికుఁడు. అట్టిమిత్రుని విడుచుచున్నాఁడు కావున నీసుగ్రీవునకు అర్థకామంబులు నశించుటయగాక ధర్మంబు గూడ నశించును. ౪౭

కార్యముల తత్త్వము దెలిసినవాఁడా! అంగనాసక్తుఁడైన సుగ్రీవుఁ డిట్లు తనకు ధర్మార్థకామంబులు చెడునట్లు ఉపకారంబునకుఁ బ్రత్యుపకారంబు సేయక మిత్రుల నుపేక్షించినపుడు అతనిపైని మేము ఏమిచేయవలయునో నీవే వచింపుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౮

ఆచార ధర్మార్థంబులతోఁ గూడినదియు మనోహరంబునగు లక్ష్మణుని మాటను విని రాముఁడు లక్ష్మణునిఁ బంపినందుకుఁ బ్రయోజనంబు దెలిసికొన్నవాఁడై లక్ష్మణునకు నమ్మకము గలుగునట్లు మఱల నిట్లని పలికెను. ౪౯

వీరుఁడవగు లక్ష్మణుఁడా! కామవశుఁడగుసుగ్రీవునిమీఁదఁ గోపగించుట యుక్తము కాదు. మఱియు మీకు మిత్రుఁడగువానియందు ఇట్లధిక కోపము సేయవచ్చునా? ఈసుగ్రీవుఁడు మీకార్యమును సాధించుట యందె మిక్కిలియు నాసక్తుఁడై యున్నవాఁడు. కావున నిపుడు ఇతఁడు కామవశతంజేసి మీకార్యము విషయమయి కొంచె మేమఱియున్నను నీవు సహింపవలెను. ౫౦

లక్ష్మణుఁడా! వీర్యాదిగుణములచే నధికుఁడగువాఁడు తనకన్న బలహీ

కుమార! కుర్యా దపకృష్టస త్త్వే. ౫౧
క స్త్వద్విధః కోపవశం హి గచ్ఛే
త్సత్త్వావరుద్ధ స్తపసః ప్రసూతిః,
జానామి రోషం హరివీరబన్ధో
ర్జానామి కార్యస్య చ కాలసఙ్గమ్. ౫౨
జానామి కార్యం త్వయి యత్కృతం న
స్తచ్చాపి జానామి యదత్ర కార్యమ్,

తచ్చాపి జానామి యథా విషహ్యం
బలం నరశ్రేష్ఠ! శరీరజస్య. ౫౩
జానామి యస్మింశ్చ జనేఽవబద్ధం
కామేన సుగ్రీవ మసక్త మద్య,
న కామతన్త్రే తవ బుద్ధి రస్తి
త్వం వై యథా మన్యువశం ప్రపన్నః. ౫౪
న దేశకాలౌ హి న చార్థధర్మా
వవేక్షతే కామరతి ర్మనుష్యః,

తం కామవృత్తం మమ సన్నికృష్టం
కామాభియోగా చ్చ నివృత్తలజ్జమ్. ౫౫
క్షమస్వ తావ త్పరవీరహన్త!
స్త్వద్భ్రాతరం వానరవంశనాథమ్,
మహర్షయో ధర్మతపోభికామాః
కామానుకామాః ప్రతిబద్ధమోహాః. ౫౬
అయం ప్రకృత్యా చపలః కపి స్తు
కథం న సజ్జేత సుఖేషు రాజా,

ముండగు నల్పునిపైఁ గోపంబునొందవచ్చునా? సత్త్వగుణసమేతుఁడును తపోనిధియు నగు నీయట్టి మహాపురుషుఁ డెక్కడనైనను గోపావేశమునకు లోఁబడుట యుక్తమా? ౫౧

సుగ్రీవునకుఁ బరమమిత్రుఁడయినను రాముఁడు కోపంబునొందుట నెఱుఁగుదును. అందుకుఁ గారణము సుగ్రీవుఁడు సీతాన్వేషణప్రయత్నము విషయమయి జాగుసేయుటయు నాకుఁ దెలియును. నీవు మాకు ఏమిగావించితివో ఆమహోపకారమునుగూడ ఎఱుఁగుదును. అందుకుబదులు మే మేమి చేయవలెనో అదియు నాకుఁ దెలియును. ౫౨

లక్ష్మణుఁడా! మన్మథునకు లోఁబడినవాఁడవు కావు. కావున నీవు పురుషోత్తముఁడవు. మన్మథునిశక్తి సహించుట కష్టమయినసంగతియు నాకుఁ దెలియును. ఈసుగ్రీవుఁడు మన్మథాధీనుఁడై యేస్త్రీలయందుఁ దగిలియున్నాఁడో ఆస్త్రీలశక్తియు నాకుఁ దెలియును. ౫౩

నీవిట్లు కోపమునొందుటను జూడఁగా మాకువలె నీకంతగా మన్మథవ్యాపారమునందు జ్ఞానములేనట్లు తోఁచుచున్నది. ఏలయనఁగా మన్మథవ్యాపారపరుండగు మనుష్యుఁడు దేశకాలంబులంగాని ధర్మార్థంబులంగాని చూడఁడు. నీకును మన్మథతంత్రపరిజ్ఞాన మున్నయెడ సుగ్రీవునివిషయమయి నీకిట్లు కోపము గలుగదు. ౫౪

శత్రువీరుల వధించువట్టి లక్ష్మణుఁడా! నాసమీపంబున నున్నవాఁడగుటం జేసి మన్మథవ్యాపారంబులం దగిలి మన్మథావిష్టుం డగుటవలన నిర్లజ్జుఁడైయున్న నీతోఁబుట్టువును వానరేశ్వరు సుగ్రీవుని ఇంతవఱకు క్షమింపుము.

ధర్మంబునే యవలంబించి తపశ్చరణపరులయినవారలును మోహమును జయించిన వారలునగు మహర్షులుగూడ మన్మథునకు లోఁబడుచున్నారు. ఇఁక స్వభావంబుననె చపలుండగు వానరుఁడైన యీసుగ్రీవుఁడు కామసుఖంబులం దగులుట యేమియాశ్చర్యము? అని తార లక్ష్మణునితోఁ జెప్పెను.

ఇత్యేవ ముక్త్వా వచనం మహార్థం
సా వానరీ లక్ష్మణ మప్రమేయమ్. ౫౭
పున స్సఖేలం మదవిహ్వలం చ
భర్తు ర్హితం వాక్య మిదం బభాషే,
ఉద్యోగ స్తు చిరాజ్ఞ ప్త స్సుగ్రీవేణ నరోత్తమ!. ౫౮
కామ స్యాపి విధేయేన తవార్థప్రతిసాధనే,

ఆగతా హి మహావీర్యా హరయః కామరూపిణః. ౫౯
కోటీశతసహస్రాణి నానానగనివాసినః,
త దాగచ్ఛ మహాబాహో! చారిత్రంరక్షితం త్వయా. ౬౦
అచ్ఛలం మిత్ర భావేన సతాం దారావలోకనమ్,

తారయా చాభ్యనుజ్ఞాత స్త్వరయా చాపి చోదితః. ౬౧
ప్రవివేశ మహాబాహు రభ్యన్తర మరిన్దమః,

తత స్సుగ్రీవ మాసీనం కాఞ్చనే పరమాసనే. ౬౨
మహార్హా స్తరణోపేతే దద ర్శాదిత్యసన్నిభమ్,
దివ్యాభరణచిత్రాఙ్గం దివ్యరూపం యశస్వినమ్. ౬౩
దివ్యమాల్యామ్బరధరం మహేన్ద్ర మివ దుర్జయమ్,
దివ్యాభరణమాల్యాభిః ప్రమదాభి స్సమావృతమ్. ౬౪

ఆ తార యిట్లు అప్రమేయుఁడగు లక్ష్మణునితో అధికమయిన యర్థముగలమాటలు పలికి మరల లక్ష్మణునింజూచి విలాసంబును బానమదంబుచేఁ బొట్రుపాటును గనుఁగొనఁ దనపెనిమిటికి హితకరంబగు నీమాటం జెప్పెను. ౧౭

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! సుగ్రీవుఁడు మన్మథవ్యాపారపరుఁడై యున్నను మఱియు నూరకున్నవాఁడు కాఁడు. మీకార్యమును సాధించుటకై ప్రయత్నము సేయుటకు మాత్రము చాలకాలము క్రిందనే వానరుల కాజ్ఞాపించినాఁడు. ౧౮

మహాపరాక్రమశాలులును గామరూపులు నగు వానరవీరులు నానాపర్వతంబులనుండి అనేకలక్షలకోట్లమంది వచ్చియున్నారుగదా! ౧౯

మహాబాహుఁడవగు లక్ష్మణుఁడా! అట్లుకావున లోపలికి రమ్ము. నీవు అంతఃపుర స్త్రీలున్నచోటికి రాఁగూడదని దూరముననే నిలుచుటచేత సదాచారము ననుష్ఠించినవాఁడవైతివి. తనమిత్రులగు వారిభార్యలను జూచుట దోషములేదు. అని తార లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౦

మహాబాహుఁడును శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలినవాఁడునగు లక్ష్మణుండు తారయు లోనికిరమ్మని పిలుచుటవలనను రామకార్యమునందలి త్వరవలనను అంతఃపురంబులోనికిఁ బోయెను. ౨౧

అంత లక్ష్మణుఁడు ఉత్తమమయిన యాస్తరణముతోఁ గూడిన కాంచనమయంబగు సింహాసనంబునంగూర్చున్నవాఁడును సూర్యసమానుఁడును ఉత్తమంబులగు నాభరణంబులు ధరించినవాఁ డగుటంజేసి నానావర్ణములయిన తత్కాంతులతో నొప్పుచున్నవాఁడును శ్రేష్ఠమయిన రూపము గలవాఁడును కీర్తిసంపన్నుఁడును శ్రేష్ఠములయిన పూలమాలికలను వస్త్రంబులను ధరించినవాఁడును దేవేంద్రుఁడుఁబోలె దుర్జయుండును దివ్యంబులగు భూషణంబులును మాలికలును ధరించిన స్త్రీలచేఁ బరివేష్టితుఁడై యున్నవాఁడునగు సుగ్రీవుం జూచెను. ౨౨-౨౪

సంరబ్ధతరరక్తాక్షో బభూ వాన్తకసన్నిభః,

రుమాం తు వీరః పరిరభ్య గాఢం
వరాసనస్థో వర హేమవర్ణః. ౬౭
దదర్శ సౌమిత్రి మదీనసత్త్వం
విశాలనేత్ర స్సువిశాలనేత్రమ్.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రయస్త్రింశ స్సర్గః. 33.

---

## చతుస్త్రింశ స్సర్గః.

త మప్రతిహతం క్రుద్ధం ప్రవిష్టం పురుషర్షభమ్,
సుగ్రీవో లక్ష్మణం దృష్ట్వాబభూవ వ్యథి తేన్ద్రియః. ౧

క్రుద్ధం నిశ్వసమానం తం ప్రదీప్త మివ తేజసా,
భ్రాతు ర్వ్యసనసంతప్తం దృష్ట్వా దశరథాత్మజమ్. ౨
ఉత్పపాత హరిశ్రేష్ఠో హిత్వా సౌవర్ణ మాసనమ్,
మహా న్మహేన్ద్రస్య యథా స్వలంకృత ఇవ ధ్వజః. 3

ఉత్పత న్త మనూత్పేతూ రుమాప్రభృతయః స్త్రియః,
సుగ్రీవం గగనే పూర్ణచన్ద్రం తారాగణా ఇవ. ౪

సంరక్తనయనః శ్రీమా న్సంచచాల కృతాఞ్జలిః,
బభూ వావస్థిత స్తత్ర కల్పవృక్షో మహా నివ. ౫

లక్ష్మణుఁడు అట్లు స్త్రీలనడుమఁ జేరోలగంబునఁ గామతంత్రుఁడై యున్న సుగ్రీవుం జూచి పరమకుపితుఁడై యొఱ్ఱనికన్నులతో యమునివలె భయంకరుఁ డయ్యెను.

అట్లు రుమను గాఢంబుగాఁ గౌఁగిటం జేర్చి సింహాసనంబునం గూర్చుండియున్న తప్తకాంచనవర్ణుండును విశాలంబులగు కన్నులుకలవాఁడునగు సుగ్రీవుఁడు మఱియు విశాలములయిన నయనంబులుగలవాఁడును మహాబలుండు నగు లక్ష్మణుం జూచెను. ౬౫

ఇది ముప్పదిమూఁడవసర్గము.

---

## ముప్పదినాలుగవ సర్గము.

అట్లంతఃపురంబు ప్రవేశించి తనయొద్దకువచ్చిన ఎదురులేనివాఁడును గుపితుఁడును బురుషశ్రేష్ఠుఁడునగు లక్ష్మణుం జూచి సుగ్రీవుఁడు భయంబు నొందెను. ౧

అన్నయగురామునకు వ్యసనముఁగలుగుటకై పరితపించుచుఁ గుపితుఁడై యూర్పులు నిగుడించుచుఁ దేజోవిశేషంబున మండినట్లున్న దశరథకుమారు లక్ష్మణుంజూచి సుగ్రీవుఁడు ఉన్నతంబగు కాంచనసింహాసనంబునుండి నేలకు డిగ్గి యుత్సవార్థమయి యెత్తఁబడు నలంకృతమయిన దేవేంద్రధ్వజమువలె లేచి నిలుచుండెను. ౨,౩

ఆకాశమునం బూర్ణచంద్రుఁ డుదయింపఁగానే వెంబడి నక్షత్రము లుదయించునట్లు సుగ్రీవుఁడు లేవఁగానే యతనివెంబడి రుమ మొదలగు స్త్రీ లందఱు లేచిరి. ౪

పానమదంబునను మన్మథావేశంబునను మిక్కిలియు నెఱ్ఱనైన నయనంబులతోఁగూడిన శ్రీమంతుఁడగు సుగ్రీవుఁడు చేమోడ్పుగీలించి లక్ష్మణు నెదుర్కొని గొప్పకల్పవృక్షంబువలె నిలువఁబడియుండెను. ౫

రుమాద్వితీయం సుగ్రీవం నారీమధ్యగతం స్థితమ్,
అబ్రవీ ల్లక్ష్మణః క్రుద్ధ స్సతారం శశినం యథా. ౬

సత్త్వాభిజనసంపన్న స్సానుక్రోశో జితేన్ద్రియః,
కృతజ్ఞ స్సత్యవాదీ చ రాజా లోకే మహీయతే. ౭

యస్తు రాజా స్థితోఽధర్మే మిత్రాణా ముపకారిణామ్,
మిథ్యాప్రతిజ్ఞాం కురుతే కో నృశంసతర స్తతః. ౮

శత మశ్వానృతే హన్తి సహస్రంతు గవానృతే,
ఆత్మానం స్వజనం హన్తి పురుషః పురుషానృతే. ౯

పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతికరోతి యః,
కృతఘ్న స్సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర!. ౧౦

గీతోఽయం బ్రహ్మణా శ్లోక స్సర్వలోకనమస్కృతః,
దృష్ట్వా కృతఘ్నం క్రుద్ధేన త న్నిబోధ ప్లవఙ్గమ!. ౧౧

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా,
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. ౧౨

నక్షత్రంబులనడుమఁ జంద్రుఁడుంబోలె స్త్రీలనడుమ నున్నవాఁడును రుమాసహితుఁడు నై నిలుచున్న సుగ్రీవుం జూచి లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై యిట్లని పలికెను. ౭

బలవంతుండును సత్కులప్రసూతుండును ఆర్తులయెడఁ గనికరము గలవాఁడును జితేంద్రియుఁడును కృతజ్ఞుఁడును సత్యంబు పలుకువాఁడునగు రాజు లోకంబునం గొనియాడఁబడును. ౮

ఏరాజయినే అధర్మపరుఁడై తనకుమున్నుపకారము గావించిన మిత్రులకు అసత్యమయిన ప్రతిజ్ఞ చేయునో అతనికన్నను పాపిష్ఠుఁడు ప్రపంచంబున నెవ్వఁడును లేఁడు. ౯

పురుషుఁడు ఒకగుఱ్ఱము విషయమయి యసత్య మాడినయెడ నూఱు గుఱ్ఱములను వధించినపాపమును బొందును. గోవువిషయమయి యసత్యమాడిన యెడ వేయిగోవులం జంపిన దోషమునొందును. అట్లు పురుషునివిషయమయి యసత్యమాడినపక్షమున ఆత్మహత్యయు స్వజనహత్యయుఁ జేసినపాపము నొందును. ఇఁక మహాపురుషుఁడగు రామునివిషయమయి యసత్యమాడినం జెప్పవలయునా? ౧౦

వానరరాజా! ముందు మిత్రులచేఁ దనకార్యము చేయించుకొని మాట ప్రకారము ఎవఁడు తనకార్యము గావించి యామిత్రులకార్యమును జేయఁడో అతఁడు కృతఘ్నుఁ డనఁబడును. అతని నేప్రాణికాని వధింపవచ్చును.

వానరుఁడా! పూర్వము స్వాయంభువమనువు కృతఘ్నునిఁజూచి కుపితుఁడై సమస్తలోకములచేతను బూజింపఁబడుచున్నయీశ్లోకమును జెప్పెను. దానిం బఠించెద వినుము. ౧౧

మహాపాతకములైన బ్రహ్మహత్య సురాపానము బ్రాహ్మణస్వర్ణస్తేయము గురుభార్యాగమనము గావించినవారలకుఁ బ్రాయశ్చిత్తము పెద్దలచే విధింపఁబడియున్నదిగాని కృతఘ్నునకుమాత్రము ప్రాయశ్చిత్తమేలేదు. అని స్వాయంభువమనువు చెప్పెను. ౧౨

అనార్య స్త్వం కృతఘ్న శ్చ మిథ్యావాదీ చ వానర!,
పూర్వం కృతార్థో రామస్య న తత్ప్రతికరోషి యత్. ౧౩

నను నామ కృతార్థేన త్వయా రామస్య వానర,
సీతాయా మార్గణే యత్నః కర్తవ్యః కృత మిచ్ఛతా. ౧౪

స త్వం గ్రామ్యేషు భోగేషు సక్తో మిథ్యాప్రతిశ్రవః,
న త్వాం రామో విజానీతే సర్పం మణ్డూకరావిణమ్. ౧౫

మహాభాగేన రామేణ పాపః కరుణవేదినా,
హరీణాం ప్రాపితో రాజ్యం త్వం దురాత్మా మహాత్మనా. ౧౬
కృతం చే న్నాభిజానీషే రామ స్యాక్లిష్టకర్మణః,
సద్య స్త్వం నిశితై ర్బాణై ర్హతో ద్రక్ష్యసి వాలినమ్. ౧౭

న చ సంకుచితః పన్థా యేన వాలీహతో గతః,
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపథ మన్వగాః. ౧౮

న నూన మిక్ష్వాకువరస్య కార్ముక
చ్చ్యుతాఞ్ శరా న్పశ్యసి వజ్రసన్నిభాన్,

సుగ్రీవుఁడా! నీవు ముందుగా రామునిచే నీకార్యము చేయించుకొని కృతార్థుఁడవయి పిమ్మట నీవు చెప్పినమాటప్రకారము రామునికార్యమును గావింపక మాట దప్పితివి కావున నీవు దుర్మార్గుఁడవు కృతఘ్నుఁడవు అసత్యము పలికినవాఁడవు నైతివి. ౧౩

ఓయి వానరుఁడా! నీవు కృతఘ్నుఁడవుగాక రాముఁడు నీకుఁ జేసిన యుపకారమును మఱవకయే యున్నవాఁడవగుదువేని రామునిచే నీవు కృతార్థుఁడవైతివి కావున నీవు తగిన ప్రయత్నముచేసి సీతను వెదకింపవలయును గదా! ౧౪

కప్పలను మ్రింగుటకై కప్పలు దనసమీపంబునకు వచ్చుటకు సర్పము కప్పవలె నఱచునట్లు నీవు మొదట కార్యార్థము సత్యవంతుఁడవుగా వర్తించి యిపుడు గ్రామ్యంబులగు విషయసుఖంబులం దగిలి ప్రతిజ్ఞదప్పినావు. నీవు కప్పవలె నఱచునట్టి సర్పమువంటివాఁడ వని రామునకుఁ దెలియలేదు. ౧౫

మహానుభావుఁడును దయానిధియును మహాత్ముఁడునగు రాముఁడు నీవు దురాత్ముఁడవు పాపిష్ఠుఁడవని తెలియక నీకు వానరరాజ్యం బొసంగెను. ౧౬

నీవు ఎంతటి కార్యమునైనను శ్రమములేకయ గావించునట్టి రాముఁడు గావించిన యుపకారమును మఱతువేని యిప్పుడే తీక్ష్ణబాణంబుల నిన్ను వధించి వాలియొద్ద కనిపెదను. ౧౭

సుగ్రీవుఁడా! వాలి హతుఁడై యేమార్గమునం బోయినాఁడో ఆ దారి యిపుడు మూయఁబడినదికాదు; కావున నీవు చేసినప్రతిజ్ఞను నెఱవేర్పుము; వాలి పోయినమార్గంబునం బోకుము. ౧౮

నీవు ఇక్ష్వాకువంశంబునం బుట్టినవారిలో నుత్తముఁడగు రామునిధనుస్సునుండి వెడలినట్టి వజ్రసమానంబులగు బాణంబులను ఇంకను జక్కఁగాఁ జూచినవాఁడవుకావు కాఁబోలు; కావుననే యిట్లు మనసుననైనను రామకా

తత స్సుఖం నామ నిషేవసే సుఖీ
న రామకార్యం మనసాఽప్యవేక్షసే. ౧౯

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుస్త్రింశ స్సర్గః. ౩౪.

---

## పఞ్చత్రింశ స్సర్గః.

తథా బ్రువాణం సౌమిత్రిం ప్రదీప్తమివ తేజసా,
అబ్రవీ ల్లక్ష్మణం తారా తారాధిపనిభాననా. ౧

నైవం లక్ష్మణ! వక్తవ్యో నాయం పరుష మర్హతి,
హరీణాం మీశ్వర శ్శ్రోతుం తవ వక్త్రా ద్విశేషతః. ౨

నైవాకృతజ్ఞ స్సుగ్రీవో న శఠో నాపి దారుణః,
నైవానృతకథో వీర! న జిహ్మశ్చ కపీశ్వరః. ౩

ఉపకారం కృతం వీరో నాప్యయం విస్మృతః కపిః,
రామేణ వీర! సుగ్రీవో య దన్యై ర్దుష్కరం రణే. ౪

రామప్రసాదా త్కీర్తిం చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
ప్రాప్తవా నిహ సుగ్రీవో రుమాంమాం చ పరన్తప!. ౫

సుదుఃఖం శయితః పూర్వం ప్రాప్యేదం సుఖ ముత్తమమ్,
ప్రాప్తకాలం నజానీతే విశ్వామిత్రో యథా మునిః. ౬

ర్యంబు దలఁపక విషయసుఖంబుల ననుభవించుచు ఎంతమాత్రము భయము లేక సుఖముగా నున్నావు. అని లక్ష్మణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౯

ఇది ముప్పదినాలుగవసర్గము.

---

## ముప్పదియైదవసర్గము.

అట్లు పరుషంబుగాఁ బలుకుచుఁ దేజోవిశేషంబున మండుచున్నట్లున్న సుమిత్రాపుత్త్రుఁడగు లక్ష్మణుం జూచి చంద్రబింబమువంటి మొగంబుగలతార యిట్లని చెప్పెను. ౧

లక్ష్మణుఁడా! నీ విట్లు చెప్పవలదు; వానరేశ్వరుఁడగు నీసుగ్రీవుఁడు పరుషవాక్య మాడఁదగినవాఁడుగాఁడు; అందుఁ బ్రియమిత్త్రుఁడవయిన నీవే యిట్లు పరుషమాడుట యుక్తమా? ౨

వీరుఁడవగు లక్ష్మణుఁడా! వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు కృతఘ్నుఁడుగాని వంచకుఁడుకాని క్రూరుఁడుకాని అనృతమాడువాఁడుకాని కుటిలుఁడుకాని యెంతమాత్రము కాఁడు. ౩

వీరుఁడవగు లక్ష్మణుఁడా! వీరుఁడగు నీసుగ్రీవుఁడు రాముఁడు తనకు యుద్ధంబునఁ గావించిన యితరులకుఁ జేయనసాధ్యమగు మహోపకారము నెంతమాత్రము మఱచినవాఁడును కాఁడు. ౪

శత్రువులఁ దపింపఁజేయునట్టి లక్ష్మణుఁడా! రామునను గ్రహంబుననే సుగ్రీవుఁ డిపుడు యశస్సును శాశ్వతంబయిన వానరరాజ్యంబును భార్యయగు రుమను నన్నును బొందినాఁడు. ౫

ఈసుగ్రీవుఁడు మున్ను బహుకాలము చాలఁగష్టముతోఁ గొండలపై ఱాళ్లఱప్పలలో నొంటిమెయిం బరుండియున్నవాఁడు కావున నిపుడు ఇమ్మహాసుఖమునుబొంది మున్ను విశ్వామిత్రమహాముని మేనకంగూడి కాలమును మఱచినట్లు రామునితోఁ జెప్పిన సంకేతకాలము వచ్చినసంగతి తెలియకున్నాఁడు. ౬

ఘృతాచ్యాం కిల సంసక్తో దశవర్షాణి లక్ష్మణ!,
అహోఽమన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః. ౭

సహి ప్రాప్తం న జానీతే కాలం కాలవిదాం వరః,
విశ్వామిత్రో మహాతేజాః కింపున ర్యః పృథగ్జనః. ౮

దేహధర్మం గత స్యాస్య పరిశ్రాన్తస్య లక్ష్మణ!,
అవితృప్తస్య కామేషు రామ క్షన్తు మి హార్హసి. ౯

నచ రోషవశం తాత! గన్తు మర్హసి లక్ష్మణ!,
నిశ్చయార్థ మవిజ్ఞాయ సహసా ప్రాకృతో యథా. ౧౦
స త్త్వయుక్తా హి పురుషా స్త్వద్విధాః పురుషర్షభ!,
అవిమృశ్య న రోషస్య సహసా యాన్తి వశ్యతామ్. ౧౧

ప్రసాదయే త్వాం ధర్మజ్ఞ! సుగ్రీవార్థే సమాహితా,
మహా న్రోషసముత్పన్న స్సంరమ్భ స్త్యజ్యతా మయమ్. ౧౨

రుమాం మాం కపిరాజ్యం చ ధనధాన్యవసూని చ,
రామప్రియార్థం సుగ్రీవ స్త్యజే దితి మతి ర్మమ. ౧౩

సమానేష్యతి సుగ్రీవ స్సీతయా సహ రాఘవమ్,
శశాఙ్క మివ రోహిణ్యా నిహత్యా రావణం రణే. ౧౪
శతకోటిసహస్రాణి లఙ్కాయాం కిల రాక్షసాః,
అయుతాని చ షట్త్రింశ త్సహస్రాణి శతాని చ. ౧౫

లక్ష్మణుఁడా! పూర్వము మహాతపస్సంపన్నుఁడగు విశ్వామిత్రమహాముని మేనకతోఁగూడి మన్మథసుఖంబులం దగిలి పదిసంవత్సరముల నొక పగలుగాఁ దలంచెనుగదా! ౭

మహాతపస్సంపన్నుఁడును సమస్త ధర్మములను దెలిసినవాఁడును కాలజ్ఞులలో నుత్తముఁడునగు మహర్షి యయిన విశ్వామిత్రుఁడే మన్మథసుఖంబులం దగిలి కాలము నెఱుఁగఁడయ్యె. ఇఁక నితరునిసంగతి చెప్పనేల? ౮

లక్ష్మణుఁడా! బహుకాలము కష్టపడి యలసి యిపుడు శరీరస్వభావమయిన మన్మథవ్యాపారమునం జిక్కి మన్మథసుఖంబులం దృప్తిం జెందక చపలుఁడైయున్నవాఁడు కావున సుగ్రీవుఁడు స్త్రీలోలుఁడైయున్నాఁడన్న తప్పు నిపుడు క్షమింపుము. ౯

నాయనా లక్ష్మణుఁడా! నీవు సుగ్రీవుని వాస్తవాభిప్రాయము దెలియక యాలోచింపక ప్రాకృతునియట్లు కోపమునొందుట యుక్తముకాదు. ౧౦

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! నీయట్టి సత్త్వగుణవంతులగు మహాపురుషులు యుక్తాయుక్తంబులు విమర్శింపక తటాలునఁ గోపంబు వహింతురా? ౧౧

లక్ష్మణుఁడా! నీవు సమస్తధర్మములు దెలిసినవాఁడవు; సుగ్రీవుని నిమిత్తమయి నేను వేఁడుకొనుచున్నాను; ఈమహాక్రోధంబును సంభ్రమంబును వదలి ప్రసన్నుండ వగుము. ౧౨

రామునంతో పార్థనయి సుగ్రీవుఁడు భార్యయగు రుమను నన్నును వానరరాజ్యమును ధనములను ధాన్యములను రత్నములను సర్వమును విడుచుదని నాయభిప్రాయము. ౧౩

సుగ్రీవుఁడు యుద్ధంబున రావణుని వధించి రోహిణీచంద్రులకుం బోలె సీతకును రామునకును సమాగమంబు సేయఁగలఁడు. ౧౪

లంకాపురియందు రాక్షసులు లక్షకోటుల మూఁడులక్షల యఱువది వేలమంది యుండుటయగాక మఱియుఁబెక్కు లక్షల రాక్షసు లున్నారు. ౧౫

అహత్వా తాంశ్చ దుర్ధర్షా న్రాక్షసా న్కామరూపిణః,
న శక్యో రావణో హన్తుం యేన సా మైథిలీ హృతా. ౧౬
తేన శక్యో రణే హన్తు మసహాయేన లక్ష్మణ!,
రావణః క్రూరకర్మా చ సుగ్రీవేణ విశేషతః. ౧౭

ఏవ మాఖ్యాతవా న్వాలీ స హ్యభిజ్ఞో హరీశ్వరః,
ఆగమస్తు న మే వ్యక్త శ్శ్రవా త్తస్మాద్బ్రవీ మ్యహమ్. ౧౮

త్వత్సహాయనిమిత్తం వై ప్రేషితా హరిపుఙ్గవాః,
ఆనేతుం వానరా న్యుద్ధే సుబహూ న్హరియూథపాన్. ౧౯
తాంశ్చ ప్రతీక్షమాణోఽయం విక్రాన్తాం స్సుమహాబలాన్,
రాఘవ స్యార్థసిద్ధ్యర్థం న నిర్యాతి హరీశ్వరః. ౨౦

కృతా తు సంస్థా సౌమిత్రే! సుగ్రీవేణ యథా పురా,
అద్య తై ర్వానరై స్సర్వై రాగన్తవ్యం మహాబలైః. ౨౧

ఋక్షకోటిసహస్రాణి గోలాఙ్గూలశతాని చ,
అద్య త్వా ముపయాస్యన్తి జహి కోప మరిన్దమ!. ౨౨
కోట్యోఽనేకా స్తు కాకుత్స్థ! కపీనాం దీప్తతేజసామ్,
తవ హి ముఖ మిదం నిరీక్ష్య కోపా
త్క్షతజనిభే నయనే నిరీక్షమాణాః,

మహాబలశాలులును గామరూపులునగు నారాక్షసుల నందఱ వధించి కాని సీతం గొనిపోయిన రావణుని వధింప నలవిగాదు. ౧౬

లక్ష్మణుఁడా! యుద్ధంబున నారాక్షసులను వధించుట వానరసైన్య సాహాయ్యము లేనియెడ సుగ్రీవునకు శక్యముగాదు; భయంకరములయిన కార్యములు సేయునట్టి రావణుని వధించుట మఱియు శక్యముకాదు. ౧౭

వానరేశ్వరుఁడగు వాలి ఈరావణునిసంగతియంతయుఁ దెలిసినవాఁడు కావున ఈవిషయము చెప్పినాఁడు. నాకేమో సాక్షాత్తుగాఁ దెలియదు. అతనివలన వింటిని గావునఁ జెప్పుచున్నాను. ౧౮

మీ కార్యార్థమయియే యుద్ధమునిమిత్తము వానరవీరుల నందఱను దీసికొనివచ్చుటకై సుగ్రీవుఁడు వానరులం బంపియున్నాఁడు. ౧౯

ఈవానరరాజు సుగ్రీవుఁడు పరాక్రమవంతులును మహాబలశాలులునగు నావానరవీరుల రాక నెదురుచూచుచున్నాఁడు కావున రామకార్యార్థమయి యింకఁ బ్రయత్నింపలేదు. ౨౦

లక్ష్మణుఁడా! నీవు వచ్చుటకు మున్నే సుగ్రీవుఁడు రామకార్యార్థము వానరులసైన్యములన్నియు నిచటికి వచ్చుటకై, "త్రిపంచరాత్రాదూర్ధ్వం యః ప్రాప్నుయాన్నేహ వానరః, తస్య ప్రాణాంతికో దండో నాత్ర కార్యా విచారణా" (పదునైదుదినములకుమీఁద ఏవానరుఁడిచటికిరాకయుండునో అతనికి మరణదండనము విధింపఁబడును. ఇందు సందియములేదు.) అని యాజ్ఞ గావించియున్నాఁడు. కావున ఆప్రకారమున మహాబలశాలులగు వానరులందఱు నేఁటిదినమున నిచటికి రావలయును. ౨౧

శత్రువులవధించునట్టి లక్ష్మణుఁడా! మహాతేజులగు పెక్కుకోట్లవానరులును బెక్కువేలకోట్ల భల్లూకవీరులును అనేకులు గోలాంగూలవీరులును ఇపుడు నిన్ను సేవింపఁగలరు. కోపమువదలి ప్రసన్నుఁడవగుము. ౨౨

సుగ్రీవుని భార్యలందఱు నీముఖంబుఁజూచి మున్ను వాలివధభయము ననుభవించినవారగుటంజేసి యట్లేమేని యగునో యని సందేహించినవార

హరివరవనితా న యాన్తి శాన్తిం
ప్రథమభయస్య హి శఙ్కితా స్తు సర్వాః. ౨౩

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చత్రింశ స్సర్గః. ౩౫

## షట్త్రింశ స్సర్గః.

ఇత్యుక్త స్తారయా వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్,
మృదుస్వభావ స్సౌమిత్రిః ప్రతిజగ్రాహ తద్వచః. ౧

తస్మి న్ప్రతిగృహీతే తు వాక్యే హరిగణేశ్వరః,
లక్ష్మణా త్సుమహ త్త్రాసం వస్త్రం క్లిన్న మి వాత్యజత్. ౨

తతః కణ్ఠగతం మాల్యం చిత్రం బహుగుణం మహత్,
చిచ్ఛేద విమద శ్చాసీ త్సుగ్రీవో వానరేశ్వరః. ౩

స లక్ష్మణం భీమబలం సర్వవానరసత్తమః,
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవ స్సంప్రహర్షయన్. ౪

ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
రామప్రసాదా త్సౌమిత్రే! పునః ప్రాప్త మిదం మయా. ౫

కః శక్త స్తస్య దేవస్య ఖ్యాతస్య స్వేన కర్మణా,
తాదృశం విక్రమం వీర! ప్రతికర్తు మరిన్దమ!. ౬

సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతి చ రావణమ్,
సహాయమాత్రేణ మయా రాఘవ స్స్వేన తేజసా. ౭

లయి కోపంబున నెత్తురువలె నెఱ్ఱగానున్న నీనయనంబులం జూచి మహాభీ
యంబునొంది యెంతమాత్రము నెమ్మది నొందకున్నారు. కావున శీఘ్రముగా
నీవు కోపంబు విడిచి ప్రసన్నుండవగుము. అని తార లక్ష్మణునితోఁ జెప్పెను.

ఇది ముప్పదియైదవసర్గము.

---

## ముప్పదియాఱవసర్గము.

లక్ష్మణుఁడు ఇట్లు తారచెప్పిన వినయముతోను ధర్మముతోనుగూడిన
మాటనువిని మెత్తనిస్వభావముగలవాఁడగుటవలన నాబిడమాట నంగీకరించి
కోపంబువదలి ప్రసన్నుఁడయ్యెను. ౧

లక్ష్మణుఁడుతారమాటనంగీకరించి ప్రసన్నుఁడుకాఁగానే సుగ్రీవుఁడు
తడిసినవస్త్రమును వదలునట్లు లక్ష్మణునివలని మహాభయంబును వదలి నిర్భయుఁ
డయ్యెను. ౨

అంత వానరరాజయినసుగ్రీవుఁడు చిత్రవర్ణంబునుమిక్కిలియు సుగం
ధంబుగలదియునగు కంఠంబున ధరించియున్న దివ్యమయిన పుష్పమాలికను
దెంపివేసి మన్మథమదంబునం జొక్కియుండుటను వదలెను. ౩

సమస్తవానరులలోను శ్రేష్ఠుఁడగు నాసుగ్రీవుఁడు మహాబలుఁడగు
లక్ష్మణుం జూచి యతనికి సంతోషంబు గలిగించుచు సవినయముగా నిట్లని
చెప్పెను. ౪

లక్ష్మణుఁడా! నన్నువదలి పోయియుండిన సంపదయుఁగీర్తియు శాశ్వ
తమయిన వానరరాజ్యంబును ఇవన్నియు నాకు రాముని యనుగ్రహంబుననే
ప్రాప్తించినవికాని వేఱుగాదు. ౫

శత్రువధంబు సేయునట్టి వీరుఁడవగు లక్ష్మణుఁడా! తనకార్యముచేతఁ
బ్రసిద్ధినొందిన యమ్మహాపురుషుఁడు రాముఁడు పరాక్రమంబుచేఁ గావించి
నయమ్మహోపకారమునకుఁ బ్రత్యుపకారము నెవఁడు గావింపఁగలఁడు? ౬

నేను తోడుమాత్రముగా నుండవలసినదేకాని ధర్మాత్ముఁడగు రాముఁడు
తనపరాక్రమముచేతనే రావణుని వధించి సీతను బొందఁగలఁడు. ౭

సహాయకృత్యం కిం తస్య యేన సప్త మహాద్రుమాః,
శైలశ్చ వసుధా చైవ బాణే నైకేన దారితాః. ౮
ధనుర్విస్ఫారయానస్య యస్య శబ్దేన లక్ష్మణ!,
సశైలా కమ్పితా భూమి స్సహాయై స్తస్య కిన్ను వై. ౯

అనుయాత్రాం నరేన్ద్రస్య కరిష్యేఽహం నరర్షభ!,
గచ్ఛతో రావణం హన్తుం వైరిణం సపురస్సరమ్. ౧౦

యది కించి దతిక్రాన్తం విశ్వాసా త్ప్రణయేన వా,
ప్రేష్యస్య క్షమితవ్యం మే న కశ్చి న్నాపరాధ్యతి. ౧౧

ఇతి తస్య బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
అభవ ల్లక్ష్మణః ప్రీతః ప్రేమ్ణా చైవ మువాచ హ. ౧౨
సర్వథా హి మమ భ్రాతా సనాథో వానరేశ్వర!,
త్వయా నాథేన సుగ్రీవ! ప్రశ్రితేన విశేషతః. ౧౩

యస్తే ప్రభావ స్సుగ్రీవ! యచ్చ తే శౌచ మార్జవమ్,
అర్హ స్త్వం కపిరాజ్యస్య శ్రియం భోక్తు మనుత్తమామ్. ౧౪
సహాయేన చ సుగ్రీవ! త్వయా రామః ప్రతాపవాన్,
వధిష్యతి రణే శత్రూ నచిరా న్నాత్ర సంశయః. ౧౫

ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సంగ్రామే ష్వనివర్తినః,
ఉపపన్నంచ యుక్తం చ సుగ్రీవ! తవ భాషితమ్. ౧౬

ఏడుమహావృక్షంబులను బర్వతంబును భూమిని ఒక్కబాణంబున భేదించినట్టి మహావీరునకు మఱియొకని సాహాయ్య మేమి కావలసియున్నది?

లక్ష్మణుఁడా! రాముఁడు ధనువు నారిలాగి ధ్వనింపఁజేయఁగా వాద్యనికి భూమియుఁ బర్వతంబులును జలించినవి. అట్టిమహావీరునకు సహాయులచే నేమిపనియున్నది? ౯

పురుషశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడా! శత్రువైన రావణునిసైన్యసమేతంబుగా వధింపరాముఁడు నడువనే నతనివెంట నడువవలసినవాఁడనేకాని యతనికి సాహాయ్యము సేసెద ననుటకు నే నెంతవాఁడను? ౧౦

మిత్రభృత్యుఁడను నేను ఒకవేళ రాముఁడు నన్నేమియుఁ జెప్పఁడని నమ్మకమువలనను స్నేహాతిశయమువలనను ఏమేని కొంచెము కాలాతిక్రమణముగావించియుండినయెడ నాతప్పును క్షమింపవలెను. లోకంబున నెవ్వఁడును దప్పుచేయనివాఁడులేఁడు. అని సుగ్రీవుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౧

మహాత్ముఁడగు సుగ్రీవుఁడివ్విధంబునఁబలుకఁగానే లక్ష్మణుఁడు సంతుష్టుఁడై సంతోషంబున వానుగ్రీవునిం జూచి యిట్లని పలికెను. ౧౨

వానరరాజవగు సుగ్రీవుఁడా! నీవు నాథుఁడవై యందును విశేషించి రామునిపట్ల వినయసంపన్నుఁడవై యుండుటచేత నాయన్న రాముఁడు అన్నివిధములను సనాథుఁడు. ౧౩

సుగ్రీవుఁడా! నీప్రభావము నీశౌచము ఈరెంటినింజూడ ఈసర్వోత్తమమయిన వానరరాజ్యలక్ష్మి ననుభవించుటకు నీవే తగినవాఁడవు. ౧౪

సుగ్రీవుఁడా! నీవు సహాయుఁడవుగా నుండఁగా నీకఁ బరాక్రమవంతుఁడగు రాముఁడు శీఘ్రముననే యుద్ధంబున శత్రువుల నందఱ వధింపఁగలఁడు; ఇఁక సందేహములేదు. ౧౫

సుగ్రీవుఁడా! నీవు చెప్పినమాట ధర్మజ్ఞుఁడును తనకుఁ గావించిన యుపకారమును మఱవనివాఁడును యుద్ధంబులందు వెనుదీయనివాఁడును జెప్పఁదగినమాటగాను యుక్తముగాను నున్నది. ౧౬

దోషజ్ఞ స్సతి సామర్థ్యే కోఽన్యో భాషితు మర్హతి,
వర్జయిత్వా మమ జ్యేష్ఠం త్వాం చ వానరసత్తమ!. ౧౭

సదృశ శ్చాసి రామస్య విక్రమేణ బలేన చ,
సహాయో దైవతై ర్దత్త శ్చిరాయ హరిపుఙ్గవ!. ౧౮

కింతు శీఘ్ర మితో వీర! నిష్క్రామ త్వం మయా సహ,
సాన్త్వయస్వ వయస్యం త్వం భార్యాహరణకర్శితమ్. ౧౯

య చ్ఛోకాభిభూతస్య శ్రుత్వా రామస్య భాషితమ్,
మయా త్వం పరుషా ణ్యుక్త స్తచ్చ త్వం క్షన్తు మర్హసి. ౨౦

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షట్త్రింశ స్సర్గః. ౩౬.

## సప్తత్రింశ స్సర్గః.

ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా,
హనూమన్తం స్థితం పార్శ్వే సచివం త్విద మబ్రవీత్. ౧

మహేన్ద్ర హిమవ ద్విన్ధ్య కైలాసశిఖరేషు చ,
మన్దరే పాణ్డుశిఖరే పఞ్చశైలేషు యే స్థితాః. ౨
తరుణాదిత్యవర్ణేషు భ్రాజమానేషు సర్వతః,
పర్వతేషు సముద్రాన్తే పశ్చిమాయాం చ యే దిశి. ౩
ఆదిత్యభవనే చైవ గిరౌ సన్ధ్యాభ్రసన్నిభే,
పద్మతాళవనం భీమం సంశ్రితా హరిపుఙ్గవాః. ౪

వానరశ్రేష్ఠుఁడవగు సుగ్రీవుఁడా! నాయన్న రాముఁడును నీవును దక్క నిగ్రహానుగ్రహంబుల సమర్థులయియుండియు తమదోషంబు దెలిసి తాము తప్పుచేసినది వాస్తవమని చెప్పువార లితరు లెవ్వరున్నారు? ౧౭

వానరోత్తముఁడా! మఱియు నీవు పరాక్రమంబునను బలంబునను రామునకు సరియయినవాఁడవు; ఇంతకాలమునకు నిన్ను సహాయునిఁగా మాకు దేవత లొసంగిరి కాని వేఱువిధమున నీయట్టివానిఁ బొందుట శక్యము కాదు. ౧౮

పరాక్రమవంతుఁడవగు సుగ్రీవుఁడా! మఱి యిప్పుడు చేయవలసినది యేమన్నను నీ విచ్చటనుండి శీఘ్రంబున నావెంబడి వచ్చి భార్యం గోలుపోయి పరితపించుచున్న నీమిత్రుని రాము నాశ్వాసింపుము. ౧౯

రాముఁడు పరమదుఃఖితుఁడై విలపించుటను జూచుటచే నేను నిన్నుఁ బరుషవచనంబు లాడినాను; నీవు దానిని మనసున నుంచక క్షమింపవలెను. అని లక్ష్మణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను ౨౦

ఇది ముప్పదియాఱవసర్గము.

---

## ముప్పదియేడవసర్గము.

సుగ్రీవుఁడు ఇట్లు మహాత్ముఁడగు లక్ష్మణుఁడు చెప్పుటను విని తన పార్శ్వభాగంబున నిలువఁబడియున్న మంత్రిని హనుమంతుంజూచి యిట్లని పలికెను. ౧

మహేంద్రపర్వతమునందును హిమవత్పర్వతమునందును వింధ్యపర్వతమునందును కైలాసపర్వతమునందును తెల్లటిశిఖరములుగల మందరపర్వతమునందును ఈయయిదుపర్వతములందు నివసించుచున్నవారలను పశ్చిమదిశయందలి సముద్రతీరంబున బాలసూర్యవర్ణంబులగు పర్వతంబుల నుండువారలను సంధ్యాకాలమేఘంబువలె నెఱ్ఱనైన సూర్యుఁ డుదయించునట్టి యుదయపర్వతంబునందు భయంకరమయిన పద్మతాళవనంబునం దున్నవారలను

అఞ్జనామ్బుదసంకాశాః కుఞ్జరప్రతిమౌజసః,
అఞ్జనే పర్వతే చైవ యే వసన్తి ప్లవఙ్గమాః. ౫
మనశ్శిలాగుహావాసా వానరాః కనకప్రభాః,
మేరుపార్శ్వగతా శ్చైవ యే ధూమ్రగిరిసంశ్రితాః. ౬
తరుణాదిత్యవర్ణా శ్చ పర్వతే చ మహారుణే,
పిబన్తో మధు మైరేయం భీమవేగాః ప్లవఙ్గమాః. ౭
వనేషు చ సురమ్యేషు సుగన్ధిషు మహత్సుచ,
తాపసానాంచ రమ్యేషు వనాన్తేషు సమన్తతః. ౮
తాం స్తాం స్త్వమానయ క్షిప్రం పృథివ్యాం సర్వవానరాన్,

సామదానాదిభి స్సర్వై రాశు ప్రేషయ వానరాన్. ౯

ప్రేషితాః ప్రథమం యే చ మయా దూతా మహాజవాః,
త్వరణార్థం తు భూయ స్త్వం హరీం త్సంప్రేషయాపరాన్.

యే ప్రసక్తా శ్చ కామేషు దీర్ఘసూత్రా శ్చ వానరాః,
ఇహాఽనయస్వ తాం త్సర్వాన్ శీఘ్రం తు మమ శాసనాత్.

అహోభి ర్దశభి ర్యే చ నాగచ్ఛన్తి మమాఽజ్ఞయా,
హన్తవ్యా స్తే దురాత్మానో రాజశాసనదూషకాః. ౧౨
శతా న్యథ సహస్రాణాం కోట్య శ్చ మమ శాసనాత్,
ప్రయాన్తు కపిసింహానాం దిశో మమ మతే స్థితాః. ౧౩

మేఘపర్వతసంకాశా శ్ఛాదయన్త ఇ వామ్బరమ్,
ఘోరరూపాః కపిశ్రేష్ఠా యాన్తు మచ్ఛాసనా దితః. ౧౪

అంజనపర్వతంబున నివసించుచున్న కాటుకవలెను మేఘంబువలెను నల్లనిమే నుగలవారలును ఏనుఁగులంతటి బలముగలవారలునగు వానరులును మనశ్శిలా గుహలయందు నివసించునట్టి బంగారువంటి మేనుగలవానరులను మేరుపార్శ్వంబున నున్నవారలను ధూమ్రపర్వతంబున నున్నవారలను మహారుణపర్వతంబుననున్న బాలసూర్యునివలె నెఱ్ఱనిదేహముగలవానరులను మంచివాసనతోఁగూడిన రమణీయంబులగు గొప్పవనంబులందు మైరేయమద్యము ద్రావుచు నివసించుచున్న భయంకరవేగులగు వానరులను సుజీయ రమణీయంబులయిన ఋష్యాశ్రమవనంబులందు నివసించువారలను భూమండలంబున నయ్యైప్రదేశంబులనుండు వానరుల నందఱను నీవిపుడు శీఘ్రంబున రప్పింపుము. ౭-౮

సమస్తవానరులంబిలుచుకొనివచ్చుటకై సామదానభేదదండోపాయంబుల శీఘ్రంబుగా వానరుల నయ్యైస్థలంబులకుం బంపుము. ౯

నేను మొదట మహావేగులగు దూతలం బంపితినే, వారలు శీఘ్రంబున సమస్తవానరులం గొనివచ్చునట్లు వారలఁ ద్వరపెట్టుటకై శీఘ్ర మరల నితరవానరులను వారలయొద్దకుఁ బంపుము. ౧౦

విషయసుఖంబులం దగిలియున్నవారలును సోమరితనంబున శీఘ్రంబుగాఁ బనిచేయకుండువారలు నెవ్వరెవరుగల రావానరుల నందఱ శీఘ్రంబున నాయొద్దకుఁ బిలుచుకొనిరమ్ము. ౧౧

నాయాజ్ఞచొప్పున ఎవ్వరు పదిదినములకిచటికి రారో రాజాజ్ఞ నతిక్రమించినందుకు ఆదుర్బుద్ధులగు వానరులందఱు వధింపఁబడెను. ౧౨

ఇంక ఈకిష్కింధయందుండునట్టి వానరవీరులు నాయాజ్ఞ ననువర్తించువారలు అనేకలక్షలకొలంది అనేకకోట్లకొలంది అందఱును వానరులం బిలుచుకొనివచ్చుటకై దిక్కులకుఁ బోవుదురుగాక. ౧౩

మేఘంబులవలెను బర్వతంబులవలెను భయంకరమయిన యాకారముగల వానరవీరులు నాయాజ్ఞచే నిచటనుండి యాకాశంబు నాచ్ఛాదించువారలుంబోలెఁ జూపట్టుచు దిక్కులకుం బోవుదురుగాక. ౧౪

తే గతిజ్ఞా గతిం జ్ఞాత్వా పృథివ్యాం సర్వవానరాః,
ఆనయన్తు హరీం త్సర్వాం స్త్వరితా శ్శాసనా న్మమ. ౧౫

తస్య వానరరాజస్య శ్రుత్వా వాయుసుతో వచః,
దిక్షు సర్వాసు విక్రాన్తా న్ప్రేషయామాస వానరాన్. ౧౬
తే పదం విష్ణువిక్రాన్తం పతత్రిజ్యోతిరధ్వగాః,
ప్రయాతాః ప్రహితా రాజ్ఞా హరయ స్తత్క్షణేన వై. ౧౭
తే సముద్రేషు గిరిషు వనేషు చ సరస్సు చ,
వానరా వానరాం త్సర్వా న్రామహేతో రచోదయన్. ౧౮

మృత్యుకాలోపమ స్యాఽఽజ్ఞాం రాజరాజస్య వానరాః,
సుగ్రీవస్యాఽఽయయు శ్శ్రుత్వా స్సుగ్రీవభయదర్శినః. ౧౯

తత స్తేఽఞ్జనసంకాశా గిరే స్తస్మా న్మహాజవాః,
తిస్రః కోట్యః ప్లవఙ్గానాం నిర్యయు ర్యత్ర రాఘవః. ౨౦
అస్తం గచ్ఛతి యత్రార్క స్తస్మి న్గిరివరే స్థితాః,
తప్తహేమమహాభాస స్తస్మా త్కోట్యో దశ చ్యుతాః. ౨౧
కైలాసశిఖరేభ్య శ్చ సింహకేసరవర్చసామ్,
తతః కోటిసహస్రాణి వానరాణా ముపాగమన్. ౨౨
ఫలమూలేనజీవన్తో హిమవన్త ముపాశ్రితాః,
తేషాం కోటిసహస్రాణాం సహస్రం సమవర్తత. ౨౩
అఙ్గారకసమానానాం భీమానాం భీమకర్మణామ్,
విన్ధ్యా ద్వానరకోటీనాం సహస్రా ణ్యపత న్ద్రుతమ్. ౨౪

వానరు లుండుస్థలంబులు దెలిసిన యవ్వానరులందఱు నాయాజ్ఞచే నిపుడు శీఘ్రంబుగా నయ్యేస్థలంబులకుం బోయి భూమియందలి సమస్తవానరులను బిలుచుకొని వత్తురుగాక. అని సుగ్రీవుండు హనుమంతునితోం జెప్పెను.

వాయుపుత్త్రుండగు హనుమంతుండు వానరరాజయిన సుగ్రీవుని మాటను విని సమస్తదిక్కులకును బరాక్రమవంతులగు వానరులం బంపెను. ౧౬

అవ్వానరులు సుగ్రీవు నాజ్ఞను శిరసావహించి యాక్షణంబున పక్షులును నక్షత్రంబులు దిరుగునట్టి యాకాశమార్గంబునం బోయిరి. ౧౭

ఆవానరులు రామకార్యార్థులయి సముద్రద్వీపములందును బర్వతంబులందును వనంబులందును గొలంకులయందునుం గల సమస్తవానరులకును రాజాజ్ఞం దెలిపిరి. ౧౮

రాజయిన సుగ్రీవుండు ప్రళయకాలమృత్యువువంటివాండు కావున నతనియాజ్ఞ వినంగానే వానరులు సుగ్రీవుండు కఠినముగా దండించు నను భయంబున నందఱును వచ్చిరి. ౧౯

అంత రామునినిమిత్తమయి అంజనజపర్వతమునుండి కాటుకవలె నల్లని మేనుగలవారలును మహావేగులునగు మూండుకోట్లవానరులును బయలుదేఱిరి.

సూర్యుండు డస్తమయమునొందునట్టి యస్తగిరినుండి యాపర్వతమునందు నివసించునట్టి తప్తకాంచనవర్ణులగు వానరులు పదికోట్లు వెడలిరి ౨౧

అంతం గైలాసపర్వతశిఖరములనుండి సింహాకేసరంబులవలె తెల్లని మేనుగల వానరులు వేయికోట్లమంది వచ్చిరి ౨౨

ఫలమూలంబులం దినిజీవించుచుహిమవత్పర్వతంబున నివసించియున్న వానరులు పదిలక్షలకోట్లు వచ్చిరి ౨౩

వింధ్యపర్వతమునుండి అంగారకునివలె నెఱ్ఱని దేహముగల భయంకరాకారులును భయంకరమయిన కార్యముగలవారలునగు వానరులు పెక్కువేలకోట్లు శీఘ్రంబునం బఱతెంచిరి. ౨౪

క్షీరోదవేలానిలయా స్తమాలవనవాసినః,
నారికేళాశనా శ్చైవ తేషాం సఙ్ఖ్యా న విద్యతే. ౨౫

వనేభ్యో గహ్వరేభ్య శ్చ సరిద్భ్య శ్చ మహాజవా,
ఆగచ్ఛ ద్వానరీ సేనా పిబ న్తీవ దివాకరమ్. ౨౬
యే తు త్వరయితుం యాతా వానరా స్సర్వవానరాన్,
తే వీరా హిమవచ్ఛైలం దదృశు స్తం మహాద్రుమమ్. ౨౭

తస్మి న్గిరివరే రమ్యే యజ్ఞో మాహేశ్వరః పురా,
సర్వదేవమనస్తోషో బభౌ దివ్యో మనోహరః. ౨౮

అన్ననిష్యన్దజాతాని మూలాని చ ఫలాని చ,
అమృతాస్వాదకల్పాని దదృశు స్తత్ర వానరాః. ౨౯

తదన్నసంభవం దివ్యం ఫలంమూలం మనోహరమ్,
యః కశ్చి త్సకృ దశ్నాతి మాసం భవతి తర్పితః. ౩౦
తాని మూలాని దివ్యాని ఫలాని చ ఫలాశనాః,
ఔషధాని చ దివ్యాని జగృహు ర్హరియూథపాః. ౩౧

తస్మాచ్చ యజ్ఞాయతనా త్పుష్పాణి సురభీణి చ,
ఆనిన్యు ర్వానరా గత్వా సుగ్రీవప్రియకారణాత్. ౩౨
తే తు సర్వే హరివరాః పృథివ్యాం సర్వవానరాన్,
సంచోదయిత్వా త్వరితా యూథానాం జగ్ము రగ్రతః. ౩౩

తేతు తేన ముహూర్తేన యూథపా శ్శీఘ్రగామినః,

క్షీరసముద్రతీరంబుననుండు వానరులును తమాలవనంబున నివసించు వానరులును నారికేళవనంబులటెంకాయ లాహారముగానివసించువానరులును బెక్కండ్రు శీఘ్రంబున నేతెంచిరి; వారల లెక్కింప నలవిగాదు. ౨౫

అడవులనుండియుగుహలనుండియునదీతీరంబులనుండియు నవ్వానరసేన అతివిస్తీర్ణం బగుటవలన సూర్యుని మ్రింగుసదివలె ఆకాశమార్గంబున వచ్చెను.

ఏవానరులు మొదట నీలునిచేఁ బంపఁబడి సమస్తవానరులం బిలువఁ బోయిరో ఆవానరవీరులు హిమవత్పర్వతంబుననున్న సుప్రసిద్ధంబగు నమ్మహావృక్షంబుఁ జూచిరి. ౨౬

మున్ను రమణీయంబగు నాహిమవత్పర్వతమునందు సమస్తదేవతలను సంతోషపెట్టునదియు నుత్తమంబును మనోహరంబునగు మాహేశ్వరయాగ మొకటి గావింపఁబడెను. ౨౭

ఆవానరులు ఆయజ్ఞము గావించిన స్థలమునందు హోమము సేయున పుడు జాతి నేలంబడిన హవిస్సులచేతఁ బుట్టినవియు నమృతంబువంటి రుచి గలవియునగు ఫలమూలంబులం జూచిరి. ౨౮

ఆహవిస్సువలనఁ బుట్టినమనోహరంబులగు దివ్యఫలమూలంబులను ఒకమాఱు దిన్నవాఁడు మఱియొక నెలవఱకుఆఁకలినొందక తృప్తుఁడై యుండును.

అవ్వానరవీరులు ఫలంబులే యాహారముగాఁ గలవారలు గావున దివ్యములగు నాఫలమూలంబులం గ్రహించుటయకాక యుచటిదివ్యౌషధులను గూడ సంగ్రహించిరి. ౩౧

ఆవానరులు సుగ్రీవుని సంతోషార్థమయి ఆయజ్ఞస్థలంబునందలి ఫలమూలంబులను మాత్రమె గాక యచటిమంచివాసనగలపూలనుగూడఁదెచ్చిరి.

అవ్వానరోత్తములందఱు భూమియందలి సమస్తవానరులను శీఘ్రంబునం బిలిచి యంత నవ్వానరసమూహంబులకు ముందుగాఁ గిష్కింధకు వచ్చిరి. ౩౩

శీఘ్రంబున నడచునట్టి యా పిలువఁబోయినవానరవీరులు లక్ష్మణుఁడు

కిష్కిన్ధాం త్వరయా ప్రాప్తా స్సుగ్రీవో యత్ర వానరః. ౩౪

తే గృహీత్వౌషధీ స్సర్వాః ఫలం మూలం చ వానరాః,
తం ప్రతిగ్రాహయామాసు ర్వచనం చేద మబ్రువన్. ౩౫

సర్వే పరిగతా శ్శైలా స్సముద్రాశ్చ వనానిచ,
పృథివ్యాం వానరా స్సర్వే శాసనా దుపయాన్తి తే. ౩౬

ఏవం శ్రుత్వా తతో హృష్ట స్సుగ్రీవః ప్లవగాధిపః,
ప్రతిజగ్రాహ తత్ప్రీత స్తేషాం సర్వ ముపాయనమ్. ౩౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తత్రింశ స్సర్గః. ౩౭.

---

## అష్టత్రింశ స్సర్గః.

ప్రతిగృహ్య చ తత్సర్వ ముపాయన ముపాహృతమ్,
వానరాం త్సాన్త్వయిత్వా చ సర్వా నేవ వ్యసర్జయత్. ౧

విసర్జయిత్వా స హరీ ఞ్శూరాం స్తా న్కృతకర్మణః,
మేనే కృతార్థ మాత్మానం రాఘవం చ మహాబలమ్. ౨

స లక్ష్మణో భీమబలం సర్వవానరసత్తమమ్,
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం సంప్రహర్షయన్. ౩
కిష్కిన్ధాయా వినిష్క్రామ యది తే సౌమ్య! రోచతే,

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య సుభాషితమ్ ౪
సుగ్రీవః పరమప్రీతో వాక్య మేత దువాచ హ,

కిష్కింధలోనుండు సమయంబున సుగ్రీవుఁడున్న కిష్కింధానగరంబునకు వేగంబున వచ్చిరి. 34

ఆవానరులు సమస్తములయిన యోషధులను దివ్యములగు ఫలములను మూలములను దీసికొనివచ్చి సుగ్రీవునకుఁ గానుకగా సమర్పించి యీవచనముం బలికిరి. 35

సమస్తములయిన పర్వతంబులకును సముద్రంబులకును వనంబులకును బోయి యందఱను బిలిచినాము. నీయాజ్ఞవలన భూమియందలి సమస్తవానరులును వచ్చుచున్నారు. అని వానరులు సుగ్రీవునితోఁ జెప్పిరి. 36

వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు ఈమాటలువిని సంతుష్టుఁడై ఆవానరులయందలి ప్రీతిచే వారలు సమర్పించు కానుక నంతయుఁ బరిగ్రహించెను. 37

ఇది ముప్పదియేడవసర్గము.

---

## ముప్పదియెనిమిదవసర్గము.

సుగ్రీవుఁడు ఆవానరులు సమర్పించినకానుక లన్నియుఁ బరిగ్రహించి యావానరులను మంచిమాటలచే సంతోషపఱచి యందఱకును వారి వారియిండ్లకుఁ బోవ సెలవొసంగెను 1

సుగ్రీవుఁడు తాను నియోగించినకార్యమును జేసివచ్చిన శూరులగు నావానరులకు సెలవిచ్చిపంపి యంతేఁ దనయొక్కయు మహాబలుఁడగు రామునియొక్కయుఁ గార్యము సిద్ధించెనని తలంచెను. 2

లక్ష్మణుఁడు మహాబలుఁడును సమస్తనరశ్రేష్ఠుఁడునగు సుగ్రీవునిం జూచి వినయముతో నతని సంతోషపఱచుచు నిట్లని పలికెను 3

సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! నీ కిష్టమయినయెడ ఇపుడే కిష్కింధనుండి వెడలి రామునియొద్దకు రమ్ము. అని లక్ష్మణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

సుగ్రీవుఁడు లక్ష్మణుఁడు చెప్పిన మధురమాయిన వచనమునువిని పరమసంతుష్టుఁడయి యతనితో నీమాటం బలికెను 4

ఏవం భవతు గచ్ఛావః స్థేయం త్వచ్ఛాసనే మయా. ౫

తమేవ ముక్త్వా సుగ్రీవో లక్ష్మణం శుభలక్షణమ్,
విసర్జయామాస తదా తారా మన్యాశ్చ యోషితః. ౬
ఏతే౽త్యుచ్చై ర్హరివరా న్సుగ్రీవ స్సముదాహరత్,

తస్య త ద్వచనంశ్రుత్వా హరయ శ్శీఘ్ర మాయయుః. ౭
బద్ధాఞ్జలిపుటా స్సర్వే యే స్యుః స్త్రీదర్శనక్షమాః,

తా నువాచ తతః ప్రాప్తా న్రాజా౽ర్కసదృశప్రభః. ౮

ఉపస్థాపయత క్షిప్రం శిబికాం మమ వానరాః,

శ్రుత్వా తు వచనం తస్య హరయ శ్శీఘ్రవిక్రమాః. ౯
సముపస్థాపయామాసు శ్శిబికాం ప్రియదర్శనామ్,
తా ముపస్థాపితాం దృష్ట్వా శిబికాం వానరాధిపః. ౧౦
లక్ష్మణా౽రుహ్యతాం శీఘ్ర మితి సౌమిత్రి మబ్రవీత్,
ఇత్యుక్త్వా కాఞ్చనం యానం సుగ్రీవ స్సూర్యసన్నిభమ్. ౧౧
బృహద్భి ర్హరిభి ర్యుక్త మారురోహ సలక్ష్మణః,

పాణ్డురే ణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని. ౧౨
శుక్లై శ్చ వాలవ్యజనై ర్ధూయమానై స్సమన్తతః,
శఙ్ఖభేరీనినాదై శ్చ హరిభి శ్చాభినన్దితః. ౧౩

అట్లె యవుఁగాక. రాముని యొద్దకుఁ బోదము. నేను నీయాజ్ఞఁ జొప్పున నడువవలసినవాఁడనే కాని వేఱుగాదు. అని సుగ్రీవుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫

సుగ్రీవుఁడు మంగళకరంబులగు లక్షణంబులతో నివ్విధంబునం జెప్పి యంతఁ దారమొదలగు స్త్రీల నందఱం బొండని యాజ్ఞాపించెను. ౬

అంత సుగ్రీవుఁడు "ఇటురండు" అని గట్టిగా వానరవరులం బిలిచెను.

సుగ్రీవుఁ డట్లుపిలుచుటయు, ఆపిలుపు విన్నంతనె అంతఃపురస్త్రీలం జూడఁదగినవారలగు వానరులు శీఘ్రంబునవచ్చి యందఱును జేతులుమోడ్చి నిలువఁబడిరి. ౭

అంతఁ దనయెదుటికివచ్చియున్నయా వానరులంజూచి సూర్యునివలెఁ బ్రకాశించుచున్న సుగ్రీవుఁడు ఇట్లని పలికెను. ౮

వానరులారా! శీఘ్రంబున నాపల్లకిని దీసికొనిరండు. అని సుగ్రీవుండు పలికెను.

శీఘ్రముగాఁ బనిచేయునట్టి యవ్వానరులు సుగ్రీవు నాజ్ఞను విన్నంతనె చూడ్కులకు వేడ్కసేయునట్టి పల్లకిం గొనివచ్చిరి. ౯

వానరరాజయిన సుగ్రీవుఁడు పల్లకివచ్చుటంజూచి లక్ష్మణునితో "నీవు శీఘ్రంబునం బల్లకి నారోహింపుము" అనిచెప్పెను. ౧౦

సుగ్రీవుఁడు ఇట్లు లక్ష్మణునకుఁ జెప్పి మహాకాయులగు వానరులచే మోయఁబడినదియు సూర్యసమానంబునగు కాంచనమయమయిన పల్లకిని, లక్ష్మణసహితంబుగా నారోహించెను. ౧౧

శిరస్సుపయి శ్వేతచ్ఛత్రంబు శోభిల్ల నలుగెలంకులను వానరులు వెల్లనివింజామరలు వీవ శంఖధ్వనులును భేరీభాంకారంబులును జెలంగ వానరులు మంగళస్తుతిపాఠంబులం గైవారంబులుసేయ నిట్లఖండరాజ్యలక్ష్మీవిరాజితుఁడై సుగ్రీవుఁడు వెడలెను. ౧౨,౧౩

నిర్యయౌ ప్రాప్య సుగ్రీవో రాజ్యశ్రియ మనుత్తమామ్,
స వానరశతై స్తీక్ష్ణై ర్బహుభి శ్శస్త్రపాణిభిః. ౧౪

పరికీర్ణో యయౌ తత్ర యత్ర రామో వ్యవస్థితః,

స తం దేశ మనుప్రాప్య శ్రేష్ఠం రామనిషేవితమ్. ౧౫
అవాతర న్మహాతేజా శ్శిబికాయా స్సలక్ష్మణః,

ఆసాద్య చ తతో రామం కృతాఞ్జలిపుటోఽభవత్. ౧౬

కృతాఞ్జలౌ స్థితే తస్మి న్వానరా శ్చాభవం స్తథా,

(ఉద్ధృతాఞ్జలిపద్మా స్తే సుగ్రీవస్య సమన్తతః.)

తటాక మివ తం దృష్ట్వా రామః కుట్మలపఙ్కజమ్. ౧౭
వానరాణాం మహా త్సైన్యం సుగ్రీవే ప్రీతిమా నభూత్,

పాదయోః పతితం మూర్ధ్నా త ముత్థాప్య హరీశ్వరమ్. ౧౮
ప్రేమ్ణా చ బహుమానాచ్చ రాఘవః పరిషస్వజే,

పరిష్వజ్య చ ధర్మాత్మా నిషీదేతి తతోఽబ్రవీత్. ౧౯

తం నిషణ్ణం తతో దృష్ట్వా క్షితౌ రామోఽబ్రవీ ద్వచః,

ధర్మ మర్థం చ కామం చ య స్తు కాలే నిషేవతే. ౨౦
విభజ్య సతతం వీర స్స రాజా హరిసత్తమ!,

సుగ్రీవుఁడు మహాపరాక్రమశాలులును ఆయుధపాణులునగు పెక్కునూఱుల వానరవీరులు తన్నుఁబరివేష్టించి కొలువ రాముఁడు నివసించియున్న స్థలమునకుఁ బోయెను. ౧౪

మహాతేజుఁడగు నాసుగ్రీవుఁడు రాముఁడు నివసించుటచే నుత్తమమయినయాప్రదేశమును (ప్రస్రవణపర్వతమును) సమీపించి యంత లక్ష్మణునితోఁగూడఁ బల్లకినుండి డిగ్గెను ౧౫

సుగ్రీవుఁడు రామునియొద్దకుఁ బోయినంతనె చేమోడ్పుగీలించి నిలువఁబడెను. ౧౬

అట్లు సుగ్రీవుఁడు చేతులుమోడ్చుకొని నిలుచుటయు వానరులును అట్లే చేతులనుమోడ్చి నిలువఁబడినవారైరి.

ఆవానరులు కమలంబులవంటి చేమోడ్పులతోఁ జేతులు పైకెత్తి సుగ్రీవునిఁ బరివేష్టించి నిలుచుండిరి.

రాముఁడు వానరులందరు చేమోడ్పులు పైకెత్తి నిలుచుండుటవలనఁ దామరమొగ్గలతో నిండిన తటాకంబువలెనున్న గొప్పదైన యవ్వానరసేనం జూచి సుగ్రీవునివిషయమయి మిక్కిలియు సంతోషంబు నొందెను. ౧౭

వానరరాజు సుగ్రీవుఁడు సాష్టాంగముగా రాముని పాదంబులం బడుటయు రాముఁడు అతని లేవనెత్తి ప్రీతితో బహుమానించి యాలింగనము చేసికొనెను. ౧౮

ధర్మాత్ముఁడగు రాముఁడు అట్లు సుగ్రీవుఁ గవుఁగిలించుకొని యంతఁ గూర్చుండుమని చెప్పెను. ౧౯

అంత సుగ్రీవుఁడు నేలపైఁగూర్చుండుటయు రాముఁ డతనిఁజూచి యిట్లని పలికెను.

వానరోత్తముఁడా! ఏవీరుఁడు ధర్మార్థకామంబులను విభజించి యేకాలంబున దేని సేవింపవలెనో ఆకాలంబుననే దానినే యిట్లు క్రమముగా నెల్లప్పుడును సేవించునో అతఁడే సరియయినరాజు. ౨౦

హిత్వా ధర్మం తథాఽర్థం చ కామం యస్తు నిషేవతే,
స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే,

అమిత్రాణాం వధే యుక్తో మిత్రాణాం సంగ్రహే రతః. ౨౨
త్రివర్గఫలభోక్తా తు రాజా ధర్మేణ యుజ్యతే,

ఉద్యోగసమయ స్త్వేష ప్రాప్త శ్శత్రువినాశన!. ౨౩
సంచిన్త్యతాం హి పిఙ్గేశ! హరిభిస్సహ మన్త్రిభిః,

ఏవ ముక్తస్తు సుగ్రీవో రామం వచన మబ్రవీత్. ౨౪

ప్రణష్టా శ్రీ శ్చ కీర్తి శ్చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
త్వత్ప్రసాదా న్మహాబాహో! పునః ప్రాప్త మిదం మయా. ౨౫
తవ దేవ! ప్రసాదా చ్చ భ్రాతు శ్చ జయతాం వర!,

కృతం న ప్రతికుర్యా ద్యః పురుషాణాం స దూషకః. ౨౬

ఏతే వానరముఖ్యా శ్చ శతశ శ్శత్రుసూదన!,
ప్రాప్తా శ్చాదాయ బలినః పృథివ్యాం సర్వవానరాన్. ౨౭
ఋక్షా శ్చావహితా శ్శూరా గోలాఙ్గూలా శ్చ రాఘవ!,
కాన్తారవనదుర్గాణా మభిజ్ఞా ఘోరదర్శనాః. ౨౮

దేవగన్ధర్వపుత్త్రా శ్చ వానరాః కామరూపిణః,

ఎవ్వఁడయితే ధర్మార్థంబుల వదలి కామమును మాత్రమే యెల్లప్పుడును సేవించునో అతఁడు చెట్టుచివరను నిద్రించినవాఁడువలె అధఃపతనము నొంది నపిమ్మట మేలుకొనఁగలఁడు. ౨౧

శత్రువుల వధించుచు మిత్రుల కుపకరించుచు ధర్మార్థకామంబుల యథాకాలముగా విభజించి యన్యోన్యకాలంబుల సేవించుచుండు రాజుమాత్రమే రాజధర్మముఁ జక్కఁగా నెఱవేర్చినవాఁడగును. ౨౨

శత్రువుల వధించునట్టి వానరరాజా! ఇది యుద్ధప్రయత్నమునకుఁ దగిన కాలము. శరదృతువు వచ్చినది. ఇపుడు సేయవలసినకార్యమును గుఱించి నీమంత్రులగు వానరులతో నాలోచింపుము అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౩

సుగ్రీవుఁడు రాముఁడు చెప్పినమాటవిని రామునిఁజూచి యిట్లని పలికెను. ౨౪

సమస్తరాజులలో నుత్తముఁడవు మహాబాహుఁడవగు రాముఁడా! నేను పోఁగొట్టుకొన్నసంపదయు యశస్సును శాశ్వతంబయిన వానరరాజ్యంబును ఇవన్నియు నీయనుగ్రహంబునను నీతమ్ముఁడు లక్ష్మణుని యనుగ్రహంబునను నాకు మరల లభించినవి. ౨౫

ఎవ్వఁడు తనకితరులు గావించిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము గావింపఁడో అతఁడు పురుషులలో నెల్ల అధముఁడు. ౨౬

శత్రువుల వధించునట్టి రాముఁడా! ఈవానరవీరులు పెక్కండ్రు పోయి భూమియందలి బలవంతులగు సమస్తవానరులనుం బిలిచి వచ్చినారు.

రాముఁడా! పెద్దపెద్దవనంబులలో నెవ్వరికిని జొరరాని ప్రదేశంబులలోని సందుగొందులుగూడఁ జక్కఁగాఁ దెలిసినవారలును భయంకరాకారులును శూరులునగు భల్లూకవీరులను గోలాంగూలవీరులనుం బిలిచివచ్చినారు. ౨౮

రాముఁడా! దేవతలకును గంధర్వులకును జన్మించినవారలును గామ

సైన్యైః పరివృతా సైన్యై ర్వ ర్తన్తే పథి రాఘవ!. ౨౯

శతై శ్శతసహస్రైశ్చ కోటిభిశ్చ ప్లవజమాః,
అయుతై శ్చావృతా వీరా శ్శఙ్కుభి శ్చ పరన్తప!. ౩౦

అర్బుదై రర్బుదశతై ర్మధ్యై శ్చాన్తై శ్చ వానరాః,
సముద్రై శ్చ పరార్ధై శ్చ హరయో హరియూథపాః. ౩౧

ఆగమిష్యన్తి తే రాజ! న్మహేన్ద్రసమవిక్రమాః,
మేరుమన్దరసంకాశా విన్ధ్యమేరుకృతాలయాః. ౩౨

తే త్వా మభిగమిష్యన్తి రాక్షసం యేస బాన్ధవమ్,
నిహత్య రావణం సంఖ్యే హ్యానయిష్యన్తి మైథిలీమ్. ౩౩

తత స్త ముద్యోగ మవేక్ష్య బుద్ధిమా
న్హరిప్రవీరస్య నిదేశవ ర్తినః,
బభూవ హర్షా ద్వసుధాధిపాత్మజః
ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః. ౩౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టాత్రింశ స్సర్గః. ౩౮.

ఏకోనచత్వారింశస్సర్గః.

ఇతి బ్రువాణం సుగ్రీవం రామో ధర్మభృతాం వరః,
బాహుభ్యాం సంపరిష్వజ్య ప్రత్యువాచ కృతాఞ్జలిమ్. ౧
యదిన్ద్రో వర్షతే వర్షం న తచ్చిత్రం భవేత్క్వచిత్,

రూపులునగు వానరవీరులు తమతమ సేనలతోఁ గూడినవారలయి వచ్చుచున్నారు. ౨౯

పరాక్రమవంతులగు వానరులు కొందఱు నూఱులతోను కొందఱు లక్షలతోను గొందఱు కోటులతోను గొందఱు పదివేలతోను, వానరులతోడంగూడి వచ్చుచున్నారు. ౩౦

కొందఱు వానరువీరులు అర్బుదంబులతోను కొందఱు ఖర్వంబులతోను గొందఱు మధ్యంబులతోను గొందఱు అంతములతోను గొందఱు సముద్రంబులతోను గొందఱు పరార్ధంబులతోను వచ్చుచున్నారు. ౩౧

రాజా! మహేంద్రునివంటి పరాక్రమముగలవానరులును మేరుపర్వతమువలెను మందరపర్వతమువలెను శరీరముగలవానరులును వింధ్యపర్వతమునందును మేరుపర్వతమునందును నివసించువారలునగు వానరులు నీకార్యమునిమిత్తమయి వచ్చుచున్నారు. ౩౨

భ్రాతృపుత్త్రాదిబంధుసహితంబుగా రావణుని యుద్ధంబునవధించిసీతాదేవిందెచ్చి నీకు సమర్పింపఁగల మహావీరులగు వానరులు నీ సన్నిధానమునకు వచ్చుచున్నారు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౩౩

అంత బుద్ధిమంతుఁడగు రాముఁడు అట్లు తనయాజ్ఞచొప్పునఁ దనకార్యము నిమిత్తమయి సుగ్రీవుఁడు గావించినప్రయత్నముంజూచి సంతోషంబువలన దేహకాంతి యధికమగుటయు వికసించిన నల్లగలువవలె మఱియు శ్యామలవర్ణుఁడై యొప్పెను. ౩౪

ఇది ముప్పదియొనిమిదవసర్గము.

---

## ముప్పదితొమ్మిదవసర్గము.

ధార్మికులలో నుత్తముఁడగు రాముఁడు ఇట్లు చెప్పుచుఁ జేమోడ్చి నిలించియున్నసుగ్రీవుని చేతులచేఁ గౌఁగిలించుకొని యిట్లనిబదులుచెప్పెను.

ఇంద్రుఁడువర్షములుగురిసినను సూర్యుఁడు ప్రపంచమునకంతయుఁ

ఆదిత్యో వా సహస్రాంశుః కుర్యా ద్వితిమిరం నభః. ౨

చన్ద్రమా రశ్మిభిః కుర్యా త్పృథివీం సౌమ్య! నిర్మలామ్
త్వద్విధో వాఽపి మిత్రాణాం ప్రతికుర్యా త్పరన్తప!. ౩

ఏవం త్వయి న త చ్చిత్రం భవే ద్య త్సౌమ్య! శోభనమ్,
జానా మ్యహం త్వాం సుగ్రీవ! సతతం ప్రియవాదినమ్. ౪

త్వత్సనాథ స్సఖే! సంఖ్యే జేతాఽస్మి సకలా నరీన్,
త్వమేవ మే సుహృ న్మిత్రం సాహాయ్యం కర్తు మర్హసి. ౫

జహా రాఽత్మవినాశాయ వైదేహీం రాక్షసాధమః,
వఞ్చయిత్వా తు పౌలోమీ మనుహ్లాదో యథా శచీమ్. ౬

నచిరా త్తం హనిష్యామి రావణం నిశితై శ్శరైః,
పౌలోమ్యాః పితరం దృప్తం శతక్రతు రివాఽహవే. ౭

ఏతస్మి న్నన్తరే చైవ రజ స్సమభివర్తత,
ఉష్ణాం తీవ్రాం సహస్రాంశో శ్ఛాదయ ద్గగనే ప్రభామ్. ౮
దిశః పర్యాకులా శ్చాసన్ రజసా తేన మూర్ఛితా,
చచాల చ మహీ సర్వా సశైలవనకాననా. ౯

ప్రకాశముగలిగించినను అది వారలకు సహజధర్మమగుటవలన నెప్పుడును
ఆశ్చర్యకరముగాదు. ౨

శత్రువులఁ దపింపఁజేయునట్టి సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! చంద్రుఁడు తనకిరణంబుల భూమినంతయు స్వచ్ఛముగావించినను అది యెంతమాత్రము ఆశ్చర్యకరముగాదు. అట్లు నీయట్టివారలు మిత్రులకుఁ బ్రత్యుపకారముచేసినను అది మీకు సహజము కావున నెంతమాత్రము ఆశ్చర్యము గాదు. ౩

సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! ఇవ్విధంబున నీవు మిత్రులకుఁ బ్రత్యుపకారముసేయుట యనునది యెంతమాత్ర మాశ్చర్యకరము గాదు. నీవు ఎల్లప్పుడును మిత్రులకు సంతోషకరమగు కార్యముగావించి యాసంగతిం జెప్పవచ్చువాఁడవని నే నెఱుంగుదును. ౪

మిత్రుఁడా! నీవు సహాయుఁడవై యుండఁగా నే నిఁక సమస్తశత్రువులను యుద్ధంబున జయింపఁగలను. మంచిమనస్సుగలవాఁడవు స్నేహితుఁడవగు నీవే నాకు సాహాయ్యము సేయవలెను. ౫

మున్ను ఇంద్రునివంచించి పులోమపుత్త్రియగు శచీదేవిని అనుహ్లాదుఁడపహరించినట్లు రాక్షసాధముఁడగు రావణుఁడు నన్ను మోసపుచ్చి తన వినాశమునకై సీతం గొనిపోయెను. ౬

పూర్వము శచీదేవిని అనుహ్లాదుఁడు హరించినందుకు సమ్మతించియుండిన శచీదేవితండ్రిని బులోముని ఇంద్రుఁడు వధించినట్లు శీఘ్రంబుననె యుద్ధంబునఁ గఱకుటమ్ముల నారావణుని వధించెదను. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౭

ఈమధ్యమునఆకాశంబునఁ దీక్ష్ణమయిన సూర్యకాంతి నావరించుచుఁ బెద్దదుమ్ము లేచినది. ౮

ఆమహాపరాగము నిండుటచేత దిశలు దెలియవయ్యె. పర్వతవనంబులతో భూమియుఁ జలనంబు నొందెను. ౯

తతో నగేన్ద్రసంకాశై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహాబలైః,
కృత్స్నా సంఛాదితా భూమి రసంఖ్యేయైః ప్లవఙ్గమైః. ౧౦
నిమేషా న్తరమాత్రేణ తత స్తై ర్హరియూథపైః,
కోటీశతపరీవారైః కామరూపిభి రావృతా. ౧౧
నాదేయైః పార్వతీయై శ్చ సాముద్రై శ్చ మహాబలైః,
హరిభి ర్మేఘనిర్హ్రాదై రన్యై శ్చ వనచారిభిః. ౧౨

తరుణాదిత్యవర్ణై శ్చ శశిగౌరై శ్చ వానరైః,
పద్మకేసరవర్ణై శ్చ శ్వేతై ర్మేరుకృతాలయైః. ౧౩
కోటీసహస్రై ర్దశభిః శ్రీమా న్పరివృత స్తదా,
వీర శ్శతవలి ర్నామ వానరః ప్రత్యదృశ్యత. ౧౪
తతః కాఞ్చనశైలాభ స్తారాయా వీర్యవా న్పితా,
అనేకై ర్దశసాహస్రైః కోటిభిః ప్రత్యదృశ్యత. ౧౫

తథా పరేణ కోటీనాం సహస్రేణ సమన్వితః,
పితా రుమాయా స్సంప్రాప్త స్సుగ్రీవశ్వశురో విభుః. ౧౬
పద్మకేసరసంకాశ స్తరుణార్కనిభాననః,
బుద్ధిమా న్వానరశ్రేష్ఠ స్సర్వవానరసత్తమః. ౧౭
అనీకై ర్బహుసాహస్రై ర్వానరాణాం సమన్వితః,
పితా హనుమత శ్శ్రీమా న్కేసరీ ప్రత్యదృశ్యత. ౧౮

గోలాఙ్గూలమహారాజో గవాక్షో భీమవిక్రమః,
వృతః కోటిసహస్రేణ వానరాణా మదృశ్యత. ౧౯

ఆంతఁ బర్వతాకారులునగు అపకోటులుగలవారలును మహాబలశాలులు నగు లెక్కకు మీఱినవానరులు భూమినంతయు వ్యాపించి నిలిచిరి. ౧౧

అంత నిమేషమాత్రంబున ఒక్కొక్కరు నూఱుకోటుల పరివారముగల వారలును కామరూపులును మహాబలులును మేఘమునకుంబోలె మహాధ్వనిగల వారలునగు వానరయూథపులు నదీతీరభవులును పర్వతమందలివారలును సముద్రతీరంబుల నుండువారలును మఱియు నితరులగువానరులు పెక్కండ్రును వచ్చి భూమియంతయు నావరించిరి. ౧౧,౧౨

అప్పుడు కొందఱు బాలసూర్యునివలె నెఱ్ఱనిమేనుగలవారలును గొందఱు చంద్రునివలె గౌరవర్ణులును గొందఱు కమలకింజల్కములవంటి వర్ణముగలవారలును గొందఱు ధవళవర్ణులునునగు మేరుపర్వతనివాసులయిన పదివేలకోట్లవానరవీరులచేఁ బరివృతుఁడై పరాక్రమవంతుఁడైన శ్రీమంతుఁడగు శతవలియను వానరుఁడు చూపట్టెను. ౧౩,౧౪

అంత బంగారుకొండవంటి మేనుగలవాఁడును బరాక్రమవంతుఁడునగు తారతండ్రి సుషేణుఁడు అనేకములయిన పదివేలకోట్లుగల వానరసేనతోఁ గూడినవాఁడై కనఁబడెను. ౧౫

అట్లు సుగ్రీవునిమామయు వానరయూథపుఁడునగు రుమతండ్రి తారుఁడు వేయికోటుల వానరులతోఁ గూడినవాఁడై వచ్చిచేరెను. ౧౬

అంతఁ గమలకింజల్కములవంటి మేనును బాలసూర్యునివంటి మోమునుగలవాఁడును బుద్ధిమంతుఁడును సమస్తవానరులలోను శ్రేష్ఠుఁడును శ్రీమంతుఁడునగు హనుమంతునితండ్రి కేసరియను వానరోత్తముఁడు ఇరువదియొక్కవేలయొనమన్నూటడెబ్బదిమందివానరులుగల అనీకములతోఁ బెక్కువేలతో వచ్చి యగపడెను. ౧౭,౧౮

భయంకరమయిన పరాక్రమముగలవాఁడగు గోలాంగూలరాజయిన గవాక్షుఁడు వేయికోట్లవానరులతోఁ గూడ వచ్చిచేరెను. ౧౯

ఋక్షాణాం భీమవేగానాం ధూమ్ర శ్శత్రునిబర్హణః,
వృతః కోటిసహస్రాభ్యాం ద్వాభ్యాం సమభివర్తత. ౨౦

మహాచలనిభై ర్ఘోరైః పనసో నామయూథపః,
ఆజగామ మహావీర్య స్తిసృభిః కోటిభి ర్వృతః. ౨౧

నీలాఞ్జనచయాకారో నీలో నామాఽథ యూథపః,
అదృశ్యత మహాకాయః కోటిభి ర్దశభి ర్వృతః. ౨౨
తతః కాఞ్చనశైలాభో గవయో నామ యూథపః,
ఆజగామ మహావీర్యః పఞ్చభిః కోటిభి ర్వృతః. ౨౩

దరీముఖశ్చ బలవా న్యూథపోఽభ్యాయయౌ తదా,
వృతః కోటిసహస్రేణ సుగ్రీవం సముపస్థితః ౨౪
మైన్ద శ్చ ద్వివిద శ్చోభా వశ్విపుత్రౌ మహాబలౌ,
కోటికోటిసహస్రేణ వానరాణా మదృశ్యతామ్. ౨౫
గజ శ్చ బలవా న్వీరః కోటిభి స్తిసృభి ర్వృతః,
ఆజగామ మహాతేజా స్సుగ్రీవస్య సమీపతః. ౨౬
ఋక్షరాజో మహాతేజా జామ్బవాన్నామ నామతః,
కోటిభి ర్దశభిః ప్రాప్త స్సుగ్రీవస్య వశే స్థితః. ౨౭
రుమణ్వాన్నామ విక్రాన్తో వానరో వానరేశ్వరమ్,
ఆయయౌ బలవాం స్తూర్ణం కోటీశతసమావృతః. ౨౮
తతః కోటిసహస్రాణాం సహస్రేణ శతేన చ,
పృష్ఠతోఽనుగతః ప్రాప్తో హరిభి ర్గన్ధమాదనః. ౨౯
తతః పద్మసహస్రేణ వృత శ్శఙ్కుశతేన చ,
యువరాజోఽఙ్గదః ప్రాప్తః పితృతుల్యపరాక్రమః. ౩౦

అంత శత్రువుల రూపుమాపునట్టి ధూమ్రుఁడనువాఁడు భయంకరముయినవేగముగల రెండువేలకోట్ల భల్లూకవీరులతోఁ గూడినవాఁడై వచ్చి చేరెను. ౨౦

మహాపరాక్రమశాలియగు పనసుఁడను వానరయూథపుఁడు పెద్దకొండంతటివారలును భయంకరాకారులునగు మూఁడుకోట్లవానరవీరులతోఁ గూడినవాఁడై వచ్చెను. ౨౧

అంత కాటుకరాశివలె నల్లని గొప్పమేనుగల నీలుఁడను వానరయూథపుఁడు పదికోట్ల వానరవీరులతోఁ గూడినవాఁడై కానంబడెను. ౨౨

అటుపిమ్మట మహాపరాక్రమశాలియు మేరుపర్వతమువంటి మేనుగలవాఁడునగు గవయుఁడను వానరవీరుఁడు పదికోట్లవానరులంగూడి వచ్చి చేరెను. ౨౩

అంత మహాబలుఁడగు దరీముఖుండను వానరోత్తముఁడు వేయికోట్ల వానరవీరులతోఁ గూడ వచ్చి సుగ్రీవునియెదుట నిలిచెను. ౨౪

అంత అశ్వినీదేవతలకొడుకులు మహాబలశాలులు మైందద్వివిదులిద్దఱును వేయికోటికోట్ల వానరసైనికులతోఁ గూడినవారలయి కనఁబడిరి. ౨౫

గొప్ప పరాక్రమంబులుగలిగి వీరుఁడయిన గజుండను వానరుఁడు మూడుకోట్ల వానరులతోఁ గూడ సుగ్రీవునిసమీపంబునకు వచ్చెను. ౨౬

మహాపరాక్రమశాలియగు భల్లూకరాజయిన జాంబవంతుఁడు పదికోట్ల బలంబులతో వచ్చి సుగ్రీవుగొలిచి నిలిచెను. ౨౭

బలపరాక్రమశాలియగు రుమణ్వంతుఁడను వానరవీరుఁడు నూఱుకోట్లబలంబులతోఁ గూడినవాఁడై శీఘ్రంబున సుగ్రీవునియొద్దకుఁ జేరెను. ౨౮

అంతఁ బదిలక్షలకోట్లవానరులతోను లక్షకోట్లవానరులతోనుంగూడి గంధమాదనుఁడను వానరవీరుఁడు వచ్చి చేరెను. ౨౯

అంత తండ్రితో సమానమయిన పరాక్రమంబుగల యువరాజయిన యంగదుఁడు వేయిపద్మంబులును నూఱుశంఖంబులునుగల బలంబులంగూడి సుగ్రీవునియొద్దకు వచ్చెను. ౩౦

తత స్తారాద్యుతి స్తారో హరి ర్భీమపరాక్రమః,
పఞ్చభి ర్హరికోటీభి ర్దూరతః ప్రత్యదృశ్యత. ౩౧

ఇన్ద్రజానుః కపి ర్వీరో యూథపః ప్రత్యదృశ్యత,
ఏకాదశానాం కోటీనా మీశ్వర స్తై స్స సంవృతః. ౩౨

తతో రమ్భ స్త్వనుప్రాప్త స్తరుణాదిత్యసన్నిభః,
అయుతే నావృత శ్చైవ సహస్రేణ శతేన చ. ౩౩

తతో యూథపతి ర్వీరో దుర్ముఖో నామ వానరః,
ప్రత్యదృశ్యత కోటిభ్యాం ద్వాభ్యాం పరివృతో బలీ. ౩౪
కైలాసశిఖరాకారై ర్వానరై ర్భీమవిక్రమైః,
వృతః కోటిసహస్రేణ హనూమా న్ప్రత్యదృశ్యత. ౩౫
నల శ్చాపి మహావీర్య స్సంవృతో ద్రుమవాసిభిః,
కోటీశతేన సంప్రాప్త స్సహస్రేణ శతేన చ. ౩౬
తతో దధిముఖ శ్శ్రీమా న్కోటిభి ర్దశభి ర్వృతః,
సంప్రాప్తోఽభిమత స్తస్య సుగ్రీవస్య మహాత్మనః. ౩౭
శరభః కుముదో వహ్ని ర్వానరో రంహ ఏవచ,
ఏతే చాన్యేచ బహవో వానరాః కామరూపిణః. ౩౮
ఆవృత్య పృథివీం సర్వాం పర్వతాంశ్చ వనాని చ,
యూథపా స్సమనుప్రాప్తా స్తేషాం సంఖ్యా న విద్యతే. ౩౯
ఆగతాశ్చ విశిష్టా శ్చ పృథివ్యాం సర్వవానరాః,

ఆప్లవన్తః ప్లవన్త శ్చ గర్జన్త శ్చ ప్లవఙ్గమాః. ౪౦

అంత నక్షత్రమువలెఁ బ్రకాశించుచున్నవాఁడును భయంకరమయిన పరాక్రమంబుతో నొప్పినవాఁడునగు తారుండనువానరవీరుఁడు (రుమ తండ్రికన్నమతియొకతారుఁడని యెఱుంగునది.) అయిదుకోట్లవానరులతో వచ్చి దూరంబునఁ గనఁబడెను. ౩౧

పరాక్రమవంతుఁడును వానరసమూహనాయకుఁడును పదునొకండు కోట్లవానరుల కొడయండునగు నింద్రజానువను వానరవీరుఁడు ఆసమస్తవానరులతోఁ గూడినవాఁడై యగపడెను. ౩౨

అంత బాలసూర్యునివలె నెఱ్ఱని మేనుగల రంభుఁడు దశసహస్రములుగాను సహస్రంబులుగాను శతంబులుగాను బన్నియున్న వానరబలంబులతో నేతెంచెను. ౩౩

అంతబలపరాక్రమంబులుగలదుర్ముఖుఁడనువానరయూథనాథుఁడు రెండుకోటుల వానరవీరులచేఁ బరివృతుఁడై సుగ్రీవు నెదుట బొలిచి నిలిచెను.

భయంకరపరాక్రములగు కైలాసశిఖరంబులవంటి వానరవీరులు వేయికోట్లమంది పరివేష్టింప హనుమంతుఁడు చూడనొప్పెను. ౩౪

మహాపరాక్రమశాలియగు నలుఁడు తన్ను వానరులు నూఱుకోట్లవారు సహస్రంబులుగాను శతంబులుగాను బరివేష్టించికొలువ నేతెంచెను. ౩౫

అంత మహాపరాక్రమశాలియగు సుగ్రీవునకుఁ బ్రియబంధువగు శ్రీమంతుఁడయిన దధిముఖుఁడు పదికోట్లవానరవీరులు కొలువ నరుగుదెంచెను. ౩౬

శరభుఁడును గుముదుఁడును వహ్నియు రంహుఁడును వీరలునుమఱియు నితరులు కామరూపులగు వానరయూథపతులు పెక్కండ్రునువచ్చి భూమియంతయుఁ బర్వతంబులును వనంబులు నావరించిరి. వారల లెక్కపెట్ట నలవిగాదు. ౩౭, ౩౮

భూలోకంబున నున్న దేవతావీర్యజాతులగు నప్రాకృతవానరులును సాధారణులగు ప్రాకృతవానరులును అందఱును వచ్చిరి.

ఆవానరులు ఉత్సాహాతిశయమునం జేసి దాఁటుచు నెగురుచు గర్జిం

అభ్యవర్తన్త సుగ్రీవం సూర్య మభ్రగణా ఇవ,
కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః. ౪౧
శిరోభి ర్వానరేన్ద్రాయ సుగ్రీవాయ న్యవేదయన్,

అపరే వానరశ్రేష్ఠా స్సంయమ్య చ యథోచితమ్. ౪౨
సుగ్రీవేణ సమాగమ్య స్థితాః ప్రాఞ్జలయ స్తదా,

సుగ్రీవ స్త్వరితో రామే సర్వాం స్తా న్వానరర్షభాన్. ౪౩
నివేదయిత్వా ధర్మజ్ఞః స్థితః ప్రాఞ్జలి రబ్రవీత్,

యథాసుఖం పర్వతనిర్ఝరేషు
వనేషు సర్వేషు చ వానరేన్ద్రాః,
నివేశయిత్వా విధివ ద్బలాని
బలం బలజ్ఞః ప్రతిపత్తు మీష్టే. ౪౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకోనచత్వారింశ స్సర్గః.

---

## చత్వారింశ స్సర్గః.

అథ రాజా సమృద్ధార్థ స్సుగ్రీవః ప్లవగేశ్వరః,
ఉవాచ నరశార్దూలం రామం పరబలార్దనమ్. ౧

ఆగతా వినివిష్టాశ్చ బలినః కామరూపిణః,
వానరా వారణేన్ద్రాభా యే మద్విషయవాసినః. ౨
త ఇమే బహువిక్రాన్తై ర్హరిభి ర్భీమవిక్రమైః,

చుచు మేఘంబులు సూర్యునిఁ బరివేష్టించునట్లు సుగ్రీవునిఁ బరివేష్టించి నిలిచిరి. ౪౦

గొప్పభుజములతోఁ నొప్పుచున్న యా వానరవీరులు అనేకవిధముగా సింహనాదములు సేయుచుఁ దమతల లెత్తి చూపి వానరరాజు సుగ్రీవునకుఁ దమరాక నెఱిఁగించుకొనిరి. ౪౧

అప్పుడు మఱికొందఱు సుగ్రీవుని సమీపంబునకుఁ బోఁదగిన యు త్తమవానరులు సవినయముగా వస్త్రాదులు ముడుచుకొని సుగ్రీవుని సమీపంబుఁజేరి చేతులుమోడ్చి నిలుచుండిరి. ౪౨

సమస్తధర్మంబులం దెలిసిన సుగ్రీవుఁడు ఆవానరోత్తముల నందఱ శ్రీరామునకు సమర్పించి యంత లేచి నిలుచున్నవాఁడై యావానరవీరుల నందఱఁ గలయంగనుంగొని యిట్లనియె. ౪౩

వానరోత్తములారా! యూథపతి యగువాఁడు తన సైన్యమంతయు కొండలసెలయేళ్లతీరంబులందును వనంబులందును సుఖముగా శాస్త్రోక్తవిధిని విడియించినచోఁ దనసేనయొక్క విశేషములం దెలియ సమర్థుఁడగుం గావున మీరలు అట్లు గావింపుఁడు. ౪౪

ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

---

## నలువదవ సర్గము.

అంత సమృద్ధమయిన సాధనసంపత్తిగల వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు శత్రుసైన్యంబుల మర్దించువానిఁ బురుషోత్తము రాముంజూచి యిట్లని పలికెను. ౧

నారాజ్యంబున నివసించునట్టి బలవంతులును గామరూపులును గొప్ప యేనుఁగులంతటివారలునగు వానరవీరులందఱును వచ్చి విడిసియున్నారు. ౨

భయంకరాకారులును దైత్యదానవులంబోలినవారు నగునట్టి యూ

ఆగతా వానరా ఘోరా దైత్యదానవసన్నిభాః. 3

ఖ్యాతకర్మాపదానాశ్చ బలవన్తో జితక్లమాః,
పరాక్రమేషు విఖ్యాతా వ్యవసాయేషు చోత్తమాః. ౪

పృథివ్యమ్బుచరా రామ! నానానగనివాసినః,
కోట్యగ్రశ ఇమే ప్రాప్తా వానరా స్తవ కింకరాః. ౫

నిదేశవర్తిన స్సర్వే సర్వే గురుహితే రతాః,
అభిప్రేత మనుష్ఠాతుం తవ శక్ష్య న్త్యరిన్దమ!. ౬

త ఇమే బహుసాహస్రై రనీకై ర్భీమవిక్రమైః,

యన్మన్యసే నరవ్యాఘ్ర! ప్రాప్తకాలం త దుచ్యతామ్. ౭
త్వత్సైన్యం త్వద్వశే యుక్త మాజ్ఞాపయితు మర్హసి,

కామ మేషా మిదం కార్యం విదితం మమ తత్త్వతః. ౮
తథాపి తు యథాతత్త్వ మాజ్ఞాపయితు మర్హసి,

ఇతి బ్రువాణం సుగ్రీవం రామో దశరథాత్మజః. ౯
బాహుభ్యాం సంపరిష్వజ్య ఇదం వచన మబ్రవీత్,
జ్ఞాయతాం మమ వైదేహీ యది జీవతి వా నవా. ౧౦

వచ్చినవానరయూధపతులందఱును మహాపరాక్రమశాలులును శీఘ్రగమనము గలవారలునగు పెక్కండ్రు వానరులంగూడి వచ్చినారు. ౩

వీరలు మున్ను గావించినకార్యములు ఒకొకటియుఁ బ్రసిద్ధికెక్కించి యున్నవి. వీరలందఱు బహుదూరము లంఘించుట మొదలయిన యితరులకు సాధ్యములుకాని కార్యములందు సమర్థులు బలవంతులు శ్రమములేనివారలు పెక్కుమార్లు లోకప్రసిద్ధముగా శత్రువ్రల మార్కొన్నవారు. ప్రయత్నములు సేయుటయందు ఉత్తములు. ౪

రాముఁడా! భూమియందును జలములయందును సంచరింపఁజాలినవారలు నానావిధపర్వతంబుల నివసించునట్టి వానరవీరులు అనేకకోట్లమంది వచ్చియున్నారు. వీరలందఱు నీకింకరులు. ౫

శత్రువుల వధించునట్టి రాముఁడా! వీరలు అందఱు నీయాజ్ఞను ఎంతమాత్రము జవదాఁటనివారలు. అందఱును స్వామిహితమునే గోరువారలు. నీయభిప్రాయమును నెఱవేర్ప సామర్థ్యముగలవారలు. ౬

ఈవానరయూధపతులు ఒకొకరును భయంకరమయిన పరాక్రమముగల పెక్కువేలసైన్యములతోఁ గూడియున్నారు.

మనుష్యశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఈకాలంబున నేది యుచితమని నీకుఁ దోఁచుచున్నదో అది వచింపుము. ఇదంతయు నీయాజ్ఞయందుండుట కాసక్తమయియున్నది. నీసైన్యము కావున నీయిష్టముచొప్పున నాజ్ఞాపింపుము. ౭

ఇవ్వానరవీరులు సేయవలసినకార్యము తత్త్వము నాకును దెలిసియే యున్నది. అయినను నీమనసునం దోఁచినవిధంబున నీవే వీరల కాజ్ఞయొసంగుము. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౮

ఇవ్విధంబున సుగ్రీవుఁడు నుడువుటయు దశరథపుత్త్రుఁడగు రాముఁడు అతని బాహువులఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యిట్లని పలికెను. ౯

మహాపండితుఁడా! నాప్రియురాలయిన సీత బ్రతికియున్నదాలేదా.

నచ దేశో మహాప్రాజ్ఞ! యస్మి న్వసతి రావణః,
అధిగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ. ౧౧
ప్రాప్తకాలం విధాస్యామి తస్మి న్కాలే సహ త్వయా,
నాహ మస్మి న్ప్రభుః కార్యే వానరేశ! న లక్ష్మణః. ౧౨
త్వ మస్య హేతుః కార్యస్య ప్రభు శ్చ ప్లవగేశ్వర!,

త్వ మేవాఽజ్ఞాపయ విభో! మమ కార్యవినిశ్చయమ్. ౧౩
త్వం హి జానాసి య త్కార్యం మమ వీర! నసంశయః,

సుహృ ద్ద్వితీయో విక్రాన్తః ప్రాజ్ఞః కాలవిశేషవిత్. ౧౪
భవా నస్మద్ధితే యుక్త స్సుకృతార్థోఽర్థవిత్తమః,

ఏవ ముక్త స్తు సుగ్రీవో వినతం నామ యూథపమ్ ౧౫
అబ్రవీ ద్రామసాన్నిధ్యే లక్ష్మణస్య చ ధీమతః,
శైలాభం మేఘనిర్ఘోష మూర్జితం ప్లవగేశ్వరః. ౧౬

సోమసూర్యాత్మజై స్సార్ధం వానరై ర్వానరోత్తమ!,
దేశకాలనయై ర్యుక్తః కార్యాకార్యవినిశ్చయే. ౧౭
వృత శ్శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్,
అధిగచ్ఛ దిశం పూర్వాం సశైలవనకాననామ్. ౧౮
తత్ర సీతాంచ వైదేహీం నిలయం రావణస్యచ,
మార్గధ్వం గిరిశృఙ్గేషు వనేషు చ నదీషు చ. ౧౯
నదీం భాగీరథీం రమ్యాం సరయూం కౌశికీం తథా,

యనుసంగతియు రావణుఁడు నివసించుప్రదేశమును దెలియవలెను. ౧౦

సీతఁ బ్రతికియున్నవృత్తాంతమును దెలిసినంతనే యాసమయంబున నేది చేయుట యుచితమో దాని మనమిద్దఱమును గావింతము. ౧౧

వానరేశ్వరుఁడవగు సుగ్రీవుఁడా! ఈకార్యము విషయమయి నేను గాని లక్ష్మణుఁడుగాని నియామకులము గాము. ఈకార్యమునకు సాధించువాఁడవును నియామకుఁడవును నీవే. ౧౨

నాథుఁడా! ఈకార్యము విషయమయిన నానిశ్చయమును వీరలకు నీవే యాజ్ఞాపింపుము; నాకార్య మెట్టిదో అవిషయమంతయు నీకే తెలియును; సందియము లేదు. ౧౩

నీవు నాకు లక్ష్మణునివంటిస్నేహితుఁడవు; (నీవు నాకుస్నేహితుఁడవు వినయసంపన్నుఁడవు) పరాక్రమవంతుఁడవు; పండితుఁడవు; దేశకాలవిశేషంబులఁ దెలిసినవాఁడవు; మాకు హితముఁగోరువాఁడవు; అర్థశాస్త్రముచక్కఁగా నేర్చినవాఁడవు; కార్యములు సాధించుటయందు సమర్థుఁడవు. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౪

వానరనాథుఁడు సుగ్రీవుఁడు రామునివచనంబు విని రాముఁడును బుద్ధిమంతుఁడగు లక్ష్మణుఁడును వినుచుండఁగాఁ బర్వతాకారుఁడును మేఘగర్జనమువంటిగర్జనముగలవాఁడును దృఢశరీరుఁడునగు వినతుండను వానరయూథనాయకుం జూచి యిట్లని పలికెను. ౧౫,౧౬

వానరశ్రేష్ఠుఁడగు వినతుఁడా! నీవు దేశకాలముల ననుసరించి నీతియుక్తంబుగా కార్యాకార్యంబుల నిశ్చయించుచు బలవంతులగు లక్షవానరవీరులచేఁ బరివృతుఁడవై చంద్రసూర్యపుత్త్రులగు వానరులతోఁ గూడినవాఁడవై పర్వతారణ్యసహితంబయిన తూర్పుదిక్కునకుఁ బొమ్ము. ౧౭,౧౮

అతూర్పుదిక్కునఁ బర్వతశిఖరంబులందును వనంబులందును నదులందును సీతాదేవిని రావణు నివాసంబును వెదకి చూడుఁడు. ౧౯

మీరలు రమణీయమగు గంగానదికిని సరయూనదికిని కౌశికికిని యము

కాళిన్దీం యమునాం రమ్యాం యామునంచ మహాగిరిమ్. ౨౦
సరస్వతీం చ సిన్ధుంచ శోణం మణినిభోదకమ్,
మహీం కాలమహీంచైవ శైలకాననశోభితామ్. ౨౧
బ్రహ్మమాలా న్విదేహాంశ్చ మాళవా న్కాశికోసలాన్,
మాగధాంశ్చ మహాగ్రామా న్పుణ్డ్రా న్వఙ్గాం స్తథైవ చ. ౨౨
పత్తనం కోశకారాణాం భూమిం చ రజతాకరామ్,
సర్వ మేత ద్విచేతవ్యం మృగయద్భి స్తత స్తతః. ౨౩
రామస్య దయితాం భార్యాం సీతాం దశరథస్నుషామ్,
సముద్ర మవగాఢాంశ్చ పర్వతా న్పత్తనానిచ. ౨౪
మన్దరస్యచ యే కోటిం సంశ్రితాః కేచి దాయతామ్,
కర్ణప్రావరణా శ్చైవ తథా చా ప్యోష్ఠకర్ణకాః. ౨౫
ఘోరా లోహముఖా శ్చైవ జవనా శ్చైకపాదకాః,
అక్షయా బలవ న్తశ్చ పురుషాః పురుషాదకాః. ౨౬
కిరాతాః కర్ణచూడాశ్చ హేమాఙ్గాః ప్రియదర్శనాః,
ఆమమీనాశనా స్తత్ర కిరాతా ద్వీపవాసినః. ౨౭
అ న్తర్జలచరా ఘోరా నరవ్యాఘ్రా ఇతి శ్రుతాః,
ఏతేషా మాలయా స్సర్వే విచేయాః కాననౌకసః. ౨౮

గిరిభి ర్యేచ గమ్య న్తే ప్లవనేన ప్లవేన చ,
రత్నవ న్తం యవద్వీపం స ప్తరాజ్యోపశోభితమ్. ౨౯
సువర్ణరూప్యకం చైవ సువర్ణాకరమణ్డితమ్,
యవద్వీప మతిక్రమ్య శిశిరో నామ పర్వతః. 3౦
దివం స్పృశతి శృఙ్గేణ దేవదానవసేవితః,

నానదికిని యమునాసంబంధి పర్వతంబునకును సరస్వతీనదికిని మణివలె స్వచ్ఛమయిన జలముగల శోణానదమునకును మహీదేశమునకును పర్వతారణ్యంబులతో నొప్పుచున్న కాలమహీదేశమునకును బ్రహ్మమాల విదేహమాళవ కాశి కోసలదేశములకును గొప్పగ్రామములుగల మగధదేశమునకును పుండ్రవంగదేశములకును గోశకారులను రాజుల రాజధానికిని వెండిగనులుగల భూమికిని బోయి యాస్థలంబుల నంతయు రాముని ప్రియభార్యయు దశరథుని కోడలునగు సీతాదేవిని వెదకుఁడు. ౨౦-౨౩

సముద్రమధ్యంబుననున్న పర్వతంబులను పట్టణంబులను విశాలమయిన మందరపర్వతశిఖరమును భయంకరాకారులగు మనుష్యులు ఆక్రయించి యున్నారు; వారలు కొందఱు చెవులులేనివారలును కొందఱు పెదవులందుఁ జెవులుగలవారలును కొందఱు భయంకరమయిన ఇనుపమోముగలవారలును కొందఱు ఒకటె పాదము గలిగి మహావేగులును కొందఱు మనుష్యుల భక్షించుచు మరణమే యెఱుఁగని వారలయి బలవంతులైనవారలునై యుందురు; మఱియుఁ గర్ణమునందు జుట్టుగల్గి బంగారుచాయ మేనుగలవారలై చూపరులకుఁ బ్రియంబుగల్గించు కిరాతులును, పక్వంబులుకాని మత్స్యము లాహారముగా ద్వీపంబుల వసించుచు జలంబులోపల సంచరింపఁజాలి సగము మనుష్యశరీరమును సగము వ్యాఘ్రదేహమును గల్గి భయంకరులయిన మఱియొకతెగ కిరాతులునుం గలరు; వారల నివాసములయం దంతటను సీతను వెదకవలయును. ౨౪-౨౮

మీరలు పర్వతంబులచేఁబోఁదగిన ద్వీపంబులకును ఎగిరిదాఁటి చేరఁదగిన ద్వీపంబులకును తెప్పచేఁ బొందఁదగిన ద్వీపంబులకునుబోయి రత్నంపుగనులుగలదియు ఏడుఖండములుగా విభజింపఁబడినదియునగు యవద్వీపంబును బంగారుగనులచేఁ బ్రకాశించునట్టి సువర్ణరూప్యకమను ద్వీపంబునుం బొంది యంత యావద్వీపము నతిక్రమించి యత్యున్నతమయిన శిఖరముగలదియు

ఏతేషాం గిరిదుర్గేషు ప్రపాతేషు వనేషు చ. 3౧
మార్గధ్వంసహితా స్సర్వే రామపత్నీం యశస్వినీమ్,

తతో రక్తజలం శోణ మగాధం శీఘ్రగామినమ్. 3౨
గత్వా పారం సముద్రస్య సిద్ధచారణసేవితమ్,
తస్య తీర్థేషు రమ్యేషు విచిత్రేషు వనేషు చ. 33
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః,

పర్వతప్రభవా నద్య స్సురమ్యా బహునిష్కుటాః. 3౪
మార్గితవ్యా దరీమన్తః పర్వతాశ్చ వనానిచ,

తత స్సముద్రద్వీపాంశ్చ సుభీమా న్ద్రష్టు మర్హథ. 3౫
ఊర్మిమన్తం సముద్రంచ క్రోశన్త మనిలోద్ధతమ్,

తత్రాసురా మహాకాయా శ్ఛాయాం గృహ్ణన్తి నిత్యశః. 3౬
బ్రహ్మణా సమనుజ్ఞాతా దీర్ఘకాలం బుభుక్షితాః,

తం కాలమేఘప్రతిమం మహోరగనిషేవితమ్. 3౭
అభిగమ్య మహానాదం తీర్థేనైవ మహోదధిమ్,
తతో రక్తజలం భీమం లోహితం నామ సాగరమ్. 3౮
గతా ద్రక్ష్యథ తాం చైవ బృహతీం కూటశాల్మలీమ్,
గృహం చ వైనతేయస్య నానారత్నవిభూషితమ్. 3౯
తత్ర కైలాససంకాశం విహితం విశ్వకర్మణా,

దేవదానవసేవితంబునగు శిశిరపర్వతంబునొంది యాద్వీపంబులందును ఆపర్వతంబునందును పర్వతదుర్గమప్రదేశంబులందును నిర్ఝరంబులందును వనంబులందును అందఱుం గూడి కీర్తిసంపన్నయగు సీతాదేవి నన్వేషింపుఁడు. ౨౯-౩౧

అంత మీరలు లవణసముద్రము నవ్వలితీరంబుఁజేరి యచటనున్న సిద్ధచారణ సేవితంబును ఎఱ్ఱనిజలముగలదియు నగాధంబును వేగంబుగాఁ బ్రవహించునదియునగు శోణనదము నొంది యందలి రమణీయములయిన రేవులందును నానావిధవనంబులందును అచ్చటచ్చట సీతాదేవిని రావణుని వెదకవలయును. ౩౨,౩౩

అంతఁ బ్లక్షద్వీపమునందు మనోహరంబులును అనేకములయిన యుద్యానవనములచే నొప్పుచున్నవియుఁ బర్వతంబులం బుట్టినవియునగు నదుల తీరంబులందును బెక్కుచఱియలతోఁ గూడిన పర్వతంబులయందును వనంబులయందును సీతాదేవిని రావణుని వెదకుఁడు. ౩౪

అంత మీరు భయంకరాకారంబులగు నిక్షుసముద్రద్వీపంబులను గాలిచేఁ గొట్టఁబడినదై గొప్పకరళ్లతో గర్జించుచుండు నిక్షుసముద్రంబునుం జూడఁగలరు. ౩౫

ఆయిక్షుసముద్రంబున మహాకాయులును బహుకాలముగా నాఁకలిగొనియున్నవారలునగు నసురులు బ్రహ్మదేవునివరంబునంజేసి యెల్లప్పుడును మనుష్యులనీడలను మ్రింగుటచే వారలమ్రింగుచుందురు. ౩౬

మీరలు ప్రళయకాలమేఘమువలె మహాభయంకరమయిగొప్పసర్పములచే నధిష్ఠితమయి మహాధ్వనితో గర్జించుచుండు నయ్యిక్షుసముద్రంబును ఆరాక్షసులకుఁ జిక్కక యుపాయమునం దాఁటి యావల ఎఱ్ఱనిజలంబుగలిగి భయంకరమయిన మధుసముద్రంబుఁ జూడఁగలరు; అచ్చట విశాలమును సుప్రసిద్ధమయిన కొండబూరుగువృక్షము గానంబడును; ఆశాల్మలిద్వీపమునందు విశ్వకర్మనిర్మితంబును గైలాసపర్వతంబువలె ధవళవర్ణమయి యున్నతంబైనదియు నానావిధరత్నాలంకృతములగు గరుత్మంతునిగృహముం జూడఁగలరు. ౩౭-౩౯

తత్ర శైలనిభా భీమా మన్దేహా నామ రాక్షసాః. ౪౦
శైలశృఙ్గేషు లమ్బన్తే నానారూపా భయావహాః,

తే పతన్తి జలే నిత్యం సూర్య స్యోదయనం ప్రతి. ౪౧
నిహతా బ్రహ్మతేజోభి రహ న్యహని రాక్షసాః,

అభితప్తా శ్చ సూర్యేణ లమ్బన్తే స్మ పునః పునః. ౪౨

తతః పాణ్డురమేఘాభం క్షీరోదం నామ సాగరమ్,
గతా ద్రక్ష్యథ దుర్ధర్షా ముక్తాహార మి వోర్మిభిః. ౪౩

తస్య మధ్యే మహాన్ శ్వేత ఋషభో నామ పర్వతః,
దివ్యగన్ధైః కుసుమితై రాజతైశ్చ నగై ర్వృతః. ౪౪

సరశ్చ రాజతైః పద్మై ర్జ్వలితై ర్హేమకేసరైః,
నామ్నా సుదర్శనం నామ రాజహంసై స్సమాకులమ్. ౪౫

విబుధా శ్చారణా యక్షాః కిన్నరా స్సాప్సరోగణాః,
హృష్టా స్సమభిగచ్ఛన్తి నళినీం తాం రిరంసవః. ౪౬
క్షీరోదం సమతిక్రమ్య తతో ద్రక్ష్యథ వానరాః!,
జలోదం సాగరశ్రేష్ఠం సర్వభూతభయావహమ్. ౪౭

తత్ర తత్కోపజం తేజః కృతం హయముఖం మహత్,
అస్యాహు స్తన్మహావేగ మోదనం సచరాచరమ్. ౪౮

ఆశాల్మలిద్వీపమునందు నానావిధములయిన రూపములుగలవారలును పర్వతంబులంతటి భయంకరంబులైనయాకారములు గలవారలునగు మందేహులనురాక్షసులు పర్వతశిఖరంబుల నధిష్ఠించియుందురు. ౪౦

ఆ మందేహులు ఎల్లప్పుడును ప్రత్యహమును సూర్యోదయకాలంబున బ్రాహ్మణులుజపించు గాయత్రీమంత్రముయొక్క ప్రభావంబుచే నిహతులయి సముద్రజలంబులం బడుదురు. ౪౧

వారలట్లు జలంబులం బడుటయేగాక సూర్యుని వేఁడిమిచేతనుం బీడితులయి మరల శైలశృంగంబులం జేరుదురు. ౪౨

శత్రువుల కెదిరింపనలవిగాని మహాపరాక్రమముగల మీరలు అంత మార్గంబున ఘృతసముద్రమును కుశద్వీపమును దధిసముద్రమును క్రౌంచద్వీపమును అతిక్రమించినవారలయి తెల్లనిమేఘమువలె నొప్పుచున్నదియు కరళ్లచే ముత్తెములహారము గలిగినట్లు శోభిల్లుచున్నదియు నగుక్షీరసముద్రమునుం జూడఁగలరు. ౪౩

క్షీరసముద్రమధ్యమున యుత్తమమైనతావితోఁగూడిన పుష్పములుగల రజతవృక్షములచే శోభిల్లుచున్న శ్వేతవర్ణమయిన ఋషభంబను మహాపర్వతంబొండు గలదు. ౪౪

బంగారు కింజల్కంబులుగల్గి దేదీప్యమానంబులయిన వెండికమలంబులతోను రాజహంసములతోను ఒప్పుచున్న సుదర్శనంబనుపేరుగల సరస్సును ఒకండుకలదు. ౪౫

దేవతలును చారణులును యక్షులును కిన్నరులును అప్సరసలంగూడి విహరించుటకై సంతోషంబున నాసుదర్శనసరస్సునకు వచ్చుచుందురు ౪౬

వానరులారా! మీరుక్షీరసముద్రము నతిక్రమించినపిమ్మట సమస్తభూతములకును భయంకరమయినదియు సమస్తసముద్రములలో నుత్తమమునగు శుద్ధజలసముద్రమును జూతురు. ౪౭

ఔర్వకోపంబునంబుట్టిన అశ్వముఖమయిన బడబాగ్నియని ప్రసిద్ధమయినయమ్మహాతేజస్సు ఆసముద్రజలంబుల నిక్షిప్తమయియున్నది; అయ్యది

తత్ర విక్రోశతాం నాదో భూతానాం సాగరౌకసామ్,
శ్రూయతే చ సమర్థానాం దృష్ట్వా తద్బడబాముఖమ్. ౪౯

స్వాదూద స్యోత్తరే దేశే యోజనాని త్రయోదశ,
జాతరూపశిలో నామ మహా న్కనకపర్వతః. ౫౦
తత్ర చన్ద్రప్రతీకాశం పన్నగం ధరణీధరమ్,
పద్మపత్త్రవిశాలాక్షం తతో ద్రక్ష్యథ వానరాః!. ౫౧
ఆసీనం పర్వత స్యాగ్రే సర్వభూతనమస్కృతమ్,
సహస్రశిరసం దేవ మన న్తం నీలవాససమ్. ౫౨

త్రిశిరాః కాఞ్చనః కేతు స్తాల స్తస్య మహాత్మనః,
స్థాపితః పర్వత స్యాగ్రే విరాజతి సవేదికః. ౫౩

పూర్వస్యాం దిశి నిర్మాణం కృతం త త్త్రిదశేశ్వరైః,

తతః పరం హేమమయ శ్శ్రీమా నుదయపర్వతః. ౫౪

తస్య కోటి ర్దివం స్పృష్ట్వా శతయోజన మాయతా,
జాతరూపమయీ దివ్యా విరాజతి సవేదికా. ౫౫

సాలై స్తాలై స్తమాలై శ్చ కర్ణికారై శ్చ పుష్పితైః,
జాతరూపమయై ర్దివ్యై శ్శోభతే సూర్యసన్నిభైః. ౫౬

ప్రళయకాలమున జంగమస్థావరసహితముగా మహావేగముగ నాజలమంత
యు దహించివేయును. ౪౭

అచట ఆజలసముద్రమునందు నివసించునట్టి భూతములు బలపరాక్ర
మసహితంబులయినను ఆబడబానలంబుఁ జూచి సహింపఁజాలక భయంబున
నఱచుచుండును; ఆధ్వని మీకు వినఁబడును. ౪౮

ఆజలసముద్రమున కావలితీరంబునఁ బదుమూడుయోజనంబుల దూరం
బున జాతరూపశిలంబను పేరుగల గొప్పకాంచనపర్వతం బొకండు గలదు.

వానరులారా! అంత నచ్చట నాజాతరూపశిల పర్వతశిఖరంబున నా
సీనుఁడై సమస్తభూతములచే నమస్కృతుఁడై చంద్రునివంటి ధవళదేహము
తోను నీలవస్త్రముతోను ప్రకాశించుచున్నవానిఁ దామరపూరేకులవంటి
విశాలములయిన నేత్రములుగల్గి వేయిశిరస్సులతో భాసిల్లుచు సమస్త
భూమిభారమును మోయుచున్నవాని సర్పమూర్తియయినదేవు నాదిశేషుం
జూడఁగలరు. ౫౧,౫౨

మహాత్ముఁడగు నయ్యనంతదేవుని ధ్వజమయిన కాంచనతాలవృక్షము
మూఁడుశిఖరములుగలదై వేదికాసహితంబుగా నాజాతరూపశిలపర్వతశిఖరం
బున స్థాపితమయి యెంతయు శోభిల్లుచుండును. ౫౩

దేవతలకును బ్రభువులయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఆతాలధ్వజము
ను పూర్వదిక్కునకు ఎల్లగా నేర్పఱచిరి.

అంతకుఁ బిమ్మట దేదీప్యమానంబయిన కాంచనమయంబగు నుదయప
ర్వత మున్నది. ౫౪

కాంచనమయంబును దివ్యంబు నగునయ్యుదయపర్వతము నగ్రభాగ
ము నూఱుయోజనము లున్నతంబై వేదికాసహితంబయి స్వర్గలోకంబు నొర
యుచు భాసిల్లుచున్నది. ౫౫

అయ్యది కాంచనమయంబులును దివ్యంబులును సూర్యబింబమువలె
వెలుఁగుచున్నవియునగు సాలవృక్షంబులును తాటిచెట్లును తమాలవృక్షంబు
లును పూచిన కొండగోఁగుచెట్లును గలిగి యెంతయు శోభిలుచుండును.

తత్ర యోజనవిస్తార ముచ్ఛ్రితం దశ యోజనమ్,
శృఙ్గం సౌమనసం నామ జాతరూపమయం ధ్రువమ్. ౫౭

తత్ర పూర్వం పదం కృత్వా పురా విష్ణు స్త్రివిక్రమే,
ద్వితీయం శిఖరే మేరో శ్చకార పురుషో త్తమః. ౫౮

ఉ త్తరేణ పరిక్రమ్య జమ్బూద్వీపం దివాకరః,
దృశ్యో భవతి భూయిష్ఠం శిఖరం త న్మహోచ్ఛ్రయమ్. ౫౯

తత్ర వైఖానసా నామ వాలఖిల్యా మహర్షయః,
ప్రకాశమానా దృశ్య న్తే సూర్యవర్ణా స్తపస్వినః. ౬౦

అయం సుదర్శనో ద్వీపః పురో యస్య ప్రకాశతే,
యస్మిం స్తేజ శ్చ చక్షు శ్చ సర్వప్రాణభృతా మపి. ౬౧

శైలస్య తస్య శృఙ్గేషు కన్దరేషు వనేషు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౬౨
కాఞ్చనస్య చ శైలస్య సూర్యస్య చ మహాత్మనః,
ఆవిష్టా తేజసా సంధ్యా పూర్వా రక్తా ప్రకాశతే. ౬౩

పూర్వ మేతత్కృతం ద్వారం పృథివ్యా భువనస్య చ,
సూర్య స్యోదయనం చైవ పూర్వా హ్యేషా దిగుచ్యతే. ౬౪

అయ్యుదయగిరి యగ్రభాగంబున, ఒకయోజనము వైశాల్యమును బది యోజనములు ఔన్నత్యమునుం గల్గి కాంచనమయమయి స్థిరమైన సౌమనసంబను శిఖర మున్నది. ౧౭

పూర్వము పురుషోత్తముఁడగు విష్ణువు బలిచక్రవర్తివలన మూఁడడుగుల నేల యడిగిపుచ్చుకొని కొలుచుకొనునప్పుడు మొదటియడుగును తూర్పుదిక్కునకు అవధియయిన ఈసౌమనసశృంగంబునందును రెండవయడుగును పశ్చిమదిశ కవధియయిన సావర్ణిమేరుశిఖరంబునందునుంచెను. ౧౮

సూర్యుఁడు అస్తమయానంతరము జంబూద్వీపము నుత్తరభాగంబునఁ బ్రదక్షిణంబుగాఁ జుట్టివచ్చి మిక్కిలియు నున్నతమునయిన యాసౌమనసశిఖరంబుఁ జేరినపిదప మేరుదక్షిణపార్శ్వంబున నున్నవారికి మనకందఱకును జక్కఁగాఁ గానఁబడును. ౧౯

ఆసౌమనసశిఖరంబున మహాతపస్సంపన్నులును సూర్యునకుంబోలెఁ దేజంబుగలవారలునగు వైఖానసులు వాలఖిల్యులను మహర్షులు దేదీప్యమానులయి కానంబడుదురు. ౨౦

సమస్తజీవులనేత్రములకును బ్రకాశము నొసంగునట్టిమహాతేజస్సు సూర్యుఁడు ఎచటఁ బ్రకాశించుచుండునో అట్టి యుదయపర్వతసమీపమందలి ద్వీపము అన్వర్థమయిన సుదర్శనంబను నామధేయముతో నొప్పును. ౨౧

ఆయుదయపర్వతమందలి శిఖరములయందును గుహాలయందును వనంబులందును దిరిగి యందందు సీతాదేవిని రావణుని వెదకుఁడు. ౨౨

కాంచనమయమయిన యుదయగిరితేజంబును మహాతేజుఁడగు సూర్యుని తేజంబును ఒండొంటితోఁ గలిసి భాసిల్లుటంజేసి ప్రాతఃకాలసంధ్య రక్తవర్ణమయి వెలుఁగుచున్నది ౨౩

ఈ తూర్పుదిశనే భూమికిని సమస్తలోకంబులకును మొదటిద్వారంబుగాను సూర్యునకు ఉదయస్థానముగాను బ్రహ్మదేవుఁడు నియమించెఁ గావున నిది పూర్వదిశయని చెప్పఁబడుచున్నది. ౨౪

తస్య శైలస్య పృష్ఠేషు నిర్ఝరేషు గుహాసు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౬౫
తతః పర మగమ్యా స్స్యా ద్దిక్పూర్వా త్రిదశావృతా,
రహితా చన్ద్రసూర్యాభ్యా మదృశ్యా తిమిరావృతా. ౬౬

శైలేషు తేషు సర్వేషు కన్దరేషు వనేషు చ,
యే చ నోక్తా మయా దేశా విచేయా తేషు జానకీ. ౬౭

ఏతావ ద్వానరై శ్శక్యం గన్తుం వానరపుఙ్గవాః!,
అభాస్కర మమర్యాదం న జానీమ స్తతః పరమ్. ౬౮

అధిగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ,
మాసే పూర్ణే నివర్తధ్వ ముదయం ప్రాప్య పర్వతమ్. ౬౯
ఊర్ధ్వం మాసా న్న వస్తవ్యం వస న్వధ్యో భవే న్మమ,
సిద్ధార్థా స్సన్నివర్తధ్వ మధిగమ్య తు మైథిలీమ్. ౭౦

మహేన్ద్రకాన్తాం వనషణ్డమణ్డితాం
దిశం చరిత్వా నిపుణేన వానరాః!,
అవాప్య సీతాం రఘువంశజప్రియాం
తతో నివృత్తా స్సుఖినో భవిష్యథ. ౭౧

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చత్వారింశ స్సర్గః. ౪౦.

---

ఏకచత్వారింశ స్సర్గః.

తతః ప్రస్థాప్య సుగ్రీవ స్త న్మహ ద్వానరం బలమ్,

ఆయుదయపర్వతంబునందలి నితంబప్రదేశములయందును సెలయేళ్ళయందును గుహాలయందును అందందు సీతాదేవిని రావణుని వెదకవలెను.

ఆయ్యుదయాచలమునకావల తూర్పుదిశ చంద్రసూర్యసంచారంబులేమింజేసి యంధకారావృతమయి యదృశ్యమయియుండుటంజేసి దేవతలకుమాత్రము సంచారయోగ్యముకాని యితరులకు సంచరింప నలవికాదు. ౬౭

మఱియు నేనుజెప్పిన స్థలములయందేగాక పూర్వదిశయందున్న యితరములయిన పర్వతములందును గుహాలందును వనంబులందును సమస్తప్రదేశంబులందును సీతాదేవిని వెదకిచూడుఁడు. ౬౮

వానరోత్తములారా! ఇంతదూరమువఱకే వానరులకుం బోవ శక్యమగును. ఆవలిప్రదేశము సూర్యసంచారములేక గ్రామము నగరము పర్వతము అరణ్యము మొదలయిన హద్దులు లేకుండుటవలన ఎట్టిదో మాకుఁదెలియదు.

మీరు ఉదయాచలమువఱకుఁ బోయి సీతాదేవిని రావణు నివాసస్థలంబును గనిపెట్టి ఒకమాసమ్ము నిండుటకు మున్నే మరలిరండు. ౬౯

ఒకనెలకన్న నధికముగా జాగుసేయఁగూడదు. అట్లు నెలకుసరిగా రానివానికి మరణదండన విధింపఁబడును. సీతాదేవినింజూచి యన్నివిధంబులను గార్యసిద్ధినొందినవారలయి మరలిరండు. ౭౦

వానరులారా! మీరలు నానావిధవనసమూహములచే నొప్పుచున్నదగు దేవేంద్రపాలితంబయిన తూర్పుదిక్కునందు నేర్పుతో సంచరించి వెదకి రాముని ప్రియురాలగు సీతాదేవిం గనుఁగొనుదురేని యచటనుండివచ్చి యుత్తమములయిన సుఖము లనుభవింపుచుండఁగలరు. అని సుగ్రీవుఁడు వినతాది వానరులకుఁ జెప్పెను. ౭౧

ఇది నలువదవసర్గము.

---

## నలువదియొకటవ సర్గము.

అట్లుసుగ్రీవుఁ డవ్వానరవీరులను దూర్పుదిశకుం బనిచి యంత ననేక

దక్షిణాం ప్రేషయామాస వానరా నభిలక్షితాన్. ౧

నీల మగ్నిసుతం చైవ హనూమన్తం చ వానరమ్,
పితామహసుతం చైవ జామ్బవన్తం మహాబలమ్. ౨
సుహోత్రం చ శరారించ శరగుల్మం తథైవచ,
గజం గవాక్షం గవయం సుషేణ మృషభం తథా. ౩
మైన్దంచ ద్వివిదం చైవ విజయం గన్ధమాదనమ్,
ఉల్కాముఖ మసఙ్గంచ హుతాశనసుతా వుభౌ. ౪
అఙ్గదప్రముఖా న్వీరా న్వీరః కపిగణేశ్వరః,
వేగవిక్రమసంపన్నా న్సందిదేశ విశేషవిత్. ౫
తేషా మగ్రేసరం చైవ మహద్బల మసఙ్గగమ్,
విధాయ హరివీరాణా మాదిశ ద్దక్షిణాం దిశమ్. ౬
యే కేచన సముద్దేశా స్తస్యాం దిశి సుదుర్గమాః,
కపీశః కపిముఖ్యానాం స తేషాం తా నుదాహరత్. ౭
సహస్రశిరసం విన్ధ్యం నానాద్రుమలతాయుతమ్,
నర్మదాం చ నదీం దుర్గాం మహోరగనిషేవితామ్. ౮
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీమ్,
వరదాం చ మహాభాగాం మహోరగనిషేవితామ్. ౯
మేఖలా ముత్కలాం చైవ దశార్ణనగరా ణ్యపి,
అశ్వవన్తీ మవన్తీం చ సర్వ మే వానుపశ్యత. ౧౦

విదర్భా నృషికాం శ్చైవ రమ్యా న్మాహిషకా నపి,
తథా వఙ్గా న్కళిఙ్గాం శ్చ కౌశికాం శ్చ సమన్తతః. ౧౧
అన్వీక్ష్య దణ్డకారణ్యం సపర్వతనదీగుహమ్,

యుద్ధంబులఁ బరాక్రమంబుఁ జూపి ప్రసిద్ధిఁగాంచినట్టి వానరులను దక్షిణ దిశకుఁ బంపెను. ౧

వానరుల తారతమ్యము చక్కఁగాఁ దెలిసినవాఁడును వీరుఁడునగు వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు అగ్నిదేవుని కొడుకైన నీలుని, హనుమంతుని, మహాబలుఁడగు బ్రహ్మపుత్త్రజాంబవంతుని, సుహోత్రుని, శరారిని, శరగుల్మని, గజుని, గవాక్షుని, గవయుని, సుషేణుని, ఋషభుని, మైందుని, ద్వివిదుని, విజయుని, గంధమాదనుని, అగ్నిసుతులగు ఉల్కాముఖుఁడు అసంగుడు ననువిద్దఱను, మఱియు వేగంబునఁ బరాక్రమంబున నధికులగు నంగదుఁడు మున్నగాఁగలవీరులను దక్షిణదిశకుఁ బో నాజ్ఞాపించెను. ౨-౫

సుగ్రీవుఁడు ఆవానరవీరులకు శీఘ్రగమనంబగు గొప్పవానరసైన్యమును సహాయముగా నియమించి వారలను దక్షిణదిశకుఁ బో నాజ్ఞాపించెను. ౬

వానరరాజు సుగ్రీవుఁడు ఆవానరవీరులకు ఆదక్షిణదిక్కునం దెలియని ప్రదేశంబులం గొన్నిటి నేర్పఱచి తెలియఁజెప్పెను. ౭

మీరలు వేయిశిఖరములతోఁ గూడి నానావిధవృక్షలతలతో నొప్పుచున్న వింధ్యపర్వతము గొప్పసర్పములతోఁ గూడినదై దాఁటుటకశక్యమయిన నర్మదానది వింధ్యపర్వతసమీపముననుండు సుందరమయిన గోదావరీనదీభాగము కృష్ణానది మహాసర్పములచే భయంకరమై పూజనీయమయిన వరదానది మేఖలానది యుత్పలానది దశార్ణదేశమునందలి నగరంబులు అశ్వవంతీపట్టణము (అర్థాంతర పక్షమందు అశ్వములచే సమృద్ధమయిన) యావంతీపట్టణము ఈస్థలములయందంతటను సీతాదేవిని వెదకిచూడుఁడు. ౮-౧౦

విదర్భదేశము, ఋషికదేశము, రమణీయమయిన మాహిషకదేశము, వంగ కళింగ కాశిక దేశములు, పర్వతములతోను గుహాలతోను నదులతో నొప్పుచున్న దండకారణ్యంబు ఆదండకారణ్యమందలి గోదావరీనది, మఱియు, ఆంధ్రదేశము పుండ్రదేశము చోళపాండ్యకేరళదేశములు ఈస్థలములకంత

నదీం గోదావరీం చైవ సర్వమే వానుపశ్యత. ౧౨
తథైవాన్ధ్రాంశ్చ పుణ్డ్రాంశ్చ చోళా న్పాణ్డ్యాం త్సకేరళాన్,
అయోముఖ శ్చ గన్తవ్యః పర్వతో ధాతుమణ్డితః. ౧౩

విచిత్రశిఖర శ్శ్రీమాం శ్చిత్రపుష్పితకాననః,
సచన్దనవనోద్దేశో మార్గితవ్యో మహాగిరిః. ౧౪

తత స్తా మాపగాం దివ్యాం ప్రసన్నసలిలాం శివామ్,
తత్ర ద్రక్ష్యథ కావేరీం విహితా మప్సరోగణైః. ౧౫

త స్యాసీనం నగ స్యాగ్రే మలయస్య మహౌజసమ్,
ద్రక్ష్యథాఽఽదిత్యసంకాశ మగ స్త్య మృషిస త్తమమ్. ౧౬
తత స్తే నాభ్యనుజ్ఞాతాః ప్రసన్నేన మహాత్మనా,
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథ మహానదీమ్. ౧౭
సా చన్దనవనై ర్దివ్యైః ప్రచ్ఛన్నా ద్వీపశాలినీ,
కా న్తేవ యువతిః కా న్తం సముద్ర మవగాహతే. ౧౮

తతో హేమమయం దివ్యం ముక్తామణివిభూషితమ్,
యు క్తం కవాటం పాణ్డ్యానాం గతా ద్రక్ష్యథ వానరాః!. ౧౯

తత స్సముద్ర మాసాద్య సమ్ప్రధార్యార్థనిశ్చయమ్,

అగస్త్యే నా న్తరే తత్ర సాగరే వినివేశితః. ౨౦

యుం బోయి, అంతటఁ దిరిగి సీతాదేవి నన్వేషింపుఁడు. ౧౧,౧౨

అంతఁ గైరికధాతువులచేఁ బ్రకాశించుచుండునట్టి సహ్యపర్వతము నకుఁ బొండు. ౧౩

నానావిధములయిన శిఖరములుఁ గలదియుఁ బుష్పించియున్నందునఁ జిత్రవర్ణములయిన వనంబులు గలదియు నద్యుప్రదేశంబులఁ జందనవనంబులతో నొప్పుచున్నదియు శ్రీమంతంబునగు నాసహ్యపర్వతమునం దంతటను సీతాదేవిని వెదకవలయును. ౧౪

అంత నచట మీరలు నిర్మలమయిన జలంబుగలదియు స్నానంబొండె దర్శనంబొండె గావించువారలకు మంగళంబు లొసంగునదియు నప్సరసలచేఁ బూజింపఁబడునదియు నగు నుత్తమమయిన కావేరీనదిం జూడఁగలరు. ౧౫

అంత మలయపర్వతము శిఖరంబున నాసీనుఁడై సూర్యునిపగిది మహాతేజముచే వెలుఁగుచున్న ఋషిశ్రేష్ఠుఁ డగస్త్యమహామునిం జూడఁగలరు. ౧౬

అంత మహానుభావుఁడగు నయ్యగస్త్యు ననుగ్రహంబువడసి యతని యనుమతినొంది మొసళ్లతోఁ గూడినదగు తామ్రపర్ణీనదిం దరింపుఁడు. ౧౭

చందనం బలందినదియు నున్నతంబులగు స్తనంబులు గలదియునగు ప్రియురాలు ప్రియునియొద్దకుఁ బోవునట్లు చందనవనంబులచేఁ గప్పఁబడినదియు ద్వీపంబులతోఁ గూడినదియునగు నాతామ్రపర్ణీనది సముద్రంబుఁ బొందుచున్నది. ౧౮

వానరులారా! అచటనుండి పోయినచో కాంచనమయంబును ముత్తెములచే నలంకరింపఁబడినదియు సుందరంబునగు నుత్తమమయిన పాండ్యనగరద్వారమందలి కవాటముం జూడఁగలరు. ౧౯

అటనుండి సముద్రతీరంబుఁ జేరి సీతాన్వేషణ కార్యమును గుఱించి సముద్రతరణము విషయమయి యాలోచించి నిశ్చయించుకొనుఁడు.

అగస్త్యమహర్షిచేత సముద్రంబున నుంచఁబడినదియు చిత్రవర్ణము

చిత్రనానానగ శ్శ్రీమా న్మహేన్ద్రః పర్వతో త్తమః,
జాతరూపమయ శ్శ్రీమా నవగాఢో మహార్ణవమ్. ౨౧

నానావిధై ర్నగై స్సర్వై ర్లతాభి శ్చోపశోభితమ్,
దేవర్షి యక్షప్రవరై రప్సరోభి శ్చ సేవితమ్. ౨౨
సిద్ధచారణసంఘై శ్చ ప్రకీర్ణం సుమనోహరమ్,
త ముపైతి సహస్రాక్ష స్సదా పర్వసు పర్వసు. ౨౩

ద్వీప స్తస్యాపరే పారే శతయోజన మాయతః,
అగమ్యో మానుషై ర్దీప్త స్తం మార్గధ్వం సమన్తతః. ౨౪

తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః,

సహి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః. ౨౫
రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్షసమద్యుతేః,
దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్యతు రాక్షసీ. ౨౬
అఙ్గారకేతి విఖ్యాతా ఛాయా మాకృష్య భోజినీ,

ఏవం నిస్సంశయా న్కృత్వా సంశయా న్నష్టసంశయాః. ౨౭
మృగయధ్వం నరేన్ద్రస్య పత్నీ మమితతేజసః,

త మతిక్రమ్య లక్ష్మీవాం త్సముద్రే శతయోజనే. ౨౮
గిరిః పుష్పితకో నామ సిద్ధచారణసేవితః,

లయిన నానావిధవృక్షములుగల్గి పుష్పఫలాదిసమృద్ధితో నొప్పుచున్నదియుఁ
గాంచనమయంబును శ్రీమంతంబును బర్వతశ్రేష్ఠంబునగు మహేంద్రపర్వ
తంబు సముద్రజలంబు లాని యుండును. ౨౦,౨౧

నానావిధములయిన సమస్తవృక్షములతో లతలతో నొప్పుచు దేవత
లచేతను ఋషులచేతను యక్షులచేతను సిద్ధులచేతను జారణులచేతను సేవితం
బయి మిక్కిలియు మనోహరంబయిన యమ్మహేంద్రపర్వతంబునకు దేవేం
ద్రుఁడు ప్రతిపర్వదివసమందును దప్పక సముద్రస్నానార్థమయి వచ్చుచుం
డును. ౨౨,౨౩

ఆ సముద్రమధ్యమున నావలితీరంబున నూఱుయోజనములు వైశా
ల్యముగలదై మనుష్యులకుఁ బోవనలవిగాని దేదీప్యమానంబగు నొకద్వీ
పంబు గలదు; ఆద్వీపం బందంతటను సీతాదేవిని జక్కఁగా వెదకుఁడు.

ఆద్వీపమందు నితరస్థలములకన్న విశేషించి సీతాదేవిని సమస్తప్రయ
త్నంబులను వెదకవలెను.

ఏలయనఁగా వధ్యుఁడును దుష్టుఁడును దేవేంద్రసమానుఁడునగు రా
క్షసరాజు రావణునకు నాద్వీపమే నివాసస్థలము. ౨౪

ఆద్వీపమున కుత్తరముగా నాదక్షిణసముద్రమధ్యమున నంగారక
యనురాక్షసియొకర్తు కలదు. అరక్కసి జంతువులఛాయను నాకర్షించి వాని
భక్షించును. ౨౫

మహాపరాక్రమశాలులారా! ఇవ్విధంబున నేయేస్థలంబుల రావణుఁ
డు సీత నుంచియుండునని సందేహముగలుగునో ఆయాప్రదేశంబుల నంత
టను వెదకిచూచి నిస్సంశయము గావించికొనుచు రామపత్నియగు సీతాదే
విని వెదకుఁడు. ౨౬

ఆలంకాద్వీపముదాఁటి నూఱుయోజనంబుల దూరంబున సముద్రం
బునందు సిద్ధచారణులచే సేవింపఁబడుచుఁ గాంతిమంతంబయిన పుష్పితకం
బను పర్వతం బున్నది. ౨౭

చన్ద్రసూర్యాంశుసంకాశ స్సాగరామ్బుసమావృతః. ౨౯
భ్రాజతే విపులై శ్శృఙ్గై రమ్బరం విలిఖ న్నివ,

త స్యైకం కాఞ్చనం శృఙ్గం సేవతేఽయం దివాకరః. ౩౦
శ్వేతం రాజత మేకం చ సేవతేఽయం నిశాకరః,

న తం కృతఘ్నాః పశ్యన్తి న నృశంసా న నాస్తికాః. ౩౧
ప్రణమ్య శిరసా శైలం తం విమార్గత వానరాః!,

త మతిక్రమ్య దుర్ధర్షా స్సూర్యవా న్నామ పర్వతః. ౩౨
అధ్వనా దుర్విగాహేన యోజనాని చతుర్దశ,

తత స్త మప్యతిక్రమ్య వైద్యుతో నామ పర్వతః. ౩౩
సర్వకామఫలై ర్వృక్షై స్సర్వకాలమనోహరైః,

తత్ర భుక్త్వా వరార్హాణి మూలాని చ ఫలాని చ. ౩౪
మధూని పీత్వా ముఖ్యాని పరం గచ్ఛత వానరాః!,

తత్ర నేత్రమనఃకాన్తః కుఞ్జరో నామ పర్వతః. ౩౫
అగస్త్యభవనం యత్ర నిర్మితం విశ్వకర్మణా,

తత్ర యోజనవిస్తార ముచ్ఛ్రితం దశయోజనమ్. ౩౬
శరణం కాఞ్చనం దివ్యం నానారత్నవిభూషితమ్,

తత్ర భోగవతీ నామ సర్పాణా మాలయః పురీ. ౩౭

ఆపుష్పితకగిరి ఒకవైపునఁ జంద్రునివలె ధవళవర్ణంబై మఱియొకవైపున సూర్యునివలె నరుణవర్ణంబై సముద్రజలంబులం బరివేష్టితమయి యున్నతంబులగు శిఖరములచే నాకాశంబు నొరయుచు భాసిల్లుచుండును. ౨౯

ఆపుష్పితకపర్వతమునందుఁ గాంచనమయంబైన యొకశిఖరమును ఈ సూర్యుఁడు దక్షిణాయనంబున బొందును. చంద్రుఁడును తెల్లనిరజతమయంబైన శృంగంబు నొందును. ౩౦

వానరులారా! కృతఘ్నులకును దయలేక పరులఁ బీడించువారలకును నాస్తికులకును అపుష్పితకశైలము కానంబడదు. మీరలు అప్పర్వతంబునకు సాష్టాంగముగా మ్రొక్కి యచట సీతాదేవిని వెదకుఁడు. ౩౧

ఎదిరింప నలవిగాని వీరులారా! అపుష్పితకశైలం బతిక్రమించిన పిదప సూర్యవంతంబను పర్వతంబున్నది; ఆరెండుపర్వతములకును దుర్గమంబయిన మార్గంబునఁ బదునాలుగుయోజనంబులదూరం బుండును. ౩౨

అంత ఆసూర్యవంతమను పర్వతంబున కావల కోరినఫలంబులన్నియు నొసఁగునవియు సమస్తకాలంబులయందును రమణీయంబులునగువృక్షంబులతో నొప్పుచున్న వైద్యుతంబను పర్వతం బున్నది. ౩౩

వానరులారా! అవ్వైద్యుతగిరియందు సర్వోత్తమములయిన ఫలములను భక్షించి శ్రేష్ఠములయిన తేనియలం ద్రావి యావలిప్రదేశమునకుఁ బొండు. ౩౪

అచటఁ గన్నులకును మనంబునకును సంతోషంబు గలిగించునట్టి కుంజరమను పర్వతంబుగలదు. ఆపర్వతమునందే విశ్వకర్మ యగస్త్యమహర్షికి గృహంబు నిర్మించెను. ౩౫

అక్కుంజరశైలంబున నగస్త్యమహర్షిభవనంబు ఒకయోజనము వెడల్పును పదియోజనములు నిడుపుఁగల్గి యున్నతంబై కాంచనమయంబై నానావిధరత్నంబులచే నలంకరింపఁబడి దివ్యంబైయుండును. ౩౬

అంత నచట సర్పనివాసస్థలమయిన భోగవతీనగరియుండును. అది

విశాలకక్ష్యా దుర్ధర్షా సర్వతః పరిరక్షితా,
రక్షితా పన్నగై ర్ఘోరై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహావిషైః. ౩౭

సర్పరాజో మహాప్రాజ్ఞో యస్యాం వసతి వాసుకిః,
నిర్యాయ మార్గితవ్యాచ సా చ భోగవతీ పురీ. ౩౮

తత్ర చానన్తరా దేశా యే కేచన సుసంవృతాః,

తంచ దేశ మతిక్రమ్య మహా న్వృషభసంస్థితః. ౪౦
సర్వరత్నమయః శ్రీమా నృషభో నామ పర్వతః,

గోశీర్షకం పద్మకంచ హరిశ్యామంచ చన్దనమ్. ౪౧
దివ్య ముత్పద్యతే యత్ర త చ్చైవాగ్నిసమప్రభమ్,

న తు తచ్చన్దనం దృష్ట్వా స్ప్రష్టవ్యం చ కదాచన. ౪౨

రోహితా నామ గన్ధర్వా ఘోరా రక్షన్తి తద్వనమ్,

తత్ర గన్ధర్వపతయః పఞ్చ సూర్యసమప్రభాః. ౪౩
శైలూషో గ్రామణీ శ్శిక్ష శ్శుభ్రో బభ్రు స్తథైవ చ,

రవిసోమాగ్నివపుషాం నివాసః పుణ్యకర్మణామ్. ౪౪
అన్తే పృథివ్యా దుర్ధర్షా స్తత్ర స్వర్గజితః స్థితాః,

విశాలములయిన తోట్టికట్టుకల్గి అంతటను భయంకరమయిన యాకారంబును తీక్ష్ణములయినకోఱలును ఘోరమయిన విషంబునుగల మహాసర్పంబులు రక్షింప ఎట్టివారికిని ప్రవేశింప నలవిగానిదై యుండును. అందు మహాపండితుఁడగు సర్పరాజు వాసుకి నివసించును. 3౭,3౮

మీరలు అగస్త్యభవనమునుండి వెలువడి అభోగవతీనగరమునందును సీతాదేవిని వెదకవలయును. 3౯

మఱియు అచటికి సమీపంబుననున్న రహస్యప్రదేశములయందంతటను సీతాదేవిని వెదకుఁడు.

ఆభోగవతీనగరము నతిక్రమించిన పిదప సముద్రరత్నంబులతోడ నిండియున్నదియు శ్రీమంతంబునగు వృషభాకారమయిన ఋషభంబను నొకమహాపర్వతంబు గానఁబడును. ౪౦

ఆఋషభపర్వతమునందు గోరోచనసమువన్నెగలవి కమలదళవర్ణముగలవి హరితవర్ణముగలవి శ్యామలవర్ణముగలవి నిప్పువలె నెఱ్ఱనివన్నెగలవి యిట్టిదివ్యములయిన చందనవృక్షములు పుట్టును. ౪౧

మీరలు ఆచందనముంజూచి యొకప్పుడును ఎంతమాత్రము ముట్టుకొనవలదు. ౪౨

ఏలయనఁగా భయంకరాకారులగు రోహితులను గంధర్వులు అచందనవనంబునకుఁ గావలియున్నారు.

ఆఋషభపర్వతమందు సూర్యునకుంబోలెఁ దేజంబుగలవారలు, శైలూషుఁడును గ్రామణియు శిగ్రువును శుభ్రుఁడును బభ్రుఁడును అను గంధర్వరాజులైదుగురు వాసముసేయుచుందురు. ౪3

పుణ్యకర్ములు గావించినవారలు కొందఱు సూర్యునకుంబోలెఁ దేజస్సుగలవారలై కొందఱు చంద్రునివలె వెలుఁగుచు కొందఱు అగ్నిప్రభులై యప్పర్వతంబున నివాసముగా నుందురు. ప్రళయకాలమున స్వర్గాదిపుణ్యలోకంబుల సాధించిన మహాపురుషులు ఇతరులకుఁ దేఱిచూడరాని తేజంబున వెలుఁగుచు ఆఋషభపర్వతంబున నుందురు. ౪౪

తతః పరం న వ స్సేవ్యః పితృలోక స్సుదారుణః. ౪౫
రాజధానీ యమస్యైషా కష్టేన తమసా వృతా,

ఏతావ దేవ యుష్మాభి ర్వీరా! వానరపుఙ్గవాః!. ౪౬
శక్యం విచేతుం గన్తుం వా నాతో గతిమతాం గతిః,

సర్వ మేత త్సమాలోక్య యచ్చాన్య దపి దృశ్యతే. ౪౭
గతిం విదిత్వా వైదేహ్యా స్సన్నివర్తితు మర్హథ,
యస్తు మాసా న్నివృత్తో ఽగ్రే దృష్టా సీతేతి వక్ష్యతి. ౪౮
మత్తుల్యవిభవో భోగై స్సుఖం స విహరిష్యతి,

తతః ప్రియతరో నాస్తి మమ ప్రాణా ద్విశేషతః. ౪౯
కృతాపరాధో బహుశో మమ బన్ధుర్భవిష్యతి,

అమితబలపరాక్రమా భవన్తో
విపులగుణేషు కులేషు చ ప్రసూతాః,
మనుజపతిసుతాం యథా లభధ్వం
తదధిగుణం పురుషార్థ మారభధ్వమ్. ౫౦

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకచత్వారింశ స్సర్గః. ౪౧.

---

## ద్విచత్వారింశ స్సర్గః.

అథ ప్రస్థాప్య సుగ్రీవ స్తాన్ హరీ న్దక్షిణాం దిశమ్,
అబ్రవీ న్మేఘసంకాశం సుషేణం నామ యూథపమ్. ౧

తారాయాః పితరం రాజా శ్వశురం భీమవిక్రమమ్,

అప్పిమ్మట మహాభయంకరంబగు పితృలోకంబు; అది యముని రాజధాని. దుస్సహంబగు చీఁకటిచేఁ బరివేష్టింపఁబడియుండును గావున మీకుఁ బ్రవేశింప నలవిగాదు. ౪౫

పరాక్రమశాలురగు వానరోత్తములారా! ఇంతమాత్రమే మీకుఁ బోయి వెదక నలవియగును. అప్పిమ్మట ఎంతటి గమనశక్తి గలవారలకును బోవ నవకాశములేదు. ౪౬

ఇప్పుడు నేను జెప్పిన స్థలములయందును మఱియు నితరప్రదేశములయందును చక్కగా వెదకిచూచి సీతాదేవియున్న స్థానము నెఱిఁగి మరలిరండు.

ఎవ్వఁడు మాసములోపలనే యిటకువచ్చి "కనఁబడినది సీతాదేవి" అని చెప్పునో, అతఁడు నాతో సమానంబుగా నఖిలసంపదలు గల్గి దివ్యభోగంబు లనుభవించుచు సుఖంబుగా విహరింపఁగలఁడు. ౪౮

సీతం జూచివచ్చినవానికన్నను నాకుఁ బ్రియుఁడులేఁడు. నాజీవితంబుకన్నను నాకతఁడధికుఁడగును. అతఁడు ఎన్నియపరాధములు గావించినవాఁడైనను నాకు విశేషించి ప్రియుఁడై యుండఁగలఁడు. ౪౯

మీరలు కొలఁదికిమీఱిన బలపరాక్రమంబులుగలవారలు శౌర్యవీర్యాదిసమస్తసద్గుణసంపన్నంబులగు వంశంబులజనించినవారలు. సీతాదేవి లభించునట్లు సమస్తవిధంబులం బ్రయత్నంబులు గావింపుఁడు. అని సుగ్రీవుఁడు నీలాదివానరులతోఁ జెప్పెను. ౫౦

ఇది నలుబదియొకటవసర్గము.

---

## నలువది రెండవసర్గము.

అట్లు సుగ్రీవుఁడు నీలాదివానరులను దక్షిణదిశకుం బోఁ బనిచి యంత మేఘమునకుఁబోలె నల్లనియున్నతమయిన యాకారముగల సుషేణుఁడను వానరయూధపతింజూచి యిట్లనియె. ౧

వానరరాజు సుగ్రీవుఁడు తారకుఁ దండ్రి కావునఁ దనకు మామయగు

అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్య మభిగమ్య ప్రణమ్య చ. ౨

మరీచిపుత్త్రం మారీచ మర్చిష్మ న్తం మహాకపిమ్,
వృతం కపివరై శ్శూరై ర్మహేన్ద్రసదృశద్యుతిమ్. ౩
బుద్ధివిక్రమసమ్పన్నం వైనతేయసమద్యుతిమ్,
మరీచిపుత్త్రా న్మారీచా నర్చిర్మాలా న్మహాబలాన్. ౪
ఋషిపుత్త్రాం శ్చ తాం త్సర్వా న్ప్రతీచీ మాదిశ ద్దిశమ్,

ద్వాభ్యాం శతసహస్రాభ్యాం కపీనాం కపిస త్తమాః!. ౫
సుషేణప్రముఖా యూయం వైదేహీం పరిమార్గత,
సురాష్ట్రాం త్సహబాహ్లీకా ఞ్శూరా న్భీమాం స్తథైవచ. ౬
స్ఫీతా జ్జనపదా న్రమ్యా న్విపులాని పురాణిచ,
పున్నాగగహనం కుక్షిం వకుళోద్దాలకాకులమ్. ౭
తథా కేతకషణ్డాం శ్చ మార్గధ్వం హరియూథపాః!,

ప్రత్యక్స్రోతోగమా శ్చైవ నద్య శ్శీతజలా శ్శివాః. ౮
తాపసానా మరణ్యాని కాన్తారా గిరయ శ్చ యే,

తత స్స్థలీం మరుప్రాయా మత్యుచ్చశిరస శ్శిలాః. ౯
గిరిజాలావృతాం దుర్గాం మార్గిత్వా పశ్చిమాం దిశమ్,
తతః పశ్చిమ మాసాద్య సముద్రం ద్రష్టు మర్హథ. ౧౦
తిమినక్రాయుతజల మక్షోభ్య మథ వానరాః!,

తతః కేతకషణ్డేషు తమాలగహనేషు చ. ౧౧

భయంకరమయిన పరాక్రమముగల సుషేణునియొద్దకుఁబోయి యతనికి నమస్కరించి చేతులుమోడ్చి యిట్లని పలికెను. ౨

సుగ్రీవుఁడు కాంతిమంతుఁడును శూరులగు వానరవీరులచేఁ బరివృతుఁడును బుద్ధియుఁ బరాక్రమంబును గలవాఁడును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమంబును గరుత్మంతునకుంబోలె వేగంబునుగలవాఁడునగు మరీచిమహాముని పుత్త్రుఁడయిన జ్యేష్ఠుని మారీచుని మఱియుఁ గాంతిమంతులు మహాబలశాలులు నగువారల నతనితమ్ములను అట్లు మరీచికుమారుల నందఱను బశ్చిమదిశకుఁ బో నాజ్ఞాపించెను. ౩,౪

వానరోత్తములారా! మీరలు సుషేణుని ముందిడుకొని రెండులక్షల వానరవీరులంగూడి సీతాదేవిని వెదకుఁడు. ౫

వానరవీరులారా! సురాష్ట్రదేశమునందును బాహ్లీకదేశమునందును భయంకరములయిన శూరదేశమునందును మఱియు సస్యాదిసమృద్ధంబులయిన రమణీయంబులగు గ్రామసమూహములయందును విశాలంబులగు నగరంబులయందును పున్నాగవనంబునందును బొగడచెట్లచేతను విరిగిచెట్లచేతను ఒప్పుచుండు కుక్షిదేశమునందును మొగిలిపొదలయందును సీతాదేవి నన్వేషింపుఁడు. ౬,౭

పడమటికట్లు ప్రవహించునట్టి చల్లనిజలంబులుగల పావనంబులయిన నదులను ఋష్యాశ్రమంబులను అరణ్యంబులను పర్వతములనుం బొంది యచ్చోటిప్రదేశంబుల నంతటను సీతాదేవిని వెదకుఁడు. ౮

వానరులారా! అంత మీరు నిర్జలప్రాయములయిన భూములయందును మిక్కిలియు నున్నతములయిన శిఖరములుగల కొండలయందును ఇట్లు పెక్కుపర్వతములతోఁగూడి సంచరింప నలవిగాని పశ్చిమదిశనంతటను వెదకి యంతఁ దిమి మత్స్యంబులతోను మొసళ్లతోనుంగూడి భయంకరమైనదియు నతిగంభీరమునగు పశ్చిమసముద్రమును జూడఁగలరు. ౯,౧౦

ఆసముద్రతీరంబున మీపరిజనులయినవానరులు మొగిలిపొదలయం

కవయో విహరిష్యన్తి నారికేళవనేషు చ,

తత్ర సీతాంచ మార్గధ్వం నిలయం రావణస్య చ. ౧౨
వేలాతటనివిష్టేషు పర్వతేషు వనేషు చ,
మురచీపత్తనం చైవ రమ్యం చైవ జటీపురమ్. ౧౩
అవన్తీ మఙ్గలోపాం చ తథా చాలక్షితం వనమ్,
రాష్ట్రాణి చ విశాలాని పత్తనాని తత స్తతః. ౧౪

సిన్ధుసాగరయో శ్చైవ సఙ్గమే తత్ర పర్వతః,
మహా న్హేమగిరి ర్నామ శతశృఙ్గో మహాద్రుమః. ౧౫

తస్య ప్రస్థేషు రమ్యేషు సింహాః పక్షగమాః స్థితాః,
తిమిమత్స్యగజాం శ్చైవ నీడా న్యారోపయన్తి తే. ౧౬

తాని నీడాని సింహానాం గిరిశృఙ్గగతా శ్చ యే,
దృప్తా స్తృప్తా శ్చ మాతఙ్గా స్తోయదస్వననిస్వనాః. ౧౭
విచరన్తి విశాలేఽస్మిం స్తోయపూర్ణే సమన్తతః,

తస్య శృఙ్గం దివస్పర్శం కాఞ్చనం చిత్రపాదపమ్. ౧౮
సర్వ మాశు విచేతవ్యం కపిభిః కామరూపిభిః,

కోటిం తత్ర సముద్రే తు కాఞ్చనీం శతయోజనామ్. ౧౯
దుర్దర్శాం పారియాత్రస్య గతాం ద్రక్ష్యథ వానరాః!,

దును తమాలవనంబులయందును నారికేళవనంబులయందును వేడుక మెయి విహ
రింపఁగలరు. ౧౧

అచట సముద్రతీరంబునను న్న పర్వతంబులయందును వనంబులయం
దును రావణుని నివాసమును సీతాదేవిని జక్కఁగా నన్వేషింపుఁడు ౧౨

మురచీపట్టణమును రమణీయమయిన జటీనగరమును అవంతీపురమును
అంగలోపానగరియు అలక్షితం బనునరణ్యంబును మఱియు నితరములయిన
దేశములను రాజధానులను బొంది యాయా ప్రదేశంబులం దంతటను సీతా
దేవిని రావణుని వెదకుఁడు. ౧౩,౧౪

సింధునదము సముద్రములోఁ గలియుస్థలమునందు నూఱుశిఖరములు
గల్గి యత్యున్నతములగు వృక్షములతో నొప్పుచున్న హేమగిరియను గొప్ప
పర్వతం బొకండు గలదు. ౧౫

రమణీయములగు నాహేమగిరి నెత్తిమీఁదను ఱెక్కలుగల సిం
హంబులుగలవు. అవి సముద్రంబునందలి తిమిమత్స్యంబులను గజంబులను
ఎత్తుకొనిపోయి తమగూండ్లం జేట్టుచుండును. ౧౬

చుట్టును జలములచేఁ బరివేష్టితంబయిన యాహేమగిరి శిఖరంబున
నున్న మేఘధ్వనివంటి ధ్వనిగలవియు తృప్తినొంది మదించియున్నవియునగు
నేనుఁగులు వాసింహములగూండ్లున్న ప్రదేశంబులందు నిర్భయంబుగా
సంచరించును. ౧౭

ఔన్నత్యంబుచే నింగిముట్టుచున్నవియుఁ గాంచనమయంబులును
బుష్పితంబులగుటను జిత్రవర్ణంబులయిన వృక్షంబులుగలవియునగు నాహే
మగిరిశిఖరంబులందంతటను గామరూపులరగు మీరలు జాగు సేయక చక్కఁగా
జానకి నన్వేషింపుఁడు. ౧౮

వానరులారా! సముద్రంబునఁ గొంతదవ్వరిగిన పిదప సముద్రమధ్యం
బున నున్నదియుఁ గాంచనమయంబును నూఱుయోజనంబుల విస్తారముగల
దియుఁ దేజోతిశయంబునంజేసి చూడవలవిగానిదియునగు పారియాత్రశిఖ
రంబుఁ జూడఁగలరు. ౧౯

కోట్య స్తత్ర చతుర్వింశ ద్గన్ధర్వాణాం తరస్వినామ్. ౨౦
వస న్త్యగ్నినికాశానాం ఘోరాణాం కామరూపిణామ్,

పావకార్చిఃప్రతీకాశా స్సమవేతా స్సహస్రశః. ౨౧
నాత్యాసాదయితవ్యా స్తే వానరై ర్భీమవిక్రమైః,

నాదేయం చ ఫలం తస్మా ద్దేశా త్కించిత్ ప్లవఙ్గమైః. ౨౨

దురాసదా హి తే వీరా స్సత్త్వవన్తో మహాబలాః,
ఫలమూలాని తే తత్ర రక్షన్తే భీమవిక్రమాః. ౨౩

తత్ర యత్నశ్చ కర్తవ్యో మార్గితవ్యా చ జానకీ,
నహి తేభ్యో భయం కించి త్కపిత్వ మనువర్తతామ్. ౨౪

తత్ర వైడూర్యవర్ణాభో వజ్రసంస్థానసంస్థితః,
నానాద్రుమలతాకీర్ణో వజ్రో నామ మహాగిరిః. ౨౫

శ్రీమాం త్సముదిత స్తత్ర యోజనానాం శతం సమమ్,

గుహా స్తత్ర విచేతవ్యాః ప్రయత్నేన ప్లవఙ్గమాః!. ౨౬

చతుర్భాగే సముద్రస్య చక్రవా న్నామ పర్వతః,
తత్ర చక్రం సహస్రారం నిర్మితం విశ్వకర్మణా. ౨౭

ఆ పారియాత్రశిఖరంబున బలవంతులును అగ్నివలె మిక్కిలియు తీక్ష్ణులును భయంకరాకారులును గామరూపులునగు గంధర్వులు ఇరువదినాలుగుకోట్లమంది నివసించుచున్నారు. ౨౦

ఆగంధర్వులు అగ్నిజ్వాలలంబోలినవారలు వేనవేలుగా గుంపులుగూడియుందురు. కావున వానరులలో భయంకరపరాక్రము లగువారలుగూడ వారలసమీపంబునకుఁ బోరాదు. ౨౧

మఱియు అచ్చోటనుండి ఫలములుగూడ కొంచెమైనను వానరులు కోయరాదు. ౨౨

ఏలయనఁగా సమీపింప నలవిగానివారలును శూరులును ధైర్యవంతులును మహాబలశాలులును భయంకరమయిన విక్రమముగలవారలునగు ప్రసిద్ధులయిన యాగంధర్వులు ఆ పారియాత్రశిఖరమునందలి ఫలమూలంబులకుఁ గావలియున్నారు. ౨౩

అచట ఫలమూలంబులు ముట్టుకొనక జాగ్రత్తగా ప్రయత్నముచేసి సీతాదేవిని వెదకవలెను; వానరులకుం దగినరీతిని మీరు మెలంగుచుండిన మీకు అంగధర్వులవలనఁ గొంచెమైనను భయములేదు. ౨౪

ఆసముద్రంబున మఱియుఁ గొంతదూరంబు పోఁగా వైడూర్యమణివంటి కాంతిగలదియు వజ్రరత్నమువలె నతికఠినంబును నానావిధములయిన వృక్షలతల నిండియుండునదియునగు వజ్రమను మహాపర్వతంబు కనఁబడును. ౨౫

శ్రీమంతంబగు నావజ్రగిరి సమముగా నూఱుయోజనంబు లున్నతంబై యుండును.

వానరులారా! ఆవజ్రపర్వతము గుహలయందుఁ బ్రయత్నపూర్వకంబుగా సీతాదేవిని వెదకవలెను. ౨౬

అంత సముద్రంబున మూఁడుభాగములు కడచినపిదపఁ జక్రవంతమను నొకపర్వతంబు గలదు. అందు మున్ను విశ్వకర్మ వేయియరములుగల చక్రాయుధంబును నిర్మించెను. ౨౭

తత్ర పఞ్చజనం హత్వా హయగ్రీవం చ దానవమ్,
ఆజహార తత శ్చక్రం శఙ్ఖం చ పురుషోత్తమః. ౨౮

తస్య సానుషు చిత్రేషు విశాలాసు గుహాసు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౨౯
యోజనానాం తత ష్షష్టి ర్వరాహో నామ పర్వతః,
సువర్ణశృఙ్గ స్సుశ్రీమా నగాధే వరుణాలయే. ౩౦

తత్ర ప్రాగ్జ్యోతిషం నామ జాతరూపమయం పురమ్,
యస్మి న్వసతి దుష్టాత్మా నరకో నామ దానవః. ౩౧
తత్ర సానుషు చిత్రేషు విశాలాసు గుహాసు చ,
రావణస్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౩౨
త మతిక్రమ్య శైలేన్ద్రం కాఞ్చనా న్తరనిర్దరః,
పర్వత స్సర్వసౌవర్ణో ధారా ప్రస్రవణాయుతః. ౩౩

తం గజా శ్చ వరాహా శ్చ సింహావ్యాఘ్రా శ్చ సర్వతః,
అభిగర్జ న్తి సతతం తేన శబ్దేన దర్పితాః. ౩౪

యస్మి న్హరిహయ శ్శ్రీమా న్మహేన్ద్రః పాకశాసనః,
అభిషిక్త స్సురై రాజా మేఘవా న్నామ పర్వతః. ౩౫
త మతిక్రమ్య శైలేన్ద్రం మహేన్ద్రపరిపాలితమ్,
షష్టి ర్గిరి సహస్రాణి కాఞ్చనాని గమిష్యథ. ౩౬
తరుణాదిత్యవర్ణాని భ్రాజమానాని సర్వతః,
జాతరూపమయై ర్వృక్షై శ్శోభితాని సుపుష్పితైః. ౩౭

ఆచక్రవత్పర్వతమునందే పూర్వము విష్ణువు ఒకానొక దేవాసురయుద్ధంబునఁ బురుషోత్తమరూపంబున నవతరించి చక్రరక్షకుఁడైన హయగ్రీవుఁడను దానవుని వధించి చక్రంబును, పంచజనుఁడను దానవు వధించి యతని యస్థియయిన పాంచజన్యంబను శంఖంబును గ్రహించెను. ౨౭

ఆచక్రవత్పర్వతమునందుఁ జిత్రములయిన నెత్తములయందును విశాలములయిన గుహాలయందును రావణుని సీతను వెదకవలెను. ౨౮

ఆపిమ్మట నఱువదియోజనంబులదూరంబునందు అగాధంబగు సముద్రంబున బంగారుశిఖరంబులుగలిగి మహాతేజంబుతో వెలుఁగుచున్న వరాహపర్వతం బున్నది. ౩౦

అవ్వరాహపర్వతంబునఁ గాంచనమయమయిన ప్రాగ్జ్యోతిషంబను నగరంబుగలదు. అప్పురంబునందు దురాత్ముఁడగు నరకాసురుఁడు నివసించును.

ఆవరాహగిరియందు అద్భుతములయిన సానువులయందును విశాలంబులగు గుహాలయందును రావణుని సీతాదేవిని వెదకవలెను. ౩౨

అవ్వరాహగిరి నతిక్రమించిన పిదపఁ గాంచనమయములయిన యంతరప్రదేశములుగల గుహాలతో నొప్పుచున్నదియు సర్వమును గాంచనమయంబును శిలయేర్లతోఁ గూడినదియునగు నొకమహాపర్వతం బున్నది. ౩౩

అందు ఏనుఁగులును వరాహంబులును సింహంబులును శార్దూలంబులును దమధ్వనికిఁగల్గిన ప్రతిధ్వని విని గర్వించినవై యెల్లప్పుడును అందుకు బదులుగా గర్జించుచునే యుండును. ౩౪

ఆపర్వతమునందే శ్రీమంతుఁడును బింగళవర్ణములయిన గుఱ్ఱములుగలవాఁడును బాకాసురు వధించినవాఁడు నగుదేవేంద్రునకు సురలు దేవరాజ్యమునకుఁ బట్టాభిషేకముచేసిరి; అది మేఘవంత మనఁబడును. ౩౫

మీరు దేవేంద్రునిచే సురక్షితంబగు నామేఘవత్పర్వతంబు నతిక్రమించి యాపిమ్మట బాలసూర్యవర్ణంబులయి యంతటం దేజరిల్లుచున్నవియుఁ జక్కగాఁ బుష్పితంబులగు బంగారువృక్షంబులచే నొప్పుచున్నవియుఁ గాంచనమయములునగు నఱువదివేలపర్వతములం జూడఁగలరు. ౩౬, ౩౭

తేషాం మధ్యే స్థితో రాజా మేరు రుత్తరపర్వతః,
ఆదిత్యేన ప్రసన్నేన శైలో దత్తవరః పురా. ౩౮

తేనైవ ముక్త శ్శైలేన్ద్ర స్సర్వ ఏవ త్వదాశ్రయాః,
మత్ప్రసాదా ద్భవిష్యన్తి దివారాత్రం చ కాఞ్చనాః. ౩౯
త్వయి యే చాపి వత్స్యన్తి దేవగన్ధర్వదానవాః,
తే భవిష్యన్తి రక్తా శ్చ ప్రభయా కాఞ్చనప్రభాః. ౪౦

విశ్వే దేవా శ్చ మరుతో వసవ శ్చ దివౌకసః,
ఆగమ్య పశ్చిమాం సన్ధ్యాం మేరు ముత్తమపర్వతమ్. ౪౧
ఆదిత్య ముపతిష్ఠన్తి తై శ్చ సూర్యోఽభిపూజితః,
అదృశ్య స్సర్వభూతానా మస్తం గచ్ఛతి పర్వతమ్. ౪౨
యోజనానాం సహస్రాణి దశ తాని దివాకరః,
ముహూర్తార్ధేన తం శీఘ్ర మభియాతి శిలోచ్చయమ్. ౪౩
శృఙ్గే తస్య మహ ద్దివ్యం భవనం సూర్యసన్నిభమ్,
ప్రాసాదగణసంబాధం విహితం విశ్వకర్మణా. ౪౪
శోభితం తరుభి శ్చిత్రై ర్నానాపక్షిసమాకులైః,
నికేతం పాశహస్తస్య వరుణస్య మహాత్మనః. ౪౫

అన్తరా మేరు మస్తం చ తాలో దశశిరా మహాన్,
జాతరూపమయ శ్శ్రీమా న్భ్రాజతే చిత్రవేదికః. ౪౬

తేషు సర్వేషు దుర్గేషు సరస్సు చ సరిత్సు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౪౭

అయ్యఱువదివేలపర్వతంబులనడుమ రాజయిన సర్వోత్తమమగు సావర్ణిమేరుపర్వతం బున్నది. మున్ను సూర్యుఁడు ప్రసన్నుఁడై యాపర్వతంబునకు వరం బొసంగెను. ౩౮

“నాయనుగ్రహంబునం జేసి నీయందున్న వృక్షశిలాదు లన్నియు రేయుంబవలును గాంచనమయంబులై యుండెడుఁ గాక; మఱియు నీయందు నివసించువారలు దేవతలుగాని గంధర్వులుగాని దానవులుగాని యెవ్వరు గలరో వారలందఱు రక్తవర్ణంబు కాంచనప్రభులయి యుండెదరు” అని సూర్యుఁడు అమ్మేరుపర్వతంబునకు వరంబొసంగెను. ౩౯,౪౦

విశ్వదేవులును వాయువులును అశ్వినులును దేవతలును సాయంకాలసంధ్యయందు శ్రేష్ఠమయిన మేరుపర్వతంబుఁ జేరి యచట సూర్యుని యుపస్థానము గావింతురు; సూర్యుఁడు వారలు గావించుపూజలఁ గైకొని యస్తగిరి నొంది సమస్తభూతంబులకు నదృశ్యుఁడగును. ౪౧,౪౨

ఆ సావర్ణిమేరువునకును అస్తగిరికిని పదివేలయోజనంబుల దూరంబున్నది. సూర్యుఁడు ఆపదివేలయోజనంబుల దూరంబును అర్ధముహూర్తంబున నతిక్రమించి యస్తగిరిశిఖరంబుఁ జేరును. ౪౩

ఆపర్వతము శిఖరంబున విశ్వకర్మనిర్మితంబును రెక్కమేడలతో నొప్పుచున్నదియుఁ దేజస్సుచే సూర్యుంబోలినదియు నానావిధంబులగు పక్షులతోఁగూడిన పుష్పితంబులగుటను చిత్రవర్ణములైనవృక్షములచే రమణీయంబై యున్నదియు విశాలంబును దివ్యంబునగు గృహంబు గలదు; అది పాశధరుఁడును మహాప్రభావుఁడునగు వరుణుని నివాసస్థానము. ౪౪,౪౫

సావర్ణిమేరుపర్వతమునకును అస్తగిరికిని నడుమ పదిశిఖరంబులును చిత్రవర్ణమయినవేదికయుం గలిగి కాంచనమయంబై యున్నతంబైన యొకతాలవృక్షం బొప్పుచుండును ౪౬

ధర్మవేత్తయు మహాతపస్సంపన్నుఁడును బ్రహ్మదేవునితో సమానుఁడు నగు మేరుసావర్ణి యెచట నివసించునో, అట్టి సావర్ణి మేరువునందు సమ

యత్ర తిష్ఠతి ధర్మజ్ఞ స్తపసా స్వేన భావితః,
మేరుసావర్ణి రిత్యేవ ఖ్యాతో వై బ్రహ్మణా సమః. ౪౮
ప్రష్టవ్యో మేరుసావర్ణి ర్మహర్షి స్సూర్యసన్నిభః,
ప్రణమ్య శిరసా భూమౌ ప్రవృత్తిం మైథిలీం ప్రతి. ౪౯
ఏతావ జ్జీవలోకస్య భాస్కరో రజనీక్షయే,
కృత్వా వితిమిరం సర్వ మస్తం గచ్ఛతి పర్వతమ్. ౫౦

ఏతావ ద్వానరై శ్శక్యం గన్తుం వానరపుఙ్గవాః!,
అభాస్కర మమర్యాదం న జానీమ స్తతఃపరమ్. ౫౧

అధిగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ,
అస్తపర్వత మాసాద్య పూర్ణే మాసే నివర్తత. ౫౨
ఊర్ధ్వంమాసా న్న వస్తవ్యం వస న్వధ్యో భవే న్మమ,

సహైవ శూరో యుష్మాభి శ్శ్వశురో మే గమిష్యతి. ౫౩
శ్రోతవ్యం సర్వ మేతస్య భవద్భి ర్దిష్టకారిభిః,

గురు రేష మహాబాహు శ్శ్వశురో మే మహాబలః. ౫౪
భవన్త శ్చాపి విక్రాన్తాః ప్రమాణం సర్వకర్మసు,

ప్రమాణ మేనం సంస్థాప్య పశ్యధ్వం పశ్చిమాం దిశమ్. ౫౫

దృష్టాయాం తు నరేన్ద్రస్య పత్న్యా మమితతేజసః!,
కృతకృత్యా భవిష్యామః కృతస్య ప్రతికర్మణా. ౫౬

స్తములయిన రహస్యప్రదేశములయందును గొలంకులయందును నదులయం దును రావణుని సీతాదేవిని జక్కఁగా వెదకవలెను. ౪౭,౪౮

సూర్యుఁడుంబోలె వెలుఁగుచుండువాసావర్ణిమహర్షి కిఖాలంబు భూమి తోఁకం బ్రణమిల్లి ఆయనను సీతాదేవివృత్తాంత మడుగవలెను. ౪౯

సూర్యుఁడు ఉదయమయి యస్తగిరిచేరువఱకు ఉదయపర్వతము వెం బలుకొని యిప్పుడు చెప్పిన యస్తగిరిపర్యంతముగల ప్రదేశములయందే యంధకారమును బోఁగొట్టి ప్రకాశము నొసఁగును. ౫౦

వానరోత్తములారా! ఇంతదూరమువఱకే వానరులకుఁ బోవ నలవి యగును అంతకు వావలిప్రదేశము సూర్యుఁడులేమింజేసి యంధకారావృతంబై నగరగ్రామాదిమర్యాదలు లేనిదగుటను ఎట్టిదో మాకుఁదెలియదు. ౫౧

మీరలు ఆస్తపర్వతమువఱకుంబోయి సీతాదేవిని రావణుని నివాసంబు నువెదకి తెలిసికొని ఒకమాసము నిండుటకు మున్నే వచ్చి చేరవలెను. ౫౨

ఒక నెలకన్నను అధికముగా జాగుసేయఁగూడదు; అట్లు నెలలోపల రానివానికి మరణదండనము విధింతును.

మీతోఁగూడ శూరుఁడు నామామ సుషేణుఁడు రాఁగలఁడు; మీర లితనియాజ్ఞ ననువర్తించువారలై నితఁడు పంచిన పనులన్నియుఁ జేయుచుం డవలెను. ౫౩

మహాబాహుఁడును మహాబలశాలియునగు నామామయు గురువునయిన యీసుషేణుఁడు కార్యముల నెఱపువాఁడు; మీరలును బరాక్రమవంతులరు. కావున సులభముగాఁ గార్యసిద్ధి కాఁగలదు ౫౪

మీర లీసుషేణుని నియామకునిఁగా నేర్పఱచుకొని యితనియాజ్ఞకు విధేయులరయి పశ్చిమదిశయందు సీతాదేవిని రావణుని వెదకుఁడు. ౫౫

మహాపరాక్రమశాలియగు రామునిభార్య సీతాదేవిం జూచియే వచ్చితిరేని మనకు రాముఁడు గావించిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము చేసినవార మగుటంజేసి కృతార్థుల మయ్యెదము. ౫౬

అతోఽన్యదపి యత్కార్యం కార్యస్యాస్య హితం భవేత్,
సంప్రధార్య భవద్భిశ్చ దేశకాలార్థసంహితమ్. ౫౭

తత స్సుషేణప్రముఖాః ప్లవఙ్గా
స్సుగ్రీవవాక్యం నిపుణం నిశమ్య,
ఆమన్త్ర్య సర్వే ప్లవగాధిపం తే
జగ్ముర్దిశం తాం వరుణాభిగుప్తామ్. ౫౮

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్విచత్వారింశ స్సర్గః. ౪౨.

---

త్రిచత్వారింశ స్సర్గః.

తత స్సందిశ్య సుగ్రీవ శ్శ్వశురం పశ్చిమాం దిశమ్,
వీరం శతబలిం నామ వానరం వానరర్షభః. ౧
ఉవాచ రాజా ధర్మజ్ఞ స్సర్వవానరసత్తమమ్,
వాక్య మాత్మహితం చైవ రామస్య చ హితం తథా. ౨

వృత శ్శతసహస్రేణ త్వద్విధానాం వనౌకసామ్,
వైవస్వతసుతై స్సార్ధం ప్రతిష్ఠస్వ స్వమన్త్రిభిః. ౩
దిశం హ్యుదీచీం విక్రాన్తాం హిమశైలావతంసకామ్,
సర్వతః పరిమార్గధ్వం రామపత్నీ మనిన్దితామ్. ౪

అస్మి న్కార్యే వినిర్వృత్తే కృతే దాశరథేః ప్రియే,
ఋణా న్ముక్తా భవిష్యామః కృతార్థార్థవిదాం వరాః!. ౫

కృతం హి ప్రియ మస్మాకం రాఘవేణ మహాత్మనా,

నేను జెప్పినదిగాక యింక నితరమేమైనను ఈకార్యమునకు సాధకమయినది మీకుఁ దోఁచినను దానినిఁగూడ మీరు దేశకాలములను గార్యాకార్యములను ఆలోచించి చేయవలెను. అని సుగ్రీవుఁడు సుషేణుఁడు మున్నగు వానరులతోఁ జెప్పెను. ౫౬

అంత సుషేణుఁడు మున్నగు నా వానరులందఱు యుక్తియుక్తంబగు సుగ్రీవు నాజ్ఞను గ్రహించి సుగ్రీవునియొద్ద సెలవుపుచ్చుకొని వరుణునిచేఁ బరిపాలితం బగు పశ్చిమదిశకుఁ బోయిరి. ౫౭

ఇది నలుబదిరెండవసర్గము.

---

## నలువదిమూఁడవసర్గము.

వానరోత్తముఁడును సమస్తధర్మంబులు దెలిసినవాఁడునగు వానరరాజు సుగ్రీవుఁడు అట్లు తనమామయగు సుషేణుని బడమరకుఁ బోఁబనిచి యంత వీరుఁడు వానరశ్రేష్ఠుఁడునగు శతవలిం జూచి ప్రత్యుపకారమునకై చెప్పఁబడునది కావున ముఖ్యము గాఁదనకు హితంబును ప్రియాసమాగమహేతువగుటచే రామునకును హితంబునగు వచనంబుఁ బలికెను. ౧,౨

నీవు నీవంటిపరాక్రమవంతులయిన లక్షమంది వానరవీరులం దీసికొని యమపుత్త్రులగు నీమంత్రులంగూడి పయనంబగుము. ౩

మీరలు విశాలంబును హిమవత్పర్వతముచే నధిష్ఠితంబునగు నుత్తరదిశకుఁబోయి యచట సమస్తకల్యాణ గుణపూర్ణయగు రామభార్యను సీతాదేవిని వెదకుఁడు. ౪

కార్యజ్ఞులలో నుత్తములగు వానరులారా! మీరు పోవునట్టికార్యము సఫలమయి సీతాదేవి లభించి రాముఁడు సంతోషంబు నొందినయెడ మేము ఋణవిముక్తులమయి కృతార్థుల మగుదుము. ౫

మహాత్ముఁడగు రాముఁడు, మొదట మనకు ఉపకారము గావించి

తస్య చే త్ప్రియకారోఽస్తి సఫలం జీవితం భవేత్. ౬

అర్థినః కార్యనిర్వృత్తి మకర్తు రపి య శ్చరేత్,
తస్య స్యా త్సఫలం జన్మ కింపునః పూర్వకారిణః. ౭

ఏతాం బుద్ధి మవస్థాయ దృశ్యతే జానకీ యథా,
తథా భవద్భిః కర్తవ్య మస్మత్ప్రియహితైషిభిః. ౮

అయం హి సర్వభూతానాం మాన్య స్తు నరస త్తమః,
అస్మాసు చాగతప్రీతీ రామః పరపురఞ్జయః. ౯

ఇమాని వనదుర్గాణి నద్య శ్శైలాన్తరాణి చ,
భవన్తః పరిమార్గన్తు బుద్ధివిక్రమసంపదా. ౧౦
తత్ర మ్లేచ్ఛా న్పులిన్దాంశ్చ శూరసేనాం స్తథైవచ,
ప్రస్థలా న్భరతాంశ్చైవ కురూంశ్చసహ మద్రకైః. ౧౧
కామ్భోజా న్యవనాం శ్చైవ శకా నారట్టకా నపి,
బాహ్లీకా న్నృషికాం శ్చైవ పౌరవా నథ టఙ్కణాన్. ౧౨
చీనా న్పరమచీనాంశ్చ నీహారాంశ్చ పునఃపునః,
అన్విష్య దరదాం శ్చైవ హిమవన్తం తథైవచ. ౧౩

లోధ్రపద్మకషణ్డేషు దేవదారువనేషు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః, ౧౪
తత స్సోమాశ్రమం గత్వా దేవగన్ధర్వసేవితమ్,
కాళం నామ మహాసానుం పర్వతం తు గమిష్యథ. ౧౫

నాఁడుగదా! అందుకు మనము ప్రత్యుపకారము గావించుమేని మనప్రతుకు సఫలమవ్వను. ౬

తనకు ఎంతమాత్రముపకారము చేయనివానికార్యముఁగూడ జన్మము సఫలమగుటకై నెఱవేర్పవలెను; ఇఁకఁ దనకు ముందు ఉపకారముచేసిన వానికార్యమునుగూడ నెఱవేర్చనియెడ నిరర్థకజన్మము లేదని చెప్పనేల? ౭

మీరలు మాసంతోషంబును మేలును గోరువారలు కావున ఈయభిప్రాయమును మనస్సున నుంచుకొని సీతాదేవిని జూచి వచ్చునట్లు తగినంత ప్రయత్నము చేయవలెను. ౮

శత్రుపురంబుల జయించునట్టి యీ రాముఁడు సమస్తభూతంబులకును పూజనీయుఁడు. మనయందును అధిక ప్రీతిగలవాఁడు. కావున నితని కార్యమును ముఖ్యముగాఁ జేయవలెను. ౯

మీరలు ఉత్తరదిశయందు మ్లేచ్ఛదేశమునందును పుళిందదేశమునందును శూరసేనదేశమునందును ప్రస్థలదేశమునందును భరతదేశమునందును దక్షిణకురుదేశమునందును మద్రదేశమునందును గాంభోజదేశమునందును యవనదేశమునందును శకదేశమునందును ఆరట్టకదేశమునందును బాహ్లీకదేశమునందును ఋషికదేశమునందును పౌరవదేశమునందును టంకణదేశమునందును చీనదేశమునందును పరమచీనదేశమునందును నిహారదేశమునందును దరదదేశమునందును హిమవత్పర్వతంబునందును సీతాదేవిని జక్కఁగా వెదకి యంత నీదుర్గమారణ్యంబులందును నదులందును పర్వతంబులందును బుద్ధిపరాక్రమంబులతో వెదకుఁడు. ౧౦-౧౩

లొద్దుగు చెట్లవనంబులయందును పద్మకవనంబులయందును దేవదారువనంబులయందును దిరిగి సీతాదేవిని రావణునిఁ జక్కఁగా వెదకవలెను. ౧౪

అంత దేవతలచేతను గంధర్వులచేతను సేవితంబగు సోమాశ్రమంబునకుఁబోయి యచటనుండి గొప్పసానువులతో నొప్పుచున్న కాళపర్వతంబునకుఁ బోఁగలరు. ౧౫

మహాత్సు తస్య శైలస్య నిర్దరేషు గుహాసుచ,
విచినుధ్వం మహాభాగాం రామపత్నీం తత స్తతః. ౧౬
తమతిక్రమ్య శైలేన్ద్రం హేమగర్భం మహాగిరిమ్,
తత స్సుదర్శనం నామ గన్తు మర్హథ పర్వతమ్. ౧౭
తతో దేవసఖో నామ పర్వతః పర్వతాలయాః!,
నానాపక్షిగణాకీర్ణో వివిధద్రుమభూషితః. ౧౮

తస్య కాననషణ్డేషు నిర్ఝరేషు గుహాసు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః ౧౯

తమతిక్రమ్య చాకాశం సర్వతశ్శతయోజనమ్,
అపర్వతనదీవృక్షం సర్వసత్త్వవివర్జితమ్. ౨౦

తం తు శీఘ్ర మతిక్రమ్య కాన్తారం రోమహర్షణమ్,
కైలాసం పాణ్డురం శైలం ప్రాప్య హృష్టా భవిష్యథ. ౨౧

తత్ర పాణ్డురమేఘాభం జామ్బూనదపరిష్కృతమ్,
కుబేరభవనం దివ్యం నిర్మితం విశ్వకర్మణా. ౨౨
విశాలా నళినీ యత్ర ప్రభూతకమలోత్పలా,
హంసకారణ్డవాకీర్ణా హ్యప్సరోగణసేవితా. ౨౩

తత్ర వైశ్రవణో రాజా సర్వభూతనమస్కృతః,
ధనదో రమతే శ్రీమా న్గుహ్యకై స్సహ యక్షరాట్. ౨౪

ఆ కాళపర్వతమందలి విశాలములయిన కోనలయందును గుహాలయంబులను దిరిగి యందందు మహాభాగ్యురాలగు సీతాదేవిని వెదకుఁడు. ౧౬

మీఁదట బంగారుగనులతోఁగూడిన పర్వతశ్రేష్ఠమయిన యాకాళపర్వతము నతిక్రమించి యంత సుదర్శనపర్వతమునకుఁ బొండు. ౧౭

వానరులారా! సుదర్శనపర్వతము నతిక్రమించిన పిదప నానావిధములయినపక్షులతోను నానావిధములయిన వృక్షములతోను ఒప్పుచున్న దేవసఖంబను పర్వతంబున్నది. ౧౮

ఆ దేవసఖపర్వతమునందలి వనంబులయందును సెలయేళ్లయందును గుహాలయందును దిరిగి యాయాస్థలములయందు సీతాదేవిని రావణుని వెదకి చూడుఁడు. ౧౯

ఆ దేవసఖపర్వతము నతిక్రమించినపిదప అంతటను నూఱుయోజనములవైశాల్యముగల శూన్యప్రదేశ మొకటి కలదు అందుఁ బర్వతములుగాని నదులుగాని వృక్షములుగాని యుండవు కావున నచట నేజంతువును నివసింపదు. ౨౦

మహాభయంకరమయిన యాశూన్యప్రదేశమునందు మీరు తడవుసేయవలదు. దానిశీఘ్రముగా నతిక్రమించి ధవళవర్ణమయిన కైలాసపర్వతమును జూచి సంతోషము నొందఁగలరు. ౨౧

ఆకైలాసపర్వతమందు తెల్లని మేఘముతో సమానమయినదియు బంగారుపనులచే నలంకృతంబును విశ్వకర్మనిర్మితంబు నగు దివ్యమైన కుబేరునిగృహము కలదు. అందుఁ గమలంబులతోను గలువలతోను నిండి హంసకారండవాదిపక్షులతో నొప్పుచున్నదియు విహారార్థమయి యప్సరసలచే సేవితంబు నగు విశాలమయిన తామరకొలను కలదు. ౨౨,౨౩

కైలాసంబున విశ్రవసునికుమారుఁడైన శ్రీమంతుఁడగు యక్షరాజు కుబేరుఁడు సమస్తభూతంబులును దన్ను భక్తిమెయి నమస్కరించి కొలువ సర్వయక్షసమేతంబుగా విహరించుచుండును. ౨౪

తస్య చన్ద్రనికాశేషు పర్వతేషు గుహాసు చ,
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౨౫

క్రౌఞ్చం తు గిరి మాసాద్య బిలం తస్య సుదుర్గమమ్,
అప్రమత్తైః ప్రవేష్టవ్యం దుష్ప్రవేశం హి తత్ స్మృతమ్.

వస న్తి హి మహాత్మాన స్తత్ర సూర్యసమప్రభాః,
దేవై ర ప్యర్చితా స్సమ్య గ్దేవరూపా మహర్షయః. ౨౭

క్రౌఞ్చస్య తు గుహా శ్చాన్యా స్సానూని శిఖరాణి చ,
నిర్దరాశ్చ నితమ్బాశ్చ విచేతవ్యా స్తత స్తతః. ౨౮

క్రౌఞ్చస్య శిఖరంచాపి నిరీక్ష్య చ తత స్తతః,
అవృక్షం కామశైలం చ మానసం విహగాలయమ్. ౨౯

న గతి స్తత్ర భూతానాం దేవదానవరక్షసామ్,
సచ సర్వై ర్విచేతవ్య స్ససానుప్రస్థభూధరః. ౩౦

క్రౌఞ్చం గిరి మతిక్రమ్య మైనాకో నామ పర్వతః,
మయస్య భవనం యత్ర దానవస్య స్వయం కృతమ్. ౩౧
మైనాక స్తు విచేతవ్య స్ససానుప్రస్థకన్దరః,
స్త్రీణా మశ్వముఖీనాం తు నికేతా స్తత్ర తత్ర తు ౩౨

తం దేశం సమతిక్రమ్య ఆశ్రమం సిద్ధసేవితమ్,

ఆకైలాసపర్వతమునఁ జంద్రవర్ణములగు పర్యంతపర్వతములయందును గుహాలయందును దిరిగి యన్ద్యోన్యస్థలములయందు సీతాదేవిని రావణునివెదకిచూడవలెను. ౨౫

అంత మీరు క్రౌంచపర్వతంబుఁ జేరి యందుఁ గుమారశక్తిచేఁ జేయఁబడిన దుర్గమమయినబిలమును ఎంతమాత్రమేమఱక జాగ్రత్తతోఁ బ్రవేశింపుఁడు. ఏలయనఁగా దానిఁ బ్రవేశించుట మిక్కిలియుఁ గష్టము ౨౬

ఆ క్రౌంచబిలమునందు మహాప్రభావులు సూర్యునకుంబోలెఁ గాంతిగలవారలు సమస్తదేవతలచేఁ బూజితులు దేవరూపులునగు మహర్షులు నివసింతురు. అందువలన దానిం బ్రవేశించుట కష్టము. ౨౭

ఆక్రౌంచపర్వతమునందు ఇతరములయిన గుహాలయందును సానువులయందును శిఖరములందును కోనలందును మధ్యప్రదేశములయందును దిరిగి యన్ద్యోన్యస్థలంబులందు సీతాదేవిని వెదకవలెను. ౨౮

క్రౌంచపర్వతమునందలి ప్రధానశిఖరమును వృక్షరహితమయిన కామపర్వతంబును సమస్తపక్షులతో నిండియుండు మానసపర్వతంబును జూచి యచట సీతాదేవిని జక్కఁగా వెదకవలెను. ౨౯

ఆ మానసపర్వతమును సాధారణప్రాణులు మాత్రమే గాదు దేవతలును దానవులును రాక్షసులును గూడఁ బ్రవేశింపఁజాలరు. అందలి సమభూములందును విషమభూములందును అగ్రప్రదేశములందును మీరలందఱు చక్కఁగా వెదకవలెను. 30

క్రౌంచపర్వతమునకుఁ బిమ్మట మైనాకపర్వతం బున్నది. అందు మయుండనుదానవుఁడు తనగృహంబును నిర్మించికొనియున్నాఁడు. 3౧

ఆమైనాకపర్వతమునందలి సమభూములయందును విషమప్రదేశములయందును గుహాలయందును మఱియుఁ గిన్నరస్త్రీలయొక్క వాసస్థానములయందును దిరిగి యన్ద్యోన్యస్థలంబుల సీతాదేవిం జక్కఁగా వెదకుఁడు. 3౨

ఆమైనాకపర్వతమును దాఁటిన పిమ్మట సిద్ధులగు మహాత్ములచే సేవితం

సిద్ధా వైఖానసా స్తత్ర వాలఖిల్యాశ్చ తాపసాః. 33

వన్ద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యాశ్చాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః. 3౪

హేమపుష్కరసంఛన్నం తస్మిన్ వైఖానసం సరః,
తరుణాదిత్యసంకాశై ర్హంసై ర్విచరితం శుభైః. 3౫

ఔపవాహ్యః కుబేరస్య సార్వభౌమ ఇతి స్మృతః,
గజః పర్యేతి తం దేశం సదా సహ కరేణుభిః. 3౬
తత్సర సమతిక్రమ్య నష్టచన్ద్రదివాకరమ్,
అనక్షత్రగణం వ్యోమ నిష్పయోద మనాదిమత్. 3౭

గభస్తిభి రివార్కస్య స తు దేశః ప్రకాశతే,
విశ్రామ్యద్భి స్తపస్సిద్ధై ర్దేవకల్పైః స్వయంప్రభైః. 3౮

తం తు దేశ మతిక్రమ్య శైలోదా నామ నిమ్నగా,
ఉభయో స్తీరయో స్తస్యాః కీచకా నామ వేణవః 3౯
తే నయన్తి పరం తీరం సిద్ధా న్ప్రత్యానయన్తి చ,

ఉత్తరాః కురవ స్తత్ర కృతపుణ్యప్రతిశ్రయాః. ౪౦
తతః కాఞ్చనపద్మాభిః పద్మినీభిః కృతోదకాః,
నీలవైడూర్యపత్రాభి ర్నద్య స్తత్ర సహస్రశః. ౪౧

బగు నొకయాశ్రమంబుఁ గనుఁడు. అందు అణిమాద్యష్టైశ్వర్యసంపన్నులును దపస్సంపన్నులు నగు వైఖానసులును వాలఖిల్యులును నివసించుచుందురు. ౩౩

మీరు తపోబలంబున నణిమాద్యష్టసిద్ధులను బొందినవారలను బరిశుద్ధులునగు నమ్మహానుభావులకు అభివాదము నమస్కారముచేసి వారలను సీతాదేవి సమాచారము గుఱించి యడుగవలెను. ౩౪

ఆయాశ్రమమునందు కాంచనపద్మములతో నిండి బాలసూర్యప్రకాశంబులగు సుందరములయిన హంసలతో నొప్పుచున్న వైఖానసమను తామరకొలను కలదు. ౩౫

కుబేరునివాహనమయిన సార్వభౌమంబను దిగ్గజము ఆఁడేనుఁగులతోఁ గూడ ఎల్లప్పుడు నచట విహరించుచుండును. ౩౬

ఆవైఖానససరస్సునకావల ఆకాశమునందు చంద్రసూర్యుల ప్రచారముగాని నక్షత్రములసంచారముగాని యెంతమాత్రము లేదు మేఘములు సంచరింపవు. నిశ్శబ్దమై శూన్యముగా నుండును. ౩౭

చంద్రసూర్యులసంచారము లేకపోయినను అచట విశ్రమించుచుండు దేవసమానులు స్వయంప్రకాశులునగు సిద్ధపురుషుల దేహప్రకాశముచే నా ప్రదేశమంతయు వెలుతురు గలిగియుండును. ౩౮

ఆప్రదేశము నతిక్రమించిన పిదప, శైలోద యను నదియున్నది; ఆ నది తీరంబుల రెంటియందును గాలికొట్టినపుడు ధ్వనించునట్టి వెదుళ్లుకలవు.

ఆరెండు తీరంబులందలి వెదుళ్లును అత్యున్నతంబులయి వంగి యొండొంటితోఁ బెనఁగియుండుటవలన సిద్ధులు వానిమీఁదుగా నావలిగట్టునకుఁ బోవుచు వచ్చుచుందురు.

అంతఁ బుణ్యవంతులకు నివాసస్థానమయిన యుత్తరకురుదేశమున్నది.

ఉత్తరకురుదేశము పుణ్యముచేసినవారలు ఆఫలము ననుభవించుటకై జన్మించు భూమి యవుటంజేసి యందు బంగారుకమలంబులతోఁగూడిన నీల

రక్తోత్పలవనై శ్చాత్ర మణ్డితా శ్చ హిరణ్మయైః,
తరుణాదిత్యసదృశై ర్భాన్తి తత్ర జలాశయాః. ౪౨
మహార్హమణిపత్రైశ్చ కాఞ్చనప్రభకేసరైః,
నీలోత్పలవనై శ్చిత్రై స్స దేశ స్సర్వతో వృతః. ౪౩

నిస్తులాభి శ్చ ముక్తాభి ర్మణిభి శ్చ మహాధనైః,
ఉద్భూతపులినా స్తత్ర జాతరూపై శ్చ నిమ్నగాః. ౪౪
సర్వరత్నమయై శ్చిత్రై రవగాఢా నగోత్తమైః,
జాతరూపమయై శ్చాపి హుతాశనసమప్రభైః. ౪౫
నిత్యపుష్పఫలా స్తత్ర నగాః పత్రరథాకులాః,
దివ్యగన్ధరసస్పర్శా స్సర్వా న్కామాం స్స్రవన్తి చ. ౪౬

నానాకారాణి వాసాంసి ఫల న్త్యన్యే నగోత్తమాః,
ముక్తావైడూర్యచిత్రాణి భూషణాని తథైవచ. ౪౭
స్త్రీణాం చా ప్యనురూపాణి పురుషాణాం తథైవచ,
సర్వర్తుసుఖసేవ్యాని ఫల న్త్యన్యే నగోత్తమాః. ౪౮
మహార్హాణి విచిత్రాణి హైమా న్యన్యే నగోత్తమాః,
శయనాని ప్రసూయన్తే చిత్రా స్తరణవన్తి చ. ౪౯
మనఃకాన్తాని మాల్యాని ఫల న్త్యత్రాపరే ద్రుమాః,
పానాని చ మహార్హాణి భక్ష్యాణి వివిధాని చ. ౫౦
స్త్రియశ్చ గుణసంపన్నా రూపయౌవనలక్షితాః,

గన్ధర్వాః కిన్నరా స్సిద్ధా నాగావిద్యాధరా స్తథా. ౫౧

వై వైడూర్యవర్ణంబులయిన తామరతీఁగలచే నలంకృతమయి రమణీయమయిన జలముతో నొప్పుచున్న నదులు వేనవేలుగాఁ గలవు. ౪౧

ఆయుత్తరకురుదేశంబునఁ గొలంకులు ఎఱ్ఱగలువలతోను బంగారు కలువలతోను బాలసూర్యవర్ణంబులగు కలువలతోను ఒప్పుచుండును. ౪౨

ఆయుత్తరకురుదేశంబున నంతటను నీలరత్నములవంటి రేకులను బంగారమువంటి కేసరములును గలిగి యత్యంత సుందరములయిన నల్లగలువలకొలంకులు మెండుగానుండును. ౪౩

ఆయుత్తరకురుదేశంబునందు నదులందు సుందరములగు ముక్తాఫలంబులును గొప్పవిలువగల రత్నంబులును బంగారమును పులినములుగానుండును; సమస్త రత్నమయములయిన పర్వతంబులును అగ్నివలె వెలుంగుచుండు కాంచనమయపర్వతంబులును ఆనదులనడుమ నచటచట భాసిల్లుచుండును.

అచట వృక్షంబులు ఎల్లప్పుడును ఫలపుష్పంబులు గలిగి పక్షులచే నిండినవై మంచి తావియు మాధుర్యంబును గలిగి సుఖస్పర్శంబులై కోరిన కోర్కెల నన్నింటి నొసంగుచుండును. ౪౭

కొన్నియుత్తమవృక్షంబులు నానావిధములగు వస్త్రంబుల నొసంగును.

మఱికొన్ని వృక్షములు ముత్తెములును వైడూర్యములును బొదిగియుండుటచే సుందరములును సమస్తఋతువులందును సుఖప్రదంబులునగు భూషణంబులను ఆఁడువారికిఁదగినట్లుగాను మగవారికిఁ దగినట్లుగాను ఒసంగును.

మఱికొన్నితరువులు ఉత్తమములు నానావిధములు చిత్రవర్ణములయిన పఱుపులుగలవియునగు కాంచనశయనీయంబుల నొసంగును. ౪౯

ఆయుత్తర కురు దేశంబున మఱికొన్నిభూరుహంబులు రమణీయములగు పుష్పమాలికలను ఉత్తమములగు పానద్రవ్యములను నానావిధములగు భక్ష్యములను గుణవతులును రూపయౌవనములుగల వారలునగు కాంతలను ఒసంగును. ౫౦

అచట గంధర్వులు కిన్నరులు కింపురుషులు సిద్ధులు నాగులు విద్యాధ

రమన్తే సహితా స్తత్ర నారీభి ర్భాస్కరప్రభాః,
సర్వే సుకృతకర్మాణ స్సర్వే రతిపరాయణాః. ౫౨
సర్వే కామార్థసహితా వసన్తి సహయోషితః,
గీతవాదిత్రనిర్ఘోష స్సోత్కృష్టహసితస్వనః. ౫౩
శ్రూయతే సతతం తత్ర సర్వభూతమనోహరః,
తత్ర నాముదితః కశ్చి న్నాస్తి కశ్చి దసత్ప్రియః. ౫౪
అహన్యహని వర్ధన్తే గుణా స్తత్ర మనోరమాః,
సమతిక్రమ్య తం దేశ ముత్తరః పయసాం నిధిః. ౫౫
తత్ర సోమగిరి ర్నామ మధ్యే హేమమయో మహాన్,
ఇన్ద్రలోకగతా యే చ బ్రహ్మలోకగతా శ్చ యే. ౫౬
దేవా స్తం సమవేక్షన్తే గిరిరాజం దివం గతాః,
స తు దేశో విసూర్యోఽపి తస్య భాసా ప్రకాశతే. ౫౭
సూర్యలక్ష్మ్యాఽభివిజ్ఞేయ స్తపతేవ వివస్వతా,
భగవా నపి విశ్వాత్మా శమ్భు రేకాదశాత్మకః. ౫౮
బ్రహ్మా వసతి దేవేశో బ్రహ్మర్షిపరివారితః,
న కథంచన గన్తవ్యం కురూణా ముత్తరేణ వః. ౫౯
అన్యేషా మపి భూతానాం నాతిక్రామతి వై గతిః,
సహి సోమగిరి ర్నామ దేవానా మపి దుర్గమః. ౬౦
త మాలోక్య తతః క్షిప్ర ముపావర్తితు మర్హథ,
ఏతావ ద్వానరై శ్శక్యం గన్తుం వానరపుఙ్గవాః. ౬౧

రులు సూర్యతేజంబున వెలుంగుచుఁ బ్రియాసమేతులయి విహరింపుచుందురు.

అచట నివసించు జనులందఱు పుణ్యవంతులు క్రీడాసక్తులు కామంబును అర్థంబును సమృద్ధంబుగాఁగలవారలై నిజకాంతలంగూడి యానందించు చుందురు. ౫౨

అచట అధికముగా హాసధ్వనులను గీతవాద్యధ్వనులను సమస్తభూతంబులకును వీనులకింపుగా నెల్లప్పుడును వినఁబడుచుండును. ౫౩

మఱియు నాదేశంబున సంతోషంబు లేనివాఁడుగాని ప్రియురాలు లేనివాఁడుగాని యొకానొకఁడును లేఁడు; అచట మనోహరంబులగు సుఖంబులు దినదినమునకును వృద్ధిఁబొందుచుండును. ౫౪

ఆయుత్తరకురుదేశము నతిక్రమించినపిదప నుత్తరసముద్రమున్నది. ఆయుత్తరసముద్రమునడుమ కాంచనమయంబగు సోమగిరియనునొక మహాపర్వతమున్నది.

విష్ణులోకంబున బ్రహ్మలోకంబున స్వర్గంబుననుండు దేవతలు ఆసోమగిరిని జూడఁగలరే గాని ఇతరులకు దానిఁజూచుటయే యసాధ్యము. ౫౬

ఆప్రదేశమున సూర్యసంచారము లేకున్నను సూర్యసంచారముగల ప్రదేశము సూర్యునిచేవెలుతురు గలిగియుండునట్లు ఆమహాపర్వతముయొక్క ప్రకాశముచే వెలుతురు గలిగియుండును. ౫౭

ఆసోమగిరియందు సర్వాత్మకుండగువిష్ణువును ఏకాదశరుద్రస్వరూపుండగుశివుండును సమస్తదేవనాథుండగుబ్రహ్మదేవుండును బ్రహ్మర్షులచే సేవింపఁబడుచున్నవారలయి వాసముసేయుచుందురు. ౫౮

ఆయుత్తరకురుదేశమున నుత్తరముగా మీరెంతమాత్రము పోవలదు; దైత్యులు మొదలగు విశేషశక్తిగలవారలకును అపిమ్మటఁబోవుటకుశక్తిలేదు.

ఆసోమగిరిం బ్రవేశించుటకు దేవతలకుఁగూడ సాధ్యముకాదు; కావున మీర లాపర్వతముం జూచి యంత నటనుండి శీఘ్రముగా మరలిరండు.

వానరోత్తములారా! ఇంతవఱకుమాత్రమె వానరులకుఁ బోవ నలవి

అభాస్కర మమర్యాదం న జానీమ స్తతః పరమ్,

సర్వ మేత ద్విచేతవ్యం య న్మయా పరికీర్తితమ్. ౬౨
య దన్య దపి నోక్తంచ తత్రాపి క్రియతాం మతిః,

తతః కృతం దాశరథే ర్మహ త్ప్రియం
మహత్తరం చాపి తతో మమ ప్రియమ్,
కృతం భవిష్య త్యనిలానలోపమా
విదేహజాదర్శనజేన కర్మణా. ౬౩
తతః కృతార్థా స్సహితా స్సబాన్ధవా
మయాఽర్చితా స్సర్వగుణై ర్మనోరమైః,
చరిష్య థోర్వీం ప్రతి శాన్తశత్రవ
స్సహప్రియా భూతధరాః ప్లవఙ్గమాః!. ౬౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రిచత్వారింశ స్సర్గః. ౪౩.

---

## చతుశ్చత్వారింశ స్సర్గః.

విశేషేణ తు సుగ్రీవో హనూమ త్యర్థ ముక్తవాన్,
స హి తస్మి న్హరిశ్రేష్ఠే నిశ్చితార్థోఽర్థసాధనే. ౧

అబ్రవీ చ్చ హనూమన్తం విక్రాన్త మనిలాత్మజమ్,
సుగ్రీవః పరమప్రీతః ప్రభు స్సర్వవనౌకసామ్. ౨

న భూమౌ నాన్తరిక్షే వా నామ్బరే నామరాలయే,
నాప్సు వా గతిసఙ్గం తే పశ్యామి హరిపుఙ్గవ!. ౩

యగును; ఆపైదేశము సూర్యసంచారము లేమింజేసి యంధకారావృతమయి నగరగ్రామాదిమర్యాదలు లేకుండుటవలన మాకుపుం దెలియదు. ౬౧

నేను ఇపుడుచెప్పిన ప్రదేశములందంతటను జక్కఁగా వెదకుఁడు; మఱియు నావైపున నేను జెప్పనిప్రదేశము లేమైననుండినయెడ నచటను గూడ వెదకవలెను. ౬౨

వాయుసమానులరు నగ్నితుల్యులరు నగు వానరులారా! మీరలు చక్కఁగా వెదకి సీతాదేవింజూచి కార్యముసాధించుకొని వత్తురేని రామునకు మహాసంతోషముచేసినవారలగుదురు; నాకు అంతకన్నను గొప్ప సంతోషము చేసినవారలగుదురు. ౬౩

వానరులారా! అంత మీరలు బంధుసమేతంబుగా నావలన మనోహరంబులగు సమస్తకామంబులం బొందినవారలయి కృతార్థులరయి శత్రువులు లేనివారలయి పెక్కండ్రను బోషింపుచుఁ బ్రియురాండ్రంగూడి సుఖంబున భూమియంతయు విహరింపుచుండఁగలరు. అని సుగ్రీవుఁడు కలవలి మున్నగు వానరవీరులతోఁ జెప్పెను. ౬౪

ఇది నలుబదిమూఁడవసర్గము.

---

## నలువదినాలుగవసర్గము.

అసుగ్రీవుఁడు హనుమంతునివిషయమయి యధికగౌరవముగాఁ జెప్పెను; ఏలయనఁగా హనుమంతుఁడు తప్పక కార్యమును సాధింపఁగలఁడని సుగ్రీవుండు నిశ్చయించియుండెను. ౧

సమస్త వానరులకును నాథుఁడగు సుగ్రీవుండు హనుమంతుని విషయమై పరమసంతోషంబునొంది పరాక్రమవంతుండగు వాయుపుత్త్రినా హనుమంతుంజూచి నిట్లనిపలికెను. ౨

వానరశ్రేష్ఠుఁడా! భూమియందుఁగాని పక్షులు మేఘములు సంచరించు నాకాశమునందుఁగాని సిద్ధవిద్యాధరాదులు సంచరించునట్టి పైయా

సాసురా స్సహగన్ధర్వా స్సనాగనరదేవతాః,
విదితా స్సర్వలోకా స్తే ససాగరధరాధరాః. ౪

గతి ర్వేగ శ్చ తేజ శ్చ లాఘవంచ మహాకపే!,
పితు స్తే సదృశం వీర! మారుతస్య మహౌజసః. ౫

తేజసా వాపి తే భూతం సమం భువి న విద్యతే,
త ద్యథా లభ్యతే సీతా త త్త్వ మే వోపపాదయ. ౬

త్వ య్యేవ హనుమ! న్న స్తి బలం బుద్ధిః పరాక్రమః,
దేశకాలానువృ త్తి శ్చ నయ శ్చ నయపణ్డిత!. ౭

తతః కార్యసమాసఙ్గ మవగమ్య హనూమతి,
విదిత్వా హనుమ న్తం చ చి న్తయామాస రాఘవః. ౮

సర్వథా నిశ్చితార్థో౽యం హనూమతి హరీశ్వరః,
నిశ్చితార్థకర శ్చాపి హనూమా న్కార్యసాధనే. ౯

త దేవం ప్రస్థిత స్యాస్య పరిజ్ఞాతస్య కర్మభిః,
భర్త్రా పరిగృహీతస్య ధ్రువః కార్యఫలోదయః. ౧౦

తం సమీక్ష్య మహాతేజా వ్యవసాయో త్తరం హరిమ్,

కాశమునందుఁగాని స్వర్గమునందుఁగాని జలములయందుఁగాని నీ వెదురులేక సంచరింపఁ గలవు. ౩

అసురులుండు లోకంబును గంధర్వలోకంబును నాగలోకంబును మనుష్యలోకంబును దేవలోకంబును సముద్రపర్వత సహితంబుగా సమస్త లోకంబులను నీవెఱుంగుదువు. ౪

వీరుఁడా! ఎదురులేని గమనంబునందును వేగమునందును బరాక్రమమునందును లాఘవమునందును నీవు మహాప్రభావుండగు నీతండ్రి వాయుదేవునకు సమానుఁడవు. ౫

భూమియందుఁ బరాక్రమంబున నీకన్న నధికమయినభూతము లేనే లేదుగదా! నీకు సమానమయినదియు లేదు; కావున సీతాదేవి లభించునట్లు నీవే తగినప్రయత్నముచేసి కార్యము నెఱవేర్పవలెను. ౬

సమస్తనీతులును జక్కఁగాఁ దెలిసినట్టి హనుమంతుఁడా! బలము బుద్ధి పరాక్రమము దేశకాలంబుల ననువర్తించుట నీతి యివి నీయందుండునట్లు మఱియొకరియందును లేవు. అని సుగ్రీవుఁడు హనుమంతునితోఁ బలికెను. ౭

రాముండు సుగ్రీవుఁడు హనుమంతునితో నాడు వచనములవలనే సుగ్రీవుఁడు కార్యభారమంతయు హనుమంతునిపై నుంచుట నెఱింగి హనుమంతుఁడు కార్యసాధకుండని తెలిసి యిట్లని యాలోచించెను. ౮

వానరరాజయిన యీసుగ్రీవుండు హనుమంతుండు తప్పక కార్యమును సాధించునని నిశ్చయించియున్నాఁడు; హనుమంతుఁడును దనవిషయమయి సుగ్రీవుని కంతటి నమ్మకము గలుగఁజేసినవాఁడుగా నున్నాఁడు. ౯

అందువలన నీహనుమంతుండు మున్ను పెక్కుకార్యములను సాధించుటవలన నితనిసామర్థ్యము సుగ్రీవునకుఁ దెలిసియున్నది; మఱియు సుగ్రీవుండితని నధికముగా గౌరవించుచున్నాఁడు కావున నితండుపోయిన కార్యము తప్పక సిద్ధించును. అని రాముఁ డాలోచించెను. ౧౦

మహాపరాక్రమశాలియగు రాముండు కార్యసాధనసమర్థుండగు నాహ-

కృతార్థ ఇవ సంవృత్తః ప్రహృష్టేన్ద్రియమానసః॥ ౧౧
దదౌ తస్య తతః ప్రీత స్స్వనామాఙ్కోపశోభితమ్,
అఙ్గులీయ మభిజ్ఞానం రాజపుత్త్ర్యాః పరన్తపః. ౧౨

అనేన త్వాం హరిశ్రేష్ఠ! చిహ్నేన జనకాత్మజా,
మత్సకాశా దనుప్రాప్త మనుద్విగ్నాఽనుపశ్యతి. ౧౩

వ్యవసాయ శ్చ తే వీర! సత్త్వయుక్త శ్చ విక్రమః,
సుగ్రీవస్య చ సందేశ స్సిద్ధిం కథయతీవ మే. ౧౪

స తం గృహ్య హరిశ్రేష్ఠః స్థాప్య మూర్ధ్ని కృతాఞ్జలిః,
వన్దిత్వా చరణౌ చైవ ప్రస్థితః ప్లవగోత్తమః. ౧౫

స తత్ప్రకర్ష న్హరిణాం మహ ద్బలం
బభూవ వీరః పవనాత్మజః కపిః,
గతామ్బుదే వ్యోమ్ని విశుద్ధమణ్డల
శ్శశీవ నక్షత్రగణోపశోభితః. ౧౬
అతిబల! బల మాశ్రిత స్తవాహం
హరివరవిక్రమ విక్రమై రనల్పైః,
పవనసుత! యథాఽభిగమ్యతే సా
జనకసుతా హనుమం! స్తథా కురుష్వ. ౧౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుశ్చత్వారింశస్సర్గః. ४४.

సుమంతుంజూచి పరమసంతుష్టుఁడై తన్నుఁ గృతార్థునిఁగాఁ దలంచెను. ౧౧

అంత శత్రువులఁ దపింపఁజేయునట్టిరాముండు సంతుష్టుండై సీతాదేవికి గుఱుతు తెలియుటకై తన పేరు చెక్కఁబడియున్న తన ముద్రటుంగరమును హనుమంతున కొసంగెను. ౧౨

వానరోత్తముఁడా! ఈ యంగుళీయకమునుజూచి సీతాదేవి నిన్నుఁజూచి సంశయముగాని భయముగాని పొందక నీవు నాయొద్దనుండి వచ్చినవాఁడవని దృఢముగా నమ్మును. ౧౩

పరాక్రమవంతుఁడవగు హనుమంతుఁడా! నీయుత్సాహంబును బలంబును బరాక్రమంబును సుగ్రీవుండు నీతోఁజెప్పిన సమాచారంబును జూడఁగాఁ గార్యసిద్ధి తప్పకయవునని నాకుఁదోఁచుచున్నది. అని రాముండు హనుమంతునితోఁ జెప్పెను. ౧౪

వానరోత్తముఁడగు నా హనుమంతుండు ఆయంగుళీయకంబుఁదీసి శిరస్సునసుంచికొని చేమోడ్పుగీలించి రామపాదములకుఁ బ్రణమిల్లి యంత బయలుదేఱెను. ౧౫

పరాక్రమవంతుండును వాయుదేవునికుమారుండు నగు నాహనుమంతుండు గొప్పదగు నవ్వానరసేనచేఁ బరివేష్టింపఁ బడినవాఁడై మేఘములులేని యాకాశమునందు స్వచ్ఛమయిన మండలముగలిగి నక్షత్ర సమూహముచేఁ బరివృతుండగు చంద్రునిభంగిఁ బ్రకాశించెను. ౧౬

మహాబలుఁడవు సింహమునకుంబోలె మహాపరాక్రమంబు గలవాఁడవు వాయుకుమారుండవగు హనుమంతుఁడా! నేను నీబలముపై భారమువేసియున్నాను; నీదుపరాక్రమంబుకొలఁదిని బ్రయత్నముచేసి సీతాదేవి లభించునట్లు గావింపవలెను. అని రాముండు మరలఁ బయ[illegible]గుచున్న హనుమంతునితోఁ జెప్పెను. ౧౭

ఇది నలువదినాలుగవసర్గము.

## పఞ్చచత్వారింశ స్సర్గః.

సర్వాం శ్చాహూయ సుగ్రీవః ప్లవగాన్ ప్లవగర్షభః,
సమస్తా నబ్రవీ ద్భూయో రామకార్యార్థసిద్ధయే. ౧

ఏవ మేత ద్విచేతవ్యం యన్మయా పరికీర్తితమ్,

తదుగ్రశాసనం భర్తు ర్విజ్ఞాయ హరిపుఙ్గవాః. ౨
శలభా ఇవ సంఛాద్య మేదినీం సంప్రతస్థిరే,

రామః ప్రస్రవణే తస్మి న్న్యవస త్సహలక్ష్మణః. ౩
ప్రతీక్షమాణ స్తం మాసం య స్సీతాధిగమే కృతః,

ఉత్తరాం తు దిశం రమ్యాం గిరిరాజసమావృతామ్. ౪
ప్రతస్థే సహసా వీరో హరి శ్శతవలి స్తదా,
పూర్వాం దిశం ప్రతియయౌ వినతో హరియూథపః. ౫

తారాఙ్గదాదిసహితః ప్లవగో మారుతాత్మజః,
అగస్త్యచరితా మాశాం దక్షిణాం హరియూథపః. ౬

పశ్చిమాం తు భృశం ఘోరాం సుషేణః ప్లవగేశ్వరః,
ప్రతస్థే హరిశార్దూలో దిశం వరుణపాలితామ్. ౭
తత స్సర్వా దిశో రాజా చోదయిత్వా యథాతథమ్,
కపిసేనాపతీ న్ముఖ్యా న్ముమోద సుఖిత స్సుఖమ్. ౮

## నలుబదియైదవసర్గము.

వానరోత్తముఁడగు సుగ్రీవుండు అవ్వానరుల నందఱంబిలిచి రామకార్యంబు సిద్ధించుపొంటె మరల వారలంజూచి నిష్పక్షపాతముగా నిట్లని పలికెను. ౧

నేను ఎవరెవరికి ఏయేదిక్కునందు ఏయేభూభాగములను వెదకవలెనని చక్కఁగాఁ జెప్పితినో వారువారు ఆయాస్థలంబులం దప్పక చక్కఁగా నేను జెప్పినవిధంబున వెదకవలెను. ౨

అవ్వానరవీరులు సుగ్రీవుని తీక్ష్ణమయిన యాజ్ఞనువిని యంత నందఱును మిడుతలవలె లెక్కకుమీఱి భూమియంతయు నాచ్ఛాదించి నడవసాగిరి. ౩

రాముండు వానరులు సీతంజూచివచ్చుటకై యవధిగా నేర్పఱుపఁబడిన యామాసము ఎపుడెపుడు కడచునోయని నిరీక్షించుచు లక్ష్మణసమేతంబుగా నా ప్రస్రవణగిరియందె నివసించియుండెను. ౪

అప్పుడు పరాక్రమవంతుండగు శతవలి హిమవత్పర్వముచే నధిష్ఠితమయి రమణీయమయిన యుత్తర దిశనుగూర్చి పోవ నుద్యుక్తుఁడయ్యె. ౫

వానరయూధపతియగు వినతుండు తూర్పుదిశకుఁబోవ సన్నద్ధుఁడయ్యెను. ౬

వానరయూధనాథుండు వాయుకుమారుండునగు హనుమంతుండు తారుం డంగదుండు మున్నగు వానరవీరులంగూడి యగస్త్యమహర్షి సేవితంబగు దక్షిణదిశకుఁబోవ నుద్యుక్తుఁడయ్యెను. ౭

వానరోత్తముఁడగు సుషేణుండు మహాభయంకరంబును వరుణునిచేఁ బాలితంబునగు పడమటిదిశకుఁబోవ నుద్యుక్తుఁడయ్యెను. ౮

పూర్వము రాజ్యలాభంబున సుఖితుండయిన సుగ్రీవుండు ఉత్తములగు వానరసేనానాయకుల సమస్తదిశలకుం బంపి రామకార్యంబునుగూడ నెఱవేర్చినవాఁడగుటం జేసి మునుపటికన్నను అధికసుఖమునొంది యానందించెను.

ఏవం సంబోధితా స్సర్వే రాజ్ఞా వానరయూథపాః,
స్వాం స్వాం దిశ మభిప్రేత్య త్వరితా స్సంప్రతస్థిరే. ౯
ఆనయిష్యామహే సీతాం హనిష్యామ శ్చ రావణమ్,
నదన్త శ్చోన్నదన్త శ్చ గర్జన్త శ్చ ప్లవఙ్గమాః. ౧౦
క్ష్వేళన్తో ధావమానా శ్చ వినదన్తో మహాబలాః,

అహ మేకో హనిష్యామి రావణం ప్రాప్త మాహవే. ౧౧

తత శ్చోన్మథ్య సహసా హరిష్యే జనకాత్మజామ్,
వేపమానాం శ్రమే ణాద్య భవద్భిః స్థీయతా మిహ. ౧౨

ఏక ఏ వాహరిష్యామి పాతాళాదపి జానకీమ్,

విమథిష్యా మ్యహం వృక్షా న్పాతయిష్యా మ్యహం గిరీన్.
ధరణీం దారయిష్యామి క్షోభయిష్యామి సాగరాన్,

అహం యోజనసంఖ్యాయాః ప్లవితా నాత్ర సంశయః. ౧౪

శతం యోజనసంఖ్యాయా శ్శతం సమధికం హ్యహమ్,

భూతలే సాగరే వాపి శైలేషు చ వనేషు చ. ౧౫
పాతాళ స్యాపి వా మధ్యే న మ మాఽచ్ఛిద్యతే గతిః,

ఇ త్యేకైకం తదా తత్ర వానరా బలదర్పితాః. ౧౬

అవ్వానరవీరులందఱు సుగ్రీవునాజ్ఞను శిరసావహించి "రావణునివధించి సీతాదేవిం దెత్తుము" అని యుత్సాహంబునం బలుకుచు తమతమదిక్కులకుఁ ద్వరితంబుగాఁ బోయిరి. ౯

మహాబలశాలులగు నవ్వానరవీరులు నాదంబులు సేయుచు మఱియు నుత్సాహంబుతో నుచ్చైర్నాదంబులు గావింపుచు భీరంబులు పలుకుచు సింహనాదంబులు సేయుచుఁ బరుగెత్తుచు వికృతంబుగా నఱచుచుఁ బోయిరి.

రావణుఁడు యుద్ధమునకు వచ్చినయెడ నేనొకఁడనె యతని వధించి పుచ్చెదను. అని యొకఁడు పలికెను.

నేను రావణునివధించి క్రమంబున గడగడ వడంకుచున్న సీతాదేవిని ఇప్పుడె శీఘ్రంబున నిచటికిఁ దెచ్చెదను; మీరలిచటనె నిలుచుండుఁడు మఱి యొకఁడు వచించెను. ౧౨

సీతాదేవి పాతాళంబున నున్నను నేనొకఁడె పోయి తెచ్చెదను. అని మఱియొకఁడు చెప్పెను.

నేను వృక్షంబులం బెఱికివైచెదను; నేనుపర్వతంబులం బడవైతును; నేను భూమిం బగుల్తును; నే సముద్రంబులం గలంతును. అని యొక్కొకరు భీరంబు పలికిరి. ౧౩

నేను ఒకయోజనముదూరము ఎగిరి దాఁటఁగలను; అందు సంశయములేదు. అని యొకఁడు పలికెను. ౧౪

"నేను నూఱుయోజనములదూరము ఎగురుదును" అని యొకఁడును, "నేను నూఱుయోజనములకన్న నధికముగా దాఁటుదును" అని మఱియొకఁడును వచించిరి.

భూమియందుఁగాని సముద్రమునందుఁగాని పర్వతంబులంగాని వనంబులంగాని పాతాళమధ్యంబునంగాని నే నడ్డులేక సంచరింపఁగలను. అని యొకఁడు చెప్పెను. ౧౫

అపుడచట బలగర్వితులగు వానరులు వానరేంద్రుండగు సుగ్రీవు

ఊచుశ్చ వచనం తత్ర హరిరాజస్య సన్నిధౌ.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చచత్వారింశ స్సర్గః. ౪౫.

## షట్చత్వారింశ స్సర్గః.

గతేషు వానరేన్ద్రేషు రామ స్సుగ్రీవ మబ్రవీత్,
కథం భవా న్విజానీతే సర్వం వై మణ్డలం భువః. ౧
సుగ్రీవ స్తు తతో రామ మువాచ ప్రణతాత్మవాన్,
శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే విస్తరేణ నరర్షభ!. ౨
యదా తు దున్దుభింనామ దానవం మహిషాకృతిమ్,
పరికాలయతే వాలీ మలయం ప్రతి పర్వతమ్. 3
తదా వివేశ మహిషో మలయస్య గుహాం ప్రతి,
వివేశ వాలీ తత్రాపి మలయం తజ్జిఘాంసయా. ౪
తతోఽహం తత్ర నిక్షిప్తో గుహాద్వారి వినీతవత్,
నచ నిష్క్రమతే వాలీ తదా సంవత్సరే గతే. ౫
తతః క్షతజవేగేన ఆపుపూరే తదా బిలమ్,
త దహం విస్మితో దృష్ట్వా భ్రాతృశోకవిషార్దితః. ౬
అథాహం కృతబుద్ధి స్తు సువ్యక్తం నిహతో గురుః,
శిలా పర్వతసంకాశా బిలద్వారి మయా వృతా. ౭
అశక్నువ న్నిష్క్రమితుం మహిషో వినశే దితి,

నెదుట నివ్విధంబున నొక్కొకరు నొక్కొకవచనముం బలికిరి. ౧౭

ఇది నలుబదియైదవసర్గము.

---

## నలువదియాఱవసర్గము.

అవ్వానరవీరులు పోయినపిమ్మట రాముండు సుగ్రీవుంజూచి "నీకు సమస్తభూమండలంబును ఎట్లుతెలియవచ్చె" నని యడిగెను. ౧

అంత సుగ్రీవుండు నమస్కరించి రామునితో నిట్లని సవినయముగాఁ బలికెను.

పురుషోత్తముఁడా! సమస్తవృత్తాంతమును విస్తరించి చెప్పెదను వినుము. ౨

పూర్వము మహిషరూపధరుండగు దుందుభియను రాక్షసుండు వాలితో యుద్ధముసేయవచ్చి భయంబునం బరుగెత్తఁగా వాలి మలయపర్వతము వఱకు వెంటనంటితఱుముటయు నద్దానవుండు అమ్మలయపర్వతంబునందలి గుహం జొరఁబడెను. ౩

వాలి ఆదుందుభిమాయావులవధించుటకై మలయపర్వతంబున నాగుహాలోనికిం బ్రవేశించెను. ౪

అప్పుడు వాలి వినయసంపన్నుఁడనగునన్ను గుహవాకిట నునిచెను, అంత నొక సంవత్సరము కడచినను వాలి వెడలి రాఁడయ్యె. ౫

అంత నపుడు ఆబిలమునిండ నెత్తురుప్రవాహము వచ్చెను. నే నది చూచి యచ్చెరువొంది మాయన్న కేమి కల్గెనోయని మిక్కిలియు దుఃఖితుఁడనైతిని. ౬

అంత అన్నయగువాలి స్పష్టముగా హతుఁడైయుండునని నాకు నమ్మకము గలిగినది. ౭

దుందుభి గుహనుండి వెడలిరాఁజాలక యటచనె నాశమునొందవలెనని నేను ఆగుహవాకిట పర్వతమంతటి శిలను అడ్డముంచితిని. ౮

తతో౽హం మాగాం కిష్కిన్ధాం నిరాశ స్తస్య జీవితే. ౮
రాజ్యం చ సుమహ త్ప్రాప్తం తారయా రుమయా సహ,

మిత్రైశ్చ సహిత స్తత్ర వసామి విగతజ్వరః. ౯
ఆజగామ తతో వాలీ హత్వా తం దానవర్షభమ్,
తతో౽హ మదదాం రాజ్యం గౌరవా ద్భయయన్త్రితః. ౧౦

స మాం జిఘాంసు ర్దుష్టాత్మా వాలీ ప్రవ్యథితేన్ద్రియః,
పరికాలయతే క్రోధా ద్ధావన్తం సచివై స్సహ. ౧౧

తతో౽హం వాలినా తేన సానుబన్ధః ప్రధావితః,
నదీ శ్చ వివిధాః పశ్య న్వనాని నగరాణి చ. ౧౨
ఆదర్శతలసంకాశా తతో వై పృథివీ మయా,
అలాతచక్రప్రతిమా దృష్టా గోష్పదవ త్తదా. ౧౩
పూర్వాం దిశం తతో గత్వా పశ్యామి వివిధా న్ద్రుమాన్,
పర్వతాం శ్చ నదీ రమ్యా స్సరాంసి వివిధాని చ. ౧౪
ఉదయం తత్ర పశ్యామి పర్వతం ధాతుమణ్డితమ్,
క్షీరోదం సాగరం చైవ నిత్య మప్సరసాలయమ్. ౧౫
పరికాలయమాన స్తు వాలినా౽భిద్రుత స్తదా,
పున రావృత్య సహసా ప్రస్థితో౽హం తదా విభో!. ౧౬

పున రావర్తమాన స్తు వాలినా౽భిద్రుతో ద్రుతమ్,

దిశ స్తస్యా స్తతో భూయః ప్రస్థితో దక్షిణాం దిశమ్. ౧౭
విన్ధ్యపాదపసంకీర్ణాం చన్దనద్రుమశోభితామ్,

అంత నేను వాలిజీవితంబువిషయమై యాశవదలి కిష్కింధకువచ్చి తారను రుమను బొందుటయేగాక యీవానరరాజ్యమునకంతయు నాథుండనైతిని. ౯

నేను గిష్కింధయందు మిత్రపరివృతుండనై దిగులులేక సుఖముగా నుంటిని. అంత దానవోత్తముఁడగు నామాయావిని వధించి వాలియువచ్చెను.

అంత నేను అన్నయను గౌరవంబువలన భయంబున వాలికి సకల రాజ్యం బొసంగితిని. ౧౦

దురాత్ముండగు నావాలి కోపంబునఁ బరవశములయిన యింద్రియము లుగలవాఁడై నన్ను వధింపఁగోరుటయు నేను మంత్రిసహితంబుగాఁ బరుగెత్తితిని. ఆతండును నావెంటం దఱిమెను. ౧౧

అంత నేను వాలిభయంబునంజేసి మంత్రులంగూడి నానావిధములగు నదులను వనంబులను నానావిధపట్టణంబులను జూచుచుఁ బరుగెత్తితిని. ౧౨

అంత నపుడు నేను భూమియంతయు గోష్పదమంతటిదిగా నెంచి అద్దమునంబోలెఁ గొఱవిచక్రమునువలె స్పష్టముగాఁ జూచినాను. ౧౩

అపుడు తూర్పుదిక్కునకుఁబోయి నానావిధ వృక్షంబులను పర్వతంబులను రమణీయములగు నదులను నానావిధంబులగు సరస్సులను జూచితిని.

అచట గైరికధాతువులచే నొప్పుచున్న యుదయపర్వతంబును ఎల్లప్పుడు నప్సరసలచే సేవితంబగు క్షీరసాగరంబును జూచితిని. ౧౪

నాథుఁడవగు రాముఁడా! నేనట్లుపరుగెత్తుచుండఁగానే యంత వాలి తఱుముకొని సమీపించుటయు నేను శీఘ్రంబున వెనుకకు మరలి మఱియొకవైపునఁ బరుగెత్తినాను. ౧౫

నేను మరలి పరుగెత్తుటం జూచి వాలి మఱియు వేగంబున నన్నుం దఱిమెను.

అంత నేను తూర్పుదిక్కు వదలి వింధ్యపర్వతవృక్షములచే వ్యాప్తంబును చందనవృక్షములతో నొప్పుచున్నదియునగు దక్షిణదిశకుఁ బరుగెత్తితిని.

ద్రుమశ్శైలాం స్తతః పశ్య న్భూమౌ దక్షిణతోఽపరాన్. ౧౮
పశ్చిమాం చ దిశం ప్రాప్తా వాలినా సమభిద్రుతః,

సంపశ్య న్వివిధా న్దేశా న స్తం చ గిరిస త్తమమ్. ౧౯
ప్రాప్య చా స్తం గిరిశ్రేష్ఠ ము త్తరాం సంప్రధావితః,

హిమవన్తం చ మేరుం చ సముద్రం చ తథో త్తరమ్. ౨౦

యదా న విన్దం శరణం వాలినా సమభిద్రుతః,
తదా మాం బుద్ధిసంపన్నో హనూమా న్వాక్య మబ్రవీత్. ౨౧

ఇదానీం మే స్మృతం రాజ! న్యథా వాలీ హరీశ్వరః,
మతఙ్గేన తదా శప్తో హ్యస్మి న్నాశ్రమమణ్డలే. ౨౨

ప్రవిశే ద్యది వై వాలీ మూర్ధాఽస్య శతధా భవేత్,
తత్ర వాస స్సుఖోఽస్మాకం నిరుద్విగ్నో భవిష్యతి. ౨౩

తతః పర్వత మాసాద్య ఋశ్యమూకం నృపాత్మజ!,
న వివేశ తదా వాలీ మతఙ్గస్య భయా త్తదా. ౨౪

ఏవం మయా తదా రాజ! న్ప్రత్యక్ష ముపలక్షితమ్,
పృథివీమణ్డలం కృత్స్నం గుహా మ స్యాగత స్తతః. ౨౫

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షట్చత్వారింశ స్సర్గః. ౪౬.

అంత నేను దక్షిణదిక్కునందు మత్రికొన్నివృక్షంబులను పర్వతంబులను జూచుచుం బరుగెత్తుచుండఁగా వాలి తఱుముటయు నంతఁ బడమరకుఁ బోయినాను. ౧౮

నేను బడమరను నానావిధములగు దేశములను జూచి యస్తగిరికడకుఁ బోతిని; అంత వాలి తఱుముకొని వచ్చుటవలనఁ దిరిగి యుత్తరదిక్కునకుఁ బరుగెత్తితిని. ౧౯

ఉత్తరదిక్కున హిమవత్పర్వతమును మేరుపర్వతమును ఉత్తరసముద్రంబును జూచితిని. ౨౦

ఇట్లు ఎచటికిఁబోయినను వాలి తఱుముటవలన నాకు రక్షకుఁడు గాని యుండుటకు స్థానముగాని లేకపోవుటయు ఒకప్పుడు బుద్ధిమంతుండగు హనుమంతుండు నాతో నిట్లనిపలికెను. ౨౧

వానరరాజా! మున్ను మతంగమహర్షి యీయాశ్రమపదము విషయమయి వానరేశ్వరుండగు వాలిని శపించియున్నాఁడుగదా! అది యిప్పుడు నాకు స్మృతికివచ్చినది. ౨౨

ఆశాపమువలన వాలి యయ్యాశ్రమంబు ప్రవేశించినయెడ వతనితల నూఱుపఱియలయి పగులును; కావున మనము మతంగాశ్రమంబున సుఖముగాను నిశ్చయముగాను నివసింపవచ్చును. అని హనుమంతుండు నాతోఁ జెప్పెను. ౨౩

రాజపుత్త్రుఁడవగురాముఁడా! అంత నేను ఋశ్యమూకపర్వతంబుఁ జేరితిని; వాలి మతంగమహాముని శాపభయమువలన నిచటికి రాఁడయ్యె. ౨౪

రాజా! నే నివ్విధంబున వాలిభయంబున నపుడు భూమండలమానంతయుఁ బ్రత్యక్షముగాఁ జూచి ఆటుపిమ్మట నీఋశ్యమూకపర్వతముగుహలో వాసముచేయ నారంభించితిని. అని సుగ్రీవుండు రామునితోఁ జెప్పెను.

ఇది నలుబదియాఱవసర్గము.

సప్తచత్వారింశ స్సర్గః.

దర్శనార్థం తు వైదేహ్యా స్సర్వతః కపియూథపాః,
వ్యాదిష్టాః కపిరాజేన యథోక్తం జగ్ము రఞ్జసా. ౧

సరాంసి సరితః కక్షా నాకాశం నగరాణి చ,
నదీదుర్గాం స్తథా శైలా న్విచిన్వన్తి సమన్తతః. ౨

సుగ్రీవేణ సమాఖ్యాతా స్సర్వే వానరయూథపాః,
ప్రదేశా న్ప్రవిచిన్వన్తి సశైలవనకాననాన్. ౩
విచిత్య దివసం సర్వే సీతాధిగమనే ధృతాః,
సమాయాన్తి స్మ మేదిన్యాం నిశాకాలేషు వానరాః. ౪

సర్వర్తుకామా న్దేశేషు వానరా స్సఫలాన్ ద్రుమాన్,
ఆసాద్య రజనీం శయ్యాం చక్రు స్సర్వే ష్వహస్సు తే. ౫

తదహః ప్రథమం కృత్వా మాసే ప్రస్రవణం గతాః,
కపిరాజేన సంగమ్య నిరాశాః కపియూథపాః. ౬

విచిత్య తు దిశం పూర్వాం యథోక్తాం సచివై స్సహ,
అదృష్ట్వా వినత స్సీతా మాజగామ మహాబలః. ౭
ఉత్తరాం చ దిశం సర్వాం విచిత్య స మహాకపిః,
ఆగత స్సహ సైన్యేన వీర శ్శతబలి స్తదా. ౮
సుషేణః పశ్చిమా మాశాం విచిత్య సహ వానరైః,
సమేత్య మాసే సంపూర్ణే సుగ్రీవ ముపచక్రమే. ౯

## నలువదియేడవసర్గము.

సీతాదేవిని వెదకి చూచివచ్చుటకు సుగ్రీవుం డాజ్ఞాపించిన వానరసేనానాయకులు సుగ్రీవుండు చెప్పినచొప్పున శీఘ్రంబున నయ్యైదిశలకుఁ బోయిరి ౧

ఆవానరులు సరస్సులయందును నదులయందును లతాగృహములయందును బయళ్లయందును బట్టణంబులయందును నదులచే గుప్తములగు ప్రదేశములయందును బర్వతంబులయందును సీతాదేవిని వెదకిరి. ౨

సుగ్రీవుం డాజ్ఞాపించిన వానరసేనాపతు లందఱును బర్వతంబులు వనంబులు మున్నగు ప్రదేశంబులం దంతటను సీతాదేవిని జక్కఁగా వెదకిరి.

ఆవానరులందఱు సీతాన్వేషణతత్పరులయి యాకాశసంచారంబున వేఱువేఱుగాఁ బగలంతయు వెదకి రాత్రికాలంబుల భూమియందు నొకరితో నొకరు చేరుచుండిరి. ౪

ఆవానరులు ఆమాసముసందలి సమస్తదినములయందును బగలంతయు సీతాదేవిని వెదకి రాత్రికి సమస్తఋతువులయందును ఫలించునట్టి ఫలవంతములయిన వృక్షములు చేరి యచ్చటం బరుండుచువచ్చిరి. ౫

అంత వానరసేనాపతులు ప్రయాణము మొదలుకొని యొకమాసము పూర్ణమగుటయును సీతాదేవిం జూచుటయం దాశవదలి వానరరాజునుగ్రీవునొద్దకువచ్చి ప్రస్రవణపర్వతంబుఁ జేరిరి ౬

మహాబలశాలియగు వినతుండు తనతోడి వానరులతోఁగూడ సుగ్రీవుఁడుచెప్పినవిధంబునఁ దూర్పుదిశ నంతయు వెదకి సీతం గానక యాఁకవచ్చెను.

అంతఁ బరాక్రమశాలియగు శతవలి ఉత్తరదిశ నంతటను వెదకి సీతం జూడకయే సైన్యములతోఁగూడ వచ్చిచేరెను. ౮

సుషేణుండును వానరసేనాపరివృతుండై పడమటిదిశ నంతటను సీతాదేవిని వెదకి మాసము నిండుటయు నాబిడం గానకయే సుగ్రీవునొద్దకు వచ్చి చేరెను. ౯

తం ప్రస్రవణపృష్ఠస్థం సమాసా ద్యాభివాద్య చ,
ఆసీనం సహ రామేణ సుగ్రీవ మిద మబ్రవీత్. ౧౦

విచితాః పర్వతా స్సర్వే వనాని గహనాని చ,
నిమ్నగా స్సాగరాన్తా శ్చ సర్వే జనపదా శ్చ యే. ౧౧
గుహా శ్చ విచితా స్సర్వా స్త్వయా యాః పరికీర్తితాః,
విచితా శ్చ మహాగుల్మా లతా వితతసంతతాః. ౧౨
గహనేషు చ దేశేషు దుర్గేషు విషమేషు చ,
సత్త్వా న్యతిప్రమాణాని విచితాని హతాని చ. ౧౩
ఉదారసత్త్వాభిజనో మహాత్మా
స మైథిలీం ద్రక్ష్యతి వానరేన్ద్రః,
దిశం తు యా మేవ గతా తు సీతా
తా మాస్థితో వాయుసుతో హనూమాన్. ౧౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తచత్వారింశ స్సర్గః. ౪౭.

---

## అష్టచత్వారింశ స్సర్గః.

సహ తారాఙ్గదాభ్యాం తు గత్వా స హనుమా న్కపిః,
సుగ్రీవేణ యథోద్దిష్టం తం దేశ ముపచక్రమే. ౧

స తు దూర ముపాగమ్య సర్వై స్తైః కపిసత్తమైః,
విచినోతి స్మ విన్ధ్యస్య గుహాశ్చ గహనాని చ. ౨
పర్వతాగ్రా న్నదీదుర్గాం త్సరాంసి విపులా న్ద్రుమాన్,
వృక్షషణ్డాం శ్చ వివిధా న్పర్వతా న్ఘనపాదపాన్. ౩

ఆవానరవీరులందఱు ప్రస్రవణపర్వతంబున రామునితోడఁ గూర్చుండియున్న సుగ్రీవునొద్దకువచ్చి నమస్కరించి సవినయముగా నిట్లని పలికిరి. ౧౦

సమస్తపర్వతంబులు వెదకినాము; దుర్గమంబులగు నరణ్యంబులును వెదకితిమి; నదులును సముద్రతీరంబులును సమస్తదేశములును వెదకినాము.

నీవుచెప్పిన గుహాలయందంతటను వెదకితిమి; లతాగృహములచే నొప్పుచున్న గుల్మంబులం దంతటను సీతాదేవిని వెదకివచ్చినాము. ౧౨

ప్రవేశింపనలవిగాని ద్వీపములయందును దుర్గమంబులగు విషమప్రదేశములయందును మహాప్రమాణశరీరులగు ప్రాణులను వెదకిచూచి వధించితిమి.

హనుమంతుఁడు మహాబలముగల వాయుదేవుని కుమారుఁడు తానును మహాబలుఁడు మహాధైర్యశాలి; యింతియగాక, సీత రావణునిచే నేదిక్కునకుఁ గొనిపోఁబడియుండునో ఆదిక్కునకే పోయియున్నవాఁడు; కావున వాయుపుత్త్రుఁడగు నాహనుమంతుఁడే సీతంజూచి రాఁగలఁడు. అని యావానరవీరులు సుగ్రీవునితోఁ జెప్పిరి. ౧౪

ఇది నలువదియేడవసర్గము.

---

## నలువదియెనిమిదవసర్గము.

ఆహనుమంతుఁడు తారుం డంగదుఁడు మొదలగు వానరులంగూడి దక్షిణదిశకుఁబోయి సుగ్రీవుఁ డాజ్ఞాపించిన నయ్యైప్రదేశంబుల వెదక నారంభించెను. ౧

ఆహనుమంతుఁడు ఆవానరవీరుల నందఱంగూడి బహుదూరంబు పోయి వింధ్యపర్వతంబునందలి గుహలను వనంబులను శిఖరంబులను నదులచే దుర్గమంబులగు ప్రదేశంబులను గొలంకులను పెద్దవృక్షంబులను నానావిధంబుగాఁ జాలుదీరియున్న వృక్షసమూహంబులను వింధ్యంబు చేరువనుండు గొప్పవృక్షంబులుంగల కొండలను సీతాదేవిని వెదకెను. ౨, ౩

అన్వేషమాణా స్తే సర్వే వానరా స్సర్వతో దిశమ్,
న సీతాం దదృశు ర్వీరా మైథిలీం జనకాత్మజామ్. ౪

తే భక్షయన్తో మూలాని ఫలాని వివిధాని చ,
అన్వేషమాణా దుర్ధర్షా న్యవసం స్తత్ర తత్ర హ. ౫

స తు దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్,

నిర్జలం నిర్జనం శూన్యం గహనం రోమహర్షణమ్. ౬
త్యక్త్వాతు తం తదా దేశం సర్వే వై హరియూథపాః,
తాదృశా న్యట వ్యరణ్యాని విచిత్య భృశపీడితాః. ౭
దేశ మన్యం దురాధర్షం వివిశు శ్చాకుతోభయాః,
యత్ర వన్ధ్యఫలా వృక్షా విపుష్పాః పర్ణవర్జితాః. ౮
నిస్తోయా స్సరితో యత్ర మూలం యత్ర సుదుర్లభమ్,
న సన్తి మహిషా యత్ర న మృగా న చ హస్తినః. ౯
శార్దూలాః పక్షిణో వాపి యే చాన్యే వనగోచరాః,
న యత్ర వృక్షా నౌషధ్యో న లతా నాపివీరుధః. ౧౦
స్నిగ్ధపత్రా స్స్థలే యత్ర పద్మిన్యః ఫుల్లపఙ్కజాః,
ప్రేక్షణీయా స్సుగన్ధా శ్చ భ్రమరై శ్చాపి వర్జితాః. ౧౧
కణ్డు ర్నామ మహాభాగ స్సత్యవాదీ తపోధనః,
మహర్షిః పరమామర్షీ నియమై ర్దుష్ప్రధర్షణః ౧౨

తస్య తస్మి న్వనే పుత్రో బాల ష్షోడశవార్షికః,
ప్రణష్టో జీవితాన్తాయ క్రుద్ధ స్తత్ర మహామునిః. ౧౩

పరాక్రమవంతులగు నవ్వానరులందఱు అట్లు దక్షిణదిశయందు సమస్తప్రదేశంబుల నెంత వెదకినను జనకమహారాజపుత్రియగు సీతాదేవిం గానరైరి. ౪

ఎట్టిభూతంబులకును ఎదిరింప నలవిగాని యావానరవీరులు సీతాదేవిని వెదకుచు నానావిధములగు ఫలమూలంబుల నాహారంబు గొనుచు నచ్చైత్యస్థలంబుల విడియుచుం బోయిరి. ౫

ఆవింధ్యప్రదేశము పెక్కు గుహలును అరణ్యమునుగలది. నొక్కడి కావున నచట వెదకుట మిక్కిలియుం గష్టము.

ఎన్నడును భయములేనట్టి యవ్వానరవీరులందఱు వెదకుటకుం గష్టములయిన యరణ్యంబుల నంతట నన్వేషించి యంత నాప్రదేశంబు వదలి ఫలపుష్పంబులుగాని పత్రంబులుగాని లేనివృక్షములును జలంబులేని నదులును గలదియు మూలంబులులేనిదియు మహిషంబులు జింకలు గజంబులు వ్యాఘ్రంబులు పక్షులు మొదలగు వన్యజంతువులు లేనిదియు మంచి వృక్షంబులుగాని లతలుగాని పొదలుగాని లేనిదియు మఱియు మంచిపత్రంబులును వికసితంబులగుకమలములును మంచితావియుం గలిగి సుందరములయ్యు భ్రమరములచేతనుం బరిత్యక్తంబులగు మెట్టదామరతీఁగలు గలదియు జనసంచారములేనిదియుజలవిహీనంబును దుర్గమంబును భయంకరంబును బ్రవేశింప నలవిగానిదియునగు శూన్యప్రదేశముం బ్రవేశించిరి. ౬-౧౧

మహాత్ముఁడును సత్యవాదియు మహాతపస్సంపన్నుఁడును దపోబలంబున సమీపించుటకేని యలవిగానివాఁడును అధికకోపముగలవాఁడునగు కండువనుమహర్షి యొకఁడుండెను. ౧౨

ఆవనమునందు ఆకండుమహర్షి పుత్త్రుఁడొకఁడు పదునాఱేండ్లవాఁడు మృతిఁబొందెను; అమ్మహర్షి తనకొడుకు మృతిఁబొందుటకై అవ్వనంబు మీఁద మహాకోపంబు నొందెను. ౧౩

తేన ధర్మాత్మనా శప్తం కృత్స్నం తత్ర మహా ద్వనమ్,
అశరణ్యం దురాధర్షం మృగపక్షివివర్జితమ్. ౧౪

తస్య తే కాననాన్తాం శ్చ గిరీణాం కన్దరాణి చ,
ప్రభవాని నదీనాం చ విచిన్వ న్తిసమాహితాః. ౧౫
తత్ర చాపి మహాత్మానో నాపశ్య జ్జనకాత్మజామ్,
హర్తారం రావణం వాపి సుగ్రీవప్రియకారిణః. ౧౬
తే ప్రవిశ్యాఽశు తం భీమం లతాగుల్మసమావృతమ్,
దదృశుః కూరకర్మాణ మసురం సురనిర్భయమ్. ౧౭

తం దృష్ట్వా వానరా ఘోరం స్థితం శైల మి వాపరమ్,
గాఢం పరిహితా స్సర్వే దృష్ట్వా తా న్పర్వతోపమాన్. ౧౮
సోఽపి తా న్వానరా న్సర్వా న్నష్టా స్థే త్యబ్రవీ ద్బలీ,

అభ్యధావత సంక్రుద్ధో ముష్టి ముద్యమ్య సంహితమ్. ౧౯

త మాపత న్తం సహసా వాలిపుత్రోఽఙ్గద స్తదా,
రావణోఽయ మితి జ్ఞాత్వా తలే నాభిజఘానహ. ౨౦

స వాలిపుత్రాభిహతో వక్త్రా చ్ఛోణిత ముద్వమన్,
అసురోఽభ్యపత ద్భూమౌ పర్య స్త ఇవ పర్వతః. ౨౧
తేఽపి తస్మి న్నిరుచ్ఛ్వాసే వానరా జితకాశినః,
వ్యచిన్వ న్ప్రాయశ స్తత్ర సర్వం త ద్గిరిగహ్వరమ్. ౨౨

విచితం తు తతః కృత్వా సర్వే తే కాననం పునః,

ఆధర్మాత్ముఁడు అచట మహావనంబంతయు ఎవ్వరికిని వాసయోగ్యము గాక దుష్ప్రవేశమయి మృగంబులు గాని పక్షులు గాని లేనిదై యుండు నట్లు శపియించెను. ౧౪

ఆవ్వానరవీరులు ఆశూన్యప్రదేశమునందలి వనమధ్యములను పర్వతగుహలను నదుల యుత్పత్తిస్థానములను బూరికతోఁ జక్కఁగా వెదకిరి. ౧౫

అచటఁగూడ సుగ్రీవాజ్ఞాకారులగు మహాధైర్యశాలులయిన యవ్వానరులు సీతనుగాని ఆబిడ నపహరించిన రావణునిగాని కానరైరి. ౧౬

ఆవ్వానరులు లతలచేతను బొదలచేతను గప్పఁబడి భయంకరముగానున్న యొక్కప్రదేశమును శీఘ్రముగాఁ బ్రవేశించినంతనే యచట దేవతలనైనను సడకుసేయని భయంకరకర్ముఁడగు నొక యసుర యగపడెను. ౧౭

వానరులు పర్వతంబువలెనున్న భయంకరాకారుఁడైన యారాక్షసుం జూచి యందఱు దృఢముగా దట్టిబిగించి యుద్ధమునకు సన్నద్ధులయిరి; బలవంతుఁడగు నయ్యసురయుఁ బర్వతాకారులగు నవ్వానరుల నందఱం గలయఁజూచి "ఇదిగో మీరలందఱు మృతిఁబొందెదరు" అని పలికెను ౧౮

అంత నారాక్షసుఁడు పరమకుపితుఁడై దృఢముగాఁ బిడికిలి యులవతించి వానరులమీఁది కడరెను. ౧౯

అంత వాలికుమారుఁడగు నంగదుఁడు ఆరాక్షసుఁడు పైకివచ్చుచుండుటం జూచి యితఁడే రావణుఁ డని తలఁచి శీఘ్రంబున నతని నఱచేతం జఱచెను. ౨౦

అయ్యసుర వాలిపుత్త్రుఁడగు నంగదుని యఱచేతిదెబ్బకు నోట నెత్తురుగ్రక్కుచుఁ బర్వతంబుకూలునట్లు నేలంగూలెను. ౨౧

ఆరాక్షసుఁడు మృతిఁబొందినపిదప జయముఁబొందిన యవ్వానరులు అతఁడే రావణుఁడనియు ఆగుహయందు సీతయుండుననియు తలఁచి యాపర్వతగుహయంతయు బలుమాఱు చక్కఁగా వెదకిచూచిరి. ౨౨

అంత నవ్వానరులు ఆయడవియంతయు వెదకి యంత నిలువక మరల

అన్య దేవాపరం ఘోరం వివిశు ర్గిరిగహ్వరమ్. ౨౩
తే విచిత్య పునః ఖిన్నా వినిష్పత్య సమాగతాః,
ఏకాన్తే వృక్షమూలే తు నిషేదు ర్దీనమానసాః. ౨౪

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టచత్వారింశ స్సర్గః. ౪౮.

## ఏకోనపఞ్చాశ స్సర్గః.

అథాఙ్గద స్తదా సర్వా న్వానరా నిద మబ్రవీత్,
పరిశ్రాన్తో మహాప్రాజ్ఞ స్సమాశ్వాస్య శనై ర్వచః. ౧
వనాని గిరయో నద్యో దుర్గాణి గహనాని చ,
దర్యో గిరిగుహా శ్చైవ విచితాని సమన్తతః. ౨

తత్రతత్ర సహాస్మాభి ర్జానకీ న చ దృశ్యతే,
తద్వా రక్షో హృతా యేన సీతా సురసుతోపమా. ౩
కాలశ్చ నో మహా న్యాత స్సుగ్రీవ శ్చోగ్రశాసనః,
తస్మా ద్భవన్త స్సహితా విచిన్వన్తు సమన్తతః. ౪

విహాయ తన్ద్రీం శోకం చ నిద్రాం చైవ సముత్థితామ్,
విచినుధ్వం యథా సీతాం పశ్యామో జనకాత్మజామ్. ౫

అనిర్వేదం చ దాక్ష్యం చ మనస శ్చాపరాజయః,
కార్యసిద్ధికరా ణ్యాహు స్తస్మా దేత ద్బ్రవీ మ్యహమ్. ౬
అద్యాపి తద్వనం దుర్గం విచిన్వన్తు వనౌకసః!,
ఖేదం త్యక్త్వా పున స్సర్వై ర్వన మేత ద్విచీయతామ్. ౭
అవశ్యం క్రియమాణస్య దృశ్యతే కర్మణః ఫలమ్,

దానిసమీపంబునయందు మఱియొక భయంకరమయిన పర్వతగుహం జొచ్చిరి.

ఆవానరులు ఆగుహయందును వెదకి యచటను సీతం గానక యలసి పరమదుఃఖితులయి యేకాంతంబున నొకచెట్టు క్రింద నందఱు నొకటిగాఁ గూర్చుండిరి ౭౪

ఇది నలువదియెనిమిదవసర్గము.

---

## నలువదితొమ్మిదవసర్గము.

అంత మహాపండితుఁడగు నంగదుఁడు మిక్కిలియు నలసటనొంది సమస్తవానరులం జూచి వారల నూఱడింపుచు తిన్నగా నిట్లనిపలికెను. ౧

సాధారణంబులగు వనంబులును బర్వతంబులును నగరులును బ్రవేశింప నలవిగాని కాఱడవులును బిలంబులును బర్వతగుహలును చక్కఁగా వెదకి చూచినాము. ౨

ఆస్థలంబుల నెచటనేనియు సీతాదేవినిగాని దేవకన్యకవంటిదైన యామె నపహరించిన రావణునిగాని యెంతమాత్రము గానమైతిమి ౩

మనకుఁ గాలమో చాలఁ గడచినది. సుగ్రీవుఁడో తీక్ష్ణంబుగా దండించువాఁడు. కావున మీరలు ఉపేక్షసేయక యందఱుంగూడి చక్కఁగా నంతటను వెదకుఁడు. ౪

మీరలు సోమరితనమొందక దుఃఖంబునకు లోఁబడక నిదురవోవక మనకు జనకమహారాజపుత్త్రియగు సీతాదేవి లభించునట్లు చక్కఁగా వెదకుఁడు. ౫

విసుగులేమియు ఉత్సాహంబును ధైర్యంబును ఇవికార్యసిద్ధిని గలుగఁజేయునని పెద్దలు వక్కాణింతురు; కావుననే యిట్లు వచించితిని. ౬

మఱియొకమాఱు దుర్గంబగు నీవనమును వెదకుఁడు. అందఱును అలసటను వదలి మరల నావనమును వెదకిచూడుఁడు. ౭

కార్యముచేసినయెడఁ దప్పక ఫలముగలుగును. కాఁబట్టి విసుగుపడుట

అలం నిర్వేద మాగమ్య న హి నో మీలనం క్షమమ్. ౮

సుగ్రీవః కోపనో రాజా తీక్ష్ణదణ్డ శ్చ వానరః,
భేతవ్యం తస్య సతతం రామస్య చ మహాత్మనః. ౯

హితార్థ మేత దుక్తం వః క్రియతాం యది రోచతే,
ఉచ్యతాం వా క్షమం య న్న స్సర్వేషా మేవ వానరాః!. ౧౦

అఙ్గదస్య వచ శ్శ్రుత్వా వచనం గన్ధమాదనః,
ఉవా చావ్యక్తయా వాచా పిపాసాశ్రమఖిన్నయా. ౧౧
“సదృశం ఖలు వో వాక్య మఙ్గదో య దువాచ హ,
హితం చైవానుకూలం చ క్రియతా మస్య భాషితమ్. ౧౨

పున స్మార్గామహే శైలా న్కన్దరాం శ్చ దరీ స్తథా,
కాననాని చ శూన్యాని గిరిప్రస్రవణాని చ. ౧౩
యథోద్దిష్టాని సర్వాణి సుగ్రీవేణ మహాత్మనా,
విచిన్వన్తు వనం సర్వే గిరిదుర్గాణి సర్వశః. ౧౪

తత స్సముత్థాయ పున ర్వానరా స్తే మహాబలాః,
విన్ధ్యకాననసంకీర్ణాం విచేరు ర్దక్షిణాం దిశమ్. ౧౫
తే శారదాభ్రప్రతిమం శ్రీమద్రజతపర్వతమ్,
శృఙ్గవన్తం దరీమన్త మధిరుహ్య చ వానరాః. ౧౬
తత్ర లోధ్రవనం రమ్యం సప్తపర్ణవనాని చ,
వ్యచిన్వం స్తే హరివరా స్సీతాదర్శనకాఙ్క్షిణః. ౧౭

చాలును. ఇఁక లెండు ఇట్లు నిదురపోవుట మనకెంతమాత్రము యుక్తము గాదు. ౯

వానరరాజగు సుగ్రీవుఁడు మిక్కిలియుఁ గోపముగలవాఁడు. తీక్ష్ణముగా దండించును. కావున నతినియాజ్ఞను ఎప్పుడును భయముతోఁ గాపింపవలెను. రాముఁడును మహాప్రభావుఁడు. గావున నతనికిని భయపడవలెను.

వానరులారా! మీ మేలుకొఱకై యే నే నింతచెప్పినాను; మీకిష్టమగు నేని యావిధంబు గావింపుఁడు; లేక మనకందఱకు హితమైనది మఱియొక కార్య ముండినయెడ దానినైనను జెప్పుఁడు. అని యంగదుఁడు వానరులతోఁ జెప్పెను. ౧౦

అంగదుఁడు చెప్పిన వచనంబువిని గంధమాదనుఁడు దప్పిచేతను అలసటచేతను బాధితుఁడగుటచే నస్పష్టముగా దీనస్వరంబున నిట్లని పలికెను.

అంగదుఁడు మీకుఁ జెప్పినమాట మిక్కిలియు యుక్తము. అట్లు చేయుటవలన మీకు హితంబును అనుకూలంబును గలుగును కావున నాప్రకారము గావింపుఁడు. ౧౨

పర్వతంబులయందును గుహలయందును బిలములయందును నిర్జనములగు వనములయందును కొండసెలయేర్లయందును మరలఁజక్కఁగా వెదకుదము.

మహానుభావుఁడగు సుగ్రీవుఁ డాజ్ఞాపించిన ప్రకారంబున మీరలందఱుం జేరి వనంబులందును బర్వతమునందలి దుర్గమప్రదేశంబులందును సీతాదేవిని వెదకుఁడు. అని గంధమాదనుఁడు వానరులతోఁ జెప్పెను. ౧౪

అట్లు గంధమాదనుఁడు చెప్పఁగా మహాబలశాలులగు నవ్వానరులు లేచి మరల దక్షిణదిక్కునందు వింధ్యపర్వతారణ్యంబుల వెదక నారంభించిరి.

అవ్వానరోత్తములు సీతాదర్శనంబు గోరినవారలయి శిఖరములతోను గుహలతోనుం గూడినదియు శరత్కాలమేఘంబుకైవడి ధవళవర్ణంబై భాసిల్లునదియునగు శ్రీమంతంబయిన వింధ్యపర్వతమునందలి రజతమయమయిన యొకభాగము నారోహించి యచట రమణీయములగు నారుగు పైరులందును

త స్యాగ్ర మధిరూఢా స్తే శ్రాన్తా విపులవిక్రమాః,
నపశ్యన్తి స్మ వైదేహీం రామస్య మహిషీం ప్రియామ్. ౧౮

తేతు దృష్టిగతం కృత్వా తం శైలం బహుకన్దరమ్,
అవారోహన్త హరయో వీక్షమాణా స్సమన్తతః. ౧౯
అవరుహ్య తతో భూమిం శ్రాన్తా విగతచేతసః,
స్థిత్వా ముహూర్తం తత్రాథ వృక్షమూలే ష్వుపాశ్రితాః ౨౦
తే ముహూర్తం సమాశ్వస్తాః కించి ద్భగ్నపరిశ్రమాః,
పున రేవోద్యతాః కృత్స్నాం మార్గితుం దక్షిణాం దిశమ్.
హనూమత్ప్రముఖా స్తేతు ప్రస్థితాః ప్లవగర్షభాః,
విన్ధ్య మేవాదిత స్తావ ద్విచేరు స్తే సమన్తతః ౨౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకోనపఞ్చాశ స్సర్గః. ౪౯.

---

## పఞ్చాశ స్సర్గః.

సహ తారాఙ్గదాభ్యాం తు సంగమ్య హనుమా న్కపిః,
విచినోతి స్మ విన్ధ్యస్య గుహాశ్చ గహనానిచ. ౧
సింహశార్దూలజుష్టేషు శిలాశ్చ సరిత స్తథా,
విషమేషు నగేన్ద్రస్య మహాప్రస్రవణేషు చ ౨

ఆసేదు స్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్,
తేషాం తత్రైవ వసతాం స కాలో వ్యత్యవర్తత. 3

స హి దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్,

ఏడాకులరఁటుల వనములయందును సీతాదేవిని వెదకిరి. ౧౬,౧౭

మహాపరాక్రమశాలురగు నావానరులు అలసటనొందినవారయ్యు ఆపర్వతశిఖరము నారోహించి యచటనుగూడ రాముని ప్రియమహిషియగు సీతాదేవిని గానరైరి. ౧౮

ఆవానరులు ఆపర్వతమునందంతటను సమస్తగుహాలయందును జూచి వెదకి యచట సీత జాడపడనందున దిగిరి. ౧౯

ఆవానరులు అట్లు అలసి ప్రజ్ఞదప్పినవారయి ఆపర్వతమునుండి నేలకు డిగ్గి కొంతసేపు నిలువఁబడియుండి యొకవృక్షముక్రిందఁ జేరిరి. ౨౦

ఆవానరులు కొంతతడవలసటదీర్చుకొని యుత్సాహమునొంది మరలదక్షిణదిశనంతటను సీతాదేవిని వెదక నారంభించిరి. ౨౧

హనుమంతుఁడు మున్నగు నవ్వానరోత్తములు మరల వెదకుటకై బయలుదేరి వింధ్యపర్వతమున మొదటనుండి సమస్తప్రదేశములయందుఁ దిరిగి వెదకిరి. ౨౨

ఇది నలువదితొమ్మిదవసర్గము.

---

## ఏఁబదియవసర్గము.

హనుమంతుఁడు తారాంగదులతోఁ గూడినవాఁడై వింధ్యపర్వతమునందలి గుహలయందును వనంబులయందును సీతాదేవి నన్వేషించెను. ౧

ఆమహాపర్వతమున సింహములతోను పెద్దపులులతోను గూడిన విషమప్రదేశములయందలి విశాలశిలలను గొప్పసెలయేళ్లయందలి సమలను హనుమత్ప్రముఖవానరులు వెదకిరి. ౨

అంత నవ్వానరులు వింధ్యపర్వతముయొక్క నైరృతి దిశకోనకుఁ జేరిరి; వారలచటనుండునప్పుడే సుగ్రీవుఁడు విధించిన యవధిమాస మతిక్రమించెను. 3

ఆవింధ్యప్రదేశము అధికముగా గుహలును వనములును గలది గొప్పది

తత్ర వాయుసుత స్సర్వం విచినోతి స్మ పర్వతమ్. ౪
పరస్పరేణ హనుమా నన్యోన్య స్యావిదూరతః,

గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః. ౫
మైన్దశ్చ ద్వివిద శ్చైవ సుషేణో జామ్బవా న్నళః,
అఙ్గదో యువరాజ శ్చ తార శ్చ వనగోచరః. ౬
గిరిజాలావృతా న్దేశా న్మార్గిత్వా దక్షిణాం దిశమ్,
విచిన్వ న్త స్తత స్తత్ర దదృశు ర్వివృతం బిలమ్. ౭
దుర్గ మృక్షబిలంనామ దానవే నాభిరక్షితమ్,
క్షుత్పిపాసాపరీతా శ్చ శ్రాన్తా శ్చ సలిలార్థినః. ౮
అవకీర్ణం లతావృక్షై ర్దదృశు స్తే మహాబిలమ్,

తతః క్రౌఞ్చా శ్చ హంసా శ్చ సారసా శ్చ వినిష్క్రమన్. ౯
జలార్ద్రా శ్చక్రవాకా శ్చ రక్తాఙ్గాః పద్మరేణుభిః,

తత స్త ద్బిల మాసాద్య సుగన్ధి దురతిక్రమమ్. ౧౦
విస్మయవ్యగ్రమనసో బభూవు ర్వానరర్షభాః,

సంజాతపరిశఙ్కా స్తే త ద్బిలం ప్లవగో త్తమాః. ౧౧
అభ్యపద్య న్తసంహృష్టా స్తేజోవన్తో మహాబలాః,
నానాస త్త్వసమాకీర్ణం దై త్యేన్ద్రనిలయోపమమ్. ౧౨
దుర్దర్శ మతిఘోరం చ దుర్విగాహం చ సర్వశః,

కావున నచట వెదకుట మిక్కిలియుఁ గష్టము; అందువలన నచట నుండు నప్పుడే వారలకు ఆయాసము నతిక్రమించెను.

ఆనిరృతిదిగ్భాగమునందు వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు మున్నగు వానరులు ఒకరికొకరు సమీపముగా నొండొరులతోఁ గలిసి యాపర్వతము నందంతట సీతాదేవిని వెదకిరి. ౪

గజుఁడును గవాక్షుఁడును గవయుఁడును శరభుఁడును గంధమాదనుఁడును మైందద్వివిదులును సుషేణుఁడును జాంబవంతుఁడును నలుఁడును యువరాజయిన యంగదుఁడును తారుఁడును హనుమంతుఁడును పెక్కుపర్వతములతోఁగూడిన యన్నైరృత్యప్రదేశంబులవెదకి యంత దక్షిణదిశయందు ఇతరప్రదేశంబుల వెదకుచుఁబోయి యొకవిస్తీర్ణమగు బిలముం జూచిరి ౫-౭

అవ్వానరులు ఆఁకలియు దప్పియుఁ గొని మిక్కిలియు నలసటనొంది త్రావ జలంబులేక తిరుగుచు మయునిచే సురక్షితంబును ఎట్టివారికిని ప్రవేశింప నలవిగానిదియు లతాగుల్మములచేఁ గప్పఁబడినదియునగు ఋక్షబిలంబను పేరుగల యొక గొప్పబిలముఁ గాంచిరి. ౮

క్రౌంచంబులును హంసలును సారసంబులును జక్రవాకంబులును నీటిచేఁ దడిసి కమలపరాగంబులచే రక్తవర్ణంబులయిన రెక్కలతో నాబిలంబు నుండి వెడలినవి. ౯

అంత హనుమంతుఁడు మున్నగు నవ్వానరోత్తములు సుగంధంబు గుబాళించుచుఁ బ్రవేశించుటకు మాత్ర మశక్యము గానున్న యమ్మహాబిలంబుఁ జూచి పరమాశ్చర్యంబునొందిరి. ౧౦

మహాపరాక్రమశాలులును మహాబలశాలులు నగు నవ్వానరోత్తములు నానావిధజంతువులచే నాక్రాంతంబయి పాతాళసమానంబై చూచుటకేని యలవిగానిదై మహాభయంకరంబై యెంతమాత్రము ప్రవేశించుట కశక్యమయినయమ్మహాబిలంబుఁ జూచి యిది పాతాళమో లేక రాక్షసమాయయో యని సందేహించి సంతోషంబు లేనివారలయి యబ్బిలంబుసమీపమునకుఁ బోయిరి. ౧౧,౧౨

తతః పర్వతకూటాభో హనూమా న్పవనాత్మజః. ౧౩
అబ్రవీ ద్వానరాం స్సర్వా న్కాన్తారవనకోవిదః,

గిరిజాలావృతా న్దేశా న్మార్గిత్వా దక్షిణాం దిశమ్. ౧౪
వయం సర్వే పరిశ్రాన్తా న చ పశ్యామ మైథిలీమ్,
అస్మా చ్చాపి బిలా ద్ధంసాః క్రౌఞ్చాశ్చ సహ సారసైః. ౧౫
జలార్ద్రా శ్చక్రవాకాశ్చ నిష్పత న్తి స్మ సర్వతః,
నూనం సలిలవా నత్ర కూపో వా యదివా హ్రదః. ౧౬
తథా చేమే బిలద్వారి స్నిగ్ధా స్తిష్ఠన్తి పాదపాః,

ఇత్యుక్త్వా తద్బిలం సర్వే వివిశు స్తిమిరావృతమ్. ౧౭
అచన్ద్రసూర్యం హరయో దదృశూ రోమహర్షణమ్,

నిశామ్య తస్మా త్సింహాం శ్చ తాంస్తాం శ్చ మృగపక్షిణః ౧౮
ప్రవిష్టా హరిశార్దూలా బిలం తిమిరసంవృతమ్,

న తేషాం సజ్జతే చక్షు ర్న తేజో న పరాక్రమః. ౧౯
వాయో రివ గతి స్తేషాం దృష్టి స్తమసి వర్తతే,

తే ప్రవిష్టాస్తు వేగేన తద్బిలం కపికుఞ్జరాః. ౨౦
ప్రకాశ మభిరామం చ దదృశు ర్దేశ ముత్తమమ్,

తత స్తస్మి న్బిలే దుర్గే నానాపాదపసఙ్కులే. ౨౧
అన్యోన్యం సంపరిష్వజ్య జగ్ము ర్యోజన మన్తరమ్,

అంత వనదుర్గంబులయం దధికముగా నమర్థమగల వాయుపుత్త్రుఁడు పర్వతశిఖరాకారుఁడు హనుమంతుఁడు సమస్తవానరులంజూచి యిట్లని పలికెను. ౧౩

దక్షిణదిక్కునందుఁబర్వతప్రాయములయిన ప్రదేశము లధికముగా వెదకి మనమందఱము నలసటనొందియున్నాము, సీతనుం గానమైతిమి. ౧౪

మఱియు నీ గుహనుండి హంసలును గ్రౌంచంబులును సారసంబులును జక్రవాకంబులును నీటందడిసిన పక్షంబులతో వెడలివచ్చుచున్నవి. ౧౫

మఱియు నీగుహవాకిట వృక్షములు పచ్చగానున్నవి. కాఁబట్టి ఈగుహయందు జలసమృద్ధమైన బావిగాని తటాకముగాని యున్నది. వాస్తవము. అని హనుమంతుఁడు చెప్పెను. ౧౬

ఇట్లు హనుమంతుఁడు చెప్పుటయు సర్వవానరులందఱు ఆబిలంబుఁ బ్రవేశించి, యచట చంద్రసూర్యులకిరణంబులు ప్రసరింపమింజేసి భయంకరంబుగా నంధకారంబు నిండియుండుటం గనిరి. ౧౭

అవ్వానరోత్తములు ఆబిలమునుండి వెడలివచ్చుసింహములను మఱియు నానావిధములగు మృగములను బక్షులను జూచుచు నంధకారావృతంబగు నాబిలముం బ్రవేశించిరి. ౧౮

అం దవ్వానరులనేత్రములుగాని తేజస్సుగాని పరాక్రమంబుగాని యుపయోగింపలేదు. వారలు వాయువుసంచరించునట్లు దారి డొంకలేక యయ్యంధకారంబునంబడి తిరిగిరి. ౧౯

అవ్వానరోత్తములు అట్లు ఋక్షబిలంబును వేగంబునం బ్రవేశించిన పిమ్మటఁ గొంతకాలమునకు వెలుతురుగలిగి మనోహరంబయిన యుత్తమంబగు ప్రదేశముం గాంచిరి. ౨౦

అంత వారలు నానావిధవృక్షంబులతోఁగూడినదియు దుర్గమంబునగు నబ్బిలంబునందు అంధకారంబునఁ దప్పిపోవుదుమనుభయంబున నొకరినొకరు పట్టుకొనుచు నొకయోజనముదూరము పోయిరి. ౨౧

తే నష్టసంజ్ఞా స్తృషితా స్సంభ్రాన్తా స్సలిలార్థినః. ౨౨
పరిపేతు ర్బిలే తస్మి న్కంచి త్కాల మతన్ద్రితాః,

తే కృశా దీనవదనాః పరిశ్రాన్తాః ప్లవఙ్గమాః. ౨౩
ఆలోకం దదృశు ర్వీరా నిరాశా జీవితే తదా,

తత స్తం దేశ మాగమ్య సౌమ్యం వితిమిరం వనమ్. ౨౪
దదృశుః కాఞ్చనా న్వృక్షా న్దీప్తవైశ్వానరప్రభాన్,
సాలాం స్తాలాంశ్చ పున్నాగా న్కకుభా న్వంజులాన్ధవాన్. ౨౫
చమ్పకా న్నాగవృక్షాం శ్చ కర్ణికారాం శ్చ పుష్పితాన్,

స్తబకైః కాఞ్చనై శ్చిత్రై రక్తైః కిసలయై స్తథా. ౨౬
ఆపీడై శ్చ లతాభి శ్చ హేమాభరణభూషితాన్,
తరుణాదిత్యసంకాశా న్వైడూర్యకృతవేదికాన్. ౨౭
విభ్రాజమానా న్వపుషా పాదపాం శ్చ హిరణ్మయాన్,

నీలవైడూర్యవర్ణా శ్చ పద్మినీః పతగావృతాః. ౨౮
మహద్భిః కాఞ్చనైః పద్మై ర్వృతా బాలార్కసన్నిభైః,
జాతరూపమయై ర్మత్స్యై ర్మహద్భి శ్చ సకచ్ఛపైః. ౨౯
నళినీ స్తత్ర దదృశుః ప్రసన్నసలిలావృతాః,

కాఞ్చనాని విమానాని రాజతాని తథైవచ. ౩౦
తపనీయగవాక్షాణి ముక్తాజాలావృతాని చ,
హైమరాజతభౌమాని వైడూర్యమణిమన్తిచ. ౩౧
దదృశు స్తత్ర హరయో గృహముఖ్యాని సర్వశః,

ఆవానరులు దప్పిగొని జలంబు గానక మిక్కిలియు నలసటనొంది సంజ్ఞదప్పి తొట్రుపడుచున్నను సోమరితనమునొందక నా బిలమునందుఁ గొంతకాలము తిరిగిరి. ౨౨

ఆవానరులు అట్లంధకారంబునం దిరుగుచు క్షుత్పిపాసలచేఁ బరిశ్రాంతులయి కృశించి ముఖంబున దైన్యంబుదోఁప బ్రతుకువిషయమయి యాశ వదలి దుఃఖితులయి కొంతకాలమునకు వెలుతురు గాంచిరి. ౨౩

అంత నవ్వానరులు అంధకారవర్జితమయి ప్రకాశమయిన రమణీయంబగు నవ్వనప్రదేశము నొంది యచట మండుచున్నయగ్నివలె దేదీప్యమానములయిన కాంచనవృక్షములను మద్దిచెట్లను తాటిచెట్లను సురపొన్నచెట్లను నేలుమద్దిచెట్లను అశోకవృక్షములను చంద్రచెట్లను సంపంగిచెట్లను నాగకేసరవృక్షములను పుష్పితంబులగు కొండగోఁగులనుం జూచిరి. ౨౪,౨౫

మఱియు నచట వానరులు సుందరంబులయిన బంగారుపూగుత్తులును ఎఱ్ఱనిచివుళ్ళును మనోహరములగు శేఖరంబులును లతలును గల్గినవై బంగారు భూషణములే ఫలంబులుగాఁ గల్గి బాలసూర్యునివలెవెలుంగుచు వైడూర్యమయములయిన తిన్నెలతోఁ గూడినవై నిజకాంతిం బ్రకాశించుచున్న బంగారు వృక్షంబులనుం జూచిరి. ౨౬,౨౭

మఱియు నచటనవ్వానరులు నీలవైడూర్యవర్ణంబులును నానావిధపక్షులతోఁ గూడినవియు బాలసూర్యసమానంబులైన గొప్పవగు కాంచనకమలములతో నిండినవియునగు తామరతీఁగలను గొప్పబంగారు మత్స్యంబులును బంగారుతాఁబేళ్ళను గలిగి నిర్మలంబులగు జలంబులతో నొప్పుచున్న తామరకొలంకులనుం గాంచిరి ౨౮,౨౯

ఆవానరులు ఆబిలమునందు బంగారుకిటికీలుగల్గి ముక్తాహారంబులచే నలంకృతములయిన బంగారువిమానములను వెండివిమానములను మఱియు బంగారుకట్టనపు నేలలును వెండికట్టనపునేలలును గలిగి వైడూర్యమణులచే నలంకృతములయిన యుత్తమగృహంబులనుం గాంచిరి. ౩౦,౩౧

పుష్పితా న్ఫలినో వృక్షాన్ప్రవాళమణిసన్నిభాన్. 32
కాఞ్చనభ్రమరాం శ్చైవ మధూని చ సమన్తతః,
మణికాఞ్చనచిత్రాణి శయనా న్యాసనాని చ. 33
మహార్హాణి చ యానాని దదృశు స్తే సమన్తతః,
హైమరాజతకాంస్యానాం భాజనానాం చ సంచయాన్. 34
అగరూణాం చ దివ్యానాం చన్దనానాం చ సంచయాన్,
శుచీ న్యభ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ. 35
మహార్హాణి చ పానాని మధూని రసవన్తిచ,
దివ్యానా మమ్బరాణాంచ మహార్హాణాంచ సంచయాన్. 36
కమ్బళానాంచ చిత్రాణా మజినానాంచ సంచయాన్,
తత్ర తత్ర చ విన్యస్తా న్దీప్తా న్వైశ్వానరప్రభాన్. 37
దదృశు ర్వానరా శ్శుభ్రా న్జాతరూపస్య సంచయాన్,
తత్ర తత్ర విచిన్వన్తో బిలే తస్మి న్మహాబలాః. 38
దదృశు ర్వానరా శ్శూరాః స్త్రియం కాంచి దదూరతః,
తాం దృష్ట్వా భృశసన్త్రస్తా శ్చీరకృష్ణాజినామ్బరామ్. 39
తాపసీం నియతాహారాం జ్వలన్తీ మివ తేజసా,
విస్మితా హరయ స్తత్ర వ్యవాతిష్ఠన్త సర్వశః. 40
పప్రచ్ఛ హనుమాం స్తత్ర కాఽసి త్వం కస్య వా బిలమ్.

తతో హనూమా న్గిరిసన్నికాశః
కృతాఞ్జలి స్తా మభివాద్య వృద్ధామ్,
పప్రచ్ఛ కా త్వం భవనం బిలం చ
రత్నాని హైమాని వదస్వ కస్య. 41

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చాశ స్సర్గః. 50

---

ఆవానరు లచ్చట పుష్పితంబులును సమృద్ధముగా ఫలించినవియునగు పగడపుకాంతిగల వృక్షములను కాంచనప్రభంబులగు భృంగంబులను నానావిధంబులగు మధువులను రత్నఖచితంబులగు బంగారుశయనీయంబులను ఆసనంబులను మఱియు నుత్తమంబులగు వాహనంబులనుం గనిరి. ౩౨,౩౩

వానరులు అచట బంగారుపాత్రలరాసులను వెండిపాత్రల సమూహంబులను కంచుపాత్రల సమూహంబులను. దివ్యంబులగు నగరువులయొక్కయు చందనములయొక్కయు రాసులను బరిశుద్ధంబులును రుచ్యములునగు ఫలమూలంబులును ఉత్తమములగు పానద్రవ్యములను రసవంతములగు తేనియలను దివ్యంబులు నుత్తమంబులునగు వస్త్రములరాసులను జిత్రకంబళములయొక్కయు నానావిధంబులగు నజినంబులయొక్కయు రాసులను మఱియు దేదీప్యమానంబులు నగ్నితుల్యంబులు నిర్మలంబులునగు కాంచనరాసులను అచ్చటచ్చట విన్యస్తంబులయియుండఁ గాంచిరి. ౩౪-౩౭

మహాబలశాలులును శూరులు నగు నవ్వానరులు అట్లు ఆబిలంబున నర్థ్యస్థలంబుల వెదకుచు సమీపంబున నొకవనితం గాంచిరి. ౩౮

నారచీరలును గృష్ణాజినంబును ధరించి యాహారంబు వర్జించి తపస్సు గావించుచుఁ దేజోబలంబున జ్వలించునట్లున్న యత్తాపసింజూచి భయంబును ఆశ్చర్యంబునుంబొంది యందఱును నిలువఁబడియుండిరి. ౩౯,౪౦

అప్పుడు హనుమంతుఁ డాబిడను నీవెవ్వతవు? ఈబిలం బెవ్వనిది? అని యడిగెను.

అంతఁ బర్వతాకారుఁడగు హనుమంతుఁడు చేతులుమోడ్చి యావృద్ధతాపసికి నమస్కరించి యామెను "నీవెవతెవు? ఈ గృహంబును బిలంబును ఈయుత్తమద్రవ్యంబులును ఎవ్వనివి?" అని యడిగెను. ౪౧

ఇది యేఁబదియవసర్గము.

---

## ఏ క ప ఞ్చా శ స్స ర్గః.

ఇత్యుక్త్వా హనుమాం స్తత్ర పునః కృష్ణాజినామ్బరామ్,
అబ్రవీ త్తాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్. ౧

ఇదం ప్రవిష్టా స్సహసా బిలం తిమిరసంవృతమ్,
క్షుత్పిపాసాపరిశ్రాన్తాః పరిఖిన్నా శ్చ సర్వశః. ౨

మహ ద్ధరణ్యా వివరం ప్రవిష్టాః స్మ పిపాసితాః,

ఇమాం స్త్వేవంవిధా న్భావా న్వివిధా నద్భుతోపమాన్. ౩
దృష్ట్వా వయం ప్రవ్యథితా స్సంభ్రాన్తా నష్టచేతసః,

క స్యైతే కాఞ్చనావృక్షా స్తరుణాదిత్యసన్నిభాః. ౪
శుచీ న్యభ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ,
కాఞ్చనాని విమానాని రాజతాని గృహాణి చ. ౫
తపనీయగవాక్షాణి మణిజాలావృతానిచ,
పుష్పితాః ఫలవ న్తశ్చ పుణ్యా స్సురభిగన్ధినః. ౬
ఇమే జామ్బూనదమయాః పాదపాః కస్య తేజసా,
కాఞ్చనాని చ పద్మాని జాతాని విమలే జలే. ౭

కథం మత్స్యాశ్చ సౌవర్ణా శ్చర న్తి సహ కచ్ఛపైః,
ఆత్మాన మనుభావం చ కస్య చైత త్తపోబలమ్. ౮

అజానతాం న స్సర్వేషాం సర్వ మాఖ్యాతు మర్హసి,

## ఏఁబదియొకటవసర్గము.

అట్లు హనుమంతుఁడు పలికి మరల కృష్ణాజినంబునే వస్త్రముగాఁ దాల్చినదియు మహానుభావురాలును బరమధార్మికురాలునగు నావృద్ధతాపసిం జూచి యిట్లని పలికెను. ౧

మేము మార్గశ్రమంబున నలసటనొంది ఆఁకలిదప్పులచేఁ బీడితుల మయి యిచట జలాదులుండునని తలఁచి ముందువెనుకఁ జూడక యంధకారావృతంబగు నీబిలంబులోనికి వచ్చినాము. ౨

మేము ముఖ్యముగా దప్పిచేఁ బరిశ్రాంతులమయి గహనంబగు నీభూబిలంబుఁ బ్రవేశించినాము.

ఇచట నిట్టి యాశ్చర్యకరములయిన దివ్యపదార్థంబులఁ జూచెఁగానే మేము ఇది యసురమాయయో యేమో యని దిగులుపడి యేమియుఁ దోఁచక చేయునది తెలియకయున్నాము. ౩

బాలసూర్యునివలె వెలుఁగుచున్న యీబంగారువృక్షములును రుచ్యములును బరిశుద్ధములునగు నీమూలఫలంబులును బంగారువిమానంబులును బంగారు కిటికీలతోఁగూడినవై రత్నములతో నిండియుండు వెండిగృహంబులును ఎవ్వనివి? ౪,౫

చక్కఁగాఁ బుష్పించినవియు మంచిఫలములుగలవియు సుగంధముగు బాలించుచున్నవియుఁ బవిత్రంబులు నగు నీబంగారువృక్షంబులును నిర్మలమగు జలమునందు ఈకాంచనకమలంబులును ఎవ్వని ప్రభావంబునఁ గలిగినవి? ౬,౭

బంగారు తాఁబేళ్లును బంగారు మత్స్యంబులును ఎట్లు కలిగినవి? నీప్రభావంబువలననా? లేక మఱియెవరి తపోమహిమవలన నీచిత్రములు కలిగినవి? ౮

మా కందఱకును ఈవిషయము తెలియదు కావున నీవు అంతయుఁ దెలియఁ జెప్పుము. అని హనుమంతుఁడు ఆతాపసితోఁ జెప్పెను.

ఏవ ముక్తా హనుమతా తాపసీ ధర్మచారిణీ. ౯
ప్రత్యువాచ హనూమన్తం సర్వభూతహితే రతా,
మయో నామ మహాతేజా మాయావీ దానవర్షభః. ౧౦
తే నేదం నిర్మితం సర్వం మాయయా కాఞ్చనం వనమ్,

పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవ హ. ౧౧
యే నేదం కాఞ్చనం దివ్యం నిర్మితం భవనోత్తమమ్,

సతు వర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే. ౧౨
పితామహా ద్వరం లేభే సర్వ మౌశనసం ధనమ్,

వనం విధాయ బలవాం త్సర్వకామేశ్వర స్తదా. ౧౩
ఉవాస సుఖితః కాలం కంచి దస్మి న్మహావనే,

త మప్సరసి హేమాయాం సక్తం దానవపుఙ్గవమ్. ౧౪
విక్ర మ్యై వాశనిం గృహ్య జఘా నేశః పురన్దరః,

ఇదం చ బ్రహ్మణా దత్తం హేమాయై వన ముత్తమమ్. ౧౫
శాశ్వతాః కామభోగా శ్చ గృహం చేదం హిరణ్మయమ్,

దుహితా మేరుసావర్ణే రహం తస్యా స్స్వయం ప్రభా. ౧౬
ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ!,

మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా. ౧౭

సమస్తభూతంబులకును హితంబు సేయునట్టి పరమధార్మికురాలగు నా-
తాపసి హనుమంతుని వచనంబు విని యతనిం జూచి యిట్లని బదులుపలికెను.

మహాపరాక్రమశాలియు మహామాయావియునగు దానవోత్తముఁడు మయుఁడనువాఁ డొకఁ డిచట నుండెను; అతఁడు మాయాబలంబున నీకాంచనవనం బంతయు నిర్మించెను. ౧౦

దివ్యంబగు నీకాంచనవనంబును నుత్తమగృహంబును నిర్మించినమయుఁడు మున్ను దానవులకు విశ్వకర్మయయి యుండెను. ౧౧

ఆమయుఁడు గాఢారణ్యంబునఁ బెక్కువేల సంవత్సరములు మహాతపస్సు గావించి బ్రహ్మదేవునివలన జనులు గొంతెమకోర్కెలు కోరు ధనమంతయుఁ దనకుఁ జేరునట్లు (శుక్రాచార్యప్రణీతమయిన శిల్పశాస్త్రమంతయుఁ దనకుఁ దెలియునట్లు) వరంబు నొందెను. ౧౨

అంత మాయాబలంబుగలవాఁడును సమస్తకామితభోగంబులను సమృద్ధంబుగాఁగలవాఁడును (లేక జనులు గొంతెమకోర్కెలుకోరు ధనమునకంతయు స్వామియు) నగు నమ్మయుఁడు ఈకాంచనవనంబు నిర్మించి యిమ్మహావనంబునఁ గొంతకాలముగా సుఖంబున నివసించియుండెను. ౧౩

దానవశ్రేష్ఠుఁడగు నమ్మయుఁడు హేమయను నచ్చరమిన్నయందుఁ దగిలియుండుటఁ గని త్రైలోక్యనాథుఁడగు దేవేంద్రుఁడు కోపించి వజ్రాయుధంబున నమ్మయునిం బ్రహరించెను. ౧౪

మయుం డీస్థలంబు విడిచిపోయిన వెనుక నుత్తమంబగు నీవనంబును శాశ్వతంబులగు కమనీయములయిన భోగ్యవస్తువులును ఈహిరణ్మయగృహంబును బ్రహ్మదేవుఁడు హేమ కొసంగెను. ౧౫

వానరవీరుఁడా! నేను మేరుసావర్ణికొమార్తెను; స్వయంప్రభయను దానను; హేమయొక్కగృహము మొదలయినదాని నంతయు రక్షించుచు నిచట నున్నాను. ౧౬

నృత్తగీతంబులయందు సమర్థురాలగు హేమ నాకూరిమిచెలికత్తియ;

తయా దత్తవరా చాస్మి రక్షామి భవనోత్తమమ్,
కిం కార్యం కస్య వా హేతోః కాన్తారాణి ప్రపద్యథ. ౧౮
కథం చేదం వనం దుర్గం యుష్మాభి రుపలక్షితమ్,
ఇమా న్యభ్యవహార్యాణి మూలాని చ ఫలాని చ. ౧౯
భుక్త్వా పీత్వా చ పానీయం సర్వం మే వక్తు మర్హథ,

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకపఞ్చాశ స్సర్గః. ౫౧.

## ద్విపఞ్చాశ స్సర్గః.

అథ తా నబ్రవీ త్సర్వా న్విశ్రాన్తా న్హరియూథపాన్,
ఇదం వచన మేకాగ్రా తాపసీ ధర్మచారిణీ. ౧

వానరా! యది వః ఖేదః ప్రణష్టః ఫలభక్షణాత్,
యది చైత న్మయా శ్రావ్యం శ్రోతు మిచ్ఛామి కథ్యతామ్. ౨

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనూమా న్మారుతాత్మజః,
ఆర్జవేన యథా తత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౩

రాజా సర్వస్య లోకస్య మహేన్ద్రవరుణోపమః,
రామో దాశరథి శ్శ్రీమా న్ప్రవిష్టో దణ్డకావనమ్ ౪
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా,
తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్. ౫

మఱియు నాబిడ ఇతరులకు వన్నెకు దెక్కించు నలవిగానట్లు నాకు పరం బొసంగినది; కావున నే నిచట నీగృహంబు రక్షించుచున్నాను. ౧౬

మీరు ఏకార్యము నుద్దేశించి యేకారణమువలన వనంబులు వెదకుచున్నారు? దుర్గమంబగు నీవనంబుగూడ నెట్లు గనుఁగొంటిరి? ౧౭

మీరు ఇచటనుండునట్టి దివ్యంబులగు ఫలంబులను భక్షించి జలంబు ద్రావి సమస్తసమాచారంబును నాకుఁ జెప్పుఁడు. అని యా తాపసి హనుమంతునితోఁ జెప్పెను. ౧౮

ఇది యేఁబదియొకటవసర్గము.

---

## ఏఁబదిరెండవసర్గము.

అంత నచటఁ దపస్సుసేయుచున్న యా స్వయంప్రభ పరాక్రమశాలులగు వానరోత్తముల నందఱఁ జూచి మిక్కిలి యక్కఱతో నిట్లని పలికెను. ౧

వానరులారా! ఫలముల భక్షించుటవలన మీయలసట దీఱినదియైన మీరు వనంబునకు వచ్చుటకుఁ గారణము మొదలగువిషయము నేను వినఁదగినదే యవునేని సమస్తమును జెప్పుఁడు; వినఁగోరుచున్నాను. అని స్వయంప్రభ వానరులతోఁ బలికెను. ౨

వాయుదేవుని కుమారుఁడగు హనుమంతుఁడు స్వయంప్రభ చెప్పిన మాటను విని కపటములేక యథార్థముగా సమాచారమంతయుఁ జెప్ప నారంభించెను. ౩

సమస్తలోకనాథుఁడును దేవేంద్రునకును వరుణునకును సాటియైనవాఁడును శ్రీమంతుఁడును దశరథపుత్త్రుఁడు నగురాముఁడు తమ్ముఁడు లక్ష్మణుని భార్యను సీతాదేవినింగూడి దండకారణ్యంబునకు వచ్చెను. ౪

ఆరామునిభార్యను సీతాదేవిని జనస్థానంబున రావణుఁడు బలాత్కారంబున దీసికొనిపోయెను. ౫

వీర స్తస్య సఖా రాజ్ఞ స్సుగ్రీవో నామ వానరః,
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్. ౬
అగస్త్యచరితా మాశాం దక్షిణాం యమరక్షితామ్,
సహైభి ర్వానరై ర్ఘోరై రఙ్గదప్రముఖై ర్వయమ్. ౭
రావణం సహితా స్సర్వే రాక్షసం కామరూపిణమ్,
సీతయా సహ వైదేహ్యా మార్గధ్వ మితి చోదితాః. ౮
విచిత్యతు వయం సర్వే సమగ్రాం దక్షిణాం దిశమ్,
బుభుక్షితాః పరిశ్రాన్తా వృక్షమూల ముపాశ్రితాః. ౯
వివర్ణవదనా స్సర్వే సర్వే ధ్యానపరాయణాః,
నాధిగచ్ఛామహే పారం మగ్నా శ్చిన్తామహార్ణవే. ౧౦
చారయన్త స్తత శ్చక్షు ర్దృష్టవన్తో వయం బిలమ్,
లతాపాదపసంఛన్నం తిమిరేణ సమావృతమ్. ౧౧

అస్మా ద్ధంసా జలక్లిన్నాః పక్షై స్సలిలవిస్రవైః,
కురరా స్సారసా శ్చైవ నిష్పత న్తి పతత్త్రిణః. ౧౨
సాధ్వత్ర ప్రవిశామేతి మయా తూక్తాః ప్లవఙ్గమాః,

తేషా మపి హి సర్వేషా మనుమాన ముపాగతమ్. ౧౩
గచ్ఛామ ప్రవిశామేతి భర్తృకార్యత్వరాన్వితాః,

తతో గాఢం నిపతితా గృహ్య హస్తౌ పరస్పరమ్. ౧౪
ఇదం ప్రవిష్టా స్సహసా బిలం తిమిరసంవృతమ్,
ఏత న్నః కార్య మేతేన కృత్యేన వయ మాగతాః. ౧౫
త్వాం చై వోపగతా స్సర్వే పరిద్యూనా బుభుక్షితాః,

ఆ రామునిమిత్రుఁడు సమస్తవానరులకును రాజయిన సుగ్రీవుఁడను వానరుఁడు మమ్మందఱను అగస్త్యమహర్షిచే నాశ్రయింపఁబడినదియు యమునిచేఁ బాలితంబునగు దక్షిణదిక్కునకుఁ బంపెను. ౭

అంగదుఁడు మొదలయిన భయంకరాకారులగు నీవానరుల నందఱను మమ్మునుం జూచి సుగ్రీవుఁడు "మీరలందఱుం జేరి, సీతాదేవిని కామరూపియగు రాక్షసుఁడునగు రావణుని వెదకుఁడు" అని యాజ్ఞాపించెను. ౮,౯

మేము అందఱము దక్షిణదిశనంతయు వెదకి యలసి యాఁకలిగొని యొకచెట్టుక్రిందం జేరితిమి. ౯

మేమందఱమును ముఖంబు తెల్లఁబాఱఁ జింతించుచుఁ గడలేని చింతాసముద్రంబున మునిఁగి యేమియుఁ దోఁచక దీనులమయితిమి. ౧౦

అంత మేము నలువైపులం జూపులఁ బఱఁగించుటయు, లతావృక్షములచేఁ గప్పఁబడినదియు నంధకారసంవృతంబునగు బిలం బొకటి యగపడినది. ౧౧

జలములం దడిసినపక్షులు హంసలును గోరువంకలును బెగ్గురుపక్షులును రెక్కలచే జలము విదిర్చుచు నీబిలమునుండి వెడలఁగంటిమి. ౧౨

"మంచిది ఈబిలంబుఁ బ్రవేశింతము" అని నేనే యీవానరులకుఁ జెప్పితిని.

వానరులకు అందఱకునుగూడ తడిసిన జలచరపక్షులం జూచుటవలన నిచట జలముండునని యూహ గలిగినది; అంత స్వామికార్యమునందలి త్వరచే "పోయి ప్రవేశింత" మని యందఱు నేకకంఠముగాఁ బలికిరి. ౧౩

అంత మేము ఒకరిచే యొకరు గట్టిగాఁ బట్టుకొని బిలద్వారంబుఁజొచ్చి శీఘ్రంబున నంధకారావృతంబగు నీబిలంబుఁ జొచ్చితిమి. ౧౪

ఇది మాకార్యము; మేము వచ్చుటకు ఇది కారణము; ఆఁకలిచేఁ గృశించి యందఱమును నిన్నాశ్రయించినాము. ౧౫

ఆతిథ్యధర్మదత్తాని మూలానిచ ఫలానిచ. ౧౬
అస్మాభి రుపభుక్తాని బుభుక్షాపరిపీడితైః,
య త్త్వయా రక్షితా స్సర్వే మ్రియమాణా బుభుక్షయా.
బ్రూహి ప్రత్యుపకారార్థం కిం తే కుర్వన్తు వానరాః,

ఏవ ముక్తాతు ధర్మజ్ఞా ర్వానరై స్తై స్స్వయంప్రభా. ౧౭
ప్రత్యువాచ తత స్సర్వా నిదం వానరపుఙ్గవాన్,
సర్వేషాం పరితుష్టాఽస్మి వానరాణాం తరస్వినామ్. ౧౮
చరన్త్యా మమ ధర్మేణ న కార్య మిహ కేనచిత్.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్విపఞ్చాశ స్సర్గః. ౫౨.

---

## త్రి ప ఞ్చా శ స్స ర్గః.

ఏవ ముక్త శ్శుభం వాక్యం తాపస్యా ధర్మసంహితమ్,
ఉవాచ హనుమా న్వాక్యం తా మనిన్దితచేష్టితామ్. ౧

శరణం త్వాం ప్రపన్నాః స్మ స్సర్వే వై ధర్మచారిణి!,

యః కృత స్సమయోఽస్మాకం సుగ్రీవేణ మహాత్మనా. ౨
సచ కాలో హ్యతిక్రాన్తో బిలే చ పరివర్తతామ్,
సా త్వ మస్మా ద్బిలా ద్ఘోరా దుత్తారయితు మర్హసి. ౩

తస్మా త్సుగ్రీవవచనా దతిక్రాన్తా న్గతాయుషః,

నీవు ఆతిథ్యధర్మమవలంబించి యొసఁగినఫలంబులను మూలంబులనుమే మందఱము ఆఁకలిదీఱ భక్షించినాము. ౧౭

ఆఁకలిచేఁ జావఁబోయెడు మమ్మందఱను నీ విపుడు రక్షించితివే; ఇందుకుఁ బ్రత్యుపకారము నీకేమి సేయవలెను? వచింపుము. అని హనుమంతుఁడు స్వయంప్రభతోఁ బలికెను. ౧౮

ధర్మజ్ఞురాలగు స్వయంప్రభ హనుమంతునిముఖంబున నవ్వానరులు చెప్పినమాటను విని వానరవీరుల నందఱం జూచి యిట్లనిపలికెను. ౧౯

బలవంతులగు సమస్తవానరులవిషయమునుయ్యును నేను సంతోషించినాను; నాకుఁ బ్రత్యుపకారము అనావశ్యకము; ధర్మమునే యవలంబించియున్న నాకుఁ బ్రతిఫలముతో నేమి పనియున్నది? అని స్వయంప్రభ వానరులతోఁ జెప్పెను. ౨౦

ఇది యేఁబదిరెండవసర్గము.

---

## ఏఁబదిమూఁడవసర్గము.

హనుమంతుఁడు ఇట్లుఆస్వయంప్రభచెప్పినధర్మయుక్తంబును మంగళకరంబునగువచనంబునువిని పరమధార్మికయగు నాబిడంజూచి యీమాటం బలికెను. ౧

పరమధార్మికురాలా! మేమందఱము నిపుడు నిన్నే శరణుచొచ్చినాము.

మహాత్ముఁడగు సుగ్రీవుఁడు మాకు నియమించిన యవధిగూడ మేము ఇమ్మహాబిలంబునఁ దిరుగుచుండునప్పుడే యతిక్రమించినది. ౨

నీవు పరమధార్మికవు కావున భయంకరంబగు నీబిలంబునుండి మమ్ము ఎట్లయినను బయలు చేర్పవలెను. ౩

సుగ్రీవుఁ డాజ్ఞాపించిన గడువు నతిక్రమించినవార మగుటంజేసి

త్రాతు మర్హసి న స్సర్వాం స్సుగ్రీవభయకర్శితాన్. ౪

మహ చ్చ కార్య మస్మాభిః క ర్తవ్యం ధర్మచారిణి!,
తచ్చాపి న కృతం కార్య మస్మాభి రిహ వాసిభిః. ౫

ఏవ ముక్తా హనుమతా తాపసీ వాక్య మబ్రవీత్,

జీవతా దుష్కరం మన్యే ప్రవిష్టేన నివ ర్తితుమ్. ౬

తపస స్తు ప్రభావేన నియమోపార్జితేన చ,
స ర్వా నేవ బిలా దస్మా దుద్ధరిష్యామి వానరాన్. ౭

నిమీలయత చక్షూంషి స ర్వే వానరపుఙ్గవాః!,
నహి నిష్క్రమితుం శక్య మనిమీలితలోచనైః. ౮

తత స్సంమీలితా స్స ర్వే సుకుమా రాఙ్గుళై ః క రైః,
సహసా పిదధు ర్దృష్టిం హృష్టా గమనకాఙ్క్షయా. ౯

వానరా స్తు మహాత్మానో హ స్తరుద్ధముఖా స్తదా,
నిమేషా న్తరమాత్రేణ బిలా దుత్తారితా స్తయా. ౧౦

తత స్తా న్వానరాం స్సర్వాం స్తాపసీ ధర్మచారిణీ,
నిస్సృతా న్విషమా త్తస్మా త్సమాశ్వా స్యేద మబ్రవీత్. ౧౧
ఏష విన్ధ్యో గిరి శ్శ్రీమా న్నానాద్రుమలతాకులః,
ఏష ప్రస్రవణ శ్శైల స్సాగరోఽయం మహోదధిః. ౧౨

సుగ్రీవుఁడువిధించు మరణదండనమునకుఁ బాత్రులమయి యతనిభయంబునం గృశించుచున్న మమ్మందఱను నీవు రక్షింపవలెను. ౪

ధార్మికవరాలా! మాకు సీతాన్వేషణరూపమయిన గొప్పకార్యము చేయవలసియున్నది; మేమిచటఁ జిక్కియున్నందున ఆకార్యముగూడఁ జేయని వారమయితిమి. అని హనుమంతుఁడు స్వయంప్రభతోఁ జెప్పెను. ౫

స్వయంప్రభ హనుమంతుఁడు చెప్పినమాటను విని యిట్లని వానరుల తోఁ బలికెను.

ఈబిలంబును బ్రవేశించినవానికి ప్రాణములతో దీనినుండి వెడలిపోవుట యసాధ్యమని తలఁచుచున్నాను. ౬

అయినను నేను ఇంద్రియములనిగ్రహించిగావించిన తపస్సుయొక్క ప్రభావంబునం జేసి వానరుల నందఱనుగూడ ఈబిలమునుండి వెలికిఁ జేర్చెదను. ౭

వానరోత్తములారా! మీరలందఱును గన్నులుమూసికొనుండు; కన్నులు మూసికొననియెడ నీబిలంబునుండి వెడల నెంతమాత్రమలవిగాదు. అని స్వయంప్రభ చెప్పెను. ౮

అంత వానరులందఱును బిలంబు వెడలఁగలుగునని సంతోషంబునొంది కనుఱెప్పలు మూయుటయేగాక శీఘ్రముగ కోమలములయిన వ్రేళ్లుగల కరంబుల నేత్రములు మూసికొనిరి. ౯

అప్పుడు అట్లు మహాపరాక్రమశాలు లగువానరులు చేతులచేఁ గన్నులం గప్పికొనుటయు నాక్షణంబుననే వారలనందఱను స్వయంప్రభ ఒక ఱెప్పపాటులోపల ఆబిలంబునుండి వెలికిఁ దీసికొనిపోయెను. ౧౦

అంతఁ బరమధార్మికయగు నాస్వయంప్రభ యవ్వానరుల నందఱ నాసంకటప్రదేశమునుండి వెడలించి వారల నాశ్వాసించి యిట్లని పలికెను.

ఇది నానావిధంబులగువృక్షములతోను లతలతోను ఒప్పుచుండు శ్రీమంతంబగువింధ్యపర్వతము; ఇది ప్రస్రవణశైలము; ఇది మహాసముద్రము; చూడుఁడు. ౧౧

స్వస్తి వోఽస్తు గమిష్యామి భవనం వానరర్షభాః!,
ఇ త్యుక్త్వా తద్బిలం శ్రీమ త్ప్రవివేశ స్వయంప్రభా. ౧౩

తత స్తే దదృశు ర్ఘోరం సాగరం వరుణాలయమ్,
అపార మభిగర్జన్తం ఘోరై రూర్మిభి రావృతమ్. ౧౪

మయస్య మాయావిహితం గిరిదుర్గం విచిన్వతామ్,
తేషాం మాసో వ్యతిక్రాన్తో యో రాజ్ఞా సమయః కృతః. ౧౫

విన్ధ్యస్య తు గిరేః పాదే సంప్రపుష్పితపాదపే,
ఉపవిశ్య మహాభాగా శ్చిన్తా మాపేదిరే తదా. ౧౬

తతః పుష్పాతిభారాగ్రాన్ లతాశతసమావృతాన్,
ద్రుమా న్వాసన్తికా న్దృష్ట్వా బభూవు ర్భయశఙ్కితాః. ౧౭

తే వసన్త మనుప్రాప్తం ప్రతిబుద్ధ్వా పరస్పరమ్,
నష్టసందేశకాలార్థా నిపేతు ర్ధరణీతలే. ౧౮

తత స్తా న్కపివృద్ధాం స్తు శిష్టాం శ్చైవ వనౌకసః,
వాచా మధురయాఽఽభాష్య యథావ దనుమాన్య చ. ౧౯
సతు సింహవృషస్కన్ధః పీనాయతభుజః కపిః,
యువరాజో మహాప్రాజ్ఞః అఙ్గదో వాక్య మబ్రవీత్. ౨౦

వానరోత్తములారా! మీకు మంగళమగుఁగాక! నేను గృహంబునకుఁ బోయెదను. అని స్వయంప్రభ పలికెను.

ఇట్లు వానరులతోఁ బలికి స్వయంప్రభ సమస్తసంపదలచేతను సమృద్ధంబగు నాబిలంబు ప్రవేశించెను. ౧౩

అంత నవ్వానరులు తుదిలేక యంతటం గర్జించుచు భయంకరములగు కెరటములతోఁ గూడియున్నదియు భయంకరంబును వరుణుని స్థానంబునగు మహాసముద్రముం గనిరి. ౧౪

అవ్వానరులు మయునిచే మాయానిర్మితంబగు నాఋక్షబిలంబునం దిరుగుచుండునప్పుడు సుగ్రీవుం డేర్పఱచిన గడువు మాసమంతయు నతిక్రమించెను. ౧౫

అంత మహాపరాక్రమశాలులగు నవ్వానరులు చక్కఁగాఁ బుష్పించిన వృక్షములతో నొప్పునట్టి వింధ్యగిరిదక్షిణపశ్చిమదిశయందలి తిప్పపైఁ గూర్చుండి చింతింపసాగిరి. ౧౬

అంత నవ్వానరులు వసంతర్తువునందు ఫలించునట్టి మామిడిమొదలగు వృక్షములు చక్కఁగాఁ బుష్పించి పెక్కులతలచేఁ బరివేష్టితములై యొప్పుచుండుటంజూచి (వసంతర్తువునందు ఫలించువృక్షములు శిశిరర్తువునందే పుష్పించును గావున) సుగ్రీవునివలని భయంబున మిక్కిలియుఁ దల్లడిల్లిరి. ౧౭

ఆవానరులు వసంతర్తువు సమీపించినదనియు నప్పుడు శిశిరర్తువనియు నొకరితో నొకరు నిశ్చయించి తెలిసికొని సుగ్రీవుఁ డాజ్ఞాపించినట్లు సీతం గానకపోవుటయేగాక యతఁడు నియమించిన గడువునుగూడ నతిక్రమించుటంజేసి సర్వార్థంబులను నశియించుటకు భీతులై నేలంబడిరి. ౧౮

అంత సింహమునకును ఆఁబోతునకునుంబోలె భుజశిఖరములుగలవాఁడును బలిసినవియు దీర్ఘములునగు బాహువులుగలవాఁడును మహాపండితుఁడునగు యువరాజయిన యంగదుఁడు ఆవానరులలో వయోవృద్ధులును విద్యావదాచారసంపన్నులు నగువారలను మధురవాక్యంబునం బిలిచి యథాయోగ్యముగ సన్మానించి యిట్లనిపలికెను. ౧౯,౨౦

శాసనాత్కపిరాజస్య వయం సర్వే వినిర్గతాః,
మాసః పూర్ణో బిలస్థానాం హరయః కిం న బుధ్యతే. ౧౧

వయ మాశ్వయుజే మాసి కాలసంఖ్యాం వ్యవస్థితాః,
ప్రస్థితా స్సోఽపి చాతీతః కి మతః కార్య ముత్తరమ్. ౧౨

భవన్తః ప్రత్యయం ప్రాప్తా నీతిమార్గవిశారదాః,
హితే ష్వభిరతా భర్తు ర్నిసృష్టా స్సర్వకర్మసు. ౧౩

కర్మ స్వప్రతిమా స్సర్వే దిక్షు విశ్రుతపౌరుషాః,
మాం పురస్కృత్య నిర్యాతాః పిఙ్గాక్షప్రతిచోదితాః. ౧౪

ఇదానీ మకృతార్థానాం మర్తవ్యం నాత్ర సంశయః,
హరిరాజస్య సందేశ మకృత్వా కస్సుఖీ భవేత్. ౧౫

తస్మి న్నతీతే కాలే తు సుగ్రీవేణ కృతే స్వయమ్,

వానరులారా ! వానరరాజు సుగ్రీవునియాజ్ఞమీఁద మనమందఱము వచ్చినాము. మనము బిలంబుననుండినప్పుడే సుగ్రీవుఁడు నియమించిన యవధి నెలయును బూర్ణంబయ్యె. మీకుఁ దెలియలేదాయేమి? ౨౧

మనము మొదట నాశ్వయుజమాసమందే హనుమంతుని ప్రేరణంబున సుగ్రీవునిచేఁ బదునైదుదినముల గడువు నియమించి పిలువఁబడినాము; అపిమ్మట లక్ష్మణుఁడువచ్చి కోపించినందుమీఁద మరలఁ బదిదినములు గడువుఁ బెట్టి పిలువఁబడినాము; అపిమ్మట మార్గశీర్షమాసమంతయు సీతను వెదకవలసిన నట్లుగా పుష్యమాసమునందు సుగ్రీవునియొద్దఁ జేరవలసినట్లుగాను సుగ్రీవునిచే నాజ్ఞాపితులమై వచ్చినాము; ఇట్లు ఆశ్వయుజమాసము మొదలుకొని కాలము లెక్కపెట్టుచున్నాము కావున మన మిపుడు కాల మతిక్రమించుటను మఱచినా మనుటకు వీలులేదు; (లేక ఆశ్వయుజమాస మయినపిమ్మటఁ గార్తిక మాసము చివరను సుగ్రీవుఁడు మనలను మార్గశీర్షమాసంబంతయు సీతాదేవిని వెదకవలెననియుఁ బుష్యమాసమునఁ దనయొద్దకుఁ జేరవలెననియు నియమించి పంపినాఁడు ) ఆమార్గశీర్షమాసమును దానివెంబడి పుష్యమాఘ మాసంబులును అతిక్రమించినవి; ఇంకఁ జేయవలసిన కార్యమెద్ది? విచారింపుఁడు. ౨౨

మీరలు సుగ్రీవుని నమ్మకమునకుఁ బాత్రులయినవారలు; నీతిమార్గము చక్కఁగాఁ దెలిసినవారలు; స్వామియయిన సుగ్రీవుహితంబు గోరువారలు; సమస్తకార్యంబులయందును సమర్థులు. ౨౩

కార్యములు సాధించుటయందు మీకు లోకంబున సాటిలేరు; మీపరాక్రమంబు సమస్తదిశలయందును సుప్రసిద్ధము; మీరు సుగ్రీవు నాజ్ఞం జేసి నావెంబడి వచ్చినారు. ౨౪

మనము సీతనుంజూడక గడువునం దప్పుటవలన ఇఁకఁ జావవలసిన వారమే; ఇందుకు సందియములేదు; వానరరాజు సుగ్రీవునాజ్ఞ నతిక్రమించి ఎవఁడు సుఖము నొందఁగలఁడు? ౨౫

సాక్షాత్సుగ్రీవుఁడే విధించినగడువు అతిక్రమించినపుడు సమస్త

ప్రాయోపవేశనం యుక్తం సర్వేషాం చ వనౌకసామ్. ౨౭

తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవ స్స్వామిభావే వ్యవస్థితః,
న క్షమిష్యతి న స్సర్వా నపరాధకృతో గతాన్. ౨౭

అప్రవృత్తౌ చ సీతాయాః పాప మేవ కరిష్యతి,
తస్మా త్క్షమ మి హాద్యైవ ప్రాయోపవిశనం హి నః. ౨౮

త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ ధనానిచ గృహాణిచ,
ధ్రువం నో హింసితా రాజా సర్వా న్ప్రతిగతా నితః. ౨౯

వధే నాప్రతిరూపేణ శ్రేయో మృత్యు రిహైవ నః,

న చాహం యౌవరాజ్యేన సుగ్రీవే ణాభిషేచితః. 30
నరేన్ద్రే ణాభిషిక్తోఽస్మి రామే ణాక్లిష్టకర్మణా,

స పూర్వం బద్ధవైరో మాం రాజా దృష్ట్వా వ్యతిక్రమమ్.3౧
ఘాతయిష్యతి దణ్డేన తీక్ష్ణేన కృతనిశ్చయః,

కిం మే సుహృద్భి ర్వ్యసనం పశ్యద్భి ర్జీవితాన్తరే. 3౨
ఇహైవ ప్రాయ మాసిష్యే పుణ్యే సాగరరోధసి,

ఏత చ్ఛ్రుత్వా కుమారేణ యువరాజేన భాషితమ్. 33

వానరులును ఆహారాదులు వర్జించి పరుండియుండి మరణము నొందుటయే యుక్తము. ౨౭

సుగ్రీవుఁడు స్వభావంబుననే మిక్కిలియుఁ గ్రూరుఁడు; అతఁడు రాజునైయున్నాఁడు; కావున నపరాధులమగు మనము అతనియొద్దకుఁ బోయి నయెడ తప్పక శిక్షించును గాని యొకరినైనను ఎంతమాత్రము మన్నింపఁడు.

మనము గడువుదప్పి పోవుటయేగాక సీతవార్తయుం దెలియకపోవుటవలన సుగ్రీవుఁడు మనలం జంపించునేగాని యెంతమాత్రము మన్నిలపఁడు; అందువలన మన మిచటనే ప్రాయోపవేశముగావించి మరణము నొందుట యుక్తము. ౨౮

అచటికిఁ బోఁగానే సుగ్రీవు నాజ్ఞవలన మనమందఱమును గొడుకులను భార్యలను ధనములను గృహములను ఎదలి హతులము గావలసినదేగాని వేఱుగతిలేదు; ఇది నిశ్చయము. ౨౯

అచట సుగ్రీవునిచే నతిభయంకరముగా వధింపఁబడుటకన్నను మన మిచటనే ప్రాయోపవేశంబునఁ బ్రాణంబులు వదలుట మంచిది.

నాకు యౌవరాజ్యంబున సుగ్రీవుఁడు పట్టాభిషేకము సేయలేదు; ఎవ్వరికిని ఎంతమాత్రమును మనఃక్లేశముసేయనట్టి మహారాజు రాముఁడు నాకుఁ బట్టాభిషేకము గావించినాఁడు. ౩౦

సుగ్రీవుఁడు మున్నే నామీఁద వైరముపూనినవాఁడు గావున నాయం దపరాధము గన్నంతనే పూనికతోఁ దీక్ష్ణమయిన శిక్షవిధించి నన్ను వధింపఁగలఁడు. ౩౧

నేను కిష్కింధలో సుగ్రీవునిచే హతుఁడనై నామిత్రుల నందఱు నా వధముఁజూచి దుఃఖించునట్లు చేయుటవలన నాకేమి ప్రయోజనము? ఇచటనే పుణ్యంబగు సముద్రతీరంబునందు అనశనవ్రతంబు నవలంబించి ప్రాణంబులు విడిచెదను. అని యంగదుఁడు పలికెను. ౩౨

యువరాజగు కుమారుఁ డంగదుఁడు పలికిన యీవాక్యంబు విని యు

సర్వే తే వానరశ్రేష్ఠాః కరుణం వాక్య మబ్రువన్,
తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవః ప్రియాసక్తశ్చ రాఘవః. ౩౪
అదృష్టాయాం తు వైదేహ్యాం దృష్ట్వాఽస్మాంశ్చ సమాగతాన్,
రాఘవప్రియకామార్థం ఘాతయిష్య త్యసంశయమ్. ౩౫

న క్షమం చాపరాద్ధానాం గమనం స్వామిపార్శ్వతః,

ఇహైవ సీతా మన్విష్య ప్రవృత్తి ముపలభ్య వా. ౩౬
నోచే ద్గచ్ఛామ తం వీరం గమిష్యామో యమక్షయమ్,

ప్లవఙ్గమానాం తు భయార్దితానాం,
శ్రుత్వా వచ స్తార ఇదం బభాషే. ౩౭
అలం విషాదేన బిలం ప్రవిశ్య
వసామ సర్వే యది రోచతే వః,
ఇదం హి మాయావిహితం సుదుర్గమం
ప్రభూతవృక్షోదకభోజ్యపేయకమ్. ౩౮
ఇహాస్తి నో నైవ భయం పురన్దరా
న్న రాఘవా ద్వానరరాజతోఽపి వా,

శ్రుత్వాఽఙ్గద స్యాపి వచోఽనుకూల
మూచుశ్చ సర్వే హరయః ప్రతీతాః. ౩౯
యథా న హింస్యేమ తథా విధాన
మసక్త మద్యైవ విధీయతాం నః.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రిపఞ్చాశ స్సర్గః. ౫౩.

వానరోత్తము లందఱును దుఃఖంబున నిట్లనిచెప్పిరి. 33

సుగ్రీవుఁడు స్వభావంబుననే క్రూరుఁడు; రాముఁడో ప్రియురాలిపై మిక్కిలియుఁ గూర్చియున్నవాఁడు; కావున మనము సీతంజూడకయే సుగ్రీవునియొద్దకుఁ బోవుదుమేని యతఁడు రాముని సంతోషార్థమై తప్పకవధించును. ఇందుకు సందియములేదు. 34,35

ఇదియునుగాక యపరాధము గావించినవారలు రాజసమీపంబునకుఁ బోవుటయే యుక్తముకాదు.

సీతాదేవిని వెదకి యాబిసవృత్తాంతము దెలిసికొంటిమేని వీరుఁడగు నాసుగ్రీవునొద్దకుఁబోవుదము; లేనియెడ నిచట నేప్రాణంబులు విడువుదము. అని వానరులు పలికిరి. 36

అట్లు భయార్తులగు వానరోత్తములు పలికిన పలుకులువిని తారుఁడు ఇట్లని వక్కాణించెను. 37

దుఃఖింపవలదు; మీకును ఇష్టమగునేని అందఱము నీబిలంబుఁజొచ్చి యిందు వసించియుందము.

ఈబిలము మాయానిర్మితంబును ఎట్టివారికిని బ్రవేశింప నలవిగానిదియు వృక్షములును జలమును భోజ్యవస్తువులును పానద్రవ్యములును సమృద్ధముగాఁగలదియుఁ గావున నిందు మనము సుఖముగా నుండవచ్చును, ఇచట మనము దేవేంద్రునివలనఁగాని రామునివలనఁగాని సుగ్రీవునివలనఁగాని యొంతమాత్రము భయపడవలసినది లేదు. అని తారుఁడు చెప్పెను. 38

అంగదున కనుకూలముగాఁ దారుఁడుగూడఁ జెప్పుటనువిని వానరులు నమ్మకమునొందినవారలయి ఎట్లు గావించితే మనకు బాధకలుగదో ఆవిధంబున శీఘ్రముగా నేర్పాటు గావింపుఁడు. అని వచించిరి. 39

ఇది యేఁబదిమూఁడవసర్గము.

చ తుః ప ఞ్చా శ స్స ర్గః.

తథా బ్రువతి తారే తు తారాధిపతివర్చసి,
అథ మేనే హృతం రాజ్యం హనూమా నఙ్గదేన తత్. ౧

బుద్ధ్యా హ్యష్టాఙ్గయా యుక్తం చతుర్బలసమన్వితమ్,
చతుర్దశగుణం మేనే హనుమా న్వాలిన స్సుతమ్. ౨

ఆపూర్యమాణం శశ్వచ్చ తేజోబలపరాక్రమైః,
శశినం శుక్లపక్షాదౌ వర్ధమాన మివ శ్రియా. 3
బృహస్పతిసమం బుద్ధ్యా విక్రమే సదృశం పితుః,
శుశ్రూషమాణం తారస్య శక్ర స్యేవ పురన్దరమ్. ౪
భర్తు రర్థే పరిశ్రాన్తం సర్వశాస్త్రవిదాం వరమ్,
అభిసంధాతు మారేభే హనూమా నఙ్గదం తతః. ౫

స చతుర్ణా ముపాయానాం తృతీయ ముపవర్ణయన్,
భేదయామాస తాం స్సర్వా న్వానరా న్వాక్యసంపదా. ౬

తేషు సర్వేషు భిన్నేషు తతోఽభీషయ దఙ్గదమ్,
భీషణై ర్బహుభి ర్వాక్యైః కోపోపాయసమన్వితైః. ౭

త్వం సమర్థతరః పిత్రా యుద్ధే తారేయ! వై ధురమ్,
దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా. ౮

## ఏఁబదినాలుగవసర్గము.

అంత నట్లు చంద్రునకుంబోలెఁ గాంతిగలతారుఁడు పలుకుటను విని హనుమంతుఁడు ఇఁక "సుగ్రీవుని వానరరాజ్యంబునంతయు నంగదుఁడు తప్పక హరించు" నని తలంచెను ౧.

వాలిపుత్త్రుఁడగు నంగదుఁడు గ్రహణధారణాదులగుఅష్టగుణములుగల బుద్ధితోఁగూడినవాఁడనియు బాహుబలమనోబలోపాయబలబంధుబలములను చతుర్బలములుగలవాఁడనియు దేశకాలజ్ఞత మొదలగు చతుర్దశగుణములతో నొప్పుచున్నవాఁడనియు హనుమంతుఁడు దెలిసికొనెను. ౨

చంద్రుఁడు శుక్లపక్షంబునఁ గాంతిచే వర్ధిల్లునట్లు క్రమముగాఁ దేజోబలపరాక్రమంబుల వృద్ధినొందుచున్నవాఁడును బుద్ధియందు బృహస్పతితుల్యుఁడును బరాక్రమంబునఁ దనతండ్రికి సమానుఁడును ఒకానొకప్పుడు హితంబుపదేశించు శుక్రునివచనంబు వినుచున్న దేవేంద్రునియట్లు (హితముపదేశించు బృహస్పతివచనంబు వినుచున్న దేవేంద్రునియట్లు) తారునివచనంబు వినుచున్నవాఁడును సుగ్రీవునికార్యమునందే శ్రమపడియున్నవాఁడును సమస్తశాస్త్రములయందును బండితుఁడునగు నంగదుఁడు సుగ్రీవునితో భేదము నొందక యతని కనుకూలుఁడగునట్లు, హనుమంతుఁడు నీతివాక్యంబులు పలుక నారంభించెను. ౩-౫

హనుమంతుఁడు సామదానభేదదండోపాయముల మూఁడవదగు భేదోపాయంబు నవలంబించి మాటలపెంపున నవ్వానరుల నందఱ నంగదు నాశ్రయించి ఋక్షబిలంబున నివసించువిషయమయి విరోధించునట్లు గావించెను.

వానరులందఱు భేదమునొందిన తరువాత నాహనుమంతుఁడు కోపరూపమయిన యుపాయమగు దండోపాయము నవలంబించి తదనుగుణంబులగు మాటలం జెప్పి యంగదునకు భయము గలిగించెను. ౭

అంగదుఁడా! నీవు యుద్ధంబున నీతండ్రికన్న గట్టివాఁడవా? నీతండ్రియట్లు వానరరాజ్యభారంబు నంతయు దృఢముగా వహింపఁగలవు. అని తా-

నిత్య మస్థిరచిత్తా హి కపయో హరిపుఙ్గవ!,
నాజ్ఞాప్యం విషహిష్యన్తి పుత్రదారా న్వినా త్వయా. ౯

త్వాం నైతే హ్యనుయుఞ్జేయుః ప్రత్యక్షం ప్రవదామి తే,
యథాఽయం జామ్బవా న్నీల స్సుహోత్ర శ్చ మహాకపిః.
న హ్యహం త ఇమే సర్వే సామదానాదిభి ర్గుణైః,
దణ్డేన వా త్వయా శక్యా స్సుగ్రీవా దపకర్షితుమ్. ౧౧

విగృహ్యాసన మప్యాహు ర్దుర్బలేన బలీయసః,
ఆత్మరక్షాకర స్తస్మా న్న విగృహ్ణీత దుర్బలః. ౧౨

యాం చేమాం మన్యసే ధాత్రీ మేత ద్బిల మితి శ్రుతమ్,
ఏత ల్లక్ష్మణబాణానా మీషత్కార్యం విదారణే. ౧౩

స్వల్పం హి కృత మిన్ద్రేణ క్షిపతా హ్యశనిం పురా,
లక్ష్మణో నిశితై ర్బాణై ర్భిన్ద్యా త్పత్రపుటం యథా. ౧౪

లక్ష్మణస్య తు నారాచా బహవ స్సన్తి తద్విధాః,
వజ్రాశనిసమస్పర్శా గిరీణా మపి దారణాః. ౧౫

అవస్థానే యదైవ త్వ మాసిష్యసి పరన్తప!,

త్పర్యము. నీతండ్రి యెట్లు హతుఁడయ్యెనో నీవు నట్లే హతుఁడవవుదువు. అని భావము. ౮

వానరోత్తముఁడా! ఇదిగాక వానరులు ఎప్పుడును చంచలచిత్తులు; పితలు పెండ్లాము బిడ్డలను విడిచి నీయాజ్ఞకు లోఁబడి యెంతమాత్రము నుండరు. ౯

నీయెదుటఁ జెప్పెదను; ఈజాంబవంతుఁడును నీలుఁడును సుహోత్రుఁడును మున్నగు వానరులు నిన్ననువర్తించియుండరు. ౧౦

నన్నును ఈజాంబవదాదులను సామదానభేదంబులంగాని దండోపాయంబునంగాని సుగ్రీవునియొద్దనుండి నీయొద్దకు ఆకర్షించుటకు నీచే శక్యము గాదు గదా! ౧౧

ప్రబలుండగువాఁడు బలహీనుని విరోధించియుండవలెనని నీతివిదులు చెప్పుదురుగాని దుర్బలుఁడు ప్రబలునితో విరోధించియుండవచ్చుననుట నీతివిదులకు సమ్మతముగాదు; బలహీనుఁడగువాఁడు ఆత్మసంరక్షణము నే చేసికొనవలసినవాఁడు; కావున అతనికిఁ బ్రబలునితో విరోధమెంతమాత్రముతగదు.

తారుఁడుచెప్పినట్లు స్వబలంబు లేకున్నను ఈబిలము నిన్ను రక్షించునని తలంతువేమో; దీని భేదించుటయనఁగా లక్ష్మణబాణంబులకు స్వల్పకార్యము. ౧౩

మున్ను ఇంద్రుఁడు ఈబిలంబుపై వజ్రాయుధంబు ప్రయోగించి కొంచెమే గావించినాఁడు; ద్వారముమాత్రము కలుగఁజేసినాఁడుకాని మఱేమియులేదు; లక్ష్మణుఁడో ఆకుదొప్పను చీల్చినట్లుగా నీబిలంబును గఱకుటమ్ముల భేదింపఁగలఁడు. ౧౪

అట్టి యసమానమగుశక్తిగలవియు వజ్రాయుధముతోను పిడుగుతోను సమానములునగు బాణంబులు పెక్కులు లక్ష్మణునియొద్దఁగలవు; అవి పర్వతంబులనేని భేదింపఁగలవు; వానికి ఈబిలం బెంతమాత్రము? ౧౫

శత్రువులఁ దపింపఁజేయునట్టి యంగదుఁడా! నీవు సుగ్రీవునితో విరో

తత్రైవ హరయ స్సర్వే త్యక్ష్యన్తి కృతనిశ్చయాః. ౧౩

స్మరన్తః పుత్రదారాణాం నిత్యోద్విగ్నా బుభుక్షితాః,
ఖేదితా దుఃఖశయ్యాభి స్త్వాం కరిష్యన్తి పృష్ఠతః. ౧౪

స త్వం హీన స్సుహృద్భి శ్చ హితకామై శ్చ బన్ధుభిః,
తృణాదపి భృశోద్విగ్న స్స్పన్దమానా ద్భవిష్యసి. ౧౭

న చ జాతు న హింస్యు స్త్వాం ఘోరా లక్ష్మణసాయకాః,
అపవృత్తం జిఘాంసన్తో మహావేగా దురాసదాః. ౧౮

అస్మాభి స్తు గతం సార్ధం వినీతవ దుపస్థితమ్,
ఆనుపూర్వ్యా త్తు సుగ్రీవో రాజ్యే త్వాం స్థాపయిష్యతి.

ధర్మకామః పితృవ్య స్తే ప్రీతికామో దృఢవ్రతః,
శుచి స్సత్యప్రతిజ్ఞ శ్చ న త్వాం జాతు జిఘాంసతి. ౨౧

ప్రియకామ శ్చ తే మాతు స్తదర్థం చాస్య జీవితమ్,
త స్యాపత్యం చ నా స్త్యన్య స్తస్మా దఙ్గద! గమ్యతామ్. ౨౨

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుఃపఞ్చాశ స్సర్గః. ౫౪.

ధించి యీబిలంబున నుండుటకుఁ బూనినంతనే యీవానరులు అందఱు నిశ్చయించికొని నిన్నువిడిచి పోఁగలరు. ౧౬

వీరలు నీతోఁగూడ నుండుట కారంభించినవెంటనే కొడుకులను భార్యలనువదలఁచుకొని యెల్లప్పుడును దుఃఖించుచున్నవారలయి సరియయిన యాహారములేక యాఁకలిగొన్నవారలయి మృదుశయనంబులఁ బరుండువారలు కావున నిచట కఠినంపు భూమిపయిఁ బరుండఁజాలక నానావిధంబుగాఁ గష్టపడినవారలయి నిన్ను వదలిపోఁగలరు. ౧౭

అట్లు నిన్నీవానరులు వదలినపిమ్మట నీవు మిత్రులను నీ హితముగోరు బంధువులనుం బాసి మిక్కిలియు దిగులొందినవాఁడవై గాలికిందూలు గడ్డిపరకకన్నను హీనుఁడవవుదువు. ౧౮

శత్రువుల వధించునవియు భయంకరములును మహావేగంబులును సమీపింప నలవిగానివియునగు లక్ష్మణుబాణంబులు సీతాన్వేషణము సేయకుండుట మాత్రమె గాక రాజాజ్ఞనుగూడ నతిక్రమించిన నిన్నుఁ దప్పక వధించును. ౧౯

నీవు మాతోఁగూడ వచ్చి వినీతుఁడవై యెప్పటియట్ల యున్నయెడ మాత్రము సుగ్రీవుఁడు నీకుఁ దనపిమ్మటఁ గ్రమముగా వానరరాజ్యంబునకుఁ బట్టంబు కట్టఁగలఁడు. ౨౦

నీపినతండ్రి సుగ్రీవుఁడు ధార్మికుఁడు. పరులను సంతోషంబుసేయువాఁడు. దృఢవ్రతుఁడు. పాపరహితుఁడు. ప్రతిజ్ఞదప్పనివాఁడు. నిన్నొకప్పుడును ఎంతమాత్రము వధింపనొల్లఁడు. ౨౧

అంగదుఁడా! ఇంతియగాక సుగ్రీవుఁడు నీతల్లియందు మిక్కిలియుఁ గూర్చినవాఁడు; కావున నాబిడప్రియంబునే కోరుచుండును. అతని ప్రాణంబులును ఆబిడవశమే; నీవు ఆమెకుమారుఁడవు కావున నతనికిని కుమారుఁడవు గాని వేఱుగాదు. అని హనుమంతుఁడు అంగదునితోఁ బలికెను. ౨౨

ఇది యేఁబదినాలవసర్గము.

పఞ్చపఞ్చాశ స్సర్గః.

శ్రుత్వా హనుమతో వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్,
స్వామిసత్కారసంయుక్త మఙ్గదో వాక్య మబ్రవీత్. ౧
స్థైర్య మాత్మమనశ్శౌచ మానృశంస్య మథాఽర్జవమ్,
విక్రమ శ్చైవ ధైర్యంచ సుగ్రీవే నోపపద్యతే. ౨
భ్రాతు ర్జ్యేష్ఠస్య యో భార్యాం జీవతో మహిషీం ప్రియామ్,
ధర్మేణ మాతరం య స్తు స్వీకరోతి జుగుప్సితః. ౩
కథం స ధర్మం జానీతే యేన భ్రాత్రా మహాత్మనా,
యుద్ధాయాభినియుక్తేన బిలస్య పిహితం ముఖమ్. ౪

సత్యా త్పాణిగృహీత శ్చ కృతకర్మా మహాయశాః,
విస్మృతో రాఘవో యేన స కస్య తు కృతం స్మరేత్. ౫

లక్ష్మణస్య భయా ద్యేన నాధర్మభయభీరుణా,
ఆదిష్టా మార్గితుం సీతాం ధర్మ మస్మి న్కథం భవేత్. ౬

తస్మి న్పాపే కృతఘ్నే తు స్మృతిహీనే చలాత్మని,
ఆర్యః కో విశ్వసే జ్జాతు తత్కులీనో జిజీవిషుః. ౭

రాజ్యే పుత్రః ప్రతిష్ఠాప్య స్సగుణో నిర్గుణోఽపివా,

## ఏఁబదియైదవసర్గము.

అంగదుఁడు వినయసంపన్నుండును ధర్మయుక్తుండును రాజభక్తితోఁ గూడినవాఁడునగు హనుమంతుని మాటనువిని యిట్లని బదులు చెప్పెను. ౧

స్థిరచిత్తతయు నాత్మశుద్ధియుఁ జిత్తశుద్ధియు దయాళుత్వమును గపటంబులేమియుఁ బరాక్రమంబును గాంభీర్యంబును సుగ్రీవునియం దెంతమాత్రమును లేవు. ౨

తన జ్యేష్ఠభ్రాత బ్రతికియున్నపు డతని ప్రియభార్యయుఁ బట్టమహిషియు ధర్మంబునఁ దనకుఁ దల్లివంటిదియునగు తారను స్వీకరించినట్టి పాపిష్ఠుఁడును మహాత్ముఁడగు తనయన్న యుద్ధంబునకై బిలంబుఁ జొచ్చినపుడు "నీవు ఈ బిలంబువాకిటనుండి, శత్రువు దప్పించుకొని బిలంబు వెలువడనీని నిలువరింపు" మని తనను నియోగించి బిలంబుఁ జొచ్చినపిమ్మట ద్రోహబుద్ధిచే నాబిలద్వారంబు పెనుఱాతిం గప్పినట్టి ద్రోహియునగు సుగ్రీవునకు ధర్మంబెట్లు తెలియును? ౩,౪

సత్యంబు నవలంబించి మిత్రభావము నొందినవాఁడును మున్ను దనకు వాలినివధించి వానరరాజ్యం బొసంగి యుపకారంబు గావించినవాఁడును యశస్సంపన్నుఁడునగు రామునిఁగూడ ఈ సుగ్రీవుఁడు మఱచినాఁడే; ఇఁక నితఁ డెవనికిఁ గృతజ్ఞుఁడగును? ౫

సుగ్రీవుఁడు లక్ష్మణునివలని భయంబున సీతనువెదుక మనల నియోగించినాఁడేగాని యధర్మభయంబునం గాదుగదా! అట్టి వీనియందు ధర్మమెక్కడిది? ౬

అట్టి పాపిష్ఠుఁడును దనకొరకు గావించిన యుపకారమును మఱచువాఁడును వివేకహీనుఁడును జంచలచిత్తుఁడు నగు సుగ్రీవునందు అతని యింటఁ బుట్టినవానికి బ్రతుకుమీఁది యాశగలయోగ్యునకు ఎవ్వనికి నమ్మకముగలుగును? ౭

సుగ్రీవుఁడు గుణవంతుఁడైనను గుణహీనుఁడైనను దనకొడుకునకు

కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి. ౮

భిన్నమన్త్రోఽపరాద్ధశ్చ హీనశక్తిః కథం హ్యహమ్,
కిష్కిన్ధాం ప్రాప్య జీవేయ మనాథ ఇవ దుర్బలః. ౯

ఉపాంశుదణ్డేన హి మాం బన్ధనే నోపపాదయేత్,
శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్. ౧౦
బన్ధనాద్వాఽవసాదాన్మే శ్రేయః ప్రాయోపవేశనమ్,
అనుజానీత మాం సర్వే గృహం గచ్ఛన్తు వానరాః. ౧౧

అహం వః ప్రతిజానామి నాగమిష్యామ్యహం పురీమ్,
ఇహైవ ప్రాయ మాసిష్యే శ్రేయో మరణమేవ మే. ౧౨

అభివాదనపూర్వం హి రాఘవౌ బలశాలినౌ,

అభివాదనపూర్వం తు రాజా కుశల మేవ చ, ౧౩
వాచ్య స్తాతో యవీయా న్మే సుగ్రీవో వానరేశ్వరః.
ఆరోగ్యపూర్వం కుశలం వాచ్యా మాతా రుమా చ మే. ౧౪

మాతరం చైవ మే తారా మాశ్వాసయితు మర్హథ,
ప్రకృత్యా ప్రియపుత్త్రా సా సానుక్రోశా తపస్వినీ. ౧౫
వినష్ట మిహ మాం శ్రుత్వా వ్యక్తం హాస్యతి జీవితమ్,

రాజ్యంబునఁ బట్టాభిషేకము గావించును గాని, శత్రుపుత్త్రుఁడనగు నన్నెంత మాత్రము బ్రతుకనీయఁడు? ౯

నేను మొదలే యపరాధము గావించినవాఁడను, అందును సుగ్రీవునితో విరోధించి ఋక్షబిలంబున నుండవలెనని నేను గావించిన మంత్రంబును వెల్లడియయి యుండఁగాఁ బ్రభుమంత్రోత్సాహశక్తివర్జితుఁడనై యనాథునియట్లు బలహీనుఁడనై కిష్కింధకుఁబోవుదునేని నేనెట్లు జీవింపఁగలను?

వంచకుఁడును నిర్దయుఁడును ఘాతుకుఁడునగు సుగ్రీవుఁడు రాజ్యంబుకొఱకు, నన్ను రహస్యముగా నురివేయించి చంపించును. ౧౦

ఉరివేయఁబడి చచ్చుటకన్నను ప్రాయోపవేశంబున ప్రాణంబులు విడుచుట మేలుగాదే? కావున నా కనుజ్ఞయొసంగి, మీరలందఱు గృహంబునకుఁ బొండు. ౧౧

దృఢముగాఁ జెప్పెద వినుండు; నేను గిష్కింధాపురికిరాను; ఇచటనే ప్రాయోపవేశనం బుండెదను; నాకు గిష్కింధకు వచ్చుటకన్న నిచ్చట మరణము నొందుటయే మేలు. ౧౨

బలవంతులగు రామలక్ష్మణులం జూచి నామాఱుగా నమస్కరించి క్షేమంబు నడుగవలెను.

వానరేంద్రుఁడగు నాపినతండ్రి సుగ్రీవునిం జూచియు మీరు నామాఱుగా నమస్కరించి క్షేమమునే యడుగుఁడు. ౧౩

నాపినతల్లియగు రుమం జూచి యామె ఆరోగ్యమును క్షేమంబును అడుగవలెను. ౧౪

నాతల్లి తారకును యుక్తవచనంబుల నాశ్వాసనంబు గావింపుఁడు.

నాతల్లి తారం దలంచుకొన్న మిక్కిలియు దుఃఖమగుచున్నది; ఆబిడ స్వభావంబుననే నామీఁద నధికప్రీతియుఁ గనికరమును గలది; నే నిచట మృతిఁబొందుటను విని ప్రాణంబులే విడువఁగలదు, సందియములేదు. అని యంగదుఁడు హనుమంతుఁడు మున్నగు వానరులతోఁ బలికెను. ౧౫

ఏతావ దుక్త్వా వచనం వృద్ధాం స్తా నభివాద్య చ. ౧౬
వివేశ చాఙ్గదో భూమౌ రుద న్దర్భేషు దుర్మనాః,

తస్య సంవిశత స్తత్ర రుదన్తో వానరర్షభాః. ౧౭
నయనేభ్యః ప్రముముచు రుష్ణం వై వారి దుఃఖితాః,

సుగ్రీవం చైవ నిన్దన్తః ప్రశంస న్తశ్చ వాలినమ్. ౧౮
పరివా ర్యాఙ్గదం సర్వే వ్యవస న్ప్రాయ మాసితుమ్,
మతం తద్వాలిపుత్రస్య విజ్ఞాయ ప్లవగర్షభాః ౧౯
ఉపస్పృ శ్యోదకం తత్ర ప్రాఙ్ముఖా స్సముపావిశన్,
దక్షిణాగ్రేషు దర్భేషు ఉద క్తీరం సమాశ్రితాః. ౨౦
ముమూర్షవో హరిశ్రేష్ఠా ఏత త్క్షమ మితిస్మ హ,

రామస్య వనవాసం చ క్షయం దశరథస్య చ. ౨౧
జనస్థానవధం చైవ వధం చైవ జటాయుషః,
హరణం చైవ వైదేహ్యా వాలిన శ్చ వధం రణే. ౨౨
రామకోపం చ వదతాం హరీణాం భయ మాగతమ్.

స సంవిశద్భి ర్బహుభి ర్మహీధరో
మహాద్రికూట ప్రతిమైః ప్లవఙ్గమైః,
బభూవ సన్నాదితనిర్దరా న్తరో
భృశం నదద్భి ర్జలదై రివోల్బణైః. ౨౩

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చపఞ్చాశ స్సర్గః. ౫౫.

అంగదుఁడట్లింతవఱకుఁ బలికి యావృద్ధవానరులకు నమస్కారంబు గావించి, దుఃఖితుఁడై రోదనంబుసేయుచు భూమిపై దర్భలుపఱచుకొని పరుండెను. ౧౭

ఆయంగదుఁడు ప్రాయోపవేశమునవలంబించి దర్భలపైఁ బరుండుటం జూచి యచటి వానరోత్తములందఱు పరమదుఃఖితులయి కన్నులనుండి యశ్రుధారలు స్రవింప రోదనంబుగావించిరి. ౧౮

అవ్వానరవీరులు సుగ్రీవుని దూషించుచు వాలిం బ్రశంసింపుచు నంగదుఁ బరివేష్టించి యందఱును బ్రాయోపవేశంబుసేయ నిశ్చయించిరి.

వానరోత్తములు అంగదునిమతంబు నెఱింగి ఇట్లు మరణము నొందుటయే యుక్తమని యెంచి తాము ను బ్రాయోపవేశంబునం బ్రాణంబులు విడువ నుద్యుక్తులయి, యచట స్నానంబు గావించి సముద్రోత్తరతీరంబున (ఉత్తరీయంబు మోఁకుఁజుట్టుకొని) దక్షిణాగ్రంబుగా దర్భలుపఱచికొని తూర్పుమొగముగాఁ బరుండిరి. ౧౯,౨౦

రాముఁడు వనంబునకు వచ్చుటయు దశరథుఁడు మృతిఁబొందుటయు జనస్థానంబున రాముఁడు ఖరదూషణాదులవధించుటయు రావణుఁడు సీతాదేవి నపహరించుటయు, జటాయువు రావణునిచేఁ జచ్చుటయు, యుద్ధమున రామునిచే వాలి హతుఁడగుటయు, సుగ్రీవుఁడు చెప్పిన చొప్పున శరత్కాలంబున సీతాన్వేషణంబు సేయం బ్రయత్నింపమికి రాముఁడు కోపించుటయు, నంత సీతాన్వేషణార్థమయి సుగ్రీవుఁడు వానరులం బంపుటయు వారిగాఁ గడచిన దంతయు నవ్వానరులు వాకొనుచుండఁగా సంపాతియను మహాగృధ్రము వారలభక్షింప వచ్చుటంజేసి వారలకు మహాభయంబుగలిగినది.

అట్లు గొప్పపర్వత శిఖరంబు లంతటిమేనులతో నవ్వేటివానరులు అఱచుచుఁ బరుండుటయు మేఘగర్జనములచేతంబోలె నమ్మహాపర్వతము గుహాంతరంబులం దంతటను గొప్పప్రతిధ్వని గలిగెను. ౨౩

ఇది యేఁబదియైదవసర్గము.

---

## షట్పఞ్చాశస్సర్గః.

ఉపవిష్టాస్తు తే సర్వే యస్మిన్ప్రాయం గిరిస్థలే,
హరయో గృధ్రరాజశ్చ తం దేశ ముపచక్రమే. ౧
సంపాతి ర్నామ నామ్నా తు చిరంజీవీ విహఙ్గమః,
భ్రాతా జటాయుషః శ్రీమా న్ప్రఖ్యాతబలపౌరుషః. ౨
కన్దరా దభినిష్క్రమ్య స విన్ధ్యస్య మహాగిరేః,
ఉపవిష్టా న్హరీ న్దృష్ట్వా హృష్టాత్మా గిర మబ్రవీత్. ౩
విధిః కిల నరం లోకే విధానే నానువర్తతే,
యథాఽయం విహితో భక్ష్య శ్చిరా న్మహ్య ముపాగతః. ౪

పరంపరాణాం భక్షిష్యే వానరాణాం మృతం మృతమ్,
ఉవాచైవం వచః పక్షీ తా న్నిరీక్ష్య ప్లవఙ్గమాన్. ౫
తస్య తద్వచనం శ్రుత్వా భక్ష్యలుబ్ధస్య పక్షిణః,
అఙ్గదః పరమాయస్తో హనూమన్త మథాబ్రవీత్. ౬
పశ్య సీతాపదేశేన సాక్షా ద్వైవస్వతో యమః,
ఇమం దేశ మనుప్రాప్తో వానరాణాం విపత్తయే. ౭
రామస్య న కృతం కార్యం రాజ్ఞో న చ వచః కృతమ్,
హరీణా మియ మజ్ఞాతా విపత్తి స్సహ సాగతా. ౮

వైదేహ్యాః ప్రియకామేన కృతం కర్మ జటాయుషా,
గృధ్రరాజేన య త్తత్ర శ్రుతం వ స్త దశేషతః. ౯
తథా సర్వాణి భూతాని తిర్యగ్యోనిగతా న్యపి,
ప్రియం కుర్వన్తి రామస్య త్యక్త్వా ప్రాణా న్యథా వయమ్. ౧౦

## ఏఁబదియాఱవసర్గము.

ఆవ్వానరవీరులు పర్వతభాగంబున నెచటఁ బ్రాయోపవేశంబున శయ
నించిరో అచటికి సమీపంబుగా గృధ్రరాజు సంపాతియు వచ్చెను. ౧

జటాయువునకు అగ్రజుఁడును మహాబలపరాక్రమశాలియు శ్రీమంతుఁ
డును చిరంజీవియునగు సంపాతియను గృధ్రరాజు వింధ్యపర్వతము గుహనుం
డి వెడలి యచటఁ బ్రాయోపవిష్టులయియున్న వానరవీరులం జూచి సంతు
ష్టుఁడై యిట్లని పలికెను. ౨,౩

దైవము మనుష్యున కీలోకంబున వానివాని కర్మానుసారంబునందప్పక
యోగక్షేమములు గలిగించును; బహుకాలమున కిప్పుడు నాకుఁగా నీవానర
రూపమయిన తినుబండమును ఏర్పఱచి నాయొద్దకుఁ బంపినదిగదా! ౪

ఉత్తములగు నీవానరులలో నొక్కొక్కనిఁగాఁబట్టి వధించి భక్షించె
దను. అని సంపాతి యవ్వానరులంజూచి పలికెను. ౫

అట్లు సంపాతి యాహారార్థమయి యాశపడి పలికిన పలుకుల నాల
కించి యంగదుఁడు మిక్కిలియుదిగులొందిహనుమంతుంజూచియిట్లనియెను.

వానరుల మనల నందఱను సంహరించుటకై సూర్యుని పుత్త్రుఁడగు సా
క్షాద్యముఁడు ఈగృధ్రవేషమున నిచటికి వచ్చినాఁడు. ౭

రామునికార్యమునుం గావింపమైతిమి; సుగ్రీవు నాజ్ఞయు నెఱవేర్ప
మైతిమి; ఇంతలో ఈవానరుల కందఱకు ఇదివఱ కెప్పుడును దలంపని యీ
చివాశము తటాలున సంభవించినది. ౮

గృధ్రరాజగు జటాయువు సీతాదేవి ప్రియార్థమయి జనస్థానంబునఁ
గావించిన కార్యమంతయు మీరలు వినియున్నారలుగదా! ౯

అవ్విధంబున సమస్తభూతంబులును తిర్యగ్జంతువులునయితము మన
యట్లు రామునికి సంతోషంబు గలిగించుటకై ప్రాణంబులనేని పరిత్యజించు
చున్నవి. ౧౦

అన్యోన్య ముపకుర్వన్తి స్నేహకారుణ్యయన్త్రితాః,
తేన త స్యోపకారార్థం త్యజతాఽఽత్మాన మాత్మనా. ౧౧
ప్రియం కృతం హి రామస్య ధర్మజ్ఞేన జటాయుషా,
రాఘవార్థే పరిశ్రాన్తా వయం సన్త్యక్తజీవితాః. ౧౨
కాన్తారాణి ప్రపన్నాః స్మ న చ పశ్యామ మైథిలీమ్,
స సుఖీ గృధ్రరాజ స్తు రావణేన హతో రణే. ౧౩
ముక్తశ్చ సుగ్రీవభయా ద్గతశ్చ పరమాం గతిమ్,
జటాయుషో వినాశేన రాజ్ఞో దశరథస్య చ. ౧౪
హరణేన చ వైదేహ్యా స్సంశయం హరయో గతాః,
రామలక్ష్మణయో ర్వాసః అరణ్యే సహ సీతయా. ౧౫
రాఘవస్య చ బాణేన వాలిన శ్చ తథా వధః,
రామకోపా దశేషాణాం రాక్షసానాం తథా వధః. ౧౬
కైకేయ్యా వరదానేన ఇదం హి వికృతం కృతమ్.
త దసుఖ మనుకీర్తితం వచో
భువి పతితాం శ్చ సమీక్ష్య వానరాన్,
భృశచలితమతి ర్మహామతిః
కృపణ ముదాహృతవా న్స గృధ్రరాట్. ౧౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షట్పఞ్చాశ స్సర్గః. ౫౬.

సమస్తప్రాణులు స్నేహంబును గారుణ్యంబు నవలంబించి యొకొక్క కరును రామున కుపకారము సేయుచున్నారు.

ధర్మజ్ఞుఁడగు నాజటాయువు రామున కుపకారము సేయుటకై ధైర్యంబున దేహంబు విడిచెను గావున నతఁడు రామునకుఁ బ్రియంబు చేసినవాఁ డయ్యెను. ౧౧

మనము ను రామకార్యము నిమిత్తమయి యడవులకు వచ్చి పరిశ్రాంతులమయి ప్రాణంబులు విడువఁబోవుచున్నాము; సీత నేమో చూచినవారము కాము. ౧౨

రామకార్యనిమిత్తంబయి రావణునితో యుద్ధంబు గావించి నిహతుఁడై నయాగృధ్రరాజు జటాయువుమాత్రము మనవలె సుగ్రీవభయంబునఁ జిక్కుపడక పరమగతిం బొందినవాఁడై సుఖంబు నొందెను. ౧౩

జటాయువు హతుఁడగుటవలనను దశరథమహారాజు మరణంబు నొందుటవలనను రావణుఁడు సీతాదేవి నపహరించుటవలనను వానరుల కిప్పుడు ప్రాణసంశయంబు గలిగినది జటాయువు బ్రతికియున్నచో నతనివలన నే రావణుని వృత్తాంతము దెలియును. దశరథమహారాజు బ్రతికియున్నచోఁ గొంతకాలమునకైనను దనయొద్దకుఁ దోడుకొనిపోవును గావున నింతటికష్టంబురాదు. సీతాదేవిని రావణుఁ డపహరింపకున్నచో వెదకవలసినదే లేదు. ౧౪

రామలక్ష్మణులు సీతాసమేతంబుగా వనవాసము సేయుటయు రాముని బాణంబున వాలి హతుఁడగుటయు రామునిచేజనస్థానంబున సమస్తరాక్షసులును హతులగుటయు ఈకష్టమంతయు దశరథుఁడు కైకేయికి వరము లొసఁగుటచే సంభవించినది. అని యంగదుఁడు చెప్పెను. ౧౫,౧౬.

మహాధీరుఁడగు నాగృధ్రరాజు సంపాతి, యంగదుఁడు పలికిన దుఃఖకరంబులగు పలుకులు విని వానరులందఱు భూమిం బడియుండుటయుంజూచి మనంబు గలంగ దుఃఖితుఁడై యిట్లనిపలికెను. ౧౭

ఇది యేఁబదియాఱవసర్గము.

## సప్తపఞ్చాశ స్సర్గః.

తత్తు శ్రుత్వా తదా వాక్య మఙ్గదస్య ముఖోద్గతమ్,
అబ్రవీ ద్వచనం గృధ్ర స్తీక్ష్ణతుణ్డో మహాస్వనః. ౧
కోఽయం గిరా ఘోషయతి ప్రాణైః ప్రియతమస్య మే,
జటాయుషో వధం భ్రాతుః కమ్పయన్నివ మే మనః. ౨

కథ మాసీ జ్జనస్థానే యుద్ధం రాక్షసగృధ్రయోః,
నామధేయ మిదం భ్రాతు శ్చిర స్యాద్య మయా శ్రుతమ్. 3
ఇచ్ఛేయం గిరిదుర్గా చ్ఛ భవద్భి రవతారితుమ్,

యవీయసో గుణజ్ఞస్య శ్లాఘనీయస్య విక్రమైః. ౪
అతిదీర్ఘస్య కాలస్య తుష్టోఽస్మి పరికీర్తనాత్,
త దిచ్ఛేయ మహం శ్రోతుం వినాశం వానరర్షభాః!. ౫
భ్రాతు ర్జటాయుష స్తస్య జనస్థాననివాసినః,

తస్యైవ చ మమ భ్రాతు స్సఖా దశరథః కథమ్. ౬
యస్య రామః ప్రియః పుత్త్రో జ్యేష్ఠో గురుజనప్రియః,

సూర్యాంశుదగ్ధపక్షత్వా న్న శక్నో మ్యుపసర్పితుమ్. ౭
ఇచ్ఛేయం పర్వతా దస్మా దవతర్తు మరిన్దమాః!.

శోకా ద్భ్రష్టస్వర మపి శ్రుత్వా తే హరియూథపాః. ౮

## ఏఁబదియేడవసర్గము.

అంతఁ దీక్ష్ణమయిన ముక్కుగల యాసంపాతి యప్పు డంగదుఁడు పలికిన పలుకులు విని పేరెలుంగున నిట్లని చెప్పెను. ౧.

నాకుఁ బ్రాణంబులకన్నను బ్రియతముఁడగు నాతమ్ముఁడు జటాయువు హతుఁడయ్యెనని నామనస్సునకుఁ గంపనముగలుగునట్లుఘంటాఘోషముగా నెవ్వఁడో చెప్పుచున్నాఁడు; ఇతఁ డెవ్వఁడు? ౨

జనస్థానంబున జటాయువునకును రావణునకును యుద్ధం బెట్లు గలిగెను? బహుకాలమున కిపుడు నాతమ్ముని పేరు వినఁగంటిని. ౩

మీరు నన్నుఁ బర్వతశిఖరమునుండి మీ రున్నస్థలంబునకు దింపఁగోరెదను.

గుణజ్ఞుఁడును మహాపరాక్రమశాలియునగు తమ్ముని పేరు దీర్ఘకాలమునకు మీవలన వినఁగలిగినందుకు మిక్కిలియు సంతోషించితిని. ౪

వానరోత్తములారా! అట్లగుటం జేసి జనస్థానంబున నివసించియుండిన నాతమ్ముఁడు జటాయువు ఎట్లు వధింపఁబడినాఁడో ఆవివరమును వినఁగోరెదను. ౫

గురుజనులకు సంతోషముగలిగించునట్టి రాముఁడు ఎవ్వనికిఁ బ్రియుఁడగుజ్యేష్ఠకుమారుఁడో అట్టి దశరథమహారాజు నాతమ్మునకు ఎట్లు స్నేహితుఁడయ్యె? అని తాత్పర్యము. ఇందువలన "జటాయువు దశరథుని స్నేహితుఁడు" అని యంగదుఁడు సంపాతితోఁ జెప్పిన మాటలలోఁ జెప్పినట్లు తెలియవచ్చుచున్నది. ౬

శత్రువుల వధించునట్టి వానరోత్తములారా! సూర్యునికిరణములచే నా రెక్కలు దహింపఁబడినవి కావున నాకు వచ్చుటకు శక్తిలేదు. ఈకొండపయినుండి మీ రున్నస్థలమునకు దిగుటకుఁ గోరుచున్నాను. అని సంపాతి వానరులతోఁ జెప్పెను. ౭

ఆవానరవీరులు దుఃఖాతిశయంబున హీనస్వరమయినను ఆసంపాతి

శ్రద్దధు ర్నైవ తద్వాక్యం కర్మణా తస్య శఙ్కితాః,

తే ప్రాయ ముపవిష్టా స్తు దృష్ట్వా గృధ్రం ప్లవఙ్గమాః. ౯
చక్రు ర్బుద్ధిం తదా రౌద్రాం సర్వా న్నో భక్షయిష్యతి,

సర్వథా ప్రాయ మాసీనా న్యది నో భక్షయిష్యతి. ౧౦
కృతకృత్యా భవిష్యామః క్షిప్రం సిద్ధి మితో గతాః,

ఏతాం బుద్ధిం తత శ్చక్రు స్సర్వే తే వానరర్షభాః. ౧౧
అవతార్య గిరే శ్శృఙ్గా ద్గృధ్ర మాహాఙ్గద స్తదా,

బభూ వర్క్షరజా నామ వానరేన్ద్రః ప్రతాపవాన్. ౧౨
మ మార్యః పార్థివః పక్షిన్! ధార్మిక స్తస్య చాత్మజౌ,
సుగ్రీవ శ్చైవ వాలీ చ పుత్త్రా వోఘబలా వుభౌ. ౧౩
లోకే విశ్రుతకర్మాఽభూ ద్రాజా వాలీ పితా మమ,

రాజా కృత్స్నస్య జగత ఇక్ష్వాకూణాం మహారథః. ౧౪
రామో దాశరథి శ్శ్రీమా న్ప్రవిష్టో దణ్డకావనమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా. ౧౫
పితు ర్నిదేశనిరతో ధర్మ్యం పన్థాన మాశ్రితః,
తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్. ౧౬

రామస్య తు పితుర్మిత్రం జటాయు ర్నామ గృధ్రరాట్,
దదర్శ సీతాం వైదేహీం హ్రియమాణాం విహాయసా. ౧౭

వాక్యంబును విని అతఁడు భక్షించివేయునని తలఁచినవారగుటవలన దాని నెంతమాత్రము నమ్మరైరి. ౮

అవ్వానరులు ప్రాయోపవేశమునం బరుండియున్న యవ్వానరులు "ఈతఁడు మనలనందఱను భక్షించివేయును." అని యివ్విధంబునం గ్రూరమయిన తలంపుచేసిరి. ౯

మనము మరణార్థమే ప్రాయోపవేశము నవలంబించియున్నాము. ఇతఁడిప్పుడు మనలను భక్షించియే వేయునేని మనము శీఘ్రముగా నిష్టసిద్ధి నొందినవారమయి కృతార్థులమగుదుము. అని యవ్వానరులు తలఁచిరి. ౧౦

అప్పుడు అవ్వానరోత్తములందఱును ఇవ్విధంబునఁ దలంచిరి. ౧౧

అంత నంగదుఁడు పర్వతశిఖరంబునుండి సంపాతిని దింపి యిట్లని పలికెను.

పక్షీ! మహాపరాక్రమశాలియు ధార్మికుఁడునగు మాతాత ఋక్షరజుఁడను వానరరాజుండెను; అతనికి నూఱుకోట్లపురుషులబలముగల వాలియు సుగ్రీవుఁడు నను నిర్వురుకొడుకులు గలరు. ౧౨,౧౩

నా తండ్రియగు వానరేశ్వరుఁడు వాలిపరాక్రమంబున లోకంబులం బ్రసిద్ధుఁడై యుండెను.

ఇక్ష్వాకువంశపు రాజులదైన సమస్తభూమండలమునకును బ్రభుఁడును మహారథుఁడును శ్రీమంతుఁడును దశరథపుత్త్రుఁడునగు రాముఁడు తండ్రియాజ్ఞను శిరసావహించి ధర్మమార్గంబు నవలంబించి తమ్ముఁడు లక్ష్మణుని భార్యను సీతను గూడి దండకారణ్యంబునకు వచ్చెను. ౧౪,౧౫

ఆరాముఁడు జనస్థానంబున నుండునపుడు అతనిభార్యను సీతను రావణుఁడు బలాత్కారంబున నపహరించెను. ౧౬

రావణుఁడు సీత నాకాశమార్గంబున నపహరించుకొనిపోవునపుడు రామునితండ్రికిస్నేహితుఁడగు గృధ్రరాజయినజటాయువుమాత్రము చూచెను. "రామునితండ్రికిస్నేహితుఁడు" అనుటవలన జటాయువు దశరథునకు స్నేహితుఁడయిన విధము అంగదుఁడు దనకుఁ దెలియుదన్నట్లు సూచితమగుచున్నది.

రావణం విరథం కృత్వా స్థాపయిత్వా చ మైథిలీమ్,
పరిశ్రాన్త శ్చ వృద్ధ శ్చ రావణేన హతో రణే. ౧౮

ఏవం గృధ్రో హత స్తేన రావణేన బలీయసా,
సంస్కృత శ్చాపి రామేణ గత శ్చ గతి ముత్తమామ్. ౧౯
తతో మమ పితృవ్యేణ సుగ్రీవేణ మహాత్మనా,
చకార రాఘవ స్సఖ్యం సోఽవధీ త్పితరం మమ. ౨౦
మమ పిత్రా విరుద్ధో హి సుగ్రీవ స్సచివై స్సహ,
నిహత్య వాలినం రామ స్తత స్త మభిషేచయత్. ౨౧

స రాజ్యే స్థాపిత స్తేన సుగ్రీవో వానరాధిపః,
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్. ౨౨

ఏవం రామప్రయుక్తా స్తు మార్గమాణా స్తత స్తతః,
వైదేహీం నాధిగచ్ఛామో రాత్రౌ సూర్యప్రభా మివ. ౨౩
తే వయం దణ్డకారణ్యం విచిత్య సుసమాహితాః,
అజ్ఞానా త్తు ప్రవిష్టాః స్మ ధరణ్యా వివృతం బిలమ్. ౨౪

మయస్య మాయావిహితం తద్బిలంచ విచిన్వతామ్,
వ్యతీత స్తత్ర నో మాసో యో రాజ్ఞా సమయః కృతః. ౨౫

తే వయం కపిరాజస్య సర్వే వచనకారిణః,
కృతాం సంస్థా మతిక్రాన్తా భయా త్ప్రాయ ముపాస్మహే. ౨౬

క్రుద్ధే తస్మింస్తు కాకుత్స్థే సుగ్రీవే చ సలక్ష్మణే,

జటాయువు అంత యుద్ధంబున రావణుని విరథునిఁగావించి సీత నాపియుంచి తుదకు అలసినవాఁడును వృద్ధుఁడును గావున రావణునిచేతం జచ్చెను. ౧౮

జటాయువు ఇవ్విధంబున బలవంతుఁడగు రావణునిచే హతుఁడయ్యెను. అంత రామునిచే సంస్కారమునొంది ఉత్తమమయినగతిం బొందెను.

అంత రాముఁడు మహాత్ముఁడగు నాపినతండ్రి సుగ్రీవునితో సఖ్యంబు చేసి నాతండ్రి వాలిని వధించెను. ౨౦

సుగ్రీవుఁడు తనమంత్రులుం దానును నాతండ్రి వాలితో విరోధించి యుండెను గావున రాముఁడు వాలిని వధించిసుగ్రీవునకు వానరరాజ్యంబునఁ బట్టాభిషేకంబు గావించెను. ౨౧

ఆసుగ్రీవుఁడు రామునిచేవానరరాజ్యంబునఁ బట్టాభిషిక్తుఁడయి సమస్తవానరోత్తములకును రాజయియున్నాఁడు. అతనియాజ్ఞమీఁదనే మేము వచ్చినాము. ౨౨

మే మిట్లు రాముని నిమిత్తమయ్యె యద్యోస్థలంబుల నెంత వెదకినను రాత్రియందు సూర్యకాంతి యగపడనట్లు సీతాదేవి యగపడనేలేదు ౨౩

అట్లు మేము ఎంతమాత్ర మేమఱక దండకారణ్యం బంతయు వెదకి తెలియకపోవుటవలన ధర్మచారిణి యగు స్వయంప్రభయొక్క ఋక్షబిలంబను బిలమును బ్రవేశించినాము. ౨౪

మయునిచే మాయాబలనిర్మితంబగు నాబిలంబున మేము సీతను వెదకుచుండఁగా నచటనే మాకు వానరరాజు సుగ్రీవుఁడు నియమించిన యవధియయినమాసము అతిక్రమించినది. ౨౫

మేమందఱము వానరరాజు సుగ్రీవునియాజ్ఞకు లోఁబడినవారము. అతఁడు విధించిన వ్యవస్థ నతిక్రమించినవార మగుటంజేసి యతనియొద్దకుఁ బోఁజాలక భయపడి ప్రాయోపవేశము నవలంబించితిమి. ౨౬

అట్టి మహావీరుఁడగు రాముఁడును లక్ష్మణుఁడును సుగ్రీవుఁడును మా

గతానా మపి సర్వేషాం తత్ర నో నాస్తి జీవితమ్. ౨౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే సప్తపఞ్చాశ స్సర్గః. ౫౭.

## అష్టపఞ్చాశ స్సర్గః.

ఇత్యుక్తః కరుణం వాక్యం వానరై స్త్యక్తజీవితైః,
స బాష్పో వానరాన్గృధ్రః ప్రత్యువాచ మహాస్వనః. ౧
యవీయా న్మమ స భ్రాతా జటాయుర్నామ వానరాః!,
యమాఖ్యాత హతం యుద్ధే రావణేన బలీయసా. ౨
వృద్ధభావా దపక్షత్వా చ్ఛృణ్వం స్తదపి మర్షయే,
నహి మే శక్తిర ద్యాస్య భ్రాతు ర్వైరవిమోక్షణే. ౩

పురా వృత్రవధే వృత్తే పరస్పరజయైషిణౌ,
ఆదిత్య ముపయాతౌ స్వో జ్వలన్తం రశ్మిమాలినమ్. ౪

ఆవృత్యాఽఽకాశమార్గే తు జవేన స్మ గతౌ భృశమ్,
మధ్యం ప్రాప్తే దినకరే జటాయు రవసీదతి. ౫

త మహం భ్రాతరం దృష్ట్వాసూర్యరశ్మిభి రర్దితమ్,
పక్షాభ్యాం ఛాదయామాస స్నేహా త్పరమవిహ్వలః. ౬

నిర్దగ్ధపక్షః పతితో విన్ధ్యేఽహం వానరర్షభాః!,
అహ మస్మి న్వస న్భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే. ౭

విషయమును కోపమువహించినపుడు మే మచటికిఁబోయినను ఒకరమైనను ఎంతమాత్రము బ్రతుకఁజాలము అని యంగదుఁడు సంపాతితోఁ జెప్పెను.

ఇది యేఁబదియేడవసర్గము.

---

## ఏఁబదియెనిమిదవసర్గము.

ఆసంపాతి యట్లు వానరుల దుఃఖవచనంబు విని తానును దుఃఖితుఁడై కన్నీరు నించుచు మహాధ్వనితో నిట్లని చెప్పెను. ౧

వానరులారా! మీరలు యుద్ధంబున బలవంతుఁడగు రావణునిచే హతుఁడయినట్లుగాఁ జెప్పిన జటాయువు నాతమ్ముఁడు. ౨

నాతమ్ముని రావణుఁడు వధించె నన్నసమాచారమును విన్నప్పటికిని నేను ముసలివాఁడను బలహీనుఁడ నగుటవలన సహించి యుండవలసియున్నది; రావణునివధించి నాతమ్ముని పగదీర్చుటకు నాకిప్పుడు శక్తిలేదే; ఏమి సేయుదును? ౩

మున్ను వృత్రాసురవధమయినప్పు డే మన్నదమ్ముల మిర్వురము ఒండొరుల వేగాతిశయముఁ బరీక్షింపఁగోరి సహస్రకిరణములచే జ్వలించుచున్న సూర్యునిసమీపంబునకుఁ బోతిమి. ౪

మేము మండలగతులం జరించుచు నాకాశమార్గంబులఁ జాలదూర మతిక్రమించిపోతిమి; అంత సూర్యుఁడు ఆకాశమధ్యగతుఁడగుటయు జటాయువు సూర్యునివేఁడిమిని ఆయాసంబును సహింపఁజాలక వివశుఁడయ్యెను ౫

అంత నాతమ్ముఁడు జటాయువు అట్లు సూర్యకిరణంబులచేఁ బీడితుఁడగుటయు నే నదిచూచి భ్రాతృస్నేహంబునం బరవశుఁడనై నారెక్కలచే నతనికి సూర్యరశ్మి తగులకుండఁ గప్పితిని. ౬

వానరోత్తములారా! నేను రెక్కలుకాలి యీవింధ్యపర్వతంబునం బడితిని; నే నిచటనే వాసముసేయుచుంటినిగాని నాతమ్ముని సమాచారమే నాకుఁ దెలిసినదికాదు, అని సంపాతి వానరులతోఁ జెప్పెను. ౭

జటాయుష స్తేవ ముక్తో భ్రాత్రా సంపాతినా తదా,
యువరాజో మహాప్రాజ్ఞః ప్రత్యువాచాఙ్గద స్తతః. ౮

జటాయుషో యది భ్రాతా శ్రుతం తే గదితం మయా,
ఆఖ్యాహి యది జానాసి నిలయం తస్య రక్షసః. ౯
అదీర్ఘదర్శినం తం వై రావణం రాక్షసాధిపమ్,
అన్తికే యది వా దూరే యది జానాసి శంస నః. ౧౦

తతోఽబ్రవీ న్మహాతేజా జ్యేష్ఠో భ్రాతా జటాయుషః,
ఆత్మానురూపం వచనం వానరాం త్సంప్రహర్షయన్. ౧౧
నిర్దగ్ధపక్షో గృధ్రోఽహం హీనవీర్యః ప్లవఙ్గమాః!,
వాఙ్మాత్రేణ తు రామస్య కరిష్యే సాహ్య ముత్తమమ్. ౧౨

జానామి వారుణా ల్లోకా న్విష్ణో స్త్రైవిక్రమా నపి,
మహాసురవిమర్దాన్వా హ్యమృతస్య చ మన్థనమ్. ౧౩

రామస్య యదిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా,
జరయా చ హృతం తేజః ప్రాణాశ్చ శిథిలా మమ. ౧౪

తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా,
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా. ౧౫
క్రోశన్తీ రామరామేతి లక్ష్మణేతి చ భామినీ,
భూషణా న్యపవిధ్యన్తీ గాత్రాణి చ విధూన్వతీ. ౧౬

మహాపండితుఁడగు యువరాజయిన యంగదుఁడు జటాయువుయొక్క అన్న సంపాతి చెప్పినమాటను విని అప్పుడతనింజూచి యిట్లని బదులు పలికెను. ౮

నీవు చెప్పినదంతయు నేను వింటిని; నీవు మాజటాయువునకు అన్నవయితే నీకుఁ దెలిసినయెడ ఆ రావణుఁ డెచ్చట నుండువాఁడో చెప్పుము. ౯

తానుజేయు కార్యమువలన రాఁబోవు ననర్థముఁదెలియని మూర్ఖుఁడు రాక్షసరాజు రావణుఁడు నివసించుస్థలము సమీపమో దూరమో నీకుఁ దెలిసినయెడ మాకుఁ జెప్పుము. అని యంగదుఁడు సంపాతితోఁ జెప్పెను. ౧౦

అంత మహాపరాక్రమశాలియగు జటాయువుయొక్క అన్న సంపాతి వానరులు సంతోషము నొందునట్లు తన కనురూపంబుగా నిట్లని వచించెను.

వానరులారా! నేను గద్దను; అందును రెక్కలుగాలినవాఁడను; వీర్యహీనుఁడను; నేనేమి గావింపఁగలను? అయినను రామునకు మాటమాత్రమునైనను సాహ్యమయినంతవఱకు సాహాయ్యము గావించెదను. ౧౨

నేను వరుణునివైన అతలాదిలోకములను త్రివిక్రమావతారమపుడు విష్ణువు అడుగులుంచిన యూర్ధ్వలోకంబులను దేవాసురయుద్ధంబులను అమృతమథనంబును జూచియున్నాను. ౧౩

రాముని కార్యము ననఁగా నేను మీయందఱికన్న ముందు చేయవలసినవాఁడను; అయితే ముసలివాఁడ నగుటంజేసి నాపరాక్రమంబు క్షీణించుటయ కాక దేహసంధిబంధములును శిథిలములయినవి; కావున మాటచేమాత్రము సాహాయ్యము గావించెదను. ౧౪

రూపసంపన్నయు సమస్తాభరణభూషితయువగు నొకానొకయువతిని దురాత్ముఁడగు రావణుఁడు దీసికొని పోవుచుండఁగాఁజూచితిని. ౧౫

ఆస్త్రీ రామరామా యనియు లక్ష్మణా యనియు నాక్రోశించుచు నాభరణంబులందీసి పాఱవేయుచు రావణుని చంకనుండి విడివడుటకై యవయవంబుల విదిర్చుచు నుండఁగంటిని. ౧౬

సూర్యప్రభేవ శైలాగ్రే తస్యాః కౌశేయ ముత్తమమ్,
అసితే రాక్షసే భాతి యథా వా తటి దమ్బుదే. ౧౬

తాం తు సీతా మహం మన్యే రామస్య పరికీర్తనాత్,
శ్రూయతాం మే కథయతో నిలయం తస్య రక్షసః. ౧౭
పుత్రో విశ్రవస స్సాక్షా ద్భ్రాతా వైశ్రవణస్య చ,
అధ్యాస్తే నగరీం లఙ్కాం రావణో నామ రాక్షసః. ౧౮
ఇతో ద్వీప స్సముద్రస్య సంపూర్ణే శతయోజనే,
తస్మిన్ లఙ్కాపురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా. ౨౦

జామ్బూనదమయై ర్ద్వారై శ్చిత్రైః కాఞ్చనవేదికైః,
ప్రాకారేణార్కవర్ణేన మహతా సుసమావృతా. ౨౧

తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ,
రావణాన్తఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా. ౨౨

జనక స్యాత్మజాం రాజ్ఞ స్తత్ర ద్రక్ష్యథ మైథిలీమ్,

లఙ్కాయా మథ గుప్తాయాం సాగరేణ సమన్తతః. ౨౩
సంప్రాప్య సాగర స్యాన్తం సంపూర్ణం శతయోజనమ్,
ఆసాద్య దక్షిణం తీరం తతో ద్రక్ష్యథ రావణమ్. ౨౪
తత్రైవ త్వరితాః క్షిప్రం విక్రమధ్వం ప్లవఙ్గమాః!,
జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగమిష్యథ. ౨౫

ఆద్యః పన్థాః కులిఙ్గానాం యే చాన్యే ధాన్యజీవినః,

పర్వతశిఖరంబుపైసూర్యకాంతి ప్రసరించినట్లును మేఘమునందు మెఱపువెలుఁగునట్లును నల్లనిరాక్షసునందు ఆబిడయొక్కయుత్తమమయిన పట్టు వస్త్రము ప్రకాశించెను. ౧౭

రామునిపేరు గీర్తించుటవలన ఆస్త్రీయే సీతయని తలంచెదను. ఇఁక నారావణుఁడుండుస్థలమును జెప్పెద వినుఁడు. ౧౮

ఆరావణుఁడను రాక్షసుఁడు సాక్షాత్ విశ్రవసునికొడుకు. కుబేరుని తమ్ముఁడు. అతఁడు లంకయను నగరియందు నివసించియుండును. ౧౯

లంకాపురి ఇచటనుండి నూఱుయోజనంబులదూరంబున సముద్రంబున నొకానొకద్వీపంబునం దున్నది సుందరమయిన ఆలంకాపట్టణమును రమణీయముగా విశ్వకర్మ నిర్మించెను. ౨౦

ఆలంకాపురి బంగారుతిన్నెలుగలిగి సుందరములయిన బంగారుద్వారంబులతోను సూర్యప్రకాశంబగు గొప్పప్రాకారముతోను ఎంతయు నొప్పుచుండును. ౨౧

ఆ లంకాపురంబున రావణుని యంతఃపురంబున సీతాదేవి మున్నుగట్టిన పట్టుపుట్టంబుతోఁ గావలియున్న రాక్షసస్త్రీలచే రక్షితయయి పరమదుఃఖితయయి యున్నది. ౨౨

జనకమహారాజు కూఁతురయిన యాసీతాదేవిని మీర లాలంకాపురంబునఁ జూడఁగలరు.

మీరలు ఇఁక సరిగా నూఱుయోజనంబులదూరముగల యాసముద్రంబు దాఁటి దక్షిణతీరంబుఁజేరి యంత జుట్టును సముద్రముచే సురక్షితమయిన యాలంకాపురంబుఁ బ్రవేశింతురేని యచట రావణునిఁ జూడఁగలరు.

వానరులారా! మీరలు శీఘ్రముగా నాలంకాపురమునకేపొండు; మీరలు లంకాపురింజేరి సుఖముగా సీతం జూచి మరలి రాఁగలరని నేను దివ్యజ్ఞానంబునం గంటిని. ౨౪

పిచ్చుకలును మఱియు ధాన్యములచే జీవించునట్టి యితరపక్షులును

ద్వితీయో బలిభోజానాం యే చ వృక్షఫలాశినః ౨౬

భాసా స్తృతీయం గచ్ఛన్తి క్రౌఞ్చాశ్చ కురరై స్సహ,
శ్యేనా శ్చతుర్థం గచ్ఛన్తి గృధ్రా గచ్ఛన్తి పఞ్చమమ్. ౨౭

బలవీర్యోపపన్నానాం రూపయౌవనశాలినామ్,
షష్ఠస్తు పన్థా హంసానాం వైనతేయగతిః పరా. ౨౮

వైనతేయాచ్చ నో జన్మ సర్వేషాం వానరర్షభాః!,

ఇహస్థోఽహం ప్రపశ్యామి రావణం జానకీం తథా. ౨౯
అస్మాక మపి సౌపర్ణం దివ్యం చక్షు ర్బలం తథా,
తస్మా దాహారవీర్యేణ నిసర్గేణ చ వానరాః. ౩౦
ఆయోజనశతా త్సాగ్రా ద్వయం పశ్యామ నిత్యశః,

అస్మాకం విహితా వృత్తి ర్నిసర్గేణ చ దూరతః. ౩౧
విహితా పాదమూలే తు వృత్తి శ్చరణయోధినామ్,

గర్హితం తు కృతం కర్మ యేన స్మ పిశితాశినా. ౩౨
ప్రతికార్యం చ మే తస్య వైరం భ్రాతుః కృతం భవేత్,

ఉపాయో దృశ్యతాం కశ్చి ల్లఙ్ఘనే లవణామ్భసః. ౩౩
అభిగమ్య తు వైదేహీం సమృద్ధార్థా గమిష్యథ,

భూమికిసమీపంబుగా ఆకాశంబున మొదటిమార్గంబున సంచరించును; కాకులును ఫలములందిని జీవించునవియు ఆపైదైన రెండవమార్గంబునం జరించును.

నీరుకాకులును క్రౌంచంబులును లకుముకులును (గోరువంకలును) అంతకుఁబయిగా మూఁడవమార్గమునసంచరించును; డేగలు దానికిఁబైనాలుగవమార్గంబునం దిరుగును; గద్దలు అయిదవమార్గంబునం జరించును. 28

బలపరాక్రమంబులతోఁ గూడినవియు రూపయౌవనసంపన్నంబులు నగుహంసలు అంతకుఁబైగా నాఱవమార్గంబునం దిరుగును; వినతాపుత్త్రులకు అరుణగరుడులవంశమునం బుట్టినవి అంతకన్నను ఊర్ధ్వమైన సప్తమమార్గంబునం జరించును. 29

వానరోత్తములారా! నేనును నాకులంబునం బుట్టినవారును వినతాపుత్త్రుఁడగు నరుణునివలనం బుట్టినవారము; కావున మాకందఱకును సప్తమమార్గము.

నేనిచటనుండియే రావణుని సీతనుఁ జక్కఁగాఁ జూచుచున్నాను. ఎట్లనఁగా మాకు గరుడునకుంబోలె దివ్యదృష్టియు మహాబలంబును గలవు. 29

వానరులారా! అట్లగుటంజేసి ఆహారబలంబునను స్వభావ నిబంధనమయిన శక్తివిశేషమువలనను మాకు ఎప్పుడును సముగ్రముగా నూఱుయోజనములదూరమువఱకు దృష్టిగలదు. 30

దైవముచే కోళ్లకు పాదమూలమునందే భక్ష్యగ్రహణము విహితమయినట్లు మాకు బహుదూరప్రదేశమునందు ఆహారము గ్రహించునట్లు విహితమయినది. 31

సీత నపహరించి నిందితకర్మముగావించిన దురాత్ముఁడగు రావణుని మీరు గనుంగొని యతని రామునిచే వధింపింపుటవలన నేను నాతమ్ముని నిమిత్తమయి యారావణునకుఁ జేయవలసిన ప్రతిక్రియయుఁ జేసినట్లగును. 32

సముద్రము దాఁటుటకు ఉపాయ మేమైనను జూడుఁడు; మీరు సీతం జూచి యిష్టార్థసిద్ధి నొందినవారలై సుఖముగాఁ గిష్కింధఁ జేరఁగలరు 33

సముద్రం నేతు మిచ్ఛామి భవద్భి ర్వరుణాలయమ్. 3౪
ప్రదాస్యా మ్యుదకం భ్రాతు స్స్వర్గతస్య మహాత్మనః,

తతో నీత్వాతు తం దేశం తీరం నదనదీపతేః. 3౫
నిర్దగ్ధపక్షం సంపాతిం వానరా స్సుమహౌజసః,
పునః ప్రత్యానయిత్వా చ తం దేశం పతగేశ్వరమ్. 3౬
బభూవు ర్వానరా హృష్టాః ప్రవృత్తి ముపలభ్య తే.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డేఽష్టపఞ్చాశ స్సర్గః. ౫౮.

ఏ కో న ష ష్టి త మ స్స ర్గః.

తత స్త దమృతాస్వాదం గృధ్రరాజేన భాషితమ్,
నిశమ్య ముదితా హృష్టా స్తే వచః ప్లవగర్షభాః!. ౧
జామ్బవా న్వానరశ్రేష్ఠ స్సహ సర్వైః ప్లవఙ్గమైః,
భూతలా త్సహ సోత్థాయ గృధ్రరాజ మ థాబ్రవీత్. ౨
క్వ సీతా కేన వా దృష్టా కో వా హరతి మైథిలీమ్,
త దాఖ్యాతు భవాం త్సర్వం గతి ర్భవ వనౌకసామ్. ౩

కో దాశరథిబాణానాం వజ్రవేగనిపాతినామ్,
స్వయం లక్ష్మణముక్తానాం నచిన్తయతి విక్రమమ్. ౪

స హరీ న్ప్రీతిసంయుక్తాం త్సీతాశ్రుతిసమాహితాన్,
పున రాశ్వాసయ న్ప్రీత ఇదం వచన మబ్రవీత్. ౫

శ్రూయతా మిహ వై దేహ్యా యథా మే హరణం శ్రుతమ్,

స్వర్గముఁజేరిన మహాత్ముఁడగు తమ్ముఁడు జటాయువునకు జలతర్పణము గావించెదను. అందుకు మీరు నన్ను సముద్రము నొద్దకుఁ దీసికొని పోఁగో రెదను. అని సంపాతి వానరులతోఁ బలికెను. ౩౪

అంత మహాపరాక్రమశాలులగు నవ్వానరులు ఱెక్కలు కాలినవగుటవలన నశక్తుఁడగు పక్షిరాజును సంపాతిని సముద్రతీరంబుఁజేర్చి యచట నతఁడు తమ్మున కుదకదానంబు గావించినపిదప మరల నెప్పటిస్థలంబునకుఁ దీసికొనిపోయి సీతయొక్కయు రావణునియొక్కయు సమాచారమును విన్నవారలగుటంజేసి సంతోషంబునం బొందలిరి. ౩౫,౩౬

ఇది యేఁబదియెనిమిదవసర్గము.

---

## ఏఁబదితొమ్మిదవసర్గము.

అంత నవ్వానరులు ఆసంపాతిచెప్పిన యమృతంబువంటిమాటనువిని మేనం బులకలుపొడమఁ బరమసంతుష్టులయిరి. ౧

అంత వానరోత్తముఁడగు జాంబవంతుఁడు సమస్తవానరులతోఁగూడ భూమిపయినుండిలేచి సంపాతింజూచి యిట్లని యడిగెను. ౨

సీత యెక్కడ నున్నది? సీత నెవ్వఁ డపహరించుకొనిపోఁగా నెవ్వఁడు జూచెను? నీవు ఈవివరమంతయుఁ దెలియఁజెప్పుము. వానరులకు నీవె గతివి. ౩

వజ్రసమానంబులగు రాముని బాణముల వాడిమిని సాక్షాల్లక్ష్మణుఁడు ప్రయోగించుబాణంబుల తీక్ష్ణతయు నెవ్వఁడు మనంబునం దలఁపకున్నాఁడు? అని జాంబవంతుఁడు సంపాతి నడిగెను. ౪

వానరులు సీతావృత్తాంతము వినుటయందు ఏకాగ్రులై సంతుష్టులై యడుగుటనుజూచి సంపాతి సంతుష్టుఁడై మరల వారల నాశ్వాసించుటకై యిట్లని పలికెను. ౫

సీతను రావణుఁడు హరించుటను నేను విన్నవిధంబును ఎవ్వఁడు

యేన చాపి మహాఽఽఖ్యాతం యత్ర సాఽఽయతలోచనా.

అహ మస్మి న్గిరా దుర్గే బహుయోజన మాయతే,
చిరా న్నిపతితో వృద్ధః క్షీణప్రాణపరాక్రమః. ౭

తం మా మేవంగతం పుత్ర స్సుపార్శ్వో నామ నామతః,
ఆహారేణ యథా కాలం బిభ ర్తి పతతాం వరః. ౮

తీక్ష్ణకామా స్తు గన్ధర్వా స్తీక్ష్ణకోపా భుజఙ్గమాః,
మృగాణాం తు భయం తీక్ష్ణం తత స్తీక్ష్ణక్షుధా వయమ్. ౯
స కదాచి త్క్షుధా ర్తస్య మ మాహారాభి కాఙ్క్షిణః,
గతసూర్యేఽహాని ప్రాప్తో మమ పుత్త్రో హ్యనామిషః. ౧౦

స మయా వృద్ధభావాచ్చ కోపాచ్చ పరిభ ర్త్సితః,
క్షుత్పిపాసాపరీతేన కుమారగ పతతాం వరః ౧౧
స మా మాహారసంరోధా త్పీడితం ప్రీతివర్ధనః,
అనుమాన్య యథాత త్త్వ మిదం వచన మబ్రవీత్. ౧౨

అహం తాత! యథా కాల మామిషార్థీ ఖ మాప్లుతః,
మహేన్ద్రస్య గిరే ర్ద్వార మావృత్య చ సమాస్థితః. ౧౩

తత స్స త్త్వసహస్రాణాం సాగరా న్తరచారిణామ్,
పన్థాన మేకోఽధ్యవసం సన్నిరోద్ధు మవాఙ్ముఖః ౧౪
తత్ర కశ్చి న్మయా దృష్ట స్సూర్యోదయసమ ప్రభామ్,
స్త్రియ మాదాయ గచ్ఛ న్నైవ భిన్నాఞ్జనచయప్రభః. ౧౫

నాకుఁ జెప్పినదియు సీతాదేవి యిపు డెచటనున్నదియు అంతయు నిపుడు చెప్పెద వినుండు. ౬

నేను బహుయోజనములవైశాల్యముగల దుర్గమంబగు నీపర్వతంబునం బడి యిచటనే బహుకాలముగా బలపరాక్రమహీనుఁడనై యుండి వృద్ధుండ నైతిని. ౭

నే నిట్టియవస్థనొందుటవలన పక్షిశ్రేష్ఠుఁడగు నాకొడుకు సుపార్శ్వుఁడనువాఁడు నాకుఁ గాలంబుదప్పక ఆహారంబుఁ దెచ్చియిచ్చి పోషణము సేయుచుండును. ౮

గంధర్వులకుఁ గామ మధికము. సర్పములకుఁ గోప మధికము. మృగములకు భయ మధికము. మాకో ఆఁకలి యధికము. ౯

నాకొడుకు సుపార్శ్వుఁడు ఒకప్పుడు నేను మిక్కిలి యాఁకలిచేఁ బరితపించుచు నాహారమునకై కాచియుండఁగా సూర్యుఁడ స్తమించినవెనుక మాంసము లేకయె వట్టిచేతులతో నాయొద్దకువచ్చెను. ౧౦

నేను ఆఁకలిచేతను దప్పిచేతను బీడితుఁడను ముసలివాఁడ నగుటవలనఁ గుపితుఁడనై పక్షిశ్రేష్ఠుఁడువగు నాకుమారునిఁ గసరితిని. ౧౧

నాకు ఎప్పుడును సంతోషము గలిగించునట్టి యాసుపార్శ్వుఁడును ఆహారంబులేమిచేఁ గుపితుఁడనగు నన్ను ఆశ్వాసించి యథార్థముగా జరగినసంగతిం జెప్పెను. ౧౨

నాయనా! నేను ఎప్పుడును బోవునట్లు యుక్తకాలంబున మాంసమునకై యాకాశంబున నెగసిపోయి మహేంద్రపర్వతద్వారము నాక్రమించి యుంటిని. ౧౩

అచట సముద్రంబుననుండు జంతుసహస్రంబులఁ బట్టుటకై నేనుదల వంచి వానిమార్గమున కడ్డముగా నిలిచితిని. ౧౪

అచట కాటుకరాశివలె నల్లనిమేనుగల యొకానొకఁడు సూర్యోదయమువలె భాసమానయగు నొకానొకవనితం దీసికొనిపోవుటను జూచినాను.

సోఽహ మభ్యవహారార్థీ తౌ దృష్ట్వా కృతనిశ్చయః,
తేన సామ్నా వినీతేన పన్థాన మభియాచితః. ౧౬

నహి సామోపపన్నానాం ప్రహర్తా విద్యతే క్వచిత్,
నీచే ష్వపి జనః కశ్చి త్కి మఙ్గ! బత మద్విధః. ౧౭
స యాత స్తేజసా వ్యోమ సంక్షిప న్నివ వేగతః,
అథాహం ఖేచరై ర్భూతై రభిగమ్య సభాజితః. ౧౮

దిష్ట్యా జీవసి తా తేతి హ్యబ్రువ న్మాం మహర్షయః,
కథంచి త్సకళత్రోఽసౌ గత స్తే స్వ స్త్యసంశయమ్. ౧౯

ఏవ ముక్త స్తతోఽహం తై స్సిద్ధైః పరమశోభనైః,
సచ మే రావణో రాజా రక్షసాం ప్రతివేదితః. ౨౦
హర న్దాశరథే ర్భార్యాం రామస్య జనకాత్మజామ్,
భ్రష్టాభరణకౌశేయాం శోకవేగపరాజితామ్. ౨౧
రామలక్ష్మణయో ర్నామ క్రోశ న్తీం ముక్తమూర్ధజామ్,

ఏష కాలాత్యయ స్తావ దితి కాలవిదాం వరః. ౨౨
ఏత మర్థంసమగ్రం మే సుపార్శ్వః ప్రత్యవేదయత్,
తచ్ఛ్రుత్వాఽపి హి మే బుద్ధి ర్నాసీత్కాచి త్పరాక్రమే. ౨౩
అపక్షో హి కథం పక్షీ కర్మ కించి దుపక్రమే,

యత్తు శక్యం మయా కర్తుం వాగ్బుద్ధిగుణవర్తినా. ౨౪
శ్రూయతాం త త్ప్రవక్ష్యామి భవతాం పౌరుషాశ్రయమ్,

నే నాహారముఁ గోరినవాఁడను గావున నా స్త్రీపురుషులంజూచి వారి నే యాహారముగా గ్రహింప నిశ్చయించితిని. ఇంతలో నాపురుషుఁడు వినయంబున సామవచనంబుతో నన్ను "మార్గంబువిడువు" మని యాచించెను.

వినయసంపన్నులను ఎవ్వరు ప్రహరింతురు? నీచులుగూడఁ బ్రహరింపరే; ఇఁక నాయట్టివాఁడు ప్రహరింపఁడని చెప్ప నేల? ౧౭

అమ్మహాపురుషుఁడు తేజోవిశేషంబున నాకాశంబు భేదించువాఁడువలె వేగంబునంబోయెను. అంత నాకాశచరంబులగు భూతంబులు నాయొద్దకు వచ్చి నన్ను గౌరవించినవి. ౧౮

నాయనా! నీవు దైవవశంబునఁ దప్పించుకొని బ్రతికితివి. ఎట్లో యాతఁడు స్త్రీసహితుఁడై నిన్ను వదలిపోయినాఁడు. నీకు మంచిగలిగినది. సందేహములేదు. అని మహర్షులు నాతోఁ బల్కిరి. ౧౯

అంత మహానుభావులగు నాసిద్ధులు నాతో నివ్విధంబునం బలికిరి.

ఆపురుషుఁడు రాక్షసరాజైన రావణుఁడనియు నేలంబడుచున్న యాభరణంబులతోను జాతినపట్టుపుట్టంబుతోను వికసినవెండ్రుకలతోనుబరమదుఃఖితురాలయి రామలక్ష్మణులం బేర్కొనుచున్నయా స్త్రీ రామభార్యయగు సీతాదేవియనియు నతఁ డాబిడను హరించుకొనిపోవుచున్నాఁడనియు నాకుఁ బిమ్మటఁ దెలిసినది. ౨౦,౨౧

రావణునివలన ఇంతప్రాప్త యినది. అని యీసమాచారమంతయు కాలముఁ దెలిసినవారిలో నుత్తముఁడగు సుపార్శ్వుఁడు నాకుఁ జెప్పెను. ౨౨

ఆసమాచారము విన్నప్పటికిని నేను గొంచెమైనను రామునినిమిత్తమయి పరాక్రమము నేయుటకులేకపోయెను; నేను ఱెక్కలుపోయినపక్షినే; ఏకార్యము నేని నేనెట్లు సేయఁగలను? ౨౩

నాకు వాక్కును బుద్ధియుఁ జక్కగా నున్నవి కావున నేను వానిచే నెంతమాత్రము సాహాయ్యముచేయఁగలనో అదిచెప్పెద. విని మీ పరాక్రమబలంబున సాధింపుఁడు. ౨౪

వాఙ్మతిభ్యాం తు సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః. ౨౫
యద్ధి దాశరథేః కార్యం మమ త న్నాత్ర సంశయః,

తే భవన్తో మతిశ్రేష్ఠా బలవన్తో మనస్వినః. ౨౬
ప్రేషితాః కపిరాజేన దేవై రపి దురాసదాః,
రామలక్ష్మణబాణాశ్చ నిశితాః కఙ్కపత్రిణః. ౨౭
త్రయాణా మపి లోకానాం పర్యాప్తా స్త్రాణనిగ్రహే,
కామం ఖలు దశగ్రీవ స్తేజోబలసమన్వితః. ౨౮
భవతాం తు సమర్థానాం న కించి దపి దుష్కరమ్,
త దలం కాలసఙ్గేన క్రియతాం బుద్ధినిశ్చయః. ౨౯
న హి కర్మసు సజ్జన్తే బుద్ధిమన్తో భవద్విధాః.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకోనషష్టితమ స్సర్గః. ౫౯.

---

## ష ష్టి త మ స్స ర్గః.

తతః కృతోదకం స్నాతం తం గృధ్రం హరియూథపాః,
ఉపవిష్టా గిరౌ దుర్గే పరివార్య సమన్తతః. ౧

త మఙ్గద ముపాసీనం తైః సర్వై ర్హరిభి ర్వృతమ్,
జనితప్రత్యయో హర్షాత్సంపాతిః పున రబ్రవీత్. ౨
కృత్వా నిశ్శబ్ద మేకాగ్రాశ్శృణ్వన్తు హరయో! మమ,
త త్త్వం సంకీర్తయిష్యామి యథా జానామి మైథిలీమ్. ౩

అస్య విన్ధ్యస్య శిఖరే పతితోఽస్మి పురా వనే,
సూర్యాతపపరీతాఙ్గో నిర్దగ్ధ స్సూర్యరశ్మిభిః. ౪

నేను మాటచేతను బుద్ధిచేతను మీకందఱకు సాహాయ్యము గావించె దను. రామునికార్యము నాకార్యమేగాని వేఱుగాదు. ఇందు సంశయము లేదు. ౨౫

వానరరాజు సుగ్రీవుఁడు బుద్ధిమంతులరు బలవంతులరు గొప్పమనస్సుగలవారలగు మిమ్ముఁ బంపినాఁడే వ్యర్థుఁగ బంపినవాఁడుకాఁడు. ౨౬

తీక్ష్ణంబులును కంకపత్త్రంబులు గట్టినవియునగు రామలక్ష్మణుల బాణంబులే ముల్లోకంబుల రక్షింపను శిక్షింపనుం జాలియున్నవి. ౨౭

రావణుఁడే మోబలపరాక్రమముల నధికుఁడనుటవాస్తవమే; అయినను మీరు సమర్థులరు గావున మీ కసాధ్యము కొంచెమయినను లేదు. ౨౮

అందువలన ఆలస్యము సేయవలదు; బుద్ధిమంతులరగు మీయట్టివారలు కార్యములువచ్చినపుడు ఎంతమాత్రము జాగుసేయుదురా? అని సంపాతి వానరులతోఁ జెప్పెను. ౨౯

ఇది యేఁబదితొమ్మిదవసర్గము.

---

## అఱువదియవసర్గము.

అంత సంపాతి తమ్మునకు జటాయువునకు నుదకదానంబు గావించి స్నానంబుచేసిన పిమ్మట వానరవీరులు అప్పర్వతంబునందు అతనిం బరివేష్టించి కూర్చుండిరి. ౧

సమస్తవానరులును బరివేష్టింపఁ దనసమీపంబునఁ గూర్చుండిన యంగదుంజూచి సంపాతి వానరులు మఱిమఱి తనమాటను శ్రద్ధతో వినుటకు సంతుష్టుఁడై మరల నిట్లని పలికెను. ౨

వానరులందఱు సద్దుసేయక విందురుగాక; నాకు సీతాదేవి వృత్తాంతమును దెలిసికొన్నవిధమును యథార్థముగాఁ జెప్పెదను. ౩

నేను మున్ను సూర్యునియొండచేఁ బరితప్తుఁడనై సూర్యకిరణంబుల దహింపఁబడినవాఁడనై ఈ వింధ్యశిఖరంబున నరణ్యమునఁ బడితిని. ౪

లబ్ధసంజ్ఞ స్తు షడ్రాత్రా ద్విహళో విహ్వాల న్నివ,
వీక్షమాణో దిశ స్సర్వా నాభిజానామి కించన. ౫

తత స్తు సాగరాన్ శైలా న్నదీ స్సర్వా స్సరాంసిచ,
వనా న్యుదధివేలాంచ సమీక్ష్య మతి రాగమత్. ౬

హృష్టపక్షిగణాకీర్ణః కన్దరా న్తరకూటవాన్,
దక్షిణ స్యోదధే స్తీరే విన్ధ్యోఽయ మితి నిశ్చితః. ౭

ఆసీ చ్చాత్రాఽశ్రమం పుణ్యం సురై రపి సుపూజితమ్,
ఋషి ర్నిశాకరో నామ యస్మి న్నుగ్రతపా భవత్. ౮

అష్టౌ వర్ష సహస్రాణి తే నాస్మి న్నృషిణా వినా,
వసతో మమ ధర్మజ్ఞా! స్స్వర్గతే తు నిశాకరే. ౯

అవతీర్య తు విన్ధ్యాగ్రా త్కృచ్ఛ్రేణ విషమా చ్ఛనైః,
తీక్ష్ణదర్భాం వసుమతీం దుఃఖేన పున రాగతః. ౧౦

త మృషిం ద్రష్టుకామోఽస్మి దుఃఖే నాభ్యాగతో భృశమ్,
జటాయుషా మయా చైవ బహుశోఽభిగతో హి సః. ౧౧

తస్యాఽశ్రమపదాభ్యాశే వవు ర్వాతా స్సుగన్ధినః,
వృక్షో నాపుష్పితః కశ్చి దఫలో వా న విద్యతే. ౧౨

ఉపేత్య చాశ్రమం పుణ్యం వృక్షమూల ముపాశ్రితః,
ద్రష్టుకామః ప్రతీక్షేఽహం భగవ న్తం నిశాకరమ్. ౧౩

అంత నేను అఱుదినములకుఁ గొంతదెలివొంది యెప్పుడును దప్పినఁగా మూర్ఛనొందునట్లు పరవశుఁడనై సమస్తదిశలం గలయఁ జూచినానుగాని యిది యేప్రదేశమో కొంచెమయినను గుర్తుతెలియలేదు. ౫

అంత సముద్రతీరంబునందలి పర్వతంబులను సమస్తనదులను సరస్సుల ను వనంబులను సముద్రతీరంబునుం జూచి యిది యీప్రదేశమని తెలిసికొం టిని. ౬

ఇది దక్షిణసముద్రతీరంబున నున్నదియు సంతుష్టంబులగు పక్షులతోఁ నొప్పుచున్నదియు గుహలతోను శిఖరంబులతోనుఁ గూడినదియునగు వింధ్య పర్వతభాగమని నిశ్చయముగాఁ దెలిసికొంటిని. ౭

ఈప్రదేశమునందు దేవతలచేతనుఁ బూజితంబగు పవిత్రమయిన యొక ఆశ్రమం బుండెను; అందు భయంకరంబగు తపస్సుగల నిశాకరుఁడను మహర్షి నివసింపుచుండెను. ౮

ధర్మము దెలిసినట్టివానరులారా! ఆనిశాకరమహర్షి మరణమునొందిన పిమ్మట నే నమ్మహర్షి నివిడిచి నేనుమాత్రమే యీప్రదేశమున వాసము సేయ నారంభించి యిప్పటికి ఎనిమిదివేలసంవత్సరము లయినవి. ౯

అంత నేను బహుకష్టముతో మిట్టపల్లమయిన వింధ్యశిఖరమునుండి మెల్లగా డిగ్గి బుషులుకోయుటచే మొక్కలవుటంజేసి కఱకులయిన దర్భల తోఁగూడిన ఆశ్రమభూమికిఁ బరమదుఃఖితుఁడనై వచ్చితిని. ౧౦

నేను అట్లు పరమదుఃఖితుఁడనై అట్టికాలమునందు ఆనిశాకరమహా ర్షిని సందర్శింపఁగోరితిని. ఎందుకనఁగా మున్ను నేనును జటాయువును అధిక ముగా నతని దర్శనముచేసి సేవించుచుండు వారము. ౧౧

ఆనిశాకరమహర్షి యాశ్రమంబునఁ బుష్పంబులుగాని ఫలములుగాని లేనివృక్షమే లేదుకావున నతనియాశ్రమంబు సమీపించినంతనే మంచివాసన గల గాడ్పులు వీచినవి. ౧౨

అట్లు పవిత్రంబగు నయ్యాశ్రమంబుఁ జేరి యొక్కచెట్టుక్రింద భగ వంతుఁడగు నిశాకరుఁ జూడఁగోరి కాచియుంటిని. ౧౩

అథాపశ్య మదూరస్థ మృషిం జ్వలితతేజసమ్,
కృతాభిషేకం దుర్ధర్ష ముపావృత్త ముదఙ్ముఖమ్. ౧౪

త మృక్షా స్సృమరా వ్యాఘ్రా స్సింహా నాగా స్సరీసృపాః,
పరివా ర్యోపగచ్ఛన్తి ధాతారం ప్రాణినో యథా. ౧౫

తతః ప్రాప్త మృషిం జ్ఞాత్వా తాని సత్త్వాని వై యయుః,
ప్రవిష్టే రాజని యథా సర్వం సామాత్యకం బలమ్. ౧౬

ఋషి స్తు దృష్ట్వా మాం ప్రీతః ప్రవిష్ట శ్చాశ్రమం పునః,
ముహూర్తమాత్రా న్నిష్క్రమ్య తతః కార్య మపృచ్ఛత. ౧౭

సౌమ్య! వైకల్యతాం దృష్ట్వా రోమ్ణాం తే నావగమ్యతే,
అగ్నిదగ్ధా విమౌ పక్షౌ త్వక్చైవ వ్రణితా తవ. ౧౮

గృధ్రౌ ద్వౌ దృష్టపూర్వౌ మే మాతరిశ్వసమౌ జవే,
గృధ్రాణాం చైవ రాజానౌ భ్రాతరౌ కామరూపిణౌ. ౧౯

జ్యేష్ఠో హి త్వం తు సంపాతే! జటాయు రనుజ స్తవ,
మానుషం రూప మాస్థాయ గృహ్ణీతాం చరణౌ మమ. ౨౦

కిం తే వ్యాధిసముత్థానం పక్షయోః పతనం కథమ్,
దణ్డో వాయం కృతః కేన సర్వ మాఖ్యాహి పృచ్ఛతః. ౨౧

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షష్టితమ స్సర్గః. ౬౦.

అంత స్నానముగావించి నిజతేజస్సుచే వెలుఁగుచు ఉత్తరదిశ కభిముఖుఁడై వచ్చుచున్నవాని దుర్ధర్షుఁడగు నమ్మహర్షి నిశాకరుని సమీపంబునం జూచితిని. ౧౪

అంత సమస్తభూతంబులును బ్రహ్మదేవునిఁ బరివేష్టించి కొలుచునట్లు అనిశాకరమహర్షిని భల్లూకంబులును జమరంబులును బులులును సింహంబులును ఏనుఁగులును సర్పంబులును బరివేష్టించి కొలచియుండినవి. ౧౫

అంత నమ్మహర్షి యాశ్రమంబులోనికిఁ బోవుట నెఱిఁగి రాజు అంతఃపురంబుఁ బ్రవేశించినవెనుక మంత్రులు మొదలగు బలఁగముపోవునట్లు ఆ జంతువులన్నియుఁ దమతమనెలవులకుం బోయినవి. ౧౬

ఆ నిశాకరమహర్షియు సుప్రీతుఁడై నన్నుఁజూచి యాశ్రమంబులోనికిఁ బోయి మరలఁ గొంతసేపులో వెలువడి నేను వచ్చినకార్యము నడిగెను. ౧౭

సౌమ్యుఁడా! నీదేహమందలి వెండ్రుకలు వికలము లగుటవలన నీరూపమే తెలియకున్నది మఱియు నీఱెక్కలు అగ్నిదగ్ధములుగాను నీచర్మమంతయు వ్రణము గలదిగాను గానఁబడుచున్నవి. ౧౮

నేను మున్ను వేగంబున వాయుసమానంబులునుసమస్తగృధ్రంబులకును రాజులును గామరూపంబులును సహోదరంబులునగు రెండుగృధ్రంబులం జూచియున్నాను. ౧౯

సంపాతీ! నీవందు జ్యేష్ఠుఁడవుగావా? నీతమ్ముఁడు జటాయువు; మీరిద్దఱును మనుష్యరూపముధరించినవారలయి నాపాదంబులకు నమస్కరించుచుందురు. ౨౦

నీకు వ్యాధియేమైన వచ్చినదాయేమి? అట్లయిననీఱెక్కలు ఎట్లుపడిపోయినవి? లేక ఎవరైనను ఇట్లు శిక్షించిరా? ఎవ్వరు? అడిగెదను; నాకు యథార్థముఁ జెప్పుము. అని నిశాకరమహర్షి నన్నడిగెను. ౨౧

ఇది యఱువదియవసర్గము.

## ఏ క ష ష్టి త మ స్స ర్గః.

తత స్తద్దారుణం కర్మ దుష్కరం సాహసా త్కృతమ్,
ఆచచక్షే మునే స్సర్వం సూర్యానుగమనం తదా. ౧

భగవ! న్వ్రణయు క్తత్వా ల్లజ్జయా వ్యాకులేన్ద్రియః,
పరిశ్రాన్తో నశక్నోమి వచనం ప్రతిభాషితుమ్. ౨

అహం చైవ జటాయుశ్చ సంఘర్షా ద్దర్పమోహితౌ,
ఆకాశం పతితౌ వీరౌ జిజ్ఞాసన్తౌ పరాక్రమమ్. ౩

కైలాసశిఖరే బద్ధ్వా మునీనా మగ్రతః పణమ్,
రవి స్స్యా దనుయాతవ్యో యావ దస్తం మహాగిరిమ్. ౪
అథావాం యుగప త్ప్రాప్తా వపశ్యావ మహీతలే,
రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్. ౫
క్వచి ద్వాదిత్రఘోషాంశ్చ బ్రహ్మఘోషాంశ్చ శుశ్రువ,
గాయ న్తీ శ్చాఙ్గనా బహ్వీః పశ్యావో రక్తవాససః. ౬

తూర్ణ ముత్పత్య చాకాశ మాదిత్యపథ మాశ్రితౌ,
ఆవా మాలోకయావ స్తు వనం శాద్వలసన్నిభమ్. ౭

ఉపలై రివ సంఛన్నా దృశ్యతే భూ శ్శిలోచ్చయైః,
ఆపగాభిశ్చ సంవీతా సూత్రైరివ వసున్ధరా. ౮
హిమవాంశ్చైవ విన్ధ్యశ్చ మేరుశ్చ సుమహా న్నగః,
భూతలే సంప్రకాశన్తే నాగా ఇవ జలాశయే. ౯

## అఱువదియొకటవసర్గము.

అంత నపుడు నేను అలోచింపక గావించిన భయంకరంబును ఎవ్వరి కినిజేయ నలవిగానిదియునగు సూర్యుని వెంబడించుట మొదలగు కార్యమునం తయు నమ్మహామునికిఁ జెప్పితిని. ౧

భగవంతుఁడా! ఱెక్కలుకాలి నాదేహమంతయు వ్రణమయియుం డుటవలన బాధితుఁడను లజ్జచేతఁ గలఁతపడిన యింద్రియంబులుగలవాఁడ నగుటంజేసి నీకుఁ బ్రత్యుత్తరము చెప్పుటకు అసమర్థుఁడనై యున్నాను. ౨

పరాక్రమవంతులమగు నేనును జటాయువును స్పర్ధవలన గర్వంబున నొండలుదెలియక యొండొరుల పరాక్రమంబుఁ దెలియఁగోరినవారమై యా కాశంబున కెగసితిమి. ౩

మే మిర్వురము కైలాసపర్వతశిఖరంబున ఋషులముందట "సూర్యుఁ డస్తగిరి చేరునందాఁక నతని వెంబడి యెగసిపోవలె" నని పందెముకట్టి యిర్వురము నేకకాలంబున నాకాశం బెగసితిమి; అంతభూమియందుండు నగ రంబులన్నియు వేఱువేఱుగా మాకు బండిచక్రంబు లంతటివిగా నగపడెను. ౪

మేము మార్గంబునఁ గొన్నిస్థలంబులను వాద్యధ్వనులను వేదఘోషం బులను వింటిమి; మఱియు రక్తవస్త్రముఁ దాల్చి గానము సేయుచున్న స్త్రీలఁ బెక్కండ్రం జూచితిమి. ౫

మేము శీఘ్రముగా నాకాశమున కెగసి సూర్యునిమార్గముఁజేరి క్రిం దఁజూచుటయు మే ముండినయడవి యప్పుడు పచ్చికవలె నతిసూక్ష్మముగాఁ గానఁబడినది. ౬

భూమియందలి పర్వతంబులు చిన్నఱాళ్లవలెఁ గానఁబడినవి. భూమి యందలినదులు సన్నదారములవలె నగపడెను. ౭

అప్పుడు హిమవత్పర్వతంబును వింధ్యగిరియు మేరుశైలంబును సరస్సు నందు విహరించు నేనుఁగులంతలవిగా భూమియందుఁ గానఁబడినవి. ౮

తీవ్ర స్స్వేదశ్చ ఖేదశ్చ భయం చాసీ త్తదా ఽఽవయోః,
సమావిశతి మోహశ్చ తమో మూర్ఛాచ దారుణా. ౧౦

న దిగ్విజ్ఞాయతే యామ్యా నాగ్నేయీ నచ వారుణీ,
యుగాన్తే నియతో లోకో హతో దగ్ధ ఇవాగ్నినా. ౧౧

మనశ్చ మే హతం భూయ స్సన్నివర్త్య తు సంశ్రయమ్,
యత్నేన మహతా హ్యస్మి న్పున స్సంధాయ చక్షుషీ. ౧౨
యత్నేన మహతా భూయో రవి స్సమవలోకితః,

తుల్యః పృథ్వీప్రమాణేన భాస్కరః ప్రతిభాతి నౌ. ౧౩

జటాయు ర్మా మనాపృచ్ఛ్య నిపపాత మహీం తతః,
తం దృష్ట్వా తూర్ణ మాకాశా దాత్మానం ముక్తవా నహమ్.

పక్షాభ్యాంచ మయా గుప్తో జటాయు ర్న ప్రదహ్యతే,
ప్రమాదా త్తత్ర నిర్దగ్ధః పత న్వాయుపథా దహమ్. ౧౫

ఆశఙ్కే తం నిపతితం జనస్థానే జటాయుషమ్,
అహంతు పతితో విన్ధ్యే దగ్ధపక్షో జడీకృతః. ౧౬
రాజ్యేన హీనో భ్రాత్రాచ పక్షాభ్యాం విక్రమేణచ,
సర్వథా మర్తు మే వేచ్ఛ న్పతిష్యే శిఖరా ద్గిరేః. ౧౭

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ఏకషష్టితమ స్సర్గః. ౬౧.

సూర్యమార్గంబున సంచరించునప్పుడు మాకు అధికముగాఁ జెమటయు నలసటయుఁ గలుగుటయగాక భయంబును జిత్తవిభ్రాంతియు దృష్టి దెలియకపోవుటయు భయంకరంబగుమూర్ఛయుఁ గలుగనారంభించినవి. ౧౦

ఇది దక్షిణదిశయనియు ఇది యాగ్నేయదిక్కనియు నిది పడమరయనియు నిది తూర్పనియు నిదియుత్తరమనియు నెంతమాత్రము దెలిసినదికాదు. లోకమంతయు నియమముదప్పి ప్రళయకాలాగ్నిచే దగ్ధమయి హతమయినట్లు కానఁబడినది. ౧౧

నామనన్సు కలఁతచే నేమియుఁ దెలియఁజాలక నిలీనమగుటఁజేసి చక్షురింద్రియమునకు దృష్టిశక్తి తప్పిపోయినది. బహుప్రయత్నంబున నే నామనస్సును చక్షురింద్రియంబునందుఁ గూర్చి బహుకష్టముచేత మరల సూర్యుఁ గనుఁగొంటిని. ౧౨

అప్పుడు మాకు సూర్యుఁడు భూమియంత ప్రమాణముగలవాఁడుగా నగపడెను. ౧౩

అంత జటాయువు నాతోఁ జెప్పకయే వివశుఁడై యాకాశంబునుండి నేలఁబడసాగెను. అట్లు జటాయువుపడుటంజూచిశీఘ్రంబున నేనును ఆకాశంబుననుండి క్రిందికి దిగితిని. ౧౪

నేను జటాయువును నాపక్షంబులఁ గప్పుటవలన జటాయువు దహింపఁబడలేదు. నేనుమాత్రము ఆకాశంబునుండి పడునపుడు ప్రమాదంబున దగ్ధుఁడనైతిని. ౧౫

జటాయువు జనస్థానంబునఁబడియుండునని తోఁచుచున్నది. నేనుమాత్రము రెక్కలుకాలి మూర్ఛితుఁడనై ఈవింధ్యపర్వతంబునం బడినాను. నాపక్షంబులను దమ్మునిరాజ్యంబును బరాక్రమంబునుఁ బాసి యిఁక నేజీవింపఁజాలను. ఈపర్వతశిఖరమునుండి క్రిందఁబడి మరణంబు నొందెదను. అని నేను నిశాకరమహర్షితోఁ జెప్పితిని. ౧౬

ఇది యఱువదియొకటవసర్గము.

## ద్వి ష ష్టి త మ స్స ర్గః.

ఏవ ముక్త్వా మునిశ్రేష్ఠ మరుదం దుఃఖితో భృశమ్,
అథ ధ్యాత్వా ముహూర్తంతు భగవా నిద మబ్రవీత్. ౧

పక్షౌ తు తే ప్రపక్షౌచ పున రన్యౌ భవిష్యతః,
ప్రాణాశ్చ చక్షుషీ చైవ విక్రమశ్చ బలంచ తే. ౨
పురాణే సుమహ త్కార్యం భవిష్యతి మయా శ్రుతమ్,
దృష్టం మే తపసా చైవ శ్రుత్వాచ విదితం మమ. ౩

రాజా దశరథో నామ కశ్చి దిక్ష్వాకునన్దనః,
తస్య పుత్త్రో మహాతేజా రామోనామ భవిష్యతి. ౪
అరణ్యంచ సహ భ్రాత్రా లక్ష్మణేన గమిష్యతి,
అస్మి న్నర్థే నియుక్త స్స న్పిత్రా సత్యపరాక్రమః. ౫

నైరృతో రావణో నామ తస్య భార్యాం హరిష్యతి,
రాక్షసేన్ద్రో జనస్థానా దవధ్య స్సురదానవైః. ౬

సా చ కామైః ప్రలోభ్య న్తీ భక్ష్యై ర్భోజ్యైశ్చ మైథిలీ,
నభోక్ష్యతి మహాభాగా దుఃఖే మగ్నా యశస్వినీ. ౭

పరమాన్నం తు వైదేహ్యై జ్ఞాత్వా దాస్యతి వాసః,

యదన్న మమృతప్రఖ్యం సురాణా మపి దుర్లభమ్. ౮
తదన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞా యేన్ద్రా దిదం త్వితి,

## అఱువదిరెండవసర్గము.

నే నివ్విధంబున మునిశ్రేష్ఠుఁడగు నానిశాకరమహర్షితో విన్నవించుకొని పరమదుఃఖితుఁడనై రోదనంబు గావించితిని; అంత నమ్మహానుభావుఁడు కొంతసేపు ధ్యానించి నన్నుఁ జూచి యిట్లని యానతిచ్చెను. ౧

నీకు ఱెక్కలును బిల్లఱెక్కలును బ్రాణంబులును నేత్రంబులును బలపరాక్రమంబులును మరలఁ గ్రొత్తవి గలుగఁగలవు. ౨

భవిష్యత్కాలమునందు ఒకగొప్పకార్యము కాఁగలదని మున్ను నేను వింటిని. తపోమహిమచేఁ దెలిసికొనుటమాత్రమేగాక పెద్దలవలన వినియుఁ దెలిసికొంటిని. ౩

ఇక్ష్వాకువంశంబున దశరథుఁడను మహారాజు ఒకఁడున్నాఁడు. అతనికి రాముఁడనుపేరుగల మహాప్రభావసంపన్నుఁడగు కొడుకు పుట్టఁగలఁడు.

వనవాసము సేయుమని తండ్రి యాజ్ఞాపించుటవలన సత్యపరాక్రముఁడగు నారాముఁడు తమ్ముఁడులక్ష్మణునితోఁ గూడినవాఁడై యరణ్యంబునకు వచ్చును. ౪

దేవాసురులకును వధింపనలవి గానివాఁడు రాక్షసరాజు రావణుఁడనువాఁడు రాముఁడు జనస్థానంబున నుండునప్పుడు అతనిభార్య నపహరింపఁగలఁడు. ౫

మహానుభావురాలగు నాసీత భోగద్రవ్యంబులనుభక్ష్యంబులను భోజ్యపదార్థంబులను రావణుఁడు ఎంత యియ్యవచ్చినను మహాపతివ్రత గావున పెనిమిటిం బాసి పరమదుఃఖితురాలగుటవలన నెంతమాత్రము భుజింపదు. ౬

ఇంద్రుఁడు సీతాదేవి భుజింపకుండుట నెఱిఁగి తా నాబిడకు ఉత్తమమయిన దివ్యాన్నం బొసంగఁగలఁడు.

అమృతంబుతో సమానమయినదియు దేవతలకేనియు దుర్లభంబునగు నద్దివ్యాన్నంబునొంది సీతాదేవి యిది యింద్రుఁడొసఁగినది యని యెఱిఁగి

అగ్ర ముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి. ౯
యది జీవతి మే భర్తా లక్ష్మణేన సహ ప్రభుః,
దేవత్వం గచ్ఛతో ర్వాపి తయో రన్న మిదం త్వితి. ౧౦

ఏష్య న్త్యన్వేషకా స్తస్యా రామదూతాః ప్లవఙ్గమాః,
ఆఖ్యేయా రామమహిషీ త్వయా తేభ్యో విహఙ్గమ!. ౧౧
సర్వథా హి నగ న్తవ్య మీదృశః క్వ గమిష్యసి,
దేశకాలౌ ప్రతీక్షస్వ పక్షౌ త్వం ప్రతిపత్స్యసే. ౧౨

నోత్సహేయ మహం కర్తు మద్యైవ త్వాం సపక్షకమ్,
ఇహస్థ స్త్వం తు లోకానాం హితం కార్యం కరిష్యసి. ౧౩

త్వయాపి ఖలు తత్కార్యం తయో శ్చ నృపపుత్త్రయోః,
బ్రాహ్మణానాం సురాణాంచ మునీనాం వాసవస్యచ. ౧౪
ఇచ్ఛా మ్యహ మపి ద్రష్టుం భ్రాతరౌ రామలక్ష్మణౌ,
నేచ్ఛే చిరం ధారయితుం ప్రాణాం స్త్యక్ష్యే కళేబరమ్. ౧౫

మహర్షి స్త్వబ్రవీ దేవం దృష్టతత్త్వార్థదర్శనః.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే ద్విషష్టితమ స్సర్గః. ౬౨.

---

## త్రిషష్టితమ స్సర్గః.

ఏతై రన్యైశ్చ బహుభి ర్వాక్యై ర్వాక్యవిశారదః,
మాం ప్రశ స్యాభ్యనుజ్ఞాప్య ప్రవిష్ట స్స స్వ మాశ్రమమ్. ౧

ఆం దగ్రభాగముఁదీసి "నాభర్త మహాప్రభువు రాముఁడును నామఱఁది లక్ష్మణుఁడును జీవించియుండురేనియు, వారలు మృతులై దేవత్వంబునొంది యుండురేనియు నారామలక్ష్మణుల కీయన్నం బుపభోగార్థంబగుఁగాక" యని భూమిపై నొసంగఁగలదు. ౮-౧౦

సంపాతీ! రామునిచేఁ బంపఁబడి సీతాదేవిని వెదకుటకై వానరులు రాఁగలరు; నీవు ఆవానరులకు సీతాదేవివృత్తాంతమును జెప్పవలయును. ౧౧

నీ వన్ని విధములను ఇచట నుండుటయే మంచిది; ఇట్లు ఱెక్కలు లేనివాఁడవు ఎందుఁబోఁగలవు? నీ విచటనే దేశకాలంబుల నిరీక్షించుచు వసించియుండుము; నీకు ఱెక్కలు మరలఁ బుట్టఁగలవు. ౧౨

నీ కిప్పుడే ఱెక్కలువచ్చునట్లు గావింప నా కుత్సాహము గలుగ లేదు. ఏలయనఁగా నీ విచటనేయుండువేని లోకములకన్నిటికి హితంబు సేయఁగలవు. ౧౩

రాజపుత్రులగు నారామలక్ష్మణుల కార్యము నీకుమాత్రమేకాదు సమస్త బ్రాహ్మణులకును దేవతలకును మహర్షులకును దేవేంద్రునకును అవశ్యకర్తవ్యము.

నాకును ఆరామలక్ష్మణుల సందర్శింపవలెనని కోరికి యధికముగా నున్నది. అయితే ఇంక బహుకాలమువఱకుఁ బ్రాణంబులు దాల్చియుండుట నాకిష్టములేదు. కావున ఆలోనే శరీరంబు విడిచెదను. ౧౪

సమస్తతత్త్వంబులుం దెలిసినట్టి యా నిశాకరమహర్షి యివ్విధంబునఁ బలికెను. అని సంపాతి అంగదునితోఁ జెప్పెను.

ఇది యఱువదిరెండవసర్గము.

---

## అఱువదిమూఁడవసర్గము.

మాటలుదెలిసినవారిలో నుత్తముఁడగు నమ్మహర్షి యిట్లు నానావిధంబులగుమాటల నన్ను శ్లాఘించి నా కనుజ్ఞయొసఁగి తా నాశ్రమంబుఁ బ్రవేశించెను. ౧

కన్దరాత్తు విసర్పిత్వా పర్వతస్య శనైశ్శనైః,
అహం విన్ధ్యం సమారుహ్య భవతః ప్రతిపాలయే. ౨
అద్య త్వేతస్య కాలస్య సాగ్రం వర్షశతం గతమ్,
దేశకాలప్రతీక్షోఽస్మి హృది కృత్వా మునేర్వచః. ౩
మహాప్రస్థాన మాసాద్య స్వర్గతే తు నిశాకరే,
మాం నిర్దహతి సంతాపో వితర్కైర్బహుభిర్వృతమ్. ౪

ఉత్థితాం మరణే బుద్ధిం మునివాక్యైర్నివర్తయే,

బుద్ధిర్యా తేన మే దత్తా ప్రాణానాం రక్షణాయ తు. ౫
సా మేఽపనయతే దుఃఖం దీప్తేవాగ్నిశిఖా తమః,

బుధ్యతా చ మయా వీర్యం రావణస్య దురాత్మనః. ౬
పుత్రస్సంతర్జితో వాగ్భిర్న త్రాతా మైథిలీ కథమ్,

తస్యా విలపితం శ్రుత్వా తౌ చ సీతావినాకృతౌ. ౭
న మే దశరథస్నేహాత్పుత్రేణోత్పాదితం ప్రియమ్,

తస్య త్వేవం బ్రువాణస్య సంపాతేర్వానరైస్సహ. ౮
ఉత్పేతతుస్తదా పక్షౌ సమక్షం వనచారిణామ్,
స దృష్ట్వా స్వాం తనుం పక్షైరుద్గతైరరుణచ్ఛదైః. ౯
ప్రహర్ష మతులం లేభే వానరాంశ్చేద మబ్రవీత్,
ఋషేర్నిశాకరస్యైవ ప్రభావా దమితాత్మనః. ౧౦

అంత నేను మెల్లమెల్లఁగాఁ బర్వతగుహనుండి ప్రాఁకి వింధ్యపర్వతంబారోహించి మీరాక యెదురు చూచుచుంటిని. ౨

అమ్మహర్షివచనంబుఁ దలఁచుకొని దేశకాలంబుల నిరీక్షించుచు సమగ్రంబుగా నూఱువత్సరంబులు గడపితిని. ౩

అనూఱుసంవత్సరము లైనపిదప నిశాకరమహర్షి మహాప్రస్థానంబునకుఁ బోయి స్వర్గంబునొందుటయు నేను నాలో నానావిధముగా సంశయించుకొని దుఃఖంబు సహింపఁజాలకున్నాను. ౪

మరణము నొందవలెనని తోఁచినపుడెల్ల నిశాకరమహర్షి చెప్పినమాటలం దలఁచుకొని యూఱడిల్లుచుందును.

"నీకు మరల ఱెక్కలు బలము రాఁగలవు. నీవు గాచియుండుము" అని ప్రాణసంరక్షణార్థమయి నాకు నిశాకరమహర్షి చెప్పినమాట దేదీప్యమానంబగు నగ్నిజ్వాల చీఁకటిని బోఁగొట్టునట్లు నాదుఃఖమును బోఁగొట్టుచుండును. ౫

నేను దురాత్ముఁడగు రావణుని పరాక్రమంబు నెఱింగియు "నీవు రావణుం బోరిగొని సీతను రక్షింపక యేలవచ్చితివి" అని పరుషవచనంబుల నాకొడుకుం గసరితిని. ౬

ఆసీతావిలాపమును వినియు రామలక్ష్మణులు సీతావిరహితు లయిరని యెఱింగియు నాకొడుకు దశరథునియందు స్నేహముంచి సీతను విడిపించి నాకు సంతోషము సేయఁజాలఁడయ్యె. అని సంపాతి యంగదునితోఁ జెప్పెను. ౭

అప్పుడు అట్లు సంపాతి వానరులతోఁ జెప్పుచుండఁగానే సమస్తవానరసమక్షంబుననే యతనికి ఱెక్కలు మొలిచినవి ౮

అంత సంపాతి తనశరీరమునందు ఎఱ్ఱని యీఁకలుగల ఱెక్కలు మొలుచుటఁగని పరమసంతుష్టుఁడై వానరులంజూచి యిట్లనిపలికెను. ౯

మహాప్రభావుఁడగు నానిశాకరమహర్షి ప్రభావమువలననే సూర్యకిర

ఆదిత్యరశ్మినిర్దగ్ధౌ పక్షౌ మే పున రుత్థితౌ,
యౌవనే వర్తమానస్య మమాఽసీద్యః పరాక్రమః. ౧౧
త మే వా ద్యానుగచ్ఛామి బలం పౌరుష మేవచ,
సర్వథా క్రియతాం యత్న స్సీతా మధిగమిష్యథ. ౧౨
పక్షలాభో మ మాయం వ స్సిద్ధిప్రత్యయకారకః,

ఇత్యుక్త్వా స హరీం త్సర్వాం త్సంపాతిః పతగోత్తమః. ౧౩
ఉత్పపాత గిరే శ్శృఙ్గా జ్జిజ్ఞాసుః ఖగమాం గతిమ్,

తస్య తద్వచనం శ్రుత్వా ప్రీతిసంహృష్టమానసాః. ౧౪
బభూవు ర్హరిశార్దూలా విక్రమాభ్యుదయోన్ముఖాః.

అథ పవనసమానవిక్రమాః ప్లవగవరాః ప్రతిలబ్ధపౌరుషాః,
అభిజిదభిముఖా దిశం యయు ర్జనకసుతాపరిమార్గణోన్ముఖాః.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే త్రిషష్టితమ స్సర్గః. ౬౩.

---

## చతుష్షష్టితమ స్సర్గః.

ఆఖ్యాతా గృధ్రరాజేన సముత్పత్య ప్లవఙ్గమాః,
సంగతాః ప్రీతిసంయుక్తా వినేదు ర్భీమవిక్రమాః. ౧

సంపాతే ర్వచనం శ్రుత్వా హరయో రావణక్షయమ్,
హృష్టా స్సాగర మాజగ్ము స్సీతాదర్శనకాఙ్క్షిణః. ౨

ణంబులచే దగ్ధంబులగు నాఱెక్కలు ఇప్పుడు మరల మొలిచినవి. ౧౦

నేను యౌవనమున నుండునప్పుడు నాకెట్టి బలవిక్రమపౌరుషంబులు గలిగెనో యిపుడు మరల నట్టిబలపరాక్రమపౌరుషంబులం బొందితిని.

మీరు ప్రయత్నముగావింపుఁడు; అన్నివిధంబులను దప్పక సీతాదేవిం జూడఁగలరు; నాకిప్పుడు ఱెక్కలు మొలుచుటయే మీకునుఁ గార్యసిద్ధి యవుననుటకు నిదర్శనము. అని సంపాతి వానరులతోఁ బలికెను. ౧౧

పక్షిశ్రేష్ఠుఁడగు నాసంపాతి యివ్విధంబున సమస్తవానరులతోఁ డను ఆకాశంబున సంచరించుటయందుఁ దన నూతనపక్షంబులకుఁగల బలంబు దెలియఁగోరి యాకాశమున కెగసెను. ౧౩

వానరోత్తములు, సంపాతి 'మీరు సీతఁజూడఁగలరు' అని వచించుట విని అందుకు నిదర్శనంబుగా నతనికి మరల ఱెక్కలు మొలుచుటయుం జూచి పరమసంతుష్టులయి పరాక్రమంబు నవలంబించి సీతాదేవిం జూచుటయను శుభమునొందఁ బ్రయత్నించిరి. ౧౪

అంత వాయువునకుంబోలె మహావేగంబుగలవారలగు నవ్వానరోత్తములు పరాక్రమం బవలంబించి సీతాదేవిని వెదకఁబూనినవారలయి యభిజిన్ముహూర్తము వచ్చువఱకు నిరీక్షించియుండి యాముహూర్తంబునందు దక్షిణదిశాభిముఖులయిపోయిరి. ౧౫

ఇది యఱువదిమూఁడవసర్గము.

---

## అఱువదినాలుగవసర్గము.

సింహమునకుంబోలెఁ బరాక్రమంబుగల యవ్వానరవీరులు సంపాతివచనంబున సీతయున్నస్థలం బెఱింగి సంతోషమున గంతులువైచి మరల నందఱు నొకటిగాఁజేరి సింహనాదములు గావించిరి. ౧

వానరులు సంపాతివాక్యంబు విని పరమసంతుష్టులయి సీతాదేవిం జూచుటకై రావణుని వాసస్థానమయిన లంకాద్వీపమునకుఁ బోఁదలఁచి తన్మార్గమయిన సముద్రముఁ జేరిరి. ౨

అభిక్రమ్య తు తం దేశం దదృశు ర్భీమవిక్రమాః,
కృత్స్నం లోకస్య మహతః ప్రతిబిమ్బ మివ స్థితమ్. ౩

దక్షిణస్య సముద్రస్య సమాసా ద్యోత్తరాం దిశమ్,
సన్నివేశం తత శ్చక్రు ర్హరివీరా మహాబలాః. ౪
సత్త్వై ర్మహద్భి ర్వికృతైః క్రీడద్భి ర్వివిధై ర్జలే,
వ్యాత్తాస్యై స్సుమహాకాయై రూర్మిభిశ్చ సమాకులమ్. ౫
ప్రసుప్త మివ చాన్యత్ర క్రీడన్త మివ చాన్యతః,
క్వచి త్పర్వతమాత్రైశ్చ జలరాశిభి రావృతమ్. ౬
సంకులం దానవేన్ద్రైశ్చ పాతాళతలవాసిభిః,
రోమహర్షకరం దృష్ట్వా విషేదుః కపికుఞ్జరాః. ౭

ఆకాశమివ దుష్పారం సాగరం ప్రేక్ష్య వానరాః,
విషేదు స్సహసా సర్వే 'కథం కార్య' మితి బ్రువన్. ౮
విషణ్ణాం వాహినీం దృష్ట్వా సాగరస్య నిరీక్షణాత్,
ఆశ్వాసయామాస హరీ న్భయార్తా న్హరిసత్తమః. ౯
తా న్విషాదేన మహతా విషణ్ణా న్వానరర్షభాన్,
ఉవాచ మతిమా న్కాలే వాలిసూనుర్మహాబలః. ౧౦

న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తమః,
విషాదో హన్తి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః. ౧౧

విషాదో౽యం ప్రసహతే విక్రమే పర్యుపస్థితే,
తేజసా తస్య హీనస్య పురుషార్థో న సిద్ధ్యతి. ౧౨

భయంకరపరాక్రములగు నవ్వానరులు అప్రవేశంబునొంది సమస్త ప్రపంచంబునుం దనలోఁ బ్రతిబింబముగా ధరింపఁజాలిన అద్దమువలెనున్న యమ్మహాసముద్రముఁ జూచిరి. 3

మహాబలశాలులగు నవ్వానరవీరులు దక్షిణసముద్రంబునుత్తరతీరంబుఁ జేరి యచట విడిసిరి ౪

నోరుదెఱచుకొని జలంబులఁ గ్రీడించుచున్న భయంకరంబులయిన మహాకాయంబులగు నానావిధజంతువులచేత నిండియున్నదియు, తరంగములతో నొప్పుచున్నదియు, జంతువులచేతను గరళ్ళచేతను ఒకచోఁ గ్రీడించునట్లున్నదియు, మఱియొకచో నవి లేకుంటఁ జేసి నిదురించునట్లున్నదియు, నొకచోఁ గొండలంతటి జలంబులచేఁ గప్పఁబడినదియుఁ, బాతాళలోకంబున నుండునట్టి దానవేంద్రులచే నధిష్ఠితంబును జూపరులకు భయంబునుఁ గగుర్పాటుఁ గలిగించునదియు నగు మహాసముద్రముం జూచి యవ్వానరోత్తములు దిగులొందిరి. ౫-౭

ఆకాశమువలెనంతము గానరాకున్న యమ్మహాసముద్రంబుఁ జూచి యవ్వానరులందఱు దిగులుపడి, ఇఁక "నేమిచేయవచ్చును?" అని పలికిరి. ౮

వానరోత్తముఁడగు నంగదుఁడు వానరసేనయంతయు సముద్రముం గని భయపడియుండుటఁ జూచి భయార్తులగు వానరులనెల్ల నాశ్వాసించెను. ౯

సమయోచితమయిన బుద్ధిగల మహాబలశాలియగు నయ్యంగదుఁడు మహాభయంబునొంది పరమదుఃఖితులగు నవ్వానరోత్తములం జూచి యిట్లని పలికెను. ౧౦

ఎంతమాత్రము మనస్సున దుఃఖ ముంచరాదు. దుఃఖముకన్న గొప్ప దోష మేదియులేదు. క్రుద్ధసర్పము బాలునిఁ జంపునట్లు దుఃఖము పురుషుం జంపివేయును. ౧౧

పరాక్రమము సేయవలసినప్పుడు ఎవ్వఁడు దుఃఖమునకు లోఁబడునో ఆతఁడు పరాక్రమహీనుఁడగుంగావున నతని కేపురుషార్థంబును సిద్ధింపదు. అని యంగదుఁడు వానరులంజూచి పలికెను. ౧౨

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయా మఙ్గదో వానరై స్సహ,
హరివృద్ధై స్సమాగమ్య పున ర్మన్త్ర మమన్త్రయత్. ౧౩

సా వానరాణాం ధ్వజినీ పరివా ర్యాఙ్గదం బభౌ,
వాసవం పరివా ర్యేవ మరుతాం వాహినీ స్థితా. ౧౪

కోఽన్య స్తాం వానరీం సేనాం శక్తః స్తమ్భయితుం భవేత్,
అన్యత్ర వాలితనయా దన్యత్రచ హనూమతః. ౧౫

తత స్తా న్హరివృద్ధాంశ్చ తచ్చ సైన్య మరిన్దమః,
అనుమా న్యాఙ్గద శ్శ్రీమా న్వాక్య మర్థవ దబ్రవీత్. ౧౬

క ఇదానీం మహాతేజా లఙ్ఘయిష్యతి సాగరమ్,
కః కరిష్యతి సుగ్రీవం సత్యసన్ధ మరిన్దమమ్. ౧౭

కో వీరో యోజనశతం లఙ్ఘయేత ప్లవఙ్గమాః,
ఇమాంశ్చయూథపాం త్సర్వాన్మోక్షయేత్కో మహాభయాత్.

కస్య ప్రభావా ద్దారాంశ్చ పుత్రాంశ్చైవ గృహాణిచ,
ఇతో నివృత్తాః పశ్యేమ సిద్ధార్థా స్సుఖినో వయమ్. ౧౯

కస్య ప్రసాదా ద్రామం చ లక్ష్మణంచ మహాబలమ్,
అభిగచ్ఛేమ సంహృష్టా స్సుగ్రీవంచ మహాబలమ్. ౨౦

యది కశ్చి త్సమర్థో వ స్సాగరప్లవనే హరిః,
స దదా త్విహ న శ్శీఘ్రం పుణ్యా మభయదక్షిణామ్. ౨౧

ఆరాత్రి గడచినపిదప నంగదుఁడు వానరులలోఁ బెద్దలయినవారిం గూడి సముద్రతరణముం గుఱించి యాలోచించెను. ౧౩

అంగదుఁ బరివేష్టించి కొలిచియున్న యవ్వానరసేన దేవేంద్రుం బరివేష్టించియుండు దేవసేనవలెఁ బ్రకాశించెను. ౧౪

వాలికుమారుఁడగు నంగదుఁడును హనుమంతుఁడునుంగాక మఱియెవ్వఁడు అసంఖ్యాకంబగు నవ్వానరసేనను నిలుప సమర్థుఁడు? ౧౫

అంత శత్రుసంహర్తయు శ్రీమంతుఁడునగు నయ్యంగదుఁడు ఆవృద్ధవానరులయొక్కయు నమ్మహాసేనయొక్కయు ననుజ్ఞంగొని అధికముగా నర్థముగల యీమాటం జెప్పెను. ౧౬

ఈసేనలో ఏమహావీరుఁడు సముద్రంబు దాఁటి లంకాపురిలో సీతాదేవిం జూచివచ్చి శత్రువుల సడంగఁద్రొక్కనట్టిసుగ్రీవునిఁ బ్రతిజ్ఞ దక్కించుకొన్నవానిఁగాఁ జేయఁగలఁడు? ౧౭

వానరులారా! ఏవీరుఁడు నూఱుయోజనంబుల సముద్రంబును లంఘించి కార్యంబు సాధించికొనివచ్చి యీవానరవీరుల కందఱకుఁ గలిగిన సుగ్రీవునివలనిభయంబుఁ బోఁగొట్టఁగలఁడు? ౧౮

మనము కార్యసిద్ధినొంది యిచటనుండి సుఖముగాఁ గిష్కింధకుఁ బోయి మనభార్యలను గొడుకులను గృహంబులను జూచునట్లు గావించు మహాప్రభావుఁ డెవ్వఁడు?. ౧౯

ఎవ్వని యనుగ్రహమువలన మనము సంతోషంబున మహాబలులగు రామలక్ష్మణులయొక్కయు మహాబలశాలియగు సుగ్రీవునియొక్కయు సన్నిధానంబునకుఁ బోఁగలము? ౨౦

మీలో నెవ్వరైనను నూఱుయోజనంబులసముద్రము దాఁటఁజాలుదురేని అతడిపుడే శీఘ్రముగా మాకుఁ బవిత్రమయిన యభయదక్షిణ నొసంగుఁగాక! అని యంగదుఁడు వానరులతోఁ జెప్పెను. ౨౧

అఙ్గదస్య వచ శ్శ్రుత్వా నకశ్చి త్కిఞ్చి దబ్రవీత్,
స్తిమితే వాభవ త్తత్ర సర్వా సా హరివాహినీ. ౨౨
పునరే వాఙ్గదః ప్రాహ తా న్హరీ న్హరిసత్తమః,

సర్వే బలవతాం శ్రేష్ఠా భవన్తో దృఢవిక్రమాః. ౨౩
వ్యపదేశ్యకులే జాతాః పూజితా శ్చా ప్యభీక్ష్ణశః,

న హి వో గమనే సఙ్గః కదాచి త్కస్య చి త్క్వచిత్. ౨౪
బ్రువధ్వం యస్య యా శక్తి ర్గమనే ప్లవగర్షభాః!.

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే చతుష్షష్టితమ స్సర్గః. ౬౪.

---

## పఞ్చషష్టితమ స్సర్గః.

తతో ఽఙ్గదవచ శ్శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః,
స్వం స్వం గతౌ సముత్సాహ మాహు స్తత్ర యథాక్రమమ్.
గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః,
మైన్దశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జామ్బవాం స్తథా. ౨
ఆబభాషే గజ స్తత్ర ప్లవేయం దశయోజనమ్,
గవాక్షో యోజనా న్యాహ గమిష్యా మీతి వింశతిమ్. ౩

గవయో వానర స్తత్ర వానరాం స్తా నువాచ హ,
త్రింశతం తు గమిష్యామి యోజనానాం ప్లవఙ్గమాః!. ౪
శరభ స్తా నువాచాథ వానరాన్ వానరర్షభః,
చత్వారింశ ద్గమిష్యామి యోజనానాం ప్లవఙ్గమాః!. ౫
వానరస్తు మహాతేజా అబ్రవీ ద్గన్ధమాదనః,

అంగదునివచనంబు విని ఎవ్వఁడును ఏమియుఁ బలుకఁడయ్యె; అప్పుడు ఆవానరసేనయంతయుఁ గదలక మెదలక చిత్తరువువలె నుండెను. ౨౨

వానరోత్తముఁడగు నంగదుఁడు అవ్వానరులంజూచి మఱల నిట్లని పలికెను.

మీరలందఱు బలవంతులలో మేటియయినవారలు; మహాపరాక్రమశాలులరు; ఉత్తమకులంబులం బుట్టినవారలు; మిక్కిలియు మన్ననవడసిన వారలు. ౨౩

వానరోత్తములారా! మీలో నొక్కొక్కరును ఎప్పుడును ఎందును అడ్డులేని గమనము గలవారలుగదా! ఎవ్వరెవ్వరు ఎంతెంతదూరము దాఁట గలరో చెప్పుఁడు. అని యంగదుఁడు వానరులతోఁ బలికెను. ౨౪

ఇది యఱువదినాలుగవసర్గము.

---

## అఱువదియైదవసర్గము.

అంత నంగదువచనంబు విని వానరశ్రేష్ఠులయిన గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు శరభుఁడు గంధమాదనుఁడు మైందుఁడు ద్వివిదుఁడును సుషేణుఁడు జాంబవంతుఁడును దమతమపరాక్రమంబు లారసి వరుసగా నంగదునితో దాఁటుటయందుఁ దమకుంగల బలముం జెప్పిరి. ౧,౨

అప్పుడు "నేను బదియోజనంబులదూరంబు దాఁటఁగలను" అని గజుఁడు పలికెను. గవాక్షుఁడు "నేను ఇరువదియోజనంబులకు లంఘింపగల"నని వచించెను. ౩

అంత గవయుఁడు అవ్వానరులంజూచి "వానరులారా! నేను ముప్పదియోజనంబుల దూరమునకు దాఁట:గలను" అని వక్కాణించెను. ౪

అంత "వానరులారా! నేను నలుబదియామడలదూరము దాఁటగలను" అని వానరోత్తముఁడగు శరభుఁడు ఆవానరులతోఁ జెప్పెను. ౫

అటుపిమ్మట మహాపరాక్రమశాలియగు గంధమాదనుఁడను వానరోత్త

యోజనానాం గమిష్యామి పఞ్చాశత్తు న సంశయః. ౬
మైన్దస్తు వానర స్తత్ర వానరాం స్తా నువాచ హ,
యోజనానాం పరం షష్టి మహం ప్లవితు ముత్సహే. ౭
తత స్తత్ర మహాతేజా ద్వివిదః ప్రత్యభాషత,
గమిష్యామి న సందేహ స్సప్తతిం యోజనా న్యహమ్. ౮
సుషేణస్తు మహాతేజాః ప్రోక్తవా న్హరిస త్తమాన్,
అశీతిం యోజనానాం తు ప్లవేయం ప్లవగేశ్వరాః!. ౯

తేషాం కథయతాం తత్ర సర్వాం స్తా ననుమాన్య చ,
తతో వృద్ధతమ స్తేషాం జామ్బవా న్ప్రత్యభాషత. ౧౦

పూర్వ మస్మాక మ ప్యాసీ త్కశ్చి ద్గతిపరాక్రమః,
తే వయం వయసః పార మనుప్రాప్తాః స్మ సాంప్రతమ్. ౧౧
కింతు నైవం గతే శక్య మిదం కార్య ముపేక్షితుమ్,
యదర్థం కపిరాజశ్చ రామశ్చ కృతనిశ్చయౌ. ౧౨

సాంప్రతం కాలభేదేన యా గతి స్తాం నిబోధత,
నవతిం యోజనానాం తు గమిష్యామి న సంశయః. ౧౩

తాంశ్చ సర్వా న్హరిశ్రేష్ఠా జ్జామ్బవా న్పున రబ్రవీత్,

న ఖ ల్వేతావ దే వాసీ ద్గమనే మే పరాక్రమః. ౧౪
మయా మహాబలే శ్చైవ యజ్ఞే విష్ణు స్సనాతనః,
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణ స్త్రివిక్రమమ్. ౧౫

ముఁడు తా నేఁబదియామడల దూరమునకు లంఘింపఁగలఁడని నుడివెను. ౬

అప్పుడు "నేను అఱువదియోజనంబులదూరము దాటఁగలను" అని మైందుఁడను వానరవీరుఁడు ఆవానరులతో వక్కాణించెను. ౭

అంత నప్పుడు మహాపరాక్రమశాలి ద్వివిదుఁడు "నేను డెబ్బదియోజనంబుల దూరమువఱకు లంఘింపఁగలను సందియములేదు" అని పలికెను. ౮

వానరోత్తముఁడగు సుషేణుఁడు ఆవానరవీరుల నందఱంజూచి "వానరవర్యులారా! నేను ఎనుబదియోజనంబుల దూరమునకు లంఘింపఁగలను" అని వచించెను. ౯

అప్పుడు అట్లు ఆవానరవీరులు చెప్పుచుండఁగా సమస్తవానరులలోను అందఱికన్నను వృద్ధుఁడగు జాంబవంతుఁడు వారి యనుజ్ఞఁగొని యిట్లని పలికెను. ౧౦

పూర్వము నేనును గొంతవఱకు లంఘించుటయందు సామర్థ్యముగలిగి యుంటిని. అయితే ఇప్పుడు చాలవయస్సుచెల్లి ముసలివాఁడనైతిని. ౧౧

ఇప్పుడేమన్నను అట్లు నేను ముసలివాఁడనైనను రాముని కార్యమును వానరరాజుసుగ్రీవునిచే నవలంబింపఁబడినదియునగు నీకార్యము నెంతమాత్రము నశ్రద్ధ సేయరాదు. ౧౨

ఇప్పుడు వయసుచెల్లి ముసలివాఁడనై యుండునప్పుడు ఎంతదూరము లంఘింపఁగలనో దానిఁ జెప్పెదను వినుఁడు; ఇప్పుడు తొంబదియామడలవఱకు లంఘింపఁగలను; సందేహము లేదు. అని జాంబవంతుఁడు పలికెను. ౧౩

అంత మఱల జాంబవంతుఁ డవ్వానరులంజూచి యిట్లని వక్కాణించెను.

నాకు మున్ను యౌవనకాలంబున నాకాశగమనంబునందుండిన శక్తి యింతమాత్రమే గాదు; పూర్వము బలిచక్రవర్తియాగంబున సనాతనుఁడగు విష్ణుదేవుఁడు త్రివిక్రమావతారంబున మూఁడడుగులు కొలుచుకొనునప్పుడు అంతలోఁ ద్రైలోక్యము నతిక్రమించియున్న యతని యాకారమును నేను ప్రదక్షిణముగాఁ జుట్టివచ్చినాను. ౧౪,౧౫

స ఇదానీ మహం వృద్ధః ప్లవనే మన్దవిక్రమః,
యౌవనేచ తదాఽఽసీ న్మే బల మప్రతిమం పరైః. ౧౬

సంప్ర త్యేతావతీం శ క్తిం గమనే తర్కయా మ్యహమ్,
నై తావతా హి సంసిద్ధిః కార్య స్యాస్య భవిష్యతి. ౧౭

అథో త్తర ముదారార్థ మబ్రవీ దఙ్గద స్తదా,
అనుమాన్య మహాప్రాజ్ఞం జామ్బవ న్తం మహాకపిః. ౧౮

అహ మేత ద్గమిష్యామి యోజనానాం శతం మహత్,
నివ ర్తనేతు మే శ క్తి స్స్యా న్న వేతి న నిశ్చితా. ౧౯

త ముప్వాచ హరిశ్రేష్ఠం జామ్బవా న్వాక్యకోవిదః,

జ్ఞాయతే గమనే శ క్తి స్తవ హర్యృక్షస త్తమ!. ౨౦

కామం శతంసహస్రం వా న హ్యేష విధి రుచ్యతే,
యోజనానాం భవాన్ శక్తో గన్తుం ప్రతినివ ర్తితుమ్. ౨౧

న హి ప్రేషయితా తాత! స్వామీ ప్రేష్యః కథంచన,
భవతాఽయం జన స్సర్వః ప్రేష్యః ప్లవగస త్తమ!. ౨౨

భవా న్కళత్ర మస్మాకం స్వామిభావే వ్యవస్థితః,

నాకు యౌవనకాలమునందు ఆకాశగమనంబున నట్టి యసదృశమయిన బలంబు గలిగియుండెను; అట్టి నే నిప్పుడు వృద్ధుఁడ నైతిని. గావున దాఁటుట యందు అంతగా బలములేనివాఁడ నైతిని. ౧౬

ఈయవస్థయందు తొంబదియామడలదూరము లంఘింపఁగలనని తలఁచుచున్నాను. అయితే లంకకు నూఱుయోజనంబులసముద్రమును దాఁటిపోవలెను గావున నింతమాత్రమునఁగూడ ఈకార్యము సిద్ధింపదు. అని జాంబవంతుఁడు చెప్పెను. ౧౭

అంత నప్పుడు యువరాజయిన యంగదుఁడు మహాపండితుఁడగు జాంబవంతుని యనుజ్ఞనొంది యధికమయిన యర్థము గల్గునట్లు ఆపైఁ జెప్పవలసిన తనబలంబు కొలఁదిం జెప్పెను. ౧౮

నేను ఈనూఱుయోజనంబుల దూరంబును లంఘించిపోఁగలను. అయితే మరలివచ్చుటకు నాకు శక్తియుండునో లేదో నేను నిశ్చయముగాఁ జెప్పఁజాలను. అని యంగదుఁడు చెప్పెను. ౧౯

వానరోత్తముఁడును మాటలుచెప్పుటయందుఁ బండితుఁడునగు జాంబవంతుఁడు అంగదుంజూచి యిట్లని వచించెను.

వానరవీరులలో భల్లూకవీరులలోను వరిష్ఠుఁడవగు నంగదుఁడా! లంఘనమునందు నీసామర్థ్యము కొలఁదికి మీఱినదని మాకుఁ దెలిసియేయున్నది. ౨౦

నీవు నూఱు యోజనంబులుమాత్రమేగాదు వేయియోజనంబులేని దాఁటిపోవుటకును అట్లే మరలివచ్చుటకును సమర్థుఁడవు. ఇందు సంశయము లేదు. అయితే నీవు రాజవు. కార్యమునకై నిన్నుఁబంపుట యెంతమాత్రము సరిగాదు. ౨౧

నాయనా! వానరోత్తముఁడా! స్వామివి నీవు. ఈ సమస్తవానరులను కార్యము నిమిత్తమయి పంపవచ్చునేగాని నీవు రాజవు ఒకానొకప్పుడును ఎంతమాత్రము పంపఁదగినవాఁడవు కావు. ౨౨

శత్రువులఁ దపింపఁ జేయునట్టి యంగదుఁడా! నీవు మాకు స్వామివి.

స్వామి కళత్రం సైన్యస్య గతి రేషా పరన్తప!. ౧౩

తస్మా త్కళత్రవ త్తాత! ప్రతిపాల్య స్సదా భవాన్,

అపి చైతస్య కార్యస్య భవా న్మూల మరిన్దమ!. ౧౪

మూల మర్థస్య సంరక్ష్య మేష కార్యవిదాం నయః,
మూలే సతి హి సిధ్యన్తి గుణాః పుష్పఫలాదయః. ౧౫

త ద్భవా నస్య కార్యస్య సాధనే సత్యవిక్రమ!,
బుద్ధివిక్రమసంపన్నో హేతు రత్ర పరన్తప!. ౧౬

గురు శ్చ గురుపుత్త్ర శ్చ త్వం హి నః కపిసత్తమ!,
భవన్త మాశ్రిత్య వయం సమర్థా హ్యర్థసాధనే. ౧౭

ఉక్తవాక్యం మహాప్రాజ్ఞం జామ్బవన్తం మహాకపిః,
ప్రత్యువాచోత్తరం వాక్యం వాలిసూను రథాఙ్గదః. ౧౮
యది నాహం గమిష్యామి నాన్యో వానరపుఙ్గవః,
పునః ఖల్విద మస్మాభిః కార్యం ప్రాయోపవేశనమ్. ౧౯

న హ్యకృత్వా హరిపతే స్సందేశం తస్య ధీమతః,
తత్రాపి గత్వా ప్రాణానాం పశ్యామి పరిరక్షణమ్ ౨౦
స హి ప్రసాదే చాత్యర్థం కోపే చ హరి రీశ్వరః,

కావున మేమందఱము నిన్ను రక్షింపవలెను. సైనికులందఱును భార్యనువలె స్వామిని జాగ్రత్తతో రక్షింపవలెననుట సిద్ధాంతము. ౨౩

అట్లగుటంజేసి నిన్ను మేమందఱము నెల్లప్పుడును భార్యనువలె బహు జాగ్రత్తతో రక్షింపవలెను.

శత్రువుల సంహరించునట్టి యంగదుఁడా! ఇంతియగాక ఈకార్యమునకంతయు వృక్షమునకు వేఱువలె నీవు ముఖ్యభూతుఁడవు. ౨౪

కార్యమునకంతయు మూలమువంటిదైన వస్తువును ముఖ్యముగా రక్షింపవలెను. ఏలయనఁగా వృక్షమునందు వేఱు చక్కఁగా నున్నంగదా పూలు ఫలములు మొదలగు గుణములు సిద్ధించును! ౨౫

సత్యపరాక్రముఁడా! శత్రువుల సంహరించువాఁడా! అట్లు ఇచట నీ కార్యసాధనమునందు నీవే బుద్ధియుఁ బరాక్రమంబునుగల్గి మాకందఱకును ముఖ్యకారకుఁ డయినవాఁడవు; నీవు లంకకుఁబోయినచో మే మందఱము నిచట నెవ్వరి నాశ్రయించియుందుము? ౨౬

వానరోత్తముఁడ వగునంగదుఁడా! ఇంతియగాక మాకందఱకును నీవు రాజవు, రాజపుత్త్రుఁడవునుగదా! నిన్నాశ్రయించియేగదా మేము కార్యసాధనంబున సమర్థులమగుదుము! నీవు లేనిచో మేమేమి సేయఁగలము? అని జాంబవంతుఁ డంగదునితోఁ బలికెను. ౨౭

మహాపండితుఁ డగు జాంబవంతుఁ డట్లు పలుకుటయు వాలికుమారుఁ డయినయంగదుఁడు అతనింజూచి యిట్లని బదులుచెప్పెను. ౨౮

సముద్రంబు దాఁటుటకు నేనును బోక మఱియొక వానరోత్తముఁడునుం బోవఁడేని, ఇఁక మనమందఱమును మరలఁ బ్రాయోపవేశము సేయవలసినదేకదా! ౨౯

బుద్ధిమంతుఁడగు వానరరాజు సుగ్రీవునియాజ్ఞను నెఱవేర్పక గడువునుందప్పి యాకిష్కింధకుఁబోయినను మనకు జీవితాశయేమోలేదుగదా! ౩౦

ఆసుగ్రీవుఁడు మెప్పువడసిన మిక్కిలియు ననుగ్రహించువాఁడును

అతీత్య తస్య సందేశం వినాశో గమనే భవేత్. ౩౧

తద్యథా హ్యస్య కార్యస్య న భవత్యన్యథా గతిః,
తద్భవానేవ దృష్టార్థ స్సంచిన్తయితుమర్హతి. ౩౨

సోఽఙ్గదేన తదా వీరః ప్రత్యుక్తః ప్లవగర్షభః,
జామ్బవానుత్తరం వాక్యం ప్రోవాచేదం తతోఽఙ్గదమ్. ౩౩

అస్య తే వీర! కార్యస్య న కించిత్పరిహీయతే,
ఏష సంచోదయామ్యేనం యః కార్యం సాధయిష్యతి. ౩౪

తతః ప్రతీతం ప్లవతాం వరిష్ఠ
మేకాన్తమాశ్రిత్య సుఖోపవిష్టమ్,
సంచోదయామాస హరిప్రవీరో
హరిప్రవీరం హనుమన్తమేవ. ౩౫

ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే పఞ్చషష్టితమ స్సర్గః. ౬౫.

## షట్షష్టితమ స్సర్గః.

అనేకశతసాహస్రీం విషణ్ణాం హరివాహినీమ్,
జామ్బవాం త్సముదీక్ష్యైవ హనూమన్తమథాబ్రవీత్. ౧

వీర! వానరలోకస్య సర్వశాస్త్రవిదాం వర!,
తూష్ణీమేకాన్తమాశ్రిత్య హనూమన్! కిం న జల్పసి. ౨

తప్పుచూచిన మిక్కిలియు నిగ్రహించువాఁడునుగదా! అతఁడు విధించినగడువునుండప్పి సీతనుంజూడక యచటికిఁ బోవుదుమేని యతఁడు మనల నందఱ వధించుట సిద్ధము. ౩౧

అట్లగుటంజేసి నీవు సర్వముం దెలిసినవాఁడవు. ఈకార్యము చెడకుండునట్టి వెరవు నీవు చక్కఁగా నాలోచింపవలయును. అని యంగదుఁడు జాంబవంతునితోఁ బలికెను. ౩౨

పరాక్రమవంతుఁడువానరోత్తముఁడునగు నజ్జాంబవంతుఁడు అప్పుడు అంగదుఁడుపలికిన తెఱంగువిని యంత నంగదుంజూచి యిట్లని ప్రత్యుత్తరంబుఁ జెప్పెను. ౩౩

పరాక్రమశాలివగు నంగదుఁడా! నీకార్యమునకుఁ గొంచెమయినను గొఱంత గలుగదు. ఈకార్యంబు సాధింపఁగల మహావీరు నిదిగో పంపుచున్నాను. అని జాంబవంతుఁడు అంగదునితోఁ జెప్పెను. ౩౪

అంత వానరవీరులలో మేటియగు జాంబవంతుఁడు అచ్చటి వానరుల నందఱ నుపేక్షించి బలపరాక్రమంబులం బ్రఖ్యాతుఁడును ఆకాశంబునకెగసి తిరుగువారిలో సత్తముఁడునగువాని నేకాంతప్రదేశంబున సుఖముగాఁ గూర్చుండియున్నవాని వానరవీరులకెల్ల మేటివీరుఁ డనఁబరఁగిన వాని హనుమంతుంజేరి యతని సముద్రతరణార్థమయి ప్రేరించెను. ౩౫

ఇది యఱువదియైదవసర్గము.

## అఱువదియాఱవసర్గము.

అంత జాంబవంతుఁడు పెక్కులక్షలసంఖ్యగల యవ్వానరసేనయంతయు దుఃఖితమయి యుండుటంగని ఈహనుమంతుంజేర నరిగి యిట్లనిపలికెను. ౧

వానరులకెల్ల మేటివీరుఁడవు సమస్తశాస్త్రములయందును బండితుఁడవునగు హనుమంతుఁడా! నీవు ఏకాంతస్థలంబున నూరక కూర్చుండియున్నావే కాని ఏలపలుకవు? ౨

హనూమన్! హరిరాజస్య సుగ్రీవస్య సమో హ్యసి,
రామలక్ష్మణయో శ్చాపి తేజసా చ బలేనచ. ౩
అరిష్టనేమినః పుత్త్రో వైనతేయో మహాబలః,
గరుత్మా నితి విఖ్యాత ఉత్తమ స్సర్వపక్షిణామ్. ౪
బహుశో హి మయా దృష్ట స్సాగరే స మహాబలః,
భుజగా నుద్ధర న్పక్షీ మహావేగో మహాయశాః. ౫

పక్షయో ర్య ద్బలం తస్య తావ ద్భుజబలం తవ,
విక్రమ శ్చాపి వేగశ్చ నతే తే నావహీయతే. ౬

బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్త్వంచ హరిసత్తమ!,
విశిష్టం సర్వభూతేషు కి మాత్మానం నబుధ్యసే. ౭

అప్సరాప్సరసాం శ్రేష్ఠా విఖ్యాతా పుఞ్జికస్థలా,
అఞ్జనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః. ౮
విఖ్యాతా త్రిషు లోకేషు రూపే ణాప్రతిమా భువి,
అభిశాపా దభూ త్తాత వానరీ కామరూపిణీ. ౯
దుహితా వానరేన్ద్రస్య కుఞ్జరస్య మహాత్మనః,
కపిత్వే చారుసర్వాఙ్గీ కదాచి త్కామరూపిణీ. ౧౦
మానుషం విగ్రహం కృత్వా రూపయౌవనశాలినీ,
విచిత్రమాల్యాభరణా మహార్హక్షౌమవాసినీ. ౧౧
అచర త్పర్వత స్యాగ్రే ప్రావృడమ్బుదసన్నిభే,
తస్యా వస్త్రం విశాలాక్ష్యాః పీతం రక్తదశంశుభమ్. ౧౨
స్థితాయాః పర్వత స్యాగ్రే మారుతో௨పాహర చ్ఛనైః,

హనుమంతుఁడా! నీవు పరాక్రమంబునను బలంబునను వానరరాజు సుగ్రీవునితోను రామలక్ష్మణులతోను సరివచ్చువాఁడవుగదా! ౩

కశ్యపప్రజాపతికి వినతయందుఁ బుట్టినవాఁడు మహాబలశాలి సమస్త పక్షులలోను శ్రేష్ఠుఁడు గరుత్మంతుఁడని పేరుగలవాఁడొకఁడు గలఁడు. ౪

మహాబలశాలియు నధికమయిన వేగముగలవాఁడును మహాకీర్తిశాలియు నగు నాగరుత్మంతుఁడు సముద్రంబున సర్పంబులం బట్టుకొనిపోవునపుడు అతని నేను బెక్కుమార్లు చూచియున్నాను. ౫

ఆగరుత్మంతుని ఱెక్కల కెంత బలముగలదో నీబాహువుల కంత బలముగలదు; నీపరాక్రమంబును వేగంబును అతనిపరాక్రమవేగంబులకు ఎంతమాత్రము తక్కువైనవికాదు. ౬

వానరశ్రేష్ఠుఁడవగు హనుమంతుఁడా! నీబలంబును బుద్ధియుఁ బరాక్రమంబును ధైర్యంబును మఱి యేభూతంబునందుం గానను; అట్టి నిన్ను నీ వెఱుంగవా యేమి? ౭

నాయనా! ముల్లోకంబులను బ్రసిద్ధివహించినదియు రూపసౌందర్యంబుల నసదృశయునగు పుంజికస్థలయను నచ్చరమిన్న శాపమువలన మహాపరాక్రమశాలియగు వానరోత్తముఁడయిన కుంజరునకుఁ గొమార్తెయయి వానరయోనియందుఁబుట్టి కామరూపిణియయి యంజనయను పేరఁబరఁగుచుఁ గేసరిని వివాహమాడెను. ౮,౯

వానరిగానున్నను సర్వాంగసుందరి యిచ్ఛకువచ్చినరూపము ధరింపఁ జాలినదియునగు నయ్యంజన యొకానొకప్పుడు మనుష్యస్త్రీరూపము దాల్చి రూపయౌవనంబులం దేజరిల్లుచు నానావిధములయిన పుష్పమాలికలును భూషణంబులును ధరించి మంచి పట్టుపుట్టంబుగట్టి వర్షాకాలమేఘంబువలె నీలవర్ణమయిన పర్వతశిఖరంబున సంచరించెను. ౧౦,౧౧

అట్లు పర్వతాగ్రంబున సంచరించునపుడు వెడఁదకన్నులుగల యయ్యంజనయొక్క సుందరమయిన యొఱ్ఱనియంచులుగల పసుపుపట్టుపుట్టంబు వాయువేగంబునకుఁ గొంతదొలంగెను. ౧౨

స దదర్శ తత స్తస్యా వృత్తా వూరూ సుసంహితౌ. ౧౩
స్తనౌ చ పీనౌ సహితౌ సుజాతం చారు చాననమ్,

తాం విశాలాయతశ్రోణీం తనుమధ్యాం యశస్వినీమ్. ౧౪
దృష్ట్వైవ శుభసర్వాఙ్గీం పవనః కామమోహితః,

స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః. ౧౫
మన్మథావిష్టసర్వాఙ్గో గతాత్మా తా మనిన్దితామ్,

సా తు తత్రైవ సంభ్రాన్తా సువృత్తా వాక్య మబ్రవీత్. ౧౬
ఏకపత్నీవ్రత మిదం కో నాశయితు మిచ్ఛతి,
అఞ్జనాయా వచ శ్శ్రుత్వా మారుతః ప్రత్యభాషత. ౧౭

న త్వాం హింసామి సుశ్రోణి! మాభూత్తే సుభగే! భయమ్,
మనసాస్మి గతో య త్త్వాం పరిష్వజ్య యశస్వినీమ్. ౧౮
వీర్యవా న్బుద్ధిసంపన్నః పుత్ర స్తవ భవిష్యతి,

మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః. ౧౯
లఙ్ఘనే ప్లవనే చైవ భవిష్యతి మయా సమః,

ఏవ ముక్తా తత స్తుష్టా జననీ తే మహాకపే. ౨౦
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభమ్,

అభ్యుత్థితం తత స్సూర్యం బాలో దృష్ట్వా మహావనే. ౨౧
ఫలం చేతి జిఘృక్షు స్త్వ ముత్ప్లుత్యాభ్యుద్గతో దివమ్,

అట్లు వస్త్రంబు దొలంగుటయు వాయుదేవుఁడు సుందరంబులయి యొండొంటిం గదిసియున్న యాయంజనతొడలను బలిసియొకటితో నొకటి యొరయుచుండు స్తనంబులను సుందరంబగు మొగంబునుం గాంచెను ౧౩

ఆ యంజన విశాలంబులగు పిఱుఁదులును సన్ననికౌనును మంగళ విగ్రహంబును సుందరములగు సమస్తావయవంబులనుం జూచినంతనే వాయుదేవుఁడు మన్మథమోహితుఁడయ్యెను. ౧౪

అంత వాయువు సర్వాంగసుందరియగు నాయంజనయందుఁ దగిలిన మనస్సుగలవాఁడై సమస్తావయవంబులను మన్మథావేశంబునొంది యాయంజనను దీర్ఘంబులగు బాహువులం గవుఁగిలించెను. ౧౫

పతివ్రతయగు నాయంజన యప్పుడు తొట్రుపాటుతో "ఎవ్వఁడు నాపాతివ్రత్యముఁ జెఱుపవచ్చినాఁడు" అను నీవచనంబుఁ బలికెను.

అంజన చెప్పినమాటను విని వాయుదేవుఁ డిట్లని బదులుపలికెను. ౧౬

సుందరములయిన పిఱుఁదులుగలదానా! సర్వాంగసుందరీ! నేను బతివ్రతవగు నిన్నుఁ గౌఁగిలించి మనస్సుచే నీలోఁ బ్రవేశించితినిగాని చెఱుగాను కావున నీపాతివ్రత్యమునకు భంగములేదు; నీవు భయపడవలదు.

నీకు మహాపరాక్రమశాలియు మహాబుద్ధిశాలియునగు కొడుకు పుట్టఁ గలఁడు.

మఱియు నాతఁడు మహాధైర్యుఁడును మహాప్రభావుఁడును గొలఁది లేని బలపరాక్రమంబులుగలవాఁడును దాఁటుటయందును ఆకాశగమనంబునందును నాకు సదృశుఁడునై యుండఁగలఁడు. ౧౮

మహాబాహుఁడవగు హనుమంతుఁడా! ఇవ్విధంబున వాయుదేవుఁడు పలుకుటయు నీతల్లి యంజనాదేవి సంతోషించినదై గుహయందు సత్త్వవానరోత్తముని నిన్నుఁ బ్రసవించెను. ౨౦

అంత నీవు జన్మమునొందినంతనే బాలుఁడవైయే యమ్మహారణ్యంబున సూర్యుఁ డుదయించుటనుజూచి యది యొకఫలం బని తలఁచి దానిం దినుటకై యెగిరి యాకాశమార్గంబునఁ బోతివి. ౨౧

శతాని త్రీణి గత్వాఽథ యోజనానాం మహాకపే!. ౨౨
తేజసా తస్య నిర్ధూతో నవిషాదం తతో గతః,

తావదాపతత స్తూర్ణ మన్తరిక్షం మహాకపే!. ౨౩
క్షిప్త మిన్ద్రేణ తే వజ్రం క్రోధావిష్టేన ధీమతా,

తదా శైలాగ్రశిఖరే వామో హను రభజ్యత ౨౪
తతో హి నామధేయం తే హనూమా నితి కీర్త్యతే,
తత స్త్వాం నిహతం దృష్ట్వా వాయు ర్గన్ధవహ స్స్వయమ్. ౨౫
త్రైలోక్యే భృశసంక్రుద్ధో న వవౌ వై ప్రభఞ్జనః,

సంభ్రాన్తాశ్చ సురా స్సర్వే త్రైలోక్యే క్షుభితే సతి. ౨౬
ప్రసాదయన్తి సంక్రుద్ధం మారుతం భువనేశ్వరాః,
ప్రసాదితే చ పవనే బ్రహ్మా తుభ్యం వరం దదౌ. ౨౭
అశస్త్రవధ్యతాం తాత! సమరే సత్యవిక్రమ!,

వజ్రస్యచ నిపాతేన విరుజం త్వాం సమీక్ష్య చ. ౨౮
సహస్రనేత్రః ప్రీతాత్మా దదౌ తే వరముత్తమమ్,
స్వచ్ఛన్దతశ్చ మరణం తే భూయా దితి వై ప్రభో. ౨౯
స త్వం కేసరిణః పుత్రః క్షేత్రజో భీమవిక్రమః,
మారుత స్యౌరసః పుత్ర స్తేజసా చాపి తత్సమః. ౩౦

త్వంహి వాయుసుతో వత్స! ప్లవనే చాపి తత్సమః,

వానరోత్తముఁడా! అంత నీవు పెక్కునూఱ్ఱయోజనంబులదూరము ఆకాశంబునంబోయి సూర్యునివేఁడిమికి ఎంతమాత్రము శ్రమము నొందవైతివి. ౨౨

వానరోత్తముఁడా! నీవు బహువేగంబున నట్లు అంతరిక్షంబున నంత దూరమువఱకు వచ్చుటంజూచి బుద్ధిమంతుఁడగు నింద్రుఁడు నీవలన లోకమున కేమి చేటుగలుగునో యని శంకించి కుపితుఁడై నీపై వజ్రాయుధంబుఁ బ్రయోగించెను. ౨౩

అంత ఆ వ్రేటునకు నీవు పర్వతశిఖరంబునంబడుటయు నీయెడమహనువు విఱిగినది. అందువలననే నీకు హనుమంతుఁడని పేరు పరఁగినది. ౨౪

సమస్తమును విఱిచివేయువాఁడును గంధమువహించి లోకములకు సుఖము గలిగించువాఁడునగు వాయుదేవుఁడు ఇంద్రుఁడు నిన్నట్లుకొట్టి పడఁద్రోయుటం జూచి పరమకుపితుఁడగుటయు ముల్లోకంబులను ఎంతమాత్రము గాలివీవకుండెను. ౨౫

అంత ముల్లోకంబులును క్షుభితంబులగుటయు లోకనాథులగు సురలు సంభ్రమంబునొంది కుపితుఁడగు వాయుదేవు నాశ్వాసించిరి. ౨౬

సత్యపరాక్రముఁడవగు నాయనా! అంత వాయువు ప్రసన్నుఁడయిన పిదప బ్రహ్మదేవుఁడు యుద్ధంబున నాయుధంబులచే వధ్యుఁడవు గాకుండునట్లు నీకు వరం బొసంగెను. ౨౭

సమర్థుఁడవగు హనుమంతుఁడా! దేవేంద్రుఁడు వజ్రాయుధంబు వ్రేటు నొందియు నీవు నొవ్వకుండుటం జూచి సంతుష్టుఁడై నీకు ఇచ్ఛవచ్చినపుడే మరణము గల్గునట్లుగా నుత్తమంబగువరంబు నొసంగెను. ౨౮,౨౯

అట్లు భయంకరమయిన పరాక్రమముగల నీవు కేసరికి క్షేత్రజపుత్త్రుఁడవు; వాయువునకు ఔరసపుత్త్రుఁడవు; పరాక్రమంబున ఆవాయువునకు సరియయినవాఁడవు. ౩౦

నాయనా! నీవు సాక్షాద్వాయుకుమారుఁడవు; ఎగురుటయందు ఆవా-

వయ మద్య గతప్రాణా భవా న్న స్త్రాతు సామ్ప్రతమ్. ౩౧
దాక్ష్యవిక్రమసమ్పన్నః పక్షిరాజ ఇ వాపరః,

త్రివిక్రమే మయా తాత స్శైలవనకాననా. ౩౨
త్రిస్స ప్తకృత్వః పృథివీ పరిక్రాన్తా ప్రదక్షిణమ్,

తథా చౌషధ యోఽస్మాభి స్సంచితా దేవశాసనాత్. ౩౩
నిష్పన్న మమృతం యాభి స్తదాఽఽసీ న్నో మహ ద్బలమ్,

స ఇదానీ మహం వృద్ధః పరిహీనపరాక్రమః. ౩౪
సామ్ప్రతం కాల మస్మాకం భవా౯ సర్వగుణాన్వితః,
త ద్విజృమ్భస్వ విక్రాన్తః ప్లవతా ము త్తమో హ్యసి. ౩౫

త్వద్వీర్యం ద్రష్టుకా మేయం సర్వా వానరవాహినీ,
ఉ త్తిష్ఠ హరిశార్దూల! లఙ్ఘయస్వ మహార్ణవమ్. ౩౬
పరా హి సర్వభూతానాం హనూమ౯! యా గతి స్తవ,
విషణ్ణా హరయ స్సర్వే హనూమ! న్కి ముపేక్షసే. ౩౭
విక్రమస్వ మహావేగో విష్ణు స్త్రీ న్విక్రమా నివ.

తతస్తు వై జామ్బవతా ప్రచోదితః
ప్రతీతవేగః పవనాత్మజః కపిః,
ప్రహర్షయం స్తాం హరివీరవాహినీం
చకార రూపం మహదాత్మన స్తదా. ౩౮
ఇతి శ్రీమత్కిష్కిన్ధాకాణ్డే షట్షష్టితమ స్సర్గః. ౬౬.

యువునకు సరియయినవాఁడవు రెండవగరుత్మంతుఁడో యనఁదగినవాఁడవు సామర్థ్యంబును బరాక్రమంబును గలవాఁడవు, ఇపుడు మాకుఁ బ్రాణంబులు దక్కుట కష్టముగానున్నది కావున నీ విపుడు మమ్మందఱను రక్షింపవలయును. ౩౧

నాయనా! విష్ణుదేవుఁడు త్రివిక్రమావతారంబు నొందినపుడు నేను పర్వతములతో నరణ్యములతోనుం గూడిన యీభూమండలమున కంతయు నిరువదియొకమాఱు ప్రదక్షిణము గావించితిని. ౩౨

ఇంతియుగాక మున్ను అమృతమథనంబున సముద్రమున వేసి చిలుకుటకై దేవతలపంపున నానావిధమూలికలను బ్రోవుచేసితిని. ఆ యోషధులు వేసి చిలుకుటవలననే సముద్రంబునుండి యమృతంబు పుట్టినది. అప్పుడు మాకు అధికబలం బుండినది. ౩౩

అట్టివాఁడను నే నిప్పుడు ముసలివాఁడనైనందున నాపరాక్రమంబు తగ్గినది. ఈకాలమునందు మాలో నెల్ల నీవయన్నిశక్తులుం గలవాఁడవు. ౩౪

అందువలనఁ బరాక్రమం బవలంబించి విజృంభింపుము; నీవు దాఁటువారలలో నుత్తముఁడవుగదా! ౩౫

వానరోత్తముఁడా! ఈవానరవీరులందఱు నీపరాక్రమముఁ జూచుటకై నిరీక్షించియున్నారు. లేచి సముద్రంబు లంఘింపుము. ౩౬

హనుమంతుఁడా! నీకుంగల గమనశక్తి యేభూతంబునకును లేదుగదా!

హనుమంతుఁడా! వానరులందఱు దిగులుపడియుండఁగా నీ విట్లుపేక్షింపవచ్చునా? మున్ను విష్ణుదేవుఁడు బలిచక్రవర్తియొసఁగిన మూఁడడుగుల నాక్రమించినట్లు నీవు మహావేగంబుపూని సముద్రంబు లంఘింపుము. అని జాంబవంతుఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౩౭

అంత నపుడట్లు జాంబవంతుఁడు బోధించి ప్రేరింప మేల్కాని దనబలపరాక్రమవేగాతిశయంబుఁ దెలిసి ఆవానరవీరులందఱుఁ బరమసంతోషంబు నొందునట్లు అద్భుతంబుగా మేనుఁ బెంచెను. ౩౮

ఇది యఱువదియాఱవసర్గము.

---

## సప్తషష్టితమస్సర్గః.

తం దృష్ట్వా జృంభమాణం తే క్రమితుం శతయోజనమ్,
వీర్యేణాపూర్యమాణంచ సహసా వానరోత్తమమ్. ౧
సహసా శోక ముత్సృజ్య ప్రహర్షేణ సమన్వితాః,
వినేదు స్తుష్టువు శ్చాపి హనుమన్తం మహాబలమ్. ౨
ప్రహృష్టా విస్మితా శ్చాపి వీక్షన్తే స్మ సమన్తతః,
త్రివిక్రమం కృతోత్సాహం నారాయణమివ ప్రజాః. ౩

సంస్తూయమానో హనుమా న్వ్యవర్ధత మహాబలః,
సమావిధ్యచ లాఙ్గూలం హర్షాచ్చ బల మేయివాన్. ౪

తస్య సంస్తూయమానస్య సర్వై ర్వానరపుఙ్గవైః,
తేజసా పూర్యమాణస్య రూప మాసీ దనుత్తమమ్. ౫

యథా విజృమ్భతే సింహో వివృద్ధో గిరిగహ్వరే,
మారుత స్యౌరసః పుత్ర స్తథా సమ్ప్రతి జృమ్భతే. ౬
అశోభత ముఖం తస్య జృమ్భమాణస్య ధీమతః,
అమ్బరీషమి వాఽఽదీప్తం విధూమ ఇవ పావకః. ౭

హరీణా ముత్థితో మధ్యా త్సమ్ప్రహృష్టతనూరుహః,
అభివాద్య హరీ న్వృద్ధా న్హనూమా నిద మబ్రవీత్. ౮

అరుజ త్పర్వతాగ్రాణి హుతాశనసఖోఽనిలః,
బలవా నప్రమేయశ్చ వాయు రాకాశగోచరః. ౯

## అఱువదియేడవసర్గము.

అంత నూఱుయోజనంబుల సముద్రంబు లంఘింపఁబూని వృద్ధినొందుచున్నవాని నంతకంతకుఁ బరాక్రమంబున నతిశయించుచున్నవాని వానరోత్తము నా హనుమంతుంజూచి యవ్వానరవీరులు శీఘ్రమున దుఃఖమువిడిచి పరమానందంబునొంది సింహనాదంబులు సేయుచు మహాబలుఁడగు నా హనుమంతుఁ బ్రస్తుతించిరి. ౧,౨

త్రివిక్రమావతారంబున నారాయణునిభూతంబులు చూచినట్లుఅవ్వానరులందఱు సముద్రంబు దాఁటుటయం దుత్సాహంబునొంది వృద్ధిఁబొందుచున్న యా హనుమంతుని సంతోషము నాశ్చర్యంబునుం బొంది చూచిరి. ౩

మహాబలశాలియగు నాహనుమంతుఁడు తన్ను నట్లు వానరు లనేకవిధంబులఁ బొగడుటయు సంతోషోత్సాహంబు లతిశయిల్లఁ దోఁకయాడించుచు అంతకంతకు బలపరాక్రమంబుల వృద్ధినొందెను. ౪

అట్లు వృద్ధులగు వానరవీరులు చేయుస్తోత్రములవలన నంతకంతకు వృద్ధిఁబొందుచున్న పరాక్రమముతో నొప్పుచున్న యాహనుమంతుని యాకారం బద్భుతమయి చూపట్టెను. ౫

పర్వతగుహయందు సింహంబు విజృంభించువిధంబున నప్పుడు వాయుకుమారుఁడగు హనుమంతుఁడు విజృంభించెను. ౬

అట్లు బలపరాక్రమంబుల మేనుఁ బెంచుచున్న బుద్ధిమంతుఁడగు నా హనుమంతునిముఖంబు జ్వలించుచున్న వేఁపుడుచట్టివలెను ధూమరహితంబగు నగ్నివలెను దేదీప్యమానంబై యొప్పెను. ౭

అంత హనుమంతుఁడు వానరమధ్యంబునుండిలేచి మేనం బ్రహర్షంబునఁ బులకలుపొడమఁ బెద్దలగు వానరులకెల్ల నమస్కరించి యిట్లని పలికెను. ౮

నిప్పుచెలియగు వాయుదేవుఁడు గమనశీలుఁడు బలవంతుఁడు కొలఁదిలేని శక్తిగలవాఁడు ఆకాశంబుననే సంచరించువాఁడు, అతఁడు పర్వతశిఖరంబులనేనియు విఱిచివేసియున్నాఁడు. ౯

తస్యాహం శీఘ్రవేగస్య శీఘ్రగస్య మహాత్మనః,
మారుతస్యౌరసః పుత్రః ప్లవనే నాస్తి మత్సమః. ౧౦

ఉత్సహేయం హి విస్తీర్ణ మాలిఖన్త మివామ్బరమ్,
మేరుం గిరి మసఙ్గేన పరిగన్తుం సహస్రశః. ౧౧

బాహువేగప్రణున్నేన సాగరే ణాహ ముత్సహే,
సమాప్లావయితుం లోకం సపర్వతనదీహ్రదమ్. ౧౨

మ మోరుజఙ్ఘవేగేన భవిష్యతి సముత్థితః,
సమ్మూర్ఛితమహాగ్రాహ స్సముద్రో వరుణాలయః. ౧౩
పన్నగాశన మాకాశే పతన్తం పక్షిసేవితే,
వైనతేయ మహం శక్తః పరిగన్తుం సహస్రశః. ౧౪

ఉదయాత్ప్రస్థితం వాపి జ్వలన్తం రశ్మిమాలినమ్,
అనస్తమిత మాదిత్య మభిగన్తుం సముత్సహే. ౧౫

తతో భూమి మసంస్పృశ్య పున రాగన్తు ముత్సహే,
ప్రవేగేనైవ మహతా భీమేన ప్లవగర్షభాః. ౧౬

ఉత్సహేయ మతిక్రాన్తుం సర్వా నాకాశగోచరాన్,

సాగరం క్షోభయిష్యామి దారయిష్యామి మేదినీమ్. ౧౭
పర్వతాం శ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవఙ్గమాః,

నేను అట్టి శీఘ్రగమనంబుగలవాఁడను మహావేగుఁడను మహాబలుఁడునగు వాయువునకుఁ బుట్టినవాఁడను. కావున దాఁటుటయందు నాకు సమానుఁడెందును లేఁడు. ౧౦

నేను నడుమఁ గొంచెమయినను విశ్రమింపక యతిశీఘ్రంబున అతి విశాలంబును ఆకాశంబు నొరయున ట్లున్నదియునగు మేరుపర్వతమునకు వేయిమార్లు ప్రదక్షిణంబు గావింతును. ౧౧

నేను బాహువుల సముద్రజలంబులు ద్రోచివచ్చి పర్వతంబులతోను నదులతోను మడువులతోనుఁ గూడిన యీభూమండలంబంతయు జలముల మునుఁగునట్లు గావింపఁజాలుదును. ౧౨

నాతొడలయొక్కయుఁ బిక్కలయొక్కయు వేగమునకు సముద్రంబు పైకిలేచుటయు అందలి పెద్దపెద్దమొసళ్లు ఆకాశంబున నగపడఁగలవు.

పక్షిసేవితమగుటంజేసి తన యుచితస్థలమయిన యాకాశంబున గరుత్మంతుఁడు ఆహారార్థమయి సర్పములంబట్టుటకు మహావేగంబునఁ దిరుగుచుండునప్పుడు నే నతని నొకటేసారి వేయిమార్లు చుట్టిరాఁగలను. ౧౪

నేను సూర్యుఁ డుదయగిరినుండి బయలుదేఱునప్పుడు అతనితోఁ గూడ బయలుదేఱి యతనికిమున్న యస్తగిరిఁజేరి మరల నతఁడు ఆకాశమధ్యంబున జ్వలించుచున్నపుడే యతని కెదురు రాఁగలను ౧౫

వానరోత్తములారా! అట్లు సూర్యునెదుర్కొన్నతరువాత నేను భూమికివచ్చి భూమిం దాఁకకయే కొంచెమైనను విశ్రమింపక భయంకరంబయిన యావేగముతో మరల మఱియొకమాఱు సూర్యునెదుర్కొనఁ జాలుదును. ౧౬

ఇంతియకాదు; ఆకాశంబున సంచరించు భూతంబులనెల్లను వేగంబున నతిశయింతును.

వానరులారా! నేను ఆకాశంబున కెగిరినచో సముద్రంబు శోషిల్లఁ జేయుదును. భూమిని భేదింతును. పర్వతంబులు చూర్ణంబు గావింతును. ౧౭

హారిష్యా మ్యూరువేగేన ప్లవమానో మహార్ణవమ్. ౧౮

లతానాం వివిధం పుష్పం పాదపానాం చ సర్వశః,
అనుయాస్యన్తి మా మద్య ప్లవమానం విహాయసా. ౧౯

భవిష్యతి హి మే పన్థా స్స్వాతేః పన్థా ఇ వామ్బరే,

చరన్తం ఘోర మాకాశ ముత్పతిష్యన్త మేవ వా. ౨౦
ద్రక్ష్యన్తి నిపతిష్యన్తం సర్వభూతాని వానరాః!,

మహామేఘప్రతీకాశం మాంచ ద్రక్ష్యథ వానరాః. ౨౧
దివ మావృత్య గచ్ఛన్తం గ్రసమాన మి వామ్బరమ్,

విధమిష్యామి జీమూతా న్కమ్పయిష్యామి పర్వతాన్. ౨౨
సాగరం క్షోభయిష్యామి ప్లవమాన స్సమాహితః,
వైనతేయస్య వా శక్తి ర్మమ వా మారుతస్య వా. ౨౩

ఋతే సుపర్ణరాజానం మారుతం వా మహాజవమ్,
న తద్భూతం ప్రపశ్యామి యన్మాం ప్లుత మనువ్రజేత్. ౨౪

నిమేషాన్తరమాత్రేణ నిరాలమ్బన మమ్బరమ్,
సహసా నిపతిష్యామి ఘనా ద్విద్యు దివోత్థితా. ౨౫
భవిష్యతి హి మే రూపం ప్లవమానస్య సాగరే,
విష్ణో ర్విక్రమమాణస్య పురా త్రీ న్విక్రమా నివ. ౨౬

నేను దాఁటునప్పుడు నాయూరువేగంబున సముద్రంబంతయు నావెంట రాఁగలదు. ౧౮

ఇపుడు నేను సముద్రతరణార్థమయి యాకాశంబునకు దాఁటఁగానే నావేగంబుచే లతావృక్షముల నానావిధములయిన పూలన్నియు నావెంటఁ గొట్టుకొని రాఁగలవు. ౧౯

అట్లు పుష్పములచే నిండియుండుటం జేసి ఆకాశంబున నామార్గము నక్షత్రములచే నిండిన స్వాతీనక్షత్రమార్గమువలె నొప్పును.

వానరులారా! నేను ఆకాశంబున నుద్గమించునపుడు గాని గగనంబునం బోవునపుడు గాని సముద్రదక్షిణతీరంబున వ్రాలునపుడు గాని సమస్తభూతంబులు నన్ను వేడుకమెయిం జూడఁగలవు. ౨౦

వానరులారా! నేను మహామేఘమంతటికిశరీరముతో నాకాశంబును మ్రింగువానిభంగి నాకాశంబంతయు నావరించిపోవునపుడు నన్ను మీరలు గూడఁ జూడఁగలరు. ౨౧

నేను బూనికతో సముద్రంబు దాఁటునపుడు మేఘంబులు చెల్లాచెదరయిపోవును; పర్వతంబులు చలించును; సముద్రంబు క్షోభిల్లును. ౨౨

నాకుంగల బలవేగములు గరుత్మంతునందును వాయువునందును మాత్రము గలవేగాని యితరుల కెవ్వరికిని లేవు. ౨౩

మహావేగుఁడగు గరుత్మంతుఁడును వాయువునుదక్క ఆకాశంబున సంచరించుచున్న నన్ను వెంబడింపఁజాలినభూతము మఱియొకటి యొచటనుం గానను. ౨౪

ఒక ఱెప్పపాటులోపల మహావేగంబున మేఘమునుండి మెఱపు వెడలునట్లు నిరాలంబనమయిన యాకాశమున కెగసెదను. ౨౫

నేను సముద్రంబు దాఁటుచుండునపుడు నారూపము పూర్వము త్రివిక్రమావతారంబున మహాబలియొసంగిన మూఁడడుగులనేల నాక్రమించు మహావిష్ణువు నాకారమువలె భయంకరంబై యొప్పును. ౨౬

బుద్ధ్యా చాహం ప్రపశ్యామి మన శ్చేష్టా చ మే తథా,
అహం ద్రక్ష్యామి వై దేహీం ప్రమోదధ్వం ప్లవఙ్గమాః!. ౨౭

మారుతస్య సమో వేగే గరుడస్య సమో జవే,
అయుతం యోజనానాంతు గమిష్యామీతి మే మతిః. ౨౮

వాసవస్య సవజ్రస్య బ్రహ్మణో వా స్వయమ్భువః,
విక్రమ్య సహసా హస్తా దమృతం త దిహానయే. ౨౯

లఙ్కాంవాపి సముత్క్షిప్య గచ్ఛేయ మితి మే మతిః,

తమేవం వానరశ్రేష్ఠం గర్జన్త మమితౌజసమ్. ౩౦
ప్రహృష్టా హరయ స్తత్ర సముదైక్ష న్త విస్మితాః,

తస్య తద్వచనం శ్రుత్వా జ్ఞాతీనాం శోకనాశనమ్. ౩౧
ఉవాచ పరిసంహృష్టో జామ్బవా న్హరిసత్తమమ్,

వీర! కేసరిణః పుత్ర! హనూమన్! మారుతాత్మజ!. ౩౨
జ్ఞాతీనాం విపుల శ్శోక స్త్వయా తాత! ప్రణాశితః,

తవ కల్యాణరుచయః కపిముఖ్యా స్సమాగతాః. ౩౩
మఙ్గళం కార్యసిద్ధ్యర్థం కరిష్యన్తి సమాహితాః,

ఋషీణాంచ ప్రసాదేన కపివృద్ధమతేన చ. ౩౪
గురూణాంచ ప్రసాదేన ప్లవస్వ త్వం మహార్ణవమ్,

వానరులారా! నాబుద్ధికిని దోఁచుచున్నది; నామనస్సంతోషము దక్షిణబాహుస్పందము మొదలయిన చేష్టలును అట్లే తెలుపుచున్నవి; నేను తప్పక చూచివత్తును సీతాదేవిని; మీరలు సంతోషముతో నుండుఁడు ౨౭

నేను వేగంబున వాయువునకు సరివచ్చువాఁడను; గరుత్మంతునితో సమానుఁడను; బదివేలయోజనంబుల దూరమువఱకు దాఁటఁగలనని నాకుఁ దోఁచుచున్నది. ౨౮

నేను వజ్రాయుధంబు చేతఁదాల్చిన యింద్రునైనను స్వయంభువగు బ్రహ్మదేవునైనను బరాక్రమంబున జయించి వారిచేతులయందు నమృతంబును శీఘ్రంబునం దేఁగలను. ౨౯

లంకనైనను బెల్లగించుకొని రాఁగలనని నాయభిప్రాయము. అని హనుమంతుఁడు పలికెను.

అట్లు కొలఁదికిమీఱిన పరాక్రమంబుగల వానరోత్తముఁడగు నాహనుమంతుఁడు గర్జించుచుండఁగా నవ్వానరవీరులందఱు పరమసంతుష్టులయి యాశ్చర్యపడి చూచుచుండిరి. ౩౦

ఆహనుమంతుఁడు సమస్తవానరులదుఃఖంబు నశించునట్లు పలికినపలుకులు విని జాంబవంతుఁడు పరమసంతుష్టుఁడై వానరోత్తముఁడగు నాహనుమంతుం జూచి యిట్లనియెను. ౩౧

పరాక్రమవంతుఁడా! కేసరియొక్క క్షేత్రజపుత్త్రుఁడా! వాయుదేవుని యౌరసపుత్త్రుఁడా! నాయనా! హనుమంతుఁడా! నీ విపుడు నీబంధువులయిన సమస్తవానరుల మహాదుఃఖమునంతయుఁ బోఁగొట్టితివి. ౩౨

వానరవీరులందఱుం జేరి నీమంగళంబు గోరినవారలయి నీవు పోవు కార్యంబు నెఱవేఱుటకై పూనికతో మంగళప్రదములయిన యాశ్వీరధ్యానాదులం జేయుచుండఁగలరు. ౩౩

మహర్షుల యనుగ్రహంబునను వానరవృద్ధుల యాశీర్వాదంబునను పెద్దలగువారి యనుగ్రహంబునను నీవు ఇమ్మహాసముద్రంబు దాఁటుము. ౩౪

స్థాస్యామ శ్చైకపాదేన యావదాగమనం తవ. ౩౫
త్వద్గతాని చ సర్వేషాం జీవితాని వనౌకసామ్,

తత స్తు హరిశార్దూల స్తా నువాచ వనౌకసః. ౩౬

నేయం మమ మహీ వేగం లఙ్ఘనే ధారయిష్యతి,

ఏతా నీహ నగ స్యాస్య శిలాసంకటశాలినః. ౩౭
శిఖరాణి మహేన్ద్రస్య స్థిరాణి సుమహాన్తి చ,

ఏషు వేగం కరిష్యామి మహేన్ద్రశిఖరే ష్వహమ్. ౩౮
నానాద్రుమవికీర్ణేషు ధాతునిష్యన్దశోభిషు,

ఏతాని మమ నిష్పేషం పాదయోః ప్లవతాం వరాః. ౩౯
ప్లవతో ధారయిష్య న్తి యోజనానా మితశ్శతమ్,

తత స్తం మారుతప్రఖ్య స్సహరి ర్మారుతాత్మజః. ౪౦
ఆరురోహ నగశ్రేష్ఠం మహేన్ద్ర మరిమర్దనః,

వృతం నానావిధై ర్వృక్షై ర్మృగసేవితశాద్వలమ్. ౪౧
లతాకుసుమసమ్బాధం నిత్యపుష్పఫలద్రుమమ్,
సింహశార్దూలచరితం మత్తమాతఙ్గసేవితమ్. ౪౨
మత్తద్విజగణోద్ఘుష్టం సలిలోత్పీడసంకులమ్,
మహద్భి రుచ్ఛ్రితం శృఙ్గై ర్మహేన్ద్రం స మహాబలః. ౪౩

నీవు వచ్చువఱకు మేమందఱము ఒకకాలితో నిలుచుండియుందుము; ఈసమస్తవానరుల జీవితంబులును నీచేతిలోనున్నవి. అని జాంబవంతుఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౩౫

అంత వానరోత్తముఁడగు హనుమంతుఁ డవ్వానరవీరులంజూచి యిట్లనిపలికెను. ౩౬

నేను సముద్రంబు దాఁటునపుడు ఈభూమి నావేగమును సహింపఁజాలదు.

ఈమహేంద్రపర్వతము ఉన్నతములయిన జాతిప్రదేశములుగలది; దీనిశిఖరములు స్థిరములును గొప్పవియునుగా నున్నవి; కావున ఇవి నావేగంబు సహించును. ౩౭

నానావిధవృక్షంబులతోఁ గూడినవియు గైరికధాతువులతో నొప్పుచున్నవియునగు నీ మహేంద్రపర్వత శిఖరంబులందు నేను వేగంబు గావించెదను. ౩౮

వానరవర్యులారా! ఇచటనుండి నూఱుయోజనంబులదూరము దాఁటఁబోవునట్టి నాపాదంబుల త్రొక్కుడునకు ఈపర్వతశిఖరంబులు ఆఁగఁగలవు. అని హనుమంతుఁడు వానరులతోఁ బలికెను. ౩౯

అంత శత్రువుల సంహరించువాఁడును వాయుదేవునికుమారుఁడును వాయువుతో సమానుఁడునగు నాహనుమంతుఁడు మహేంద్రపర్వతంబుపై నారోహించెను. ౪౦

అంత మహాబలశాలియుఁ బరాక్రమంబున దేవేంద్రుం బోలినవాఁడునగు నావానరోత్తముఁడు హనుమంతుఁడు నానావిధవృక్షములుగలదియు పచ్చికభూముల మేయుచున్న మృగంబులతోఁ గూడినదియు లతలను బుష్పంబులను నిండినదియు నిత్యంబుఁ బుష్పించుచు ఫలించుచున్న వృక్షంబులతో నొప్పుచున్నదియు సింహంబులు వ్యాఘ్రంబులు మత్తగజంబులు నున్నగు

విచచార హరిశ్రేష్ఠో మహేన్ద్రసమవిక్రమః,

పాదాభ్యాం పీడిత స్తేన మహాశైలో మహాత్మనా. ౪౪
రరాజ సింహాభిహతో మహా న్మత్త ఇవ ద్విపః,

ముమోచ సలిలోత్పీడా న్విప్రకీర్ణశిలోచ్చయః. ౪౫

విత్రస్తమృగమాతఙ్గః ప్రకమ్పితమహాద్రుమః,
నానాగన్ధర్వమిథునైః పానసంసర్గకర్కశైః. ౪౬
ఉత్పతద్భి శ్చ విహగై ర్విద్యాధరగణైరపి,
త్యజ్యమానమహాసాను స్సంనిలీనమహోరగః. ౪౭
చలశృఙ్గశిలోద్ఘాత స్తదాఽభూ త్సమహాగిరిః,
నిశ్వసద్భి స్తదాఽఽర్తైస్తు భుజఙ్గై రర్ధనిస్సృతైః. ౪౮
సపతాక ఇవాభాతి స తదా ధరణీధరః,

ఋషిభి స్త్రాససమ్భ్రాన్తై స్త్యజ్యమానశిలోచ్చయః. ౪౯
సీద న్మహతి కాన్తారే సార్థహీన ఇ వాధ్వగః,
స వేగవా న్వేగసమాహితాత్మా
హరిప్రవీరః పరవీరహన్తా,
మనస్సమాధాయ మహానుభావో
జగామ లఙ్కాం మనసా మనస్వీ. ౫౦

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తషష్టితమ స్సర్గః. ౬౭.

మృగంబులచే సేవితంబును నానావిధఫలరసాస్వాదంబున మదించి మధురంబుగాఁగూయు పక్షిసమూహంబులచే మనోహరంబైనదియు అధికమయిన సెలయేళ్లతోఁగూడినదియు నత్యున్నతంబులయిన శిఖరంబులుగలదియునగు మహేంద్రపర్వతంబున విహరించెను ౪౧-౪౩

అట్లు విహరించునపుడు అమ్మహేంద్రగిరి మహాబలుఁడగు హనుమంతుని పాదంబుల ద్రొక్కుడుచే నలఁగి సింహముచేఁ గొట్టఁబడిన గొప్పమదపుటేనుఁగువలె నొప్పెను. ౪౪

అమ్మహేంద్రగిరి ఆపాదఘట్టనమునకు చెల్లాచెదరైన శిఖరములుగలదై జలప్రవాహంబుల స్రవించెను. ౪౫

అప్పుడు హనుమంతుని పాదఘట్టనంబునంజేసి అమ్మహేంద్రగిరి భయంబునం బొఱలు మృగంబులు నేనుంగులును వేగంబునంగదలు మహావృక్షంబులును, దమ రమణీయవిహారస్థలంబులగు సానువులను భయంబునం బరిత్యజించునట్టి పానమత్తులయిన నాగదంపతులును గంధర్వదంపతులును విద్యాధరులును ఆకాశంబున కుద్గమించుపక్షులును రంధ్రంబులం డాఁగునట్టి మహాసర్పంబులును జలనంబునొందు గొప్పశిఖరంబులునై యుండెను. ౪౬,౪౭

అప్పుడు అట్లు సర్పంబులు రంధ్రములనుండి సగము వెడలినవై పడగలుపఱచి నిట్టూర్పులు పుచ్చుచుండుటచే నమ్మహేంద్రగిరి పెక్కు టెక్కెంబులు గట్టినట్లు చెలంగెను. ౪౮

అమ్మహేంద్రగిరిని మహర్షులు భయంబున వేగిరపాటుగదుర వదలిపోవుటయు నమ్మహాపర్వతము తోడుజనులందఱు వదలిపోవుటచే మహారణ్యంబున నొంటిమెయి భయంబునం బొక్కుచున్న బాటసారియట్లుండెను. ౪౯

మహావేగుఁడును వేగంబు వహించుటయందుఁ బ్రీతిగలవాఁడును శత్రువీరుల వధించువాఁడును వానరులలో నెల్ల మేటివీరుఁడునగు నాహనుమంతుఁడు మనంబున సముద్రంబు దరింపఁబూని యపుడే మనస్సుచే లంకాపురిం జొచ్చెను. ౫౦

ఇది యఱువదియేడవసర్గము.

కిష్కింధాకాండము సమాప్తము.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.

# సంస్కృతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కార్తికమాహాత్మ్యము, చక్కానికూర్పు | ... | 0 | 6 |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 3 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్య సహితము | | 2 | 0 |
| ప్రతిపదాంధ్ర టీకాతాత్పర్య విశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు 15 వాల్యములు | ... | 70 | 0 |
| డిటో ఆరణ్యకాండము | ... | 10 | 0 |
| డిటో కిష్కింధాకాండము | ... | 10 | 0 |
| డిటో సుందరకాండము | (అచ్చగుచున్నది). | | |
| డిటో యుద్ధకాండము | ... | 20 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము, దళసరికాగితములు | ... | 6 | 0 |
| డిటో సుందరకాండము, చిన్నసైజు | ... | 1 | 0 |
| డిటో వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు, చిన్నసైజున చక్కగముద్రితము | ... | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | | 2 | 0 |
| డిటో అయోధ్యాకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | | 3 | 0 |
| డిటో అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| డిటో సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| డిటో ఉత్తరకాండము ,, | ... | 3 | 0 |
| అమావాస్యతర్పణము | ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆపస్తంబధర్మసూత్రములు, ఉజ్జ్వలాభాష్యసహితము | ... | 1 | 8 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 1 | 8 |
| ఋగ్వేదఆశ్వలాయనసూత్రములు | ... | 0 | 8 |
| ఋగ్వేద శ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక, చిన్నసైజు | ... | 0 | 2 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, బ్రహ్మమేధసహితము | ... | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | ... | 0 | 6 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| ,, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| తైత్తిరీయఆరణ్యకోపనిషద్భాగము, సస్వరము | ... | 3 | 0 |
| యజ్ఞోపవీతధారణవిధి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 2 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, సాంధ్రటీకాతాత్పర్య సహితము | ... | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 8 |
| యజుర్వేద ఆబ్దికమన్త్రములు | ... | 0 | 6 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము.—అనేకవిషయములఁ జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁ బరిష్కరించి ముద్రించియున్నాము, చక్కని ప్రతి | ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ॥ | అ॥ |
|---|---|---|
| రుద్రము, పురుషసూక్తమువగైరాలు, చిన్నసైజు ... | 0 | 2 |
| శ్రీవైష్ణవాహ్నికము ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము—ఇందు వ్రతసంకల్పము మొదలు పూజముగియువఱకు చేయవలసినవిధులదెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ గణాధిపతిపూజ, షోడశోపచారశ్లోకములు మొదలగు వానిని తాత్పర్యముతోడ ముద్రించినారము, ఇందు వినాయకవ్రతము, వరలక్ష్మీవ్రతము, సరస్వతీవ్రతము అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీవ్రతము అను 6 వ్రతములు గలవు. ... | 0 | 10 |
| వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.—ఇందు ఋషిపంచమీ, మధ్వద్వాదశీ· అమావాస్యసోమవతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, ఆముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శతవర్తి, లక్షవర్తి, త్రికార్తి, చిత్రగుప్త, క్షీరాబ్ధిశయన, సావిత్రీగౌరి, సంపద్గౌరి, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థీ, ఏకాదశీగురువారము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతీ మున్నగువ్రతములు గలవు ... | 1 | 2 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు, మంచికాగితములపై చక్కగ ముద్రితము ... | 2 | 0 |
| వైశ్యసంధ్యావందనము ... | 0 | 2 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 1 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| జాతకచన్ద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| కాలామృతము, సటీక, మేలుప్రతి ... | 1 | 4 |
| బృహజ్జాతకము, సటీకాంధ్రతాత్పర్యసహితము, చక్కనిప్రతి, నూతన ముద్రితము ... | 2 | 0 |

| ప్రతి 1-కి | | | రూ. | అ. |
|---|---|---|---|---|
| ముహూర్తదర్పణము, సటీక, చక్రనికూర్పు | | ... | 0 | 14 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్న గ్రంథమునకు తెనుఁగు | | ... | 0 | 3 |
| షట్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము | | ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్రనిప్రతి | | ... | 0 | 6 |
| సర్వార్థచింతామణి | | ... | 0 | 8 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 12 |
| భృగుసూత్రములు | ,, | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక | ,, | ... | 0 | 8 |
| వృద్ధపరాశరము | ,, | ... | 0 | 10 |
| కేరళప్రశ్నము | ,, | ... | 0 | 3 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 3 |
| మయవాస్తువు | ,, | ... | 0 | 3 |
| వాస్తుసర్వస్వము | ,, | ... | 0 | 4 |
| వనమాల (వర్షఫణి) | ,, | ... | 0 | 3 |
| స్వప్నశాస్త్రము | ,, | ... | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | | ... | 0 | 2 |
| సాముద్రికశాస్త్రము, సటీక | | ... | 0 | 4 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము, చక్రనిప్రతి | | ... | 0 | 4 |
| శకునశాస్త్రము (శిఖినరసింహశతకము), తాత్పర్యసహితము | | | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | | ... | 3 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ,, | | ... | 0 | 12 |
| ఆపస్తంబప్రవరకాండము, సటీక | | ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండము ,, | | ... | 0 | 2 |
| ఆశౌచనిర్ణయము (తెనుగు) | | ... | 0 | 3 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతపంచరత్నములు | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు (సాధనపంచకము) | ... | 0 | 2 |
| ఆత్మబోధము, సటీక, చక్కని కూర్పు | ... | 0 | 4 |
| ఆత్మపూజ ,, | ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 4 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు మంచికాకితములు | ... | 0 | 12 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| డిట్టో తెలుగువచనము | ... | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 3 |
| బ్రహ్మసూత్రములు, తెనుగువచనము, శ్రీశంకరాచార్యులవారిభాష్యము అందరికి తెలియుట దుర్లభమనితలంచి చక్కని శైలిలో అనేకవృత్తులననుసరించి తెనుఁగు వ్యాఖ్యానమును ప్రకటించినారము, రెండు సంపుటములు | | 12 | 0 |
| భగవద్గీతలు మూలముమాత్రము, చిన్నసైజు | ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము చక్కనికూర్పు | ... | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు | ... | 0 | 10 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమాతో | ... | 0 | 8 |
| ,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్య సహితము, మతత్రయా భాష్యములనుండి అనేక అంశములిందుచేర్చి శ్లోకానుక్రమణికతో ముద్రింపఁబడినది. | ... | 2 | 12 |
| ,, శాంకరభాష్యము, (సంస్కృతము) | ... | 1 | 0 |
| ,, మేలుప్రతి | ... | 1 | 8 |
| ,, రామానుజభాష్యము (సంస్కృతము) | ... | 1 | 4 |
| శ్రీమద్భగవద్గీతారహస్యము, శ్రీ బాలగంగాధరతిలక కృతము | | 3 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# వైదికగ్రంథములు

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| డిటో సస్వరము (ఏకాగ్నికాండ) | ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 3 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 6 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |



| | | |
|---|---|---|
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | 2 | 8 |
| డిటో ఆబ్దికమంత్రములు | 0 | 8 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు ... | 0 | 6 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 6 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక ... | 1 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 2 |



| | | |
|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| జ్యోతిషార్ణవనవనీతము ... | 2 | 0 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి ... | 0 | 6 |
| శీఘ్రబోధము, సాధారణప్రతి ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము ... | 0 | 12 |